# శ్రీ మహాఋషి నిఘంటేత

# యోగ శాస్త్రం





mohanpublications.com
granthanidhi.blogspot.in

శ్రీపరమఋషిభ్యోన్నమః

# శ్రీమహాఋషిసంఘటిత

# యోగశాస్త్రము,

[illegible]మవిద్యాయాం ముముక్షుజనహితః

వేల్పూరునివాసినాం బ్రహ్మశ్రీ

## కొత్తాప్రోలపల్లి

## సూర్యనారాయణ యోగిని

విరచితం.



[illegible] ప్రవీణ

బ్రహ్మశ్రీ [illegible]

[illegible] సూర్యనారాయణ [illegible]

పరిష్కృతం.



[illegible] 1000




కాకినాడ:

[illegible]ముద్రాక్షరశాలయందు

ముద్రితంబైనది.

19౨౮




[వెల రు 5-0-0

హరిః ఓమ్ తత్సత్

ఓమ్ పరమఋషిభ్యోన్నమః

శ్రీం పరమజగద్గురుభ్యోన్నమః

# శ్రీ మహాఋషి నిఘంటిత యోగశాస్త్రము.



## ఉపోద్ఘాతము.



సమస్తోపనిషత్సార వేదవేదాంగ బ్రహ్మఋషి సాంప్రదాయార్థక గురుపరంపరాభి గమ్య బోధ్య బోధకసారస్య సమరసైక్యానుసంధాన పారీణ ధురీణ కాగ్రిసర గ్రీవేయ కమండల ముండన మండితానేక శ్రుతిస్మృతేతిహా సపూర్వపక్షసిద్ధాంత దృష్టాంత దార్ష్టాంతిక ప్రమేయ నిజపరేంగిత జ్ఞాన శిష్య ప్రశిష్యానుసార గుర్మండలి యందలి నొకడనై యుండుటంజేసి నీమహా ఋషినిఘంటితయోగశాస్త్రోపోద్ఘాతంబు నుద్ఘాటించ సమకట్టినాడ. ఈ గ్రంథనామ సార్థకసారస్య విచారణ ప్రథమకర్తవ్యంబు.

శ్రీ మ హా ఋ షి । ని ఘ ం టి త । యో గ । శా స్త్ర ము.

ఇదినాల్గు శబ్దంబులం గలిగి పదునేనక్షరములతో నిండియుండెను.

శ్రీసౌభాగ్య పంచదశి స్త్రీవిద్య బ్రహ్మవిద్యోపాసన చతుర్వేద సాధన చతుష్టయ సంపదాధికారులకే గాక చతుష్షష్టి విద్యాకళా సారాంశసంభూత యనుట కెంతేని యుచితంబుగ నుండె.

అక్షరసాంఖ్యయోగత్వరత్వ తత్త్వచింతాస్వాత్మానుభూత సంగ్రహ గ్రాహ గ్రాహకాత్మచిత్త చైతన్యమాదర్శితాయత్తిదం బనుటకు నిస్సంశయంబు. రూపనామ కళాతీతాను భావానుగమ్య గురుపాదుకాదీక్షా దక్షత్వశిక్షా సౌభాగ్య పంచదశీ యోగాద్యక్షర సాంప్రదాయక శ్రుతిస్మృతేతిహాస వేద వేదాంత సమస్తోపనిషత్సారాంతర్భూత భావబోధితంబై ఋషిపరంపరాభి గమ్యాగమకంబుల మంత్రమంత్రార్థ సాంప్రదాయక సాక్షీభూతామనస్కా చలపరిపూర్ణ తారక సాంఖ్యయోగ సామ్రాజ్యంబునకాకరంబై, మాతృ

కాకుక్షి నిక్షిప్త దక్షశిక్షా శాస్త్రానువాదా భేదాను సంధాన మోదితంబై,
సమస్తగుణ గణాద్యలంకృతమై యగణ్యంబై, సకలామనస్క రాజయోగ
ప్రభా ప్రకటిత నిఘంటిత యోగశాస్త్రధారేయమంత్రక నానుభేదమాను
మాత్రవాద భేద వర్జితసంతతాభిలాష వేషాభాషా భూషితాంత ర్యానేకఋషి
బోధాస్ఫురణ మానసంబై, సద్వస్తు సూచనా వివేక విజ్ఞానాజ్ఞాన పరిమాణాను
పాదాన కారణకార్య రహస్య భేదనంబై, నిర్హేతుక గురు జాయమానకరుణా
కటాక్ష నిక్షిప్త మాతృకా గర్భజనిత పరిణామానుప్రమాద దోష నిర్లిప్త
జీవచైతన్య కళాస్వరూప స్వభావాను రక్తి యుక్తి శక్తి భక్తి ముక్తిదాయ
కంబై, సమస్తయోగ భోగజపతపస్సంపన్నతా మునిగణగుణ సేవితంబై, నిరా
శ్రయంబై, నిగమాగమ గోచరంబై, నిత్య సత్య శుద్ధ బుద్ధ సదసద్వివేక సా
రాంశ సాధనాంతర బిందుబీజ సంస్కరణ సంసారార్ణవరహస్యకరణ తారక
సారహంసావిశేషాయత్త శేషసాక్షికా స్త్రైకస్య నామోచ్చారణ మహిమా
తిశయ మహాభారతేతిహాస పరాయణ పారీణ పఠనా చింతితాత్మమై, యుగ
న్యాగణ గణాద్యలంకార భూషణభేషజంబై, జన్మకర్మాచ్ఛేదనాకురాదవా
మంబై, దనరారు నీమహాఋషినిఘంటిత యోగశాస్త్ర నామాది సంఖ్యాభి
వర్ణనాతీతభావనా యోగారూఢ జనితంబై, నిరాలంబ పరమపావన స్థిర సిర
న్యాయమార్గావలంబనధారియై, సమస్త ధరణీవర సుర దేవ పితృబ్రహ్మజ్ఞాన
సంరక్షితానేక సాంప్రదాయకా దృష్టంబై, పండిత పామర జనానురాగయో
గ భక్తి ముక్తిదాయకంబై, మూలాధార యనేక చక్ర ముద్ర లయ హఠయో
గానుభవ సాధన సాధ్యంబై, సాక్షీభూతియై సమస్తోపనిషత్సారాంతర్యాతి
నై, గురువాక్యానుసార మంత్రార్ధగాయత్రీదీక్షా పరాయణానుక్రమణానే
క శ్రుతి యుక్తంబై, శ్రోత్రియ ప్రీతిపూర్వక యనేక జన్మపరిపాక విశేషా
మనీషా జిగీషత్వ మాహాత్మ్యచ్ఛేదితానేక మార్గావరోధాను దర్శిత దార్ష్టాం
తిక దృష్టాంత పరవశతానుగమ్య సారాంశమే నీగ్రంధరాజ నామధేయ పర్య
వసానము. తుదకది శాస్త్రమయ్యును శాస్త్రమున శాసించునది. శాస్త్రమొ
కసియముకొరకు పుట్టబడ్డది. ఇయ్యది గురుశాస్త్రము. సమస్తశాస్త్రము
లున్ను నిందిమిడియుండెను. శ్లో॥ అజ్ఞానతిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా
చక్షురున్మీలితం యేన తస్మై శ్రీగురవేనమః। నగురోరధికః గురోర్ముఖేన జ్ఞాత
వ్యం అన్యథానోపలభ్యతే॥ గురువుబినా పదార్థంబు లేమింజేసి గురువువలననే

సమస్తము తెలివిని జేలవలసియుండె, గాన నీగ్రంథము గురుశాస్త్రమాయెను. కాబట్టి దీనిని గురువనదగును. ఎన్ని శాస్త్రములు చర్చించినను నెన్నెన్ని మార్గము లనుసరించినను, నేయేకర్మ లెన్నెన్ని జేసినను, యెన్నెన్ని జన్మలెత్తినను తన్నుదా దెలియుటకొరకు తనజన్మ కర్మలను గురుశాస్త్రనియమములను దెలివొందు సాధనబోధనల కిదియే క్రియకట్టు గలిగినది. కాలానుసారిణులై కలకాలమును నిత్య సత్య ముక్తత్వమునకు గతిజూపుట కిది కరతలామలకంబు మానవశాస్త్రజ్ఞుల కిదిమరణశాస్త్రము. వేదశాస్త్రజ్ఞులకు విధికృత శాస్త్రము. అనుభవజ్ఞులకు ఆనందశాస్త్రము. సమస్తశాస్త్రములకును శాసనశాస్త్రము. సమస్తశస్త్రాస్త్రంబులకు శపథశాస్త్రము. గురుశిష్యులకు గుర్తుశాస్త్రము. పామరులకు బరమార్థశాస్త్రము. పండితులకు డింభికశాస్త్రము. పరమార్థులకు బరమానందశాస్త్రము. శాస్త్రుల కందరికిని శస్త్రశాస్త్రము. శ్రీమహాబుషిభిఘుంటిత యోగశాస్త్రసాను ధారణాధ్యాన యోగ జపతప సంపన్నసాంప్రదాయ కానుభవమున కెంతయు నొప్పియున్నదని వేరె చెప్పనవసరము లేదు. కాక శృతి॥ అనంత శాస్త్రం బహు వేదితవ్యం అల్పశ్చ కాలో బహవశ్చ విఘ్నాః॥ అనెడి సుశ్రుతివాక్యప్రత్యయము అల్పాయుష్యమనుజు లనేక గ్రంథపరిశోధక జ్ఞాన సంపాదనా భక్తిమార్గ ప్రవృత్తులకు నిది నేకగ్రీవంబుగ బహుస్వల్పకాలంబున నతిసులభంబుగ బహుదుర్గమ మాయామార్గంబుల వేరుజేసి యామహాత్ములనై తమ్ముదా దరించి తదితరుల దరింపజేయునదే గురుశాస్త్రసాంప్రదాయిక రహస్యార్థకము. ఇక సాంఖ్యసూత్రనిఘటిత యోగానుసరణంబున నకృతతత్వ సాంకేతికంబున పదిరెండు పమనాలు గణనకు రాగా మొట్టమొదట ఒకటి యను దానిని గ్రహించుటకున్న ఆధారాధేయమై ఆయొకటికి కుడిని జేర్చిన లెక్క కు నిక్కలిమై యొకమును జేర్చిన దానికి విలువ యే లేకపోయెను గాన సాంఖ్యుడు తన్నుదా దెలిసేవరకు లెక్కకు వచ్చెడి సాంప్రదాయికంబుపైనై యుండెను, గాన పదిరెండు అనగా అయిదు × అయిదు॥ పది, రెండు, జీవుడు దేవుడు కలిపిన దానినే పెరుగుటచే దేహమనియు కృశించుటచే శరీరమనియు నామము లనేక యర్థ భావ భేషజంబుల బ్రత్యక్షముగ బ్రకాశించుచుండె శూన్యవాదత్వేన యేమియు లేదను నాలుగును కలిసి పది × హేతువైన నది పంచదశి దీన ననేక గంభీర భావ భేద వేదశాస్త్రంబులు ఘోషించుచున్నవి. దీనినే వాచార్థమని వాడెదరు.

ఈపంచదశయే సౌభాగ్య పంచదశి దేవియందగు నొక బీజభేదమే గాని వేరొంకుగాదు.

పంచదశి పదునేను బీజంబులును, సౌభాగ్యపంచదశి విద్యకు (15) X (16).

దీనినే అనగా షోడశినే, దేవీగాయత్రిగాను అజపగాయత్రిగాను బ్రహ్మగాయిత్రిగాను రామగాయత్రిగాను, బీజసంపుటీభేదంబుల సద్వస్తు విచారణపరులగు వేదాంతశాస్త్రమునకు మంత్రశాస్త్రమునకు సంబంధానుబంధములు గలిగి, అవాఙ్మానసగోచరంబైన యావస్తుతత్వనిర్దేశమునకుగాను సమస్తమైన ఋషులుభేదపడ వ్యాసనిఘంటితనామంబున యోగశాస్త్రంబు స్థిరపరచబడిన దానినే సులభోపాయంబున గొలదికాలమాత్రిల సద్వస్తుదర్శనమాతృకయే నీమహాఋషినిఘంటిత యోగశాస్త్రము.

గ్రంథకర్త స్వీయచరిత్ర.

హిందూదేశముయొక్క పుణ్యవశంబేమొయోగాని యనేక యోగియోగినీమహాత్ములు, నిరాకారశస్త్ర్యబ్రాబైన మహాశ్శక్త్యంబులు, గ్రహించు తెలివిగలవార లెందరతోనో నిండియుండెననుట కీ గ్రంథకర్త్రి సూర్యనారాయణయోగినీ కవికవితాగ్రంధచారిత్రి యామె స్వీయచారిత్రిమే చాటుచుండుటచే నామె యనుభవపఠనాపాటవం బవశ్యకర్తవ్యంబు.

మన హిందూదేశంబేలెడి మొదట జార్జిగారిపేర కట్టబడిన జార్జిపేట పూర్వకవి నొకతాళపత్రిగ్రంధంబున "సకియ నవరత్నములకోట జార్జిపేట, వేణుగోపాలు దేవ రావేలతాంగి"యను మకుటము గల శతకమొకటి నాకు లభించినది. ఆగ్రామము మదరాసురాజధాని గోదావరిజిల్లా ప్రఖ్యాతికెక్కిన వారిదైన యానాందరినున్న దామెగ్రామము. ఈమె జన్మస్థానము కౌండిన్యసగోత్రి వీరయ భాగమాంబా గర్భశుక్తిజనిత సూర్యోపాసనా, ప్రభాప్రకటిత జన్మసార్థకనామధేయ షట్ప్సోదర సోదరీ రమణవంశ పారంపర్యాయ పారమార్థిక చిత్తచైతన్య ధౌరేయ కామోద కాకినాడపురంబున బెరిగి ప్రైమరీ విద్యబోధినియై కాట్రావులపల్లి వెంకటరత్నమునకు భార్యయై వయఃకాలంబున పూర్వసువాసినియై, తన తృతీయ సోదరుండనగు నావద్ద జగ్గంపేట కాపురస్తులు పింగళ లక్ష్మీనారాయణగారిచే భగవద్గీత కంఠపాఠంబుజేసి నూతన రూపలావణ్యాదుల సమానురాలై మిగుల మాధురీగరి

మంబున భక్తిమార్గ కీర్తనల బాడి పరమాహ్లాదమోదినురాలై, తీవ్రవేదనా యత్తచిత్త మగ్నమానసంబునఁ దనతోఁబుట్టువు జ్ఞానోపదేశికురాలగుట, దనకును నట్టి యుపదేశానురక్తిభక్తియుక్తురాలై యుండ, యూడిమూడిగ్రామ కాపురస్థులు బ్రహ్మజ్ఞానసంపన్నులు వయోవృద్ధులు, నగు జాలిగం భీమదేశికురాలై, యనేకయోగయోగినీ భక్తసేవామృత మస్తురాలై, మంత్రిహారలయ రాజయోగంబు లనుభవ సాంప్రదాయంబుల బరమపావన చారిత్రయై ప్రకృతిమయకల్పిత భావసకులన్ న్యాయసభలం గలిచియు నవియన్నియు ననిత్యములనియు దలచి ఇంతలో మాతృహీనయై, మహానుభావ సద్వంశో బమానసురాలై యుండెను. అంత దేవశాస్త్రిగారును, శ్రీజగద్గురు శంకరాచార్యవిరచిత భజగోవింద శ్లోకంబుల పఠాంతరము. నిజగురుభజగోవింద శ్లోకములు దేవశాస్త్రి తత్వకీర్తనంబును ఆ 1912 సంవత్సరము ముద్రితమైనవి.

ఇట్లు ఆత్మానుభవజ్ఞాన భక్తివైరాగ్యల వాదభేదనోపాయంబుల నోలలాడుచుండ, అమలాపురంతాలూకా సాకుర్రు అగ్రహారం కాపురస్థులును ఉభయభాషాజ్ఞానాత్మాన్వేషా పండితాగ్రేసరులును సీమకుర్తి ఆజ్జరపు సూర్యనారాయణమూర్తిగారు కాకతాళీయన్యాయంబున దర్శించ పురుషులలోనే గాక స్త్రీలలోఁగూడ నింత నిశ్చితజ్ఞానాత్మనిష్ఠయుండెనని, కృష్ణవేణమ్మ మాన కరుణాకటాక్షంబుల శ్రీగురుపాదుకాసౌభాగ్య పంచదశాక్షరీ మంత్ర మంత్రార్థానుభవ చరణనియమాంగులను సమగ్రంబుగ బోధించి, అపూర్వ పుణ్య పరిపాకవశంబున సముపార్జితమహాభ్యాస బుద్ధిసాంప్రదాయక రహస్యార్థబోధితంబగు వారి పరిచితి సచ్చి, దీనిఁ దెనిగించ మన గురువాజ్ఞానుసారిణియై దేవికటాక్షంబున స్వప్నలబ్ధపరవశానుండ నోగ్రంథరచన యు సముపార్జనిష్ఠస్తుల నేగాక, కనవాకల్పితమున నే నామె యాజ్ఞవడసి, తదారభ్యగ్రంథరచనకు లోకానుభవము లేమిం జేసి, దేశసంచారంబునకు వెడలి, హిందూదేశమందలి, ఉత్తరదక్షిణభాగ పుణ్యక్షేత్రమఠాలయంబులను సందర్శించి, యనేక బ్రహ్మ ఆర్య, సనాతన నానేక సమాజదేశంబుల పరిశీలించి, తపోనిష్ఠయందారితేరి, ప్రపంచంబు మరచి, తన్మయత్వంబుననుండ, తత్సోదరుండును, నామె గురుపుత్రుండును, సార్థకనామధేయుండును, అంతేమతిస్సాగతిః॥ యనున్యాయప్రతిష్ఠగాంచ, కాశీవిశ్వేశ్వరాలయంబున, బరలోక ప్రాప్తిభవంబ

లంకరించియున్న రెండవ శంకరుఁడోయన, శంకరయ్య బహుదేహశ్రమలకోర్చి, నీమెను గలసికొని వెల్లడికిఁదీసికొని రా చిన్నబిడ్డవతు నన్నపానాదులనేర్చి నాల్గుమహావాక్యానుబోధ బోధితులైన యనేక బుధుల సందర్శించి, స్వప్న వృత్తాంతంబున దేవీప్రసన్నతయును దెలుప, పెద్దలును గురువులును మఱికొందరు జ్ఞానులును, బోధిస్సహిత యన్నాదికముల వర్జించి, సుమారు సంవత్సరం, తదేకదీక్షాపరశత్వంబున, నీగ్రంథంబు బరిసమాప్తమయ్యెను, ముద్రిణాధృతికిఁదగు స్వద్రవ్యసాహాయ్యంబునవే మహాత్ముల యుపకరణములుగో పని లేదను శ్రుత్యర్థతః కాకినాపుర నివాసులు మండపాక రంగయ్యనాయుడు గారీ గ్రంథంబును విని యాయన ముద్రాక్షరశాలయం దిది ముద్రింపింపఁగో డంగ ముద్రణాసాహిత్యంబులు భాషాసౌశీల్యతయును జేసి నాకుం జూపు నప్పటికి ముద్రింపబడిన మొదటి ప్రకరణమందలి 1-2 పై శోధంబులుంగలుగుటంజూచి సంతజాలించి దీనికుపోద్ఘాతంబును, వ్రాయుమన, నానేర్పుకొలంది, చెరకునకు నంకబోసేయి చెమనేటిపి' యన్నట్టుల సద్వస్తువిషయక జ్ఞానపూరితయగు, నీనిశకు విప్పేబు యానిశకింముకొనక సుకుశుండుబున వ్రాయుపముక్తిని గాని, ముద్రణాధృతికిని నీకనివాకన్యక దగియున్నది.

ఈమె యోగినీనిరుదాంకితమై శ్రీమాయమ్మను గున్నవలిని నొకసెనైన స పూర్ణానుభవ సంచార సంకుచిత సాన్న్యానుభూతి, సర్వజనాదరణీయ సమ్యాస నైభవసామ్రాజ్య భోజ్యభావన పరమపావన పూతాత్ములగు పరమపతివ్రతా తిలకాంకిత శోభిత శోభనదేవతా సారంగతలగు శ్రీలిహాపరసాధనబోధ్య బోధకులై పతివ్రతలై పతితపావన పూతచరితలగు తెన్నశ్చితమానసోల్లాసభాసురానుభవభక్తి జ్ఞాన యోగాభ్యాసధారణాగుణులగుటను నీమె స్వానుభవమే దృష్టాంతభాండకము.

శ్రుతి ॥ మోక్షసత్యేన॥ సమస్తమైన కోరికలను వదలి కేవల నిష్కామ కర్మముమోక్షాపేక్షులై పరమనైరాగ్య పరులై శాంతయనన్య భక్తిపూర్ణతమై॥ త్రిగుణాతీయ మాపాకి, దేహః చపాణాదుల్యాక్తమాః॥ యను రీతిని కాశి, గయ, ప్రయాగ బృందావనము జగన్నాథము అయోధ్య, మొదలగు నుత్తర పుణ్యక్షేత్రంబులును దక్షిణాదిని, రామేశ్వరం, కంచి, కాళహస్త్రి, మధుర, శ్రీరంగము, పెద్దతిరుపతి, మొదలు గాగల దివ్యక్షేత్రములనే గాక, శివకేశవ భేదభావ బుద్ధిశూన్యతయా పోతులూరి వీరబ్రహ్మంగారి మ

రములను వారివారి చారిత్రిక చరిత్రలనే గాక, బ్రహ్మజ్ఞాన సాంప్రదాయకం
బు లా యాశిష్య ప్రశిష్యులతో సంభాషించి కడప కర్నూలు బళ్లారి అనం
తపురం కోయంబత్తూరు నీలగిరి, మొదలగు ప్రాంత సమాజికుల సమాదరణీ
యంబువడసి కేవల దేవీకరుణాకటాక్షంబుననే తోచు నీడజేసుకొని "ధనమూ
లం మిదం జగత్తను" న్యాయంబును నవలదోసి, కేవల గురువాక్య కరవా
లంబు పదిలపరచికొని, తనమానమును తనుప్రమర్యాదను దగుపండిత పామర
జనాసభా మధ్యంబున భాగవతపురాణేతిహాసంబులకు వ్యాఖ్యానబోధినియై రాజ
యోగాను భోగినియై బ్రాహ్మణియై బ్రహ్మయై బ్రహ్మభావబోధక బోధిని
యై పరబ్రహ్మస్వభావ సమాధి యను యోగాను సంధాయినియై "ఆత్మ వత్సర్వ
భూతాని" యను న్యాయంబున భక్తి జ్ఞాన వైరాగ్యానుభూతిచే గడుం గడునం
ధకారబంధురం బగు నరణ్యంబున నాహారపదార్థంబు లేనిదై "జ్ఞానాన్ ముక్తిః"
అను శృతిరీత్యా వింధ్యపర్వత గుహాయందు సుమారు పదమూడు మాసంబు
లు తపోయోగనిష్ఠ చిత్తారూఢ విశ్రాంతిం గాంచియుండ, దనకు వినాపదాంగం
బులేని దగపంచే నెవరు పిలచినను దన్నుగానట్టు మరు, కేకాగ్రనిష్ఠ చిత్త
స్థిగాన, శృతి ఉదాసీనవదాసీనో గుణైర్యో నవిచాల్యతే॥ అని యున్నటుచే
త ననేకాత్మానుభవసిద్ధ దర్శనంబున యోగిని యని బిరుదంబును వడసినందు
లకు తార్కాణంబుగ తలయంతయు జడలుగలిగి నిస్పృహకిని యుండెను.

తరువాత కర్నూలులో, ధర్మ మహాలయంబున మూడు నెలలు యా
హారనిద్రా దేహేంద్రియ సర్వవ్యాపకములు మఱచి యోగసమాధి నిష్ఠ
నుండ లోకులు కాకులవంటి వారగుటచే రాలచేరువ్వబడియు, నగ్నిచే గా
ల్పబడియు త్రిమాస దీక్షానంతరంబున మేల్కాంచి నంత నందరును దాసో
హమనిరి. బళ్లారి బ్రహ్మసమాజమందు త్రైమాసదీక్షితురాలై సుమారు
నూటయాబదిమంది సన్యాసులతో గలిసి యాత్మానాత్మవిచారణ చేయు
చుండ సాంఘిక సమాజాద్యక్షతాహ్వానియై జీవబ్రహ్మ ప్రకృతి విచారణ విపు
లముగ నుపన్యసింప నందరును వారివారి యోగ్యతాశక్త్యనుసార సమ్మానిత
రాయెను.

తదనంతరంబున నీలగిరి గుహలపు తరుచ్ఛాయం దదేకాగ్రసమాధి నొ
క నెలయుండ సమస్త క్రూరమృగములును వచ్చి ప్రేమ సలిపియు గాని, నేవి
ధమైన యపాయమును బొందలేదు; గాని నచ్చట కొందఱవారలు

సమాధి భగ్నోపాయంబులం బాధించ యచటి శీతోష్ణాదినైసర్గికములను సహించినంత నగ్నికుంపట్లను మీదబోసిరి గాని నగ్నియు చల్లనై స్వేచ్ఛగ యుండె; ఇది గాక యిక నొకస్వానుభవము బ్రహ్మగిరిప్రాంతమున నొకకోదు గ్రామముండెను.

ఆయూరి వెలుపల నొకకపిత్థ వృక్షచ్ఛాయను మూడుమాసములుండ మంత్రికోమయొక్కం డావృక్షమును పరిసరపర్వతపంక్తు లఖండమంటలు వచ్చి కాలుచున్నట్లు గనబడుచు ననేక ఘాతుకక్రూరమృగములు తన్నుం బరివేష్టించియుండ నొకముని యదిజూచి శ్రీ నవయౌవ్వన విలాసలావణ్య కళాకళాత్మకా బ్రహ్మైక్యాను సమాధి నిష్ఠా గరిష్ఠ సమష్టి వ్యష్టి స్వరూపస్వానుభవ సిద్ధిదాయినిగ మనంబున శంకించి, పరీక్షించి చైతన్యమాత్రావశిష్టమైన నామె శిరస్సున నొక వటావృక్షంబుం దనమాయచే మొలపించె నంత నచటి జనులందరాశ్చర్య మగ్నమానసులై నిశ్చేష్టితులై జూచుచుండిరి.

అందు నింకొక కోయదొర సమాధినుండి మేల్కొలుప, సమస్తమును నదృశ్యమైపోయెను. శృతి॥ యద్దృశ్యంతన్నశ్యం॥ బనునది ప్రత్యక్ష దృష్టాంత్యానుభవమాయె, నంత కైలాసగిరి నొకగుహాయందు పదుమూడు నెలలుండెను. అందు మూడు నెలలకే చీమలుపుట్టలుపోసెను. అచట సుమారు ముప్పదిమునులున్న యెనమండుగురు యోగినిలు, జటావల్కలధారిణు లైనందు నైదుగురు వల్మీకములలోనే గప్పబడియుండిరి, గాక దిగంబరులునుగలరు. వారలిద్దరి యోగినులను మొలవరకు బైలపరచిరి. అందొకతె నీమెయందు నిర్హేతుక జాయమానమై, యాపుట్టలందీసి పదునేనుదినములకు తెలివి దెప్పించి కందమూలాదు లాహారముగ నిచ్చి గాపాడిరి.

ఆపర్వతప్రాంతమున నొక మహారణ్యంబున పాండవగిరిగలదు. అచట సుమారు మూడేసిగజముల యెత్తుగలిగి నల్లరాతితో జెక్కిన పంచపాండవ విగ్రహములేగాక ద్రౌపదీ విగ్రహమునుగలదు. అచట కోదు కోయ గదబలందరు నేటేట యాద్రౌపదీ విగ్రహమున కుత్సవాదులు సలుపుచుందురు. అచటికి గవర్నమెంటు అధికారములలో యూనిఫారండ్రెస్సులతో సమస్తాయుధోపేతులై వచ్చుటగలదు. ఈమె యాకోయవాండ్రి మంత్రిసామర్థ్యంబు దెలిసికొన సంకల్పించ వారలామెను నొకపాముపుట్టవద్ద నిలువబెట్టి, బ్రదక్షిణ నమస్కారంబులంజేయ నదృశ్యులైరి. ఈమెమాత్ర మాపుట్టయందుండెను.

ఇట్లొక పక్షందివసానంతరమున, కాగవర్నమెంటు యుద్యోగస్థులు కైలాసగిరినిగల యోగినులునువచ్చి యీమెవృత్తాంతంబు సర్వంబును ముచ్చటించనందు పెద్దధికారి వారల నెంతసామవాక్యంబులను లొంగకున్నందున, భేదపరిచియు కార్యకారిగాక తుదకు దండోపాయంబున వార లామెను బయటబెట్ట యోగినులును యుద్యోగస్థులును ఆశ్చర్య మగ్నమానసులై తిరిగి కైలాసగిరికిం దోడ్కొనిరి. అటనుండి మహోన్నదయుడగు శంకర సార్థకనామధేయుండీమెను ప్రపంచాత్మికతా చిత్ప్రచైతన్య తీవ్రవేదనా యుక్తుల దరించ బయటకు దీసుకొనిరా, నీగ్రంధ మారంభమయ్యెను.

ఓచదువరులారా లోక మెంతటితమమో, జ్ఞానసంపాద నేశ్చయం బెంతతీవ్రతమో భక్తిమార్గ ప్రపన్నత నెంతయావశ్యకమో సమాధినిష్టాగరిష్ఠ మెంతయోగ్యమో, మంత్రశక్తి బలమాహాత్మ్యం బెంతవరకో, స్త్రీపురుష వివక్షత నెంతవట్టో, బ్రహ్మజ్ఞానసంప్రాప్తి దమెంత సాధనసాధ్యమో, ఆత్మానాత్మ వివేక విజ్ఞప్తి యెంతదుర్లభమో, సమస్త యోగ భోగ జప తపః సంపన్నసాదృశా ధ్యనుభవసిద్ధాంత సిద్ధిదం బీమె చారిత్రకపఠన పారంపర్యవసాన మని విరమించితి.

ఇట్టిప్రకృతి మాయా జగజ్జాల మహావిద్యానుభవ సిద్ధాంత దార్ష్టాంతికముగ సకలోపనిషదర్థక ప్రతిపాదితంబుగ ప్రకృతి పురుషజన్మ కర్మాభిరత్యంతాభిజరు లెల్లరును నిష్కామకర్మ ఫలత్యాగులై స్వకులోచితంబుల ధర్మార్థకామమోక్షాయత్తచిత్తాములరై సత్సహవాసయోగ భావలక్ష్య లక్షణ శిక్షితార్థులరై సర్వసంశయ విపరీతభావన రహిత పరమపావన పారమార్థక సిద్ధులై పంచపంచతత్త్వాతీత బ్రహ్మానుసారులై ప్రబలవాక్య భయరహితులై నిజగురు సాంప్రదాయక సాక్షీభూతామనస్క రాజయోగసారులై చచ్చియు బ్రతికి జననమరణప్రవాహ దేహదేవ జీవనిర్ణితులగుట కీమెచారిత్రమే శాస్త్ర మనందగును.

## —। గ్రంధవిమర్శన ।—

సమస్తోపనిషత్సార వేదవేదాంత జ్ఞాన భక్తి వైరాగ్య ధర్మార్థ కామ మోక్షంబులకెల్ల సమస్త పామర పండిత మండనముండితులకును శ్రుతిస్మృతేతిహాస పురాణాదికములే యాధారాధేయ మనున దెల్లరకును, స్వానుభవంబని తెల్లంబుగదా. అట్టి శ్రుతిస్మృతులకెల్ల వేదంబు లాధారమైయుండెన

నుట సుప్రసిద్ధంబు, గాన నట్టి వేదంబును వినినవారు అనగా ఋషులు వారికి స్మృతికివచ్చినవే స్మృతులు, ఇట్టి శ్రుతిస్మృతుల కాటపట్టు ఋషులు. అట్టి ఋషులు చెప్పిన శ్రుతిస్మృతేతిహాస పురాణాదికములె ప్రకృతియందలి గ్రంధ రాజములు. ఏమేగ్రంధంబులైనను వేదపరేంగిత పరిబోధనమే కవికవితాహ్వా గ్రంధము. అట్టి వేధయు వేదములనే జెప్పెనుగాన బ్రహ్మామొదలు పిపీలికాది పర్యంతమును బ్రహ్మపదార్థ భావననే సూచించుచుండును, గాని నిజప రేంగిత జ్ఞానభక్తి వైరాగ్యోప నిషత్సారాధికారులగు ఋషివిచారణ ప్రధను కర్తవ్యంబు నీగ్రంధంబంతయు సుమారు 12 పదిరెండు ప్రకరణములును 32 యోగములు మొదలగు విషయములును నిండియుండెను.

ఇందొక్కటె దానినే చరిత్రచర్వణముగ చర్చించుటకు నధికారులె వరు? కేవల నిజపరేంగిత జ్ఞానపారీణ ధురీణాత్మానుభవులగు ఋషులకేగాక, తదితరుల కందరానియగాధము, పొందరాని ప్రోవునై యున్నయది. కాబట్టి గ్రంధపరిశోధనాగ్రేసర పండిత పామర జ్ఞాన భక్తి వైరాగ్య యోగ భోగ జప తప స్సంపన్నతా ముండితమండనగుర్మండలి బ్రహ్మఋషి సాంప్రదాయక సిద్ధులారా! మున్ముందుగ కం ఋషియనుపదమున కర్థము, ఋషియొక్కరును లకేగాక ఋషికుత్పత్తి౯! ఋషివాచ్యవాదభేదము! ఋషులె చర్చించవల యు రూఢిగజగతిన్! సమస్తోపనిషత్తులును ఋషులవలననే కలిగెను. ఋషులే సమస్తవేద ప్రకాశకులు, ఋషులే సమస్తశాస్త్రసృష్టికర్తలు, ఋషులే కార్య కారణగురువులు, ఋషులే యోగభోగజపతప స్సంపన్నులు ఋషులే జ్ఞాన భక్తి వైరాగ్యభూషణులు, ఋషివినా పదార్థంబు లేదు ప్రతిమానవుననును, ఆ చండాలాది బ్రాహ్మణపర్యంతంబును ఋషిగోత్రము, వంశములేనివాడు లే డుగాన, ప్రతిమానవుడును, ప్రతిలోకమందునను, ఆయా ఋషిగోత్రవంశీకు లరే గాని తదితరమైనవారిని గానము. ఇట్టు మానవులకేగాదు, దేవతలకును యక్షరాక్షస పిశాచగుహ్యకగంధర్వ సిద్ధసాధ్య విద్యాధరాదియెల్ల దేహధారు లకును గలిగియుండుటచేతనే దేవు డెట్టివాడో జీవు డెట్టివాడో తెలియుటకె నీభాషా పరిజ్ఞాన యోషిదత్రిములెల్లయు ఘోషించుచున్నవి. కాబట్టి ప్రతి మానవుడును మున్ముందుగ ఋషియాట బహుసులభంబుగ ననతికాలంబున ననాయాసంబుగ న్యాయమార్గానుసార యనేకపూర్వజన్మ పరిపాక పుణ్య విశేషంబున నాత్మ సాక్షాత్కార పరమఋషిదర్శనంబునకు జీవదేవు లిద్దరిని

వేర్వేరుగగాని నేకముజేసిగాని కేనోపాయేన మానవశరీరంబున నీజీవుడుండగ దేవుడనిగాని దెయ్యమనిగాని నేదోయొక గోల్పాయుటను పరమావధిగ జేసుకుని దానియందు తీవ్రవేదనాయత్తచిత్తైకాగ్రతగ మార్గాన్వేషణ ప్రథమకర్తవ్యంబు ఇదియే దుర్లభంబని యనుకొనరాదు.

మ॥ ఆరంభింపరు నీచమానవులు విఘ్నాయాస సంత్రప్తులై నారంభించి పరిత్యజింతు రుమవిఘ్నాయత్తులై మధ్యముల్। ధీరుల్ విఘ్ననిహన్యమానులగుచున్ దృత్యున్నతోత్సాహులై। ప్రారబ్ధార్థము లుజ్జగింప రుసుమీ ప్రజ్ఞానిధుల్ గావునన్॥ ప్రతిమానవుడును ఋషిసాంప్రదాయక గోత్రవంశీకుండగుటచే ప్రతివాడును, ఋషియగుట కవశ్యకర్తవ్యంబు. అట్టి ఋషియగుటకు సర్థవాదత్వేన, భేదభావబుద్ధి చైతన్యమానసాంభోజ పరిణామాను పాదాను కారణ కార్యంబు లరయక మనోవాక్కాయ కర్మభిఃఋషికావలెనను తీవ్రవేదనాచిత్తమగ్నతచే ఋషియైన నంతనె చతుష్షష్టి విద్యాపారంగతుడౌట కగ్హాండగును, గాన ఋషియనుపదమున కర్థమనే కానర్థంబుల కేత్వంబు గాన వానినన్నిటిని నవలద్రోచి ఋషిని ఘుంటితముందు చెప్పిన సొప్పున ననగా వ్యాసోనారాయణో హరిః॥ అన్నట్టు వ్యాసప్రోక్తంబైన నిఘంటార్థంబు శృతి॥ జ్ఞానేనజ్ఞానమాలోక్య పశ్చాజ్ఞానం పరిత్యజేత్॥ అనుప్రమాణతః నగురోరధికః యని యున్నది గాన నీగ్రంథమే గురువాభావించి, యమయోగ సాధన, అనగా యమలను నమరములకు భేదస్వల్పమాత్రం బగుటచే గురువులకభేదభావమే యోగం గాన ప్రతియోగమునకును సాంఖ్యతారకా మనస్క రాజయోగమే యమయోగము, అనగా క్రిందమీద కుడియెడమ, లావు, సన్నము, దీర్ఘముకురుచ, యిట్టిద్వంద్వ స్వభావక చాతురీమహిమా పాండిత్య ప్రకల్పితయేగాని సమస్త వేదాధారమై సమస్తమునకు ఋషికారణమెట్లయ్యెనో యట్లనే నోంకారంబు వినావేదంబులేదు గానవేదార్థమునుదెలియుటే ఋషి॥

అట్టి సప్రశని అనగా సత్వరజస్తమో గుణాత్మికమైన నీశరీరమునకు మూలము జీవునిగా భావించియైనను తన కీదేహంబు గలదో లేదో లేకయుండు స్థితిని, ఉండి లేని స్థితిని నీయోంకారాను సంధానమే ప్రాధాన్యమై యున్నట్లు వ్యాసనిఘంటింతమై యనేకోపనిషద్ఘోషమై గన్పట్టెడిని, ఇది యెవరంతటవారు తనుదా దెలియవలెను.

ఆకాశమొక భూతమై విచారణకు సావకాశమై స్పష్టముగ స్వల్ప కాలంబునతాను వేరై తనువును వేరుజేసివేదాంతవిచారణకు నర్హులైనానాశ్రుతిస్మృతేతిహాసాదిపురాణ శ్రవణ మనన నిధిధ్యాసలను ఋషిసాంప్రదాయకంబులను తాను తన తెలివిని తాదెలసితా సచ్చిదాయనందైకాత్మపరేంగితజ్ఞానసంపాదనేచ్ఛాపరులకు పరమార్థదాయికంబై యుండును

అట్టి మానసిక సన్యాసులకు మణిమాణిక్యంబు లోకంబున ఋషికానివాడుండడు. అనగా తన జీవితమున నేకారణకార్యములచేత నైనను భగవంతుని దలచనివా డుండడు. కాబట్టి వ్యాసుడు సమస్త జనోపయోగంబుగ సిఘుంటితమైన మార్గమొక్కటియే యేర్పాటుచేసి మాయను తొలగించి మనుజసంరక్షణార్థంబు మంత్ర మంత్రానుభవ మార్గంబుల మర్యాదలెరిగి పెద్దల వాక్యామృతసారమగ్నులై మాహాత్ములగు టతిసులభంబు ఋషిప్రోక్తంబులు ఋషులకే తెలియవలెను గాని యితరులకగాధబాధురంబై యుండుగాక నొకదాని గుణదోషవిచక్షణత ఫలాఫల ప్రాప్తజ్ఞులకు గాని పారమార్థికత విచారణలకు ప్రతిమానవునకును మనోరాజ్యంబున మహదహంకారవ్యాక్యామృత జ్ఞానం బనాదిసిద్ధంబై యుండుటం జేసి తాను మనీషిని యను జనులందరును విచారణకర్తలే కావున శ్రుతి స్మృతులు వేనవేలై యుండుటం జేసి యొకదాని మించునొకటి యుండుట సుప్రసిద్ధంబు. అట్లుండుటంజేసి తర్కంబు తార్కికంబున వాదభేదోపాయంబులం గాలంబు వృథయగును. కాబట్టి ప్రథమమున తాను తరించు సాధనం బెట్టేకద్దా యని విచారణ పెట్టుకొని దానిని తెలివొంది కలిసిన పిమ్మట యితరుల తరణోపాయంబులకు బ్రయత్నించుట పరోపకారపారీణతయగును. ఇందనుభవ జ్ఞాన భక్తి వైరాగ్య వాక్యరత్నంబమూల్యంబులు గుప్పలు గుప్పలుగ గ్రుచ్చెత్తబడి యున్నవి; జిహ్వాకొకరుచి పుర్రెకొకగుణమన్నట్లు యేజీవికేది రుచియో దానినే గ్రహించతగు రచనావివేచనమై యున్నవి; ఇట్లని యూరకున్న మాయవిడిపోదు. మార్గము సరిగాదు. భ్రాంతిమాత్రము ముందున నూయియు వెనుకను గోయియు మనసు వ్యాట్లాడుచుండును గాని యీగ్రంథంబును చేతబట్టిన ప్రతివానికిని యాశాపాశా బంధశృంఖలంబై యుండు మహాత్ములారా! అంతటను దేవుడుండెను. అసిన మాత్రిన దస్ప్రారబ్దకర్మానుభవము దప్పునా రవిగాననిచో కవిగాను గనులోకోక్తి కవనాకల్పనాపదయమకాలంకారయుక్తం బగు కవితను కరు

ణాకటాక్ష వీక్షణంబుల యాదరింప వారలనేకులు గాని స్వచ్ఛమైన నిజస్వ గుణగణాద్యలంకారయుక్తంబగు దానినందరు. గ్రంథమును ఈదూషణ భూషణ తిరస్కారభావంబు లన్నియు శరీరంబునకే గాని ఆత్మకు లేవు గాన, పెద్దల ట్టిటులవిచారించినను, నీగ్రంథంబుతయు శుద్ధిత్వానుభూతి పూతమయమై పుణ్యపాప విచక్షణీయమై విన గన నగణ్యగుణాద్యలంకార భూషితమై బహుమార్గావలంబన నాత్మబోధకమై పరికృతిద్వయదోషహరమై నిజపరేంగిత జ్ఞానబోధనిమై యుండెను.

గ్రంథపరిశోధక మహాశయులారా! ఈగ్రంథంబు నీహావబోధితములు గలవని తన గ్రాహ్యాగ్రహణ యూహలచేగద నిర్ణయించవలసినది నేను సర్వజ్ఞత్వాదిగుణ బ్రహ్మ నిష్ఠాగరిష్ఠత్వమేగద సర్వాపరాధశోధనీ యధికారి. ఇట్టి యధికారత్వాహంకారము కారణాపాదితమైన నీదేహముండిన గదా! గ్రంథముండిన గదా! తప్పొప్పులెంచుట ఇట్టి దేహవిచారమెంతవరకు జేయుననగా, జీవభ్రాంతి యున్నంతవరకు విచారమే వేదమును వచ్చినవరకు చెప్పించుకొనవలయు చచ్చేవరకు చదువవలయును.

కాబట్టి దేవజీవభ్రాంతి యుక్తమైన నీదేహంబు కాల్చినను, తిరిగి తిరిగి గలుగుచుండు నను శాస్త్రవినోదంబుల విచారణకట్టిపెట్టి, అహం బ్రహ్మాస్మి యను నాల్గు మహావాక్యార్థానుభవజంతువై, నీగ్రంథంబును నిది తప్పనిన దానిని చక్కగదిద్ది సమర్పింప సమర్థనైక్యానుసంధానయోగ్యతానుసారముగనున్న దేశప్పు, ఈతప్పు అందరికిని గలదు. గాన ధీశాలురుధీయోయోనః యను, గాయత్రి త్రిపాదములనేగాక, పావనరజశ్శుద్ధోమ్మను నాలవపాదంబున ననుగ్రహించి శ్రీపంచదశి సౌభాగ్యపాదుక గాయత్రీ పూర్ణదీక్షా దక్షత్వ శిక్షితంబైయున్నయది. ఈగ్రంథము పండ్రెండు ప్రకరణములుగ విభజింపబడియున్నది. ప్రకరణశబ్ద సామస్యంబు సరసంబుగ వనువర్తింపబడెను. కృత్ ధాతువు చేయుట ప్ర అనునది ఉపసర్గకరణంబు చేయునది. పండ్రెండుభావములను ప్రకాశింపజేయుచుండెను. ఇదియు సార్థక సాంఖ్యయోగ తత్పరత్వమును బోధించుచుండుట విషయసూచికానుక్రమణికాగమనసిద్ధంబై యున్నది.

గ్రంథకర్త స్త్రీ, గాక యోగినియైయున్నది. కాబట్టి ఈవిషయికానేక గ్రంథరాజములందు ప్రకృతిపురుషావివేచనమందును, మాయా యీశ్వర

సంవాదంబులను సమస్తద్వంద్వాద్వైతానుభవసిద్ధ సిద్ధమునిగణగుణభూషణుం డగు పైలమహాఋషి వ్యాసశిష్యుండు నారాయణమహాఋషి యావిషయ ప్రబోధంబుబోధింప, కుమారస్వామికి పరమేశ్వరుండిట్లుచెప్పెడు. ఇది పంచమవేదమందును ప్రామాణ్యగ్రంధమందు 125 ఋషులకును, మహాశక్తిహం శులైనభార్యలు బోధించిరి. ఆప్రామాణ్యగ్రంధమందు 447 డుగురు ఋషులు యొక్క యుత్పత్తి నొప్పియున్నది.

వేదవిధి నిర్ణయ ప్రకృత్యాగోణప నివారణార్థంబు అనగా బాహ్యమందు వేదకర్మవిధి ప్రేరేపణతయా స్త్రీని వైవాహిక గర్మాచరణ ప్రకృతి పురుషపాప పుణ్యకర్మ సమారంభములు సమస్తవిధిష్ట నిర్ణయమునకు శ్రీశాంభదేవి గాయత్రిత్రిపాద స్వరూపమైనందున త్రినేత్రమనే మనోనేత్రామృతస్థానం గాన దేవీదేవతల కమృతప్రదాయి నగుటంజేసి జ్ఞానస్వరూపిణియగు స్త్రీ యిచ్ఛా క్రియాశక్తి త్రితయాం మహాఋషులకు బోధనాధికారము గలదై గర్మానుష్ఠానచరులగు పండితపామరులకెల్ల దివ్యజ్ఞాన భక్తి వైరాగ్యానుభవాత్మబోధ కథకారిణి స్త్రీ యైయున్నట్లు నీక్రింది వివరణలచే స్పష్టీకరించబడి స్థిరీకృతమైనది.

జ్ఞానవాశిష్ఠమందు శిఖిధ్వజమహారాజునకు భార్య చూడాల ఆత్మజ్ఞానోపదేశమును జేసెను. వేదములన్నిటిలోన నొక్కొక్కబుక్కున కర్తకారులు స్త్రీలేయైయున్నట్లుగ గన్పడుచున్నది. ఋగ్వేదమందంతటను స్త్రీలే జ్ఞానభక్తివైరాగ్యోపరత్యాధికారిణులైయున్నట్లు స్పష్టముగనుండెను. కాబట్టి స్త్రీశక్తిస్వరూపి మహామాయాప్రకృతి యిట్లనేక నామాంతరములచే బెక్కుస్వరూపములుగ సురూపులుగను జ్ఞానయిచ్ఛా క్రియాశక్తి త్రితయరూపిణీ దేవతలచే ధ్యానించబడినందున దీన మాయ మోహజాలంబుల పదునాలుగులోకంబులలోను బ్రహ్మమాయయేమియు శ్రుతిప్రమాణముచే నాత్మను దెలియనందున స్త్రీయనగ నే తత్త్వంబని మహాత్ములైన ఋషులు వేదాధికార గురుమంత్రసిద్ధత్వంబును సాక్ష్యానుభూతిగా ఋషిగోత్ర వంశవృద్ధి పారంపరముగ స్త్రీలు సర్వజ్ఞత్వాదిగుణమణినికరంబు లిప్పటికిని నిర్ణీతలైయుండిరి. అట్టి స్త్రీలలోనే గ్రంధకర్త యొకయోగినియై యుండుటంజేసియే నిట్టి శాస్త్ర జ్ఞానాభివృద్ధి గ్రంధరాజీయంబును బ్రకటింప శక్తిమంతురా లగుటయే నిప్పటి స్త్రీబాల వృద్ధాదరణీయ ప్రమాణనిఘంటితమై ప్రకాశించుచున్నయది.

ఓ మహాజనపాఠకులారా! పరమార్థ బోధోపరత్యంతానురాగమోద ఖేదసంతాప తాపాపనోదినియగు నీయోగినికి దగుబ్రోత్సాహపాత్రితాపవిత్రితీర్ణులగుదురని నమ్మువాడ. శ్రీయని నిరసించినను విషయానుభవసిద్ధులగుదురుగాత. సంసారతరణ తారణో యత్తచిత్తచైతన్య మాదృశ మహానీయులగు జనులకందరికిని శ్రీశే మూలాధారముక్తి మోక్షసక్తి భక్తిజ్ఞానదాయినులు శ్రీ లేయైయున్నట్లు భవంబేగాన ప్రత్యక్షదృష్టాంత దార్ష్టాంతిక ఉపోద్ఘాత వివేచనా విజ్ఞానహేతుమ్యాభ ప్రతిమానవ్యనము ప్రకృతిద్వయా దోషనివార్థులు శ్రీశేయని నిర్ణయించవలసెను.

ఆయన తనశరీరమేయని నిశ్చితమానసులగు మానవులకెల్లరకును పంచభౌతాత్మకమైన నీదేహమెల్లమార్గములకును మూలాధారమైయున్న దాని సుప్రీ॥ మూలాభావ మిదంజ్ఞాతుం నశరీరంనకిను స్తి॥

శరీరమేమియు లేదనుదానియందే సమస్తసృష్టి స్థితిలయములునుగలిగి యెట్లువచ్చునో అట్లే యన్యోన్య మెచటికుండినచ్చునో నచటికే యనిచనుట సహజమాయెను గాన సుష్కతర్క వేదాంతులుగాక నిజపరేంగిత జ్ఞానోపయోగభక్తి వైరాగ్యబోధ్యులచే ప్రకృతి ద్వయదోషరహితులు శ్రీశేగాన నీ గ్రంధకర్త్రి యోగినియని శ్రీయని గ్రహితభాంఖేదవాదన్నులుగాక ఆత్మ శ్రీ కాదు పురుషుడునుగాదు గనుక మానవబిడ్డయైనను మంటిబిడ్డయైనను ఆత్మపరేంగితజ్ఞులగుదురుగాతయని పెద్దలీసున్నదని నన్నబు పరబ్రహ్మస్వరూపిని నే యను దృష్టాంత దార్ష్టాంతిత్యాగుభావసిద్ధులగుటచే కర్త కర్మ సామాన్యమైన క్రియయే ప్రాధాన్యముగ నిశ్చితనిశ్చయ మానసోల్లాస భావబద్ధ మోక్షదాయిని యని యెల్లరకును తెల్లంబని గ్రహించి గర్వించిన గిగనమున కేమియు కొనవలే దుగాన సుకవిమహాకబ్రహ్మంబును పరబ్రహ్మ భావనాసూచికయే యీయోగిపరలబ్ధావశేషమార్గవర్ధిని యన నల్లెపల వేదమార్గానుసారవిశేషాశేషామృతపానముత్రాభోదయధురీణాత్మకాంట కెంతయు నిస్సంశయాత్మకంబగు నీశ్రీనామకథన సారసంగ్రహంబును వేదసారగ్రంధపరిశీలనా ప్రభావ ప్రకటితెంబనుట నిశ్చయము.

ఆఖ్యాయికా వ్యాఖ్యానములు వ్యాసవాల్మీకాదులు మొదలగు మహాఋషులందరును సంస్కృతభాషయందే యుండుటచేతను నన్నయాదులును సంస్కృతాదులయందే వ్రాసియుంచిరి. పారాశర్య సర్వజ్ఞును॥ శృతి॥ శ్రీ

శూద్రద్విజ బంధూనాంత్రయీ న శ్రుతిగోచరా॥ ఇతి భారతమాఖ్యానం కృపయా మునినా కృతమ్॥ ఎనిమిదివేల ఎనిమిదివందల వ్యాసఘట్టశ్లోకములు గణేశాదులకించుక గ్రాహ్యముగ వ్రాయబడినవి. త్రయమతకర్తలును స్త్రైమాసోద్ధారణాధికారులయ్యును భగవద్గీతాది గ్రంథములను యాత్మప్రబోధితములైనవి వ్రాసియుంచిరి. వాల్మీకి యిరువదినాల్గువేల శ్లోకములు రచించిరి గాని నొక్కపద్యమైన విడువలేదు. ఆత్మపరేంగిత జ్ఞానప్రకాశితకై నెవరెవ రెట్టిగ్రంథంబులు రచించినను దేవుడుండెననుట జీవుడై యాధారుండై యొకరొకరిని యొక్కరొక్కరుగ నెవరంతటవారే విచారించిన తనయాత్మకు తానే సాక్షీభూతుడగుటకు నిదియే నిశ్చితజ్ఞానబోధిని యనంబడు. ఇది చదివిని యూరకున్న మాయవిడిపోదు. మార్గముదొరకదు. జనన మరణప్రవాహంబునబడి కొట్టుకొనిపోవుటయే గత్యంతరముగాని జన్మరాహిత్యమైన మార్గమునకు మరలుట వారివారి యనేక పూర్వజన్మ పరిపాక సంచితార్థంబని నిజంబు నిముసంబు వెల్లడియై తెలిసికొందుటకుగాను యీగ్రంథసారాంశము.

ఇట్లు,

వేమూరి శేషయ్యశర్మ పరిష్కృతం
కాలేజీమేష్టర్, పిఠాపురం.

పెదపర్తి శివరామదీక్షితులు,
షట్ శాస్త్ర పండిత పరిష్కృతం
కృష్ణాజిల్లా, వాసుదేవపురం.





కాట్రావులపల్లి సూర్యనారాయణ యోగినీ.

# విజ్ఞప్తి.

ఆర్యులారా !

దిక్ప్రదర్శనముగ వ్రాయబడిన యీయుపోద్ఘాతము నుద్దేశించి నంతకన్న గొప్పదయ్యు ననేకవిషయములు చర్చింపక విడచియు మిగుల సంక్షేపముగ నాకే సంతుష్టి నొసగకేదన,

శ్రీభాష్యకారులు, మహాఋషి ప్రోక్తమైనది గాన నీమాటచెప్పనేల, గ్రంథమూగొప్పది, కవియూ, శ్రీమహాయోగిని, విద్యా, బ్రహ్మవిద్య, మర్మములా మెండు, భాషాంధ్రభాష, చదువుకొలది విశేషార్థము దోచుచుండును, ఇక నేనా కించజ్ఞతను దోషములా దండిగనుండవచ్చును, దానికి సవరణపట్టికయే సాక్షి, దీనిని మీరందరు కేవల పరమదయతో సాంగముగాజదివి చేకొని నన్నానందింప జేయవలయును.

జగత్సృష్టినిగూర్చి యనేకగ్రంథములయం దనేకవిధంబులుగ జెప్పంబడియున్నది. కావున శ్రుతిస్మృత్యాది ప్రమాణోక్తముగను న్యాయార్థసిద్ధముగను పరమేశ్వర సృష్ట్యాది ప్రబోధజనకమగు నొక గ్రంథరాజము సంస్కృతభాషచే రచియింపుడని సృష్టివిషయిక జ్ఞానేచ్ఛాసముత్సాహవిద్వత్సంఘము వారు నన్ను బ్రోత్సాహపరప సంస్కృతకవిత్వమందసమర్థతనయ్యు వారి యాజ్ఞ నుల్లంఘింపజాలక సాహసించి నాశక్తికొలది నానక్తిచే భుక్తిముక్తి ప్రదంబగు, శ్రీమహాఋషినిఘంటిత యోగశాస్త్రమను నీయుద్గ్రంథము రచించితి నందు దోషంబులున్నం బరిశీలించి మన్నించగోరెదను.

క॥ తప్పైనను నొప్పైనను, దెప్పుచునో మెచ్చుకొనుచు దీనిఁ శ్రద్ధఁ
దప్పక సకలము జదివెదు, నప్పుణ్యాత్ముల కొనర్తు సాష్టాంగనుతుల్।

మ॥ అపశబ్దంబుల గూడియుఁ హరిచరిత్రాలాపముల్ సర్వ పా
పపరిత్యాగముసేయు గావున హరిఁ భావించుచుఁ బాడుచుఁ
జపముల్ సేయుచు వీనులఁ వినుచు నశ్రాంతంబు గీర్తించుచుఁ
తపసుల్ సాధులు ధన్యులౌదురుగదా తత్వజ్ఞ చింతింపుమా॥

తే॥ మృదుమధురరీతి శ్రీమహాఋషినిఘంటు
యోగశాస్త్రంబునొనరించి యుండెఁజూవె

సంస్కృతంబున దానికి సార్థకముగ
నర్థ మొనరింపు మమ్మ నాహ్వాయసుధీంద్ర।

మ॥ అని నాతో విబుధోత్తముల్ దెలుపగా నాలించి తాత్పర్యబో
ధిని గావించితి భామరుల్ సుకవులున్ ధీవర్యులుఁ మెచ్చరీ
తిని దీనిం గనుమానవప్రవరులెంతే సత్కృపం దప్పులుం
డిన నిందింపక దిద్ది బాగుపరుపఁ డెందంబునఁ వేడెదన్.

ఇట్లు,
కా॥ సూర్యనారాయణయోగిని,
గ్రంథకర్త.



# గురుస్తోత్రం.

శ్లో॥ విశ్వవ్యాపినమాది దేవమమలం నిత్యం పరంనిష్కళం
నిత్యోద్బుద్ధ సహస్రపత్రకమలే లుప్తాక్షరే మంటపే
నిత్యానందమయం సుఖైక నిలయం నిత్యం శివంస్వప్రభం
ధ్యాయేద్ధంస పరంపరాత్పరతరం స్వచ్ఛంద తస్సర్వదా.

వ్యా॥ నిత్యో...కమలే-నిత్య= ఎల్లప్పుడును, ఉద్బుద్ధ =వికసించిన, సహస్రపత్ర= వేయిరేకులుగల, కమలే = పద్మమునందలి, లుప్తా = పోయిన, అక్షరే = ఆకారాదివర్ణములుగల, మంటపే = మంటపమునందు, విశ్వవ్యాపినం- విశ్వ = సమస్తప్రపంచమునందు, వ్యాపినం = వ్యాపించినదియును, ఆదిదేవం = మొట్టమొదట దైవస్వరూపమైనదియును, అమలం = పరిశుద్ధమైనదియును, నిత్యం = శాశ్వతమైనదియును, పరం = బుద్ధిమొదలైనవాని కన్నిటికి వేరైనదియును, నిష్కళం = కళారహితమైనదియును, (ప్రాణము, శ్రద్ధ, ఆకాశము, వాయువు, జ్యోతి, ఉదకము, భూమి, ఇంద్రియము, మనస్సు, అన్నము, వీర్యము, తపస్సు, మంత్రములు, కర్మ, లోకములు, నామములు, ఈపదియారును కళలనంబడును. ఇవిమాయానిర్మితములు. యీకళలు లేనిది నిష్కళయనంబడును.) నిత్యానందమయం = ఆనందస్వరూపమైనదియు, సుఖై = సౌఖ్యమునకు, ఏక = ఒకటియై, ముఖ్యమైన, నిలయం = స్థానమైనదియును, సర్వదా = ఎల్లప్పుడు, స్వచ్ఛందతః-స్వతంత్రముగ, హంసపరంపరాత్ -హం, స= హంసమంత్రము యొక్క, పరంపరాత్ = వరుసకంటె, పరతరం = మిక్కిలి వేరై యుండునదియు, నిత్యం = శాశ్వతమైనదియు, శివం = మంగళస్వరూపమైనదియునగు, స్వప్రభం - స్వ = ఆత్మయొక్క, ప్రభం = తేజస్సును, ధ్యాయేత్ = ధ్యానించెదను, నమః = నమస్కరించెదను.

శ్లో. యదంఘ్రికమలద్వంద్వం ద్వంద్వతాప నివారకం
తారకంభ శింధోశ్చ శ్రీగురుం ప్రణమామ్యహం॥

శ్లో. ఆబ్రహ్మస్తంభ పర్యంతం పరమాత్మస్వరూపకం
స్థావరం జంగమంచైవ ప్రణమామిజగన్మయం॥

# దేవతాస్తోత్రం.

శ్లో. శ్రీసింహాసన సంస్థితాం త్రినయనీం సౌభాగ్యరూపాంశివాం
సర్వాభీష్ట ఫలప్రదాం మణిమయీం మాణిక్యమాలోజ్వలాం
బ్రహ్మాద్యాది సమస్తదేవవినుతాం బాలార్కకోటీజ్వలాం
త్వాంవందే త్రిపురాంత్రిలోకజననం దారిద్ర్యపాప విఛ్ఛేదినీం

# గీతాభాష్యకథనమ్.

శ్లో॥ త్యక్త్వాకర్మ ఫలాసంగం నిత్యతృప్తోనిరాశ్రయః ।
కర్మణ్యభి ప్రవృత్తోపి నైవకించిత్కరోతిసః॥

టీక॥ కర్మమునందు అకర్మమును, అకర్మమునందు కర్మమును, జన్మమునందు కర్మమును, కర్మమునందు జన్మమును, విత్తనమునందు వృక్షమును, వృక్షమునందు విత్తనమును, శ్లో॥ అగ్నిదగ్ధం యథాబీజం, శాఖాపల్లవ వర్జితమ్ । జ్ఞానదగ్ధంతథా యోగి, పునర్జన్మంనవిద్యతే॥ శ్లో॥ అభీజం వృక్ష సంకీర్ణం శాఖాపల్లవవర్జితం । పుష్పం నాస్తిఫలంనాస్తి సంపూర్ణం వృక్షవర్జితమ్॥ సః॥ ఆపురుషుడు, కర్మఫలాసంగం = కర్తృత్వాభిమానమును, ఫలాభిలాషను, త్యక్త్వా = విడచి, నిత్యతృప్తః = సర్వకాలములయందును అగుచు స్వాత్మానం దానుభవముచేత తృప్తుడైనవాడును, నిరాశ్రయ = ఆధారశూన్యుడును, కర్మణి = కర్మమునందు, అభిప్రవృత్తోపి = ప్రవర్తించినప్పటికిని, కించిత్ = ఒక్కదానిని, (ఏకర్మమును) నకరోత్యేవ = చేయుచున్నవాడే కాడు.

COM-భాష్యం.

యస్యకర్మాది దర్శీసో ఽ కర్మాదర్శనాదేవ నిష్కర్మా సన్యాసీజీవనమాత్రార్థ చేష్టస్సన్ కర్మణినప్రవర్తతే । యద్యపి ప్రాక్‌వివేకతః ప్రవృత్తః యస్తుప్రారబ్ధకర్మాసన్ ఉత్తరకాల ముత్పన్నాత్మసమ్యగ్దర్శనః స్యాత్ సకర్మణి ప్రయోజన మపశ్యన్ ససాధనం కర్మపరిత్యజత్యేవ సకుచితశ్చిన్నిమిత్తాత్ కర్మపరిత్యాగా సంభవే, సతి, కర్మణి, తద్ఫలేచసంగరహితతయా, స్వప్రయోజనా భావాల్లోక సంగ్రహార్థం, పూర్వవత్, కర్మణి ప్రవృత్తే ఽ పినైవకించిత్ కరోతి జ్ఞానాగ్నిదగ్ధ కర్మత్వాత్ తదీయం కర్మాకర్మైవ సంపద్యత ఇత్యేవతదర్థం దర్శయిష్యన్నాహ ।త్యక్త్వేతి।త్యక్త్వాకర్మస్వాభి మానఫలాసంగంచ యథోక్తే జ్ఞానేనిత్యతృప్తోనిరాకాంక్షో విషయేష్వితి త్యర్థానిరాశ్రయ

ఆశ్రియరహిత ఆశ్రియోనాను యదాశ్రిత్యపురుషార్థం నిసాధయిష్యతి। దృష్టాదృష్టేష్ట ఫలసాధన నాశ్రియరహిత ఇత్యర్థః తే నైవంభూతేన స్వప్రయోజనా భావాత్ ససాధనం,కర్మపరిత్యక్తా్వ నైవేశఇత్యపాప్తౌ తతోనిర్గమానంభవః లోకసంగ్రిహ చికర్షయా శిష్టవిగర్హణా పరిజిహీర్షయా, వా, పూర్వవత్ కర్మణ్యభిప్రవృత్తో ఒపినిష్క్రియాత్మదర్శన సంపన్నత్వాన్నైవకించిత్ కరోతిసః॥

తా. వివేకముగలుగుటకు పూర్వమునందు కర్మమునందు ప్రవర్తించినప్పటికిని వివేకముగలిగినపిమ్మట కర్మమునందు అకర్మమును అకర్మమునందు కర్మమును చూచు బ్రహ్మజ్ఞాని ఆత్మజ్ఞానము కలవాడై సన్యాసియగుచు వైదికలౌకికకర్మమునందు కర్తృత్వాభిమానుడై ప్రవర్తించక కర్తృత్వాభిమానము లేక జీవనమాత్రోపయుక్తమైన కర్మమునందు ప్రవర్తించును. ఆత్మజ్ఞానికి ఏదో కారణమువలన కర్మమును వదలుట సంభవించకపోయినందున స్వప్రయోజనము లేదు గనుక కర్మమునందును తత్ఫలమునందును కర్తృత్వ భోక్తృత్వాభిమానములను వదలుకొని లోకసంగ్రహము కొరకుగాని శిష్టజనులవలన నిందపోగొట్టుకొనుటకు గాని వివేకము లేనప్పుడు వలెనే కర్మమునందు వాడు ప్రవర్తించినను జ్ఞానాగ్నిచే సకల కర్మములను కాల్చివేసినవాడగుటవలన దృష్టిచేత ఏకర్మమును చేయనివాడగుచున్నాడు. ఆతనికి కర్మము కర్మముకానేరదు. ఆత్మజ్ఞాని సర్వఫలాభిలాషను వదలి విషయసంబంధమునందు విముఖుడై స్వాత్మానందానుభవముచే తృప్తుడై దృష్టాదృష్టఫలప్రాప్తి సాధనములను ఆశ్రయించక కర్మప్రవృత్తుడైనను కర్మచేయుచున్నవాడుకాడు.

"సర్వంబ్రహ్మైవపశ్యతో విదుషః స్వార్థాపరార్థాచా ప్రవృత్తిర్నసంభవః క్వచిద్వాసనయా ఆపాదితా కర్మణి ప్రవృత్తిరపిస్వయ మకర్మైవ భవతి॥

శ్లో॥ బ్రహ్మార్పణం బ్రహ్మహవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతం
బ్రహ్మైవతేన గంతవ్యం బ్రహ్మకర్మసమాధినా.

టీక. అర్పణం= (హోమసాధనమైన) స్రుక్స్రువాదికము బ్రహ్మ=బ్రహ్మస్వరూపమే, హవిః=(అన్నము, నేయి, మొదలుగాగల) హోమద్రవ్య సముదాయము, బ్రహ్మైవ=బ్రహ్మస్వరూపమే, బ్రహ్మణా=(బ్రహ్మస్వరూపున) యజమానునిచేత, బ్రహ్మాగ్నౌ=బ్రహ్మస్వరూపమైన అగ్నియందు

హుతం=(చేయబడు) హోమము, బ్రహ్మైవ=బ్రహ్మమే, బ్రహ్మకర్మసమాధి నా=బ్రహ్మమనియెడు కర్మమునందే చిత్తైకాగ్రతగల, తేన=ఆయజమానునిచేత గంతవ్యం=పొందదగినఫలమును, బ్రహ్మైన=బ్రహ్మమే.

## Com_ భాష్యం.

కస్మాత్పునః కారణాత్ క్రియమాణం కర్మ సర్వకార్యారంభమ కుర్వత్సమగ్రం ప్రవిలీయత ఇత్యతేయతః॥ బ్రహ్మార్పణమితి॥ బ్రహ్మార్పణం యేన కర్మణేన బ్రహ్మవిద్ధవిరగ్న్యాదర్పయతి తద్బ్రహ్మైవేతి పశ్యతి తస్యాత్మవ్యతిరేకేణాభావం పశ్యతి యథాశుక్తికాయాం రజతాభావం పశ్యతి తథోచ్యతే బ్రహ్మైవార్పణమితి యథాయద్రజతం తచ్ఛుక్తికైవేతి బ్రహ్మార్పణమిత్య సమస్తే పదేయ దర్పణబుద్ధ్యాగృహ్యతే లోకే తదస్య బ్రహ్మవిదో బ్రవేత్యర్థః బ్రహ్మవిః తథాయద్ధవిర్బుద్ధ్యా గృహ్యమాణం తద్బ్రహ్మైవాస్య తథా బ్రహ్మగ్నావితి సమస్తంపదం అగ్నిరపి బ్రహ్మైవ । యత్రహూయతే బ్రహ్మణా కర్త్రా బ్రహ్మైవకర్తేత్యర్థః। యత్తేహుతం హవనక్రియ తద్బ్రహ్మైవ యత్తేన గంతవ్యంఫలం తదపి బ్రహ్మైవ బ్రహ్మకర్మసమాధినా బ్రహ్మైవకర్మ బ్రహ్మకర్మ బ్రహ్మకరంణి సమాధిర్యస్యసః బ్రహ్మకర్మసమాధిస్తేన బ్రహ్మకర్మసమాధినా బ్రహ్మైవ గంతవ్యమేవం. లోకసంగ్రహంచికీర్షణాపి క్రియమాణం కర్మపరమార్థతో అకర్మ బ్రహ్మబుద్ధ్యుపమృదితత్వాన్నివృత్త కర్మణోపి సర్వకర్మసన్న్యాసినః సమ్యగ్దర్శన స్తుత్యర్థం యజ్ఞత్వసంపాదనం జ్ఞానస్యసుతరాముపపద్యతే । యదర్పణాది అధి యజ్ఞే ప్రసిద్ధం తదస్యాధ్యాత్మ బ్రహ్మైవ పరమార్థదర్శనఇతి । అన్యథా సర్వస్యబ్రహ్మత్వేసతి అర్పణాదీనామేవ విశేషతో బ్రహ్మత్వాభిదానమనర్థకంస్యాత్ తస్మాద్బ్రహ్మైవేదం సర్వమితి జ్ఞానతః కర్మాభావః కారకబుద్ధ్యభావశ్చనహి కారకబుద్ధిరహితం యజ్ఞాఖ్యం కర్మదృష్టం సర్వమేవాగ్నిహోత్రాదికం కర్మసమర్పిత దేవతావిశేష సంప్రదానాదికారక బుద్ధిమత్కర్త్రభిమానఫలాభిసంధి మచ్చదృష్టం నోపమృదిత క్రియాకారక ఫలభేద బుద్ధి కర్తృత్వాభిమాన ఫలాభి సంధిరహితంవా ఇదంతు బ్రహ్మబుద్ధ్య సమృదితార్పణాది కారకక్రియాఫల భేదబుద్ధిమత్ కర్మఅతో ఒకర్మైవతథాచదర్శితం కర్మణ్యకర్మయః పశ్యేత్ కర్మణ్యభి ప్రవృత్తోపి నైవకించిత్కరోతిసః । గుణాగుణేవర్తంతే నైవకిచిత్ కరోమితియుక్తామన్యేతతత్త్వవిత్ ఇత్యాదిభిస్తదాచదర్శయుస్తత్రతత్రక్రియాకారకఫల భేదబుద్ధ్యుపమర్దనం కరోతిద్బ్ర

ష్ఠాచ కామాగ్నిహోత్రాగా కామోపమన్త్రే కామాగ్నిహోత్రాది హాని
స్తదామతిపూర్వకామతిపూర్వకాదీనాం కర్మణాం కార్యవిశేష స్యారంభకత్వం
దృష్టంతథేహాపి బ్రహ్మబుద్ధ్యుప మృదితార్పణాదికారక క్రియాఫలభేదబుద్ధేర్బా
హ్యచేష్టామాత్రేణ కర్మాపివిదుషః అకర్మసంపద్యతే। అత ఉక్తంసమగ్రంప్ర
విలీయత ఇతి అత్ర కేచిదాహుః యద్బ్రహ్మతదర్పణాది బ్రహ్మైవ కిలఅర్ప
ణాదినా పంచవృథేవ కారకాత్మనావస్థితం సత్ తదేవకర్మకరోతి తత్ర నార్ప
ణాది బుద్ధినివర్త్యతే। కింత్వర్పణాదిషు బ్రహ్మబుద్ధిరాధీయతే యథాప్రతిమా
దౌ విష్ణ్వాదిబుద్ధిర్యథా వా నామాదౌ బ్రహ్మబుద్ధిరేవమితి సత్యమేవముపి స్యా
ద్యదిజ్ఞాన యజ్ఞస్తుత్యర్థం ప్రకరణంస్యాదత్రతు సమ్యగ్దర్శనం జ్ఞాన యజ్ఞశబ్దిత
మనేకాన్ యజ్ఞశబ్దితాన్ క్రియా విశేషానుపన్యస్య శ్రేయాన్ద్రవ్యమయాద్యజ్ఞాత్
జ్ఞానయజ్ఞ ఇతి జ్ఞానయజ్ఞంస్తౌతి। అత్రచసమర్థమిదం వచనంబ్రహ్మార్పణ మిత్యా
దిజ్ఞానస్య యజ్ఞత్వసంపాదనే యేష్వర్పణాదిషు ప్రతిమాయాం విష్ణ్వాదిదృష్టివత్
బ్రహ్మదృష్టిః క్షిప్యతే నామాదిష్వివచేతి బ్రవతేన తేషాం బ్రహ్మవిద్యో
క్త్యాహ విపక్షితా అర్పణాదివిషయత్వాత్ జ్ఞానస్యనచ దృష్టిసంపాద జ్ఞానేన
మోక్షఫలంప్రాప్యతే బ్రహ్మైవ తేన గంతవ్యమితి చోచ్యతే। విరుద్ధంచ సమ్య
గ్దర్శన మంతరేణ మోక్షఫలం ప్రాప్యతఇతి ప్రకృతవిరోధశ్చ సమ్యగ్దర్శనంచ
ప్రకృతం కర్మణ్యకర్మయః పశ్యేదిత్యత్ర అంతేచ సమ్యగ్దర్శనస్యైవ ఉపసం
హారాచ్ఛ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః। జ్ఞానంలబ్ధ్వాపరాంశాం
తిమిత్యాది నాసమ్యగ్దర్శనస్తుతి మేవ కుర్వన్నుపక్షీణోధ్యాయః ఇతి ను
పపన్నంతస్మాద్యథా వ్యాఖ్యాతఏవాయం॥

## తాత్పర్యము.

చేయబడుచున్న కర్మము ఫలమును కలుగజేయకయే ఏరీతిగా నశించు చున్నదనిన్ని బ్రహ్మవేత్త చేయుకర్మము ఏకారణముచేత కర్మము కాదనిన్ని అర్జునుడు అడుగునేమోయని తలచి కృష్ణుడు ఈశ్లోకములో సమాధానము చెప్పుచున్నాడు. సర్వము బ్రహ్మమను జ్ఞానముకలుగగానే కర్మమునకు కారణమగు అవివేకము నశించును. అందువలన వేత్తయగువాని కర్మము కర్మముకాదు. మరిన్ని బ్రహ్మవేత్త లోకసంగ్రహము కొరకు కర్మమును చేయుచున్నను స్రుక్స్రువాదిఅంతయును బ్రహ్మమే అను బుద్ధితో యజ్ఞకర్మమును చేయుచుండుటచేత అది కర్మము కాదని కృష్ణుడు చెప్పుచున్నాడు. బ్రహ్మవేత్తయగు వాడు బ్రహ్మము

కంటె వేరైనది యేదియును లేదు గనుక హవిస్సు అగ్నియందు సమర్పించుటకు సాధనములగు స్రుక్స్రువాదులు బ్రహ్మమని తెలిసికొను చున్నాడు. ముత్యపుచిప్పయందు రజతాభావమును ఏవిధముగా చూచునో ఆరీతిగానే బ్రహ్మవేత్త స్రుక్స్రువాదులను ఆత్మకంటె భిన్నమైన పదార్థముగా జూడడు. బ్రహ్మార్పణము అను సమస్త ప్రయోగమందు అర్థమేమనగా లోకదృష్టిని అర్పణముగా నూహింపబడిన పదార్థము బ్రహ్మవేత్తకు బ్రహ్మమే యగుచున్నది. హోమద్రవ్యములగు ఘృతాదులు బ్రహ్మమే, బ్రహ్మాగ్నౌ అనునది సమస్త పదం అగ్నికూడా బ్రహ్మమే, బ్రహ్మస్వరూపుడైన యజమానునిచేత బ్రహ్మస్వరూపమగు అగ్నియందు చేయబడు హోమము బ్రహ్మమే. జ్ఞాననిష్ఠ గలవానిచేత పొందబడదగిన ఫలముకూడా బ్రహ్మమే. ఈరీతిగా కర్మమునుచేయు బ్రహ్మవేత్తచేతను లోకసంగ్రహము కొరకు బ్రహ్మబుద్ధి చేయబడు కర్మము కర్మము కాజాలదు. సర్వకర్మ సన్యాసియగు బ్రహ్మవేత్త యొక్క బ్రహ్మజ్ఞానమునకు యజ్ఞసంపాదనము అనగా జ్ఞానయజ్ఞముగా చెప్పట బ్రహ్మజ్ఞానమును స్తోత్రము చేయుటకై యున్నదనుట యుక్తము. ఇట్లుకాదేని సర్వము బ్రహ్మమే అయియుండగా స్రుక్స్రుతములు, హవిస్సు, అగ్ని, యజమానుడు హోమకర్మము అనునది మాత్రము బ్రహ్మస్వరూపమని చెప్పట నిరర్థకమగును. దేవత, కరణము, రక్తము, అను భిన్నజ్ఞానము లేకయే లేదు. అయితే బ్రహ్మవేత్తచేయు జ్ఞానయజ్ఞమందు బ్రహ్మబుద్ధిచేత కర్త్రాకరణాది భేదజ్ఞానము నశింప బడుటచేత వానియొక్క కర్మము అకర్మ మగుచున్నది. బ్రహ్మవేత్తకు క్రియాంకారక ఫలభేద బుద్ధిలేదని గీతలలో "కర్మణ్యభిప్రవృత్తోపి" గుణాగుణే వర్తంతే" నైవకించ త్కరోమితి" శ్లోకములలో, చెప్పబడినది. బ్రహ్మవేత్త మూఢునివలె కర్మమునందు ప్రవృత్తిగలవాడుగా నున్నను బ్రహ్మబుద్ధిచేత నశింప జేయబడిన ద్వైతబుద్ధి గలవాడగుటచేత వానికర్మము అకర్మమగుచున్నదనుటకు మరియొకనిదర్శనము కలదు. లోకములో కామాగ్ని హోత్రము చేయువానికి కామము నశించిన పిదప ఆఅగ్ని కామాగ్ని కాకపోవుచున్నది. మరియును బుద్ధిపూర్వకముగాను చేయబడు కర్మములకు ఫలభేదము గలిగియున్నది. ఈశ్లోకమునకు కొందరు వేరుగా వ్యాఖ్యానము చేయుచున్నారు, ప్రతిమాదులయందు బ్రహ్మబుద్ధి గలిగి విష్ణుబుద్ధియును రామాదినామములయందు బ్రహ్మబుద్ధియును కలిగియున్నట్లు యజ్ఞకరణాదులయందు బ్రహ్మబుద్ధి

గలిగికర్మను చేయవలయును. బ్రహ్మనుసందు స్రుక్స్రువాదిబుద్ధిగలుగుచుండ లేదనియును ఇచ్చట భేదబుద్ధి లేదనియును చెప్పుచున్నారు. ఈవ్యాసము సరికాదు, జ్ఞానయజ్ఞమును స్తోత్రము చేయుట శ్లోకము ప్రవర్తించినది, ఈప్రకరణములయందు అనేక యజ్ఞములను చెప్పి (అ, 4.33 శ్లోకములో) జ్ఞానయజ్ఞమును చేయవలయును. ఈఆత్మ యజ్ఞము వలననే సర్వకర్మ పరిత్యాగము జన్మకర్మ నివారణ మోక్షప్రాప్తి, బ్రహ్మైవాహం భవతి॥ ఇతిమోక్షః॥

శ్లో॥ గతసంగస్య ముక్తస్య, జ్ఞానావస్థి చేతసః
3 యజ్ఞాయాచరతః, కర్మ సమగ్రం ప్రవిలీయతే॥

టీక: గతసంగస్య=అభిమానము లేనివాడును, ముక్తస్య=(కామక్రోధాదిమూలమగు సంసారమునుండి) విడవబడినవాడును, జ్ఞానవాస్థితచేతసః=బ్రహ్మజ్ఞానమందు నిలచియున్న చిత్తముగలవాడును, యజ్ఞాయ=విష్ణుప్రీతి కొరకు, ఆచరతః=(యజ్ఞాదికర్మమును) ఆచరించుచున్నవాడును (అయిన) అస్య=ఈబ్రహ్మజ్ఞానియొక్క, కర్మ=కర్మము, సమగ్రము =ఫలముతో గూడ, ప్రవిలీయతే=నశించుచున్నది.

## COM_భాష్యం.

త్యక్త్వా కర్మఫలాసంగ మిత్యనేన శ్లోకేనయః ప్రారబ్ధకర్మాసన్ యథానిష్క్రియ బ్రహ్మాత్మదర్శన సంపన్నస్యాతథా తస్యాత్మనః కర్తృకర్మ ప్రయోజ నాభావదర్శినః కర్మపరిత్యాగే ప్రాప్తే కుతశ్చిన్నిమిత్తాత్త సంభవే సతి పూర్వవత్ తస్మిన్ కర్మణి అభిప్రవృత్త శ్యాపినైవకించత్కరోతి స ఇతికర్మాభావః ప్రదర్శితః యస్యైవం కర్మాభావోదర్శిత తస్యైవం॥ గతసంగస్యేతి॥ గతసంగస్య సర్వతోనివృత్త సంగస్యయతేః ముక్తస్యనివృత్త ధర్మాధర్మాది బంధనస్య జ్ఞానవాస్థితచేత సఃజ్ఞాన ఏవావస్థితం చేతో యస్యశోయం జ్ఞానవాస్థితచేతాః తస్యయజ్ఞాయ యజ్ఞనివృత్యర్థ మాచరతో నిర్వర్తయతః కర్మసమగ్రం సహాగ్రేణఫలేన వర్తత ఇతి సమగ్రంకర్మతత్సమగ్రంప్రవిలీయతేవినశ్యతీత్యర్థః।

## తాత్పర్యము.

లోకములో యేమానవుడు ప్రారబ్ధకర్మము కలవాడగుచు ఎప్పుడు నిష్క్రియ బ్రహ్మాత్మజ్ఞానము గలవాడగునో అప్పుడు ఆత్మకు కర్తృత్వకర్మము వలన ప్రయోజనము లేదని తెలిసికొనుచున్న యీబ్రహ్మజ్ఞానికి ఒకవేళ యే

దోయొక కారణముచేత కర్మపరిత్యాగము సంభవింపక పోవుచుండగా బ్రహ్మ జ్ఞానము కలుగునప్పటివఱకే కర్మమునందు ప్రవర్తించినప్పటికిని కర్మఫలాభిలాషను వదలుకొని ప్రవర్తించినయెడల ఏకర్మమును చేయనివాడే అగుచున్నాడని అ॥ 4 శ్లో॥ 20 త్యక్త్వాకర్మ ఫలాసంగం॥ అను శ్లోకముచేత తెలియజేయబడెననియును అట్లు కర్మఫలాభిలాషను వదలినవానిని గురించియే యీ శ్లోకమునుకూడ భగవంతుడగు కృష్ణుడు చెప్పుచున్నాడనియును తెలియవలయును అయితే జ్ఞానమునే కోరుచున్నవానియొక్క జ్ఞానమునకు భగవత్ప్రీతికొరకు ఆచరించుచున్న కర్మమునుమాత్రము ప్రతిబంధకముకాదా అని శంకింపక భగవత్ప్రీతికొరకు చేయబడుచున్న యజ్ఞాదికర్మము ఫలముతోగూడ నశించిపోవుచున్నదని యెఱుంగవలయును.

శ్లో॥ యదృచ్ఛా లాభసంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః।
సమస్సిద్ధావసిద్ధౌచ కృత్వాపిననిబధ్యతే।

టీక యదృచ్ఛా లాభసంతుష్టః = అయాచితముగా సంభవించిన యాహారపదార్థములతో తృప్తిపొందినవాడును, ద్వంద్వాతీతః = శీతము, ఉష్ణము మొదలుగాగల జంటలను అతిక్రమించినవాడును, విమత్సరః = మాత్సర్యము లేనివాడును, సిద్ధౌ = (ఆహారాదులు అప్రయత్నముగా) సిద్ధించుటయందును, అసిద్ధౌ = (ఆహారాదులు అప్రయత్నముగా) సిద్ధింపక పోవుటయందును, సమః = సమానమైన బుద్ధిగలవాడును, (అగువాడు) కృత్వాపి = (భిక్షాటనము మొదలుగాగల కర్మలను) చేసినను, ననిబధ్యతే = (సంసారముచేత) కట్టబడడు.

## COM-భాష్యం

త్యక్తసర్వపరిగ్రహస్య యతేః అన్నాదేశరీరస్థితి హేతోః పరిగ్రహస్యాభావాత్ యాచనాదినా శరీరస్థితి కర్తవ్యతాయాం ప్రాప్తాయాం॥ శ్లో॥ అయాచితమ సంక్లిప్త ముపపన్నంయదృచ్ఛయేత్యాది నావచసేనాను జ్ఞాతంయతేఃశరీరస్థితిహేతోరన్నాదేఃప్రాప్తిద్వారంఆవిష్కుర్వన్నాహాయదృచ్ఛేతి యదృచ్ఛా లాభసంతుష్టః అప్రార్థితోపనతోలాభోయదృచ్ఛాలాభః తేనసంతుష్టః సంజాతాలయం ప్రత్యయః। ద్వంద్వాతీతః ద్వంద్వైశ్శీతోష్ణాది భిరభిహన్య మానోప్యవిషణ్ణ చిత్తఃద్వంద్వాతీత ఉచ్యతే। విమత్సరఃవిగతవిమత్సరః నిర్వైరబుద్ధిః సమస్తుల్యోయదృచ్ఛా లాభస్య సిద్ధావసిద్ధౌచయోయతేనంయో

యతిరన్నాదేః శరీరస్థితిహేతోః లాభాలాభయోస్సమః హర్షవిషాదవర్జితః కర్మాదావకర్మాదిదర్శీయథాభూతాత్మదర్శననిష్ఠస్సన్ శరీరస్థితిమాత్రప్రయోజనే భిక్షాటనాదౌ కర్మణి శరీరాదినిర్వర్త్యే నైవకించిత్ కరోమ్యహం గుణాగుణేషు వర్తంత ఇత్యేవంసదా పరిసంచక్షాణః ఆత్మనః కర్తృత్వాభావం పశ్యన్ నైవకించిద్భిక్షాటనాదికం కర్మకరోతి లోకవ్యవహారసామాన్యదర్శనేనతు లౌకికైరేవ ఆరోపితకర్తృత్వాన్ భిక్షాటనాదౌ కర్మణికర్తాభవతిస్వానుభవేనతు శాస్త్రప్రమాణజనితేనాకర్తైవస ఏవం పరాధ్యారోపితకర్తృత్వ శరీరస్థితిమాత్రప్రయోజనం భిక్షాటనాదికం కర్మకర్తృత్వాపిననిబధ్యతే। బాధహేతోః కర్మణఃసహేతుకస్యజ్ఞానాగ్నినాదగ్ధత్వాదిత్యుక్తానువాదయేనైషః॥

యదృచ్ఛాలాభః అయత్నప్రాప్తోలాభః "ప్రారబ్ధకర్మణా స్వతయేవ ప్రాప్తః అసాధునావాసాధునావాదత్తః శుద్ధోఽ శుద్ధోవా అల్పోఽనల్పోవా అన్నాది."।

## తాత్పర్యము.

సమస్తవస్తు సంగ్రహము విడచిపెట్టిన యతికి శరీరస్థితికి కారణమైన అన్నాదికముయొక్క పరిగ్రహము లేకపోవుట వలన యాచనమొదలగు వానిని చేసి శరీరమును నిలుపుకొనవలసి యున్నది. అట్టి అన్నాదికములను గ్రహించు మార్గమును కృష్ణుడీశ్లోకములో చెప్పుచున్నాడు మరియును అప్రయత్నముగా లభ్యమైన దానితో తృప్తిపొందిన వాడును, శీతోష్ణాది ద్వంద్వములను అతిక్రమించిన వాడును, దేనియందును వైరబుద్ధి లేనివాడును అప్రయత్నముగా అన్నాదికము సిద్ధించినను సిద్ధింపక పోయినను సమబుద్ధి కలవాడును అయిన ముముక్షువు కర్మాదికమునందు అకర్మాదికము చూచువాడును, కూటస్థాత్మనిష్ఠుడును అయి శరీరము నిలుచుట మాత్రమే ప్రయోజనము గాగలదియును శరీరాదులచే నెరవేర్చ దగినదియును అయిన భిక్షాటనాది కర్మమునందు అ 5 శ్లో॥ 8 "నైవకించిత్కరోమితి" "అ 3 శ్లో॥ 28 గుణాగుణేషు వర్తంతే" (నేను దేనిని చేయువాడను గాను, ఇంద్రియములు విషయములయందు ప్రవర్తించుచున్నవి.) అని సర్వకాలముల యందును స్పష్టముగ జెప్పుచు తనకర్తృత్వమును లేకపోవుటను చూచుచు, భిక్షాటనము మొదలగు కర్మములలో దేనిని జేయుచుండ లేదని యెరుగవలయును. ముముక్షువగు యతికి అవివేకులతో గూడ స్నానమాచమన్యాది వ్యవహారము సమానముగానే కనబడుచుండుట వలన

ద్వాని ననుసరించి అవివేకులచేత ఆరోపింపం బడిన కర్తృత్వభోక్తృత్వములు కలవాడగుట వలన విద్వాంసుడు కూడ లోకదృష్టిచేత బిక్షాటనాదికమునం దు కర్తృత్వము కలవానివలె గనబడుచున్నప్పటికిని శాస్త్రప్రమాణముచేత కలిగిన స్వానుభవముచేత అకర్తృత్వాది సంధానమే కలిగియుండుట వలన బిక్షాటనాది చేష్టలయందుగూడ కర్తృత్వము లేనివాడే అగుచున్నాడని యెరుంగవలయును. సహేతుకమును బంధహేతుకమును అయిన కర్మము జ్ఞానాగ్నిచేత కాల్పబడి యుండుటవలన కర్మముచేత బద్ధుడు కాడు

శ్లో॥ నిరాశీర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః
శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషం॥

టీక. నిరాశీః=ఆశలు లేనివాడును, యతచిత్తాత్మా=నియమింపంబడిన చిత్తమును, దేహమును కలవాడును, త్యక్తసర్వ=పరిగ్రహః=విడువ బడిన సకల వస్తు సంపాదనము గలవాడును, శారీరం కేవలం=శరీరం నిలుచుటకు మాత్రము తగిన, కర్మ=కర్మమును, కుర్వన్=చేయుచున్న వాడును, (అయినమానవుడు) కిల్బిషం=(పుణ్యపాపములైన) సంసారమును (లేక) బంధమును, నప్రాప్నోతి=పొందడు..

Com.- భాష్యం.

యః పునః పూర్వోక్తవిపరీతః ప్రాగేవకర్మారంభాత్ బ్రహ్మణిసర్వాంతరే ప్రత్యగాత్మని నిష్క్రియె సంజాతాత్మదర్శనస్సదృష్టా దృష్టేష్టవిషయ వివర్జితతయాం దృష్టాదృష్టార్థే కర్మణిప్రయోజనమపశ్యన్ ససాధనం కర్మసన్యస్యశరీర యాత్రామాత్రచేష్టో యతిర్జ్ఞాననిష్ఠో ముచ్యత ఇత్యేతమర్థందర్శయితుమాహాని రాశీరితి। నిరాశీః నిర్గతా ఆశిషో యస్మాత్ సనిరాశీః యతచిత్తాత్మ చిత్తమంతఃకరణం ఆత్మాబాహ్య కార్యాకారణసంఘాతః తావుభావపియతౌసంయతౌ యేనసయతచిత్తాత్మాత్యక్తసర్వపరిగ్రహః త్యక్తః సర్వపరిగ్రహో యేనసః శారీరంశరీరస్థితిమాత్రప్రయోజనం కేవలం తత్రాప్యభిమానవర్జితం కర్మకుర్వన్ నాప్నోతినప్రాప్నోతి కిల్బిషం పాపమనిష్టరూపం ధర్మంచ ముముక్షోరనిష్టరూపత్వాత్ ధర్మోపికిల్బిషమేవ తస్మాత్తాభ్యాం ముక్తోభవతి సంసారాన్ముక్తో భవతీత్యర్థః। శారీరం కేవలం కర్మేత్యత్రకింశరీర నిర్వర్త్యంశారీరం కర్మాభిప్రేతం ఆహోస్విత్ శరీరస్థితిమాత్ర ప్రయోజనం శారీరం కర్మేతి కించాతః యది శరీరనిర్వర్త్యం శారీరంకర్మయదివా శరీరస్థితిమాత్ర

ప్రయోజనం శారీరం కర్మేత్యుచ్యతే యదా శరీరనిర్వర్త్యం శారీరం కర్మాభిప్రేతం స్యాత్ తథా దృష్టాదృష్టప్రయోజనం కర్మ ప్రతిషిద్ధమపి శరీరేణకుర్వన్నాప్నోతి కిల్బిషమితి బ్రువతో విరుద్ధాభిధానం ప్రసజ్యేత శాస్త్రీయం చ కర్మ దృష్టాదృష్ట శరీరేణకుర్వన్ నాప్నోతికిల్బిషమిత్యత్రాపిచ బ్రువతోఽప్రాప్తప్రతిషేధ ప్రసంగః శారీరం కర్మ కుర్వన్నితి విశేషణాత్ కేవలశబ్దవాచ్చ కుర్వన్ నాప్నోతి కిల్బిషమిత్యుక్తం శాస్త్రతోఽపి వాఙ్మనోభ్యాం విహితానుష్ఠాన పక్షే కిల్బిష ప్రాప్తివచనం విరుద్ధమాపద్యేత ప్రతిషిద్ధ సేవాపక్షేపి భూతార్థానువాదమాత్ర మనర్థకం స్యాత్ యదాతు శరీరస్థితి మాత్రప్రయోజనం, శారీరకర్మాభిప్రేతం భవేత్తదా దృష్టాదృష్టప్రయోజనం కర్మ విధి ప్రతిషేధగమ్యం శరీర వాఙ్మనోనివర్త్య మన్యదకుర్వన్ స్తైరేవ శరీరాదిభిః శరీరస్థితిమాత్రప్రయోజనం కేవలశబ్దప్రయోగాదహం కరోమీత్యభిమానవర్జితః శరీరాదిచేష్టామాత్రం లోకదృష్ట్యా కుర్వన్నాప్నోతి కిల్బిషమిత్యేవంభూతస్య పాపశబ్దవాచ్య కిల్బిషప్రాప్త్యసంభవాత్ కిల్బిషం సంసారం నప్రాప్నోతి జ్ఞానాగ్ని దగ్ధకర్మత్వాత్ అప్రతిబంధేన ముచ్యతఏవేతి పూర్వోక్తసమ్యగ్దర్శనం ఫలానువాదఏవైషః ఏవం శారీరం కేవలం కర్మేత్యస్యార్థస్య పరిగ్రహే నిరవద్యం భవతి।

## తాత్పర్యము.

ఏమానవుఁడు కర్మములను ఆరంభింపకయుండునో సర్వాంతరుఁడును ప్రత్యగాత్మస్వరూపుఁడును నిష్క్రియుఁడును అయిన బ్రహ్మము నేననియెడు జ్ఞానము కలవాఁడగునో అట్టివాఁడు ఇహాముత్రార్థఫలభోగవిరాగుఁడగుటచేత, అట్టిఫలమును కలుగఁజేయు కర్మములను ప్రయోజనములేనివని తలఁచుచున్నవాఁడగుచు కామసంకల్పములతోఁ గూడ కర్మములను విడచిపెట్టి శరీరము నిలుచుటకు మాత్రము తగినకర్మములను చేయువాఁడును, యతియును, జ్ఞాననిష్ఠుఁడును, అగుచు ముక్తుఁడగునని తెలియఁజేయుటకు కృష్ణుఁడు ఈశ్లోకమును చెప్పుచున్నాఁడు.

జ్ఞాని కామసంకల్పములతోఁ గూడ కర్మములనువిడిచిపెట్టి శరీరమునిలుచుటకు మాత్రము తగిన కర్మమును జేయుచు అట్టికర్మమును చేయుచు అట్టికర్మమునందు అభిమానమును అనగా ఆదరమునువదలి ఆత్మజ్ఞానమునందుమాత్రమే ఆదరమును కలిగియుండును. "శరీరం కేవలంకర్మ" అనుచోట శరీరముచేత నెరవేర్పఁదగినదని చెప్పినయెడల దోషముకలదు. శాస్త్రప్రతిషిద్ధకర్మముకూడ

శరీరముచేత నెరవేర్పబడవచ్చును. అట్టికర్మమును జేయుచు పాపమునుపొందడని అర్థము వచ్చును. అట్లుచెప్పినయెడల నిషిద్ధకర్మము నాచరింపకూడదని చెప్పిన శాస్త్రమునకుహానివచ్చును. శాస్త్రసమ్మతమగు కర్మమును శరీరముచేత చేసినయెడల శాస్త్రవిహితకర్మమును చేయుచున్నవాడు పాపమును పొందడని చెప్పినట్లగును. ఇందువలన అప్రాప్తప్రతిషేధమను దోషముగలుగును. అనగా విహితకర్మముచేయుటవలన కిల్బిషములు గలుగునని యెక్కడను చెప్పబడకయుండగా చెప్పబడియున్నట్లు తలచుకొని అట్లుకాదుసుమీ అని చెప్పినట్లగును. 'కేవల' శబ్దప్రయోగము వలన, శరీరముచేత నెరవేర్పబడినది (శారీరమ్) అని చెప్పినయెడల ధర్మార్థములను పేరుగలశాస్త్రవిహితనిషిద్ధకర్మములను వాక్కుచేతను మనస్సుచేతను చేయుటవలన ముముక్షువగువాడు కిల్బిషమును పొందును అని చెప్పినట్లగును. వాక్కుచేతను మనస్సుచేతను విహితకర్మమును జేయుటవలనకిల్బిషప్రాప్తియగునని చెప్పుటవలన జపాదులను చేయవలసినదను శాస్త్రమునకు విరోధమును, ప్రతిషిద్ధకర్మమును చేసినయెడల కిల్బిషప్రాప్తియగునని చెప్పినయెడల అప్రాప్తప్రతిదోషమును కలుగును. కాబట్టి శారీరమనగా శరీరముచేత నెరవేర్పదగినది అను అర్థము యుచితముగనుండలేదు. మరియును శరీరము నిలచియుండుటకు మాత్రముతగినది (శారీరం) అని చెప్పిన, యతి శరీరముచేతను, వాక్కుచేతను, మనస్సుచేతను ఇహాముత్రఫలకారణమగు శాస్త్రవిహిత నిషిద్ధములైన ధర్మాధర్మ కర్మములను సాభిమానముతో చేయక లోకదృష్టికి శరీరవాఙ్మనస్సులయొక్క చేష్టామాత్రరూపమైన కర్మమును చేయుచున్నట్లు కనబడుచున్నను తనదృష్టికి ఏకర్మమును చేయుని వానివలెనే యున్నాడు. కనుక కిల్బిషమును పొందడు అని అర్థమిచ్చుచున్నది. అట్టివాడు జ్ఞానాగ్నిచేత కాల్పబడిన సర్వకర్మము కలవాడగుటవలన సంసారమును పొందడు. జననమరణకారణమగుట వలన ధర్మముకూడ ముముక్షువునకు బంధకారణమై పాపమగుచున్నది.

## COM—భాష్యము.

The having, renounced, egoism, in Karma (agency) and the desire for fruits of Karma (ఫలాసంగం) being every, content and seeking No, rest any where, does not really do any Karma, although engaged in it.

మనోదృశ్యమిదం ద్వైతం యత్కించిత్సచరాచరమ్ । మనసోహ్యమనీభావే ద్వైతం నైవోపలభ్యతే। ౧౬॥

ఐతరేయోపనిషత్తృతీయాధ్యాయము 1-2-3 వ వాక్యములు.

కోయమాత్మేతివయముపాస్మహే కతరస్స ఆత్మాయేనవారూపంపశ్యతి యేనవాశబ్దం శృణోతి యేనవాగంధానాజిఘ్రతి యేనవావాచం వ్యాకరోతియేన వాస్వాదుచాస్వాదు చవిజానాతి॥ ౧॥

యదేతద్ధృదయం మనశ్చైతత్ సంజ్ఞానమాజ్ఞానం విజ్ఞానం, ప్రజ్ఞానం మేధాదృష్టిర్ధృతిర్మతిర్మనీషా జూతిస్మృతి స్సంకల్పః క్రతురసుః కామోవశ ఇతిసర్వాణ్యేవైతాని ప్రజ్ఞానస్యనామధేయానిభవంతి స్వేవబ్రహ్మైవ ఇంద్ర ఏష ప్రజాపతిరేతేసర్వే దేవఇమానిచపంచ మహాభూతాని పృథివీవాయురా కాశ, ఆపోజ్యోతీంషీత్యేతానీమానిచక్షుద్రమిశ్రాణీ వబీజానీతరాణి చేత రాణి చాండజానిచజారుజానిచ స్వేదజాని చోద్భిజ్జానిచాశ్వాగావః పురుషాహస్తినోత దేవనిష్కళం బ్రహ్మనిర్వికల్పం నిరంజనమ్॥ ౨॥

తద్బ్రహ్మాహ, మితిజ్ఞాత్వా బ్రహ్మసంపద్యతే ధ్రువమ్॥ ౩॥

నిర్వికల్పమనంతంచ హేతుదృష్టాంతవర్జితం అప్రమేయమనాద్యం చయ జ్జ్ఞాత్వాముచ్యతేబుధః॥ ౪॥

ననిరోధోనచోత్పత్తి ర్నబద్ధో నచసాధకః నముముక్షుర్నవైముక్తః ఇత్యేషాపరమార్థతా॥ ౫॥

ఏకఏవాత్మా మంతవ్యోజాగ్రత్స్వప్నసుషుప్తిషుస్థానత్రియ వ్యతీతస్యపున ర్జన్మనవిద్యతే॥ ౬॥

ఏకఏవహిభూతాత్మా భూతేభూతేవ్యవస్థితః, ఏకధాబహుధాచైవదృశ్య తే జలచంద్రవత్॥ ౭॥

ఘటసంభవమాకాశం లీయమానే ఘటే యథా ఘటోలీయేతనాకా శస్తద్వజ్జీవో ఘటోపమః॥ ౮॥

ఘటవద్వివిధాకారం భిద్యమానం పునఃపునః తద్భేదేనజానాతి సజా నాతిచనిత్యశః॥ ౯॥

శబ్దమాయావృతోనైవతమసా యాతిపుష్కరే భిన్నేతమసిచైకత్వమేక మేవానుపశ్యతి॥ ౧౦॥

నిష్కళం నిశ్చలం శాంతంతద్బ్రహ్మాహమితిస్మృతమ్॥

నృశింహోత్తరతాపితాన్యుపనిషత్ 7 వ ఖండము.

నిరాత్మకమాత్మైవేదం సర్వం తస్మాత్సర్వాత్మాకి నకారణసర్వాత్మక మాత్మానమన్విచ్ఛేద్బ్రహ్మైవేదం సర్వం సచ్చిదానంద రూపమిదం సర్వమ్—1.

(అష్టమఖండము)

అయంసర్వాత్మాయం హిసర్వం నైవాత్రోద్వయోహ్యయమాత్మైకఏవా వికల్పోనహివస్తునదయం హ్యేతఇవసద్ఘనోఽయం చిద్ఘనం ఏవైకరసోహ్యయ మాత్మైకలఏవచిన్మయమిదం సర్వం తస్మాత్పరమేశ్వర ఏవైకమేవ తద్భవత్యే తదమృతమభయమేత ద్బ్రహ్మాభయం వైబ్రహ్మాభయంహివై బ్రహ్మాభవతియ ఏవం వేదేతిరహస్యమను జ్ఞాతాహ్యయమాత్మహ్యస్య సర్వస్యహ్యాత్మాన మనుజానాతి॥ చిన్మయమిదం సర్వం తస్మాత్ పరమేశ్వర ఏవైకమేవతద్భవత్య వికల్పోనావికల్పోపినాత్రకాచన, భిదాస్తినైవతత్రకాచన బిదాస్త్యత్రభిదామి వమన్యమాన శతధాసహస్రధాభిన్నో మృత్యోస్సమృత్యుమాప్నోతి—2.

మైత్రేయోపనిషత్తులోని 2 వ అధ్యాయము.

( 1 దేహోదేవాలయప్రోక్తో జీవోదేవస్సనాతనః।
త్యజేదజ్ఞాననిర్మాల్యంసోహంభావేనపూజయేత్॥
2 అభేదదర్శనం జ్ఞానం ధ్యానం నిర్విషయం మనః।
స్నానం మనోమలత్యాగః శౌచమింద్రియనిగ్రహః।
3 బ్రహ్మామృతం పిబేత్ భైక్షమాచరే దేహరక్షణే।
భావనామఖిలాంత్యక్త్వా ... తన్మయో భవ।
ద్రష్టదర్శనదృశ్యాని త్యక్త్వా వాసనయాసహ।
దర్శనప్రథమాభావ మాత్మానం కేవలంభజ॥

3 వ అధ్యాయము.

1 అహమస్మిపరశ్చాస్మి బ్రహ్మాస్మి । ప్రభవోస్మ్యహమ్॥
సర్వలోకగురుశ్చాస్మి సర్వలోకేస్మి సోస్మ్యహమ్॥
2 అహమేవాస్మిసిద్ధోస్మి శుద్ధోస్మి పరమోస్మ్యహమ్।
అహమస్మిసదాసోస్మి నిత్యోస్మి విమలోస్మ్యహమ్॥
3 విజ్ఞానోస్మివిశేషోస్మి సోమోస్మిసకలోస్మ్యహమ్।
మానావమానహీనోస్మి నిర్గుణోస్మి సోస్మ్యహమ్॥

4 ద్వైతాద్వైతవిహీనోఽస్మి ద్వంద్వహీనోఽస్మి సోఽస్మ్యహమ్।
భావాభావవిహీనోఽస్మి భాషాహీనోఽస్మి భాస్మ్యహమ్॥

5 శూన్యాశూన్యప్రభావోఽస్మి శోభనాశోభనోఽస్మ్యహమ్।
శుభోఽస్మి శోకహీనోఽస్మి చైతన్యోఽస్మి సమోఽస్మ్యహమ్॥

6 తుల్యాతుల్యవిహీనోఽస్మి నిత్యశుద్ధసదాశివః।
సర్వాసర్వవిహీనోఽస్మి సాత్వికోఽస్మి సదాస్మ్యహమ్॥

7 ఏకసంఖ్యావిహీనోఽస్మి ద్విసంఖ్యావానహం నచ।
సదసద్భేదహీనోఽస్మి ఆధారరహితోఽస్మి సంకల్పరహితోఽస్మ్యహం॥

8 నానాత్వభేదహీనోఽస్మి, యఖండానందవిగ్రహః।
నాహమస్మి నచాన్యోఽస్మి దేహాదిరహితోఽస్మ్యహం॥

9 ఆశ్రయాశ్రయహీనోఽస్మి ఆధారరహితోఽస్మ్యహం।
బంధమోక్షవిహీనోఽస్మి శుద్ధబ్రహ్మాస్మి సోఽస్మ్యహమ్॥

10 చిత్తాదిసర్వహీనోఽస్మి, పరమోఽస్మి పరాత్పరః।
సదావిచారరూపోఽస్మి నిర్విచారోఽస్మి సోఽస్మ్యహం॥

11 అకారోకారరూపోఽస్మి మకారోం కారోఽస్మి సనాతనః।
ధ్యాతృధ్యానవిహీనోఽస్మి, ధ్యేయహీనోఽస్మి సోఽస్మ్యహం।

12 సర్వపూర్ణవిహీనోఽస్మి, సచ్చిదానందలక్షణం।
సర్వతీర్థస్వరూపోఽస్మి పరమాత్మాస్మ్యహం శివః॥

13 లక్ష్యాలక్ష్యవిహీనోఽస్మి లయహీనరసోఽస్మ్యహం।
మాతృమానవిహీనోఽస్మి మేయహీనశివోఽస్మ్యహం॥

14 నజగత్సర్వద్రష్టాస్మి నేత్రాదిరహితోఽస్మ్యహం।
ప్రవృద్ధోఽస్మి ప్రబుద్ధోఽస్మి ప్రసన్నోఽస్మి పరోఽస్మ్యహమ్॥

15 సర్వేంద్రియవిహీనోఽస్మి, సర్వకర్మహితోఽస్మ్యహమ్।
సర్వవేదాంతతృప్తోఽస్మి సర్వదాసులభోఽస్మ్యహమ్॥

16 ముదితాముదితాఖ్యోఽస్మి సర్వమౌనఫలోఽస్మ్యహమ్।
నిత్యంచిన్మాత్రరూపోఽస్మి సదాసచ్చిన్మయోఽస్మ్యహమ్॥

17 యత్కించిదపిహీనోఽస్మి స్వల్పమప్యవినాస్మ్యహమ్।
హృదయగ్రంథిహీనోఽస్మి హృదయాంబుజమధ్యగః॥

18 షడ్వికార విహీనోస్మి షట్కోశరహితోస్మ్యహమ్।
అరిషడ్వర్గ విహీనోస్మి అంతరాద న్తరోస్మ్యహమ్॥
19 దేశకాలవిముక్తోస్మి దిగంబరసుఖోస్మ్యహమ్।
నాస్తిబంధవిముక్తోస్మి నకారరహితోస్మ్యహమ్॥
20 అఖండాకార రూపోస్మి హ్యఖండాకార మస్మ్యహమ్।
ప్రపంచముక్త చిత్తోస్మి ప్రపంచరహితోస్మ్యహమ్॥
21 సర్వప్రకాశ రూపోస్మి చిన్మాత్రజ్యోతిరస్మ్యహమ్
కాలత్రయవిముక్తోస్మి కామాదిరహితోస్మ్యహమ్॥
22 కాయికాది విముక్తోస్మి నిర్గుణ కేవలోస్మ్యహమ్।
ముక్తిహీనోస్మిముక్తోస్మి మోక్షహీనోస్మి హంసదా॥
23 సత్యాసత్యాది హీనోస్మిసన్మాత్రాన్నాస్మ్య హంసదా।
గన్తవ్యదేశహీనోస్మి గమనాది గమనాది వివర్జితః॥
24 సర్వదా సమరూపోస్మి శాంతోస్మి పురుషోత్తమః।
ఏవం స్వానుభవో యస్యసోహమస్మి నసంశయః॥
25 యశ్శృణోతిసకృద్వాపి బ్రహ్మైవభవతి! స్వయం॥

పైనవ్రాసిన శ్రుతిశ్శ్లోకోపనిషత్తులయొక్క అనుభవమును
తెలిపెదను వినుమని యిట్లనియె.—

సాకారస్వరూపమగు శరీరము సత్యము గాదనియు, నిరాకారుండగు నాత్మస్వరూపుడు సత్యమనియు నిమానంబున నిశ్చయభావము గలవాడవై, నీవు నట్టి యాత్మతత్వమును తెలిసికొనిన పిమ్మట, మరల జన్మమును గురించి యఘోరమగు దుఃఖపరితాపములను బొందవు. కావున, అద్దమునందు మన నీడ ప్రతిఫలించి గనుపించుచుండును. అద్దము ప్రతిఫలించిన బింబమునందును, తక్కిన యాపత్తు ప్రదేశమందునను నిండియున్నటుల శరీరములనేకు ప్రకృతులలోపల పురుషుండగు పరమేశ్వరుండు సర్వము నిండియున్నవాడై, సదా కాలము నేయింద్రియముల సాంగత్యమును జేయక, తాను వేరుగానె యుండును. కావున, ఒంటిదియును సర్వము నిండినదియును నగు నాకాశము కుండ లోపలను వెలుపలను సర్వము నెటుల నిండియున్నదో అటుల పరమాత్మ స్వరూపుడగు దేవుండు సమస్తభూతకోట్లయందు అంతటలోపల వెలుపలను

సర్వదా నిండినవాడై ప్రకాశించును. కావున, నేను నిర్మల జ్ఞానానంద స్వరూపుండను మాయను గడచినవాడను, శరీరమునకు వేరైన ఆత్మను, సర్వవృత్తులు రహితమైనవాడను, శాంతచిత్తుడను. అహంకారములేని పరబ్రహ్మస్వరూపుండనని తెలియక నే నిన్నిదినములు మోహపాశములలో దగులుకొని బద్ధుండనై యుంటినని- అజ్ఞుండనైన నే నెక్కడనుంటినే. పాంచభౌతికంబగు శరీరంబును, యీప్రపంచమును శుద్ధచైతన్యరూపుండగు సర్వసాక్షిస్వరూపుండనై ప్రకాశింపజేయుచుందును. కావున, యీజగజ్జాలమంతయును నాదిగాని తెలియవచ్చుచున్నది అట్లుగాకుండిన, మరియొకరివల్లనైనదియని విచారణచేసిన సర్వము నేను గాననియును, నన్ను మినహా సర్వము దబ్బరయనియును దెలుసుకొనుటే ముక్తి. శేషంబు సర్వవాంఛలకును, సర్వబంధకములకును, మూలంబగు నీశరీరంబుతో గూడ నామరూపరహితంబగు నీప్రపంచమును విడచినవాడనై, చలనరహితుండనై, దేహేంద్రియంబుల సాంగత్యమును బొందక, సద్గురుకటాక్షమును నేర్పుచేత పరమాత్మస్వరూపుండగు, సర్వసాక్షిని జూచుచు, అదే నా స్వరూపంబని భావించి, యేసంశయమును పొందక సర్వకాలములందు ఏకవిధముగా శాశ్వతమైన సుఖానందయుక్తుండనై యున్నాడను. కావున, అలలును బుగ్గలును దోచించగా నుదకమునకు నుదకమునకు, ప్రత్యేకముగా నుండు నట్లుగాని కనుపించుచున్నవి. అటువలెనే పరమాత్మవలనం గల్పితంబగు నీప్రపంచమున్న పరబ్రహ్మముకంటెను వేరు గాకుండునట్లుగాని ప్రకాశించుచుండును. కాబట్టి- సద్గురుకటాక్షమును బడసి బ్రహ్మమునకును, ప్రపంచమునకును వేరైన విధమును దెలుసుకొనుము. కావున- విచారణచేసి చూడగ వస్త్రములన్నియు నూలుపోగులేయని తెలియవచ్చునటుల యీప్రపంచరూపములన్నియు, యాత్మగానే తెలియవచ్చుచున్నది. ఇంతకంటెను వేరొకవిధమును దెలిసికొనుము. కావున- చెరుకురసమువలనం జేయబడిన పంచదార- ఆచెరుకురసముగాని యెట్టుల పరిణమించుచున్నదో అటువలెనే, నాచేత బోధింపబడినది పూర్ణబోధయనెడు- పరబ్రహ్మము యీప్రపంచమంతయు నిండి వెలుగుచున్నాడు. కాబట్టి- యీప్రపంచము తనయొక్క అజ్ఞానముచేతనే తెలియబడుచున్నది. గాని, జ్ఞానస్వరూపులైన మహాత్ములకు నిజముగా నీప్రపంచము గోచరింపబడదు. ప్రపంచ మున్నదను భ్రాంతి, రజ్జువు సర్పభ్రాంతిగా నున్నది. శ్రోత్రియుండు యుండు

పాము నిజముగా నున్నదిగాదు- భ్రాంతివలన దోచినపాము. త్రాడని తెలిసినపిమ్మట లేశమైనను పాము భయము గలిగి యుండదు. కాబట్టి- అంత పిండ బ్రహ్మాండములని చెప్పంబడి నామరూప సహితమగు నీప్రపంచము యెట్టుల వర్తించుచున్నదో, అదే ప్రకారము నేనును, సర్వము నేనుగాను ప్రకాశించుచున్నాను తనయొక్క స్వప్రకాశమును విచారింపగ, తనకంటెను అన్యమును అధికమును లేదు. కావున, సర్వసాక్షిస్వరూపుండనగు నావలన నీయండ పిండ బ్రహ్మాండములన్నియును సృజింపంబడి యీప్రపంచంబంతయు నాయందే నిలచియున్నది. ఎట్లనగా- బంకమట్టివలననే కుండలు చేయబడునట్టుల యున్నది, బంగారమువలననే, కంకణములు భూషణములు చేయబడునట్లుగాను, జలమువలననే అలలుగలిగినట్లుగాను, నీప్రపంచము దానివలననే గలిగి నాయందే లయించిపోవును. కాబట్టి- ఈ ఆశ్చర్యమును దెలియుము. నావలన గల్పితంబైన యీసమస్త ప్రపంచమును త్రాటియందు సర్పమనియును భ్రాంతిని బుట్టించుచున్నట్లు బ్రహ్మస్వరూపంబగు తనయందు యీప్రపంచము భ్రాంతివలన తోచుచున్నది. కాబట్టి- పగలనియును రాత్రియనియును దెలియంబడని నిద్రావస్థయందు నామరూపసహితమగు నీప్రపంచమంతయును లయించును. ఆబ్రహ్మపిపీలికాంతముగాగల సర్వశరీరములయందును సర్వసాక్షి మాత్రుండనై ప్రకాశించెడు పరమాత్మస్వరూపుండనగు నాకు నేనే నమస్కారము చేయుచున్నాను. కాని- తనకన్నా అన్యమైనది రెండవది లేనిది గావున, సర్వసాక్షిస్వరూపుండనై ప్రకాశించెడు తనకు తానే వందనములు చేయుచున్నాను. ఆహా- ఇది ఏమి ఆశ్చర్యకరము, నేను దేహమును ధరించియుండియు ఏకాలమందును నాకు రాకపోకలు లేక సర్వవృత్తిరహితుండనై ప్రపంచమంతటను పుల్లు గ్రుచ్చినట్లైనను పొందు లేక సర్వమును గ్రమ్ముకొని యున్నాను. కావున, తోలుత తనకు తానే నమస్కారము జేసుకొనుచున్నాను. కావున- ఏడేడు పధ్నాలుగు లోకములయందును- తనకు సమానులు లేరు. నాయొక్క సామర్థ్యమువలన శరీరములతోటి లేశమైనను సంబంధములేక, యీవిశ్వమంతయు నేనొకండనే ధరించి ప్రకాశించుచున్నాను. కావున ఆత్మస్వరూపుండనగు నేనే నిత్యముక్తుండను. నేనే పరబ్రహ్మస్వరూపుండను, ధర్మార్థకామమోక్షములలో నెద్దియును గోరక తాను గోరదగినది యేదియు లేక, తన్ను తా జూచి యానందించుచున్నాను. ఈప్రపంచమంతయును నేనే యని దృఢముతో నున్నాడను.

కాబట్టి- జీవసంబంధమగు జ్ఞానమున్ను తెలియుందగునట్టి నామరూపాత్మకమైన నీప్రపంచమంతయును దెలిసికొనునట్టి జీవుండును ఈమూఁడును రజ్జువునందు దోఁచిన సర్పభ్రాంతివలెనే దోఁచుచున్నవి గాని, నిజముగా లేవు. ఆత్మానుభవమందు నివి మూఁడును గలవని చెప్పుట యనుభవజ్ఞానము గాను తనకన్న రెండవ వస్తువవలె నీఅద్వయబ్రహ్మము తానే యని యెఱింగి- తన్ను తా నెఱిగి తాను తానై యున్నాను. కావున- జీవుఁడు వేఱు ఈశ్వరుఁడు వేఱు అని భేదబుద్ధియే ద్వైతుల యభిప్రాయము. ఈఅభిప్రాయమే అజ్ఞానము. ఇదియే జన్మము, పాపము. ఇదియే మహాదుఃఖము. ఇట్టి రోగులకు మందొకటి కలదు వినుము. అది యెట్లనగ- వివిధనామరూపములతో దృశ్యంబగు నీప్రపంచమంతయును దబ్బరగా నెంచి సకలదృశ్యములను మఱచి సర్వసాక్షిరూపమైన దృక్కు- తానె యని నిశ్చయించి- తన్మయుండై చిన్మయుండై యుండుటే ద్వైతులనెడు యజ్ఞానులకుం దగు మైన మందు. బ్రహ్మము తప్ప మఱి యేమియును లేదని నిశ్చయించుటె వారికి అనుభవము అయ్యో అట్టివారికి ఇట్టి చికిత్స జేయక యుండినవారిని జననమరణములు విడువవని చెప్పెను. కావున—తొలుత తత్త్వవివేకము గలుగనికారణంబున నేను జీవునిగాను, నాకు శరీరసంబంధములగు సర్వోపాధులును గలిగియున్నట్లుగాను అజ్ఞానముచేత భ్రమసి యుంటిని. ఇప్పుడు సద్గురుకటాక్షమువలన తత్త్వవివేకమున్ను అనుభవజ్ఞానమున్ను బొందుటచేత నే నేసంకల్పములను బొందక, నిర్వికల్పసమాధియందు నిలచి కేవలజ్ఞానమాత్రస్వరూపుఁడనై దేహత్రయంబునకు వేఱైనవాఁడనుగాను. సమస్తయుపాధులు శరీరమునకె గాని తనకు లేకుండునట్లుగాను, తన నిజస్థితిని చక్కగా దెలిసికొంటిని కాబట్టి, అజ్ఞానమువలన నీప్రపంచమంతయును నాయందె యున్నదని భావించితిని బ్రహ్మజ్ఞానవిచారణ చేయఁగా ఈప్రపంచము నాయందు నిజముగా లేదు. మఱియు బంధమున్ను మోక్షమున్ను యదార్థముగా తనకు లేవు. కట్టు విడుపులున్ను భ్రాంతియును తనకు లేదు. ఇది యేమి ఆశ్చర్యము. నేను మలినరహితుఁడనై ప్రకాశించుచున్నాను. కావున, యీ యపవర్గమార్గమును గురించి నే నెంతని చెప్పుదును. ఈప్రవృత్తియును, ఈప్రపంచమును యదార్థముగా నాయందు కొంచెమైనను లేదు లేదు. కేవలపరిశుద్ధుండను, కల్పనయనెడు అజ్ఞానవృత్తులు గలుగనేరవని భావము గావున- ఆగామి సంచిత ప్రారబ్ధముల నెడు త్రివిధకర్మంబులలో సంచితకర్మంబువలన నీశరీరంబు

గలిగెడు ఇట్టి దేహమునకు స్వర్గనరకంబులును, బంధమోక్షంబులును గలుగుచుండును మరియును—జన్మదుఃఖం జరాదుఃఖం జాయాదుఃఖంబులనెడు త్రివిధ దుఃఖములయొక్క మహత్తరమైన చింతయున్ను మరణంబనెడు దట్టమైన దుఃఖమున్ను ధనధాన్య అష్టైశ్వర్యంబుల వలనం గలిగెడు సుఖమున్ను యీకార్యము లన్నియును, కల్పనామాత్రంబులగు చిత్తవికారములె గాని నిజములుగావు. సర్వము తానొకఁడై ప్రకాశించెడు తనకు, యివి అన్నియును మెచ్చుకొనదగినవి కావు. అద్వయుండనై రెండవవస్తువు యున్నదని యెరుంగక జ్ఞానానంద స్వరూపకుండనై వెలింగెడు తనకు పదునాలుగు లోకములున్నను, వాటియొక్క లీలానటనాదికార్యముల నెరుంగక అడవియందుండు యాబోతువలె దేనిని లక్ష్యపెట్టక ప్రపంచవృత్తిను మరచి, గోరంతసుఖంబైనను గోరక కల్పనారహితుండనై యున్నాను కాబట్టి—స్థూలమగు నీదేహంబును తక్కిన సూక్ష్మకారణంబు లనెడు రెండు దేహంబులను తాను గాక యేకాలమందును తనకు మూడు శరీరములును లేవు గావున నేను జీవుండను ప్రతిబింబ చైతన్యుండనుగాను సదా జ్ఞానస్వరూపుండను అని కలికెడు తెలివియును నేను గాను, అక్షరపరబ్రహ్మస్వరూపుండను గాన తుచ్ఛమగు జీవభ్రాంతులను బొందకుందును. కావున- ఆనందమనెడు మహాసముద్రంబునునై నిండియున్న తనయందు, నీటితో సంభావింపబడిన నీకాలను నడుమ బుగుల విచిత్రంబుగా చిత్తమనెడు వాయువుచేత లోకములనెడి చెప్పంబడు అనేకమహా హాజును గల్పింపంబడి ఏ అనగ పరిపూర్ణ సముద్రమువలె నిండియున్న తనయందు సంకల్పవశంబున లోకములన్నియును సృష్టింపబడినవని చెప్పబడును. కావున- నిస్తరంగ సముద్రమువలె సర్వము నిండి యానందసాగరంబునునై సర్వమును వ్యాపించి వెలుగుచున్న నాయందు వాయువు సంబంధమగు మనస్సున్ను, వాయువు రూపంబగు హంసయున్ను లయమై పోవుచున్నవి. అదెట్లనగా, సదా హానియును వృద్ధియును గల జీవుండనెడు వర్తకుండు సర్వవ్యాపారములు జేయుటకొరకై ప్రపంచస్వరూపమగు, ఓడ నెక్కి యానసముద్రము మీదనె గుప్మ్మరును నానసముద్రంబునను మునిగిపోవునటుల సర్వవృత్తులు గల జీవుడే పరిపూర్ణ సముద్రమునందు మునిగిపోవును. కావున- లోకంబులును లోకేశులును, లోకస్థులును లయమునొంది లోకంబైన చీకటియనెడు మాయను గడచి నిలచిన సర్వదృక్కు స్వరూపుండైన మహాసముద్రంబువలె

నిండియున్న తనయందు, యిట్టిసమయంబున భ్రాంతివలన జీవుండనెడు అలలు గనుపించి యణగిపోవుచున్నవి. అట్టి అలలు గనుపించియును మరల గనుపించక పోవుటయును నవి జీవునియొక్క స్వభావధర్మంబులని దెలియుము వాటిని మనంబునం దలంచుటచేత బ్రయోజనమేమి? మాయను దలంచన గూడదు. కక్కినకూటికి వడిగట్టినట్లే యగును. తలంపె సంకల్పము సంకల్పము లేకుండుటె ముక్తి గాబట్టి—

సర్వసారోపనిషత్-ప్రత్యగాత్మాకథనం భవతి

సత్యజ్ఞానమనంత మానందం, సర్వశరీరోపాధి వినిర్ముక్తం కటకముకుటాద్యుపాధి రహితం సువర్ణఘనవద్విజ్ఞాన చిన్మాత్రస్వభావమాత్మ చైతన్యం బ్రహ్మయదవభాసతె తవవిద్యోపాధిం త్వంపదార్థ స్సప్రత్యగాత్మా॥

(పరమాత్మా కథనం)

సత్యం జ్ఞానమనంత మానందం, సర్వశరీరోపాధి వినిర్ముక్తం। సర్వజ్ఞత్వాద్యుపేతం, మాయోపాధికం తత్పదార్థః పరమాత్మా॥

(కిం బ్రహ్మ) సర్వోపాధినిర్ముక్తం నిర్విశేష చిన్మాత్రం పదసద్వివేకమానన్దం మమాయ బ్రహ్మాద్యుపదార్థాదాపాధికాత్ తత్పదార్థాద్యోపాధిక భేదాద్విలక్షణ మభేదమధిష్ఠా నత్వోపలక్షితం శుద్ధం పారమార్థికం సత్తామాత్రమ వినాశి॥

కామాయా॥ అనాత్మమూలం మాయాసాచ బ్రహ్మణ్యాకాశే మేఘాదిరివదృశ్యతె మాయానామ అనాదిరన్తవతీ ప్రమాణా ప్రమాణా, సాధారణా, సాధారణాససతీ, నాసతీ, ససదస, త్యనిర్వాచ్యాధిష్ఠాన ఏవా విద్యమానా న్తర్వాశి వికల్పనిరూప్య మాశోచ్చావచ వ్యవహారభేదవతియా, సవిద్యతె- వస్తుతిస్సామాయా, తత్స్వరూపమజ్ఞానం తదేవమూల ప్రకృతి గుణసామ్యామవిద్యే త్యాద్యనేకాకారాజగదాకారేణాపరిణతా, తదేవం, బ్రహ్మవిజ్ఞానాత్యనుభవతిచ= నైవంభవామ్యహం దేహోనేంద్రియాణిదశైవ తున బుద్ధిర్మన ఉశశ్చనాహంకార స్థదేవచ, అప్రాణోహ్యమనాహు భ్రోబుధ్యాదీనాం హిసర్వదా, సాక్ష్యహం సర్వదానిత్యశ్చిన్మాత్రోహం సదాశివః

నాహంకర్తా నైవభోక్తా ప్రకృతెసాక్షిరూపకః
మత్సానిధ్యాప్రవర్తన్తేదేహాద్యా అబడాయివ।
స్థాణుణత్యస్సదానంద శుద్ధోజ్ఞాన మయోమలః

ఆత్మాహం సర్వభూతానాం విభుస్సాక్షీన సంశయః॥
బ్రహ్మైవాహం సర్వవేదాంత వేద్యం నాహం వేద్యం
వ్యోమవాతాదిరూపం, నాహం దేహోజన్మ మృ
త్యుకుతోమే, నాహంకారః, క్షుత్పిపాసాకుతోమే॥
ఇతిమునీన, దృశ్యవాణ్యువాచ, సత్యమితి, మునీ
నసత్యవాణ్యువాచ సత్య మిత్యుపనిషత్॥

(నిరాలంబోపనిషత్)

కిం బ్రహ్మ॥ మహదహంకార, పృథివ్యప్తేజో వాయ్వాకాశాత్మకత్వేన బృహద్రూపేణాణ్డకోశేన కర్మజ్ఞానార్థ రూపతయాభాసమానమద్వితీయమఖిలోపాధివినిర్ముక్తంతత్సకలశక్త్యుపబృంహితమనాద్యంతం శుద్ధం శివం శాంతం నిర్గుణమిత్యాదివాచ్యమనిర్వాచ్యం చైతన్యంబ్రహ్మ॥

కః ఈశ్వరః॥ కిం లక్షణం బ్రహ్మైవస్వశక్తిః ప్రకృత్యాభిధేయ మాశ్రిత్య లోకాన్ సృష్ట్వాప్రవిశ్యాన్తర్యామిత్వేన బ్రహ్మాదీనాంబుద్ధీంద్రియ నియన్తృత్వాదీశ్వరః

కోజీవః॥ ఈశ్వరఏవ బ్రహ్మవిష్ణ్వీశానేన్ద్రాదీనానామరూపద్వారాస్థూలోహమిత్యధ్యాసవశాజ్జీవః- సోయమేకోపిదేహారంభక భేదవశాత్ బహుజీవః॥

కఃప్రకృతిః॥ బ్రహ్మణస్సకాశాన్నానావిచిత్రజగన్నిర్మాణసామర్థ్యైకబుద్ధిరూప బ్రహ్మశక్తిరేవప్రకృతిః॥

కఃపరమాత్మా॥ దేహాదేఃపరతరత్వాత్, బ్రహ్మైవపరమాత్మా సబ్రహ్మా, సవిష్ణుః, సరుద్రస్స ఇన్ద్రస్సశమన, స్ససూర్య, స్సచంద్రస్తే అసురాస్తే పిశాచాస్తే- మనుష్యాస్తాస్త్రియస్తే పశ్వాదయస్తత్స్థావరంతే బ్రాహ్మణాదయ సర్వం ఖల్విదం బ్రహ్మనేహ నానాస్తికించన॥

కిమజ్ఞానమ్॥ రజ్జౌసర్ప భ్రాంతిరివాద్వితీయే సర్వానుస్యూతే సర్వమయే బ్రహ్మణిదేవతిర్యఙ్నరస్థావర స్త్రీపురుషవర్ణాశ్రమ బంధమోక్షోపాధి నానాత్మభేదకల్పితం జ్ఞానమజ్ఞానం॥

కింతపః॥ బ్రహ్మసత్యం జగన్మిథ్యేత్యపరోక్ష జ్ఞానాగ్నిబ్రహ్మాద్యైశ్వర్యాశాసిద్ధి సఙ్కల్పబీజం సంతాపరూపం తపః॥

కస్సన్న్యాసః॥ సర్వధర్మాన్ పరిత్యజ్యనిర్మమో నిరహంకారో భూత్వా

బ్రహ్మైక్యం శరణముపగమ్య, తత్త్వమసి సర్వంఖల్విదం బ్రహ్మ నేహ నానాస్తికిం చన, ఇత్యాదిమహావాక్యార్థానుభవజ్ఞానా బ్రహ్మైవాహమస్మీతి నిశ్చిత్యనిర్వికల్ప సమాధినాస్వాత్మంత్రోయశ్చగతి సన్న్యాసీనముక్తస్సపూజ్యస్సయోగీశ పరమ హంసస్సావధూతస్సబ్రాహ్మణః॥

ఇత్యాద్యుపనిషత్ ప్రమాణంబులు, బ్రహ్మజగత్తుం గురించి చెప్పుచున్నవి గావున — నెట్లనిన — ఆత్మస్వరూపుం డొక్కడుమాత్రమే, నాశన రహితుండు శాశ్వతుండై యుండునని, సద్గురుకటాక్షంబున నెఱింగిన బ్రహ్మవేత్తయగును, వైరాగ్యపరుండవునగు నీకు, పనికిరాని యపవాదమెగాని, నీకు యేమాత్రమున్ను ధనాపేక్షము మొదలగువృత్తులు ఏకాలమందును గలుగ నేరవు గావున తనయొక్క యజ్ఞానమును భ్రాంతివల్లనె సర్వకార్యములయందును బ్రయోజనములేని ప్రేమలుపుట్టును. అదియెట్లనగా భ్రాంతియనగ మాయవలననె, గుల్లయందు వెండియనెడు లోహముయొక్క భ్రాంతిని బుట్టించుగాన మాయమిగుల నాశ్చర్యముగానున్నది గావున, సముద్రమునందు దోచిన అలలు ఆసముద్రమునకు వేరుగానియట్లు — యేపరబ్రహ్మమునుండి యీప్రపంచము తోచెనో ఆపరబ్రహ్మమునకు ప్రపంచము వేరుకాదు. అనగ అట్టి పరిపూర్ణబ్రహ్మమే నీవుగానున్నావు. ఇట్లుండగ నీవు అజ్ఞానకార్యములయందు వర్తింపగూడదు గావున, పామరుండగు మానవుడు తాను మిగులమనోహరమగు శుద్ధచైతన్యమునైన ఆత్మస్వరూపుడై యుండియును గొందరివలన వినియును యుత్పత్తిస్థితిలయంబులనెడు పగ్గంబులం గట్టుపడి కల్మషభావముగలవాడవై, తనపిచ్చిని తాను దెలిసికొననేరక, అయ్యో వ్యర్థముగా నాశనము బొందుచున్నానుగదాయని అజ్ఞానుండగు పామరుండు- తనకు తెలివిలేని కారణంబున తానెనెడు యాత్మస్వరూపుడు సర్వభూతకోట్లయందును, నిండియున్నాడని పిపీలికము మొదలుకొని బ్రహ్మపర్యంతముగాగల భూతకోట్లన్నియును తనయందే గలిగియున్నవనియును నెఱుంగక, తానుబ్రహ్మమునకు పరుండని దలంచుచుండును. ద్వైతాద్వైతమార్గములలో అద్వైతమార్గమే మిగులశ్రేష్ఠంబని మనంబున యోచించియును, మోక్షమునందె కోరికగలవాడై యుండియును మానవుడు కామోద్రేకముగలవాడై సంసారబంధములం దగులుకొని అయ్యో సమస్తకష్టములలో గాసిబొందుచుంటిని గావున, శాంతిశమదమాది గుణములు లేనిమానవుడు అంగమే నిర్మలబిందువనియును, లింగమే నాదమని

యును, లింగాంగసంగమె కళయనియును భావించి యిట్టివిపరీత జ్ఞానమనెడి చల
చిత్తముగు స్త్రీహితుడింగూడుకొని, సదా కామమనెడు స్త్రీసంగమమునే గోరు
చుండునుగావున, విజ్ఞానఘనుండగు యోగపురుషుడు అట్టివికారములను, మనం
బునలేశముగా భావించి యేతలంపులును లేక యాత్మానందుండై యుండును-
కాబట్టి- ఈలోకమందును, స్వర్గలోకమందును, తనకుగలిగెడు సుకర్మముల
యొక్క- ఫలితార్థమును గోరికవిడచినవాడును మిగుల శాంతచిత్తుడును నగు,
నిత్యానిత్య వివేకముగల జ్ఞానికి మోక్షచింతయును గలిగియుండకూడదు. అదియె
ట్లనగ—తన్నుతానెరింగిన జ్ఞాని సదామోక్షమునందె యుండును గాన,
మోక్షమనెడు చింతయందును వృథాశయానమేకదా ఏచింతలనుబొందక నేను
కల్పవర్జితుండై యుండవలయును. ధీరుడగు సద్గురుపుత్రుండు- తాను విశేష
ములగు భోగములను అనుభవించువాడుగానుండినను, మిగులగొప్పవై భరింప
గూడనికీడులు సంభవించినవాడుగా నుండినను, ఆరూఢదృష్టివలన శ్రేష్ఠుడగు
నాత్మనునెరింగి యాసర్వసాక్షియే తానని నిశ్చయమైన మహాత్ముడు ఏకాల
మందును సంతోషమునుగాని దుఃఖమునుగాని, పొందడు గావున ఆత్మతత్వము
నెరింగిన సద్గురుపుత్రుండు, చూచుటకు మిగుల రమ్యమైయుండెడు తనదేహ
మందు అభిమానము లేశమైనను లేక అన్యశరీరముగా జూచును. యిత
రులు తన్నుదూషించినను, భూషించినను, భూషించువారిమీద ప్రేమగాని,
దూషించువారిమీద విరోధముగాని గలిగియుండడు గాబట్టి--జ్ఞానమాత్రుండగు
సద్గురుపుత్రుండగువాడు, యాలోచుచుండెడు నామరూపాత్మకమగు ప్రపంచ
మంతయును, భ్రాంతిరూపంబగు మాయయేగాని నిజముగానున్నది కాదని
యమేధ్యపుంజముగాను నిస్సారముగాను భావించును మృత్యుదేవత ఆసన్నమై
తనదగ్గరకువచ్చినప్పుడు కొంచెమైనను చలించక ఆత్మానందుండయ్యేయుండును-
గావున- సద్గురుపుత్రుండగు ఆత్మజ్ఞాని మిగుల శ్లాఘనీయుండై సుఖదుఃఖ
ములకును, ఆటపట్టుగానుండెడు యీప్రపంచమును మనంబున నెంచక,
ఒకటిని విడువవలయును. మరియొకటిని బట్టవలయుననియును, లేక, బద్ధముష్టి
ప్రకటముష్టి భావములను బొందక సర్వకార్యములయందు సహజముగావర్తించు
నుగావున, చిత్తచలనము లేక, సంకల్పవర్జితుండై, జ్ఞానామృతమనెడు అమృత
ధారచేత, పరమతృప్తినిబొంది వర్తించెడు యాబుద్ధిమంతునకు సాటి యేలోక
మందును లేరు. అతడు ఏవిధమైనవృత్తులు గలిగియుండినను సర్వత్రపూజ్యుడే

యగుచున్నాడు గావున—కోరికలన్నియును విడచి ద్వంద్వములనెడు పుట్టువిడు పులును, సుఖదుఃఖములును పాపపుణ్యంబులును శూన్యమైయున్న విజ్ఞాన శీలుండగు బ్రహ్మజ్ఞాని, తనంతటతానుగా ప్రారబ్ధకర్మవశాత్తు అయిశ్వర్యము నమితిలేనిభోగములును సంభవించినయెడల నామహాత్ముడు యిటులసంభవించె నేయన్న సంతోషమునుగాని యివి అన్నియు నేలసంభవించెనని సంతోషమునుగాని- యివి అన్నియు ఏలసంభవించెనన్న వాటియందు అసూయగాని దుఃఖమును గాని, గలిగియుండక ఒకటే విధముగా నుండును—గాబట్టి- ఆత్మజ్ఞానియైన మహాత్ముడు తనకు విశేషములగు భోగములను గలిగియుండియును పామర జనులవలె సర్వకాలములయందును దగిలి ఘోరంబగు సంసారసముద్రంబునం దగులంబడక, మిగుల జాగ్రత్తగలవాడై యుండును. అదియెట్లనగ, నీటిబిందువు లు తామరపత్రంబులకు నంటనివిధంబున, ఆశ్చర్యంబుగా వర్తించుచుండును గాబట్టి—బ్రహ్మయును, దేవేంద్రుడును మొదలగు శ్రేష్ఠులగు దేవతలందరు మిగులదీనులై యేపదవిని గోరుటకు సామర్థులుగాకయుందురో అట్టిమోక్షపద వినింబొందిన, మిగులశ్రేష్ఠుండగు ఏశివపదమును వేరొక ఏసంతోషమును బొం దక, నిర్మలుండై యుండును పరిశారించుచుండెడు ఆకాశమునందు పొగయెటు లగలయకుండునో అటువలెనే బ్రహ్మవేత్తయైన జ్ఞానికి పాపపుణ్యములయొక్క ఫలములు ఏవిధంబునైనను బొందనేరవు— గావున, యీప్రపంచమంతయును ఆత్మస్వరూపంబుగ భావించిన తత్వవేత్తయగు జ్ఞానికి నామరూపసహితమగు యీప్రపంచవ్యవహారమునను, చక్కగా పూర్ణచూపునుగావున- శ్రద్ధగావినదు, మొద్దుమీద వానకురియుటవలె యథేచ్ఛగా తిరుగుచుండును. అట్టిమహాత్ము నకు, చూచి వినవలెనన్న విధియును జూడకూడదు వినగూడదు అన్ననిషేధ మున్నలేదు గావున—చతుర్ముఖబ్రహ్మ మొదలుకొని, చెట్టుపర్యంతముగా నుండెడు నాలుగువిధములైన భూతసమూహము అనగ పిండములు అండజములు శ్వేదజములు ఉద్భిదములు యీనాలుగువిధములుగాగల చేతనకోట్లయందంత టను, ప్రేమయును, ప్రేమలేకుండుటయును, లేక మీకార్యములయందు వర్తిం చక బ్రహ్మజ్ఞాని యాత్మానందసుఖలీలలయందె వర్తించును గావున—వాకు రెండవవస్తువు లేక ఏకముగానుండువాడనియును, సర్వలోకములకు నేనే దేవుం డననియు నెరింగి దృఢమైన నిశ్చయజ్ఞానముగల మహాత్ముని విడువక వాశ్రి యించియుండెడు పుణ్యపురుషుని గురించి, విచారించగ నతనికి, జననమున్ను

బాధయున్ను భయమున్ను గలుగనేరదు గావున- మహానుభావుండవు, బుగ్గలుగలిగినవని, చెప్పినట్లుగ నీవలననే యీ ప్రపంచమంతయును గలిగెను. తన్ను తానెరింగి- తానొక్కండనే యని భావించుచు పరతత్వమునకు బ్రహ్మమునందైక్యసమాధినిం బొందుము — గాబట్టి — సత్యస్వరూపుండవు నీయందు యేదేశమునునాలుగు భువనములు అసత్యరూపకంబులై ప్రత్యక్షముగా కంటికి నగుపడుగా రూపనామములుగలిగి ప్రకాశించుచున్నవి అవి భ్రాంతిరూపకములేగాని, నిజముగానున్నవిగావు. అదియెట్లనగ ఉత్తరాత్రియందు భ్రాంతివలన పాము దోచినటుల దెలిసి సర్వభ్రాంతులు విడచి చిదాకాశస్వరూపుండవు సర్వసాక్షితో నైక్యము జెందుటకై మనంబున ఆత్మైక్యజ్ఞానము పొందుచూ, నీమనంబునం గోరక తనంతట తామే సంభవించెడు సుఖదుఃఖంబుల్గాని, అపేక్షలేకయుండుము. మరియును, ఆశయుంచుకను, సమీపించివచ్చిన మృత్యుదేవతయందును సమచిత్తుండవై ఏవికారములను బొందక సర్వసాక్షిస్వరూపుండవగు నాత్మునితో నైక్యసమాధిని బొందుటకై చిత్తశుద్ధిగలవాడవై యుండుము- గావున, నేను ఆకాశంబువలె నిండియున్నాడననియు, శృతి॥ ఆకాశవ్యగురాత్మబ్రహ్మ నిశ్చబ్దో బ్రహ్మముచ్యతే॥ అని యీప్రపంచంబు అలలవలె నాయందు గలిగియున్నదనియును నిశ్చయముగల బ్రహ్మజ్ఞానవిచారణపరుండవైన నీవు విడచుటయును, గ్రహించుటయును అనెడు పట్టు విడుపులున్ను నాశనము జెందుటయును లేక సర్వములేక యేవికారములను బొందక యున్నావని, నేను తరంగములు లేని మహాసముద్రమువలె నిండియున్నాననియు, యీప్రపంచము అలలవలె నాయందు గలిగియున్నదనియును, నిశ్చయముగల బ్రహ్మజ్ఞానవిచారణపరుండవగు నీకు కొన్ని కార్యములను విడుచుటయును, కొన్ని కార్యములను గ్రహించుటయును మరణముజెందుటయును లేక సదా యాత్మానందుడవై యుండుము కాబట్టి తాను గుల్లలలో సమానుండనై సర్వము నిండియున్నాను అనియును, యీప్రపంచము నాయందు వెండివలె దోచుచున్నదనియును దెలిసికొనిన ఆత్మజ్ఞానిరతుండవగు నీకు విడుచునట్టి వృత్తులను, గ్రహించునట్టి వృత్తులను చచ్చిపోయెద మను భయమును, లేక పరిపూర్ణుండనై యున్నాను. కావున- నేను సమస్త చేతనకోటియందంతటను నిలచి యున్నాననియును సమస్త భూతజాలమంతయును, నాయందు నిండియున్నదనియును, దెలిసికొనిన బ్రహ్మజ్ఞానవిచారణపరుండవగు నీకును, విషయానులను విడుచుట

యును, విషయములను విడుచుటయును, విషయములను గ్రహించుటయును, నాశనముబొందుటయును, యిట్టి విధినిషేధ ధర్మములను బొందక, అందఱింద బ్రహ్మానందములయందంతటను నిండియున్నావు. కాబట్టి- యిందుకు శ్రుతిస్మృతి త్వోపనిషత్ వాక్యములను దృష్టాంత దార్ష్టాంతికములను ముందు వ్రాయుచున్నవి.

శుకరహస్యోపనిషత్.

ఓం ప్రజ్ఞానం బ్రహ్మ! ఓం అహం బ్రహ్మాస్మి! ఓం తత్వమసి! ఓం అయమాత్మాబ్రహ్మ, తత్వమసీత్యభేదవాచకమిదం, యేజపన్తితే, శివసాయుజ్య ముక్తిభాజో భవన్తిస్సజీవబ్రహ్మైక్యార్థే జపే వినియోగః.

1 జీవోబ్రహ్మేతి వాక్యార్థం యావదస్తి మనస్థితిః
ఐక్యం తత్వం లయేకుర్వన్ ధ్యాయేదతి పదంసదా!
2 చతుర్ ముఖేంద్ర దేవేషు మనుష్యాస్వగవాదిషు,
చైతన్యమేకం బ్రహ్మాతః ప్రజ్ఞానం బ్రహ్మమయ్యపి!
3 పరిపూర్ణపరాత్మాస్మిన్ దేహేవిద్యాధికారిణి
బుద్ధిసాక్షితయాస్థిత్వాస్ఫురన్నహమితీర్యతె
4 స్వతఃపరిపూర్ణం పరాత్మాత్ర బ్రహ్మశబ్దేనవర్ణితః
అస్మీత్యైక్యపరామర్శస్తేన బ్రహ్మభవామ్యహమ్
5 ఏకమేవాద్వితీయం సన్నామరూపవివర్జితమ్
సృష్టేః పురాధునాప్యస్యతాదృక్త్వం తదితీర్యతె
6 శ్రోతుర్దేహేన్ద్రియాతీతం వస్త్వత్రత్వంపదేరితమ్
ఏకతాగృహ్యతె శీతి, తదైక్యమనుభూయతామ్
7 స్వప్రకాశాపరోక్షత్వమయ మిత్యుక్తితోమతమ్
అహఙ్కారాదిదేహాంన్తం, ప్రత్యగాత్మేతి గీయతె
8 దృశ్యమానస్యసర్వస్యత్సన్తత్త్వమీర్యతె
బ్రహ్మశబ్దేన తద్బ్రహ్మస్వప్రకాశాత్మరూపకం
9 అనాత్మదృష్టే అవివేకనిద్రా అహమనుస్వప్నగతింగతోహం
స్వరూపసూర్యే భ్యుదితేస్ఫుటో క్తైర్గురోర్మహావాక్య
పదైః ప్రబుద్ధః

10 కార్యోపాధిరయంజీవః కారణోపాధిరీశ్వరః
కార్యకారణతాంహిత్వాపూర్ణ బోదోవశిష్యతె
తేజోబి·దూపనిషత్తు.

దృష్టిజ్ఞానమయీంకృత్వా, పశ్యే ద్బ్రహ్మమయంజగత్ చిత్తాదిసర్వ భావేషుబ్రహ్మత్వేనైవభావనాత్ నిషేధనంప్రపంచస్య, రేచకాఖ్యసమీరితః బ్రహ్మైవాస్మీతియావృత్తిః, పూరకేవాయురుచ్యతె తతస్తద్వృత్తినైశ్చల్యం కుంభకం ప్రాణసంయమః

౨ దవ అధ్యాయము.

అఖండైకరసోజీవః, అఖండైకరసోహ్యజః.
అఖండైకరసోబ్రహ్మ, అఖండైకరసోహరిః
అఖండైకరసోరుద్ర, అఖండైకరసోస్మ్యహం
అఖండైకరసోహ్యాత్మా, అఖండైకరసోగురుః
దృగ్దృశ్యాయదిచిన్మాత్రం, వస్తుచెచ్చిన్మయంసదా
సర్వాశ్చర్యచిన్మాత్రం, దేహంచిన్మాత్రమేవహి
లింగంచకారణంచైవ, చిన్మాత్రంనహివిద్యతె
అహంత్వంచైవచిన్మాత్రం, మూర్తామూర్తాదిచిన్మయం
బ్రహ్మమాత్రమిదంసర్వం, బ్రహ్మణోన్యన్నకించన
తదేవాహం సదానందం, బ్రహ్మైవాహం సనాతనం

౪ వ అధ్యాయము.

దేహత్రయాతిరిక్తోహం, శుద్ధచైతన్యమస్మ్యహం
బ్రహ్మహమితి యస్యాంతస్సజీవన్ముక్తఉచ్యతె
అహంబ్రహ్మాస్మ్యహం, బ్రహ్మాస్మ్యహం బ్రహ్మేతినిశ్చయం
చిదహంచిదహంచేతి, సజీవన్ ముక్తఉచ్యతె
బ్రహ్మైవాహం చిదేవాహ, మేవంవాపినచింత్యతె
చిన్మాత్రైవ యస్తిష్ఠేద్వైదేహీ ముక్తఏవసః

౫ దవ అధ్యాయము.

బ్రహ్మమాత్రజగదిదం, బ్రహ్మమాత్రం త్వమప్యహం, చిన్మాత్రంకేవలంచాహం। నాన్యనాత్మేతి నిశ్చను ఇదంప్రపంచనాస్త్యేవ, నోత్పన్నంనోస్థితంక్వచిత్, చిత్తంప్రపంచమిత్యాహు। నాస్తినాస్త్యేవసర్వదా, నప్రపంచంనచిత్తా

దినాహంకారోనజీవకః । రతుకోవిష్ణురిత్యాది బ్రహ్మాసృష్టేస్తుకారణం, సంహారోరుద్రోయిత్యుక్తం । సర్వంమిథ్యేతినిశ్చయం, స్థానంజపస్తపోహోమానుస్వాధ్యాయో దేవపూజనం, మంత్రతంత్రంచ సత్సంగో గుణదోషవిజృంభణం । అన్తఃకరణసద్భావ, అవిద్యారయాశ్చసంభః । అనేకకోటిబ్రహ్మాణ్డాం సర్వంమిథ్యేతినిశ్చయు, యద్యత్కించోపిసత్త్వేన సర్వమిథ్యేతినిశ్చయు । త్వమేవపరమాత్మాసి, త్వమేవపరమోగురుః త్వమేవాకాశరూపోసి, సాక్షిహీనోసిసర్వదా । త్వమేవ సర్వభావోసి త్వంబ్రహ్మాపినసంశయః ఇదంప్రపంచయత్కించిత్ । యద్యజగతి విద్యతె, దృశ్యరూపంచ, దుగూపం సర్వశశవిషాణవత్ సంకల్పమేవ యత్కించి తత్వవాస్తితినిశ్చను నాస్థినాస్తిజగస్సర్వం । గురుశిష్యాదికంనహి॥

౬ వ అధ్యాయము.

సర్వంచైతన్యంమాత్రత్వా, త్సర్వదోమసదానహి । సర్వం చిన్మాత్రరూపత్వా, త్సచ్చిదానందమాత్మకం బ్రహ్మైవసర్వనాన్యోస్తి తదహన్తదహనస్తథా । తదేవాహం, బ్రహ్మైవాహంనాతనం బ్రహ్మైవాహం ననుసారీబ్రహ్మైవాహనమేమనః । బ్రహ్మైవాహం నమేబుద్ధిః బ్రహ్మైవాహంనచేంద్రియః బ్రహ్మైవాహంనదేహోహం । బ్రహ్మైవాహంనగోచరః బ్రహ్మైవాహంనజీవోహం । బ్రహ్మైవాహం నవేదభూః బ్రహ్మైవాహంజడోనాహ మహంబ్రహ్మనమేమృతిః । బ్రహ్మైవాహంనచప్రాణో బ్రహ్మైవాహం పరాత్పరః ఇదం బ్రహ్మపరంబ్రహ్మ । సత్యంబ్రహ్మ ప్రభుర్హినః కాలోబ్రహ్మకలాబ్రహ్మ సుఖం బ్రహ్మస్వయంప్రభం । జీవఏవసదాబ్రహ్మ సచ్చిదానందమస్మ్యహం సర్వం బ్రహ్మమయంప్రోక్తం । సర్వంబ్రహ్మ మయంజగత్ స్వయంబ్రహ్మ నసందేహస్స్వస్మాదన్యన్నకించన । ఆత్మనోన్యజగన్నాస్తి సర్వమాత్మమయంజగత్ నిత్యానందమయం । బ్రహ్మకేవలం సర్వదాస్వయం అనంతమవ్యయంశాన్తమేకరూపమనామయం మత్తొన్యదస్తిచేన్మిథ్యాయథామరుమరీచికః । వన్ధ్యాకుమారవచనే । భీతిశ్చేదస్తికించన శశశృంగేణనాగేంద్రో మృతశ్చేజగస్థితత్ మృగతృష్ణజలంపీత్వా తృప్తిశ్చేదస్త్విదంజగత్ । అహంబ్రహ్మైనిశ్చిత్య అహంభావంపరిత్యజేత్ । సర్వమేవలయంయాతివస్తుహస్తస్థపుష్పవత్ నదేహోనచకర్తాని సర్వంబ్రహ్మైవకేవలమ్ ఇత్యాద్యుపనిషత్ ప్రమాణంబులు చెప్పుచున్నవి. గాబట్టి అంతటను నిండినదియును, అపరిమితమైనదియును, అయిన నిస్తరంగ మహాసముద్రము అనిచెప్పబడు నాయందు, ప్రపంచాత్మికంబగు నీశరీరంబను ఓడ,

మనస్సనెడు గాలిచేతను దిరుగుచుండును. ఈమోఁద భ్రాంతియానకమైనాని నిజముగా విచారించిన నాయందు ప్రపంచస్వరూపమగు ఓడ, యేకాలమందైన లేదు. సర్వమునకు మనస్సె కారణమని, తన్నుతా నెరింగి వాడుముక్తుండగును; గావున—అండపిండబ్రహ్మాండములన్నియును నిండి మహాసముద్రమువలె నుండు నాయందు, లోకములన్ని చెప్పంబడిన అలలుగలిగి అణఁగిపోయినను బోవు చుండుఁనుగాని నిజస్వరూపుండైన నాకు, ఏకాలమందును తగ్గుటయుండుటయు హెచ్చుటయును బోవుచుండునుగాని నాకు గలుగనేరవు ఒక్కటేవిధంబుగా నుండెడు నాయందు నిజమెఱుంగనిలోకులు భ్రాంతివలన లోకములున్నవని సాధించెదరు. ప్రపంచములేనలేదని భావముగాబట్టి పరబ్రహ్మముయొక్క సత్తామాత్రముచేతనే బ్రహ్మమనెడు భావనయల్లరకును గలుగుచున్నది. నేను నిరంజనుండనై పుణ్యపాపంబుల గొడవలులేక సర్వమునిండియున్నాను అని యేకల్పములయందును, ఆసక్తుండనుగాక చిత్తవిశ్రాంతి బొందియున్నవాడనుగావున సామ్యములేనిదియును, అనంతమునునగు, నిస్తరంగసముద్రంబని చెప్పంబడిన నిజస్వరూపుండనగు నాయందు ప్రపంచమనునది కల్పనామాత్రంబెగాని ప్రపంచము నాయందులేదని యెరింగి పరమశాంతుండనై సదా ఏవికారములును లేనివాడనై యున్నాను గాబట్టి తాను కేవలజ్ఞానస్వరూపుండనగుదునని నాశ్చర్యమేమియునులేదు.* ఈప్రపంచము యింద్రజాలముభంగి తనయందు భ్రాంతివలనని నితరులకు దోచుచున్నదేగాని, నిజముగా తనయందు ప్రపంచములేదు యేవృత్తియునులేని తనకు గ్రహించుట విడుచుట కల్పనజేయుటమొదలగు నీచవృత్తులు వెచ్చుటనైనను గలుగనేరవు గావున—యవనియొక్క చిత్తము ఏకాలమందైనను చూపులయందు దగిలి నామరూపములుగల చిత్రవిచిత్రముల ను జూచునో ఆతక్షణమె, అయామానవునకు, బంధము సంభవించును. ఎవనియొక్క చిత్తము నామరూపాత్మికమగు ప్రపంచ విచిత్రరూపములందు గలుగక యుండునో, అప్పుడే ఆమనుజునకు మోక్షము సంభవించును గాబట్టి.

కఠోపనిషత్ 3 వ వల్లి ౧౮ వ వాక్యము.

నసందృశే తిష్ఠతి, రూపమస్య నచక్షుషాపశ్యతి కశ్చనైనం హృదామనీషీమనసా భిక్లృప్తోయ ఏతద్విదురమృతాస్తేభవన్తి॥

కఠోపనిషత్ 3 వ వల్లి ౧౮ వ వాక్యము.

ఉత్తిష్ఠత జాగ్రతప్రాప్యవరాన్నిబోధత క్షురస్యధారానిశితాదురత్యయా

దుర్గంధ స్తపత్కావరోా వదంన్తి॥

ప్రశ్నోపనిషత్

౪ వ ప్రశ్నము ౧౦ వ వాక్యము.

పరోహావై తరచ్ఛాయ మశరీరం లోహితం శుభ్రమక్షరం వేదయతే యస్తుసోమ్యేన సర్వజ్ఞః సర్వోభవతి.

ముండకోపనిషత్

3 వ ముండకము- ౧- వ ఖండము- ౮ వాక్యము.

నచక్షుషాగృహ్యతే నాపివాచాన్యైర్దేవై స్తపసాకర్మణావా జ్ఞానప్రసాదె నవిశుద్ధసత్వ స్తతస్తుతం పశ్యతే నిష్కళం ధ్యాయమానః॥

ఈపరబ్రహ్మమునకు, సత్తు- అనత్తను నదియు ఆనందమనునదియు, యిప్పు డుండునది కాదు, ముందు లేనిదియు కాదు, మునుపు యుండునదియు కాదు. యిప్పుడు లేనిదియు కాదు. స్వతశిద్ధముగా తనకు తానే యున్నది, సరే గాని, దానిని తెలియుట యెట్లు అని విచారించవలసి వచ్చును. అవిచారమునకుఁ మూలములేదు. శృతి—"మూలాభావ ఇదం జ్ఞాతుం నశరీరం నకిమస్థి" మూలంలేని యీగుర్తు యెరిగి శరీరము ఏదీాలేదు, ముందులేదు యిప్పుడు లేదు, ఆదిమధ్యాంత శూన్యమైనది, మొదలు తుదలేనిది, అనాదిమూల ప్రకృత్తి దీనినే సనాతనమైనదిన్ని అవ్యక్తనామరూపాత్మకమైనదియు, సమస్త వ్యవహారికములు కలిగినదియు, యున్నట్టుగా తోచబడునదియు నైన తను, తాను, అనగ, దేహిదేహములు రెండున్ను, నేతికి దొన్ని ఆధారం దొన్నికినేయి ఆధారం కలిగియుండునట్లు, దేహిదేహములకుఁ అనగ యీమూలం లేని గుర్తెరిగ శరీరమునకు, తనకు తానే ఆధారమైయున్నది. కావున తనకు మూలములేదని చెప్పుటకు కారణమేమనగ తాను సృష్టికి రావడమునకు కారణములేదు. నిమిత్తకారణముగా వచ్చినది, వచ్చి, కొంతకాలము, శృష్టిస్థితిలయములకు కారణమై అవస్థాత్రయముల పాల్పడి, జననమరణ ప్రవాహరూపకమైన సంసార మహాసముద్రమునందు అలలవలె మూలాభావమై రాకపోకలకు కారణమైయున్నది. కాబట్టి దీనికి- అనిత్యమనియు, అనిత్యమనియు చెప్పుమరే గాని శంఢోపతండములుగా నిండియున్న సముద్రమునందు అనగ తనలోపల అనేకమైన జీవరాసులు, శృష్టిస్థితిలయములు అయివుంటూా యున్నవి. అట్టి వుత్పత్తి స్థితిలయములను, సముద్రము యెరుగును యెరగదు యెట్లనగ కేవల పరబ్రహ్మము

నందు తనయొక్క బలముచేత సర్వచరాచర ప్రపంచము జననమరణ ప్రవాహరూపకమై రాకపోకలకు కారణమై ఆవరణ విక్షేపరూపములగు అంతనంత కోటిరూపములై అంతటా యున్నది. కాబట్టి సర్వము తన స్వరూపమై పరిపూర్ణమైన పరబ్రహ్మము, తనయొక్క బలముచేత, సత్వరజోతమోగుణాత్మకమైన మూలజ్ఞప్తిశక్తిమాత్రి శరీరమనే, అనాదిమూల ప్రకృతి సుషుప్తియందు మెలకువవలె నున్న మేఘమందు మెరుపువలెనున్న తనంతట తానే, రజ్జువు సర్పభ్రాంతివలెగ తోచబడి, అంతా తానై తాన అంతామై, విశ్వరూపంబుగ దోచబడి యున్నది లేనిదిగానున్న లేదియున్నదిగానున్న తోచుచున్నది.

## మాండూకోప నిషత్.

### ౭ వ వాక్యము.

నాన్తః ప్రజ్ఞం నరాభయతః ప్రజ్ఞా నప్రజ్ఞానఘనం నప్రజ్ఞం నాప్రజ్ఞం అదృష్టం అవ్యవహారం అగ్రాహ్యం, అలక్షణం, అచిన్త్యం అవ్యపదేశ్య ఏకాత్మ ప్రత్యయసారం, ప్రపంచోపశమం శాన్తం శివం అద్వైతం చతుర్థం మన్యన్తేస ఆత్మానవిజ్ఞేయః॥

## సన్న్యాసోప నిషత్.

### ౨. వ. అధ్యాయము.

నిరస్తమనవాసన్న, స్సచిన్మాత్రపరోస్మ్యహం మలం సంవేద్యముత్సృజ్యమనో నిర్మూల యత్పరం ఆశాపాశమసంభిత్వావం చిన్మాత్రపరోస్మ్యహం॥

యిట్లు పనిషత్సారములు మహాఋషులు చెప్పుచున్నారు. కేవల పరబ్రహ్మమైన తనకు ప్రజ్ఞానం నాస్తి లేదు. బాహ్యదృశ్యప్రపంచ దృక్కున కగోచరమైనది అవస్థాత్రయమందు వ్యవహారమునకు వేరైనది నాస్తిలేనిది, గ్రహించునది గానిది, లక్షణముగానిది, నశించనిది, వుపదేశముగానిది, తానొక్కటియై ప్రత్యక్షప్రమాణమైయున్నది. జననమరణప్రవాహరూపకమైన ప్రపంచం నాస్తి లేనిదే. సర్వమంగళప్రదమైన అద్వైతాత్మస్వరూపమైన విజ్ఞానమైస్వరూపకమైన నిర్విషయానందమైన బ్రహ్మమునందు శాశ్వతమైనదియు, ఆశాపాశావినిర్ముక్తముయినదియు, శృతి ఆశాపాశవినిర్ముక్తమైనదియునై అమలమై వేదవేదాతీతమై, అంతతానే సర్వం నిండియున్నదై పరమాత్మయందు, యితరమైన దంతయు తానే ఆరోపించుకొని, సుఖదుఃఖములను పొందుచున్నాడు. కాబట్టి, పరమాత్మమిక్కిలి

శరీరమునందు యుండెడి బుద్ధిని, చిత్తమును, మనస్సును, లేనిదైన యింద్రియములచేత, పరమాత్మను యింద్రియములు దెలియజాలవు. కావున, పరమాత్మ అహంకారాదులు మొదలైన యింద్రియములచేత దెలియబడకపోయి నప్పటికిన్ని అనగ, మనోనేత్రముచూడబడిన వివేకజ్ఞానముచేత తన్ను దా దెలియబడును. కాబట్టి ఆపరమాత్మ సస్వరూపమునకంటె మరివక జ్ఞానంలేదు. కాబట్టి పరమాత్మ బుద్ధ్యాదులతో గూడిన అంతఃకరణాదులచేత, తన్ను దా దెలియబడకపోయినట్టయితే ఆపరమాత్మను యెట్లు తెలుసుకోబడును. శ్రవణమనన నిదిధ్యాసములచేత తన్ను దా దెలియవచ్చును. కాబట్టి, అట్టి పరమాత్మను దెలియుటకు, జడరూపకములగు పాధులను తొలియబడక, అనగ స్థూలసూక్ష్మ కారణ మహాకారణములను తొలియబడకపోయినట్లైతే పరమాత్మ తెలియబడదు. అది యేలాగంటె దృష్టాంతము త్రాటియందు తోచబడినపాము నిశ్చయమని, నమ్మిన వరకు, తననిజము తెలియక- అధ్యారోపణగా, ఆరోపించిన పామువంటి దేహేంద్రియ భ్రాంతిని, గురువాక్యమనే, అనగ- అంతకుముందుగా తన్ను దా దెలుసుకొనిన వాడును- ఆత్మానాత్మ వివేకముచేత యిది పాముగాదని, తాడని నిశ్చయించి, పాముని భ్రమశినవాని మనస్సు దృఢపరచిన పిమ్మట, అది పాముగాదని వాడుకూడా ఆతనివలె తాడెయని దృఢముగలిగినవాడై యున్నట్లుగ తాను దేహేంద్రియముల చేజిక్కి దేహేంద్రియ ప్రపంచకమే వానిని భ్రమించి, తన్ను తా దెలియక, అవిద్యాజ్ఞానంచేత తా నెవరో, నీ వెవరో తా దెలియక అరిషడ్వర్గములలోను యీషణత్రయములో జిక్కబడి, తను తా దెలియనేరక యుండెను. కావున శృతి—"ఉల్కాహస్తో యథాకశ్చిత్ ద్రవ్యమాలోక్య తాంప్రిత్యజేత్" అనునట్లు దొంగవాడు కాగడాను వెలిగించుకొని, వస్తువును చూచి, స్థాననిర్ణయము చేసుకుని, ఆకాగడాను విసర్జించినట్లును ఆలాగువనే, జ్ఞానమనే గురువాక్యముచేత, తన్ను తా దెలుసుకొని, తాను దేహేంద్రియములు కాదని గడద్రోచి, మిగిలినదే పరమాత్మయని, తన్ను తా దెలుసుకొని, తాను అంతానేయని తానే అంతాయని తెలిసిచే దెలశినవాడు మహాత్ముడనియు బ్రహ్మనిష్ఠుడనియు మహాఋషులు చెప్పియున్నారు. కావున, దీప మున్నంతలోనే చక్కబెట్టుట యుచితము. అజ్ఞాన గాఢాంధకారమైన సంసారములో జిక్కి దారిగానక యుండుట పునరావృత్తికి కారణమైన గర్భయుండ్లు గూలుదురు.

## ఛాందగ్యోపనిషత్.

8 వ ప్రపాఠకము- 14 గవ ఖండము.

ఆకాశో వై నామ నామరూపయో ర్నిర్వహితా తేయదంతరాతద్బ్రహ్మ తస్త్వైక్యత్తేహాపిదిన్మయః ఆత్మానాత్మవివేకోయం ముక్తిప్రక్రియతే బుద్ధేః సర్పత్వేన యథాఽజ్ఞానజితత్వేన శుక్తికా విసర్జితా వియూథైవ, దేహత్వేన తథాత్మా, ఘటత్వేన యథా పృథ్వీజలత్వేన మరీచికా గృహత్వేన హికాష్ఠాని ఖడ్గత్వేననైవ లోహతా తద్వదాత్మా దేహత్వం పశ్యత్యజ్ఞానయోగతః॥

౮. దవ అధ్యాయము.

చిత్తైచలతి సంసారో నిశ్చలే మోక్షుచ్యతే తస్మాచ్చిత్తం స్థిరీకుర్యాత్ ప్రజ్ఞయా పరయా పర చిత్తం కారణమర్థానాం తస్మిన్సతి జగత్త్రయం తస్మిన్ క్షీణే జగత్క్షీణం తచ్చికిత్స్యం ప్రయత్నతః॥ ఇత్యాద్యుపనిషత్ ప్రమాణము చెప్పుచున్నవి. మహాకాశమనే, పరమాత్మకు నామరూపక్రియలు రహితమై, ఆత్మనాత్మ బ్రహ్మసత్యం జగన్మిథ్యాయనే యుపనిషద్ వాక్యములు మహాఋషులు చెప్పియున్నారు బ్రహ్మమందు, జగద్భ్రాంతి ఆరోపితమైనది యెట్లనగ మరుమరీచికలు, యెండమావులలో నీరువలెను రజితత్వేనశుక్తికా ముత్యపు చిప్పలు వెండివలెను, దారువ పురుషునుగాను దారువపుషవద్ భ్రమ అట్టి పరమాత్మ తాదాత్మ్యమగు అజ్ఞానముచేత తోచబడినది. ఆకారణముచేత తన్ను తా విచారించిన ముత్యపుచిప్పయగు తన్ను తా దెలసిన యెండమావులలో నీరు ఏమియు లేదు గావున, లేనిదే వున్నట్టుగా తానైన పరమాత్మ యందు తోచబడినది.

శ్లో॥ శృతి॥ అవిద్యకం శరీరాదిదృశ్యం బుద్బుదవత్ క్షరమ్, ఏతద్ విలక్షణం విద్యాదహం బ్రహ్మేతి నిర్మలమ్॥ అనగ—దృశ్యం- అగపడుచుండెడు దృశ్యప్రపంచమంతయు, శరీరాది- దేహము మొదలుగా గల సర్వోపాధి చరాచర ఉజ్జడరూప సమూహములున్ను, అవిద్యకం- అవిద్యవలన కల్పింపబడినదై, అజ్ఞానావ్యక్తముచేత, ఆరోపితా- కల్పితమైనదియునై, బుద్బుదవత్- నీటిబుగ్గవలెను, క్షరం-నశించిపొయ్యేది, తస్మాత్-ఆకారణముచేత, నందువలన, యేతద్విలక్షణం- ఏతత్- ఈపైనిచెప్పిన దేహేంద్రియాదులకంటె, అనగ, పంచవింశతిత్త్వములకంటె, విలక్షణం- వేరైనటువంటిన్ని, నిర్మలం, జననమరణ క్షుత్పిపాసాదిరాగద్వేషా, గుణత్రయ, తాపత్రయములు లైన దూషణము

మాలిన్యరహితమైనది పరబ్రహ్మ- సర్వపరిపూర్ణ స్వరూపమైనది తానే యని, తాను- తానైన పరబ్రహ్మమును, విద్యాత్- తన్ను దా దెలియవలసినది అనగ అపరబ్రహ్మము తెలియవలెను గాబట్టి దేహత్రయ స్థూలసూక్ష్మ కారణ శరీరములకు, అశ్యత్వాత్- విలక్షణ మాటవలన అనగ వేరవుట వలన, త్వం - నీవు, జన్మజరాకార్శ్యలయాదయః...జన్మ - పుట్టుటయున్ను, జరా- ముదిమిన్ని, పెరుగుట, మునలితనముయున్ను; కార్శ్య- చిక్కిపోవడమున్ను, శుష్కించడమును, చిన్నదియాటయున్ను; లయ- నాశనమున్ను, నశించుటయు, లేకపోవుటయు; యన్మశ్యాం- తన్నస్యాం అనునట్లు దృశ్యమేవతద్వినశ్యతి- నశించునదియు, ఆదయః- ఆదియైన మొదలైన, అస్తి- జాయతే వర్ధతే- పరిణమతే- అపక్షీయతే- వినశ్యతే- అను షడ్భావవికారములు, న- లేవు, నిరింద్రియత్వా- ఇంద్రియములు లేకపోవుటచేత, విషయములు లయమవుటచేత, శబ్దాదివిషయైః - శబ్దాది అనగా శబ్దమే యిల్లుగా గల రూప రసగంధ స్పర్శములనే విషయములతో శబ్దమె - ఓంకారశబ్దం ఈ ఓంకారమే యిల్లుగాగలదియునై యున్నది. కావున, సంగః- అనుభవము స్నేహము, కూడుటయున్ను, న- లేదు, అనగా, పరమాత్మ జరామరణసంగ సంసారమును నంటకయున్నదనుట. పరబ్రహ్మము దేహత్రయమునకంటె విలక్షణమైనది గనుక, దేహధర్మములు పరమాత్మకు లేవు ఇంద్రియములు లేకపోవుటవలన, యెట్లననగ, దేహము లేనందున యింద్రియములు లేవు, యింద్రియములు లేనందున విషయము వాని వాని గుణములు లేవు. కావున, యింద్రియ రహితు డౌటచేత అనగుడుగనుక యింద్రియసంఘములతో కూడనివాడు గనుక యింద్రియ విషయాములవల్ల కలిగే పాపకర్మ పుణ్యకర్మలు తన్నంట నేరవు. అనగ భోగములు సర్వము తన్ను జెందవు. కావున, భోగములు యొంతమాత్రమున్ను తన్ను సంబంధించనందున, నిర్గుణబ్రహ్మమునిన్ని-"అహం బ్రహ్మాస్మి"యను పదమునకు సరిపడువాడనిన్ని మహాఋషులు చెప్పుచున్నారు కావున, బ్రహ్మైక్యమును మనన నిధ్యాసలు చేయవలయును. పరబ్రహ్మమునకు మనస్సు లేనందున, సుఖదుఃఖాదికములు లేవని దృఢనిశ్చయమే గదా. కావున గురువుయొక్క- అనుగ్రహమువలన, తనకు అనుభవసిద్ధమైనది యెట్లనగ—శృతి॥ నిర్గుణో నిష్క్రియో నిత్యోనిర్వికల్పో నిరంజనః- నిర్వికారో నిరాకారో, నిత్యముక్తోస్మి నిర్మలం॥ కావున, అస్మి- అయితిని బ్రహ్మమైతిని, బుద్ధి లేకపోవుటవల్లను,

నిర్గుణః- త్రిగుణశూన్యుఁడు, యింద్రియములు లేకపోవుటవలన, క్రియాశూన్యుడు, యిప్పుడు అవస్థాత్రయమందు నశించనందుచేత, నిత్యః- ఎల్లప్పుడును యుండే వాడును, మనస్సు లేకపోవుటవలన, నిర్వికల్పః- వికల్పనలు సంకల్పములు లేనివాఁడు, ఒకదానికొకటి సంధించనందున, సంబంధము లేనివాఁడు, బంధవిముక్తి అయినవాఁడు, నిరంజనః- రంజనము లేనివాఁడు, సంతోషము లేనివాఁడు, యెక్కడ యెతతెగక నిండియున్నవాఁడు, షోడశకళలతో కూడిన లింగదేహభంగమైనందున, నిరాకారః- ఆకారము లేనివాఁడు, రూపము లేనివాఁడు, యింత యంతయని యనరానివాఁడు, ఒక సంబంధమును తనయందు లేనందున, నిత్యముక్తః- యెల్లప్పుడు ముక్తిస్వరూపుఁడు, బంధవిముక్తుఁడు, జీవభ్రాంతి విడచినవాఁడు, అవిద్యా అజ్ఞానఅంతఃకరణవృత్తి శూన్యమైనవాడును, నిర్మలః- రాగాదివిషయములు లేనివాఁడు గావున, నిర్గుణసాక్షాత్కార పరబ్రహ్మమనియున్నది.

## పరమహంస పరివ్రాజకోపనిషత్.

బ్రహ్మమస్మీతి తత్త్వమస్యాది వాక్యార్థస్వరూపానుసంధానం కుర్వన్ కృతీభూత్వా బ్రహ్మాహమస్మీతి భావయన్ సచ్చిదానందాద్వయ చిద్ఘనం సంపూర్ణానన్దః కథోర్ధ్వోబ్రహ్మైవాహ మస్మీత్యనవరతం బ్రహ్మప్రణవానుసన్ధానేనయః కృతకృత్యోభవతి సపరమహంస పరివ్రాట్।

## అన్నపూర్ణోపనిషత్.

### ౧. వ అధ్యాయము

భ్రమపంచ విధోభాతి తదేవాత్రసముచ్యతే- జీవేశ్వరాభిన్న రూపావతిప్రథమకో భ్రమః ఆత్మనిష్ఠం కర్తృగుణం వాస్తవం వాద్వితీయకః శరీరత్రయసంయుక్త జీవసంగీ తృతీయకః జగత్కారణరూపస్యవికారిత్వం చతుర్థకః కారణాద్భిన్నజగత్సత్యత్వం పంచమోభ్రమః పంచభ్రమనివృత్తిశ్చ తదా స్ఫురతిచేతసి బింబప్రతిబింబదర్శనేన భేదభ్రమోనివృత్తః॥ ఘటమఠాకాశదర్శనేన సంగీతి భ్రమోనివృత్తః- రజ్జుసర్పదర్శనేన, పారమార్థిక కర్తృత్వభ్రమో నివృత్తః కనకరుచక దర్శనేన వికారత్వ భ్రమోనివృత్తః॥ తథా ప్రకృతి ముచ్చిత్తం బ్రహ్మాకార మభూత్స్వయం సర్వవస్తు పరిత్యాగే శేష ఆత్మేతికథ్యతే ఆత్మావలోకనార్థంతు తస్మాత్సర్వం పరిత్యజేత్ సర్వం సన్త్యజ్య దూరేణ యుచ్ఛిష్టంతన్మయోభవ సర్వాకించి దిదందృశ్యం దృశ్యతే చేజ్జగద్గతం

చిన్మిష్పందాంశ మాత్రస్త నాస్త్యకించన శాశ్వతః॥

౪ వ అధ్యాయము.

ప్రతిష్ఠా సర్వభూతానాం ప్రజ్ఞాన ఘనలక్షణః తద్విద్యావిషయా బ్రహ్మసత్యం జ్ఞానసుఖాద్వయం ఏకం బ్రహ్మాహమస్మీతి కృతకృత్యోభవేన్మునిః॥

౫ వ అధ్యాయము.

చిన్మాత్రమక్షయం శాంతం మేకం బ్రహ్మాస్మి నేతరత్ బ్రహ్మైవ సర్వమిత్యేవ భావితే బ్రహ్మవైపురాః సన్మాత్రమిన చచ్ఛన్దామి ఆత్మనోన్యన్న హి క్వచిత్ ఏకమాద్యంతహీనం చిన్మాత్రమమలంతతం ఖాదప్యతితరాం సూక్ష్మం తద్బ్రహ్మాస్మి నసంశయః దిక్కాలాద్యనవచ్ఛిన్నం స్వచ్ఛం నిత్యోదితం తతం సర్వార్థమయ మేకార్థం చిన్మాత్రమమలంభవ సర్వమేకమిదం శాంతం ఆదిమధ్యాంత వర్జితం భావాభావ మజం సర్వ మితిమత్వాసుఖీభవ, నబద్ధోస్మి బ్రహ్మైవాస్మి నిరామయం ద్వైతభావ విముక్తోస్మి సచ్చిదానంద లక్షణః యావం భావయ యత్నేన జీవన్ముక్తోభవిష్యసి, యథాకాశో ఘటాకాశో మహాకాశో ఇతీరితః తథాభ్రాన్తైర్ద్విధాప్రోక్తో హ్యాత్మా జీవేశ్వరాత్మనా యదామనసి చైతన్యం భాతి సర్వత్రగం సదా యోగినో వ్యవధానేన తథా సంపద్యతే స్వయం యథా సర్వాణి భూతాని స్వాత్మన్యేవహిపశ్యతి సర్వభూతేషుచాత్మానం బ్రహ్మసంపద్యతే తథా యథా సర్వాణి భూతాని సమాధిస్థోనపశ్యతి ఏకీభూతః పరేణాసౌ తదాభవతి కేవలః అలేపకో, హ్యహం అజరో, నీరాగశ్శాన్తవాసనః నిరంశోస్మిచిదాకాశ మితిమత్వానశోచతి అహం మమత్వవిరహితః శుద్ధోబుద్ధోజరోమరః శాంతశమసమాభావ ఇతి మత్వాన శోచతి తృణాగ్రేష్వంచరే భానౌనరనాగామరేషుచ యత్తిష్ఠతి తదేవాహమితి మత్వానశోచతి భావనాం సర్వభావేభ్యస్సముత్సృజ్యసముత్థితః అవశిష్టం పరం బ్రహ్మకేవలోసీతిభావయ మాభవగ్రాహ్య భావాత్మా గ్రాహకాత్మాచమాభవ భావనామఖిలాంత్యక్త్వా యచ్ఛిష్టంతన్మయోభవ॥

అక్ష్యుపనిషత్.

అవిద్యాతిమిరాతీతం, సర్వాభావ వివర్జితం అనన్తమమలం శుద్ధం మనోవాచామగోచరం ప్రజ్ఞాఘనమానన్దం బ్రహ్మాస్మీతిభావయ॥

అధ్యాత్మోపనిషత్.

ఘటాకాశమహాకాశ ఇత్యాత్మానం పరాత్మని విలాప్యాఖండ భావేన

తూష్ణీం భావన్నదాముని యత్రైవజగదాభాసో దర్పణాంతంపురం యథాత బ్రహ్మహమితిజ్ఞాత్వా కృతకృత్యోభవానఘ॥ సమాధినావికల్పేన యథాద్వైతాత్మదర్శనం, అతాత్మన్యాం దృఢీకృత్వన్నహమాది ఘనన్త్యజన్ ఉదాశీనతయాతే షుతిష్ఠేద్ఘట కటాదివత్ బ్రహ్మాది స్తంభపర్యంతం మృషామాత్రా ఉపాదయః తతః పూర్ణం స్వమాత్మానం పశ్యేదె కాత్మనాస్థితం స్వయం బహ్మ, స్వయం విష్ణు, స్వయమిన్ద్ర, స్వయం శివః స్వయం విశ్వమిదం సర్వం స్వస్మాదన్యనకించన॥

ఇత్యాద్యుపనిషత్ ప్రమాణములు చెప్పుచున్నవి. కాబట్టి, అట్టి నిర్గుణ పరబ్రహ్మమే తానై స్వయమై ఏకమై ప్రకాశించునది. కామక్రోధాదిరహితమైనదియు, సర్వబంధ రహితమైనదియు, అఖండమై భేదరహితమైనదియు, శాశ్వతమైనదియు నిష్ప్రపంచ స్వరూపమైనదియు, సర్వచరాచరాదులయందును సర్వత్ర వ్యాపించియుండునదియు, శుద్ధమై, పుణ్యపాప రహితమైనదియు, నిష్కళస్వరూపమై నిష్క్రియాస్వరూపమై నిష్కళంకమై త్రిగుణరహితమైనదియు, సంకల్పవివర్జితమై నిర్వికారమై నిరాకారమై నిరతిశయమై, శరీరత్రయవిలక్షణమై జాగ్రత్స్వప్నసుషుప్తావస్థలయందు నశించనిదియు, శృత్యనుభవములచేత తన్ను తా దెలియనైయున్న నిర్గుణ సాక్షాత్కార పరమాత్మ, ఏవం- యాపైన జెప్పబడిన ప్రకారము, అహం- నేను, బ్రహ్మైవ- సర్వపరిపూర్ణమైన వస్తువే, అస్మితి- అయితిని, నిరంతరం కృతా- నిరంతర- యెల్లప్పుడు, కృతా- చేయుబడినవాడు వాసనా - సంస్కారము, అనగ వినినదానివల్లను తెలియరానిది గ్రహించరానిది అగోచరమైనది ఆవరణవిక్షేపశక్తి రహితమైనదియు, అవిద్యా- మాయవలన గలిగిన, విక్షేపాన్- ఆవరణవిక్షేపశక్తులందు అనగ తననుతాను చూచుచుండునప్పటికిన్ని దానిని తెలియలేకుండా చేసి భేదమును తనయందు లయపరచుకొని తిరుగా భేదమునకు కారణముగా నుండేది- ఆవరణశక్తి యిందుకు దృష్టాంతము నిద్రయె విక్షేపశక్తియనగ జాగ్రత్స్వప్నముల యందు భేదబుద్ధిని గలుగజేసెడిశక్తి, హారతి - నశించుచున్నది, బ్రహ్మాస్మితి - పరబ్రహ్మమైతిననే తత్వమస్యాదివాక్యార్థము నస్వరూపానుసంధానం అనగ తన్నుద చూచుట, తానుతానౌట, తానుబ్రహ్మమైతినని సచ్చిదానందాద్వయ స్వరూపమైనది పరిపూర్ణానందస్వరూపం, అనవరతం - ఎల్లప్పుడు బ్రహ్మకారవాసనానుభవముచేత, బ్రహ్మానందముచేత

తానుతానాటచేత, తాను కృతకృత్యుండగును గావున పంచవింశతి తత్వములు భ్రమ, జీవేశ్వరుల్భ్రమ, కర్తృకార్యములు భ్రమ, కారణ కార్యములుభ్రమ, శరీత్రయముభ్రమ, జగత్కారణంభ్రమ, భ్రమనివృత్తి - యె - రహితం-బంధ రహితం, తన్మోక్షం భవతి- తన్నివృత్తికొరకై, బ్రహ్మైవాహమస్మి- బ్రహ్మనై తిని జీవాత్మపరమాత్మ యనునది. బింబప్రతిబింబదర్శనేన భేదభ్రమోనివృతిః॥ నీవు నేను అనునదిభ్రమ. ఘటాకాశమహాకాశ దర్శనంచేతను సంగతంచేతను భ్రమఘటాకాశము భ్రమ మహాకాశము భ్రమ యీరెంటియొక్క సంగతం భ్రమ వుపాధిద్వయదోషం భ్రమ రజ్జుసర్పవద్భ్రాంతివత్ తాడు పామని భ్రమ ఇదేజగద్భ్రమ పారమార్థికమును కర్తృత్వముండుటభ్రమ తథా అప్రకారముగా సర్వవస్తుపరిత్యాగంచేశిన శేషించినదే పరమాత్మేతినిశ్చయః॥ అపరమాత్మను తెలుసుకొనే నిమిత్తమై తస్మాత్- ఆకారణమువలన, పరిత్యజేత్-విడిచిపెట్టవలయును. పంచభూతములు కూడికచేతనే జీవాత్మకూడియున్నది గావున తానొక్కడై బ్రహ్మస్వరూపమై యున్నది. సర్వం బ్రహ్మమే శాశ్వతమైన యీచిన్మాత్రమే యున్నది. అపరబ్రహ్మస్వరూపమే సత్యమైనదియు శాంతమైనదియు పరిపూర్ణమైనదియు స్వచ్ఛమైనదియు సర్వదా నిండియుండునదియు యేకమైనదియు. ఇది అంతయు శాంతమైన బ్రహ్మస్వరూపము. ఆది మధ్యాంతరహితమైనదియు, మూలములేనిదియు, భావాభావ వివర్జితమైనది భేదాభేదవివర్జితమైనది బంధవిముక్తి అయినదియు బ్రహ్మైక్యమైనదియు నిరామయమైనది ద్వైతాభావతవిముక్తైనదియు సచ్చిదానందమైనదియు, గావున జీవన్ముక్తికలుగును. ఘటాకాశమహాకాశములకు ఏకత్వం కలిగినటుల జీవాత్మపరమాత్మల ఏకత్వంకలిగి తానొక్కటైయున్నది.

ఏది వాక్కులచేత తెలియబడనిదో, ఏది ఆధారముచేత వాక్కులచేత చెప్పబడుచున్నదో, అదియే బ్రహ్మము యుపాశించుచున్న యీశనబడు శ్వప్రపంచముగాదు. ఈదృశ్యమైనతేజస్సులను యుపాశించుటకాదు పైవ్రాశిన పరబ్రహ్మమును యుపాశించుట యుత్తమము. యుత్తమపురుషులే అపర బ్రహ్మైక్యానుసంధానముచే బ్రహ్మనిష్ఠయందు యుందురు.

బ్రహ్మముకలదని దెలిసికొను తాను బ్రహ్మహమస్మి బ్రహ్మమగును. అనగ సత్పదార్థమైన బ్రహ్మమగును. అనగ శాశ్వతమైనది. బ్రహ్మణోనకించన॥ అనగ బ్రహ్మపదార్థముకన్న నితరమించుకయును లేదు. అహంబ్రహ్మాస్మి॥ ఈ

మహావాక్యము యజుర్వేదమందు బృహదారణ్యకమునందు యున్నది. అహం అనగ కొందరు అవిద్యోపాసకులు దేహేంద్రియాదులనిన్ని పంచవింశతి తత్వములచేకూడి అభిమానించువాడని తలంచెదరు గావున అటులతలంచుటచే అనగ దేహేంద్రియ సముదాయమైనదని తలంచునదియే జననమరణాది దుఃఖములకు కారణమగును. అనిత్యమగు దేహేంద్రియాదికము తానైన బ్రహ్మమెట్లగును. అహంశబ్దమగు దేహేంద్రియాదులను విడచి లక్ష్యార్థమగు అద్వితీయాఖండ పరిపూర్ణ సచ్చిదానంద కూటస్థచైతన్య ప్రత్యగాత్మయె తానని తెలియవలయును. బ్రహ్మమనగా కాలత్రయాబాధ్యమైనది. మూడుకాలములయందు యెండ వాన చలిమొదలైనవాటి బాధలేనిదియునై యున్నది. అట్టిబ్రహ్మము సత్- శాశ్వతమైనది, యెల్లకాలములయందు యదార్థముగాయున్న శాశ్వతముగాను జాగ్రత్స్వప్నసుషుప్తి తుర్యము యీనాలుగవస్థలు దేహమునకు గలవు గాని పరబ్రహ్మమునకు లేవు. ఒకఅవస్థలోనుంచి మరియొక అవస్థ మరియొకఅవస్థలోనుంచి యింకొకఅవస్థ యీప్రకారము మారుచుండును.

దేహేంద్రియములకే అవస్థలు మారుచుండును. బ్రహ్మము ఏకాకారమై యుండును. ఇటుల బ్రహ్మమునకు వారములు, పక్షములు, దినములు, మాసములు, ఆయనములు, సంవత్సరములు, యుగాదులు, మారుచున్నను పరబ్రహ్మమెన్నటికి మారదు. ఆనందమనగా, బ్రహ్మానందము ఇంద్రసభానందం, బృహస్పత్యానందం, ప్రజాపత్యానందం, గంధర్వానందం, మనుష్యానందాదులు యెన్నన్నియైనను అనిత్యోపాధులుగాని నిత్యానందములుగావు. నిరుపాధికమై బ్రహ్మానందములకు సరిగావు. కాబట్టి అద్వితీయాఖండపరిపూర్ణ స్వరూప పరమాత్మయే బ్రహ్మమనబడును. అస్మియనుపదమున కర్థము అయితిని అనగ వాచ్యార్థములగు అహం బ్రహ్మపదములను విడచి లక్ష్యార్థముచే అద్వితీయాఖండ పరిపూర్ణ సచ్చిదానంద కూటస్థప్రత్యగాత్మయగు నేనే అద్వితీయాఖండ పరిపూర్ణ సత్యజ్ఞానానంద స్వరూప పరమాత్మ యనియు, ప్రత్యగాత్మయే పరమాత్మయనియు, పరమాత్మయే ప్రత్యగాత్మయనియు, అదియే బ్రహ్మమనియు ఐక్యానుసంధానము అస్మి అను పదార్థము ప్రత్యగాత్మ స్వరూపుండనైన నేను పరమాత్ముండనగుచున్నాను. "శృతి॥ అహమస్మి- బ్రహ్మాహమస్మి॥ నేనే బ్రహ్మము బ్రహ్మమే నేను అని [illegible]యవలయును. ఎప్పుడు పరోక్షజ్ఞానముకలుగునో అప్పుడు సత్య[illegible]స్వరూపుడగును. అనృతజడదుఃఖాత్మకమగు ప్రపంచభ్రాంతి నశిం

చును. సత్యముచే అనృతము నశించును. చిత్తుచే జడము ఆనందముచే దుఃఖము నశించును. తుదకు పరబ్రహ్మమే యగును ఈప్రకారము తన్నుదా దెలిసికొనినవాడే బ్రహ్మవేత్త, మృతిలేనివాడగును. వాడే మృత్యువును జయించినవాడు గావున జననమరణభ్రాంతిరహితుడు. మోక్షముకొరకు యితరమార్గము లేదు. కావున ఆత్మ స్త్రీగాదు, పురుషుడుగాదు, నపుంసకుడుగాదు, అట్టిపరమాత్మ పుట్టదు. చావులేనివాడు యెల్లజీవులు అనుభవించుచుండు జననమరణాదులు ఆపరమాత్మకు లేవు. దేహము హరించునుగాని ఆత్మ హరించదు.

శృతి॥ అంతర్బహిశ్చతత్సర్వం వ్యాప్య నారాయణస్థితః॥ ఆపరమాత్మ స్త్రీగాదు. పురుషనపుంసకాదిభేదములు గలవానికే గాని ఆపరమాత్మకు లేవు. ఆపరమాత్మలోనను బైటను సమస్తపదార్థములయందు నిండియున్నాడు పరమాత్మ పరబ్రహ్మమనియు, పరంజ్యోతియనియును, మంగళప్రదయగు మోక్షప్రదమనియనియు వశిష్ఠులవారు శ్రీరామచంద్రుని కుపదేశించెను ఓరఘురామా ఈదృష్టితోడను సంగరహితమగు చిత్తముతోడను సంసారమను అరణ్యమునందు విహరించుచున్నవాడవైనను ఖేదమునొందవు అనుచ గ్రహింపుము. కావున బ్రహ్మజ్ఞాని పరపురుషునియందు మనస్సుగల స్త్రీ గృహకర్మలు జేయుచు లోపల పరపురుషుని ధ్యానించును గృహకృత్యములు చేయునటుల జ్ఞాని పరాత్పరుని చింతించుచు విహరించవలయును

సంపూర్ణమ్



శ్రీరస్తు.

హరిః ఓం తత్సత్ శివః.

శ్రీ సద్గురవే నమః.

# శ్రీ మహాఋషి నిఖంటిత యోగశాస్త్రము.

## కర్మజిజ్ఞాస

—: ధ్రువమహాఋషి శారదకు కర్మజిజ్ఞాస బోధించుట :—

కర్మజిజ్ఞాస భూతభవిష్యద్ వర్తమానకాలములయందు అనగ త్రికాలములయందు ఆత్మానాత్మవివేకపరులై తన్నుతాదెలియవలెను. ఈజన్మజిజ్ఞాస సద్గురుముఖ వివేకజ్ఞానముచేత నరకాల రాక్షసకాల దేవకాలములయందు తన్నుతా తెలిసిన బ్రహ్మవేత్తయైన పరమపురుషుడు తానుయెవరు తనకు జన్మ యేది అని తన్నుతా నెరచుట ఎట్లనిన- జీవబ్రహ్మైక్యసమాధియందు స్వయం ప్రకాశమానంబైన ప్రజ్ఞానస్వరూపంబైన తత్వంబు దాని అవలీలంగని అనగ తన్నుతాదె శి తరది పూర్ణుడై పిదప తరువాత మాయాజడమైన సంసారమునందు జొదినను జెందక అతినిశ్చలమానసుడై తాను అకర్తయై అభోక్తయై, సర్వసాక్షియై, యున్నతాను తన్నుతానెరుచుట ఎట్లనగ- శ్లో॥ ఏకమద్వితీయ మానదీపకం జగద్ధితా, మావవర్జితంవిశుద్ధ, రూపకం పరాత్పరం పాపకృద్భవాదతర్నసాధునైకపాపకం- బ్రహ్మరూపకం స్వరూప. ప్రాపకం గురుంభజే॥ అట్టినిర్మలాత్మయందు, అవికారుడైయ్యు గనకము వివిధాభరణాబులైన విధమున నితడే భువియై రవియై కలియై సర్వాత్ముడై ప్రకాశించుదగన్ నిర్మలంబైన అనగ, పరమాత్మయందు త్రిగుణాత్మకమైన ప్రకృతి తన్ను తామరచి, తనయొక్క శక్తిబలమున ఆత్మశక్తి బలముచేత చంద్రచంద్రికా న్యాయంబున, క్షీరమందు దధిబిందువు ప్రవేశించి అనగ జఠరగర్భగోళమందు బిందురూపంబున ఆత్మ ప్రవేశించి, పంచవింశతితత్వములు చేకూడి, ఆవరణవిక్షేపరూపంబై, మాయాశబలిత బ్రహ్మంబై,

మాయా సమన్వితేశ్వరుడై, జగత్కారణుండై, విశ్వరూపుండై, అధో ముఖవ్యాప్తియై మానుషజన్మంబు ధరించి, తన్ను తా మరచి దేహేంద్రియ ములె తా నని, సర్వేంద్రియ సమన్వితమై, వ్యావహారికజీవుడై, నీవు నేను అనేభేదాభేదములు గలిగి, అజ్ఞానజడమైన పెరుగు తోడుకుని యున్న తాను తన్ను తా తరచుటకొరకు, అనేక జన్మపుణ్యపరిపాకవశమున సద్గురువుల సాన్నిధ్యమందు చేరి, వివేక జ్ఞానమనే కవ్వముచే అనగ, సాధనచతుష్టయ సంపత్తిచేతను, వేదప్రమాణమున, బ్రహ్మసత్యం జగన్ మిథ్యాయనే ప్రమాణమును, శ్రుతి॥ శాస్త్రదృష్ట్యా, గురోర్వాక్యా, తృతీయం ఆత్మనిశ్చయం॥ అనేప్రమాణముచేత తన్నుతాతరచి అనగ, అధ్యాత్మతత్వసాంఖ్యశాస్త్రము విచారించి, తానుసాక్షియై, పాలుపెరుగై తరచంగ యానవనీతము, ఇక యెన్నడైన చల్లలోగలయునా కలవదనుట యెట్లనగ తన్నుతాదెలసి తాను పంచవింశతి తత్వములుగానని- "ఆత్మపంచకం నాహం దేహో నేంద్రియాణ్యంతరంగం నాహంకారః ప్రాణవర్గోనబుద్ధిః దారాపత్యక్షేత్రవిత్తాదిదూరః సాక్షి నిత్యఃప్రత్యగాత్మాశివోహం" అద్వైతతారకోపనిషత్-"ప్రభాసూన్యం మనసాసూన్యం బుద్ధిసూన్యం నిరామయం సర్వసూన్యం నిరాభాసం సమాధితస్య లక్షణం॥ అస్యజ్ఞానం నాస్తిజన్మప్రవృధిర్నాస్తి జ్ఞప్తిసర్వానిత్యవాక్యం భక్తి జ్ఞానాతీతం భక్తిజ్ఞానేనకర్మ శక్తిర్నాస్తి సర్వవ్యాప్తం సచ్చిదానందరూపం ప్రకృతిపురుషోన కూటస్థానచాత్మా ఇత్యాదిపాఠః పూర్వోన్నిరాఖ్యః సాధనాంతరనిరపేక్షస్స్వగతఆపరిచ్ఛిన్నశ్శివవర్గోపశివ్యతె అవస్థాత్రియసాక్షిణాంప్రత్యగ్భిన్నపరమాత్మనె పంచకోశవినిర్ముక్తం పంచకోశవివర్జితం పంచభూతాది సంగత్వంన ఏవపరమశ్శివః॥ శ్రుతి॥ దేహోదేవాలయప్రోక్తోజీవో దేవసనాతనః దేహమనేఘటమందు దేవుడువున్నాడు. దేహమే దేవాలయం దేహమందు యున్న ఆత్మజ్యోతియె దేవుడు గావున దేహమనేఘటమందు దేవుడువున్నాడు గనుక యీదేహమందు తరచవలెను యీఘటమందు తరచిన వెన్నయనే నవనీతమనే ఆత్మ బైలుబడును కావున సద్గురువాక్యమనే వివేకజ్ఞానమనేకవ్వముతో తరచిన నవనీతమనేసారము శేషించును. దీనినినే వేదశ్రుతి ఆపోజ్యోతిరసోమృతం బ్రహ్మ బ్రహ్మభూర్భువస్సువరోం॥ అని వేదశ్రుతి॥ చెప్పుచున్నది. కావున నిత్యానిత్యవివేకజ్ఞానముచేత సాంఖ్యశాస్త్రంఅధ్యాత్మతత్వమును తన్ను తాతరచిన బ్రహ్మనందసారమనే అమృతముదిగులును. కావున అమిగిలినదే

సర్వసాక్షి బ్రత్యభిన్నపరమాత్మయని వేదవేదాంతోపనిషత్తులు చెప్పుచున్నవి గావున పై వుపనిషత్ ప్రమాణములే సాక్షి గావున శృతి॥ అథాతో బ్రహ్మ జిజ్ఞాస॥ అనున్యాయమున మిగిలిన తన్నుతా తెలియుట అథాతోబ్రజిజ్ఞాసనిత్యము చేయుటె జీవన్ముక్తి ఇట్టి జీవన్ముక్తులయొక్క అనుభవము శాస్త్రగురు ఆత్మనిశ్చయముచేత తా తెలియవలెను.

ప్రకృతిపురుషసంయోగంబున మదించగ అనగ తరచగ శేషించిన పదార్థం బ్రహ్మపదార్థమే. అనగ అనంతకోటి జీవరాసులకంటె మానవజన్మ గొప్పదైనందున సాంఖ్యశాస్త్రముకుబట్టి 8400000 కోట్ల జీవరాసులకంటె అధికమైనజన్మ మానవజన్మ గావున శ్లో॥ ఆహారనిద్రాభయమైథునానిసమా నమేతత్ పసుభిర్నరాణాం జ్ఞానం నరాణాం మధికోవిశేష॥బ్రహ్మోపనిషత్॥ అనంతశాస్త్రం బహువేదితవ్యం అల్పశ్చకాలోబహవశ్చవిఘ్నాః యత్సారభూ తం తదుపాశితవ్యం హంసోయథాక్షీరమివాంబుమిశ్రితం॥ సమస్తశాస్త్రసారం బైనదే ఆత్మస్వరూపం. సర్వశాస్త్రములయందు చెప్పబడిన ధర్మమే సారమే మానుషజన్మ. ఈజన్మలోనె తానుయెవరు అని తన్ను తాదెలియుట సారవం తమైన నిర్మలంబైన పాలు పరమాత్మస్వరూపం వివేకజ్ఞానమైన హంసయున్ను అజ్ఞానజడమైన పంచవింశతితత్వాత్మకమైన కొంగయున్ను అనగ అజ్ఞానజడమై దేహాభిమానియైన సంసారి జీవుడున్ను స్వవిలక్షణ స్వరూపమైన బ్రత్యగ్భిన్నపరమాత్మ స్వరూపమున్ను యీరెంటియొక్క భేదమును విడదీయు టకు హంసకే వివేకజ్ఞానముకలుగును గాని కొంగకు కలుగనేరదు. కావున ఆహారము నిద్ర భయము మైథునము అనంతకోటిజీవరాసులకు సమానమేగాని మానుష్యజన్మమునకుమాత్రం జ్ఞానం అధికం గాబట్టి శృతి॥ వజ్రం వజ్రేనభిద్య తే॥ వజ్రం వజ్రంచేతనే కోయవలెనేగాని యితరరాళ్ళచేత కోయబడదు గావున శృతి॥ జ్ఞానేనజ్ఞేయమాలోక్యపశ్చాజ్జ్ఞానం పరిత్యజేత్॥ జ్ఞానముచేత విజ్ఞానమనే బ్రహ్మమును తెలియవలెను. గాబట్టి తన్ను తాతరచవలెను. తన్నుతా తరచు టతారకము. తన్నుతాతరుచుటచేత మిగిలిన నవనీతం అనగ పరమాత్మస్వరూ పం బ్రత్యగ్భిన్నపరమాత్మె తానని తెలియుటే తారకం. ఘటము ఉచ్ఛ్వా సనిశ్వాసరూపమైన హంసయనేతాడు ప్రజ్ఞానస్వరూపమనే ఆత్మ యనే పాలు ఆత్మానాత్మవివేకజ్ఞానమనే బుద్ధిచే తరచిన వెన్నయనే బ్రత్యగ్భిన్న పరమాత్మ యనే సాక్షియైన తాను వేరై కేవలపరబ్రహ్మమె నెయ్యిఅయి జీవబ్రహ్మైక్య

ఆరూఢనిర్బీజసమాధియందు తానుతానై యున్న పరమాత్మ పరిపూర్ణుండై యున్నది గానబట్టి తనలోతానే తెరచవలెను. తన్నుతా దెలియవలెను గురుముఖ వివేకజ్ఞానముచేత తనలోన అమృతమున్నదిగావున మేధావియైన ధీమంతుడు తన్నుతా దెలిసి తానుతానై పునరావృత్తి రహితుండై చిత్తవిశ్రాంతిగలిగిన పరమపురుషుడు తానే పరమాత్మయని ఎరింగి తన్నుతా తెరచి శరీరాత్మలు తాగాక వేరైనవిధమున బృహదారణ్యోపనిషత్తు చెప్పినప్రకారము జగత్ మిథ్యయనియు నిజమైన పరమాత్మస్వరూపమే తాననియు దృఢపడిన జీవన్ముక్తునియొక్క అభిప్రాయము యెట్టిదనిన- నిరంజనోపనిషత్ "సాధనాంతరని రపేక్షసప్రకాశమనామయం పదార్థభానకత్వం చ నిత్యం వదతిసన్మాన శ్రవణం చ గురోర్ పూర్వ్యంమననంతదనంతరం నిదిధ్యాసనమిత్యేత త్పూర్ణబోధస్యలక్షణం" జీవన్ముక్తుని లక్షణముగాబట్టి స్వభావగుణమునందు చిత్స్వరూపము మినహాగా వేరేవస్తువు లేకపోయినా వ్యవహారికజ్ఞానమందు మాయాకల్పితముగా జీవుడని ఈశ్వరుడని యిరువురు గలరని సాంఖ్యశాస్త్రము చెప్పుచున్నది. వీరిలో సృష్టి మొదలైనవాటిని చేయువాడు ఈశ్వరుడు. జాగ్రత్తమొదలు మోక్షపర్యంతము గలిగిన సంసారమును నిర్వహించెటివాడు జీవుడు. ఈ బృహదారణ్యోపనిషత్తునందు "క్షేత్రజ్ఞం చాపిమాం పురుషం" క్షేత్రజ్ఞుండేపురుషుడని చెప్పుచున్నది అధిష్ఠానచైతన్యముతోగూడిన జీవుని పురుషుడని చెప్పుచున్నది ఈఆత్మే అహం అనగ నేను అనేవ్యవహారశబ్దమునకు వ్యవహారికజీవుడని కించజ్ఞుండని కార్యోపాధియని శృతి॥ కార్యోపాధిరయంజీవః కారణోపాధి యీశ్వరః॥ ఇత్యాదిగీతావచనములు చెప్పుచున్నవి. శృతి॥ అహంకారోజీవః॥ జీవశబ్దవాచ్యుండు "సఏషఆత్మైవపురుషః" యీఅహంకారియే పురుషుడు జీవుడు క్షేత్రజ్ఞుడు గావున యీజీవుడుని అధిష్ఠానమునకు కూడా చేర్చవచ్చునా అనగ అధిష్ఠానము మినహాగా ఆరోపితమునకు వేరే స్వరూపము లేనందువల్లన వ్యవహారమునందు యిరువురును నొక్కటిగా తోచుటవల్లను ముక్తియందు ఆరోపణము అధిష్ఠానమాత్రముగా పోవుటవల్లను యీజీవేశ్వరుల రెండిటినిచేర్చి చెప్పుచున్నవి. గీత "ఉపాధిద్వయం క్షేత్రక్షేత్రజ్ఞద్వయం క్షరాక్షరద్వయం" గీత "క్షేత్రక్షేత్రజ్ఞ యోరన్యః నామరూపస్వరూపవత్" యిట్లు యీజీవేశ్వరద్వయం వొక్కటై వ్యవహరించుచున్నది. దీనినే వ్యవహారికజీవేశ్వరోపాధియని చెప్పుచున్నవి. ఈఆత్మ అధిష్ఠానప్రధాన

ముగ యెటువలె వ్యవహరించును. ఆరోపితప్రధానముగ యెటువలె వ్యవహరించును. అనగ శృతి॥ అధిష్ఠానచైతన్యం ఆత్మవై పురుషః॥ అధిష్ఠానము ఆరోపితమందు అణగియుండు కాలములో, వొక్కటిగా నేను సంసారినియని చెప్పుచున్నది ఆరోపితముత్రోసి అధిష్ఠానమె తానుగా చూచునపుడు నేను అసంగుడను చిన్మాత్రస్వరూపుండను అనేనామంకలిగినది ఎట్లనిన, బృహదారణ్యోపనిషత్తు "రజ్జుర్ సర్పభ్రాంతి వత్సర్వంజగత్" ఆత్మపంచకమందు "రజ్జుర్జ్ఞానాత్ భాతిరజ్జుర్ యదాహిస్వాత్మజ్ఞానాదాత్మ నోజీవభావః అప్తోక్త్యాహిర్ భ్రాంతి నాశేసరజ్జుర్ జీవోనాహం దేశికాక్త్యాశివోహం దత్తాత్రియోపనిషత్ ఊషరాంబువత్సభూతరజ్జు సర్పవత్తథా యుహ్యామానదుర్మదె భవారణం ప్రతారణం వాసవానిరాసకం సుఖాసనప్రభాసకం బ్రహ్మరూపకం స్వరూపం ప్రాపకం గురుంభజే" ఇది అధిష్ఠాన ఆరోపితంబైనది గావున అహం నేను అసంగుడను అకర్తను అభోక్తను అయిన నాకు అహంకారంకూడి వుండవచ్చును. ఎట్లనిన అహంకారం మూడువిధములైయున్నది. ఎవ్వియనిన-

1 ముఖ్యాంశఅహంకారమనియు,

2 అముఖ్యాంశఅహంకారమనియు,

3 ముఖ్యాముఖ్య అహంకారమనియు మూడువిధములుగలవు. అందు అధిష్ఠాన అహంకారములను ఖంచిపెట్టిచూడక అజ్ఞాన మూఢులు వొక్కటిగా నేనువచ్చితిని నేనుపోతిని. నేనుకర్తను. నేనుభోక్తను నేను సుఖమును పొందుదురు. నేను దుఃఖమునుపొందుదును నేను జ్ఞానిని నేను అజ్ఞానిని. అహం గురువు అహం శిష్యః బృహద్వాశిష్ఠ "యద్యద్వదతితత్సర్వత్సర్వం సూక్ష్మం యదత్" అహంకర్తఅహంభోక్త అహంజ్ఞాని అహంఅజ్ఞాని అహంగురుః అహం శిష్యః అహందుఃఖ అహంసుఖ అని చిధాభాసులుగా వ్యవహారికవార్త మాటలాడుదురు. కావున ఇదిముఖ్యఅహంకారము.

(2) లక్షణావృత్తిచేతను తన్నుతాతరచిన జ్ఞాన తన్నుతాదెలసినజ్ఞాని విచారించి చూచిన అహం నేను చిన్మాత్రుడను అని దేహేంద్రియ సమ్మన్వితుడను దేహాభిమానినైన అహం నేను చిదాభాసుడననే అహంభావమ్ముచేత వ్యవహరించుచున్నానని వార్త మాటలాడుట అముఖ్య అహంకారము.

(3) తాను చిన్మాత్రస్వరూపముగానుండి వ్యవహారమ్ములో అహం నేను

వచ్చితిని నేను పోతిని అని చిదాభాసునివలె మాటలాడుట ముఖ్యాముఖ్య అహంకారము గాబట్టి,

జ్ఞాని- అజ్ఞాని అనే యిద్దరున్ను అహం నేను అనే చిదాభాసు లెట్ల యిరి. అనగ జ్ఞానాజ్ఞానములు రెండున్ను దేహాభిమానియైన చిదాభాసులే ఐనట్లయితే. తనుకు అనగ క్షేత్రక్షేత్రజ్ఞులకు జ్ఞాన- అజ్ఞానులకు విలక్షణము గా నుండు ప్రత్యగాత్మ స్వరూపమైన సాక్షి తానని యెట్లు అను కొనవచ్చును. ఆభాసముఖమునకు తనముఖమునకు దర్పణమునందు ప్రతిఫలించిన ముఖము అనగ ముఖము మాలిన్యంబైన అద్దము మాలిన్యంబగును గావున ముఖము స్వభావముగా నిర్మలమైనదై యున్నది అట్టిముఖము అద్దమందు ప్రతి బింబించినప్పుడు స్వభావముగానే యున్నది కావున తనముఖము దర్పణము నందు ప్రతిబింబించిన చిదాభాసుడు గావున ఆభాసముఖమునకు దర్పణము నందు ప్రతిఫలించిన ముఖము స్వభావముగాక యెటువలె నైతే దర్పణమును చూచిన ముఖము యేస్వభావమో ఆప్రకారమే చిదాభాసుడుగా నుండు తాను మిథ్యయైనందువల్లను శృతి॥ అనిత్యాని శరీరాణి॥ అన్నట్లు సాక్షిగా మిగి లిన ప్రత్యగాత్మే స్వభావమైనందువల్లను తనయొక్క స్వభావ చైతన్యమునే నిజమైన పరమాత్మనేనని తెలియవలెను.

ఆచిదాభాసుడు మిథ్యయైన పట్ల ఆతనికి ఆ చిదాభాస జీవుడుచేత అను సంధానము చేయబడిన జ్ఞానము కూడా మిథ్య కావలయును. కాబట్టి అది ఆచిదాభాస జ్ఞానము సంసారదుఃఖమును యెట్లు పోగొట్టును. పోగొట్టుటకు ఈజ్ఞానము మిథ్యయైనా యుండుచేత చిదాభాసునకు మునుపుండిన అనగ తెన్ను తా తెలియకముందు వుండిన సంసారదుఃఖము మిథ్యయైనందున ఆసం సారదుఃఖము పోగొట్టుటకు యీ జ్ఞానమే చాలును గాని చిదాభాసుడైన జీవుడే వ్యవహారిక పరుడని యెరుగవలయును. ఇకను ఆత్మ నేనే యని యెరుగుట యెట్లనిన- సందేహ విపరీతములు లేక దేహమే తా నని యుతిస్థిర రీతిగా సాక్షియైన ప్రత్యగాత్మయే తా ననెడు దృఢజ్ఞానమే కావున యీపరమాత్మే తాను అనే శబ్దము ప్రత్యక్షమే గదా. అనగ అపరోక్ష సాక్షాత్కారము శృతి॥ అపరోక్షం బ్రహ్మవిజ్ఞానం శబ్దం దేశికపూర్వం బుద్ధిపూర్వ కృతం పాపం కృత్స్నన్ దహానివహ్నివత్॥ ఈ ఆత్మ తన్ను తా తెలియకపూర్వము పరోక్షముగా వేరుగా నుండును. శృతి॥ పరోక్షం బ్రహ్మ

విజ్ఞానం శబ్దం దేశికపూర్వకం బుద్ధిపూర్వకృతం పాపం కృత్స్నం దహాని వహ్నివత్। అయితే యీ ఆత్మస్వరూపుడు గతమందు పరోక్షముగా నుండడ మెట్లు.

చిన్నకథ సామ్యమురీతిగా, పరమానందాయగారి శిష్యులలో పదియవ వాడైన దశముడుకి తనయందు తనకె ౧ అజ్ఞానము ౨ ఆవరణము 3 విక్షే పము ౪ పరోక్షము ౫ అపరోక్షము ౬ దుఃఖనివృత్తి ౭ ఆనందావాప్తి అని సప్త అవస్థలు చూచినరీతిగా ఆత్మయందు సప్తావస్థలును కూడియున్నవి. కాబట్టి దశమునియందు అనగ పదియవవాని యందు అనగ జ్ఞానమందు అనగ ఆత్మయందు సప్తావస్థలు అనుభవముగా వున్నట్లు చూచుట యెట్లు అనగా,

(1) పదియవవాడు తొమ్మండుగురు మనుష్యులను లెక్కపెట్టి పదియవవానిని గానక అదరిపడి భ్రమపొందినదె అజ్ఞానము.

(2) పదియవవాడు కానరాడు వాడు యెక్కడకు పోయెనో అనే విమర్శయే ఆవరణము.

(3) నదిలో పోయెనని రోదనము చేసి యేడ్చుటయే విక్షేపము.

(4) ఆప్తుని మాటవిని స్వర్గాదిలోకములవలె పదియవవాడు యున్నాడని యెరుగుటయె పరోక్షజ్ఞానము.

(5) నీవే దశముడు అని ఆప్తుడు లెక్కపెట్టి చూపగ నేనని తెలిసి కొనుటదె అపరోక్షజ్ఞానము.

(6) మునుపు నదిలో మృతమై పోయినాడని రోదనచేసి దుఃఖపెట్టు టదే దుఃఖనివృత్తి.

(7) పదవవానిని తన్ను తా జూచిన సంతోషమే ఆనందావాప్తి. ఇటువలెనే,

(1) అంతరార్థం యెట్టులనిన- ఇట్లనె ఆదిబాభాసుకన పంచవింశతి తత్వాత్మకుడన ఆభాస వ్యవహారిక జీవుడు అనాది సంసారదుఃఖమును మునింగి తన్ను తా తెలియనేరక తన స్వభావమును విచారించక దేహాత్మబుద్ధిచే తన్ను తా మరచి తెలియక వుపేక్షించినదే అజ్ఞానము.

(2) ఆమార్గమందు విచారించి ఆత్మయున్నట్టులైతే తోచదా లేదని చెప్పుట ఆవరణము. తాను పరమాత్మైతే తన్ను తా తెలియదా యనుట ఆవరణము.

(3) స్థూలసూక్ష్మ కారణ శరీరత్రయములను చిదాభాసజీవునిగా జూచి నదే తన్ను తాన జీవునిగా చూచినదే విక్షేపము.

(4) సద్గురుండైన మహాదేవాచార్యుండైన నారాయణ స్వరూపుడైన అప్పునిచేత బ్రహ్మముగలదని తన్ను తా దెలిసినదే తాను వేరు బ్రహ్మము వేరు జీవుడు బ్రహ్మము అభేదభావముగా చూచినదే శాస్త్రం. గురువాక్యంచేత తెలిసినదె శృతి॥ శాస్త్ర దృష్టం గురోర్వాక్యం- చేత బ్రహ్మమును తెలియడమే పరోక్షజ్ఞానం

(5) శృతి॥ తృతీయం ఆత్మనిశ్చయం॥ వేదాంత విచారణముచేసి ఆపర బ్రహ్మమే తానని తెలియుటమే తాను తానైనదే అపరోక్షము.

(6) నేను కర్తను నేను భోక్తను నాస్తి కర్తృత్వం నాస్తి భోక్తృత్వం లేకపోయినదే దుఃఖనివృత్తి.

(7) చేయువలసిన దంతయు చేసి తీరవలయును. పొందవలసిన దంతయు పొందబడెను. అను సంతోషమే ఆనందావాప్తి జీవబ్రహ్మైక్యజ్ఞానమే ఆనందము

ఇట్లు చిదాభాస వ్యవహారిక జీవునికి యీసప్తావస్థలు గలవని వేదాంతశాస్త్ర యుక్తిమత్ ప్రమాణములు చెప్పుచున్నవి.

ఈసప్తావస్థలలోను బాధములగు అవస్థలు యేవి మోక్షమునిచ్చు అవస్థలు యెవ్వి అవి సవిస్తరముగా చెప్పవలయును.

మొదట మూడవస్థలు బాధహేతువులు.

తరువాత నాలుగవస్థలు మోక్షహేతువులు.

(1) ఆత్మను నేను యెరుంగను అనే ఉదాశీనము అనగా అజ్ఞానముచేత వచ్చిన అర్థము అనర్థము యీ అర్థమార్గమందు విచారించిచూడగ కూటస్థుడు వుండినయట్లు తోచకపోవును అన విపరీతార్థము ఆవరణముచేత వచ్చిన శరీరములో వచ్చిన అనర్థము. ఇహపరలోకములను గూర్చి కాంక్షతో యుండి చేయుకార్యములన్నియు మనయొక్క వ్యాపారములు గనుక పుణ్యపాపములు చిదాభాసుడైన జీవుని విడువనేరవు అనేదిగులు విక్షేపముచేత వచ్చిన అనర్థం గనుక యీమూడు అవస్థలు అనర్థకములు కలుగజేయుచున్నవి. గీతా వచనాత్ గుణాణావర్ణత్యాగో విశేషపరహితం సదా శృతి॥ అజ్ఞానమూల కారణం జన్మకర్మనివారణం॥ శృతి॥ అనేక జన్మసంప్రాప్తి జన్మకర్మవిదాహినః॥ అనునట్లు గీతావచన శృతివాక్యములు చెప్పుచున్నవి. అజ్ఞానము ఆవరణము

విక్షేపమునకు మునుపటి అవస్థలై నప్పటికి సప్తావస్థలు ఆచిదాభాస వ్యవహార జీవునకు యెట్లు చెప్పవచ్చును. చంద్రచంద్రికా న్యాయంబున విక్షేపశక్తి కార్యముగా పరిణమించుటకు మునుపు కారణరూపముగా పరబ్రహ్మమునందు ఆరోపించెను. ఆచిదాభాసునియందు మునుపటి రెండుఅవస్థలు వుండినవిగనుక సప్తావస్థలు చిదాభాస వ్యవహారిక జీవునకే గాని పరమాత్మయైనతాను సర్వసాక్షి ప్రత్యగభిన్న పరమాత్మ గావున తనకు లేవు పూర్వపుమహాత్ములందరు శృతి స్మృతులు మొదలైనవి అన్నియు అజ్ఞానావస్థకు ఆధారము చిదాభాసుడనే జీవుని చెప్పక బ్రహ్మమని యెందుకు చెప్పుచున్నవి ఆరోపితంబైన చిదాభాసునకు అధిష్ఠానము బ్రహ్మమైనందువల్ల అంతయు పరబ్రహ్మమునందు ఆరోపితము గావున శృతి॥ రజ్జుసర్పభ్రాంతి వత్సర్వంజగత్ ॥ సర్వశాస్త్రానుభవము చేత అనగ శృతి॥ శాస్త్రదృష్టం గురోర్వాక్యం తృతీయం ఆత్మనిశ్చయం॥ అను అనుభవముచేత జాగ్రత- స్వప్న- సుషుప్తి అవస్థలన్నియు చిదాభాసునకే గాని ఆత్మకు లేవు అని చెప్పియున్నవి ఈసప్తావస్థలు చిదాభాసుండైన జీవునియందు గలిగినవన్ని లేనివన్ని కూడా చెప్పియున్నవి. ఎట్లనిన నేను సంసారిని నేను పరోక్షజ్ఞానిని నేను విజ్ఞానిని నేను సుఖదుఃఖములు లేనివాడను నేను కృతకృత్యుండను అనే విక్షేపములు మొదలుగా గల అయిదు అవస్థలును చిదాభాసుడే అవి అనుభవించెడి అనుభవము చూచితిమి. ఇక పైగ నాలుగు అవస్థలు మోక్షమును యిచ్చే మార్గము గావున పరోక్షజ్ఞానముచేత సప్తావరణములు నష్టమైపోవును. అపరోక్షజ్ఞానముచేత చిత్తు అనే ఆవరణము మూలాజ్ఞానముతో కూడా నశించినందువల్ల బ్రహ్మమే నేనని బట్టబైలుగా దోచును గావున ఆరోపింపబడిన జీవత్వము నష్టమగును కాగాన కర్తృత్వము మొదలైన సకలదుఃఖములున్ను సకలసంసారమున్ను నివర్తియగును పిదప నేను నిత్యతృప్తుండననే గంభీరముచేత అత్యంతానందము వచ్చును. ఈప్రకారము మిగిలిన నాలుగు అవస్థలును మోక్షమును యిచ్చు క్రమ మెట్లనిన- బ్రహ్మ స్వయంప్రకాశమైతే పరోక్షజ్ఞానమునకు విషయము యెట్లు కనుబడును అనగ బ్రహ్మము గలదనియు ప్రకాశించుటచేతను గావున స్వయంప్రకాశమైతే తానై ప్రకాశించును గాని బ్రహ్మము వేరైయున్నదని ప్రకాశించుట యెందుకు గనుక యీపరోక్షజ్ఞానము అనుభవ ప్రమాణముగాదు, ఈపరోక్షజ్ఞానము అప్రమాణము అని చెప్పుట కారణమేమనగ- యీపరోక్ష

మునకు నాలుగుదోషములు గలవు. అవి యెవ్వియనిన మొదట నిర్ణయము నకు నాశనము కన్నులారా చూడకయుండడము తారుమారుగా వినుటయున్ను ఏకముగా మాత్రము చూచుట యీనాలుగు దోషములలో ఒక్కటియైనా చూచినా అప్రమాణమని చెప్పవచ్చును. పరోక్షజ్ఞానమునకు యీనాలుగు దోషములు లేవు. ఈనాలుగు దోషములున్ను పరోక్షజ్ఞానమునకు లేవని చెప్పుట యెట్లు. కావున పరబ్రహ్మము లేదని యొక శ్రుతి ప్రమాణమైనా లే నందువల్ల నిర్ణయమునకు నాశనములేదు. నిరాలంబోపనిషత్- అకుతో జగన్నాస్తి ప్రత్యక్షో జగత్ నహి సర్వదా భేదకలనం ద్వైతాద్వైతం నవి ద్యతే॥ కన్నులతో జూడనందున పరోక్షజ్ఞానము అప్రమాణమని అందురు. కాని అయితే స్వర్గాదిభోగములు లోకములును అప్రమాణము గావలెను. కావున ప్రత్యక్షము కానిది పరోక్షము అని చెప్పినందువల్ల భ్రాంతియని చెప్ప కూడదు గావున ఏకముగ చూచినందువల్ల అప్రమాణమని చెప్పినచో ఘట పటాది జ్ఞానముకూడా భ్రాంతియేకదా అనగ దృశ్యమంతయు భ్రాంతియే కదా. అట్లు కాదుగనుక పరోక్షబ్రహ్మసాక్షాత్కారమునకు కూడ భ్రాంతి లేదని చెప్పుచున్నది. కావున పరోక్షబ్రహ్మసాక్షాత్కారముకూడా భ్రాంతి ఆరోపణ లేదని కాదని చెప్పవచ్చును ఎట్లనిన దృశ్యము- దృక్కు- యీ రెంటి విచారణచే తన్ను తా విచారించినయెడల పరోక్షబ్రహ్మసాక్షా త్కారముగలుగును గాన పరోక్షజ్ఞానమునకు ఏదోషమున్ను లేదు. కాబట్టి నిరంజనవస్తువయందు లేనికల్పన యెట్లు వచ్చును అనగ బ్రహ్మమందు భ్రాంతి యెట్లు కల్పింపబడును. శ్రుతి॥ అధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్ర పంచ్యతే॥ శ్రుతి ప్రమాణములు చెప్పుచున్నవి. స్వభావముగ లేకపోయినా తోచబడిన వుపాధివశమున రావచ్చును. ఎట్లనిన

శ్రుతి॥ వంధ్యాపుత్రో పత్సర్వం జగత్॥ గొడ్డురాలికొడుకు లేనే లేడు. ఒకప్పుడు పుట్టలేదు. ఒకప్పుడు పోనూలేదు. కావున లేనిదే వున్న తనయందు తోచబడెను.

శ్రుతి॥ మృగతృష్ణజలం పీత్వాతృప్తిశ్చేద త్వదంజగత్॥ మృగతృష్ణికల యందు నిగనిగ దోచు నీరు జగదాభాసము గావున లేనిదిలేనట్టెవున్నది వున్నట్టే యున్నది గావున వున్న తానైన పరమాత్మయందు వున్నది లేనట్టుగ తోచ

బడిన వుపాధివశమున జగదాభానము సర్వారోపితమైన జగద్భ్రాంతి. కాబట్టి జీవబ్రహ్మలకు భేదములేదని సర్వశాస్త్ర సారాంశమైన వేదాంతోపనిషత్సారములు శృతి స్మృతులు ఘోషించుచున్నవి. కాబట్టి అయితే యీవుపాధి యెట్లునివర్తింమను అనగ యీఅధ్యారోపోపాధియైన జీవభ్రాంతి యెట్లు నివర్తించును అనగ పరోక్షజ్ఞానం చేతను సత్వావరణము నివర్తియగును. యజ్ఞవరాహోపనిషత్ శృతి॥ పరోక్షం బ్రహ్మజ్ఞానం శాబ్దం దేశికపూర్వకం బుద్ధిపూర్వకృతంపాపం కృత్స్నం దహానివహ్నివత్॥ అపరోక్షం బ్రహ్మవిజ్ఞానం శబ్దం దేశికపూర్వకం సంసారకారకాజ్ఞానం తమశ్చండ భాస్కరః॥ ఇత్యాద్యుపనిషత్ ప్రమాణములు ఘోషించుచున్నవి. కాబట్టి యీసత్వావరణమనే వుపాధినివృత్తియైన యెడల అపరోక్షజ్ఞానమునకు భంగంగలుగును గదా యెట్లనిన పైనవుదహరించిన ప్రకారము పరమానందాయగారి శిష్యులలో పదిమంది గంగాతీరమునకు పోయి అందులో నకడు నదిలో పడిపోయెననే భ్రాంతి దుఃఖం అపభ్రమ అనగ వున్నదే లేనిదనే అపభ్రమ లేని జగద్భ్రాంతి నిమిత్తమై దుఃఖంచి కంగారుగా గాబారుపడుట అపభ్రమ అనగ శృతి॥ అపభ్రమ శానమస్తానాం జీవానాం భ్రాంతిచేతసాం॥ అని యిత్యాది శృతి ప్రమాణములు చెప్పుచున్నవి. కావున అపరోక్షజ్ఞాన బ్రహ్మసాక్షాత్కారమునకు అధ్యారోపోపాధి ఆరోపించిన అపభ్రమ హానిగలుగదా యనిన యెట్లనిన- పదియవవాడు తానైన వెనుక అనగ తన్ను తా దెలిసిన వెనుక తాన బ్రహ్మనని జగద్భ్రాంతి మిధ్య యని సర్వమును బ్రహ్మమని చూచు శాంతినిధికి మునుపు చూచిన తొమ్మిది మంది మనుష్యులలోను తాను లేదని చూచినట్టుగ తన్ను మరచి నట్టుగ అనగ తన్నుమరచి దృశ్యము చూచుచున్నట్టుగ జీవాత్మయే పరమాత్మయని దెలసినట్లుగ తాన పరమాత్మయని దెలసినట్లుగ అనగ ఆత్మే బ్రహ్మమని దెలసినపిదప తాను బ్రహ్మమని తెలియకపూర్వము తన్ను మరచి నప్పుడు మునుపు తన కన్యముగా చూచి ప్రకాశించిన అహంకారము తాను గాదని తోయబడును. కాని మహావాక్య రత్నావళియందు "నేతి, నేతీతి, నేతీతి శేషితం పూర్ణముచ్యతే పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదీరితం పూర్ణశ్యపూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే"అని యిత్యాది ప్రమాణములు చెప్పుచున్నవి. సర్వము తాను గాదని కడదొరిచి శేషించిన పదార్థం బ్రహ్మమే యని ఆబ్రహ్మమే తానని తనకన్నా అన్యము లేదని మరియు తన్నే తా

లెఖగా చూచుకుని మిగిలినది తాన బ్రహ్మమని శేషించినది శృతి॥ యదృశ్య భావనానాస్తి దృశ్యమేవ తద్వినశ్యతి- యదృశ్యం తన్న స్యం॥ అను నట్లు "యద్ధ్య ద్వదతి తత్తత్సర్వం స్వాప్నం" అనునట్లుగ తాను అనే జీవభ్రాంతి తోచియు బడునే గాని తానే బ్రహ్మమనే అపరోక్ష బ్రహ్మసాక్షాత్కారమునకు భంగ ము గలుగనేరదు. కాబట్టి యీప్రకారముగా పరోక్షజ్ఞానము అనగ పరోక్ష బ్రహ్మసాక్షాత్కారమునకు అవాంతరవాక్యముచేత వచ్చునదియు వున్న దాని యందు లేని సర్వారోపణయనే జగద్భ్రాంతి అవాంతరముగా తోచబడునని యు ఆవెనుక మహావాక్య విచారణచేత అపరోక్ష బ్రహ్మసాక్షాత్కారము గలుగుననియు శృతి స్మృతిపురాణమత్ ప్రమాణములు చెప్పుచున్నవి. కావున ఒక చిన్న యితిహాసము దృష్టాంతరముగా చెప్పుచున్నది. అప్రమయనే అధ్యారోపజగద్ భ్రాంతి యెట్టిదనిన- కరచరణ విహీనుడనే అశరీరుడనే వంధ్యాపుత్రుడు శశవిషాణ ధనధరుండై మృగతృష్ణలో నీరు ద్రావి, గంధర్వ నగరం మీదికి యుద్ధానకు పోయి గగనపుష్పము సాధించుకుని వచ్చి పుత్ర కన్యనే స్త్రీకి యివ్వగ అంధుడగు గుడ్డివాడు చూచి వినపడని చెవిటివాడితో చెప్పగ తలలేని మొండిమెడవాడు శిరఃకంపముచేసి నవ్వినట్లుగ జగద్ భ్రాంతి తోచుచున్నది. కాబట్టి అధ్యారోపోపాధి తన్ను తా విచారించి చూడగ తానె బ్రహ్మమని అంతా తానేయని తనకన్నా అన్యము లేదని జీవబ్రహ్మైక్యజ్ఞానము నిత్యమై నిలచును ఎట్టులనిన- ఉద్దాలకుడు శ్వేతకేతునకు ముందర పిపీలికా మార్గమనే పరోక్షజ్ఞానము బోధించెను వెనుక తొమ్మిదవసారి అపరోక్ష బ్రహ్మసాక్షాత్కారము చెప్పినాడని సామ వేదమందును చెప్పుచున్నది. వరు ణుడు భృగువునకు ముందర పరోక్షజ్ఞానమును బోధించి అనగ శాస్త్రదృష్టం గురోర్వాక్యం తృతీయం ఆత్మనిశ్చయ మును బోధించి పిమ్మట అపరోక్ష సాక్షాత్కారమును బోధించెనని యజుర్వేదమందు చెప్పి యున్నది. దేవేంద్రుడు ముందుగా అవాంతర వాక్యమును అనగ అధ్యారోపాపవాదము ను బోధించి బ్రహ్మమును పరోక్షముగా దెలసెను. వెనుక అప రోక్ష సాక్షాత్కారమును తన్ను తా దెలిసినాడని ఋగ్వేదమందు చెప్పు చున్నది. ఈప్రకారమె శ్రీశంకరాచార్యులవారును త్రిభాష్యముల వాక్యాను భవమునందు చెప్పియున్నారు. అపరోక్ష బ్రహ్మసాక్షాత్కారముచేతను మహావాక్యార్థానుభవంబు చేతను గలుగునని చెప్పియున్నారు. అహంకారము

కూటస్థునున్న త్వంపదానికి అర్థము గావున పరోక్షమైన మాయోపాధికముగా నుండు, జగత్కారణ చైతన్యము తత్పదానికి అర్థము. కావున యీరెంటిలో అహంకారమైన కూటస్థును త్వంపదము పరోక్షమైన మాయోపాధికముగా నుండు జగత్కారణ చైతన్యము తత్పదమనియు చెప్పియున్నది ఈరెంటిలో విరోధాంశములను త్రోశివేశినవాడె వీడు- వీడె వాడు- అనే లక్షణముచేత అనగ కూటస్థుడే బ్రహ్మము బ్రహ్మమె కూటస్థుడ అని తన్ను తా తెలియ గాని యిదివరకు నేను బ్రహ్మముగాదనిన బుద్ధియున్ను ఈశ్వర చైతన్యము పరోక్షమనే బుద్ధియునియు కనుపించకపోవును. ఆకారణమువలన అపరోక్ష బ్రహ్మసాక్షాత్కారమునకు మహావాక్యములే ప్రమాణములు అని చెప్పియున్నారు. కాబట్టి వాక్యానుభవమువల్ల పుట్టిన తెలివి అంతయు పరోక్షమే గాని అపరోక్షసాక్షాత్కారముగాదు కావున పరోక్షజ్ఞానము పిపీలికా మార్గమనియు అపరోక్షజ్ఞానం విహంగ మార్గమనియు శాస్త్రవాక్యపద్ధతులు బోధించుచున్నవి.

ఒక చిన్న దృష్టాంతము గలదు ఎట్లనిన- వడ్డీకి ఆశపడి మొదలు పోగొట్టుకొనెను అనునట్లుగ తాను బ్రహ్మము కావలయునని నిశ్చయించి ప్రత్యక్షముగా నుండు జీవునకు స్వతస్సిద్ధముగా నున్న ప్రత్యక్షము పోవును. అనగ జీవునియొక్క అజ్ఞానావస్థపోవును నిజస్వరూపమైన బ్రహ్మమె తానై నిలచును. కావున జీవునికి అజ్ఞానావస్థ పోవడము ఆశ్చర్యకరముగా నున్నది. కాబట్టి నీవే దశముండవు అని ముందు తన్ను లెఖచూచుకోగా నిజముగా లెఖకు సరిపోవును గావున ముందు తన్ను తా తెలియవలెను.

అంతఃకరణోపాధియుండగ జీవుని ప్రత్యక్షముగా చూడవచ్చును. అయితే నిరుపాధికబ్రహ్మముగానుండు పరబ్రహ్మము ప్రత్యక్షముగ యెట్లు తెలియబడును. కావున ఇనుముతో చేయబడినసంకెళ్ళు బంగారముతో చేయబడిన సంకెళ్ళు అనే సంజ్ఞ పోనట్టుగ సంకెళ్ళు అనుమాట సంజ్ఞసమానమేగాని యినుముబంగారము అనుభేదమేగాని సంకెలసంజ్ఞ యొక్కటియేగావున జీవుడు బ్రహ్మము అను భేదమేగాని తన్నుతా విచారించి చూడగ అనుభవజ్ఞానదృష్టిచేత విచారించగ తానే బ్రహ్మము బ్రహ్మమే తాను అనే అభేదము ఒక్కటే గావున శుకోపనిషత్తు "భేదాభేదానపదిగళితా పుణ్యపాపేవిశీర్ణమాయామోహేక్షయమతిగతా నష్టసందేహవృత్తిః శబ్దాతీతం త్రిగుణరహితంప్రాప్యతత్వా

పభోదాం నిస్సై్రగుణ్యేపథివిరచితాం కోవిధిఃకోనిషేధః" యిత్యాద్యుపనిషత్ ప్రమాణములు చెప్పుచున్నవి కాబట్టి అంతఃకరణసంబంధమే జీవోపాధి యగును. ఆఅంతఃకరణజీవోపాధిని విడచియుండునదే బ్రహ్మోపాధి యగును. నేను అనేయుపాధియంతయు, త్రోసి వేసిన వెనుక నేను బ్రహ్మము అనే జ్ఞానము యెట్లు కలుగును. ఆత్మానాత్మవివేకజ్ఞానమున కలుగును అహంఅనే నేను అనే దానిని అంతయు త్రోయబడక వుపాధిమాత్రము త్రోసివేసి ఆబ్రహ్మచైతన్యము మాత్రము త్రోసివేయక యుండగ అహంబ్రహ్మాస్మి యని తెలివి రావచ్చును. కావున సాక్షిస్వయంప్రకాశమైనట్ట్లు వృత్తికి విషయము కాకూడదు. కూడదని చెప్పుటవలన బ్రహ్మము వృత్తియందు చిదాభాసుంచేత తెలియబడి జడపదార్థమని ఏర్పడదా? ఎట్లనిన- ఘటమును చూచుటకు దీపమున్ను నేత్రమున్ను కావలయును. దీపమును చూచుటకు మాత్రము నేత్రము చాలును ఆరీతిగా అప్రకాశమైన విషయమును తెలియుటకు విషయముయొక్క అజ్ఞానమును పోగొట్టుటకు వృత్తియు తెలిసికొనుటకు చిదాభాసుడును కావలయును స్వయంప్రకాశమైన బ్రహ్మమును తెలియుటయందు అజ్ఞానమును పోగొట్టుటకు వృత్తి మాత్రము చాలును. కాబట్టి చిదాభాసుడు అక్కరలేదు. ఉన్నప్పటికిన్ని యెండలోనిదీపమున్న యట్లుండునన ఘూ యనునట్లు సూర్యప్రకాశమునందు దీపము వలె ప్రకాశించక బ్రహ్మమునందు నికృష్టమైయుండును. వృత్తికి వ్యాప్తికలదనియు చిదాభాసునికి ఫలవ్యాప్తిలేదనియు వేదములు చెప్పుచున్నవి. ఈ అపరోక్షజ్ఞానమే యితడే నేను అనే వేదమునకు అర్థముగావున శ్రీశంకరాచార్యులవారు విద్యారణ్యులవారు సర్వకాలములయందును శ్రవణముచేయమని చెప్పియున్నారు. అందువల్ల ప్రత్యక్షజ్ఞానము దృఢముకాదుగదా. అనగా శ్రవణము వలన శాస్త్రవిచారణవలన అపరోక్షబ్రహ్మసాక్షాత్కారముగాదు. కావున వేదభేదమున్ను కామభేదమున్ను అంగీకరించి కర్మభేదము చూచినటుల జ్ఞానికి భేదములేదనునది షడ్విధలింగములచేత సకలవేదాంతములయొక్క అర్థమును యేకరీతిగా చూచిన యీజ్ఞానమునకు విపరీతభావన పోవునట్లు మననముచేయమని చెప్పియున్నారు.

విపరీతభావన యేమియనగ, తనతండ్రియందు శత్రుభావము దలచినట్లు దేహమే నేను ప్రపంచమే నిత్యము అనునది విపరీతభావన గాబట్టి యీవిపరీత భావనకు ఏమికారణము అనగా శ్లో॥ అనేకజన్మసంప్రాప్తి కర్మ జన్మఫలం

భవేత్॥ బహుజన్మములు మొదలుకొని చేసిన జన్మాంతరవాసనే కారణము. నానాకర్మజవాసనాన్వితమైన జన్మకారణము గావున విపరీతభావనకు బహుజన్మములనుంచి మొదలుకొని చేసిన జన్మాంతరవాసనే కారణముగావున విపరీతభావన యెట్లునశించిపోవుననగా శృతి॥ అనేకజన్మసంప్రాప్తి కర్మబంధవిదాహినే జ్ఞానానలప్రభావేన తస్మై శ్రీగురవేన్నమః॥ శృతి॥ అజ్ఞానమూలహరణం జన్మకర్మనివారణం జ్ఞానవైరాగ్యసిద్ధ్యర్థం గురుపాదుకమహంభజే శృతి॥ త్వమేవాహం త్వమేవాహంనసంశయః॥ నేనేసత్యముగానుండు బ్రహ్మమనియు దేహాదిజడదుఃఖాత్మకమైన ప్రపంచము మిథ్యయనియు తత్వవివేకభావనచేత పోవునుగాబట్టి శృతి॥ ఉత్తమంతత్వచింతాచ మధ్యమం శాస్త్రచింతనం అధమం మంత్రచింతాచ తీర్థభ్రాంతి అధమాధమః॥ కావున వుత్తమమైన తత్వభావన చేయుట యెట్లు అనగా-పరబ్రహ్మమును సర్వకాలములయందు శాస్త్రోపనిషత్ ప్రమాణములచేత విచారించుటయును మరియొకరికి బోధించుటయును. శృతి॥ స్వయం తారతితిపరాన్ పరన్ తారయ॥ అనునట్లు తానుతరించి యితరులను తరింపజేయుటయును ఇది నిర్గుణబ్రహ్మోపాసనాభ్యాసముచేయు విధము గావున సర్వకాలము నిర్గుణబ్రహ్మోపాసన జేసినయెడల దేహనిర్వాహకము వ్యవహారికము యెట్లుజరుగును వేదశృతి॥ బ్రహ్మకర్మసమారభే॥ అనునట్లు నిర్గుణబ్రహ్మోపాసనచేయు వానికర్మలంతయు బ్రహ్మార్పణముగా యీశ్వరార్పణముగా జేయునుగావున తాను యిహాముత్రార్థఫలభోగవిరాగుడై జీవబ్రహ్మైక్యసమాధినుండును. అయితే అట్టితత్వసమాధిభావనకు కారణమేమనగ తాను మనోమారుతదృక్కులు ఏకముచేసి తాను ఏకాగ్రచిత్తమునందు నిలచియుండును. ఏకాగ్రచిత్తము యెటులప్రాప్తించును. నిర్గుణబ్రహ్మోపాసనచేత ప్రాప్తమగును. నిర్గుణబ్రహ్మోపాసనచేయుటకు మంత్రజపమువలనగాని విగ్రహారాధన వలనగాని తత్వజ్ఞానముచేతగాని బ్రహ్మప్రాప్తిగలుగునా అనిన మంత్రజపము మొదలైన వాటికి దృష్టఫలము లేనందున అనగ ప్రత్యక్షముగా త్వరలో ఫలము గనబడనందున నియామకముగా బ్రహ్మోపాసన చేయవలసివచ్చెను. కావున నియామకము తప్పితే ప్రత్యవాయువుగలదు. కావున బ్రహ్మోపాసన నియామకముగా మంత్రజపవిగ్రహారాధన పూర్వకముగా నియామకముగా చేయవచ్చును. నియామకము నిర్గుణబ్రహ్మైక్యసమాధికి నియామకము అక్కరలేదు. నిరాలంబోపనిషత్తు "నయోగసనతపోధ్యాన్నం నహిసాధనసంపదగి జ్ఞానాజ్ఞాన

విచారోఽపి నాస్తి సర్వత్ర సర్వదా। తైత్తిరీయోపనిషత్ - అనుభూతౌ జగన్నాస్తి హ్యా
త్మతుష్టౌ జగన్నహి సర్వదా భేదకలనం ద్వైతాద్వైతం నవిద్యతే। దత్తాత్రేయో
పనిషత్॥ నహి పుణ్యపదం నహి పాపపదం నహి బంధపదం నహి మోక్షపదం
కించోదిపి హానన సర్వసము॥ కావున అన్నము భక్షించినంతచేత తూత్తుపోవురీతి
గా జీవబ్రహ్మైక్యతత్త్వభావనానుభవముచేత విపరీతభావనపోవును. ఎట్లనిన
పై వ్రాసిన వుపనిషత్ ప్రమాణములచేత పోవును.

కావున బ్రహ్మోపాసనానుభవము సర్వకాలములయందు చేయుట
ప్రయాసమైయుండునదిగదా అది యెటు సులభముగా దెలియును. అది ఆ
నిర్గుణబ్రహ్మోపాసన ఆత్మానాత్మవివేకముగల బ్రహ్మవేత్తలకు అతిసూక్ష్మ
ముగా దెలియును అజ్ఞానజనదుఃఖాత్మకమైన జీవులకు బహుకష్టముగా దెలియు
నుగాబట్టి సర్వకాలములయందు బ్రహ్మోపాసనచేయునది ప్రయాసపడి చం
చలమైన మనస్సునకు నియమముగలిగిన జపమున్ను మరియొకటిని మరియొకటిని
కించిత్ మాత్రములచే చెడిపోవును. మూర్తిధ్యానమున్ను ప్రయాసమున్ను
నదియేగాని నటకచూచేవారలకు బహువేషములు వేసుకుని సరసమైనకథలను
చెప్పువారును వినోదముగా చూచినట్లు బ్రహ్మోపాసనకు ప్రయాసపడని
చెప్పుచు మనస్సునకు బహువినోదముగానుండును. కాబట్టి మనస్సు చంచలము
గలది. అదియెట్లనిన శృతి॥ మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః॥
అనియిత్యాది శృతిప్రమాణములు. మనస్సే బంధకమునకు మోక్షమునకును కార
ణము గావున సమస్తలోకులకు సమస్త వేషభాషలకు యిహాముత్రార్థఫలభో
గములకు స్వర్గాదిసంపదలకు మనస్సే కారణము ఈమనస్సే నిర్మలమైన మోక్ష
మునకు కారణము గాబట్టి యిందుకు ప్రమాణమేమనగా-తానుపోయినదే దోవగ
చంచలమే స్వభావముగానుండు మనస్సు నిలుపడము వాయువును నిలుపుటకు
సమానమని గీతావచనములున్ను సముద్రమును పానముచేసినా అగ్నిమ్రింగి
నా మేరువును పెకలించిన మనస్సును నిలుపరాదను అనిన వాశిష్ఠమున్ను
శ్రీరామహృదయమందు “అలయక సత్త్వవారిధుల నావలకీవలి కొల్లరీతిగా గల
యగ నీదవచ్చుమగంబుల నచ్చనగండ్లుగా గరంబులగొనియాడవచ్చునభముగ
గబళించగవచ్చుగాని యిట్టులనమనస్కయోగము గ్రహించగరాదు దలంచనేరి
కిన్” అనునట్లుగ ప్రమాణములున్నవి. ఈమనస్సు మనంబే స్థూలసూక్ష్మముల్
మాతృమానమేయముల్ మనంబే కామరాగద్వేషమత్సరాదివృత్తులున్ మనంబె

సర్వధర్మముల్ మనంబె బంధమోక్షముల్ మనంబె నృశ్యమాతయున్ క్రమం
బుచే నరింగినన్ అనేనట్లు యీప్రకారముగా విషయశక్తియనే మనస్సునకు
చిన్మాత్రమే ఆశ్రయమనియు మిగిలినదంతయు మిథ్యయనియు శృతి॥ నాస్తి నాస్తి
జగత్సర్వం సర్వం నాస్తీతినిశ్చయం యదృశ్యభావనా నాస్తి దృశ్యమేవతద్వినశ్యతి
కావున నిధిధ్యాసము యట్లుచేయుటకు సాధ్యముగానుండును. కావ్యము తర్క
ము వర్తకము వ్యవసాయము వీటియందు తగిలిన మనస్సునకు నిధిధ్యాసము
సాధ్యముగానేరదు మనస్సు అన్యవిషయసుఖాత్మకమైనది గావున సంకల్పవికల్ప
ములకున్ను వ్యవహారమునకున్ను సుఖదుఃఖములకున్ను బంధమోక్షములకు దగి
లియుండుటచేత నిధిధ్యాససాధ్యముగానేరదు ఇట్లు చెప్పినందువలన భోజనా
దులు విషయశక్తియనే మనస్సునకుగాదా, స్వల్పవిశేషమైన భోజనాదులు అను
సంధానమును చెరపనేరవుగనుక అవివిఘ్నాపకములుగావు. తనవశముగా యీచ్చు
కానిపోవుతర్కమున్ను మొదలైనవి బ్రహ్మతత్వ విచారణ చెరుపుటచేత యివి
యే ఘనమైనవిఘ్నాపములవును. కనుక యితరవిద్యలకు చోటు ఇయ్యరాదు. ఈ
ప్రకారముగ అన్నివిద్యలను పరిహసించిన పక్షమందు జీవించు వుపాయము
యెద్దియో తన్ను తాదెలియవలయును శృతి॥ అనంతశాస్త్రం బహు వేదితవ్యం
అల్పశ్చకాలో బహవశ్చవిఘ్నాః యత్సారభూతం తదుపాసితవ్యం హంసో యథా
క్షీరమివాంబుమిశ్రం॥ శృతి॥ కిమత్రబహునోక్తేన శాస్త్రకోటిశతైరపి దుర్ల
భా చిత్తవిశ్రాంతిర్వినా గురుపరంపరాం అనుప్రమాణముచొప్పున సర్వశాస్త్ర
సారమైనదే బ్రహ్మజ్ఞానం ఈబ్రహ్మజ్ఞానంవల్లనే చిత్తవిశ్రాంతి. హంస పాలు
నీళ్ళు కలిసియున్న పాలనువిడదీయునట్లుగ బ్రహ్మజ్ఞానసారమును తీయుటయే
ముఖ్యాంశము. అనుభవము గాబట్టి అశనమును విడిచిపెట్టుమని అనగ అన్న
మును విసర్జించమని చెప్పినప్పుడు జీవించడము కష్టమగును గాని యితర విచా
రమును విడచిపెట్టుమని చెప్పినప్పుడు జీవనము యెట్లు జరుగుననే దురా
గ్రహమును అనగ శోకము వదలుము. అహంకారమువదలుము. ఎట్లనిన-పుత్ర
మిత్రకళత్రమైమిత్రులు సంయమబ్రహ్మిష్ఠవినమే కర్మముకుడై రాజధర్మమూని
చరించు జనకునివిజ్ఞానచర్యవినమే వాణిజ్యవృత్తి జీవనుడైన యల తులాధారు
ని పూర్ణబోధంబు వినమే కటికిగాయములచే గాలంబుగడుపుచు ధర్మవ్యాధుని
విజ్ఞానమహిమవినమే. వారిప్రారబ్ధమున నుండవలసి జ్ఞానుల కెట్టి వ్యవహారమున
నున్న నేమి కొదువ. జ్ఞానవైరాగ్య నిశ్చలానంద పూర్ణులైనవారు జీవన్ముక్తు
లగుట నిజము.

జనకుడు- దృఢజ్ఞానముచేత రాజ్యభారమువహించి చేసెను. నీకును అంతటి దృఢజ్ఞానము గలిగితె ప్రారబ్ధవశముచేత తర్కవాదము మొదలైనవి చేసిన- జీవన్ముక్తుండ వగుదువు- ప్రారబ్ధమునె నెపముచేత- అనాచార కార్యములు చేయవచ్చునా చేయకూడదా- కర్మ ఎవ్వనిచేతను నిలుపరాదు- ఎట్లనగ- బ్రహ్మజ్ఞాని- అకర్త- అభోక్త- అసంగుడు- గావున- సంగములు సర్వమునుగలిగి సంగిగాడు- భోగములు సర్వమును బొంది భోక్తగాడు- కార్యములు సర్వమును జేసి కర్తగాడు- విగతసంకల్పుడగు బ్రహ్మవేత్తయధిప- జ్ఞానాహంకుడు బాహ్యచేష్టల మనస్సంకల్పుడై చేయునె-

మైనం బ్రాకృతమట్లు వానిగని తా నాచేష్టలే చేయగా- బోనల్పజ్ఞుడు వంచనన్ మదితలంపుల్ మానకాహంకృతుడున్ ననంచున్ ఫలమేమిచేయదు నిశ్చింత లేకుండినన్-

కర్మరహితా- సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ- అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః- బ్రహ్మజ్ఞాని- సర్వకర్మములున్ను బ్రహ్మార్పణముగా చేయుచు- ఆకర్మఫలమును తానుబొందక- అనుభవించక- స్వర్గాదిభోగములకు కోరక- కామిగాక- మోక్షగామిగాడు- అని- నిష్కామకర్మచేయుచు- నిర్గుణోపాసనా నిష్ఠాగరిష్ఠులై- యుందురు. అట్లా జరిగిన- జ్ఞానికి- ప్రారబ్ధ- మెట్ల అనుభవమగుచున్నది- అనగ (శృతి) దగ్ధశ్చదహనం నాస్తి పక్వశ్చపచనం యథా జ్ఞానాగ్ని దగ్ధదేహస్య నచశ్రాద్ధం నచక్రియః- జ్ఞానికి- శ్రాద్ధకర్మాదిక్రియలు- న- చేస్తు- దహించినవస్తువ-తిరుగదహించదు-తగలబడిపోయినన-వస్తువ- దానియాకారము చమురుపోయి-వస్తువరూపము నిలచియుండును. పక్వమైన- అన్నము- తిరుగ పక్వమగున- వుడికిన అన్నముడుకున-అట్లనె-జ్ఞానాగ్నిచేత దగ్ధమైన లింగదేహం అనే అహంకారం- దహించిపోగా-తిరిగిమరివకసారి దహించునా? తక్కినఅన్నము తిరిగి-తినునా- అదిసహించున-వుడికిన అన్నముపుడుకున- దగ్ధమైన- పటలం- తిరిగిదగ్ధమాన- (శృతి) అగ్నిదగ్ధంయథాబీజం-శాఖాపల్లవవర్జితం- జ్ఞానదగ్ధంతథాయోగిపునర్ జన్మానవిద్యతె- (శృతి) అజ్ఞానమూలహరణం జన్మకర్మనివారణం- (శృతి-) గీతాభాష్యం- అభీజం వృక్షసంకీర్ణం శాఖా పల్లవవర్జితం పుష్పం నాస్తిఫలం నాస్తిసంపూర్ణం వృక్షవర్జితం గావున జ్ఞాని కర్మఫలము అనుభవించువాడుగాడు గావున జ్ఞానికి- అజ్ఞానికి భేదమా- ప్రారబ్ధఅనుభవము సమానమేగాని- వృత్తి

భేదముగలదు- (ఒక రహదారి మార్గమందుపోవు యిద్దరును- చేరవలసిన
గ్రామము వక్కటిగానుండెనా- వుండదు. ఎట్లులనిన- చేరవలశినగ్రామము
యెరిగినవాడు మార్గమెరిగినవాడు- యీరెండూ యెరగనివాడు ఒక్కటిగా
నుండున- దోవ తెలియనివాడు యేమోయని పోవునట్లు- దోవదెలసినవాడు
ధృఢముగా పోవునట్లు-గ- జ్ఞానాజ్ఞానులకు- భేదముగలదు- జ్ఞానికి- అజ్ఞానికి-
ప్రారబ్ధము సమమైన- గాని- జ్ఞానినేను అకర్తను అని దృఢముగానుండును-
అజ్ఞాని భయపడి చచ్చును. ఇదియే యిద్దరకు భేదము- గావున- ఈ బ్రి
హ్మమే నేను. అనే పరోక్షసాక్షాత్కార జ్ఞానము- యెవ్వరికొరకు- తన్ను
తాదెలియుటకొరకే తనకొరకేగావున- యేభోగమునుగూర్చి యెవ్వడు శరీర
పరితాపముపడును- అనగా యేమిఅర్థము. అపరోక్ష బ్రిహ్మసాక్షాత్కారము
గలుగువానికి- విషయము గాని- భుజించువాడుగాని- లేవని స్మృతులు చెప్పు
చున్నవి- అకర్తవ్యమ భోక్తవ్యం యని యున్నదిగావున- ప్రారబ్ధభోగ మనుభ
వించుచుండగ- విషయములున్ను- అనుభవించువాడున్ను లేవని- చెప్పుట
యెట్లు- శృతి॥ ప్రారబ్ధం భోగతోనస్యేత్ తత్వజ్ఞానేనసంచితం- ఆగామిత ద్వివి
ధంకర్మత ద్విష్ణోప్రియవాదినః- ఇత్యాదిశృతులు చెప్పుచున్నవి- ప్రారబ్ధమును
భోక్తవ్యాంకృతం కర్మశుభాశుభం- దుఃఖమాగంతుకము- సుఖము స్వాభావి
కముగావున- బ్రిహ్మజ్ఞానికి- ప్రారబ్ధం అనుభవవించకతీరదు గావున- కామ్య
వర్జితులై ఫలవర్జితులై- నిష్కామకర్మ ప్రారబ్ధం అనుభవించుచు- వెంటనే
తీర్మానం- యెట్లనిన- అప్పుతీరి- తలచించినపత్రివంటిది- గావున వడ్డీ పెరగ
నేరదు- గావున- అప్పుతీరి- తలంచిన పత్రినంటి ప్రారబ్ధా- బ్రిహ్మజ్ఞాని-
అనుభవించును గాబట్టి- యింద్రజాలమును- యింద్రజాలమందు- గంధర్వనగర
మును చూచినవాడు ఒక భోగమును నిశ్చయించక, అపహసించి పోయిన
రీతిగా బ్రిహ్మ సాక్షాత్కారము వచ్చినవారికి॥ శృతి॥ ప్రిజ్వలత్పావకే కుందే
పద్మమూలం ప్రిజాయతె నానాలత సమాకీర్ణం పత్రిపుష్పసమాకులంతా
సాంవృధి యథాసత్యం జగసత్యం ససంశయః ప్రిజ్వలత్ పావకాహ్వాత
పర్వతంబు నాశ్రియించునే మృగవిహంగాదికములు బ్రిహ్మవిదుడై ప్రికాశిం
చు బ్రిహ్మవిదుని అంటునే పుణ్యపాపంబులాంజనేయా- అని- శ్రీరామహృ
దయమందు చెప్పియున్నది గావున॥ సర్వసారోపనిషత్॥ నాస్తి నాస్తిజగత్
సత్యంసర్వం నాస్తీతినిశ్చయః.

నిరావరణ భావార్థసూత్రములు- సర్వసారోపనిషత్.

ప్రమాణము- బ్రహ్మజ్ఞాని- ప్రారబ్ధం- దగ్ధపటల న్యాయమువంటిదిగా చూచును- అనగా- జగత్ మిథ్యా జ్ఞానం కలుగును. శేషించిన బ్రహ్మమే తానగును- గావున- పంచకోశ వినిర్ముక్తం పంచదేహ వివర్జితం పంచకోశాది సంగత్వం స ఏవ పరమశ్శివః- శృతి॥ వేదశాస్త్ర పురాణాని- యితిహాసాదికానిచ మంత్రియంత్రాది విద్యానాం స్మృతి రుచ్ఛాటనాదికం శైవశాక్తాగమా దీన్యహ్యన్యేచ బహ్యామతాః అపభ్రమశ సమస్తానాం- జీవానాం భ్రాంతిచె తసాం-

జ్ఞానమానం దగం బ్రహ్మ యిత్యుక్తం మూఢ మానసైః- భ్రాంతి మూలమిదం జ్ఞానం జ్ఞానం భ్రాంతేతి నిశ్చయః- జ్ఞానాత్సం జాయతో నందో. ఆనందో భ్రాంతి లక్షణః- సత్యజ్ఞాన మనంతంచ మాయాగుణ మిదం శృణు- జ్ఞానమానం దగం నాస్తి యితి వేదాంత నిశ్చయః- దేశకాలాభి శూన్యంసర్వశూన్యం సనాతనం శృతి॥ నారాయపరోవస్తు తస్మి నాహం కదాచన- గుణత్రయాదిన విద్యం తా పకార రహితం సదా- ఇదం వస్తు నారాయణాత్పరంవస్తు నారాయణాయేతి సమర్పయామి- యని- ఇత్యాది శృతి ప్రమాణములు- బ్రహ్మజ్ఞానియొక్క ప్రారబ్ధం యెటుల అనుభవించును అనగ- పరబ్రహ్మంబైన దాను- తానై యుండి తాను చేయునదంతయును- బ్రహ్మార్పణముగా చేయుచు- జగత్ మిధ్యావాక్యములు దృఢజ్ఞానపరుండై- శృతి॥ నభోగే నయోగే- నవా రాజ్యభోగే- నకాంతాముఖైనైవ విత్తేషు యుక్తః- యిత్యాది శృతి ప్రమాణములు బ్రహ్మజ్ఞానులయొక్క నడతను చెప్పుచున్నవి.

అపరోక్షబ్రహ్మ సాక్షాత్కారము గలవానికి- శృతి॥ తత్వమశ్యాది విద్యా చపరోక్షజ్ఞాన మేవహి- అహం బ్రహ్మాస్మీతిహ్యా పరోక్ష మితీర్యతే- ఇత్యాది ॥నిరాలంబోపనిషత్॥ సర్వమిత్యాకాశె తత్ప్రతిష్ఠేత్యుపాశీత్- తత్ప్రతిష్ఠావాన్ భవతి- తద్ బ్రహ్మేత్యుపాశీత్- బ్రహ్మవాన్ భవతి అను ప్రమాణముగ నామహాపదమును పొందిన- మహానుభావులయొక్క, అధ్యారోపోపాధికి- నొకవేళ యెప్పుడైనను- శృతి॥ పంచదశీయనె ప్రపంచవ్యాది- అనగ- అనాత్మదృష్టె అవివేక నిద్రా అహంమను స్వప్నగతిం గతోహం ఇత్యాది శృతులన్ను శృతి॥ అణిన మాలజ్ఞష్టి కళామాత్ర శరీరం నాస్తి

కేవలం- అనే- ప్రపంచవ్యాధిగను బడునట్లు వ్యాధిగను బడినతోడనే- ఆ అధ్యారోపోప పుపాధికి- ప్రారబ్ధం భోగతోనశేత్- వాకవేళ రోగము వచ్చినయెడల అనగ కర్మ సంప్రాప్తమైనయెడల- శృతి॥ గురోర్ ముఖేన జ్ఞాతవ్యం- అన్యధానో ఫలభ్యతే- గురుముఖ వివేక జ్ఞానముచేత తన్ను తా దెలసి- తాను తానై- సద్గురుం డిచ్చిన పదహారు మాత్రలను నెల్లప్పుడు- శ్రవణమును- మూటగట్టుకొని- దగ్గర నుంచుకొని యుండి- యామాత్రలను తప్పక- శ్లోకం॥ శరీరె జర్ఝరీ భూతె వ్యాధిగ్రస్తె కళేబరె- ఔషధం జాహ్నవీతోయం వైద్యోనారాయణో హరిః- పరమరసముతో- అనుపానముబెట్టి బుచ్చుకొని ద్వాదశిని పత్యముగ దీసికొనిన అధ్యారోపోపాధి యనె- ప్రారబ్ధమనె రోగము నిరోగమూను- కాబట్టి విషయమున్ను- అనుభవించుట యున్ను లేకపోవును అంతట తైలములేని దీపమువలె- ఆశాసంకల్పాదులంతయు- అణగిపోవును. నిరాసుడై యుండును- గాబట్టి-

శృతి॥ నకోధో నచమాత్సర్యం నలోభోనా సుభామతిః భేదాభేద వివర్జితం గుణహారం- నిష్ప్రపంచం ప్రపంచకె॥ ఆత్మోపనిషత్॥ వాచం యచ్ఛ, మనోయశ్చ ప్రాణం యేచంద్రియాణిచ- ఆత్మాన మాత్మనా యచ్ఛన భూయకల్ప సెధ్వనె, తస్మాద్వ్యక్తేంద్రియ గ్రామోయుక్తచిత్త మిదం జగతు- ఆతనీకుస్వ మాత్మానం మయ్యధీశ్వరః- ఇత్యాద్యుపనిషత్ ప్రమాణములు చెప్పుచున్నవి.

॥నిరాలంబోపనిషత్॥ సాధనాంతర నిరపేక్షః సర్వాగతాపరిచ్ఛిన్నశ్శివ ఏకోవశిష్యతె-సర్వము అణగి లయమైయున్న బ్రహ్మవేత్తయొక్క స్వభావము యెట్లనిన॥ నిరావరణోపనిషత్॥ నిరామయం, సర్వశూన్యం తదాత్మేతి సమాధితస్య లక్షణం- శూన్యభావిత భావాత్మ పుణ్యపాపై ప్రముచ్యతె- శ్లోకం॥ ద్రిష్టిదర్శ నదృశ్యానాం విరామోయతృ భావవేత్ దృష్టిస్తత్రైవ కర్తవ్యం నాసాగ్ర నవలోకనం-

గాబట్టి బ్రహ్మజ్ఞాని యైనవాడు- నిత్యానుష్ఠానము చేయునది యేమనగ- నిర్గుణ బ్రహ్మోపాసన అనుష్ఠానము చేయుచు వాసనత్రయములను విడచి- స్వజాతి విజాతి స్వగత భేదములను విడచి- సర్వకర్మములను ఈశ్వరార్పణముగా నిష్కామకర్మ జేయుచు- తాను తానై- చిత్తవిశ్రాంతి గల పరమపురుషుడు- సప్తవ్యసనములను విసర్జించి- స్వయంత్రాంతీతి

పరాన్ పరంతారయ యను— తాను తరించి యితరులను తరింపజేయుచు- విదేహానిరాలంబ కైవల్యమోక్ష సామ్రాజ్యమును పొందును.

ప్రారబ్ధము అనుభవించునందువల్ల బ్రహ్మజ్ఞానికి- భాద యేమయినా యున్నదా- హాని యేమయినా గలుగునా హాని లేదుగాని— దోషదృష్టి చేత నిజముగా అనుభవించడు—గాపున- యింద్రియ విషయములయందు యే దోషములు యున్నవి- అనగ- అర్థము- అనగ- ధనము సంపాదించునపుడును- కర్చుపెట్టు నప్పుడును ఆత్మబంధు- సంరక్షణ జేయుచున్నపుడున్ను- దుఃఖమే గాని- సుఖము లేదు. యీ యింద్రియదోషములను ప్రారబ్ధముచేత అనుభవించినా- దుఃఖముతోనే అనుభవించును గాని- సంతోషముతో అనుభవించడు- అనుభవించుచుండగా దుఃఖం యెందుకు- బ్రహ్మజ్ఞాని యింకాకర్మ తొలగిపోలేదుగదా యనే దుఃఖము- కారాకులు దుళ్ళినట్లు కర్మముడుల్లున్- కర్మరహిత మహాను- కర్మ రహితమే జన్మ రహితం- జన్మరహితమే- చిత్తవిశ్రాంతి- యీచిత్త విశ్రాంతియే- మోక్షం- బ్రహ్మజ్ఞానియొక్క విచారమనె క్లేశము మూలమాయెను గదా- గాపున- ఇది సంసారతాప విరక్తియగునె గాని- దుఃఖము కానేరదు- శృతి॥ సంసార రహితో విముక్తః- బంధోవిముక్తః- ఇత్యాదిశృతులు చెప్పుచున్నవి. విరక్తియే కారణమువల్ల బ్రహ్మజ్ఞానికి కలుగును- అనగ ఈజగత్ భ్రాంతి- యనె- అధ్యారోపోపాధియనె- దృఢజ్ఞానముచేత వచ్చెను గాని- అందుచేత- జ్ఞాని దొరికినకాలది- సంతోషమును పొందును- గాపున అజ్ఞాని- యన్నిభోగములు యనుభవించిన- తృప్తిపొందనేరడు- ఎట్లనిన అగ్నిలో పైపైగా ఆజ్యము పోయుచుండగ- అగ్ని చల్లారినట్టులయితె- అజ్ఞానికి భోగములయందు-ఆశ అణగును- అటుల లేదుగనుక- ఆశలు వైరాగ్యముచేతనె అణగవలయును- గాపున- ఆశలు వ్యర్థమాయె- వైరాగ్యం దృఢంబుజేసి పరతత్వజ్ఞాన మార్జించి- సర్వారంభోపరంబు గైగొని తురీయంబుంది ఆరూఢస్థితి సర్వమున్ మరచి- సర్వావస్థలన్ జిన్నధారాపాన సుఖాప్తి శుద్ధ బ్రహ్మమేనంచు శంకరాహిత్యముఙ్ మీాప్రాప్తియదియ మోక్షమాభూవల్లభా అని-యున్నది. గావున శృతి॥ జన్మాభావె కర్మం నాస్తి- కర్మాభావె ఫలం నహి పలాభావె- భయంకృత్వా- భయాభావె నసంశయః॥ జ్ఞానియైనవానికి కర్మవశముచేత- ప్రారబ్ధము లబ్ధమయిన భోగములను అనుభవించుట యందు మునుగుచుండక

పోవునా- గాబట్టి- ఖయిదు చేయబడిన రాజును- విడుదలచేసిన వెనుక- ఒక్క- గ్రామ మిచ్చినను సంతోషించినట్టువలె- బ్రహ్మజ్ఞాని- యదృశ్చాలాభ సంతుష్టిచేత సంతోషించును. ఆటలకుచేసిన దొంగతనము వినోదార్థమైనట్లుగ, ఆభోగములను- ఉపరి- పురరికాము సాకల్పములను గలుగచేయనేరవు గావున- ఆటలకు పిల్లలు దొంగతనముచేసి- నట్లు- బ్రహ్మజ్ఞానియైనవానికి- ప్రారబ్ధకర్మ అనుభవమువల్ల వచ్చెడు- సుఖదుఃఖములను అనుభవించడని భావము- గాబట్టి-

ఇశ్చాప్రారబ్ధము- అనిశ్చాపారబ్ధము- పరేశ్చాప్రారబ్ధము అని మూడు విధములు- అయివున్నవి- గావున- యిశ్చామాత్రి ప్రభు శృష్టిః- యని యున్నది.

అపత్యము చేసేవానికి, దొంగిలించేవానికిని, రాజస్త్రీలతో సహవాసము చేసేవానికిని- యీపనులు చేయరాదని తెలిసియుండియు, ఆశలు యేల వచ్చుచున్నవి, గనుక యీఆశను యీశ్వరునకైన తప్పించుట అడ్డగించుటకూడాకాదు- బ్రహ్మజ్ఞానము గలిగినవాని వానిని ప్రకృతి విడచి పోజాలదు అని- గీతాశాస్త్రములు చెప్పుచున్నవి. ఈప్రకారము- పెద్దలైనవారు వారినిమిత్త- మపహరించి చెప్పితిరి- గావున- సామర్థ్యము గలిగితె- ప్రారబ్ధకర్మలను ఏల అడ్డగించకూడదు- అట్లయిన పక్షమునందు నలుడు రఘురాముడు- ధర్మపుత్రుడు మొదలైనవారు- దుఃఖపడని, నిమిత్తము లేదు, ఈశ్వరుడును- సృష్టిస్థితిలయము- తిరోధానము, అనుగ్రహాములయందు పనిలేదు. అందుచేత యీశ్వరకల్పనలు యెవ్వరిచేతను త్రోయబడునవిగావు- గావున- ఇది యిశ్చాప్రారబ్ధము అనిశ్చా ప్రారబ్ధము అనగ- అందుకు ప్రమాణమేమి మనము మనస్సునందు చేయకూడదని యుండు కార్యములను, బలవంతముచేత, మనములను అపేక్షించుకొని చేయించేవారెవరు, మనకు కావలసిన కార్యములను, చేయకుండాచేసేవారెవరు- అని అడిగిన- అర్జునునకు వానివానికర్మ చేయించుచున్నదని చెప్పినశ్రీకృష్ణులవారి వాక్యమే ప్రమాణము-

గీతాశాస్త్రం నకర్మాణి, నకర్తృత్వం, కర్తృత్వం ధర్మసంగ్రహః- బ్రహ్మకర్మసమారంభే- అనువేదవాక్యము- సర్వకర్మలున్ను, నిష్కామయయై బ్రహ్మార్పణముగా చేయుచు తాను- యిహాముత్రార్థ ఫలభోగవిరాగుడై- నిజ

కర్మచేయుచు- కర్మజేయుచు ఫలకాంక్ష వర్జితుడై యున్న వానికి- కర్మహేతువను జన్మరహితం గావున- యిట్టివానికి పరేశ్చాప్రారబ్ధమనగా నేమి- తనకు యిశ్చయనియు- అనేశ్చయనియు లేకయుండిన, ఆప్తులచేత గలుగు సుఖదుఃఖములే పరేశ్చాప్రారబ్ధమగును- గావున- యిట్లయినపక్షమునందు దేనిని నిశ్చయింపబోవు మన్నాడను వేదవాక్యమునకు ఆశను విడచిపెట్టవలయును యని చెప్పుచున్నవి- గావున వేదశృతులు- యిశ్చను కోసివేసివేయుమని చెప్పలేదు ఆయిశ్చ- వేచినవిత్తనమువంటిది- అని- శృతి స్మృతులు చెప్పుచున్నవి- శృతి గీత అభీజం వృక్షసంకీర్ణం శాఖాపల్లవవర్జితం- పుష్పంనాస్తి ఫలంనాస్తి సంపూర్ణం వృక్షవర్జితం- శృతి- అగ్నిదగ్ధం యథాబీజం శాఖాపల్లవవర్జితం- జ్ఞానదగ్ధం తథాయోగీ పునర్జన్మ నవిద్యతే- శృతి-క-

వాదించడమనగా యేమి- వేయించినవిత్తనం మొలకలెత్తవు- యెత్తకున్నను- తినుటకు యోగ్యముగానుండును కాబట్టి- బ్రహ్మజ్ఞానియొక్క- ఆశదొరికినభోగరాగములయందు సంతోషించుచునుగాని- ప్రపంచపైగ కపటముగలిగి కామసంకల్పములు చేయడుగావున- బ్రహ్మజ్ఞానికి ఆశయెందుకు రాకూడదు- విషయములందు ఆయనకు భ్రాంతి లేనందుచేత- ఆశయును లేదు- యింద్రియవిషయముల భ్రాంతికి- లక్షణములు యేమి-

రాబోవుకర్మములు- రాకయుండడములేదు- రానికర్మము రావడము లేదు- అనుబోధచే- భ్రాంతిని బోగొట్టును. జ్ఞానికిన్ని మధ్యస్థముగానుండు విషయములు ఒకనికి- భ్రాంతియివ్వవలసినదేమి మరియొకరికి భోగమివ్వవలసిన దేమికారణము- యివిరెండూ భ్రాంతులే-

తనకు ప్రాప్తి లేనిదానిని పొందవలెనని సంకల్పముచేసి భ్రాంతునికి దుఃఖమునిచ్చును. యిది మాయామయముగాదా- జరగవలసినరీతిగ జరిగిన విధముననే బ్రహ్మజ్ఞానికీసంకల్పము చేయనేరదు గనుక బ్రహ్మజ్ఞానికి దుఃఖము యెట్లు ప్రాప్తమగును- యీజగత్తు మాయామయమైనట్లు యుండగ నచ్చును. దీనియందు ఆసక్తి యెట్లుపోవును- శృతి మాయాకార్యమిదంనాస్తి మాయానాస్తి భయంనహి- అనున్యాయమున- శృతి స్వప్నమువలెను- ఆనాత్మదృష్టె అవివేక నిద్రాఅహంమను స్వప్నగతిం గతోహం- ఇంద్రజాలమిదం సర్వం యథామరుమరీచికః అఖండితమనాకారం వర్తతే కేవలం శివం-

యింద్రజాలమువలెను యున్నది- వచ్చును- పోవును- అని నిర్ణయింపబడక- తోచబడి- చూడబడి నశించుటవల్ల మాయామయమని యెరుంగవచ్చును. అప్పుడు జాగ్రత్తయును- స్వప్నమువంటిదేను- కలలో దోచిన శరీరము ఏలాగో ఆలాగె- అనిన మూలజ్ఞప్తికళామాత్ర శరీరం నాస్తి. నిశ్చయం- అనునట్లు- యీఅనుభవం గురుముఖతా- తన్ను తాదెలిసిన- గురి గలిగిన తెన్నగ తగిలితె ఆసక్తిపోవును- గావున- ఈతత్వజ్ఞానమునకు పట్టుదల దేనియందు- యీప్రారబ్ధకర్మమునకు పట్టుదల దేనియందు- గావున ప్రారబ్ధకర్మము- తత్వజ్ఞానమును చేర సదా జగత్తు సత్యముగా తోచినయెడల- ప్రారబ్ధకర్మభోగము కూడునపుడు- బ్రహ్మజ్ఞానమునకు విరోధము జగత్తు మిథ్యగాపోయినప్పుడు- వివేకమును చెరపక యుండును- స్వప్నయింద్రజాలమువలె సంతోషభోగము దర్శనము చూచుటమాత్రమెగానె యుండుటచేత ప్రారబ్ధము జ్ఞానమును చెరచదు గావున- బ్రహ్మజ్ఞానము ప్రారబ్ధమును చెరివివేయదా యేమి- జ్ఞానమురాగానె- జగత్తు లేకపోయినందువలన ప్రారబ్ధకర్మమును చెడిపోవును. సర్వసారపూర్ణోపనిషత్॥ అపరిచ్ఛిన్నరూపాత్మా అణుస్థూలాది వర్జితః, నామరూపవిహీనాత్మ ద్వైతాద్వైత వివర్జితః. నిష్కలాత్మ నిర్మలాత్మ శుద్ధాత్మాబింకువర్జితః, సచ్చిదానంద హీనోయో యేష్యైవాత్మాసనాతనః సర్వానంద విహీనాత్మ- భావాభావ వివర్జితః, పాదాభావాద్గతక్నాస్తి హస్తాభావాత్‌క్రియానహి మృత్యుర్‌ నాస్తె జన్మభావాత్‌ బుద్ధ్యాభావాత్సుఖాదికం ఆత్మాభావాజగన్‌ నాస్తి యితి వేదాంతడిండిమః—ఇత్యాద్యుపనిషత్‌ ప్రమాణములు చెప్పుచున్నవి. బ్రహ్మైక్యజ్ఞానానుభవజ్ఞునకు- ఆగామిసంచిత ప్రారబ్ధములు నశించు గావున, అనృతజడదుఃఖాత్మకమైన- వుపాధినశించగానె- సర్వసంశయము దానితోనే నశించుగాన- వున్న తానె బ్రహ్మమై యుండెను. అట్లు చెరచుట మాయామయమని తోచుటవలన బ్రహ్మజ్ఞానమునకును ప్రారబ్ధమునకును- విరోధములేదు- ఎందుకుచేతననగ,- దీపం వుండగ చీకటినుండు వస్తు వెతుకుటకున్ను- నేలవిడచిన సాము లేదు- గావున- యేఅవస్తయందు సర్వము ఆత్మగా పోవునో ఆ అవస్తయందు యెవడు యేయింద్రియములచే యేవిషయములను అనుభవించుచున్నాడని వేదములు చెప్పుచున్నవి- గావున- బ్రహ్మజ్ఞానము రాగానె సర్వము నశించును —

సర్వసారోపనిషత్ సదూపం నాస్తి సర్వత్రి యీవేదము సుషుప్తిని- విదేహకైవల్యమని చెప్పుచున్నదే గాని జీవన్ముక్తిని చెప్పలేదు. అని, వ్యాససూత్రిములు చెప్పుచున్నవి- యస్యజ్ఞానం నాస్తి, జన్మప్రివృధిర్ నాస్తి, జ్ఞప్తి సర్వదా సత్యవాక్యాం భక్తిజ్ఞానేన కర్మ శక్తిచ నాస్తి సర్వవ్యాప్తం సచ్చిదానంద హీనం- అవేద్యమసంగమ బాధ్య మబోధ్యమ లక్ష్యమ కర్మమ ప్రితర్క్యమ ప్రిమేయమ నిష్క్రియం పరమాకాశమ చలం, సర్వదా భాతిపూర్ణం నిరాభాసేన కావరణా ఛిత్వాని రామయం నిరంజనం, పరమశివ మాలోక్యం నిరహంకారోభవ అనావృతేన జీవేశ్వర భావం విశృజ్య—

యాజ్ఞవల్క్యులు మొదలైన పూర్వాచార్యులవారు వారికి ద్వైత దృష్టి యుండుటచేత వారలకు- నిర్గుణబ్రిహ్మోపాసన లేకయున్నారు- గావున- అట్లయిన పక్షమునందు శిష్యులగూర్చి- వారలు బ్రిహ్మజ్ఞానము వుపదేశము చేయకనే యుండవలయును- అట్లు లేక వారలు వుపదేశముచేసిన శాస్త్రములు వున్నవి- అనగ- శాస్త్రములు బోధించిరి. గావున- వారలకు ప్రిపంచము తోచక నిర్వికల్ప సమాధియందు- జ్ఞానముకలదని యేల చెప్పకూడదు. ఆకారణమున సుషుప్తియు జ్ఞానమే యగును- అయితే సుషుప్తియందు అహం బ్రిహ్మము అనె జ్ఞానము లేదుగదా. అట్లు గనుకనే నేను బ్రిహ్మమునవే జీవన్ముక్తి జ్ఞానము జగత్తు తోచకపోవును గాదుగదా- యీరెండూ కూడినదే జ్ఞానము కాకూడదు గదా- ద్వైతము తోచినదే జ్ఞానమనునదే యీపక్షము ఘటపటాదులకును గలదు. కావున నిర్వికల్ప జ్ఞానమునందు దోమలు లోపలికి వినుచుండగ అజ్ఞానము ఘటజ్ఞానానికి సరిగా చాలదు- అప్పుడు ఆత్మవిచారమె జ్ఞానమగును గాని ద్వైతము మరుగుపడునది గాదు యీసిద్ధాంతము దెలసినప్పుడే కృతకృత్యుండ వగుదువు- గావున మహాదుస్తరమైన మనస్సు నిలుపవలదా యనినచో తనకు తోచే విషయములను మాయామయముగా చూచుటే మనస్సును నిలుపడమగును- యేఅనుభవమును నిశ్చయించబోవుచున్నాడనేవాక్యమునకు అర్థము తెలియును. ఎవరికి అనుభవము అనుభవించేవాడెవడని చెప్పుచున్నది- గాని- యెందుకు అనుభవించేవాడు లేడు అనగ- కూటుస్థుడు నిర్వికారుడైనందున సుఖదుఃఖ భోగవ్యవహారము వానికిలేదు, చిదాభాసుడు ఆరోపిత

మైనందున- వాడు సుఖదుఃఖ వ్యవహారము అనుభవించువాడుగాదు గావున- యిట్లు అగుటచేత అధిష్ఠానమును విడచి- ఆరోపితము వుండదు గనుక యిరువురుని- ఒక్కటిగా చూచి- తాదాత్మ్యముచేతను- వీడే అనుభవించువాడు అని- లోకవ్యవహారము చెప్పడమే గాని- వివేకముచేత అనుభవించెడువాడున్ను లేడు—శ్రుతి॥ నేతినేతీతి వైశ్యానిః నేతినేతీతి నేతీతి శేషితం పూర్ణముచ్యతె, పూర్ణమధః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణము దీరితం, పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణ మేవావశిష్యతే- అను ఇత్యాద్యుపనిషత్ ప్రమాణములు చెప్పుచున్నవి. గావున శేషించిన పదార్థమే బ్రహ్మపదము- తాను తానైనదే- బ్రహ్మము.

ఏలాగైనా ఆత్మ తానే అనుభవించేవాడని చెప్పకూడదా ఆత్మయెవ్వరు అని విచారించునప్పుడు- శృతులు ఆత్మ- వ్యవహారకజీవుడు- ఆత్మ అనగ దేహము ఆనందమయకోశము పర్యంతముతోసివేసి కూటస్థునిగదా ఆత్మయని చెప్పుచున్నది. ॥ఆత్మోపనిషత్॥ ఆత్మానాత్మ వినాశహేతుమనిశం సర్వాతి రిక్తంశుభం, పూర్ణాత్పూర్ణమనామయం సుఖతరం సర్వాపదధ్వంసకం సర్వజ్ఞాన వినాశకం గురుపదం, సర్వాత్మకం నిర్మలం సర్వభ్రాంతివివర్జితం గుణహారం సంపూర్ణంబోధ మేత్పరం —

చిదాభాసుడు లేనివాడైన ఇట్ల అజ్ఞానదశయ గు నెట్లు అనుభవించేవాడు అగును- కూటస్థునియొక్క సత్తను తనయందు దీసికొని నాకు భోగము నిజమని భ్రమశి విషయములను కాంక్షించినవాడు చిదాభాసుడు యీ చిదాభాసుని విషయములో చేయవలసిన విషయమేమి- లౌకికమునను యనుభవించేవాడు ప్రియముగానుండు విషయములకన్న తన్ను ప్రియముగా చూచినట్లు- వివేకజ్ఞానము గలవాడు- కూటస్థునికి- అన్యమంతయు అప్రియమని తోసివేసి కూటస్థునినే ప్రియముగా జూడవలయును. ఆకూటస్థుడు ప్రియము యెట్లు చూడవలయును ననగా పామరుండు స్వేచ్ఛందనము మొదలైన విషయాదులయందు చేసే ఇచ్ఛను- వివాదము చేయగోరినవాడు కావ్యనాటకాదులయందు చేసే విశ్వాసమును యోగియైనవాడు మనస్సును- నిలిపేటందుకు చేసే ప్రయాసను కూటస్థునియందు చేయవలయును- గావున- యిటువలె చేసినపట్ల గలుగు ప్రయోజనమేమిటియో భోగము విద్య- పుణ్యలోకము అణి మాది అష్టసిద్ధులు యీనలుగురికి ప్రాప్తమగును- కూటస్థుడు

గా నుండు తన్ను అవస్థాత్రయములకు అతీతునిగా - తాను వొక్కడుగా సచ్చిదానందునిగా సదా శివునిగా చూచినవానికి స్వప్నమువలెనే పుణ్య పాపకర్మములతోటి సంబంధము తెగి ముక్తిని పొందును - అట్లు చూచేవాడికి అనుభవించేవాడు యెవడు అజ్ఞానిగా నుండు చిదాభాసుడే అనుభవించును. వీడు సాక్షిని విడచియుండడు గనుక వీడిద్వారా సాక్షియందు - భోగము ఆరోపింపబడదా - చిదాభాసుడు యొక్క అవస్థయందు చూడబడినట్లు మరి యొక అవస్థయందు చూడబడనందున మాయామయానికి లోబడినవాడగును గనుక - తాను నష్టుడు కాబొయ్యేడువాడుగా చూచినందున చచ్చేవాడు పెండ్లిచేసుకొనుటకు వాంఛ పేనట్లు - తనకు లోబడిన భోగములను - నిశ్చయింపబడకయుండును - సుఖదుఃఖముల అనుభవించేవాడు అని చెప్పుటకు ముక్కు - పోయినవానినివలె [illegible] ప్రారబ్ధభోగము అనుభవించుటవల్ల - దీనిని సాక్షియందు యెట్లు ఆరోపించును. అట్లు గనుక వేదములు అనుభవించేవాడు లేడని చెప్పుచున్నవి - అనుభమున్నక్కా-యెగదయ్యోనని చెప్పియున్నవి - గావున జ్ఞానికి శరీరానుతాపము లేదని వేదములకు అర్థము బ్రహ్మజ్ఞానికి శరీరత్రయములయందు - అధ్యాస అనురాగము పోయినందువలన - మూడు శరీరజ్వరములున్ను బ్రహ్మమును బ్రహ్మజ్ఞానిని తపింపజేయవు - గావున - ॥ కైవల్యోపనిషత్ ॥ జాగ్రత్ స్వప్నసుషుప్తీనాం అవస్థాపంచకం నహి - నబహిర్ స్వప్నం నజాగ్రత్స్వప్న సుషుప్తిః, నగోత్రం నకులం శూన్యం, శూన్యోక్తే నకంవదంతి కేనకిం, పశ్చేత్ కేనకం - శృణోతి కేనకం - సర్వోపాస్తిః, నవిజ్ఞానావి భావాభావ వివర్జితః - పరమాకాశ వాద్యన్యం నకించన అత్యంతవివర్జితశ్శివః అనిమధ్యాంతరహితం దేవం - సపకో నిత్యం అకారణమద్వయః, వాచారంభణం వికారోనామధేయం - కాలత్రయాబాధ్యస్స ఏకశ్శివః - అని ఇత్యాద్యుపనిషత్ ప్రమాణములు చెప్పుచున్నవి గావున - తానైన పరబ్రహ్మమునకు ఏమీలేదు - గావున తన్ను తా తెలియవలయును.

ఈ మూడుశరీరములయందు - ఏవ జ్వరములున్నవి అవి - యీబ్రహ్మమున కెట్లులేవు. స్థూలసూక్ష్మకారణములని మూడుశరీరములు చిదాభాసునికి గలవు గావున, ఇందు దోషవాతపిత్తశ్లేష్మము మొదలైనవానిచే గలుగు - తలనొప్పి కడుపునొప్పి చచ్చువాయువు మొదలైన వ్యాధులు స్థూలశరీరజ్వరము - కామక్రోధలోభమోహమదమాత్సర్యములు లజ్జ భయము మొద

లైనవియు శమము దమము శ్రద్ధ భక్తి మొదలైనవియు సూక్ష్మశరీర జ్వరములు అనేకవివిధ శరీరకార్యములు గలుగజేయునది కారణజ్వరము (తంతువినాపటలమువలె నటులనె) పెండ్రికలులేని కంబళమువలెనె- మృత్తిక వినాఘటమువలెనే- దానికిని చెప్పిన జ్వరములు వినాఘటనములెనటువలెనే- శరీరము లేనటువలెనే- దానికి చెప్పిన జ్వరములు వినాశరీరములు లేవు. ఈమూడుశరీరములుకు పైచెప్పిన జ్వరములకు యెట్లు స్వభావసిద్ధములో ఆప్రికారము చిదాభాసునికి ప్రికాశమే స్వభావముగాని వానికి జ్వరములేదు. స్వభావమైనా స్వభావముకాదు. ఇట్లు చిదాభాసునకే లేనిజ్వరములు- సాక్షికి ప్రశక్తి యెంతమాత్రిములేదు. అందుచేతనే వేదము బ్రిహ్మజ్ఞానికి శరీరానుతాపము లేదని వేదములు చెప్పుచున్నవి- ఈప్రికారముగా లేనితాపము జ్వరము ఇనుముయం దుక్కుతప్పింపచేసినది- అజ్ఞానముచేతను పుత్రిదారాదులు తపింపగ- తాను తపించుచున్నాననే మూఢునివలె- శరీత్రియములను- సాక్షిని వొక్కటిగాకూర్చి- తనరూపముగా నెంచకొని- తానే ప్రిత్యక్భిన్న పరమాత్మయనిదెలసి- శరీరము తపింపగ- తాను తపించని యట్లు భ్రిమించును —

శ్లోకం॥ భ్రిమేణాహం భ్రిమత్వంచ భ్రిమేణోపాస కాజనః- భ్రిమేశేశ్వర భావత్వం భ్రిమమూలమి దంజగత్- అనియున్నది గావున- వివేకముచేత భ్రాంతిని ద్రోసివేసి- తన్ను సాక్షిగా నెరిగిననెనుక- తన్ను దాదెలసిన వెనుక- మునుపటి- శరీరపరితాపము పోవును- యారజ్జువునుజూచి యెందుకు పరుగెత్తి గ్రిందపడి- పండ్లువిరిగి పోగొట్టుకొనియుంటిమి అన్నట్లుగా ఆరోపిత భుజంగమమరగక పట్టునే స్ఫురదధిష్ఠానరజ్జువునిగనిన సంసారమును మోల పైనివేసికొంటిని- యేనుగు- మహాఘనమైన జంతువు అయినప్పటికి- తనముందరనున్న చెత్తతానే తొండముతో దీసి తననెత్తిననే వేసుకొనును- అనునట్లు- అనృతజడ దుఃఖాత్మకమైన సంసారమును తనపైనివేసికొని- నేను- నాది- అనే అహంకార మమకారములుగలిగి- అహంభావముతో- వ్యవహరించుచున్నది గావున లేనిసంసారమును మోల పైనివేసుకొంటిని- అని వైరాగ్యవివేక జ్ఞానముగలిగినదే- విరక్తి తాముగాని- శరీరతాపము నిత్యముగాదు- గావున- ప్రిత్యగ్భిన్న పరమాత్మయైన సాక్షి తానని తెలసితే చాలునుగదా అప్పటప్పటికి చేయవలసినవి అడుగడుగు నకు దేహమునేను కాదని

భావించవలసిన కారణమేమనగ- శ్రుతి॥ మూలాభావ ఇదం జ్ఞాతుం నశరీరం నకి మస్థి- అనె గురువాక్యమును- అడుగడుగునకు దేహము తాగాదనే- గురువాక్యం మరువకూడదు- మరచిన భ్రాంతిచేకూడును. నీటిమీదనాచువలె- తిరిగి ఆవరింప బడుచుండును గావున కాని సంసారమును- ఆత్మయందు ఆరోపించితిరిగదా ఆరోపణను క్షమించవలెనని- తన్ను తానే తెలియవలెననెడి గురువాక్యం- గావున సాక్షిని శరణుపొందునట్టుల చేసిన పాపముపోవునట్లు ప్రాయశ్చిత్తము చేసికొనునట్టుల, సంచితకర్మవీడి పోవునట్టుల- ఆత్మానుసంధానము చేయడమగును. నీచజాతివానిచేతికి దొరికిన బ్రాహ్మణుడు అనగ- శ్రీశంకరులవారు ఛండాలరూపముతో- యీశ్వరుడైన- చండాలరూపముతో- వచ్చి బ్రాహ్మణుడైన శంకరాచార్యులవారు ప్రాయశ్చిత్తము చేసికొని- బ్రాహ్మణులతో కూడినవారు- మరల నీచజాతివానితోగూడితే పారిపోయినట్లు దేహము నేనుకాదని ఆత్మానుసంధానము చేయుటయగును- జ్ఞానియైనవాడు మునుపటివలె ప్రపంచవ్యవహారము చేయకపోవుటకు కారణమేమిటి అనగ- గుహ్యమందు కుష్ఠుగలిగి వేశ్య యొంగినవానిముంగట- న్యాయమాడుటకు సిగ్గుపడునట్లు చిదాభాసుడును- తన్ను మాయామయమని తెలిసినపిదప తానుకర్తయని చెప్పుటకు- సంకోచకయుండెనుగదా- అనగా సిగ్గుగాదా- బ్రహ్మజ్ఞానికి- సిగ్గుపడుట- భయము కోపము- యీమొదలైనవియుండున- యుండవు- బహుళసంకటములు ప్రాప్తంబులైనచో తల్లడింపడాత్మతత్వవిదుడు- వాయుశీతవహ్ని వర్షాతపంబుల యించుకైన గిరిచలించనట్లు యను న్యాయంబున్నది- యువరాజుగా నుండువాడు, రాజ్యనిమిత్తముగ, రాజును ఆశ్రయించినట్లు, బ్రహ్మమును తెలసినవాడు- బ్రహ్మమే- అగుననే వేదవచనమువిని- బ్రహ్మమును గంభీరముగా- బ్రహ్మైక్యాను సంధానము జేయుటయేగాని భీతిలేదు గావున- బ్రహ్మజ్ఞాని- చిదాభాసుడైన జీవుని చంపవచ్చినందుచేత యెవ్వడైనా తాను చచ్చుటకు మందలించునా- కాబట్టి దేవత్వము వచ్చుననే సంతోషముచేత గంగాప్రవేశము చేయునట్లు బ్రహ్మము కావచ్చుననే సంతోషము చేత జ్ఞానము అభ్యసింప వచ్చును. గంగాప్రవేశము కాగానే దేవుడు అయినట్లు- జ్ఞానులు- జ్ఞానమువచ్చిన తత్క్షణమే- బ్రహ్మము గావలయును గాబట్టి ప్రారంభించి కర్మలుతీరి శరీరము నశించు పర్యంతము మనుష్యుడను సంజ్ఞ నిలిచినట్లు ప్రారబ్ధదేహము పడిపోవు పర్యం

తము- చిదాభాసజీవుడను పేరుపోదుగాబట్టి- ప్రారబ్ధావసానకాల పర్యంతము అనుభవించకతీరదు.

రజ్జువుసర్పము అని తెలియగానే, సర్పమనె భ్రాంతిపోలేదా- రజ్జువని తెలసినవెనుక సర్పభీతి క్రిమముగాతీరినట్లు- దశముడు- అనగ పదియవవాడు దెబ్బతిననివెనుక, ఆదెబ్బయొక్క వేదనక్రిమముగా తీరినట్లు, ప్రారబ్ధకర్మ భోగము క్రిమముగా అనుభవించి తీరవలయును. జ్ఞానముగలిగియు ప్రారబ్ధదుఃఖము వుండినంతట దుఃఖనివృత్తియనే ఆవస్థవ్ర యెట్లుకూడును- కావున- పదియవవాడు చావకయుండగ- తన్ను తాచూచిన సంతోషమువలనఁ దెబ్బయొక్క దుఃఖము తోచకపోయినట్లు, తానే బ్రిహ్మమని ముఖ్యుడైన సంతోషము ప్రారబ్ధదుఃఖమును తెలియనీయదు గనుక ఆరవఅవస్థకూడును గావున చిదాభాసుడైన జీవునియొక్క ఆరుఅవస్థలు తెలిసినవి- యెడతెగని ఆనందావాప్తిని విశదముగా చెప్పవలయును ఇహలోకపరలోకములను గురించి- చేయవలసిన కర్మలంతయు చేసితీరినందువల్ల మోక్షమున్ను బ్రిహ్మమే నేనని తెలిసినందుచేత మనస్సులో, యేకొదవయులేదని యెరింగినందువలన, యెడతెరిపిలేని బ్రిహ్మనందమున్ను గలదు గావున, మంత్రిత్రియమునందు చెప్పబడిన అనుష్ఠానములలో ఒక్కటైనాచేయక యుండిన్ని యంతయు చేసితీరవలయునని చెప్పుచున్నది- గావున- అంతాతీరిన అప్పుపత్రమువలె- వీరేను, అన్నట్లు, బ్రిహ్మజ్ఞాన సంధానముచేత తీరును గావున చేయవలసినది- తెలియవలసినది అక్కరలేకపోయెను- ఈ అను సంధానము యెట్లలనిన, నేను దుఃఖననియును, అజ్ఞానిననియును, అజ్ఞానికిభూమి, ధనము, పుత్రి, మిత్రి, కళత్రాదులు కావలెను అని యిహలోక సంసారమునందు తిరిగి శ్రమపడవలయును. బ్రహ్మమందు పరిపూర్ణముగా నుండుగాని, మాకు మాయామయముగా నుండువాటిని కోరలేదు గావున పరలోకమును పొందవలయును అని, కోరికగలవానికే అందుకు తగిన కర్మానుష్ఠానము చేయవలెను గావున, సకలలోకములను మాయామయముగా చూచుచున్న మాకు ఒక్కకర్మయూ నక్కరలేదు కర్మరహితమే జన్మరహితం —

॥నిరావరణోపనిషత్॥ ప్రిమాణం॥ ద్వైతాద్వైత వినిర్ముక్తః పూర్ణో బోధోవశిష్యతె- నిత్యం సర్వగతం లింగం లీనగంమ్యానవిద్యతె- అచలం చా

వ్యయంపూర్ణం మనంతమృతశ్శివః- ఇత్యాద్యుపనిషత్ ప్రమాణములు చెప్పుచున్నవి- గాబట్టి—

బ్రహ్మలోకమును బొందుదుననె కోరికగలవానికి, వేదశాస్త్రములు అభ్యసించవలయునె గాని- నిరధకారిగా నుండువానికి నక్కర లేదు- కావున- బ్రహ్మ ప్రాప్తిగలవానిక అక్కర లేదు. కావున ఆత్మనిశ్చయం- గురువాక్యమే గావలయును గావున తత్వమును దెలిసినవానికి వేదాంతోపనిషత్ ప్రమాణ ములచేత శ్రవణము చేయవలెను గావున- యిట్టి శ్రవణము చేసినవానికి నక్కర లేదు. సందేహముగలవానికి మననముచేయవలయు దేహము నేన ఒకప్పుడు గానిపించక సందేహము తెగి బ్రహ్మైవాహమస్మియె, బ్రహ్మమె తానైయున్న మాకు మననము అక్కర లేదు. విపరీతభావన వానిక నిధిధ్యా సనము చేయవలయును. దేహాది విలక్షణముగానుండు తనకు నిధిధ్యాసయు నక్కర లేదు= యెట్లనిన ॥శృతి॥ (నిరాలంబోపనిషత్తు॥ శ్రవణమనవ నిధిధ్యా స సమాధి భ్రాంతిలక్షణం బ్రహ్మవిశ్వం ద్వయంమిధ్యా ఇతినిశ్చయమెవహి- శిష్యోర్నాస్తి గురోర్ నాస్తి నాస్తి జ్ఞప్తికదాచన, ఏతద్వాక్య విభోదోయం గురువాక్యే నలభ్యతే॥ ఇత్యాద్యుపనిషత్ ప్రమాణంబులు చెప్పుచున్న వి-గావున ॥శృతి॥ శ్రవణంచ గురోర్ పూర్వ్యం మననంత దనంతరం-నిధిధ్యాస సమానేషు సమాధితస్యలక్షణం- గావున- విక్షేపము గలిగియుండువాని సమా ధిగలిగియుండును. బ్రహ్మమాత్రమైన తనకు అక్కర లేదు- విక్షేపమున సమాధిన్ని అంతఃకరణమునకే గనుక చేయవలసినదంతయు చేసితీరవలయును గావున- వ్యవహారము గలిగియుండగ తనకు విపరీతభావన లేదని చెప్పవచ్చు న కూడదనుట- యెట్లనగ- నిద్ర, బిక్ష, స్నానము, శౌచము, మొదలైనవి తానుచేయుగ- తనకే స్వర్గాది భోగములు గలుగును.

అనృతజడ దుఃఖాత్మకమైన- సంసారమనే అవస్తాత్రయమునందు జీవుడు వ్యవహారము కులాలచక్రమువలె- అనగ కుమ్మరసానవలె- అవస్తా త్రయములనే వాసనలచేత నడుచుచున్నదెగాని- తనకు విపరీతభావనలేదు- అన్యుడు గురుగింజల రాశినిచూచి అగ్నియని చెప్పినమాత్రమున చెట్టును దహింపుచేయదు- ఈరీతిగా తాను కర్తయని అనుకొన్నమాత్రమున- దాను- అవస్తాత్రయము లందు నిద్రించు వాడుగాడు- గావున- ఇట్లు

వ్యవహారవాసనచేత గలిగిన వ్యవహారముకూడా పోవలదా-గాబట్టి, ప్రారబ్ధకర్మము తీరితేనేతప్ప వ్యవహారముపోదు. అయినా తనయొక్క వ్యవహారమునకు విధియెట్లనిన, లౌకిక వైదికాతిశయములు ప్రారబ్ధమున్నట్లుగ నడుచునదే విధిగానుండును- ఇట్లుయినపక్షమునందు సకలజనులకు అప్రమాణబుద్ధి వచ్చును. మీరు పెద్దలనిమిత్తములను- జ్ఞానము అడిగేవారునులేరు.- తనజ్ఞానము తనకుమాత్రము ప్రయోజనమేగాని- అన్యులను రక్షించుటకుగాదు గావున- అయితే నేను కృతకృత్యుండయి నా లోకానుగ్రహార్థమై దేవతార్చనశౌచము మొదలగు కర్మములను- శరీరముచేయని- ప్రణవజపము వేదాంతఅధ్యయనము మొదలైన కర్మలను- వాక్కులచేత చేయనిమూర్తి ధ్యాన్నమును, బ్రహ్మధ్యాన్నమును, మనస్సుజేయని, నేను చేసినవాడనుగాను, చేయనివాడనుగాను, యని, యిట్లు తాను యుండినపక్షమునందు కర్మలను తనకు వివాదములేదు గావున- జ్ఞానము పరులకు వుపకారమే యగును గాబట్టి కర్మమునకు నిర్బంధము దేనియందుయున్నది జ్ఞానమునకు నిర్బంధము దేనియందుయున్నది- గావున, జ్ఞానికి బద్ధమని తోచబడిన త్రివిధ కరణముల చేతను- అనగ- మనోవాక్కాయ కరణములచేతను- కర్మలను చేసినా తనకు హానిలేదు. తాను- సాక్షిఅపుట- లేదు- గావున- హానియునతనికికూడా చెప్పవచ్చును- జ్ఞానమునకు నేను అసంగుడను- అనుటయందు నిర్బంధమెగాని త్రివిధ మనోవాక్కాయ కరణములయందు నిర్బంధముగాని త్రివిధకరణములకు కర్మలతోయనవసరములేదు గావున, జ్ఞానియైనవాడు- తాను బ్రహ్మమని తెలిసినందువల్ల కర్మచేత ఏమిహానియున్నది. నిష్కామకర్మ చేయువాడు బ్రహ్మజ్ఞాని- గావున- యిట్లు అందరు తెలియక- ఆత్మత్రికర్మములతోగూడా కర్తయని చెప్పు కర్మలున్న, జ్ఞానముగాగాత్రివిధకరణములకు ఒకకర్మయు వలదనియుండు- బ్రహ్మజ్ఞానులు- ఒకరికొకరు వాదములను చేయవలసిన పనియేమి- వారలు అజ్ఞానముచేత- బధిరులు కథ విన్నట్లు వాదములు చేయుచున్నారు. జ్ఞానము గలిగినవానికి పరులను యపేక్షించియైనా కర్మప్రవృత్తి ఉచితముగాదు గాని- విధిపూర్వకముగా చేయవలయును. నివృత్తిసన్మార్గములయందుకూడా వుండవలయును. జ్ఞానికి, ప్రవృత్తివలన ప్రయోజనము లేనందువలన, నివృత్తియందుకూడా ప్రయోజనములేదు గావున నివృత్తియైనది జ్ఞానమునకు సాధము

తన్ను తా దెలిసినవెనుక యేసాధన నీ కెందుకు పీసానికి పనికిగాదు గావున- ఆపరబ్రహ్మ స్వాత్ముండనైన తనయందు, తోఁచబడిన జగద్ భ్రాంతి, చేత, యిక జ్ఞానభ్రాంతి వచ్చిన, సాధనములు అనుష్ఠించినపట్ల యేమిలోప మున్నది. కావున బ్రతికియుండు, మెలుక, పిల్లిని చంపనేరదు అని యుండగ చచ్చినమెలుక పిల్లిని చంపెనన్నట్లు వలెను పాశుపదాస్త్రముచేత చంపకూడదని వాసని, దర్భపుల్ల చంపెనన్నట్లును, అనాదియందు, అజ్ఞాన తత్కార్యములంతయు కూడి చంపనేరక యుండు బోధయే. తానే దృక్జ్ఞానముచేత చంపబడిన అజ్ఞాన తత్కార్యములు నష్టమైపోయినా- జగత్తు తోఁచుచుండడము చూచి శృతులు చెప్పుచున్నవి. కావున, తోఁచితె యేమాయెను, రణమందు హతమైన కళేబరములను చూచే రాజునకు- యింతకు నేను గదా హతముచేసితిని అను తృప్తిమెగాని, భయములేదు- యిటువంటి బోధ సూరునకు- దేహాదులు చెడి ప్రవృత్తి నివృదు- నివృత్తి కావచ్చును, అనే నిబంధనయెవరికి- పరమాత్మయైన తనకు- చిదాభాసునకు- భోగమోక్షములను గూర్చి యత్నముచేయు అజ్ఞానికి గావున, అటువంటి అజ్ఞానితో జ్ఞాని కూడి యుండునప్పుడు చేయగల కార్యము యేమియున్నది. ప్రియుండైన పుత్రుడు కొట్టినా తిట్టిన తండ్రి మనస్సునందు మాడక తిరిగి ముద్దులాడేటట్టు అజ్ఞానులు భూషించినా దూషించిన, తిరిగి తాను అట్లు వారలకు జ్ఞానమును బోధించవలయును గావున- జ్ఞానికి- జ్ఞానాభ్యాసము చేయువానితో కూడియుండునపుడు శ్లోకం॥ సత్సంగత్వే నిస్సంగత్వం- అను నట్లు, చేయు కార్యములు యెట్లు- జ్ఞానమును బోధించి, కర్మలను దూషించి తాను కర్మలను విడచి పెట్టునట్లు చేయవలయును- జ్ఞాని తానుమాత్రము యుండునప్పుడు చేయు కార్యములు యెట్లు చేయవలయును. తనయొక్క కృతకృత్యానందమును చూచి సంతోషించి- బ్రహ్మమె తా నని తానె బ్రహ్మమని- తన్ను తా దెలిసినందుకు- యేమిభాగ్యము చేసితినో- అజ్ఞానజడమైన జీవభ్రాంతి యెక్కడకు పారిపోయినదో నేను చేసిన అదృష్టయత్నముచేత తనకు యే సంసారము లేకపోయెనుగదా. తనకు బ్రహ్మానందముయొక్క నిలకడ బట్టబైలుగా తోఁచేటట్టు దొరికెనుగదా ॥వేదశృతి॥ అయం వ్యర్థబాహ్యకోపి భవతి అను నిజగురువాక్యం దొరికెను గదా యని- బ్రహ్మానందము- గావున- లోకమునందు పొందగిన పెట్టియుండు కర్తవ్యములు- తనకు అక్కర

లేకపోయిన భాగ్యము ఏదియో గదా- నాకు యింతభాగ్యమును- యిచ్చిన శాస్త్రమును, స్తోత్రముచేసిన పొగడింతునా- ఈశాస్త్రమును అనుభవానికి వచ్చునటుల జేసిన- గురువులు వారిని నుతిచేసితిని గదా- ఏపుణ్యముచేత యిటుల ఫలించినదో. ఆపుణ్యమునకును జ్ఞానమునకును- బ్రహ్మానందమునకును సమయము కానరాదని చూచి సంతోషించి- ఏకాలమందు తన స్వభావానందమునందు తాను తానైన బ్రహ్మానందమునందు అనుభవించునదే, చేయదగిన కార్యములగును.

సమాప్తము.



# శ్రీ మహాఋషి నిఘంటివిత యోగశాస్త్రము

## జన్మజిజ్ఞాస.

గౌతమమహాఋషి కల్మషపాదునకు జన్మజిజ్ఞాస బోధించుట.

పరమేశ్వరుచే సృజింపబడిన అనంతకోటి సకలజంతుజాలములలో, మానుషజన్మము అన్నివిధములను శ్రేష్ఠము, తనకు మేలు గలుగజేయు దానిని స్వీకరించుటయు కీడు గలుగజేయుదానిని విడుచుటకును, దగిన బుద్ధి గలవాడే ధీనిధియైన బ్రహ్మవిద్వరిష్ఠుడు గావున ॥శృతి॥ విచిత్రాదేహ సంపత్తి, రీశ్వరాయ నివేదితం పూర్వమేవ కృతారాజా హస్తపాదాది సంయుతా॥ అన్నట్లు, పరమదయాసముద్రుడగు పరమేశ్వరుడు, యీమనుష్యులు, తన్నారాధించి, తన్ను తా దెలిసకొని, ముక్తినిబొందుటకు, కర్మేంద్రియ వర్గముతో, గూడిన కళేబరమనె దేహము నొసంగెను, గాని, ద్వివిధవస్తువు లైన యీనరులు, ॥శృతి॥ కర్మపూరిత దేహానాం ధర్మశాస్త్ర మరోచకం. చర్మఖండన భక్ష్వానాం శ్వానం ఘృతమరోచకం॥ అను నట్లు యీ నరపశువులు అనగ, అజ్ఞానులు, కర్మపూరిత దేహధర్మములయందు ఆసక్తి యుండి ధర్మశాస్త్రములయందు మనస్సు చొరనీయక, అరోచకముగా చూచును. ఎట్లనగ, శ్వానం అనగ, కుక్క, ఘృతం, అనగ, నెయ్యి అందుకు కుక్కకు నెయ్యి యిమడదు- యిష్టముండదు. అజ్ఞానజడమైన మనుజునకు- ఆత్మానాత్మ వివేకమనె ధర్మం మోక్షమార్గమందు యిష్టముండదు. మాంసపు కండలు భక్షించు కుక్కకు- నెయ్యియందు- యిష్టముండదు గాబట్టి మనుష్యుడు నది దాటుటకు యియ్యబడిన, తెప్పతో సముద్రములో బడినట్లు, అనగ, దాటలేక సమిధలు గొట్టుటకు యిచ్చినకత్తిచేత గోవుమాంసమును ఖండించినట్లున్ను స్వధర్మోపకరణముగా పరమేశ్వరుడు, తనకు నిచ్చిన దేహ

మును దుర్విని యోపకరణముగా సాధనముఁ జేసుకొని దేహేంద్రియ మనఃప్రాణముబుద్ధ్యాదులకంటె విలక్షణమైన, సచ్చిదానంద పరమాత్మయై యొప్పు ఆత్మ యొక్కటి యున్నదను, జ్ఞానము లేశము లేనివారై యుండుటయే గాక, మీఁదుమిక్కిలి శరీరమందు ఆత్మభ్రమ గలవారై అనగ, దేహభ్రాంతి గల వారై, నేను చిక్కియున్నాను నేను బలిసియున్నాను- నేను, నాది యని వ్యవహరించుచు ॥శృతి॥ ఇదమద్య మయాలబ్ధ, ఇమం ప్రాప్స్యమనోరథమ్ ఇదమస్తీదమపిమే, భవిష్యతి ॥పునర్ధనఁ ధ్॥ ఇది నాకు లభించినది, నాకు దొరికినది, ఈకోరికను బొందుచున్నాను, పొందబోవుచున్నాను- యీవిధమున నాకు యున్నది- మరల నీది నాకు రాబోవుచున్నది—

॥శృతి॥ అసమయా హతశత్రు ర్హనిష్యే చాపరానపి, ఈశ్వరోహ, మహంభోగీ శిద్ధోహం బలవాన్ సుఖీ॥ అనగా యీశత్రువు నాచేత జంప బడెను, యితరశత్రువులను వధించబోవుచున్నాను. నేను ప్రభువును నేను భోగిని, నేను బలవంతుడను నేను సుఖిని. కావున ॥శృతి॥ ఆఢ్యోభిజనవా నస్మికోన్యోస్తి సదృశోమయా, యక్ష్యేదాస్యా మిమోదిష్య ఇత్యజ్ఞాన మోహితాః॥ అనగ, నేను ధనికుడను, కులీనుడను, నాతో సమానుఁ డెవఁడున్నాడు. నేను యాగములను జేయుచున్నాను జేయబోవుచున్నాను అని యజ్ఞానముచే మోహింపబడినవారై ॥శృతి॥ అనేక చిత్తభ్రాంతి, మోహజాల సమావృతాః, ప్రసక్తాకామభోగేషు పతంతి నరకే ఽశుచౌ —నేక చిత్తవిభ్రాంతులతో గూడినవారై, మోహమనెడి వలచేత గట్టబడినవారై కామభోగములయందు జిక్కువడి అశుద్ధమగు నరకమందు గూలుచున్నారు. ఎట్లన ఒకచిన్న యుదాహరణ- యెట్లనగ యేనుగ గొప్పజంతువై యుండియు, తనపాదముల క్రిందయున్న తాను త్రొక్కిన చెత్తను, తనతొండముచేత దీసి, తన కుంభస్థలమందుననే యీపెంటను చల్లుకొనును. దేహమంతటను అమేధ్యమును బూసుకొని బిందెలతో నీళ్లుదెచ్చి కడుగుకొనునట్లు—

శృతి॥ అమేధ్యపూర్ణే క్రిమిజాలసంకులం స్వభావ దుర్గంధమశౌచమ ధ్రువం కళేబరం మూత్రపురీషభాజనం, రమంతి మూఢా నర మంతి పండితాః॥ అనునట్లు యీనరకమందు- అశయనేగర్భనరకమందు గూలుచున్నారు. పునరావృత్తికారణమై పుట్టుచు చచ్చుచుందరు గావున, యీశ్లోకముల యందు చెప్పబడిన ప్రవృత్తిగలవారై॥ శృతి॥ నిద్రయా హ్రియతే నక్తం, వ్య

వాయేన నవంనయః, దివాచార్రేహా యారాజక, కుటుంబకళేనచ దేహా పత్యకళతాదిి, ప్రాత్మస్నేష్వప్య సత్స్వపి తేషాంప్రమత్తో నిధనం పశ్యన్న పినపస్యతి, సద్యస్సూదిత ఆదిత్యే, న న స్యత్తు మి తేరతా ఆయుఃపరిశ్రవతి భిన్న ఘటాదివాంద్భుః॥ అనునట్లు రాత్రి కాలము నిద్రచేతను వయఃకాలమున గ్రామ్యకర్మాసక్తి చేతను, పగటివేళను, కుటుంబ భరణముకొరకు ధనార్జన శ్రమచేతను, గడువుచు బొక్కగుండలోని జలమువలె బ్రతిక్షణము, క్షీణించెడు నాయువు నెరుగక, క్రొత్తసంవత్సరము వచ్చినదనియును సంతోషించుచు, తన దారపుత్రాదులు, దేహబాధువులు, మిత్రులు, మృతినొందుటను- తాను కన్నులార అనుదినము జూచుచున్నను తనకుకూడ నట్లు అవస్థయెప్పుడో తప్పక సంభవించునని, ప్రమత్తతచేత తెలిసికొనజాలక, గృహారామక్షేత్ర విత్తాదులకై స్వజనమునుగూడ బరిమార్చుచు, ॥శ్రుతి॥ సంసారతాపానఖిలానీ వాప్నోత్యతి సంతతాక, అనునట్లు, అధ్యాత్మిక అతిదైవిక అతిభౌతికమును త్రివిధదుఃఖముల నొందుచు, జననమరణ ప్రవాహమునొందు అనగ జననమరణ ప్రవాహములలో మునుగుచున్నారు—

శ్రుతి॥ ఏవంసంశ్రుతిచక్రస్తే భ్రామ్యమాణె స్వకర్మభిః, జీవే దుఃఖాకులే విష్ణోః, కృపా కాప్యుపజాయతే ఉద్ధరే చాస్త్రప్రాణినా హార్దుంతమస్సదసతీ చవివేక్తు మిాశోమానసు, ప్రదీప మివకారుణే కోదదాతి॥ అనునట్లు తనదుష్కృత కర్మములచే నెన్నటికిని దెంపులేని సంసారమందు బడి దుఃఖములను బొందుచున్న జీవులనుజూచి, పరమదయా సముద్రుండగు శ్రీమన్ నారాయణుడు అయ్యో పాపం యీప్రలందరును ॥శ్రుతి॥ సుఖం మెభూయాత్ ॥ నాకు సుఖముగుగాక.

శ్రుతి॥ దుఃఖం మాభూయాత్ ॥ దుఃఖము గలుగక పోవుగాక, యని గోరుచున్నను, నాత్మహిత మిారు గనిపిల్లలవలె విషయోప భోగజనితము క్షణికము దుఃఖ పర్యవసాయమగు, నాభాససుఖమును, నిజమైనసుఖముగాను దలంచుచు దానికొరకే యెల్లప్పుడు, ప్రయత్నించుచున్నవారై- అనంతము స్థిరము స్వకంఠదద్వత మణివలె, నిత్యాసిద్ధమునకు, నాత్మప్రాప్తి సుఖము, నపేక్షించుచున్నారు. పరమేశ్వరుడు అనేక జన్మసంచిత దుష్కర్మసంపాదిత అధ్యాత్మిక దుఃఖత్రయమునుండి విముక్తులై, పూర్వోక్తాత్మ ప్రాప్తి రూపానంతర సత్యసుఖము నొందువారు గావలయునని సంకల్పించి ॥శ్రుతి॥ అజాయ

మానోబహు దావిజాయతే, సగ్ శ్రేయాన్ భవతిజాయమానః సంభవామియుగేయుగె॥ అన్నట్లు రామకృష్ణాది రూపములతో నీలోకమందవతరించి, హనుమ, దుద్ద, వార్జునులకు పరతత్వ ముపదేశించియు స్వాంశభూతులగు పరాశరీయమను, పారాశర్య, వాల్మీక, కపిల, పతంజలి జైమిన్యాదిమహాఋషుల నీజగములోన నవతరింప జేసియు శిక్షావ్యాకరణాద్యంగములతోను న్యాయ వైశేషిక సాంఖ్యయోగ పూర్వోత్తర మీమాంసా రూపారూపోపాంగముల తోను గూడినవేదమును, ప్రకాశింప జేసియు, చేతనోద్ధరణము గావించెను. ఈవేదమును యధాప్రకారముగా, బరిశీలించినచో, సకలప్రాణులకు ధర్మార్ధకామమోక్షములను, చతుర్విధ పురుషార్థములు సిద్ధించుచున్నవి. ఇదియే సర్వశాస్త్ర జ్ఞానప్రసవభూమి ఆపాతముగా నాలోచించిన యీవేదమందు అచ్చటచ్చట గొన్ని పరస్పర విరోధములు కానవచ్చినను, మందబుద్ధులగు వారికి, మొట్టమొదట సూక్ష్మాంశములయందు బుద్ధిజొరదు గాన, క్రమముగా స్థూలసూక్ష్మ విషయముల యందు అధికారి తారతమ్యముచేత, జ్ఞానము కలగవలెనని చేతనులు గ్రహించుటకు, సాంఖ్యయోగాదర్శన పరంపర సోపాన రూపముగా, నిర్మింపబడినది. ఈదర్శనములకు నీవాంతర విషయములలో, గొన్ని పరస్పర విరుద్ధాంశములు వున్నను పర్యవసానమందునవి, యన్నియు, చేతనులకు సకలదుఃఖములను, నశింపజేసి, నిరతిశయాహ్లాద లక్షణమగు మోక్షము నిచ్చుటలో, నైకమత్యము నొందుచున్నవి. మోక్షసాధనములు, అనేకములు, ఋషులచేత వక్కాణింపబడి యున్నవి. ఎట్లనగ ॥శృతి॥ సత్యం కేచిత్ప్రశంసన్తి తపశ్శాచంత థాపరే, క్షమాం కే, చిత్ప్రశంసన్తి తథైవశమ మార్జనమ్ కే చిద్దానం, ప్రశంసన్ని, పితృకర్మతథాపరే, కేచిధర్మ ప్రశంసన్తి లేచి ద్వైరాగ్య ముత్తమమ్ అగ్నిహోత్రాది కంకర్మత థాకేచిత్పరం విదుః ఏవం బహూను పాయాంస్తా ప్రవదంతి విముక్తయె॥

అనునట్లు కొందరు, సత్యము, శౌచము, తపస్సును, మరికొందరు అగ్నిహోత్రాది కర్మములను, వేరొకకొందరు వైరాగ్యమును, యింకొక కొందరు ప్రకృతిపురుష వివేకమును, మోక్షసాధనము అని చెప్పుచున్నారు.

శృతి॥ ఆలోక్య సర్వశాస్త్రాణి, విచార్యః చపునఃపునః
ఇదంమేకం నిష్పన్నం యోగశాస్త్ర పరం మతమ్॥
యస్మిన్ జ్ఞాతె సర్వమిదం, జ్ఞాతం భవతి తత్వతః

తస్మిన్ప్రరిశ్రమః కార్యః కిమన్యఛాత్రిభాషితమ్॥
కులేమహతి జాతేన, స్మాత్మన శ్శ్రేయఇచ్ఛతా
ఆత్మజ్ఞానే శ్రమః కార్యాయజ్ జ్ఞాత్వామృత మశ్నుతే॥
ఏతావాన్ సాంఖ్యయోగాఖ్యాం, స్వధర్మపరినిష్ఠయా
జన్మలాభః పరఃపుంసామ్॥
సగుణీసచ ధర్మిష్ఠసని వివేకీ సబుద్ధిమాన్ బ్రహ్మజ్ఞానే మతిర్యస్య
శేషాః పశుసమానరారి॥ ఇత్యాదిశ్రుతి ప్రమాణములు —

ఎవరెట్లు యభిప్రాయపడినను, సర్వశాస్త్రములను. విమర్శించి చూడగ ప్రకృతి పురుషవివేకమువలన, నాత్మ సాక్షాత్కారమును గలిగించు యోగముకంటె అధిష్ఠానమగు, ముక్తిసాధనము యింకొకటిలేదని, నిశ్చయముగా చెప్పనచ్చును. అది సర్వజ్ఞానప్రదము. వివేకియగువాడు మోక్షప్రదమగు, నాత్మజ్ఞానమును సంపాదించుటకు బాగుగ పనిపలయును. సర్వవర్ణాశ్రమోచిత ధర్మాచరణమువలనను, సాంఖ్యయోగమువలనను గలుగు జ్ఞానమే పురుషుల కుత్కృష్టలాభకరము. ఎవ్వడు బ్రహ్మజ్ఞాన సంపాదనము దభిలాషగలవాడో, వాడె గుణవంతుడు. వాడె వివేకి. వాడె ధార్మికుడు. వాడె బుద్ధిమంతుడు. ఇతరులు పశుప్రాయులు. శ్రుతి॥ జ్ఞానం నరాణాం మధికోవిశేషః జ్ఞానేనహీన పశుభిస్సమానః॥ ఆత్మానాత్మ వివేకజ్ఞానము లేనిమనుజుడు, నరపశువని యిత్యాదిశ్రుతిప్రమాణములు చెప్పుచున్నవి. ॥శ్రుతి॥ తత్ జ్ఞాన, మజ్ఞాన, మతోన్యదుక్తమ్ సావిద్యాయముం వినుక్తయే। అనునట్లు మోక్షసాధనమైనది. ఏజ్ఞానము యింతకంటె వేరైనది యజ్ఞానము, ముక్తికొరకు అగునది యేవిద్య- శ్రుతి అనంవాచోవిముంపధ నాచోవిగ్లాపనంహితత్। తత్త్వశాస్త్రేతరవాక్కులను విడిచిపెట్టుడు. తత్త్వశాస్త్రేతర వాగ్వ్యవహారము, కేవలము వాక్కులకు శ్రమకరము అని స్మృతులు ఘోషించుచున్నవి. పైన వ్రాయబడి నశ్రుతిస్మృతి పురాణవచనములబట్టి వివేకుల కాత్మశాస్త్రమె అవస్యాదరణీయము గాబట్టి ఆత్మస్వరూపము- పరమేశ్వర స్వరూపమును తెలుసుకొనుటయె జ్ఞానమునకు ముఖ్యప్రయోజనము ఆత్మస్వరూపము, నేను, నేను, అని అహంశబ్దవ్యవహార గోచరమై పండితపామరులు సామాన్యముగా నెల్లజనులచేతను భాయమాన మగుచున్నదియైనను, శాస్త్రజ్ఞాన సహాకృతమైన విమర్శచేగాని తెలియబడదు. శరీరమే తానని పామరులు భ్రమజెందుచున్నారు.

కావుననే తన శరీరముపై నితరులు కొట్టునప్పుడు తాను వానిచేతం గొట్టబడెననుకొనుచున్నాడు. ఇట్టిభ్రాంతి ఆత్మానాత్మ వివేకముగల విద్వాంసులకుగూడ బాధితానువృత్తమై పుట్టుచున్నది. కాని వారలకు పునర్ విమల దర్శనమున నది పరిహృతమైనను, పూర్వవాసనా విధంబున నాపాత ప్రాంతంబై వెండియు, విమర్శనంబున నివృత్తమగుచుండును. పామరుల కట్టి ఆత్మ విమర్శనము లేదుగావున నది దృఢమైయుండును. కొందరు విమర్శించియు జన్మాంతర వాసనవశంబున, విపరీతజ్ఞాన బలాత్కారముగ చేతురు. వారు నాస్తికమతస్థులలో నగ్రేసరులు. వారే చార్వాకులనియును లోకాతిరిక్తులనియును జెప్పబడుచున్నారు. వారిమతములో దేహమే ఆత్మయని సిద్ధాంతము. వీరు వేదప్రామాణ్యముల నంగీకరించరు. ప్రత్యక్షప్రమాణము తప్ప బ్రమాణాంతరముల నొప్పరు. పృథివ్యాపస్తేజోవాయువులను నాలుగు భూతములనుమాత్రమె కలవందురు. ఆకాశమను భూతము లేదందురు. ప్రమాదకద్రవ్యములగు కణ్వాదులనుండి మదశక్తివలె, పూర్వోక్త భూతచతుష్టయ సమ్మేళనముచేసి చైతన్యము జనించుననియు నిట్టిగుట స్వభావసిద్ధమనియు, జెప్పుదురు. దేహాతిరిక్తాత్మ సద్భావమందు బ్రమాణాభావమువలన చైతన్య విశిష్టదేహమే ఆత్మయని వీరిఅభిప్రాయము. అర్థము కామములే వీరికి పురుషార్థములు. కంటకశస్త్రపాతాది జన్యమైన దుఃఖమే నరకము. లోకముననుండు బ్రథితయశుడైన భూపాలుడె భగవంతుడు. దేహనాశమె మోక్షమనిచెప్పుదురు. బౌద్ధమతస్థులు దేహము, ఆత్మ, క్షణిక మనగ, ప్రతిక్షణము మారునని చెప్పుదురు. అర్హులు ఆత్మదేహ పరిమాణమని వచింతురు. అనగ, చీమ దోమ మొదలగు చిన్న జంతువులందుండు ఆత్మ చిన్నది. గజము మొదలగు పెద్దజంతువులయందుండు ఆత్మపెద్దది అని వారి సిద్ధాంతము. శరీరమే ఆత్మయనుట యనుచితము, శరీరమనే అవయవ సంఘాతమని పండితపామరులు సామాన్యముగా నందరు యెరుంగుదురు. ఇన్ని అవయవములును బ్రత్యేకముగా నాత్మలైనచో నొక్కొక్క శరీరములో అనేకాత్మలుండవనవచ్చును. బహురాజకరాజ్యమందువలె నీఅవయవసమూహమందు బరస్పర వివాదములు ప్రశక్తములగును. ఇందులో నొక్క అవయవమే ఆత్మయగుచో అట్టి అవయవంబులకు ప్రఘాతము సంభవించినయెడల చైతన్యము నశింపవలసివచ్చును. అట్లుగాక లోకములో బాణిపాద నేత్రాద్యంగవైకల్యము నొందినవారును జిరకాల

ము జీవించుట మనము చూచుచున్నాము. ఇంతియకాక సర్వశరీరమున వ్యాపించు సుఖదుఃఖానుభవంబుల అనుపపత్తి గలుగును. అవయవములు తప్ప నాది యనునది యొక్కటి వేరుగా గానరాదు. నాశరీరమని తనకును శరీరమునకును భేదవ్యవహారము స్వానుభవ సంబంధమును, సర్వానుభవ స్వభావసిద్ధము. అట్లె నాయాత్మయనియు, వ్యవహారము కలదేయని శంక పొడము. లెస్సగా విమర్శించినచో, నాశంక కవకాశము లేదు. ఆత్మశబ్దము సంస్కృతభాషలో శరీరస్వరూప స్వభావాద్యనేకార్థములం జెప్పుచున్నది. శృతి॥ ఆత్మాజీవేధృతౌ దేహేస్వభావే పరమాత్మని యత్నేర్కేగ్నౌమతౌ వాతే॥ అని నిఘంటువు. కావున నాయాత్మ యనుచో దన శరీరమని కాని తన స్వభావమునిగాని, తలంచుటవలన గాని గలిగెడి వ్యవహారము అంతి యకాని తనకంటె తాను వేరని తలంపునంగాదు. అట్లయినచో తాను నేను అని ఆంధ్రభాషలోగూడ వ్యవహారము గలుగవలసివచ్చినది. ఇంద్రియ ములు ఆత్మ యంటిమేని శరీరాత్మ వాదమందువలె నొక్కశరీరమున అనే కావస్థ లుండవలసివచ్చును. మరియు ఏనేను మునుపు దీనిని జూచితినో యి ప్పుడా నేను దీనినిస్పృశించుచున్నాను అని జ్ఞానముకలుచుచున్నది. చూచుట, చక్షురింద్రియముపని, స్పర్శించుట త్వగింద్రియముపని, ఈచక్షుత్వగింద్రి యములు రెండున్ను, భిన్నాత్మకములైనచో వేరు వేరైన యిద్దరుపురుషులకు వలె నొక యింద్రియమే సంభవింపగూడదు. అట్లుగాక పైన నుదహరించిన వాక్యములో, వీక్షణక్రియాకర్తయు స్పర్శనక్రియాకర్తయును, నొక్కడే యని కర్తవ్యమే ప్రతీతి విషయమగుచున్నది. ఇదిగాక మున్ను కన్ను గలవానికి దురదృష్ట వశమున మాంద్యము సంభవించును. అట్టివాడు పూర్వము తానుజూచిన వస్తువులను, స్మరించుటయుం గలదు. ఇంద్రి యములె యాత్మలైనచో జూచినయాత్మ నశించెనుగదా. ఆవస్తువులను స్మరించువాడెవడు. అయినను అంతఃకరణ మొకటిగలదు. అది ఇన్నిపనులకు బోవును గాన దానిని ఆత్మ యనవచ్చునని శంకతోచును. లోకములో నొక్కపనికి కర్తయు కరణంబు వేరుగా నుండుటను జూచుచున్నారము గాని కర్తయు కరణంబును నొక్కటి గానేరవు. స్మరణాదికార్యములకు నంతఃకరణ మే కర్తయైనచో కరణం బెయ్యది- ప్రాణం ఆత్మయనగాదు. అది యొక వాయువు. అది ఉచ్ఛ్వాసనిశ్వాసంబులచే లోనికి నడుచుచున్నది. అట్లు నడచు

నూర్పును తనచేతిమీాదికి నడపి స్పర్శబలంబున నిది నాప్రాణమని, మనుష్యుడు తెలుసుకొనుచున్నాడు. కావున నిట్టి ప్రాణవాయువు ఆత్మతత్వ మెట్లు సిద్ధించును—కొందరు జ్ఞానమే ఆత్మయని చెప్పుచున్నారు కాని, యీపక్షము శృతిచేతను, యుక్తిచేతను, బాధితము. ఎట్లన ప్రాబాప్రభావ ద్రవ్యమున కెట్లు గుణభూతమో మాధుర్యము, చేగు, తెలుపు, నలుపు, మొదలుగునవి గుణము లెట్లు మరియొకవస్తువు నాశ్రయించి దాని ధర్మమై యుండవలయును. ఇంతియేకాక లోకములో సంవిత్తు, అనుభూతి, అవగతి, జ్ఞానము మొదలగు శబ్దములు సంబంధి శబ్దము లని శాస్త్రజ్ఞులు వాడుచున్నారు. సంబంధశబ్ద మనగ నింకొకదానితో సంబంధించిన సాకాంక్షమైయుండునది. ఎట్లన, పుత్రుడనగా నెవ్వరిపుత్రుడు జనకుడనగా నెవనికి అని యాకాంక్ష పుట్టినట్లు, జ్ఞానమనగా నెవనియొక్క జ్ఞానమని కర్తను, దేని నెరింగిన జ్ఞానమని కర్తను నాకాంక్షించుచున్నది. కావున జ్ఞానధాతునకు లోకమందుగాని, వేదమందుగాని, యకర్మకముగాను అకర్తృకముగాను, ప్రయోగము గానరాదు. జ్ఞానమునకు వుత్పత్తివినాశము లనుభవముచే దెలియబడుచున్నవి. ఇట్లు ప్రతిక్షణము పుట్టుచు నశించుచుండెడి జ్ఞానము నాత్మగా నంగీకరించినయెడల వెనుకటిదినమున తాను చూచినదానిం గూర్చి ఇది నేను నిన్నటిదినమున జూచినవస్తువే యని ప్రతిజ్ఞ గలుగగూడదు. ఈపక్షమున మరియొక ప్రతీతిబాధయు గలదు. అది యెట్టిదనిన, ఆత్మజ్ఞానము కాశ్రయమై యుండునది గాక కేవలము జ్ఞానమే అయినయెడల నేనే జ్ఞానమని తన్ను జ్ఞానమాత్రముగ వ్యవహరించుట తప్ప ॥శృతి॥ అహమిదం జ్ఞానామి॥ నేను దీని నెరుంగుచున్నానని, తన్ను జ్ఞానముగలవానినిగా చెప్పగూడదు. ఈఅర్థమును నేను తెలుసుకొనుచున్నాననుటచే విషయము నెరింగెడు నొక జ్ఞానమునకు తాను ఆశ్రయమను సంశయము తోచుచున్నది. కావున నిట్లాత్మయొక్క జ్ఞానాశ్రయత్వజ్ఞాతృత్వములు ప్రత్యక్షసిద్ధములు. ఈఅర్థము యీాదిగువ నుదహరింపబడిన శృతిస్మృతిపురాణవాక్యములు బలపరచుచున్నవి—

శృతి॥ అథయోవె వేదం జఘ్రాణీతిస ఆత్మా॥ ఇక నెవడు దీనిని వాసన చూచుచున్నానని యెరుగునో వాడు ఆత్మ. ॥శృతి॥ నపశ్యోమృత్యుం పశ్యతి॥ ఆత్మను జూచినవాడు మృత్యువును జూడడు. ॥శృతి॥ విజ్ఞాతార మరేకేన, విజానీయాత్॥ ఓయీ జ్ఞానస్వరూపుడైనవానిని యెట్లు తెలుసుకొన

వలయును ॥శృతి॥ అసఙ్గో హ్యాయంపురుషః॥ ఈపురుషుడు అసంగుడు ॥శృతి॥ ఆత్మాశుద్ధోక్షరశ్శాన్తో నిర్గుణంః, ప్రకృతేః పరః ప్రవృద్ధ్యపచ యౌనస్త ఏకశ్శాఖిల జన్తుషు పిండం పృథగ్యతః పుంసశ్శిరః ప్రాణ్యాదిలక్షణః॥ ఆకాశ వాయ్వగ్నిజల పృధివీభ్యపృథక్స్థితే అనాత్మనాత్మభావంతు కః కరోతికశ్రీ బగే కావున పూర్వోక్తశృతి శ్మృతిపురాణవచన ప్రామాణ్యముచే, నీయాత్మ దేహేంద్రియ మనఃప్రాణబుద్ధి విలక్షణము, ఆనందమయము, నిత్యము, అసంగము అని సమర్థత గలిగినది. పైనజెప్పినయట్లు నిత్య శుద్ధబుద్ధముక్తి స్వభావుడగు నీజీవుని కీబంధ మెట్లు గలిగెనని విచారింపగా ॥శృతి॥ నిత్యశుద్ధ బుద్ధ స్వభావస్యతద్యోగస్తద్యోగాధృతే అనుకపిలసూత్ర ప్రామాణ్యమును బట్టి, పురుషున కీబంధము ప్రకృతిసంబంధమువలన గలిగెను. అనగ పురుడనగ, పరమాత్మకు ప్రకృతి సంబంధమువలన గలిగెను గావున, ॥శృతి॥ యదాహి కేవలో రక్తస్ఫుటికో నక్షణే జన్మైం రఙ్గకాద్యుపధానేన, తథాసౌ పుసపోపిచ ప్రకృతేః క్రియమాణాని, గుణకర్మాణి సర్వశః అహంకార విమూఢాత్మా కర్తాహమితి మన్యతే పురుషః ప్రకృతిస్థోహిభుఙ్క్తే ప్రకృతి జాన్ గుణాన్ కారణం గుణసఙ్గోస్యసదసద్యో నిజన్మసు॥ అన్నట్లు స్వచ్ఛమైయుండెడు స్ఫటికం ముకిజపాపుష్పరూపకర్త ద్రవ్య సంపర్కము వలన దశ్చాయాపన్నమై, దానిభోగంబగు సుఖదుఃఖాదులకు, దానె భోక్తనని యు దలంచుచుండును. దానిచే చేయబడు పనులకు తానె కర్తననియు దలంచుచుండును. వాస్తవముగా కర్తయు, భోక్తయు గాదు — తాను సర్వ సాక్షి ప్రత్యగభిన్న పరమాత్మ —

శృతి॥ వాఙ్మాత్రం నతుతత్వంచిత్తం చిత్తస్థితేః, ప్రతిబింబించుటవలన అనగ ఘటమునందు ప్రతిబింబించుటవలన, స్ఫటికమునకు కాహిత్యమువలె బంధచిత్త గతమైనది గాని అంతఃకరణమలినముచేతనుండిన ఆత్మ అంతఃకరణ యందు, మలినముగా, జీవుడై, వ్యవహార ప్రతిబింబస్వరూపుడు - గావున, పరమాత్మకు - అనగ, ఉత్తమపురుషునకు - ॥గీత॥ వుత్తమపురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృత॥ అనియున్నది గావున యీపరపురుషుడు సంసారబద్ధుడనుట వాగ్వ్యవహారముగాని వాస్తవముగాదు। శృతి॥ బంధమోక్షౌ సుఖం దుఖం, మోహాపత్తిశ్చ యాయయా, స్వప్నేయథాత్మనః ఖ్యాతిసంసృతిర్నతు వాస్తవి॥ బంధమోక్షములు, సుఖదుఃఖములు, మోహము మొదలగునవి, వృత్త

మపురుషుడైన పరమాత్మకు ప్రకృత్యుపాధిచే గలుగుచున్నవి గాని వాస్తవములుగావు. రజోగుణముచే నంతఃకరణము తపింపజేయగ నది, నీదిబుద్ధి రూపముగా బరిణమించును. అంతఃకరణము తపింపజేయబడగ, తమోగుణవశమున దానితోన భేదమునొందు, ఆత్మపురుషుడును తపింపబడును. ఇందులకు ॥శంకరభాష్య॥ సత్వం తప్యం బుద్ధిభావేన వృత్తంభావస్తైవారాజ సాస్తాపకాస్తత్ తస్యా భేదగ్రాహిణీ తామసీయాంవృత్తి స్తస్యాంతప్య। ఇత్యుక్తఆత్మా పతంజల భాష్యమందు యిట్లు చెప్పబడియున్నది. అపరిణామినీ హిభోక్తుశ్శక్తిః అప్రతిసరికర్మాచ, పరిణామిన్యర్థే పతిసంక్రాంతే తద్వృత్తి మనుపతతీతి॥

ఆత్మ పరిణమించు స్వభావముగ బుద్ధియందు ప్రతిబింబుబుగ బుద్ధిశ్ఛాయా పన్నమై బుద్ధివృత్త్యనుకారము గలదియగును. అందువలన, బరిశుద్ధుడనైన పరమపురుషుడు బుద్ధితోన భేదమునొంది బుద్ధాత్మకుడుగా బ్రతిభాసించు దుఃఖత్రియము ననుభవించుచున్నాడు. మరియు పుట్టకుండ యీ దుఃఖత్రియము నశింపజేయగల యుపాయమేది లౌకికోపాయమువలన నీ దుఃఖత్రియము నివృత్తి సిద్ధించునంటివేని, సిద్ధించదు. కపిలసూత్రమునందు నదృష్టాత్తత్సిద్ధి కీర్నివృత్తి దర్భనాత్॥ ద్వివిధదుఃఖములను, నిరన్వయ వినాశమొందవు. ఒకవేళ తాత్కాలికముగా నివారితములైనను మరల నివర్తించుచుచున్నారము. శృతి అట్లేచెప్పుచున్నది. ॥శృతి॥ అమృతత్వస్యతు నాశాంతివిత్తేన॥ మోక్షధనముచే సిద్ధింపదు ॥శృతి॥ ఆపదర్థేధనం రక్షేత్॥ అను న్యాయము ననుసరించి, ధనాదులు దుఃఖములను దొలంగింపలేక, గజస్నానమువలె నిష్ఫలములైనచో ధనార్జనమందు ప్రకొత్రైష్ ప్రవృత్తి నిరర్థకరమేగును అనగ, ॥శృతి॥ ప్రాత్యహికత్వ క్షుత్ప్రతీకార తత్ప్రతీకారచేష్ట నాత్పురుషార్థత్వం॥ ప్రతిదినము మనకు గలుగు చుండెడి క్షుద్బాధయాహారముచే శమించి, మరల బుట్టుచున్నట్లు దృష్టసాధనమునలన దుఃఖ మప్పటి కప్పుడు నివారింపంబడినను మరల బుట్టుచుండును, దృష్టసాధన జన్యమగు దుఃఖోపసంహృతి దుఃఖవేశసంబంధమై యుండునుగావున పరమాత్మకా లేదుఃఖవ్యవహారిక జీవాత్మయనే నామంకలిగినది గావునం దుష్టసహాయముచలన మలినఘటనుందు ప్రతిబింబించుటచేత, దుష్టోపాయమువలన సిద్ధింపని దుఃఖప్రయా విఘాతము వేదవిహితమైన కర్మములవలన గలుగవచ్చును. అందులకు దార్ఢారణముగా శృతులు యెట్లు బల్కుచున్నవో జూతుము. ఎట్లనగ ॥శృతి॥ అ

పాను సోమమమృతా అభూమ అగన్మజ్యోతి రవిదామదేవాన్కిం నూనమస్మాన్ క్ర్ణవదరాతిః కిముధూర్తి రమృతమర్త్యస్య॥ యిత్యాది శృతులు చెప్పుచున్నవి. ఎట్లన, తొల్లియింద్రాది దేవతలు తమ కమరత్వము లభించినందుకు గారణము నాలోచించి యిట్లుపలికిరి గావున —

సోమపానముచేసి అనగ అమృతపానముజేసి, మనమిట్టు మరణము లేనివారమైతిమి, దివ్యుల దెలసికొంటిమి. మనశత్రువులు మనను ఏమికొరుతచేయగలరు. ముదిమియును మనలను బాధింపనేరదు. వేదమునందు యింకొకచోటను యిట్లు చెప్పియున్నది గావున, ॥శృతి॥ సర్వాన్ లోకాన్ జయతి, మృత్యుం తరతి, పాప్మానంతరతి, బ్రిహ్మాత్యాంతరతి, బ్రిహ్మాత్యాంతరతియో, శ్వమేధేనజయతె॥అనగ, అశ్వమేధ యాగము, చేయువాడు సర్వలోకములను జయించును, మృత్యువును దాటును, పాపమును తొలగించును, బ్రిహ్మహత్య నివారించును. సకలప్రిమాణ మాళిభూతమగు వేదమిట్లు పలుచోట్ల చాటిచెప్పుటచే, లౌకికోపాయమువలన నిరన్వయ దుఃఖాభిఘాతము సిద్ధించునంటివేని, అట్లు కానేరదు. ॥శృతి॥ దృష్టవదాను శ్రివికస్సహ్యా విశుద్ధిక్షయాం తిశయయుక్తః॥ వేదవిహితమగు యజ్ఞాదికర్మయు పసువిశసనముచే నవి శుద్ధియుక్తమగుటవలనను కర్మసంపాదిత స్వర్గాదిపుణ్య లోకభోగములు క్షయింపవుటవలనను, లౌకికోపాయముగూడ దృష్టోపాయమువలె- నకించత్కరము అనగ కొంచమైననులేదు ఇట్లయినచో మరియేది, దుఃఖత్రియ బంధరహితము, భంజకము ॥శృతి॥ తద్విపరీత శ్రియాన్ వ్యక్తావ్య క్తజ్ఞ విజ్ఞానాత్ ॥ అనునట్లు పూర్వోక్తమగు నుపాయద్వయముకంటె విలక్షణమైన సత్వపురుష, న్యధాఖ్యాతిచే, అనగ, ప్రికృతివేరు పురుషుడువేరు అనగ శరీరమువేరు, జీవుడువేరు క్షేత్రింవేరు, క్షేత్రిజ్ఞుడువేరు అను జ్ఞానముచే అవిద్యాదిక్లేశ పంచకము నిర్మూలమగును ॥శృతి॥ నిర్మూలమే తధాజ్ఞావశ్చరీరం నాస్తి కేవలం అనునట్లు అపుడు పురుషుడు పరమపురుషుడై స్వస్వరూపావస్థితి నొందును. అనగ తనునిజమైన బ్రిహ్మమే యగును. ఈసస్వరూపానుభవము దెలియుటకు యోగమే ముఖ్యసాధనము, గాబట్టి యోగమనగ యెద్ది ॥శృతి॥ భక్తియోగక్రియాయోగ కర్మయోగశ్చ వాయుభిఃలయయోగోమంత్రి యోగోలంబిక ఏవచ, జ్ఞానదిజ్ఞాన యోగశ్చరాజయోగ శకీర్తితః, తుర్యయోగః పూర్ణభూధోదశ సుఃపరికీర్తితః,

శృతి॥ యోగశ్చిత్తవృత్తి నిరోధయిత్యుచ్యతే॥ యోగమనగ చిత్తవృత్తి నిరోధకము. అనగ చిత్తశుద్ధికరము కొరకు యీశృతి యాజ్ఞవల్క్యమునందు చెప్పబడినది. శ్రీరామహృదయమనె అధ్యాత్మరామాయణమునందు సంతతముమీర చిత్తవిశ్రాంతికొరకు సతత మాత్మసమాధి గోరితివిగాన, అని యున్నది. ఇదియునుంగాక, నను యుజిర్యోగ ఇతిసంయోగార్థత యాపరిపఠితాద్యు జెర్నిష్పన్నో యోగశబ్దః సంయోగవచన ఏవస్యాన్నతు నిరోధవచనః అత ఏవోక్తం, యాజ్ఞవల్క్యేన॥

సంయోగోయోగ, ఇత్యుక్తో జీవాత్మ పరమాత్మనోరితి తదేవదార్థమ్ జీవపరయోస్సంయోగకారణ స్యాన్యతరకర్మాదెరసంభవాద జనంయోగస్య కణభక్షాక్షుచరణాదిభిః, ప్రతిసిద్ధస్యతస్యసాధ్యత్వాభావేన, శాస్త్రవైఫల్యాపత్తేశ్చధాతూనామనేకార్థత్వేన, యుజేసమార్థత్వేఽప్యుపపత్తేశ్చ, తదుక్తం॥ నిపాతాశ్చోపసర్గాశ్చధాతవశ్చేతితేత్రయః అనేకార్థాస్స్మృతాస్సర్వే పాఠస్తేషాం నిదర్శనమితి॥

అతఏవకేచనయుజం, సమాధావపిపఠంతియుజ సమాధావితి॥ నాసి, యాజ్ఞవల్క్య వచనవాక్యోపః తత్రితస్యాపియోగశబ్దస్య సామర్థ్యత్వాత్॥

॥సమాధి సమతావస్థా జీవాత్మ పరమాత్మనెరాః బ్రహ్మణ్యేవస్థితిర్యాసాసమాధిః ప్రత్యగాత్మనయితి, తిస్సైవోక్తావ్యాశ్చ తదుక్తం భగవతావ్యాసేన, యోగస్సమాధిరితి, యద్యేవఅష్టాంగయోగేచరమస్యాజ్ఞస్య సమాధిత్వయుక్తంపతంజలినా యమనియమాసనప్రాణాయామ, ప్రత్యాహారధ్యాన్నధారణసమధియోష్టాంగాని, యోగశ్యేతి, నచాంగ్యవాజ్ఞతాంగన్తుమితనిహతే, ఉపకార్యోపకారక, భావస్యదర్శపూర్ణమాస ప్రయాజాదాభిన్నాయతనత్వేనాంత్యంతభేదాదతస్సమాధిరపి నయోగశబ్దార్థోయుద్యత ఇతిచైతన్యయుజ్యతే యుత్పత్తి మాత్రాభిధిత్సహాయా, తదేవార్థమాత్రనిర్భాస్వంస్వరూపశూన్యమివసమాధిరితి, నిరూపితచరమజ్ఞావాచకేన సమాధిశబ్దేనాజ్ఞినోయోగస్యాభేద, వివక్షయా వ్యపదేశోపపత్తేః, నహ్యుత్పత్తి బలాదేవసర్వత్రశబ్దః ప్రవర్తతే తథాదేవదత్తస్యస్యాత్ ప్రవృత్తినిమిత్తంచ, ప్రాకృత్తమేవచిత్తవృత్తినిరోధ, ఇతి తదుక్తం యోగశ్చిత్తవృత్తనిరోధ ఇతి, సర్వాదర్శనసంగ్రహము॥

సంయోగార్థమందు పఠితమైన యుజిర్ యోగె అను ధాతునుండి

పుట్టిన యోగశబ్దమునకు సంయోగమే అర్థము, గాని విరోధ మర్థముగాదు. అందుచేతనే, జీవాత్మ పరమాత్మల సంయోగము యోగము అని, యాజ్ఞవల్క్యుడు పలికియున్నాడు గాని జీవేశ్వరసంయోగమునకు కారణమైన కర్మాదులు, సంభవింపకపోవుట వలనను, కణాదుడు, నకుపాదుడు నట్టి జీవితేశ్వర సంయోగమును నిషేధించుట వలనను, మీమాంసకమతానుసారముగా, జీవేశ్వరసంయోగ మంగీకరింపబడినను, నిత్యసిద్ధుడైన పరమేశ్వరుడు కాడు గావున శాస్త్రమున వైఫల్యమును వాటిల్లుట వలనను యాజ్ఞవల్క్యుడు చెప్పిన యర్థము సరిగాదు గావున యుజో ధాతువునకు సమాధి యని యర్థము చెప్పుటయే, సమంజసము సమాధానము, సంతోషము, సమానము యేల ననగ నిపాతములు, వుపసర్గములు, ధాతువులు ననేకార్థములు యిందుకు ధాతుసాధమే నిదర్శనము. కావుననే కొందరు యుజ్ సమాధౌ అని యుజ్ ధాతువును సమాధ్యర్థమందుగూడా పఠించుచున్నారు. ఇందువలన, యాజ్ఞవల్క్యోక్త శ్లోకమందున్న యోగశబ్దమునకు, సమాధి యని అర్థమును చెప్పవచ్చునుగాన, విరోధము లేదు. జీవాత్మ పరమాత్మలయొక్క సమాధానమునకు జీవుడు బ్రహ్మాహం ముండుటకు, సమాధి యని పేరు. పాతంజలియోగభాష్యమందు శ్రీవేదవ్యాసులవారుగూడా యోగమునకు సమాధి యని యర్థము చెప్పిరి. ఇట్లయినచో, పతంజలి యమనియమ ఆసనప్రాణాయామ ప్రత్యాహారధ్యాన్నధారణ సమాధు లను నివి అష్టాంగయోగమున యెని మిది అంగములని సమాధినిగూడా ఒక యంగముగా చెప్పియున్నాడు. అంగ మెట్లగును. ధర్మపౌర్ణమాసలు ప్రయాజాదులు, మొదలగువాని యందు వుపకార్యోపకారకభావము, భిన్నాయతన మగుటచే భిన్నమగుట వలన, అంగి యెప్పుడు అంగము కాజాలదు. కాబట్టి సమాధి, యోగశబ్దార్థమని చెప్పదగదని యంటివేని, వుత్పత్తి ననుసరించి, యిట్లు చెప్పవచ్చును. దోషము లేదు. ధ్యాన్నమే ధ్యాయాకారముగ బ్రకాశించి, ప్రత్యయరూపం బగు స్వరూపముతో శూన్యమగుపోల్కి తన్ను తానుమరచి, ధ్యేయస్వభావావేశ మొందినయెడల, నది సమాధి యనంబడు నని, నిరూపింపబడిన చరమాంగమును జెప్పి, సమాధిశబ్దముచే అంగి యగుయోగమున, అభేదవివక్షత జేసి, యట్లు వ్యవహరించుట యుపపన్నము. నీవు చెప్పినయట్లైెడల వుత్పత్తిబలముచేతనే శబ్దము ప్రవర్తించినయెడల నడచునది కావున

గోవని వ్యుత్పత్తి చెప్పినచో నిలువబడియున్నది. గోవు కాకపోవలెను. నడచు చుండెడి దేవదత్తుని కాపేరు చెల్లవలయును. యోగశబ్దమునకు, ప్రవృత్తి నిమిత్తము చిత్తవృత్తి నిరోధమని యిదివరకే చెప్పియుంటిమి కావున యోగము చిత్తవృత్తినిరోధకము అని చెప్పబడునది. చిత్తవృత్తులనిరోధమును యోగమనబడును. చిత్త మేవిషయముచే నుపకరణమగునో యావిషయము తెలియబడినదగును. దేనిచే నుపకరణముగాదో అది తెలియబడదు. కావున వస్తువు తెలియబడుటకు తెలియబడకపోవుటకు నుపరాగ అనుపరాగములే కారణములు. సధర్మక మగుచిత్తము పరిణామిక అనగ సూదంటురాయివంటిది. చిత్తము యినుమువంటిది. విషయము యిందిర్రియములద్వార చిత్తముతో సంబంధించి దాని కుపరాగము గలిగించును. కావున, వృత్తులు చిత్తధర్మములుగాని అసంగుడైన ఆత్మపరమాత్మ లవికావు శృతి చెప్పుచున్నది. ॥శృతి॥ కామసంకల్పోవిచికిత్సాశ్రద్ధా అశ్రిధాధృతిరధృతిర్హీర్ధీర్భీ రిత్యే తత్సర్వం మనఏవ అపరిణామినీభోక్తృశక్తిః॥ అని పరుష అపరిణామి యని పంచశిఖాచార్యుడు పలుకుచున్నాడు ॥శృతి॥ సదాజ్ఞాతా చిత్తవృత్తయస్తత్ప్రభోః పురుషస్యాపరిణామిత్వాత్॥

పాతంజలమ్॥ చిత్తవృత్తులు సంతతము జ్ఞాతములై యుండును. అనగ చిత్తపరిణామంబులగు సుఖదుఃఖభయశోకరాగద్వేషాదులు తాము పొడమిన అనంగ వ్యవహారికజీవునకు తెలియబడకుండ నుండజాలవు. సుఖదుఃఖములు కొంతకాల ముండి యానల దెలియంబడును. సుఖదుఃఖాదు లున్నచో జ్ఞానగోచరములు కాకుండ నొక్క క్షణమేనియు నుండజాలవు. ఇది యెందువలన ననగ, చిత్తమునకు దేవుడైన పురుషాఖ్య చైతన్యమునకు బరిణామ గంధంబు లేకుండుటచే నయ్యెగాని, వేరొండుగాదు. అనగా చిత్తవృత్తుల నిరంతర జ్ఞాతృత్వమునుబట్టి పరమపురుషునకు అపరిణామము అనుమానింపబడునని, తాత్పర్యము. అనగ పరమాత్మకు పరిణామ అపరిణామములు లేవని తాత్పర్యము.

శృతి॥ యుగపద్ జ్ఞానానుత్పత్తి మనసోలిఙ్గం॥ యుగపద్ జ్ఞానానుత్పత్తి మనస్సునకు లింగమైనట్లు చిత్తవృత్తి సదాజ్ఞాతృత్వము అపరిణామి పురుష లింగ మగుచున్నదని యూహింపవలెను. చిత్తవృత్తుల యనుభవమును గూడ చిత్తమాత్రముచేతనే సిద్ధించుచున్నది. చిత్తాదిరిక్త శుద్ధచైతన్య ప్రత్యక్ పర

మాత్మ లేదని, వాదించువారికి వృత్తి సహజజ్ఞానతత్వము కుదరదు. ఏలనగ, సుఖదుఃఖాదివృత్తులు, చిత్తమునందుదయించును గాన, పుట్టినతోడనే ప్రకాశించుచున్నది. శబ్దాదులవలె నుండియును, ప్రకాశింపకుండ నుండవు. ఈసుఖాదివృత్తులు, చిత్తమునందు పుట్టును గాన, పుట్టినతోడనె, ప్రకాశించుచున్నవి. శబ్దాదులు బాహ్యములుగాన వెంటనే ప్రకాశింపవనుటయు జెల్లదు. ప్రకాశించుటచే గదా చిత్తవృత్తులకు స్వరూపసిద్ధి కలుగుచున్నది. ప్రకృతిచిత్తాగోచరములైనను శబ్దాదివిషయముల కితరశ్రోత్రాది యింద్రియములచే స్వరూపసిద్ధికలదు. చిత్తాగోచరములై యుండినందులకు, ప్రమాణము లేనందున, నీసుఖాది వృత్తులకు స్వరూపసిద్ధిలేదు. అనగ నిత్యత్వము లేదు. పరమాత్మకాదు- సంతతపరిణామియగు చిత్త ముపలబ్ధిపరిణామమును బొందుచో సుఖాదులలో నొక్క-వ్యక్తిని ప్రకాశింపజేయును. కాని పుట్టిన వానినెల్ల బ్రకాశింపజేయనేరదు. ఒక యుపలబ్ధిపరిణామముగ చిత్తమునకు వెంటనే తదుపలబ్ధి పరిణామ మెట్లుగలుగును. కలుగునన్నచో మూడవయుపలబ్ధి నాల్గవయుపలబ్ధియుని యాక్రమంబున ననంతోపలబ్ధి పరిణామం బేకక్షణంబున గలుగవలయును. ఇట్లుదయించె యీయనవస్థా దురవస్థాయమెట్లు నివారింపబడును. చిత్తాతిరిక్త పురుషచైతన్య పక్షముం దైనచో, పురుషునియందె యుపలబ్ధి చెప్పబడును. కావున, నవికారియగు, ఉత్తమపురుషునియందు అనగ ఆత్మయందు ప్రతిఫలమాత్రంబగు నుపలబ్ధి యుపపన్నంబై యీయనవస్థా దోషము బొందదు. ఇందువలన పురుషుండు అనగ ఉత్తమపురుషుడు పరమాత్మ అపరిణామి అనగ చిత్తసంకల్పములేనివాడు చిత్తసంకల్పమైన వ్యవహారికపురుషుడు పరిణామిచిత్తమునందు బొడమిన వృత్తులు నిరర్థకములు.

ఇట్టియోగము సంప్రజ్ఞాత యోగమనియు, అసంప్రజ్ఞానయోగమనియు రెండువిధములు. ఎవ్వియనిన ఏకాగ్రమైన, చిత్తమందు యదార్థమును ప్రకాశింపజేయుచు నవిద్యాదిక్లేశముల క్షీణింపజేయుచు, కర్మబంధముల శిథిలముజేయుచు ప్రకాశించు నేకాగ్రవృత్తియందు అనగ మనోమారుత దృక్కులు ఏకమైన కాలమందు, మనోలయకాలమందు బాహ్యములగు ప్రమాణాదివృత్తులు నిరోధము సంప్రజ్ఞాత మనంబడు. ఇది వితర్కము, విచారము, ఆనందము, అకస్మిత యని నాలుగువిధములు. స్థూలాలంబనములగు

విష్ణురూపములు చిత్తమునకు సాక్షాత్కారదశ నొందుట వితర్కణము. స్థూల భూతములగు పృథివ్యాదులకు గారణములగు తన్మాత్రలను సాక్షాత్కరించు దశ, విచారము; స్థూలములగు నింద్రియములను, నాభోగపర్యాయములగు లక్ష్యవ్యాప్తి, యానందము, స్వరూపసాక్షాత్కారముగల ప్రజ్ఞ కాభోగమని పేరు. ఇంద్రియములకు మూలము సత్త్వప్రధానమునగు నహంకారమునగు బుద్ధికిని, పురుషునకును, అవిభాగముగ నేకీభావ మొనరించియున్న యొక క్లేశము అస్మితయనంబడు సంప్రజ్ఞాతసమాధి యానాల్గింటిని గోచరించి యుండును. ॥శ్రుతి॥ విరామప్రత్యయాభ్యాస పూర్వస్సంస్కారశేషోన్యః॥ సర్వవృత్తి విరామము నాలంబనముగా జేసుకొని యభ్యసించునదియును, సంస్కారమాత్రము, శేషించియుండునదియును నసంప్రజ్ఞాతసమాధి. దీనికి పరమవైరాగ్యము సాధకము. విరామప్రత్యయాభ్యాసమనగ పరమవైరాగ్యము. ఇది యీసమాధికి ముఖ్యోపాయము.

సమాధి మరల నుపాయప్రత్యయ సమాధియనియు భవప్రత్యయ సమాధియనియు రెండువిధములు చెప్పియున్నది. ఎట్లనగ ॥బ్రహ్మసూత్రం॥ భవప్రత్యయో విదేహప్రకృతిలయానాం॥ విదేహులగు దేవులకును ప్రకృతిలయులకును భవప్రత్యయమను సమాధియగును. విదేహులగు దేవులు నిజసంస్కారమాత్రముచే నుపయోగించు చిత్తముచే కైవల్య మనుభవించు పోల్కి తృప్తులగుచు, సంస్కారవిపాకమను నీభవప్రత్యయముచే వెళ్ళబుత్తురు. ప్రకృతిలయము యొక్క చిత్తము ప్రకృత్యుపాసనచే, ప్రకృతిలో లీనమగును. పిదప కైవల్యము ననుభవించునట్లుండును. ప్రకృతి లీనంబగు చిత్తము అధికారగర్భంబు నయధికారబలంబు గావున, మరల ప్రకృతి నుండి, వెలువడి, చితితో సంయోగించు నంతవరకు, అనగ అగ్నియందు ప్రవేశించేవరకు నీభవప్రత్యయఫలంబగు నీ స్వరూపప్రతిష్ఠ యుండునని యెరుంగునది. విదేహప్రకృతియులు, పొందెడు గతిపరిణామము వాయువపురాణమందు యిట్లువక్కాణించుచున్నది॥శ్రుతి॥దశమన్వంతరాణీహతిష్ఠంతీంద్రియచింతకాః భౌతికాస్తుశతం పూర్ణం సహస్రంత్వాభిమానికాః బౌధాదశసహస్రాణితిష్ఠంతి విగతజ్వరాః పూర్ణం శతసహస్రం తుతిష్ఠంత్యవ్యక్తచింతకాః పురుషం నిర్గుణం ప్రాప్యకాలసంఖ్యానవిద్యతే॥ బ్రహ్మసూత్రం॥ శ్రద్ధావీర్యస్మృతి ప్రజ్ఞాపూర్వక ఇతరేషామ్॥ యోగులకగు నుపాయప్రత్యయము

శ్రద్ధయు, వీర్యంబు, స్మృతియు, ప్రజ్ఞయు, పూర్వముగా గలదియై జనించును. వివేకఖ్యాతి యందభిలాషచేనగు నోపిక శ్రద్ధయనంబడును. ఇది చిత్తసంప్రసాదరూపము. శ్రద్ధతో యత్నింపగ, చిత్తమునకు వీర్యము గలుగును. వీర్యమనగ నలసతపోయి ముందు ముందునకు జొరవను పుట్టించుశక్తి. ఈశక్తిరూపముగ దీనివలన స్మృతి పొడముచు. స్మృతియనగ ధ్యానము. ఏకాగ్రమగు నిధ్యానము పుట్టుటచే చిత్తమనాకులంబై పిదప సమాధినొందును. సమాహిత చిత్తునకు ప్రజ్ఞాలోకమనగ ప్రకృతిపురుషవివేకము సమీపించును. ఈసంప్రజ్ఞాత యోగమున పరమేశ్వరుడనియు, తత్వములనియు ధ్యాన్యము ద్వివిధము. జడాజడ భేదముచే నవి రెండును, రెండువిధములు. జడములు ప్రకృతిమహదహంకారాది చతుర్వింశతి తత్వములు. అజడతత్వము పురుషుడు సంప్రజ్ఞాత యోగమునందు శిష్యమాణమగు, సాత్వికవృత్తిగాడ దేనిలో నిరోధింపబడునో దాని కసంప్రజ్ఞాత యోగమని కూడ పేరు ॥బ్రహ్మసూత్ర॥ తదాద్రష్టుస్స్వరూపె వస్థానమ్॥ చిత్తము సర్వవృత్తి నిరోధాత్మకమునగు, అసంప్రజ్ఞాతయోగావస్థనొందునప్పుడు, చితిశక్తికి గైవల్యంబును బోలె పరిణామరహితంబును అనగ అగ్నిసంస్కారమునకు తగిన యవస్థయు బోలె గాన పరిణామము లేదు. ఇక్కడికి- వ్యవహారికం సరిపోయినది. ప్రతిసంక్రమ సామాన్యంబును, బ్రదర్శిత విర్శనీయంబును, శుద్ధంబును, నాశంబును సత్వగుణ మాత్రమును, నగు స్వరూపము సాక్షాత్కరించును. కొంతసేపటికి సమాధిశిథిలమై స్వరూప సాక్షాత్కారము తిరోహితమైనను అనగ గనబడకపోయినను మరల, స్వస్వరూపము గనుగొనుటకు రుచిపుట్టించుచుండును. కావున యోగమావృత్తిగ నభ్యసింపనగును —

బ్రహ్మసూత్రం॥ వృత్తిసారూప్యమితరత్ర॥ యోగవిరహితమైన, వ్యుత్థానదశయందు, గామసంకల్ప విచికిత్సాశ్రద్ధాశ్రద్ధ హీధీభీతులగు వృత్తులచే జితిశక్తికి మనోవృత్తులలో నైక్యరూపము కలుగును. మశ్చిత్తాదిసంజ్ఞల చేవ్యవహరింపబడు సత్వమునంగలుగు శాంతఘోర మూఢ వికారంబులు స్వచ్ఛంబగు చిత్తికెక్కుటయే, సారూప్యము, బుద్ధిసత్వము చేతనమైనది. పురుషసాన్నిధ్యమున చందనవృక్ష న్యాయముచే సచేతనంబగును. దానికివృత్తిదర్శనము సహజము విశుద్ధంబగు చితికిదర్శన వికారము లేకున్నను సత్వమందలి ప్రతిభ వలన బింబప్రతిబింబాభేదానుసంధానమున, సారూప్యము

భోదార్థ ముపదేశింపబడియె. ఈయర్థమునే పంచశిఖాచార్యు డిట్లు సూత్రి ముచెప్పియున్నాడు—సూత్రం ॥ఏకమేవదర్శనం॥

ఖ్యాతిరేవదర్శనం॥ అనగ సత్వమునకు జితిశక్తిన్ని వృత్తిదర్శనం బొక్కటియె, దర్శనమనగా, ఖ్యానము. ఖ్యానమనగ జిక్స్వజ్వలితబుద్ధి. గతవృత్త్యుదయము ఆయాత్మకు లేకున్న నున్నట్లు చెప్పబడును. చిత్తవృత్తి బోధయందు పరపురుషునకు, అనాది యగుటవలన, నొలుత నెట్టిన్వృత్తిబోధము గలిగెనని, శంకించుట, కనకాశము లేదు.

బ్రిహ్మసూత్రం॥ వృత్తయః పంచయః క్రిష్టాక్రిష్టాః॥ నిరోధింపవలసిన వృత్తులు విద్యాదిక్లేశములతో అనుకూలముగ, సంబాధించిన యెడల నవి ఘోరమూఢంబులు అనంబడు. అదియె, కామసంకల్పభయాదులు, అవిద్యాక్లేశములకు బ్రతికూలములై, ప్రకృతిపురుష వివేకఖ్యాతికి సాధనంబులై యుండెడు నహింసాసత్యశ్రద్ధాదులు, శాంతరూపంబులు. ఇవి సంప్రజ్ఞాతసమాధితో సంబంధించి యుండును. అసంప్రజ్ఞాతసమాధిలో, నిరుద్ధములగును. నదీనిస్తరణానంతరము నాకను పరిత్యజించినట్లు, నది దాటుటకు వోడ కావలసియుండి దాటుపిమ్మట ॥కార్యాంతే విసర్జయేత్॥ ఆవోడను విసర్జించి నట్లుగను సత్వవృత్తులుగూడ బరిత్యాజ్యములగును. నిరవధికంబగు చిత్తం బారభశూన్యంబై యాత్మకల్పంబై స్వచ్ఛమైయుండును. పూర్వోక్తములగు వృత్తులు అయిదువిధములు. ఎవ్వియనిన, ప్రమాణవృత్తి, విపర్యవృత్తి, వికల్పవృత్తి, నిద్రావృత్తి శృతి శ్మృతివృత్తి, వీనిలో బ్రమాణవృత్తి ప్రత్యక్ష అనుమాన గమనంబులని త్రివిధము. విపర్యయమనగ, ఆ భాసమాత్రంబగు మిథ్యాజ్ఞానము. ఇదియు నవిద్యయనంబడు. అవిద్య ఆశ్మిత రాగము, ద్వేషము, అభినివెశమునని నీఅయిదువిధములు. వీనికే క్లేశములని పేరు. ఈ అయిదింటికి క్రమముగా తమస్సుమోహము మహామోహము తామిశ్రము అంధతామిశ్రము అని, పూర్వమహర్షికృతములగు నామాంతరములు కలవు. అనాత్మయగు, నవ్యక్తమహదహంకార పంచతన్మాత్రముల యెనిమిదింటియందు నాత్మబుద్ధి జేయుట తమస్సనంబడును. ఈయెనిమిది విధములు యోగులకు ఆశ్రయరూపంబులగు నణిమాద్యష్టైశ్వర్యములను సంపాదించి, లౌకికభేదమున దశవిధములగు శబ్దాదులను, భోగించెదరు. మనోవృత్తారాగము; ఇదియే

మహామోహము. పదివిధములు. ఇట్టిభోగమున, యోగులశక్తిచేఁ బ్రతిబంధకము గలిగినచో జనించు క్రోధము, ద్వేషము, దీనికి కదామిశ్రమని పేరు. యోగసిద్ధాణిమాదులచే సిద్ధములగు, నుత్కృష్టభోగంబులు కల్పాంతంబున నశించు, నని, పుట్టు భయము అభినివేశము ఇదాంధతామిశ్రమంబనంబడును. అణిమాదులెనిమిది, లౌకికాలౌకికములగు శబ్దాదివిషయములు పది; కావున మిశ్రాంధతామిశ్రములు పదునెనిమిదిగా గణింపబడుచున్నవి. ॥శృతి॥ భేదస్తమసోష్టవిధో మోహస్యచదశవిధో మహామోహః తామిస్రోష్టాదశధాతథాంధతామిశ్రః॥ తత్వకౌముదిసూత్రం ॥శబ్దజ్ఞానానుపాతివస్తుశూన్యోవికల్పః॥ అనునట్లు శబ్దభేదముచేనగు జ్ఞానము ననుసరించి బొడమి, తనకు గోచరించునంశము వికల్పవృత్తి వాస్తవముగానిది. ఇందులకు నుదాహరణము పురుషునిచైతన్యము అని వ్యవహరింతురు గాని, పురుషునికంటె భిన్నముగ చైతన్యము అవాస్తవము. ॥సూత్రభాష్యం॥ అభావప్రత్యయాలంబనావృత్తిర్నిద్రా॥ అనునట్లు అభావమనగ, జాగ్రదాదివిషయప్రకాశాభావము. ఇది ప్రకాశవిరుద్ధంబగు నావరణాత్మకాంతస్థమనస్సు ॥సూత్రభాష్యం॥ అనుభూతవిషయాసంప్రమోషస్స్మృతిః॥ అనునట్లు అనుభవారూఢంబులగు శబ్దాదివిషయములయొక్క సంస్కారము చెడకుండుట స్మృతియనంబడును. ॥సూత్రం॥ అభ్యాసవైరాగ్యాభ్యాంతన్నిరోధః॥ అనునట్లు అభ్యాసవైరాగ్యములచే అప్రమాణాదివృత్తులు నిరోధింపబడవలె ననుచిత్తనునది పుణ్యమువైపు పాపమువైపు కూడ బ్రవహించును. కావున, నుభయతోవాహినీ యచిత్తానది విస్తారముగ కైవల్యోన్ముఖమై వివేకవిషయమందాసక్తి గలదియైయుండునో యది కళ్యాణవాహినీయని చెప్పబడును. ఏచిత్తనది సంసారోన్ముఖమై యవివేకవిషయమం దాసక్తముగునో దానికి పాపవాహిని యని పేరు. వైరాగ్యముచే విషయస్రోతస్సు నశింపజేయబడుచున్నది. కాబట్టి యభ్యాసవైరాగ్యములు రెండింటిచే వృత్తులను నిరోధింపవలెను. ॥సూత్రం॥ తత్రస్థితౌయత్నోభ్యాసః॥ అనునట్లు రాజసతామసవృత్తిరహితమైన చిత్తము ఏకాగ్రతను గలిగియుండుటకు స్థితి యనిపేరు. ఇట్టిస్థితిని సంపాదించుటకు, యమనియమాదిసాధనంబుల నావృత్తిజేయుట యభ్యాసమనబడును. ॥సూత్రం॥ దృష్టానుశ్రవికవిషయ వితృష్ణస్యవ శీకారసంజ్ఞావైరాగ్యమ్॥ అనగ స్త్రీలు, అన్నపానములు ఆధిపత్యము, మొదలగు దృష్టభోగ

ములందును, విముఖులై దేహరహితేంద్రియలయంబును, నవస్థయు, ప్రకృతోపాసనజన్యమగు, ప్రకృతిలయానస్థయు దోషదుష్టములనియు, హేయములనియు, పరిత్యజించి, యభ్యాసపరుండై యుండువానికి జనించు వశీకారము వైరాగ్య మనబడును. ఇది పూర్వవైరాగ్యమనియు పరవైరాగ్యమనియు రెండువిధములు వశీకారము. సంజ్ఞాపూర్వవైరాగ్యము గుణవైతృష్ణము పరవైరాగ్యము సత్వ ముద్రేకించి, తమస్సుపోయినను, రజోలేశములచే గళంకముజెందియున్న చిత్తమందు జనించెడు నీపూర్వవైరాగ్యము తౌష్టిక, సాజ్ఞల, ప్రకృత్యుపాసకులకుం గూడ గలుగును. ఈపూర్వవైరాగ్యముచే దాష్టికలు ప్రకృతిలయమను నుత్కృష్టపదము, నొందుదురు. ॥సూత్రం॥ వైరాగ్యాత్ప్రకృతిలయస్సంసారో భవతి రాజసాద్రాగాత్॥ అని తత్వకౌముదీ గుణవైతృష్ణరూపంబగు పరవైరాగ్యము జ్ఞానప్రసాదమాత్రస్వరూపంబుగాని, వెనుక దానివలె నొకదానిని విషయీకరించి రాజసమైయుండదు. ఈవైరాగ్యముదయించునపుడు యోగి, నేను బొందవలసినదానిని బొందితిని. అవిద్యాక్లేశములు క్షీణించినవి. అవిచ్ఛిన్నమైన జననమరణాదిభవప్రబాధ విరమించినది. అని సంతసిల్లును. ఇట్టిజ్ఞానముయొక్క, పరమావధియే పరమవైరాగ్యము. దీనికి స్వాభావికకైవల్యము ఫలక వైరాగ్యప్రధానమగు సమాధిఘ అమోఘమని చెప్పబడును. ॥సూత్రం॥ వ్యాధిస్త్యాన, సంశయప్రమాదాలస్యావిరతి, భ్రాంతిదర్శనాలబ్ధ, భూమికత్వానవస్థితత్వాని, చిత్తవిక్షేపాస్తేంతరాయాః॥ అనునట్లు యోగాంతరాయములు తొమ్మిది. చిత్తవృత్తులతోగూడ నివియు, గలుగుచున్నవి. ఈఅంతరాయములు లేకుండ బూర్వోక్తచిత్తవృత్తులుండవు. వాతపిత్తశ్లేష్మాదిధాతువైషమ్యము, వ్యాధి, చిత్తమునకు గర్మోత్సాహశూన్యవస్త్యానము ఉభయకోటిజ్ఞానము సంశయము యోగసాధనంబుల భావింపకునికి ప్రమాదము కఫాదులచే శరీరమునకు దమోగుణముచే చిత్తమునకు గలుగు గురుత్వమాలస్యము చిత్తమునకు డెంపులేని, విషయసంప్రయోగమవిరతి, విపరీతజ్ఞానము, భ్రాంతిదర్శనము సమాధిభూమిలభింపకునికి యలబ్ధభూమిత్వము లబ్ధమగును యోగభూమియందు జిత్తమునకు, స్థైర్యము లేకుండుట యనవస్థితి. ఈతొమ్మిది చిత్తవిక్షేపములనియు, యోగప్రతిపక్షములనియు యోగాంతరాయములనియు జెప్పబడును.

॥సూత్రం॥ దుఃదౌర్మనస్యాంగమే జయత్వశ్వాసప్రశ్వాసావిక్షేపస హాభువః॥ అనునట్లు- ఆధ్యాత్మికాదిదుఃఖమును, ఇచ్ఛావిఘాతజనిత చిత్తక్షోభరూపంబగు ధర్మనస్యంబును అంగకంపహేతువగు నశక్తియు, బాహ్యవా వ్యాతరాకర్షణరూపంబగు శ్వాసంబును అంతర్వాయుబహిర్నిస్సరణరూపం బగు ప్రశ్వాసమానంబును నివిచిత్తవిక్షేపములతోఁగూడ నుండును. విక్షేపరోధి యగు సమాధిసమర్థగల చిత్తమందివి యుండనేరవు. చిత్తప్రసాధన, సాధనము లు- ఎవ్వియనిన ॥సూత్రం॥ తత్ప్రతిషేధార్థమేకతత్త్వాభ్యాసః॥ అని చిత్తవృత్తుల నిరోధించుటకు విక్షేపముల నివారించుటకు చిత్తము నేకాగ్రముగా జేయవల యును. ॥సూత్రం॥ మైత్రీకరుణాముదితోపేక్షాణాం, సుఖదుఃఖ పుణ్యాపుణ్య విషయాణాం భావనాతశ్చిత్తప్రసాదనమ్॥

అనగ సుఖమునొందుచున్న సకలప్రాణులయందు మైత్రియును దుఃఖితులయందు గరుణయును, పుణ్యాత్ములయందు సంతోషమును, పాపుల యందు యుపేక్షయును భావించినచో శుక్లధర్మ ముత్పన్నమగును. అందువల న చిన్నతన ముత్పన్నమగును అనియున్నది. చిత్తము ఏకాగ్రత జెందును. అనగ శాంతినొందును.

॥సూత్రం॥ ప్రచ్ఛర్దనవిధారణాభ్యాం వా ప్రాణస్య॥ అనునట్లు, కోష్ఠ్య వాయువును నాసాపుటములద్వారా ప్రయత్నముచే బైకిగ్రక్కుట ప్రచ్ఛర్ద నము ఇదియే రేచకమని వ్యవహరింపబడును. విధారణంబన బహిర్వాయువు నాకర్షించి లోపలపూరించి నిలుపుట. ఇది పూరకకుంభకరూపము. ఈరెం డింటిచేతనైనను, చిత్తము ప్రసన్నంబై అనగ, స్వాధీనమై చిత్తవిశ్రాంతిగలిగి ఏకాగ్రస్థితిపదము నొందును. అనగ బ్రహ్మపదము నొందును. ॥సూత్రం॥ విష యవతీ వాప్రవృత్తీ రుత్పన్నామనః స్థితిని బంధనీ అనునట్లు విషయవతి యగు ప్రవృత్తి పుట్టినయెడల మనస్సును నిలుపును. విషయములనగ గంధాదులు; నాసికాగ్రమందు చిత్తమును నిలుపగా దివ్యగంధానుభవంబు లగు అదిగంధవతియగు ప్రవృత్తి జిహ్వాగ్రమందు రసవతి, తాలువునందు రూపవతి, జిహ్వామధ్యమందు సరస్వతి, జిహ్వామూలమందుశబ్దవతి, విషయ సంజ్ఞలుగల యీగంధాదులయొక్క నాసాగ్రాదిధారణములచేనగు సంవేద నంబులవలన, నీఅయిదు ప్రవృత్తులవలనను చిత్తమునకు స్థితిపదము గలుగును.

ఈపరివృత్తు లుత్పన్నములై సంశయమును వారించును. ఇవి సమాధిపరిజ్ఞకు ద్వారములగును.

ఇట్లు పతంజలిచిత్తవశీకారమున, యనేకసాధనములు చెప్పి తుదకు, పతంజలి యందు ॥యథాభిమతధ్యానాద్వా॥ యెట్టిశన కిష్టమగునో దానిని ధ్యానించిన, ధ్యానమనగ సమాధి. బ్రహ్మాత్మైక్యయోగ సమాధి, గావున, చిత్తము స్థిరమైన బ్రహ్మపదమునొందునని చెప్పెను.

సమాపత్తి చతుష్టయమనగ వివరంబెట్లనిన ।సూత్రం॥ క్షీణవృత్తి రభిజాతస్యేవమణేర్గ్రహీతృ, గ్రహణగ్రాహ్యేషు తత్స్థతదంజన తాసమాపత్తి॥

ఎట్లనిన స్పటికమణి యుపాస్యములగు జపాకుసుమాదులచే నుపయుక్తమైన వానిలో హితశిలాదిరూపములనొంది ప్రకాశించునట్లు అభ్యాసవైరాగ్యములచే చిత్తము క్షీణించిన, రాజసతామస ప్రమాణాదివృత్తులు కలదియును దేనినిధ్యానించుచుండునో దానియాకారము నొంది బ్రహ్మమైతానై భాషించునట్లు చిత్తమునకుగలుగు తదాకారపరిపత్తి సమాపత్తి యనబడును. సమాపత్తి జీవాత్మ పరమాత్మలకు అభేదవృత్తి సమాపత్తియని సూత్రభాష్యం చెప్పుచున్నది.

సవితర్కసమాపత్తి నిర్విచారసమాపత్తి యని యీసమాపత్తులు నాలుగువిధములు. ఎవ్వియనిన ॥సూత్రభాష్యం॥ తత్రశబ్దార్థజ్ఞాన వికల్పై సంకీర్ణాపితర్కాసమాపత్తి॥ యని చెప్పియున్నది —

1 నిర్వికల్పసమాపత్తి 2 సవిచారసమాపత్తి 3 నిర్విచారసమాపత్తి 4 సమాపత్తి అని నాలుగువిధములు సూత్రభాష్యమందు చెప్పియున్నవి. అవి యెవ్వియనిన—

1 సూత్రం॥ తత్రశబ్దార్థజ్ఞాన వికల్పైసంపూర్ణా సవితర్కా సమాపత్తి॥

అనగ శబ్దము అర్థము జ్ఞానము అను నీమూడింటికి అభేదాధ్యాస రూపంబగు వికల్పముచే వ్యామిశ్రమమగు చిత్తసమాపత్తి సవితర్కసమాపత్తి యనంబడును.

2 సూత్రం॥ స్మృతిపరిశుద్ధౌ స్వరూప శూన్యేవార్థమాత్ర నిర్భాసా నిర్వితర్కా—ఇది నిర్వితర్కసమాపత్తి.

అనగ శబ్దసంకేతస్మృతి నివృత్తముగాగ సాకారమేమియు లేనియుండ్బోలె, నాలంబనమాత్రజ్ఞానము గలదియైనచో, అసమత్తి నిర్వితర్కమనం

బడును. ఘటాది ధర్మాభివ్యక్తిగల భూతసూక్ష్మములందు దేశకాల నిమిత్తానుభవంబులతో మిశ్రితముగా బొడము సమాపత్తి సవిచార యనంబడును. నీల పీతాదిసర్వప్రకారములచే ననవచ్ఛిన్నంబులై భూతసూక్ష్మప్రకృతికంబులై తద్భిన్నాభిన్నంబులగు నణువులందుగలుగు సమాపత్తి నిర్విచారమనం బడును.

సూత్రం॥ తాఏవసబీజస్సమాధిః॥ అని. ఎట్లనగ, యీనాలుగు సమాపత్తులు, బహిర్వస్తుబీజముగా జనించును, గాన, సబీజసమాధు లనంబడును.

సూత్రం॥ నిర్విచారవైశారద్యేధ్యాత్మప్రసాదః॥ వీనిలో నాల్గవది యగు నిర్విచారసమాధిలో చిత్తము సుధ్యావరణముచే విడింబడి, ప్రకాశించుబుద్ధి, సత్వమునకు, రజస్తమోలేశములేని, స్వచ్ఛమైనస్థితికి, వైశారద్యమని పేరు. అపుడు యోగియొక్కయాత్మ ప్రసన్నమగును. ప్రత్యక్చేతనాదిగమ[illegible]సిద్ధించును.

సూత్రం॥ ఋతంభరాతత్రప్రజ్ఞా॥ అని. ఆసమాధిలో బుట్టిన ప్రజ్ఞ సత్యగోచరమగుటచే ఋతంభర యని యోగులచే వ్యవహరింపబడుచున్నది.

సూత్రం॥ శ్రుతానుమాన, ప్రజ్ఞానన్య, విషయావిశేషార్థత్వాత్॥ అనగ ఆగమానుమానములచే గలుగు జ్ఞానములు, సామాన్యధర్మవిషయములు, అటువలెగాక యీఋతంభరచే గలుగు జ్ఞానము విశేషవిషయమై యుండును.

సూత్రం॥ తజ్జస్సంస్కారోన్యసంస్కారప్రతిబంధీ॥ అనునట్లు ప్రత్యయనిరోధముచే సమాధియు, సమాధిచే ప్రజ్ఞయు, ప్రజ్ఞచే సంస్కారాతిశయమును జనించును. ఈఋతంభరచే జనించు సంస్కార మితరసంస్కారముల నణచివేయును. కాబట్టి—

సూత్రం॥ తస్యాపినిరోధే సర్వనిరోధాన్నిర్బీజస్సమాధిః॥ అనగ ఇట్టి సకలేతరసంస్కారములను బుట్టించు నిర్విచారసమాధిసైతము విరుద్ధముకాగా, సర్వవృత్తులు విరుద్ధము లగును. కావున నిది నిర్బీజసమాధియని యున్నది. ఈసమాధిలో బ్రత్యక్చేతనాదిగమ మగును. దీనికే యసంప్రజ్ఞాతసమాధియని పేరు. ప్రథమకల్పకుడు, మధుభూమికుడు, ప్రజ్ఞాజ్యోతి, అతిక్రాంతభావనీయుడు అని యోగులు నాలుగుతెగలవారు. వీరిలో మొదటివానికి పరచిత్తాదులను గోచరించుజ్ఞానము వశమైయుండదు. రెండవవాడు

ఋతంబరప్రజ్ఞ గలవాడు. మూడవవాడు భూతములను, యింద్రియములను జయించినవాడు. నాల్గవవాడు పరమవైరాగ్యసంపన్నుడు. ఇట్లు సర్వవిషయములయందు విరక్తిగల పురుషశ్రేష్ఠునకు క్లేశబీజము లన్నియు నిర్దగ్ధశాలిబీజములవలె ॥శ్రుతి॥ అగ్నిదగ్ధంయథాబీజం శాఖాపల్లవవర్జితం జ్ఞానదగ్ధం తథా యోగీ పునర్జన్మ నవిద్యతే॥ అని యున్నది. నిర్దగ్ధమువలె మరల నంకురింపవు. మొక్కమొలవదు. పునరావృత్తి లేదు. కాబట్టి—

ఇవన్నియు, మనస్సుతోగూడ నస్తమించును. ఆపుడు నిరుపప్లవముగు వివేకఖ్యాతిపరిపాకమునొందుటచేత కృతకరణీయములు పురుషార్థశూన్యములు నగు గుణములకు స్వకారణమైన, ప్రధానమందు లయమగుటయే కైవల్యము. ఇట్టి చిత్తశక్తియొక్క స్వరూపప్రతిష్ఠయే చిచ్ఛక్తియొక్క స్వరూపము శరీరముయొక్క ప్రతిష్ఠయే కాని వేరుకాదు. చికిత్సాశాస్త్రము రోగమనియు, రోగహేతువనియు, ఆరోగ్యమనియు, భేషజమనియు చతుర్వ్యూహమైనట్లు యోగశాస్త్రము సంసారము సంసారహేతువు మోక్షోపాయమని నాలుగువిధములు. సంసారము దుఃఖమయము, ప్రధానపురుషసంయోగము, సంసారహేతువు దాని యాత్యంతికనివృత్తిమోక్షము. సమ్యగ్దర్శనము మోక్షోపాయము.

పతంజలి యోగసూత్రములందు ప్రతిపాదించిన యోగమిది॥ సాంఖ్య యోగౌపృథగ్బాలాః ప్రవదంతినపండితాః॥ ఏకమప్యాస్థిత స్సమ్యగుభయో ర్విందతేఫలమ్। యత్సాంఖ్యైః ప్రాప్యతేస్థానం తద్యోగైరపిగమ్యతే॥ ఏకం సాంఖ్యంచ యోగంచ యపశ్యతిసపశ్యతి॥ అనగా, సాంఖ్యము, యోగము వేరని పండితులట్లనరు. ఒకదానియందు జ్ఞానముగలవాడు, రెండిటియొక్క ఫలమును బొందును. సాంఖ్యజ్ఞానముచే బొందదగు. పదవి యోగముచేగూడ లభ్యమగును. సాంఖ్యయోగ మొక్కటియని తెలిసికొనువాడు తత్వము నెరిగినవాడు. గీత॥ 5 వ అధ్యాయము॥ సాంఖ్యము యోగము నొక్కటియే, యోగమనగ కొంచెము మార్పునెంచబడినది. సాంఖ్యమనగ ।సూత్రం। క్లేశకర్మవిపాకా శయైరపరామృష్టః పురుషవిశేష ఈశ్వరః। క్లేశకర్మ విపాకాశయ సంపర్కరహితుడగు, పురుషవిశేషుడు ఈశ్వరుడనియు, ।సూ। స్వయేవపుర్వేషా మపిగురుః। కాలేనానవచ్ఛేదాత్॥ అతడు పూర్వగురువులగు బ్రహ్మాదులకుగూడ గురువు కాలావచ్ఛిన్నుడు ॥సూ॥ తస్యవాచకః ప్ర

ణవః॥ అతనుచెప్పునది ఓంకారము ॥సూత్రం॥ తత్రనిరతిశయం, సర్వజ్ఞబీజం॥ ఆయీశ్వరునియందు అతతానాగతీ ప్రత్యున్న ప్రత్యేకసమదాయా తీంద్రియంబులగు విషయములను, గోచరించు సర్వజ్ఞమగు జ్ఞానముగలదు. ।సూ॥ తపస్స్వాధ్యా యీశ్వర ప్రణిధానాని, క్రియాయోగః। కృచ్ఛ్రాంద్రాయణాది తపస్సుప్రణవ జపవేదాంతచింతా పారాయణాది రూపంబగు స్వాధ్యాయంబును ఈశ్వరునియందును, స్వకృత, సర్వకర్మార్పణమును యోగసాధనంబులగు క్రియాయోగంబు లనబడును. ఇట్లు పతంజలి, అవిద్యాగంధా రహితుడు సర్వజ్ఞుడునగు నొక ఈశ్వరు నొప్పుకొని, యోగాభ్యాసపరుడగువాడు దానోన దించు, సర్వకర్మముల సమర్పించుట, యోగనిష్పత్తికి సాధనమని చెప్పబడును ।సూత్రం ॥ఋషింప్రసూతం, కపిలం మహాన్తమ్।

శ్రుతి॥ ప్రత్యయభిజ్ఞాయ మానమహాత్మ్యంమును, భగవదంశావతీర్ణుండును [illegible]ంద్రియ జ్ఞాననిధియు, నగు కపిలాచార్యుడు సాంఖ్యసూత్రమందు ప్రత్యక్షాది ప్రమాణముల లక్షణముల జెప్పుచు ।శ్రుతి। యత్సంబద్ధం సత్తదాకారోల్లేఖి విజ్ఞానం, తత్ప్రత్యక్షమ్। అని ప్రత్యక్షమును నిరూపించి ॥శ్రుతి॥ యోగీనామ బాహ్యాప్రత్యక్షాత్వాన్న దోషః। ఇంద్రియైక ప్రత్యక్షమే యిచట మాకులక్ష్యము. యోగిప్రత్యక్షము బాహ్యమగుటచే దానియందు అవ్యాప్తి లేదని విచారించెను.

ఈప్రకరణమందు నిత్యుడైన యీశ్వరుని ప్రత్యక్షము, సన్నికర్షాజన్యము గాన దానియందు అవ్యాప్తి సంభవించునని, పూర్వపక్షముచేసి ।శ్రుతి॥ ఈశ్వరాసిద్ధేః॥ ఈశ్వరసద్భావమందు దోషములేదని, సమర్థించెను. తరువాత ॥సూ॥ ముక్తబద్ధ యోరన్యతరాజావాన్న తత్సిద్ధిః॥ భవమభిమతేశ్వరుడు, క్లేశాదిముక్తుడా తద్బద్ధుడా యెట్టివాడైన యీశ్వరుడైయుండుట కుదరదు. ॥శ్రుతి॥ ఉభయదాప్య సత్కరత్వం॥ ముక్తుడయ్యేనేని ప్రయోజకరాగాభిమానాదులు లేనివాడగుటచే కేవలము సమర్థుడు అని ప్రతిపాదించెను. ఇందువలననే సాంఖ్యమునకు నిరీశ్వరసాంఖ్యమనియు యోగమునకు సేశ్వరసాంఖ్యమనియు వ్యవహారము కలదు. ఈశ్వర నిర్వ్యపేక్షముగా ప్రకృతియే జగత్తు సృష్ట్యాదులనొనర్చునని, సాంఖ్యుల సిద్ధాంతము. లోకములో నులి, బాడిత, మొదలగుపనిముట్లు చేతనాధిష్ఠితములైనచో పనిచేయనేరవు. అట్లే

యచేతనమగు, ప్రధానముచేత ననధిష్ఠితమై మహదాదికార్యముల జేయుట కెట్లు సమర్థమగును అని ప్రశ్నించితివేని, వినుము చెప్పెదను.

తత్వకౌముదియందు॥ ‘శృతి వత్సవివృద్ధినిమిత్తం క్షీరస్యయథాప్రవృత్తిరజ్ఞస్యపురుషవిమోక్షనిమిత్తం యథాప్రవృత్తి ప్రధానస్య॥’ యన్నట్లు జడపదార్థమగు క్షీరము శిశువృద్ధికొరకెట్లుమాతృస్తనమందు, యుక్తకాలము లో ప్రవర్తించునో, అచేతనమగు జలము లోకోపకారముకొరకెట్లు ప్రవర్తించునో అట్లెయచేతనమగు, ప్రకృతిచేత తనధిష్ఠితమయ్యును, పురుషుని యొక్క పురుషార్థముకొరకు ప్రవర్తిల్లునని తెలుసుకొనవలయును. ప్రకృత్యగ్ యధిష్ఠానమగు, నీశ్వరుడుండక తప్పదంటివేని, వికల్పానుపపత్తావలన నీశ్వరసద్భావము కుదరదు. ఎట్లనగ, అతడు సృష్టికంటె ముందు, కరుణతో ప్రవర్తించునా. సృష్టి యుత్తరకాలమందా మొదటివికల్పమందు, జీవులకు శరీరాద్యభావముచే దుఃఖపరిహారేచ్ఛచే యుపపన్నముగాదు. రెండవవివేకమందు అన్యోన్యాశ్రయదోషము సృష్టికారుణ్యము చేతనమైనప్రధానముచేత నాధిష్ఠితమయ్యును మహదాదిరూపముగా, బరిణమించి పురుషునియొక్క భోగమోక్షములకొరకుఁ బ్రవర్తించును. నిర్వ్యాపారమగు అయస్కాంతము యొక్క సాన్నిధ్యమువలన, లోహమున కెట్లు వ్యాపారముగలుగునో యట్లె నిర్వ్యాపారుడగు పురుషునియొక్క సాన్నిధ్యమువలన జడమైన ప్రధానమునకు వ్యాపారముగలుగుచున్నది. ప్రకృతి పురుషసంబంధము గంధసంబంధమువలె పరస్పరాపేక్షనిబంధనము భోగ్యమగుటచే, ప్రకృతి భోక్తయగు పురుషు నపేక్షించును. పురుషుడును తనకు, ప్రకృతికిగల భేదమును తెలిసికొనజాలనివాడగుటచే బుద్ధిశ్ఛాయాపన్నుండై తద్గతమగు దుఃఖత్రయమును వారించుకొనుచున్నవాడై కైవల్యమును గోరును. ప్రకృతి పురుషవివేకము లేనిది. జడమైనది దేహము, గనుక కైవల్యము సిద్ధింపదు గావున, కైవల్యముకొరకు పురుషుడు అనగ, ఆత్మప్రధానము నపేక్షించును. ప్రకృతిపురుషసంబంధము గంధసంబంధమువంటిది. ఒకసొట్టవాడు, నొక గ్రుడ్డివాడును అధికసంబంధముతో మార్గమందు బోవుచు దైవవశమున సార్థకమునుండి తప్పిపోయి యిట్టట్టు మెల్లమెల్లగ సంచరించుచు యాదృశ్చికముగా, నుభయులు కలుసుకొనగ వారిరువురిలో గ్రుడ్డివాడు, సొట్టవానిని వీపుపై నెక్కించుకొని నడువ సమకట్టగఁ గన్నులున్నవాడు అంధుని ఇటు తిరుగు అటుమరలుమని, చెప్పిచెప్పి నడిపింపగా

తుదకు ఇరువురు గంతవ్యస్థానమును పొందినట్లుగ జడమగు ప్రకృతి చేత నసంబంధమువలన, స్వర్గాదికార్యములను నిర్వహించును. ఈఅర్థ మీసాంఖ్య కారికయం దుపపాదింపబడినది. ।శ్రుతి। పురుషస్యదర్శనార్థం కైవల్యార్థంతథా ప్రధానస్య పంగంధవతుభయోరపి, సంబంధస్తత్కృ తస్సర్గః ప్రకృతి పురుషార్థముకొరకు అనగ స్త్రీపురుషులకొరకు క్షేత్రింకొరకు ప్రవర్తించుట తగియున్నదిగాని కొంనకు దాని నివృత్తి యెట్లు ప్రపపన్నమగును. అని శంకించినచో భర్తృగుష్టదోషయగు స్వైరిణి మరల భర్తృసన్నిధికి రాజాలని భంగిని సభయందు నాట్యముజేసిన నర్తకి, కృతార్థురాలై సభను విడచి పైకి బోవుచున్నట్లును, ప్రకృతిగూడ పురుషునిచే జూడబడినదియై నివర్తించుననుటకు దిగువవ్రాసిన ప్రకారమే ప్రమాణము యెట్లనిన- ।శ్రుతి॥ రంగస్యదర్శయిత్వానివర్తతే నర్తకీ యథానృత్యాత్ ॥ పురుషస్యతథాత్మానం, ప్రకాశ్యవినివర్తతే ప్రకృతిః॥ ఇది సాంఖ్యసిద్ధాంతమందు, యీప్రకారముగ చెప్పియున్నది. ఇట్లు సాంఖ్యశాస్త్రము యోగము యీరెండిటిలో ఈశ్వర నిర్వ్యపేక్షముగా ప్రకృతిపురుష వివేకఖ్యాతివలననే, మోక్షమని సిద్ధాంతము. కపిలాచార్యుడు ప్రమాణచర్చలయందు ।శ్రుతి ఈశ్వరాసిద్ధేః॥ ఏప్రమాణముచేతను ఈశ్వరుడు సిద్ధింపడ నెనుగాని విజ్ఞానభిక్షువు చెప్పినట్లు ।శ్రుతి॥ ఈశ్వరాభావాత్ ॥ అని సూత్రములు వ్రాయలేదు. పతంజలియోగమందు యీశ్వరు డిట్టివాడని నిరూపించి మన మొనర్చు సర్వకర్మలు నతనియం దర్పించుట యోగనివృత్తిసాధనమని జెప్పెను. ఇదియె కపిలపతంజలిసిద్ధాంతములకన్న యీమత్తుభేదము. ఇట్లు న్యాయవైశేషికములందు పూర్వోత్తరమీమాంసలునుగూడ నీషద్భవాంతరభేదము లున్నను పరస్పరసంబాధములైయున్నవి. వాఙ్మయచరిత్రమునుబట్టి యాలోచింపగ యీమత్తుదర్శనములు సూత్రరూపముగా, సంగ్రంధితములైన కాలమందె యుత్పన్నములైనవని మనము తలంపగూడదు. గౌతమునికంటె ప్రాచీనముగా న్యాయము, కణాదుని కంటె ముందుగ వైశేషికమునట్లె యితరదర్శనము సూత్రకర్తలకంటె ముందుగా నితరదర్శన సిద్ధాంతములు అనాదికాలమునుండి, సంప్రదాయపరంపరాప్రాయములై లోకమందు, ప్రవర్తించుచున్నట్లు యీసూత్రగ్రంథములయందు వుదాహృతములైన, ప్రాచీనమైన తమ ఋషిమతములవలన దెలియబడుచున్నది.

ఈరీతిగా వాఙ్మయచరిత్రవిమర్శవలన నీయోగము కూడ అనాదిగా లోకమందు ప్రవర్తించుచున్నట్లు గ్రంథనిదర్శనమువలన గానవచ్చుచున్నది కాబట్టి యీసాంఖ్యయోగములు రెండున్ను సనాతమైనవి గావున-యిప్పటికి గూడా ప్రవర్తింపబడుచున్నవి

ఈ ఆతత్వశ్రుతిస్మృత్యుపనిషత్ సూత్రపతంజలి గీతాయోగశాస్త్రములచే విచారించిన హంశమేమనగా,

నిర్గుణబ్రహ్మము యెట్టిదనిన

॥ శ్రుతి ॥॥ అనంతప్రవిష్టాశ్శాస్తా జనానాం సర్వాత్మా ॥
తత్సృష్ట్వాతదేవానుప్రావిశత్ ॥
తదనుప్రవిశ్య। సచ్చత్యశ్చాభవత్ ॥
సత్యంచానృతంచ, సత్యమభవత్ ॥
సత్యచానృతంచ, సత్యమభవత్ ॥

అను మొదలగు శ్రుతులును జెప్పునట్లు సర్వప్రకారత్వమున నంతటను నిండియున్నట్టియు, హేయగుణవర్జితుడు నగు, పరమాత్మ ॥ శ్రుతి ॥ జగత్సర్వం శరీరంతే స్థైర్యంతే వసుధాతలం ॥ ఏకమేవాద్వితీయం బ్రహ్మ ॥ అనియున్నది. పరమాత్మకార్యకారణ రూపములచేత, సమస్తము తానైయున్నవాడు, నొక్కటియై పరమై హేయప్రత్యయనీకానేక కళ్యాణగుణ విశిష్టుండై యుండుటచేత, సర్వోత్కృష్టమైనదియు అలౌకమైనది ॥ శ్రుతి ॥ యస్యకించిద్బహిర్నాస్తి కించదం ॥ తఃకియన్నచ, యస్యలింగం ప్రపంచంవా, బ్రహ్మైవాత్మానసంశయః ॥ యనుటచేశ్రుతి ॥ ప్రపంచసంమంధమైన సుఖదుఃఖాదులులేనిదియైనదని- తాత్పర్యము ॥ కేవలం, ఆనందం ॥ శ్రుతి ॥ ఆనందో బ్రహ్మ। తివ్యజానాత్ ॥ అన్యోంతర ఆత్మానందమయః ॥ అను మొదలగు శ్రుతులవలన, నిరతిశయానంద స్వరూపము, సంతతాస్పందమైయున్నది ॥ శ్రుతి ॥ స్థైర్యేణ హిమవానివా । యనుటచేత, స్థైర్యగుణముచేత యెన్నియుడుములు వచ్చినప్పటికి చెలింపనిదియైయున్నది ॥ శ్రుతి ॥ పద్మకందం- గురుం వందే ॥ శ్రుతి ॥ యస్యనిశ్వతిం వేదాః, శాస్త్రయోనిత్వాత్ ॥ అను మొదలగు ప్రమాణములవలన, వేదములనియెడు తామరలనెడు కలవలకు దుంపమూలకందం మూలకారణం మూలదుంపయై యున్నది- గావున-

సారమై ॥గీతావచనాత్॥ ఉత్తమపురుషత్ స్త్వన్యః పరమాత్మేతు- దాహృతః। గీతావచనమువలన సర్వోత్తమమైనదియు నైయున్న పరబ్రహ్మం తనకన్న వేరొండువస్తువ లేదనియు, పరాత్పరమైన ఉత్తమ పరమపురుషస్వరూప మైనది- త్రికాలత్రియాబాధ్యమై ॥శృతి సత్యం జ్ఞానమనంతం బ్రహ్మా బను ॥శృతి॥ వలన సత్యస్వరూపమైనదియు, మహాప్రళయకాలమున, సమస్తలోకములను తనలో వ్యక్తరూపమున నుండకపోవుటచేత నిష్ప్రపంచమనియు, అంతటను వ్యాపించిన దివ్యతేజోమయుడై యున్నది. ॥శృతి। యతోవా ఇమానిభూతా నిజాయంతే యేనజాతాని జీవంతి, యత్ప్రయం త్యభి సంవిశంతీతి॥ యను మొదలగు శృతులచే సమస్తోలయములకు మూలకారణమైనదియు మాయతనకు వశమైయుండుటచేత ఆమాయ యొక్క సంబంధము లేనిది గావునసే సంసారసంబంధము లేనిది సుఖదుఃఖములు లేని ఐశ్వర్యమయినదియు, నైష్కర్మ్య కర్మస్వాప్యనిర్గుణ బ్రహ్మగుగును గాబట్టి బ్రహ్మము మాయాగుణసంబంధము లేనిది. ॥శృతి॥ భీషాస్మాద్వాతఃపవ తే భీషోదేతిసూర్యః భీషాస్మాదగ్నిశ్చేంద్రశ్చ॥ యను శృతిచే సర్వనియంతయు స్వయంప్రకాశమనుటచేత తనకు ఆపరబ్రహ్మమునకు వేరొకదానివలన వణుకుట లేనిదియు నిష్క్రియము, నిష్కాపము, నిష్కల్మషము ॥శృతి॥ ఏకంఅద్వైతం నిష్కళంనిష్క్రియంశాంతం॥ అనుశృతిచేత మాయాసంబంధమగు కపటము లేకపోవుటచే అనగ యిచ్ఛయనేసృష్టికోరిక లేక స్వాంత్వతేజో బిందుకళాస్వరూపమై ఆకళలోనిష్కళమై ఆనిష్కళతానై తానే ఆపరబ్రహ్మమై నైష్కర్మ్యము కర్మరహితమై ఆకర్మమై . సృష్టియనే కోరికలేనిదై- పుత్పత్తిస్థితిలయములు లేనిదియై యున్నచో నిష్కళ కళారహితమై ॥శృతి॥ కళా స్యాత్కపటేపిచ అనునిఘంటువుచే కళాశబ్దమిచట కపటము అనగ కళయందు గుణసామ్యావస్థయుండుటచేతను మనోభింపనకూడియుండుటచేతను కపట వాచకమైనది, గావున నిష్కళంకము త్రిగుణాతీతమైనదియు, మాయా కళంకము లేనిదై ॥సర్వంవిష్ణుమయం జగత్॥ యనుటచేత ఇదివికువనిగిఇదివిమువ రానిది యనుభేదము లేనిది ॥శృతి॥సత్యజ్ఞానమనంతంబ్రహ్మ ॥ఆనందోబ్రహ్మేతి వ్యజానాత్ ॥ మొదలగు శృతులచేత తనస్వరూపము ఆనందస్వరూపమగు పరబ్రహ్మముయొక్క మూలప్రకృతివలన గలిగిన మహదాది కార్యకరణ సంఘాతమునకు మూలకారణమైన చైతన్యశక్తికి నియామకమగు ప్రకాశ

ము నగుటచేత మూలాధారమైనదినైన జీవులయట్లు అజ్ఞానావచ్ఛిన్నరూపమైన లింగశరీరములేనిదియు, కారణదేహోపాధికంబగుటచే సూక్ష్మశరీర విహీనమైనదియునై, నిఖిలజగద్వ్యాపారమునకు సాక్షియైనదియు సాధారణముగ జీవులకు, జాగ్రదవస్థయందు, స్వప్నావస్థయందును దెలివిగలుగుటయు సుషుప్తవస్థలో నేమియు దెలివిలేనట్లును, దోచబడుటయు గలదు. ఐతే సుషుప్త్యవస్థయందు సాక్షిచైతన్యము లేకపోవుట లేదు. నేను సుఖముగ నిద్రించితిని. అప్పుడు పనియేమియు నెరుగను అని గాఢనిద్రనుండి లేచినవాడ ననుకొనును. కావున సుషుప్తికాలీనమగు నేనేమియు నెరుగననే నజ్ఞానమునకును సుఖమునకును, సాక్షియగు చైతన్యము, అప్పుడున్నది లేదని దోచి నప్పటి యజ్ఞానసుఖములు, స్మరణకురావు. అనుభూతముగాని దానిస్మృతి యెన్నడును గలుగదుకనుక సుషుప్తియందు సాక్షిచైతన్యమునకు సంసారదోషసంపర్కము లేనిదియు దేశకాలవస్తుకృత పరిచ్ఛేదనము లేక, సర్వవ్యాపకమైయున్నది. ॥ శృతి ॥ కార్యోపాధిరయంజీవః। కారణోపాధి యీశ్వరః। కార్యకారణతాంహిత్వా పూర్ణబోధోకశిష్యతే॥ కారణశరీర ముపాధిగగలుగుటంజేసి లింగశరీరసంబంధము లేనిదియు తనకు తానెరుంగుచున్నది తనకు కానలసినదిగాని, కానరానిదియుగాని, లేదని చెప్పియున్నది—గాబట్టి శృతి ॥ యతోవాచో నివర్తంతే అప్రాప్యమనసాసహ ॥ అని శృతివలన యవాఙ్మానసగోచరమగు నాబ్రహ్మము, అనవదికాపరిమితవైభవోజ్వలమగుటచే నీవస్తువనిగాని యావస్తువనిగాని దీనినిబోలియుండుననిగాని దానింబోలియుండుననిగాని యింతపరిమితనిగాని ఇంతపరిమితిగలదనిగాని, చెప్పుటకు వీలులేనిది. ఇట్లు ॥ శృతి ॥ నతత్రచక్షుర్గచ్ఛతి నవాగ్గచ్ఛతినో మనోనవిద్మోన విజానమః యస్త్వవిజ్ఞానవాన్ భవత్యమనస్కః పదాశుచిః నసతత్పదమాప్నోతి ॥ మొదలగు శృతులను బట్టి యజ్ఞానోపహితమగు నాత్మకు బ్రహ్మస్వరూప మగోచరమైనను ॥శృతి॥ యస్తువిజ్ఞానవాంభవతి॥ శృతులవలన శమదమాది సాధనసంపత్తిగలిగిన యింద్రియనిగ్రహముగలవాడై శ్రవణమనననిధిధ్యాసనతత్పరుండైన జ్ఞాని భ్రమరకీటక న్యాయమున నిరంతరాభ్యాసవశమున పరమాత్మతాదాప్యము నొంది ॥శృతి॥ యస్సర్వజ్ఞ సర్వవిత్ అను శృతి॥ ప్రమాణమువలన, సర్వజ్ఞత్వాది గుణములగు పరమేశ్వరుని యోగమున సర్వము నెరుంగుచుండును, అట్టి సర్వసాక్షి చైతన్యమే పరబ్రహ్మము

శృతి॥ సర్వం ఖల్విదంబ్రహ్మ। శృతులచేత సర్వంవిష్ణుమయంజగత్॥ శ్మృతు లవలన ॥శృతి॥ విష్ణ భాహామిదం కృత్స్నమేకాంశేనస్థితో జగత్॥ శృతినిబట్టి పరమాత్ముడే శరీర, శరీరిభావమున జగద్రూపుడైయున్నాడు గాబట్టి శృతి॥ ప్రకృతేణమహదాదికార్యకరణసంఘాతం। కరోతీతిప్రకృతిః॥ మహాతత్వ ము మొదలగు కార్యకరణసంఘాతమును జేయునదిగాన ప్రకృతియనబడు. ప్రవృత్తిచేత, ప్రకృతిశబ్దవాచ్యమగుమాయ యజ్ఞాన . అజ్ఞానమునకు విల క్షణమునైనది చెప్పబడుటచేత- యనాదిమూలమాయ ॥శృతి॥ అహీనమూలజ్ఞ ప్తికళామాత్రశరీరంబనే మూలప్రకృతియనే మూలమాయకు ॥శృతి॥ మూలా భావమిదంజ్ఞాతుంనశరీరం॥ బనిశృతులు చెప్పుచున్నవి. అనాదిమూలమాయ మొదలు, లేనిమాయశక్తి తనకన్నాభిన్నముగానిది మాయ పరమాత్మకన్న మేలైనదియు పైజెప్పబడినరీతి తనుయెందుకు యెంచకూడదు గాబట్టి— యెంచ నలయును. ఇదివరకే సర్వజ్ఞులైన మహాఋషులు పరమాత్మవిచారణచేయుచు మాయాస్వరూపము పరమాత్మకంటె వేరైనది వేరుగానిది నిర్ణయించుటకు శక్యముగానిది యని చెప్పిరి గాబట్టి తనసంబంధమైన మాయారూపమనగు త మస్సు సస్వరూపానుభవజ్ఞానలక్షణమగు చూడ్కిచే జూచిన జననమరణాది బహుదుఃఖభూయిష్టంబగుటచే గనుతుచ్ఛమై విడనాడదగియున్నది. అనేక పెక్కుయుక్తులనుబట్టిచూచినచో నిది యిట్టిదని నిశ్చయించుటకును, విలులేద నియును, లోకవ్యవహారమునుబట్టిచూచిన తుదిలేనిదియునై యున్నది. శృతి॥ నిర్మూలమేతథాజ్ఞానశరీరం। మూలాభావః॥ కావున, బ్రహ్మాదులకైనను నీ మాయాస్వరూపము అగమ్యము గావుననే మమమయాదురత్యయా యని యున్నది. మరియు మహాజ్ఞానులు విక్షేపశక్తినిమీరి అసంభావన విపరీతభా వనలేక మిక్కిలిబలపడి భేదములేని స్వరూపానుభవజ్ఞానవిలోకనముచేత ॥శృతి॥ పూర్ణమదఃపూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదీరితం। పూర్ణస్యపూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే॥ యన్నట్లు గుణత్రయాతీతమైనట్టియు బరబ్రహ్మమునైన తన్నుతా తెలిసి నిజమునుగ్రహించినతోడనే మాయనశించునో తనసంబంధ మైన మహామాయాశక్తి అదియేయని ప్రమాణము లున్నవి.

ఇంతియేగాక యీమాయ ॥శృతి॥ అజామేకాంలోహితశుక్లకృష్ణాం॥ అను మొదలగు ననేకసమూహాజీవమనియును నీళ్లయొక్కసమూహము కొలన నియును బలుకబడునట్లు అనేకవిధములగు తోచుచున్న జీవులయందలి యజ్ఞాన

మంతయు గలసినది. మూలజ్ఞప్తికళామాత్రశరీరమనే అనాదిమూలమాయ శృతి॥ అజామేకా మొదలగుశృతిచే నుత్పత్తి స్థితిలయములులేని మహామాయప్రపంచమునకు వ్యక్తిగలిగినప్పుడు నుత్పత్తి స్థితినాశనములు గలదియునై యున్నది. కావున జననమరణాది షడ్భావవికారములులేక అద్వితీయమగు పరబ్రహ్మమునకే ఆవిక్ళృతిగలుగిదోచునట్లు యున్నది. శృతి॥ ఊర్ణనాభిర్యథాస్వాంగతత్తూన్ శృజతిచైతథా నిమిత్తోపాదాన। హేతుర్జీగతః పరమేశ్వరః॥ అనునట్లుసాలెపురుగు తన అవయవములనుండినన్నిదారములను శృజింపుచు నాదారములకు నిమిత్తకారణము నుపాదానకారణము దానెయగునట్లున్ను మరియును నీజగత్తునకు కార్యకారణహేతువై సంఘాతమెల్ల తానై యున్నది. కాబట్టి గురుస్వరూపం పరబ్రహ్మస్వరూపం ॥శృతి॥ అథపరాయయాత దక్షరమతిగమ్యతే అపరాయ ర్వేదో ఋగ్వేదోస్సామవేదోథర్వవేద శిక్షాకల్పోవ్యాకరణం నిరుక్తంఛందోజ్యోతిషమితి॥ అనుశృతిచే బ్రహ్మకాండ పరావిద్యాయనియు, కర్మకాండ అపరావిద్యయనియు చెప్పబడుచున్నది గాన నీరెండువిద్యలకును అధిపతియగు పరమాత్మగాన యెరుంగవలయును. కొందరుమనుష్యులు గురుబ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవోమహేశ్వరః అనుటచేత మరికొందరు ॥శృతి॥ హిరణ్మయాం స్వర్ణమయాండంగర్భస్థుత్పత్తిస్థానమస్య॥ అను వుత్పత్యర్థమునుబట్టి బంగారు వికారమగునండము పుట్టుకపట్టుగాగల వాడు గాన చతుర్ముఖబ్రహ్మ హిరణ్యగర్భుడనబడును గావున యిందుకు ॥శృతి॥ తదండమభవద్దైమం। సహస్రాంసుసమప్రభం తస్మిన్ జజ్ఞేస్వయం బ్రహ్మ సర్వలోకపితామహః॥ అనుమనుప్రమరియు ॥శృతి॥ హిరణ్యగర్భసమవర్తతాగ్రే॥ అనుశృతి హిరణ్యగర్భుడే యాదిదేవుడు అనికొందరభిప్రాయము. మహావిరాట్పురుషుడు ॥శృతి॥ భూఃపదౌయస్యనాభిర్వియత్॥ అనుమొదలగు శృతి॥ సహస్రశీర్షాపురుష సహస్రాక్షసహస్రపాత్॥ అనుమొదలగు శృతుల వలన సమస్తప్రపంచస్వరూపుడగు విరాట్పురుషుడే పరదైవమునే గురువని కొందరు, ఋభుప్రభుడంచు కొందరు ॥శృతి॥ ఇందోమాయాభిఃపురురూప ఈయత॥ ఇతిశృతి ప్రమాణవాదములచే సాధింపుచుందురు. కొందరు గణాపత్యునియందురు ॥శృతి॥ గణానాంత్వాగణపతింగ్ హావమహేకవిం, కవీనా॥ యని చెప్పుదురు. ఆయావుపాస్తినిబట్టి ఆయాదేవతను ఆచరింతురుగాబట్ట తానేగురుస్వరూపమైన పరబ్రహ్మమని తెలుసుకొనజాలరు గావున—

తన్నుతాఁదెలసి, తాను కేవల పరబ్రహ్మముగా నెరింగి, తనయందారోపిత మైన కేవల మూలప్రకృతి ॥శ్రుతి॥ ప్రాణాః క్షేత్రజ్ఞరూపేణ ధారయన్ జీవవృచ్ఛతే యని జీవశబ్దవాచ్యమగు దేహాదికమునందు నభిమానముగల జీవుఁడనబడెడు నా అవిద్యయందు, ప్రతిబింబించిన, ఆత్మ, అవిద్యావశుఁడై పంచీకృతభూతసంబంధమైన, రక్తమాంసమేధోమజ్జాస్థి భూయిష్ఠమయిన స్థూలశరీరముయొక్కయు అపంచీకృతభూతసంభవమై కర్మపాశబద్ధమగు సూక్ష్మశరీరముయొక్కయు, సంసారములచేత భావించి, నిత్యము, అత్యంత మోహావిశిష్టమగు వ్యాపారములో నీసంసారచక్రమునుండి కడతేరలేక దిర్మరుచుండును. కావున, వ్యక్తావ్యక్తరూపమ సమస్త ప్రపంచసృష్టికిని నామరూపాత్మలకును సాక్షియగుచు పరమాత్మ యొప్పుచుండును గాబట్టి సర్వద్రష్టయగు నా పరమాత్మ ॥శ్రుతి॥ భిద్యాతే హృదయగ్రంథిశ్ఛిద్యంతే సర్వసంశయాః॥ అనునట్లు వికల్పములును లేనివాఁడును ప్రకృతి, వికృతి, రూపములగు సకలపదార్థములయొక్క సంపర్కము లేనివాఁడును జననమరణాదిక రూపములైన షడ్భావవికారములు లేనివాఁడును, స్వజాతి విజాతి, స్వగతభేదములు లేనివాఁడును, అపరిచ్ఛిన్నుఁడును, సర్వావస్థస్వరూపుఁడైన పరమాత్ముఁడనియు, సర్వాంతర్యామియగుటచే బ్రహ్మమనియు అఖండమై అంతటను నిండియున్న శుద్ధచైతన్యమైనదియు ప్రమాణములున్నవి ॥శ్రుతి॥ వాచారంభణం వికారో నామధేయః మృత్తికేత్యేవసత్యం॥ అనుటచే మూకుడు, కడవ, మొదలగు మృణ్మయపాత్రవిశేషముల యాయా పేరులను, నాకృతులను, విడచినచో మట్టియొక్కటియే కొరవడినట్లు అవిద్యాప్రతిబింబితమగు జీవచైతన్యముయొక్కయు మాయాప్రతిఫలితమగు, యీశ్వరచైతన్యముయొక్కయునైన, స్థూలసూక్ష్మకారణ శరీరరూపములగు పాధులను బరిగణింపక, పదసద్వివేచనాపూర్వకమగు, జ్ఞానదృష్టిచే విచారించినచో స్వయంప్రకాశమై సర్వాంతర్యామియై సర్వవ్యాపకమై మాయాసంబంధములేని, పరమాత్మ యొక్కటియే తన్నుతాఁగన్న మహాత్ములకు తాఁదెలియబడును. కూటస్థచైతన్యమునకు పరమాత్మ చైతన్యమునకు ఛాందగ్యోపనిషత్తునందు తత్వమసి యనే మహావాక్యార్థము. అయిక్యము ఏకత్వమే అశిపదం తత్వమశియనె మహావాక్యార్థమునందలి అసియను పదమునకు నర్థము, త్వం=నీవు, తత్=ఆబ్రహ్మవు, అసి=అయితివి. అని మహావాక్యమునకు ప్రతిపదార్థము, జీవ

బ్రహ్మైక్యము ,జీవునకును పరబ్రహ్మమునకు నేకత్వము నుపదేశించెను॥శృతి॥ త్వమేవాహం, త్వమేవాహం నసంశయః॥ అభేదమైనది తానైనపరబ్రహ్మము తనకన్యమేమియు లేనిది యున్నది ॥శృతి॥ నద్వితీయోహాస్తికశ్చన॥ మొదలగు ప్రమాణమువలన తనకంటె వేరొండు లేనిదియు నగు పరమాత్మయొక్క యదార్థమైన తననిజస్వరూపమును బోధించుచున్నవి గాబట్టి జీవాత్మయైన తాను ప్రజ్ఞానం బ్రహ్మంబన నైతరేయారణ్యమునందలి మహావాక్యార్థము యిట్లు వివరింపబడియున్నది గాన ॥ఏనవాపశ్యతి॥ అను తైత్తిరీయోపనిషత్తు ॥సర్వాణ్యేతాని ప్రజ్ఞానస్య నామధేయాని॥ తుదగల యధాంతరవాక్యాసందర్భము యిట్లెరిగింపబడినది ॥శృతి॥ యేనేక్షతే శృణోతీదం జిఘ్రతి వ్యాకరోతిచ, స్వాదస్వా దూవిజానాతి తత్ప్రజ్ఞానముదీరితం॥ అనుటచే శ్రోత్రేంద్రియమునుండి వెలువడిన యంతఃకరణవృత్తియొక్క తాదాత్మ్యమునొందిన యేచైతన్యముచేత వాగ్రూపముగను ధ్వనిరూపముగ నున్న శబ్దజాలము వేర్వేర తెలియబడుచున్నదో యాచైతన్యమే నేను యాప్రజ్ఞానమే నేనైతిని. యింతియేకాక యాయంతఃకరణవృత్తు లుపాధివశముచేత సమస్తములైన సంకల్ప వికల్పములు యెరుంగబడుచున్నవో యాప్రజ్ఞానమే నేనైతినని చెప్పుచున్నది. సర్వపరిపూర్ణ పరబ్రహ్మము నేనేసుమీ అని యున్నది గావున ॥శృతి॥ నతత్ర, సూర్యోభాతి, నచంద్రా తారకం, నేమావిద్యుతో, భాంతికుతోయమగ్నిః తమేవభాంతమనుభాతి సర్వంతస్యభాసా సర్వమిదం విభాతి॥ యనుశృతినిబట్టి సూర్యుడు, చంద్రుడు, అగ్ని, నక్షత్రములు, మెరుపులు మొదలగు, ప్రకృతిసంబాధములైన, తేజస్సులన్నియు నేస్వయంజ్యోతిస్వరూపమును వెలిగింపజాలక, యాపరంజ్యోతిరూపముచేత బ్రకాశింపజేయబడుచున్నవో యట్టి స్వప్రకాశాత్మరూపుడనైన నేను, నిరంతరము యెల్లెడల ఒక్కతీరున ప్రకాశించును, గావున తాను సర్వసాక్షిప్రత్యక్‌బ్రహ్మచైతన్యమాత్రుండైన తనకు ॥నిరాలంబోపనిషత్తునందు॥ అణుస్థూల, అహ్రస్వమదీర్ఘం॥ బను శృతులబట్టి తాను ప్రకృతిధర్మములను షడ్భావవికారము లేనివాడగుటంజేసి పంచకోశవిలక్షణుండనై అట్లునేనేమియుగాకయని, విమర్శింపుచున్న శుద్ధజీవునిసాక్షిరూపినై తానెచూచుచున్నవాడనే అట్టికూటస్థచైతన్యమునకుగూడ, సాక్షినై యున్నవాడను తుదకు ఆత్మపంచకమందు॥ నాహందేహోనేం ద్రియాణ్యంతరంగం, నాహంకారః ప్రాణవర్గో నబుధిః ధా

శోపప్రిత్యక్తే త్ర విత్తాదిదూరః, సాక్షినిత్యః ప్రత్యగాత్మ శివోహం॥ యిట్లు చెప్పియున్నది —

తుదకు నేను సాక్షీనిత్యప్రత్యగాత్మశ్శివోహం" బగును. ఇవి యేవి యు నేగానని వికారములులేని నిర్వికారరహితమై శుద్ధబోధస్వరూపుడను॥ ఓహం బ్రహ్మాస్మి" అహమస్మి బ్రహ్మాహమస్మి॥ జ్యోతిరహమస్మి॥ అను మొదలగు వాక్యములచే నన్నియు నేనై తినని; తన్ను తా దెలుసుకొని సాక్షే బ్రహ్మసైయుండె ॥శ్రుతి॥ మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః॥అనునట్లు అవిద్యకు పెద్దకొడుకగు నీమనసున్ను పుణ్యకర్మగాని, పాపకర్మగాని, ఏది గావించినను, ఆమూపునులెల్ల తానే మొనరింపుచున్నాననను. భ్రాంతిచే సాధారణముగ పామరులందరు, ననుకొనుచున్నారు ఇట్టిమనఃకృత్యమును, తానుచేయుచుంటినని అనుకొనుట సచ్చిదానంద సాంద్రపరమాత్మ స్వరూపులమగుచు నొప్పుచున్న మనకు తనకు, నజ్ఞానకల్పితములుగాని, వాస్తవముగాదుసుమీ అనేకశ్రుతిశ్రోత్రోపనిషత్ ప్రమాణములు చెప్పుచున్నవి- ఆత్మానాత్మవివేకము లేకపోవుటవలన పరిణామవిరసములగు స్వేచ్ఛందనాది విషభోగములయందు ప్రపనిషత్తులయందు ॥యదహరేవ॥ విరజ్యేత్తదహరేవ ప్రవ్రజేత్ ॥ అను నుపనిషద్వచనములనుబట్టి వైరాగ్యము బొడమినతోడనే దేవ్యోపనిషత్॥ యథేదేహకర్మచితోలోకః క్షీయతే, ఏవమేవాముత్రపుణ్యచితో, లోకక్షీయతే యను శ్రుతులచేత నైహికాముష్మికరూపములగు ప్రపంచమెల్ల నజ్ఞానకల్పితమగుటచేత వినశ్వరమైనదను దలంపుత్రో న్నావైషయిక భోగములయందు నక్కీన కూటియందు నభిలాషను వదలి, జడములగు దేహాదిచైతన్యస్వరూపుడనగు నేనుగానను సర్వావస్థలయందు, నేను నేననియెడు, స్థితప్రజ్ఞయందు, స్ఫురింపుచున్న యఖండైకరసచిన్మాత్ర పరబ్రహ్మమే తానని యెంచి, మనోవాక్కాయకర్మాదులయందు నహంకార మమకారరూపమగు, సంస్కారమును బొందకుము.

కావున బ్రహ్మైక్యరూపమగు ముక్తిసామ్రాజ్యము నొందుదువు. అచ్ఛేద్యోయమదాహ్యోయ మక్లేద్యోశోష్యఏవచ, నిత్యంసర్వగతస్థాణురచలోయం సనాతనః॥ గీతాద్వచనము నాశరహితుడగు పరమాత్మ జీవాత్మ తన్ను భగవన్మాయ ఆవరింపగ, సదసద్వివేచనాది హీనుడై వినశ్వరమగు, నీశరీరాదికమే తానని తలంచుకొనుచున్నాడు. కాని నిక్కముగ నీదే

హాదికము తానుగాడు. తానెప్పుడనిన తనకును, పరాత్పరునకు, శేషశేషి భావములనుబట్టి భేదమించుకయులేక పోవుటవలన, బ్రహ్మజ్ఞానముచే మూలాజ్ఞానమును భేదించి యాపురుషోత్తముడే తానని తాదెలిసికొనవలెను — తట్టిపురుషోత్తమునియొక్క హంశమాత్రంబైన క్షేత్రము రూపమును నిష్పన్నమైనదిగాన ॥శృతి క్షయతీతిక్షేత్రం॥ పరిణామయుతోప్యున, అని వ్యుత్పత్త్యర్థముచేత క్షయించునది క్షేత్రమనబడును, ॥గీత। భాష్య॥ ఇంద్రియాణి దశైకంచ పంచేంద్రియగోచరాః, ఇచ్ఛాద్వేషః స్సుఖందుఃఖం సంఘాతశ్చేతనాకృతిః ఏతత్ క్షేత్రమితిజ్ఞేయం॥ అని సొల్లి ప్రదహరించబడిన గీతావాక్యమువలన, నింద్రియములు పదునొకండును యిందిరియార్థములైనను, మొదలగునవీ క్షేత్రశబ్దవాక్యములుగాన క్షేత్రమనియును, క్షరమనియును క్షయతీతిక్షరః॥ అను వ్యుత్పత్తిచే నశించునదిగాన, క్షరమనియు పరిణామముగ మహదాదిరూపమున జేయునదిగాన ప్రకృతియనియు ఆత్మకువిలక్షణమైనదిగాన అనాత్మయనియు యిట్టి అనాత్మ ॥శృతి। అనాత్మదృష్టే అవివేకనిద్రా అహం మమ స్వప్నగతింగతోహం॥ అసత్తు-స్వప్నమువంటిది- అసత్యస్వరూపమగు నాపరికృతియె తానను, భావనచేత ప్రవర్తించు, సంసారయాత్రను జేయుచున్నట్టి॥ మత॥ నాసంబంధమైన, చైతన్యాంశమువలనగలిగినవాడైన జీవుడగునట్టి జీవాత్ముడు పంచవింశకుడు యనునదిమొదవవాడగును. క్షేత్రజ్ఞుడు పూర్వోక్తక్షేత్రస్వరూపుడగు అపరాప్రకృతిని తెలిసికొనుచుండువాడు గాన క్షేత్రజ్ఞుండనియును, అక్షరుడనియును॥ గీతాభాష్యే నైనంఛిదంతిశస్త్రాణి నైనందహతిపావకః। నచైనంక్లేదయంత్యాపోనశోషయతిమారుతః॥ భగవద్వచనమునుబట్టి ॥నక్షరతీత్యక్షరః। అనువ్యుత్పత్తిచేత నాశనములేనివాడుగాన, నక్షరుడనియు, పురుషుండనియు ॥పురిశేరతఇతిపురుషః। అను వ్యుత్పత్తిచేత, శరీరత్రయమను పురమునందుండువాడుగాన, పురుషుండనియు, ఆత్మ ॥శృతి॥ అతతీతత్తచ్ఛరీరాదిషువ్యాప్నోతీత్యాత్మా॥ అను వ్యుత్పత్తిచే, నాయాశరీరాదులయందు వ్యాపించియుండువాడు నాత్ముడనియును చెప్పుదురు. ॥శృతి। నిత్యత్వంసత్యత్వం తద్వ్యక్త్యాస్థితస్నిత్యాసత్యా॥ యనునభియుక్తివచనములను బట్టి నిత్యత్వమునకు ప్రేరేపించినది తనకుదా వెలుగొందుచున్నది ఆత్మకు నిత్యము శృతి॥ సుఖంమ్మేభూయాత్, దుఃఖంమ్మేభూయాత్॥ అనగ, సుఖమే నాకు గలుగుగాత, దుఃఖమెపుడును గలుగకపోవుగాకయని ప్రతిప్రాణి

లకును దలంపుగలిగియుండుట యెల్లరకును ననుభవసిద్ధమేగాని, జీవాత్మ తానుచేసికొనిన, కర్మానుసారముగ తనకుగలిగిన యిడుములు నశించిపోవలయునని, కనిపెట్టుచు మిక్కుటమైన నిలుకడగల ఎలమినొందుటకై దలపోయుచుండును. ఆత్మసర్వాధికమగు ప్రియమునకు నాశ్రయభూతమై యుండుటచేత (నిరతిశయమగు సుఖము) స్వరూపముగలది ఆత్మయని అనుభవసిద్ధము జెప్పుచున్నవి. ॥శృతి॥ అణినమూలజ్ఞప్తి కళామాత్రశరీరం॥

ఈఅనాత్మ మీమాంసలంజేసినగు యిదిగోశరీరంబను నీప్రపంచంబు ఆత్మకాని యీజగత్తుమిథ్యాభూతమగుటవలన నిరవయవంబై ॥నిరాలంబోపనిషత్॥ అశబ్ద, మరూపమస్పర్శమవ్యయం॥ బనుటచేత ఆత్మకు నామరూపాదికములు లేకపోవుటచేసి కాళ్లు, చేతులులోనగు నంగములు లేనియు వ్యాపకంబును శృతి॥ పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదీర్యతే॥ అను మొదలగు శృతులచే సంతతటను నిండియుండునదియు అసంగము యెట్టిసంసర్గమును లేనిదియు ॥శృతి॥ అసంగోహ్యయంపురుషః॥ అనుశృతిచేత నెట్టిసంసర్గమును లేనిదియు ఆత్మయగును. ఇట్లు నిరవయత్వాదిధర్మములుగలదియైన ప్రకృతి నిజధర్మమగుటవలన శశవిషాణంబునకు అనగా చెవులపిల్లికొమ్మువలనే అభావపదార్థమగును. ఈవస్తువు ఆత్మ యీవస్తువు ఆత్మకాదనియెడు భేదము లేకున్నది. ఈరీతిని దేశకృత, కాలకృత వస్తుకృతభేదములు లేకపోవుటచేసి ప్రత్యక్ భిన్నసాక్షి చైతన్యముకంటె వేరుగాని పరిపూర్ణసర్వవ్యాపకమగు బ్రహ్మచైతన్యంబునగు పరమాత్మ నేనైతిని. ఇట్లు శృతిప్రమాణంబులు చెప్పుచున్నవి. ॥సర్వసారోపనిషత్॥ అణినమూలజ్ఞప్తికళామాత్రి శరీరం॥ బనె మూలాజ్ఞానముచేతనే గ్రిమ్ముకొనియుండు యింద్రియార్థములుగల ॥గీతాభాష్యం॥ మాత్రాస్పర్శాస్తుకౌంతేయ ॥శీతోష్ణసుఖదుఃఖదాః॥ భగవద్వచనముచేత యిచ్చట శబ్దాది విషయపంచకమని తెలియవలెను. నిముషమాత్రమైనను గడచిన మహాత్ముని బ్రహ్మాదులు మొదలగువారైనను యెన్న లేరనునపుడు క్షణము॥శృతి॥ తాస్త్రి త్రింశతక్షణః॥ యనుటచేత త్రింశత్కళాత్మకమగుక్షణమాత్రము అనృతజడ దుఃఖాత్మకమగు ప్రపంచమునకంటె సచ్చిదానందమయమగుటచే వ్యతిరిక్తమగు పరబ్రహ్మమును గలసి యెట్టిమహాత్ముల కేనియు కలసి పట్టజాలని ధీవృత్తిచేత కూర్పబడిన ప్రతిబింబించిన జ్ఞప్తి, కళా, జ్ఞానకళయొక్క చివరనే వునికిపట్టయినది. దేదీప్యమానమగు సముజ్వలమగు ఆత్మసంబంధమైన

వెలుగు చేత భాసిలజేయుచున్న పదునాలుగులోకముల గుంపునకును స్వాత్మ భూతమగు తేజస్సును అపరోక్షసాక్షాత్కారముగ గనుగొనును. అట్టి బ్రహ్మా నందమయ స్వరూపుడగు చిత్రపటమునవ్రాయబడిన విగ్రహమువడువున చేష్టలుడిగి వ్యాపారము లెవ్వియులేక మేనిపైజ్ఞప్తిలేక కొంతసేపటికి యూర కయుండెను గాబట్టి జీవాత్మపరమాత్మైక్యస్వరూప నిరూపణము యెట్లనిన శృతి॥ శబ్దస్పర్శాదయోవేద్యా వైచిత్ర్యాజ్జాగరేపృథక్॥ తతోవిభక్తా తత్సంవిదై కరూప్యాన్నభిద్యతే॥ యనుటచేత జీవాత్మపరమాత్మలకు నైక్యరూపమగు ప్రధానవిషయమందు మనము తెలుసుకొనుటకు దొలుత జీవాత్మసత్యజ్ఞానా నందస్వరూపమని యెరుగదగియున్నది. ఎట్లనినచో స్పష్టివ్యవహార, విశిష్టం బగు జాగ్రిదావస్థయందు జ్ఞానమునకు గోచరమగుచున్న యాకాశము మొద లగు పంచభూతములును పంచభూతగుణములును శబ్దము, స్పర్శనము మొదల లగునవియు యెద్దలు, గుర్రములవలెబరస్పరవిరుద్ధములగుటవలన నొండొంటి కి వేరు వేరు కారణములున్నవి. ఆశబ్దాదులవలన దెలుసుకొనుజ్ఞానము ఆశబ్దాదు లనుండి బుద్ధిచేత వేరుపరుపబడియుండినదై యేకాకారముగ వెలుగుచుండును. ఘటాద్యుపాదులు లేనప్పుడు ఆకాశమే యేకాకారముగ వెలుంగుచుండునట్లు శబ్దము మొదలగు నుపాధులసంబంధము లేనపుడు యీప్రజ్ఞానమునకు యేక రూపత్వము సంభవించు గాబట్టి ॥శృతి॥ తథాస్వప్నే త్రవేద్యంతు నస్థిరంజాగ రెస్థిరం తద్భేదో తత్సమోస్సంవిఏకరూపానభిద్యతే॥ అనుటచేత జాగరితము నందు శబ్దాదివిషయములకు నానాత్వమువలన భేదమును ప్రజ్ఞానమునకు నేకాకారత్వముచే అభేదమునుసిద్ధమైనట్లు స్వప్నమునందుగూడ విషయములే భిన్నములుగాని ప్రజ్ఞానబ్రహ్మంభిన్నముగాదు. దీనినే బ్రహ్మజ్ఞానమని గీతా భాష్యములయందు చెప్పబడియున్నది. స్వప్నమందు దోచబడ్డ పదార్థజాత ము ప్రతీతిమాత్రశరీరం బగుటచేత స్థిరముగాదు. జాగరితనమునందు గన్పట్టు వస్తుజాతము కాలాంతరమునందు జూడదగియుండుటచే స్థిరముగాన స్వప్నమ నియను ॥శృతి॥ మహావాక్యరత్నావళియందు అనాత్మదృష్టై అవివేకనిద్రా అహంమమస్వప్నగోచరే తోహం॥ జాగరితయనియు వ్యవహారభేదం గలుగు చున్నది. జాగ్రత్త పెద్దస్వప్నము. స్వమము చిన్నస్వప్నము. స్వప్నంవంటిదే జాగ్రత్తజాగ్రత్తయే స్వప్నము. ఇట్లు స్వప్నజాగరణములయందు జ్ఞానమునకు గల యేకత్వము సుషుప్తియందుగలదు. ॥శృతి॥ సుప్తోత్థితస్యసౌషుప్తతమో

బోధోభవేన్మృతిః । సాచావబద్ధ విషయా ధ్వాన్తబోధాత్స్వాప్నబోధవత్ ॥ యనుటచేత నిదురబోయి లేచినవానికి నాగాఢనిద్రయందలి యజ్ఞానమునం దేమియు నపుడెరుగనను జ్ఞానముగలదు. అజ్ఞానము స్మృతియగునుగాని యనుభవముగాదు. ఆస్మృతియు దెలియబడిన విషయముగలది. ఆసుషుప్తియందలి అజ్ఞానానుభవమునకు భిన్నమైనదిగాని జ్ఞానమునకు భిన్నముగాదు గాన నిట్లు అవస్థాత్రయమునందలి జ్ఞాన మేకరూపమగునట్లు ప్రతిదినమునందును గడిచినట్టియు రాబోవునట్టియు మాసములు, సంవత్సరములు, యుగములు, కల్పములు మొదలగు సమస్తకాలములయందు నేకరూపమగును గావున, దీనికి నుత్పత్తి వినాశములు లేవు. కాన సత్యమైనది ఇది స్వయంప్రకాశము యీ యేకరూపమగు జ్ఞానమే ఆత్మయనబడుచున్నది. ఇట్లు నేకరూపమగు నాత్మ నిత్యమనియు, స్వప్రకాశమనియు సాధించుటచేత సత్యమనియు సాధింపంబడియున్నది. ॥శృతి॥ నిత్యత్వాం, సత్యత్వాం, తద్వ్యాప్తి, తన్నిత్యం, సత్యం॥ యని వేదాంతభామతియందు వాచస్పతిమిశ్రులు చెప్పిరి. కాన, నిత్యమునకువేరు సత్యత్వముగాదు. మరియు నీయాత్మ నిరతిశయంబగు ప్రేమకు పాత్రమగుటచేత ॥శృతి॥ మానభూవంహి, భూయాసం॥ అనగా నేను లేనన్నమాట లేక యెల్లప్పుడు నుండెదగాకయను ననుభవము ప్రమాణముగాన ఆత్మ తనయందలి ప్రేమ నిరతిశయమైనదగుటచేత ఆత్మకు పరమానందమును నిష్పన్నమైనదిగావున తత్త్వమస్యాదిమహావాక్యములయందు త్వంపదార్థమగు ప్రత్యగాత్మ యిట్లు యుక్తిచేత సత్యమును చిత్తును నిరతిశయానందమును స్వరూపముగలదని యున్నది. ఇకను పదార్థమగు ఆపరబ్రహ్మము సచ్చిదానందరూపమని శృతిశతకములచే ఘోషించుచున్నవి. ఇట్లు సచ్చిదానందస్వరూపులును తత్త్వంపదార్థములగు ప్రత్యగాత్మ పరాత్మలకు అఖండైకరసత్వము తత్త్వమస్యాది మహావాక్యములయందు నుపదేశింపబడినది. తత్క్రమం బెట్లనిన ॥శృతి॥ పరాపరాత్మనో రేవం యుక్త్యాసంభావితైకతా । తత్త్వమస్యాదివాక్యైస్సా భాగత్యాగేన లక్ష్యతే॥ యనుటచేతబరమాత్మ జీవాత్మలకు సచ్చిదానందస్వరూపత్వసామ్యమును జూపుటయను ఉపాయముచేత నేకత్వ మొప్పింపబడియున్నది. ఆయేకత్వము తత్త్వమస్యాదిమహావాక్యములచేతగూడ స్పష్టముగ విరుద్ధాంశపరిపాకములచే బోధింపబడుచున్నవి. అందు తత్త్వమసియను మహావాక్యముయొక్క యర్థజ్ఞానము యీవాక్యమునం

దలి తత్పదార్థము మొదలగు పదములయొక్కయర్థము. ఇంతలుత తెలియనిది గలుగుగాని తత్పదార్థముయొక్క మొదలుపదముయొక్క యర్థ మెట్లనిన ॥శృతి॥ జగతోయదుపాదానం మాయామాదాయతామశీం నిమిత్తశుద్ధ సత్త్వాంతాముభ్యతే బ్రహ్మతద్గిర॥ యనుటచేత సచ్చిదానందలక్షణముగుటయే పరబ్రహ్మము తమోగుణపరిధానయగు మహామాయను వుపాదిగాజేసికొని చరాచరాత్మక మగుకార్యజాతము నకు నుపాదానభూతమగు అధ్యాసాదిష్టానమగుచున్నచో విశుద్ధసత్వపరిధానయగు నామాయను నుపాదిగాగైకొని నిమిత్తము వుపాదానకరణ దికము నెరింగిన కర్తయగుచున్నదో యిట్లు నిమిత్తాపాదానోభయాత్మకమగు ఆబ్రహ్మము తత్వమసి అను మహావాక్యమునందలి తత్పదార్థముచేత చెప్పబడుచున్నది. కావున ॥శృతి॥ మూలజ్ఞప్తికళామాత్రశరీరం॥ బనె యనాదిమూలప్రకృతి నట్టి ఆత్మారామపరబ్రహ్మమందు త్రిగుణాత్మియై యెల్లప్పుడును జగత్ స్వరూపమై ఉత్పత్తిస్థితిలయములుచేయుచున్న అనాదిమూలప్రికృతి నేనే యనుచుంటెని గనుక అధ్యాత్మరామాయణమునందు పరబ్రహ్మముయొక్కయు అనాదియైన మూలప్రికృతియొక్క యు కార్యకారణస్వరూపహేతువును గురించియున్నది. అదియెట్లనిన బ్రహ్మజగత్ స్వరూపకారణము. అధ్యాత్మరామాయణమందు ॥శృతి॥ షడ్భావవికారశూన్యమేవ మాదివిలక్షణః॥ అనుటచే జననమరణాదివికారములు లేనిదియు సదా పరిశుద్ధంబైనదియు ॥శృతి॥ అధ్యాత్మ శుద్ధంసూక్ష్మం నిరాకారం నిర్వికారం నిరంజనం॥ శృతిచే యెల్లప్పుడు పరిశుద్ధమును-బుద్ధంబునైయున్నది.

గీత॥ ద్వేబ్రహ్మణి వేదితవ్యే । శబ్దబ్రహ్మపరంచయత్
శబ్దబ్రహ్మణిస్నాతః । పరంబ్రహ్మదిగచ్ఛతి
తపస్విభ్యోధికోయోగీజ్ఞానిభ్యోపిమతోధికః
కర్మిభ్యశ్చాధికోయోగీ । తస్మాద్యోగీభవార్జున॥

బ్రహ్మ రెండువిధములుగనున్నదని తెలిసికొనవలయును. అందు శబ్దబ్రహ్మ మొక్కటి. రెండవది దానికంటె పరముగ నున్నది. నిర్గుణబ్రహ్మమని చెప్పబడియున్నది. శబ్దబ్రహ్మను బాగుగనెరింగినపిదప దానికంటె పరమగు నిర్గుణబ్రహ్మ నొందును. అని యుపనిషత్తులును మహాభారతమునందును చెప్పంబడినది గావున జ్ఞానియగుపురుషునకు శబ్దబ్రహ్మయందున్న కామ్యకర్మలచే లోకసంగ్రహార్థమై చేయవలయునని చెప్పుకర్మయోగమిష్టమగును.

మరియు నీనిష్కామకర్మయోగము కొంచెమైనను మొదట నాచరించుట సంఘటిల్లును. అనంతరము ॥స్వల్పారంభాః క్షేమకరాః॥ యను నిఘంటువుచే నీస్వల్పాచరణమే యామనుజునికి యీమార్గమునందు ముందుకు క్రమక్రమముగ జేర్చి యావల నిదానముగ పూర్ణముగ సిద్ధిపొందింపజేయును. కర్మయోగముచేయవలయునని నిశ్చయము కలిగినను వాడు శబ్దబ్రహ్మముకంటె పరమైనదానిని జేరును. అని చెప్పబడినదాని కిదియే తాత్పర్యము. కారణమేమన యీజిజ్ఞాస కర్మయోగరూపమగు నిశ్శ్రేయసమునకు మొదలగుచున్నది. మరియు నొకసారి యీజిజ్ఞాసము మొదట దొరకునేని యీజన్మయందు కాకపోయినను మరు దేహమందైనను పూర్ణముగు సిద్ధిని సంపాదించుకొని శబ్దబ్రహ్మముకంటె పరమగునట్టి బ్రహ్మము పొందకమానడు. జనకాదులు యీసిద్ధి నొకజన్మమునందే సంపాదించుకొనిరని చూచుచుండగనే తోచును. కాని యథార్థమును విచారించితిమేని వారికిసహితము యీఫలము అనేకజన్మలసంబంధమైన సంస్కారమువల్ల గలిగియుండునని తోచకమానదు. అట్లుండనిమ్ము.

శృతి॥ మాయాహ్యేషా మయాసృష్టా యన్మాం పశ్యతి నారద। సర్వభూతగుణైర్యుక్తం నైవత్వం జ్ఞాతుమర్హసి యని శ్రీమన్నారాయణమూర్తి నారదులవారికి ఈప్రకారముగ చెప్పెను. ఓనారద, నీవుచూచుచున్నది నాచే కల్పింపంబడిన మాయ అయియున్నది. సర్వభూతములయొక్కయు గుణములతో నేను కూడుకొనియున్నానని నీవనుకొనుము. అని చివరకు చెప్పెనని యున్నది. ఆసిద్ధాంతమే యిప్పుడిక్కడ సైతము చెప్పబడినది. మాయయనగ నేమియో గీతారహస్యమున ౯॥ ౧౦॥ ప్రకరణముల నిరూపింపబడినది చూడుము. మాయచేనశించిన జ్ఞానముగలవారును మూఢులును దుర్మార్గులును నగు నరాధములు అసురబుద్ధికి లోబడినందున నారాయణుని శరణుజెందుదురు గావున మాయయందు మగ్నులగు లోకులు పరమేశ్వరుని మరచిపోదురనియు చెప్పబడినది. ఇప్పుడు పరమేశ్వరుని శరణుచొచ్చినవారు నన్ను జేరుదురు అని చెప్పెనుగావున బుద్ధిహీనులు నాయొక్క శ్రేష్ఠమైన నిజస్వరూపము నుత్తమోత్తమమైన అవ్యయమగు నిజరూపమును తెలిసికొనలేక యవ్యక్తుడనైన నన్ను వ్యక్తుడననుకొనుచున్నారు. నాయోగరూపమగు మాయచే ఆచ్ఛాదితుడనగుటచే నెల్లవారికిని నస్వరూపముతో గన్పట్టును.

నేను, అజుడను, అవ్యయుడను, అని మూఢులు తెలిసికొనలేరు. యోగమనగ నవ్యక్తస్వరూపమును వదలివేసి వ్యక్తస్వరూపమును ధరించెడి యుక్తి. దీనిని గీతాభాష్యమందు చెప్పబడియున్నది. దీనినే వేదాంతులు మాయయని చెప్పుచున్నారు. మరియు నీయోగమాయచే పరమేశ్వరు డాచ్ఛాదితుడై యున్నాడని చెప్పుచున్నారు గాని, యిక్కడను నితరస్థలములయందును మాయాశబ్దమునకు నాశికమగు లేక విలక్షణమగు శక్తియేయని యర్థము చేసికొని, యనేకులు నీమాయ యసత్యమైనది కాదనియు పరమేశ్వరునివలెనే నిత్యమైనదనియు ప్రతిపాదించుచున్నారు. మాయయనునది పరమేశ్వరునియొక్క యంశమే యనాదియు లీలయనియు అద్వైతవేదాంతులు నొప్పుకొనుదురు. కారణమేమనగ మాయయనునది యింద్రియములచే నుత్పాదింపబడినదియు దృశ్యమైనదియైనను యింద్రియములు పరమేశ్వరునియొక్క సత్తాచేతనే యీకార్యమును చేయుచున్నవి గాన, మాయ తుదకు పరమేశ్వరుని యొక్క లీలయేయని చెప్పవచ్చును. ఈమాయతత్వమునుబట్టి చూడగ సత్యమైనదా లేక మిథ్యాభూతమైనదా యనునది మాత్రమే యిక్కడ వివాదాంశమైయున్నది. మరియు నీవిషయమైయే నామరూపాత్మకమగు మాయచేత నవ్యక్తుడగు పరమేశ్వరుడు వ్యక్తుడుగ దలపబడుచున్నాడో యా మాయచేతనే దానిని యాలౌకికశక్తియనిగాని మరియొకటియనిగాని యనవచ్చును గావున మాయ సత్యమైనదిగాదనియు పరమేశ్వరుడొక్కరుడే సత్యమనియు యిందలిసారాంశము గావున ఈరీతిగ తన్నుదా దెలసిన జ్ఞానులకు జరామరణములనుండి ముక్తులగుటకు ప్రయత్నించువారు ఆబ్రహ్మమును అధ్యాత్మతత్వమును సమస్తకర్మలను తెలుసుకొనుచున్నారు. కావున మరణకాలమున తన్నుతాదెలసి ఆబ్రహ్మమేతానై తాజీయు సర్వకర్మలును బ్రహ్మార్పణముగా జేయుచు శాస్త్రముయొక్కయు యుపనిషత్తులయొక్కయు సిద్ధాంతము ననుసరించి సుఖదుఃఖాది ద్వంద్వమోహములచే నీసృష్టియందలి సర్వభూతములును భ్రమజెందుచున్నవి గావున, తన్నుతాదెలసిన జ్ఞానులు సుఖదుఃఖములనుండి విముక్తులగుచున్నారు. కావున మాయనుండి విముక్తులైనపిదప వారియొక్కస్థితి॥ బ్రహ్మప్రాప్తి కరంస్థిరం"—కాబట్టి—

అధ్యాత్మ! శుద్ధోబుద్ధస్సత్యోముక్తః" మొదలగు శృతులచే సస్వరూపానుభవమువలన, దెలియబడునదియు అచింత్యము అధ్యాత్మ" అచింత్యము

న్యపదేశ్యమేకాత్మ ప్రత్యయసారం, యన్మవసానముప తే॥ యను శ్రుతులచే బ్రహ్మర్ముఖమగు మనస్సుచే చింతించుటకు వీలులేనిదియు, అవాచ్యంబు అధ్యాత్మ॥ యతోవాచో నివర్తంతె అప్రాప్యమనసాసహ యద్వాదానవ భ్యుదితం॥ మొదలగు శ్రుతులచే వాక్కులచే యిట్టిదని చెప్పుటకు, వలనుపడ నిదియు అతులం తనకువేరొండు సాటిలేనిదియు, ॥అతీంద్రియం॥ అధ్యాత్మం॥ అశబ్దమస్పర్శమరూపమవ్యయం తథారసం నిత్యమగంధవచ్చయత్ ॥ అనుశ్రుతిచే శబ్దాదివిలక్షణంబగుటచే శ్రోత్రాదీంద్రియములకు గోచరములుకానిదియు, సత్తామాత్రము, ॥అధ్యాత్మ॥ సత్యశుద్ధచిదానదస్సత్తామాత్రోహమవ్యయం॥ బను శ్రుతిచె, గాలత్రయాబాధ్యమానమైన సస్వరూపము స్వప్రకాశము ॥అధ్యాత్మ॥ సత్తామాత్రస్వప్రకాశైక ప్రకాశ భావనాతిగ॥ బ్రహ్మశబ్దేనతద్బ్రహ్మ స్వప్రకాశాత్మరూపకం॥ మొదలగు శ్రుతులచే నొకదానిచే తాను ప్రకాశింపబడక యన్నింటియందు బ్రకాశింపజేయుచు తనను తానే ప్రకాశింపుచున్నది నిర్ద్వంద్వము నిరుపాధికముగావున, శీతోష్ణసుఖదుఃఖాదిద్వ దములులేనిదియు, నిర్వికల్పము ॥అధ్యాత్మ॥ నిర్వికల్పస్వరూపాత్మా॥ యను శ్రుతిచే సంకల్పవికల్పాత్మకమగు మనస్సు మొదలగు అంతఃకరణ చతుష్టయములేనిదియు గావున, భేదవికల్పములును లేనిదియును ॥అజాయుస్॥ అధ్యాత్మ॥ శాశ్వతోజస్వతంత్రః॥ అను శ్రుతిచేతఁ బుట్టుటకు కారణమగు కర్మలేదుగాన అనగ పుట్టుటయే కర్మ జన్మింపనిదియు॥ సత్యంవిదానందరూపం॥ బ్రహ్మసూత్ర॥ బ్రహ్మసూత్రం చిదాకాశ సచ్చిదానందమద్వయం॥ బను శ్రుతిచే భూతభవిష్యద్వర్తమాన కాలములయందు నశింపనదిగాన, సద్రూపమును జడవిలక్షణముగుటచే సద్రూపమును, దుఃఖరహితమును నానందరూపమును నైనది, ॥ఆయుర్మా॥ అధ్యాత్మ॥ సుస్కృతమునందు॥ నిర్వికారం నిరాకారం॥ బను శ్రుతిచే కరచరణాద్యవయవవిశిష్టంబగు, మూర్తి లేనిది ఆనగ మూలంలేని గుర్తుయెరిగెడిశరీరంబేమియు లేదు ॥శ్రుతి॥ అహీన మూలజ్ఞప్తికళామాత్రశరీరంనాస్తి ॥కేవలమ్॥ అమూర్తము॥ అజిరం॥ అమూర్తంబగుటచే మలినములేనిదియు నగును॥ శ్రుతి॥ నిర్మాలమేతథాజ్ఞానస్వరూతం నాస్తికేవల ॥ అనుశ్రుతిచేత కేవలపరబ్రహ్మంబు॥ శ్రుతి॥ ఏకమేవాద్వితీయం బ్రహ్మంబనుటచే స్వప్రకాశమగు పరమాత్మయే యగును॥ అట్టిపరబ్రహ్మము, శ్రుతి॥ దివిభూమౌతథాకాశే, బహిరంతశ్చయోవిభుః ప్రవిభాత్యవ

భాసాతాతస్త్రిస్సర్వాత్మనేనమః।

స్వయంబ్రహ్మా స్వయంవిష్ణుః॥ స్వయమింద్రస్స్వయంశివః॥ స్వయంవిశ్వమిదంసర్వం। స్వస్మాదన్యన్నవిద్యతే॥ సర్వంఖల్విదంబ్రహ్మ యథాసౌమ్యైకేన, లోహమణినా, సర్వంలోహమయం, విజ్ఞాతంస్యాద్వాచారంభణం వికారోనామధేయం లోహమిత్యేవసత్యం అనుమొదలగు శ్రుతిస్మృతులచే యర్థము యందు అన్వయించుకొనునది ॥అధ్యాత్మ రామాయణమునందు తారక ఘట్టమందు శ్రుతి శ్మృత్యుపనిషద్ భాష్యములు ఇట్లు చెప్పుచున్నవి. రామం విద్ధిపరంబ్రహ్మ సచ్చిదానందమద్వయం సర్వోపాధివినిర్ముక్తం సత్తామాత్రమగోచరం॥ ఆనందనిర్మలంశాంతం। నిర్వికార॥ నిరంజనం॥ సర్వవ్యాపినమాత్మానం। స్వప్రకాశమకల్మషం॥ మాంవిద్ధిమూలప్రకృతిం॥ స్వర్గస్థిత్యంతకారిణీం అధ్యాత్మరామాయణమునందు శీతావాక్యతారకఘట్టమునందు శ్రుతి చెప్పుచున్నది. ఈప్రకారముగా అనాదిమూలప్రకృతియే జగత్తునకు గారణమైనయెడల బ్రహ్మమేజగత్కారణమని చెప్పుచున్న తస్మాద్వా, ఏతస్మాదాత్మన ఆకాశసంభూతః ఆకాశాద్వాయుః వాయువోరగ్నిః యతోవాఇమాని, భూతానిజాయంతె యేనజాతానిజీవన్తి యత్ప్రయన్త్యభిసంవిశంతీతితద్బ్రహ్మేతి శ్మృతులకు విరోధముగలుగునెయని చెప్పుచున్నవి.

ఈయసంగుడైన రామునియందు యజ్ఞానముచేత కల్పింపంబడిన ఆరోపింపబడినది మరుమరీచికలయందు యెండమావులయందు వుదకముప్రగిదిని రజ్జువునందు సర్పమువలెపున, ఆకసమునందు మాలిన్యమువలెపున ॥ఆత్మపంచకమందు॥ రజ్జుజ్ఞానాద్భ్రాతిరజ్జుర్యధాహి। స్వాత్మజ్ఞానాదాత్మనో జీవభావః ఆప్తోక్త్యాహిభ్రాంతినాశేసరజ్జుర్ జీవోనాహంద్దేశికోక్త్యాశివోహం బ్రహ్మసూత్ర॥ ఊపరెంబువత్సభూతరజ్జు సర్పవత్తదా ముహ్యమానదుర్మదెభవారణం ప్రతారణం జ్ఞానమందనాస్వయంరభేదకోవిధర్వసం గోపరూపకం స్వరూపప్రాపకంగురుంభజే మృగతృష్ణజలంపీత్వాతృప్తిచ్ఛేదస్థిదంజగత్ గగనేనీలిమాభాతేభ్రాంతి మూలమిదం జగత్॥ భ్రాంతిచేత నారోపింపబడుచున్నదనుట.

॥శ్రుతి॥ తస్యసన్నిధిమాత్రేణ శృజామీగమత్రంద్రిత। తత్సాన్నిధ్యాన్మయాసృష్టం తస్మిన్నారోప్యతేబుధైః॥ అధ్యాత్మరామాయణ వాక్యార్థ

మునందు గాబట్టి యీయనాదిపరబ్రహ్మమునందు యజ్ఞానముచే నారోపింప బడినదని చెప్పుచున్నది

మరియు యిట్లింకాకాంత అనుభవము వక్కాణించుచున్నవి. ॥శ్రుతి॥ అధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచయేత్ ॥ అను న్యాయమున అధ్యారోపాపవాదములచే బ్రహ్మతత్వమును నిజమైన ఉపపన్నుడగు శిష్యున కుపదేశింపవలయును గాన యీశ్రుతులయందు తొలుత నధ్యారోపక్రమమును సూక్ష్మముగ సూచించుచున్నది. తద్వివరణం బెట్లనిన ॥శ్రుతి॥ అసర్పభూతాయాం రజ్జౌ సర్పారోపవద్వస్తున్యవస్త్వారోప అధ్యారోపః ॥ యనుటచేత వ్యవహారికపదార్థముగ అంగీకరింపబడినది. తద్వివరం బెట్లనిన వాటియందు మిథ్యాభూతమగు పాముయొక్క యారోపణమునగ త్రాటియందుజొరబడిన చైతన్యమునందు నజ్ఞానము సర్పజ్ఞానముయొక్క యాభాసరూపమున బరిణమించినదై సర్పాకారముగమారును. ఈమారుట త్రాటియందలి చైతన్యమునందున్న యజ్ఞానమే మూలముగాగలదగుటచేత నిది త్రాడుగాని పాముగాదను విశేషజ్ఞానము గలిగినపిదప బాడమడు యధిష్ఠానభూతమగు రజ్జువుయొక్క సాక్షాత్కారముచేత వాటియందలి యజ్ఞానముపోగా పాముభ్రాంతి పోవును. కాన నీదృష్టాంతానుసారముగ ద్రష్టాంతికము యన్వయము చేసుకోవలయును. ఎట్లనిన సచ్చిదానందస్వరూపమగు నద్వితీయపరబ్రహ్మము ప్రపంచాధిష్ఠానభూతమగు వస్తువు తద్విలక్షణం బగు నజ్ఞానము మొదలుగాగల జడజాత మెల్లను మిథ్యాభూతమును దృశ్యమును, సావయవమును వికారి యను వస్తువు అజ్ఞాన మన్ననో వస్తువనిగాని యవస్తువనిగాని చెప్పుటకు వలనుపడదు. కుందేటికొమ్మువలె మిథ్యాభూతమగుటవలన వస్తువునుగాదు ప్రపంచమునకు హేతుభూతమగుటవలన నవస్తువునుగాదు. ॥శ్రుతి॥ తదాత్మశక్తిం త్రిగుణైర్నిగూఢాం॥ శ్రుతివలన నేను అవజ్ఞుడను మొదలగు ననుభయమునుబట్టియు గుణత్రియాత్మకమును జ్ఞానమునకు విరోధము భావరూపమగుటచేత నిట్టిదని నిర్దేశించుటకు శక్యముగాకయున్నది. అజ్ఞాన మిట్లు ఘటితఘటనాపటీయమయ్యు ॥శ్రుతి॥ దేవీఎహ్యాగుణమయీమమరు యాదురత్యయా ॥ మామేవప్రపద్యంతే మాయామేదాంతరన్తిత్తితే॥ భగవద్వచనాత్ భగవద్వాక్యముచేత పరమాత్మ సాక్షాత్కారముచేత నశించును. జ్ఞానముయొక్క అభావమే యజ్ఞానము యని తార్కికులు జెప్పెదరుగాని అదిపై నుదహరింప

బడిన శృతిస్మృతులకు విరుద్ధముగావున పైనిచెప్పినవడుపున నిర్వచనీయ అనాదిభావరూపమగు నజ్ఞానము కలదనుటకు నేను అజ్ఞుడను. నన్ను నే నెరుంగనను అపరోక్షాభావభాసమే ప్రబలప్రమాణము. వాస్తవముగ నీయ జ్ఞాన మొకటియయ్యు సమిష్టి అభిప్రాయముచే నేకముగను వ్యష్టి అభిప్రాయముచే అనేకముగను వ్యవహరింపంబడుచున్నది. ఎట్లనిన చెట్లయొక్క సమిష్టి అభిప్రాయముచేత వనమనియును నీళ్ళయొక్క సమిష్ట్యభిప్రాయము చేత గోలయనగ శబ్దమనియును వ్యవహరింపంబడునట్లు పలుదెరంగుల దోప బడుచున్న జీవులయందలి యజ్ఞానము లన్నింటియొక్క సమిష్ట్యభిప్రాయముచేత ॥శృతి॥ అజామేకా॥ అనేశృతినిబట్టి యాయజ్ఞాన మొకటియేయని చెప్పబడును. ఈసమిష్టి అజ్ఞానము లన్నియు నొకటియగుట పెక్కులగు జీవులయొక్క నికృష్టాంతరంగరూపములగు నుత్కృష్టోపాదియగుటచేత శుద్ధసత్వప్రధానమైనది దీనియందు బింబించిన బ్రహ్మచైతన్యము చరాచరాత్మక ప్రపంచమునకునెల్ల సాక్షియగుటచేత సర్వజ్ఞమనియు సర్వజీవులకు సస్వకర్మానురూపఫలముల నిచ్చుచుండుటచేత నీశ్వరుడనియు సకలజీవులను బ్రేరేపణ జేయుటచే నియంతయనియు, సమస్తజీవులయొక్క హృదయములనుండి బుద్ధుల నెల్ల నియమించుచుండుటచేత నంతర్యామియనియు స్థావరజంగమాత్మకమగుటచేత ప్రపంచమునకెల్ల వివర్తాభిమానమగుటచే జగత్కారణమనియును శృతి॥ యస్సర్వజ్ఞసర్వవి యత్యాది॥ స్మృతులయందు చెప్పబడుచున్నది. పరమేశ్వరునియొక్క యీసముదాయోపాధి సమిష్టియుపాధి సమస్తకార్యప్రపంచమునకును మూలప్రకృతియగుటవలన కారణశరీరమనియును ఆనందప్రచురమగుటచేతను కోశమనియును, వడువున, నాత్మాచ్ఛాదకమగుటచేత ఆనందమయకోశమనియును, స్థూలములు, సూక్ష్మములు, నగునిఖిలలోపాధులునగు వాటియందు లీనములగుటచేత, సుషుప్తమనియును, గావుననె, పంచీకృతభూతకార్యమగుటచే స్థూలప్రపంచమునకు జాగ్రదవస్థావిశిష్టమనియును అపంచీకృతభూతకార్యమును, పరమసూక్ష్మము, నగు స్వప్నప్రపంచమునకు, లయస్థానమనియును వ్యవహరింపంబడుచున్నది. ఇకవ్యష్టిరూపకమగు అజ్ఞాన స్వరూపమెట్లనిన.

శృతి॥ ఇందోమాయాభిః పురురూపఈయతే॥ అనుమొదలగు ప్రమాణములు మరియు నీయజ్ఞానమును నజ్ఞానావిచ్ఛిన మగుచైతన్య మొక్కటియే

యయ్యును మట్టికుండలు, మట్టిపిడతలు, మట్టిదాకలు, మట్టిమూకుడులు, ననున ట్లు భేదమును జెప్పునపుడు వ్యష్టియనియును ఘటాదికమెల్లను మట్టియేయైనట్లు అభేదము జెప్పునప్పుడు సమిష్టియనియును వ్యవహారము జీవులనుబొందియున్న యీవ్యష్టినికృష్టమగు నుపాధికలదగుటచేత మలినసత్వప్రధానమైనది॥ శ్రుతి॥ లయేఫేనస్యతిధర్మాద్వా ద్వాస్స్స్య స్థరంగకే, తత్వాపివిలయే, నీరేతిష్ఠంత్యే తేయథాపురావ్యవహారిక దెహస్యలయస్వాత్వాతిభాసికె తల్లయెసచ్చిదానం దః పర్యవస్యంతిసాక్షిణః॥ యీమలకు నుదాహరణము ॥శ్రుతి॥ నందభుక్చే తోముఖః ప్రాజ్ఞః॥ శ్రుతివలనను నేను సుఖముగ నిద్రించునప్పుడు నేనేమి యు తెలియకయుంటిని యని నిదురలేచినవానికి సుషుప్తికాలీన సుఖాజ్ఞానము ల యనుభవపరామర్శమునుబట్టియు, స్వచ్ఛమగుటచే నంతఃకరణమునకు వృత్తినంగీకరించినట్లు చైతన్యముచే ప్రకాశింపబడు మరియు ॥శ్రుతి॥ ఏషసర్వే శ్వర ఏషసర్వజ్ఞ ఏషోన్తర్యామ్యేష యోని స్సర్వస్యప్రభవాస్యయోహి భూతా నాం॥ అనుమొదలగునవి పైనజెప్పినట్లు రెండువిధములగు నజ్ఞాములయందును నుపలక్షితులగు నీశ్వరప్రాజ్ఞులకు నిరుపురకుగూడ భేదములేదు ॥శ్రుతి॥ కా ర్యోపాధిరయం జీవః కారణోపాధియీశ్వరః కార్యకారణతాం తాహిత్వాపూ ర్ణబోధోవశిష్యతే॥ కార్యోపాధియైనజీవునకును, కారణోపాధియైన ఈశ్వ రునకును వుపాధిభేదము తప్ప వాస్తవముగ భేదములేదు, అని పూర్వాచా ర్యులచే గూడ చెప్పబడినదిగాన, నజ్ఞానులు నిరంజనుడగు పరబ్రహ్మమందు మూలాజ్ఞాన కల్పితమునగు ప్రపంచమును భ్రాంతిచే నారోపించెదరని ప్రస్తు తానుసరణముగాబట్టి యీగ్రంథమునందు శ్రుతిశృత్యోపనిషత్ వాక్యముల ను చేర్చి నాకు గోచరించినంతవరకు వ్రాసితిని. బుద్ధిమంతులగువారు మీా దుమిక్కిలిగా నూహింపవచ్చును.

శ్లోకం॥ కాయేనవాచామనసేంద్రియైర్వా, బుధ్యాత్మనావాప్రకృతె స్వభావాత్కరోమియద్యత్సకలంపరస్మై నారాయణాయేతి సమర్పయామి॥ భాగవతమునందు చెప్పబడియున్నది. కాయము, వాక్కు, మనస్సు, ఇంద్రి యములు, బుద్ధి లేక ఆత్మ దీని ప్రవృత్తిచే గాని లేక, స్వభావానుసారము గా మనముచేయునదంతయు పరాత్పరుండైన నారాయణునికే సమర్పింపవల యునను భాగవతమునందు ఆయర్థమే యున్నది. అధ్యాత్మశాస్త్రమునందు॥ బ్రహ్మకర్మసమారభే॥ యను వేదప్రమాణం దేనిని జ్ఞానకర్మసముచ్ఛయ

పక్షమనియు, ఫలాశాత్యాగమనియు బ్రహ్మార్పణపూర్వకమగు కర్మయనియు చెప్పుచున్నారో దానికే ఇదంకృష్ణార్పణమస్తు యని భగవద్గీతలయందున్న పైశ్లోకమువలెనే సర్వకర్మఫలత్యాగ ఆశానిర్మూలనముచేసి, యిహమాత్రార్థఫలభోగ విరాగుడై కర్మఫలాశను వదలి కర్మనుచేయుట యనునదియే దెలియవలెను.

ఇదంబ్రహ్మార్పణమస్తు.



శ్రీరస్తు

# శ్రీ మహాఋషి నిఘంటిత యోగశాస్త్రము



## ఆత్మసూత్రము.



—। వేదవ్యాసుఁడు ధృతరాష్ట్రునకు ఆత్మసూత్రము బోధించుట. ।—

మనుశ్మృతి_6_46—సత్యపూతాం, వదేద్వాచం మనఃపూతం సమాచరేత్.

అతిభౌతికమార్గమేగాక- కర్మపరీక్షకు- నాధిదైవతమని సైతము మరియొకమార్గము గలదు. ఈమార్గావలంబనకు యీతీరున జెప్పెదరు. మానవుడు, కర్మాకర్మలను, నిర్ణయించు సమయమునందేకర్మవలన, నెవరికెంతసుఖమో, లేక దుఃఖమో కలుగుననిగాని దానిలోనగుటకు సుఖరాసియధికమా దుఃఖరాసియధికమా యని విచారింపడు. ఆత్మానాత్మ విచారమునందు సైతమెప్పుడును ప్రవేశింపడు. తాను సుఖదుఃఖములకు విలక్షణుడు, శ్రీరామహృదయమునందు దుఃఖమాగంతుకము సుఖము స్వాభావికము నాకు సూచివర్యా! యున్నది—అనేకులగు జనులు యీకోలాహలము నెరుంగకయున్నారు. వేయేల ప్రతిమనుజుడు, నాత్మసుఖార్థమే ప్రతికర్మను జేయునను విషయమును లేదు—అతిభౌతికవాదులు యేయుక్తిజెప్పినను జెప్పుదురుగాక ధర్మాధర్మములు నిర్ణయించు మనుజుని మనస్సుయొక్క స్థితి యెట్లుండునని క్షణమాత్రము విచారించితిమేని మనుష్యుని మనస్సునందునవియు, స్వాభావికములు, నుదాత్తములు, నగుకారుణ్యము, దయ, పరోపకారము, మొదలగు మనోవృత్తులే యొక్కసారిగ నొకానొక కార్యము జేయుటయందు అతనినెప్పుడు ప్రేరేపణజేయునని మనకు స్పష్టముగ దోచును. వుదాహరణమేమియనగ- ఒకదరిద్రుని మనము చూచితిమేని ఏమిహైనను ధర్మాచరణచేసినచో- జగత్తునకు- లేక- తనయాత్మకు- నెంతకళ్యాణమగును. సంతోషమ

గు ననునంగతి తోపకమునుపే, దయార్ద్రహృదయులమై, స్వశక్త్యానుసారము
గా ధర్మాచరణ మొనరించిన ముక్తులగుచున్నారు. బాలుడేడ్చెనేని యతని
కి పాలిచ్చినచో నెందరికెంతహితవగునని యేమియు విచారింపక తల్లిపాలు
యిచ్చుచున్నది. అనగా యీయుదాత్తమనోవృత్తి ఏకర్మయోగశాస్త్రమున
కు ముఖ్యమగు మూలబంధనపునాదిగానున్నదని తాత్పర్యము. ఈమనో
సద్గురుపుత్రుండగువాడు, ఆత్మను దర్శించినవాడుగానుండియును, దృఢజ్ఞానము
లేకపోవుటచేత, మోహాంబునంజిక్కి దుఃఖమును, కోరికయును, పశ్చాత్తాప
మును, పట్టువిడుపులును, మనోవికారములును, కోపతాపములును వీటిని
యెప్పుడైనను, గలిగియుండిన యెడల వెంటనే యతనికి బంధము సంభవించు
టకు కారణమవుచున్నది. కావున సద్గురుపుత్రుండగు బుద్ధిమంతుడగువాడు
ఏకాలమందైనను, మనస్సునందు ఏకోరికలను గోరక, మిక్కిలి లోభగుణము
ను బొందక, లేనివృత్తులను గ్రహించక, వున్నవృత్తులను విడువక, అజ్ఞానుల
తో చెలిమిచేయక, తాపత్రియాది దుఃఖములను నంటక, చిత్తచలనము లేక,
క్రోధముంచక, భయమును వదలి స్వయంప్రకాశమానుడై సమదర్శనము
గలిగినప్పుడే ఆమహాత్మునకు మోక్షము కరతలామలకంబై తప్పక సంభవిం
చును. కావున ఏకాలమందైనను దేహేంద్రియవృత్తులు నేనుగానని తెలిసికొ
నుచున్నాడో అప్పుడెవానికి మోక్షంబు సంభవించును. అటులలేక భ్రాంతి
నినొంది దేహేంద్రియవృత్తులన్నియు తానుగానని యెప్పుడనుకొనుచున్నాడో
అప్పుడె మోక్షము సంభవించును. అటుల లేక భ్రాంతినిబొంట దేహేంద్రి
యవృత్తులన్ని తానేయని యెప్పుడనుకొనుచున్నాడో అప్పుడే బంధముగలి
గినవాడగుచున్నాడు. నిరాకారపరుడగు జ్ఞాని యీరెండువిధంబుల నెరింగిన
వాడై ఏవిధమైనతప్పును గాని పట్టువిడుపులును గాని బొందడు గనుక దేహ
వృత్తులను జరిగించినను, జరిగించకుండినను ప్రారబ్ధమువలన గలిగిన ద్వంద్వ
ములు, సుఖదుఃఖములు పుణ్యపురుషునకు భావమునందు లేకయుండునో
అట్టివిధమును నీవుదెలుసుకొని నీమనంబున సర్వవృత్తులను దెలుసుకొని విడ
చినవాడవై ప్రతిదినము సర్వసాక్షీస్వరూపమే తానని, తన్నుదాదెలియవలె
ను. ఈదేహము మిగుల నసహ్యమును అతిచంచలమును, సారములేనిది
యును, అనిత్యమైనదియును గానున్నది. దీనికి తాపత్రియములు సదాగలిగి
యున్నవి. అవి యెవ్వియనిన ఆధ్యాత్మికంబనియు అధిభౌతికంబనియును అది

దైవికంబనియును మూడున్ను గలవు. అధ్యాత్మికంబనగ దేహమునకు రోగంబులును ఆయాసంబులును సుఖదుఃఖంబులును గలుగుట. అతిభౌతికంబనగా దేహమునకు, సర్పముకరచుట, తేలుకుట్టుట, పులికరవవచ్చుట, భూతప్రేతపిశాచములుపట్టి బాధించుట యివి మొదలగుదుఃఖములు గలుగుట. అధి దైవికమనగా దేహమునకు వర్షమువల్లను, వాయువువల్లను, అగ్నివల్లను పిడుగులుపడుటవలనను, సుఖదుఃఖములు గలుగుట యివియన్నియును మిగుల దూషితంబులనియు యీప్రపంచశరీరములు సకలదుఃఖములకు కారణములనియును బ్రహ్మవేత్తయైనవాడు తన్నుతాదెలుసుకొని, సదా చిన్మాత్రస్వరూపుండైయుండి యీభూలోకవస్తువులన్నియు చక్కగచూచి యెరింగిన, ఏపుణ్యాలు సుఖజీవనముబొందుటకు చింతయును సుఖభోగములనుభవించుటకై తలంపును యివిఅన్నియు పొందకుండునో అట్టిమహాత్ముని చరితము మిగుల యద్భుతము. ఈలోకంబున నానావిధములుగా వర్తించెడు అజ్ఞానమతముల న్నింటిని యతీశ్వరులుగాని, యోగీశ్వరులుగాని మతదేవతలనుగురించిన భేదవాదములాడక, వేదాంతమే సర్వమతసమ్మతమని వర్ణింతురు గాన ఏమసుజుండైనను, మతములయందు వర్తించుట సరికాదు. అన్నిమతములట్టివేగాని, సర్వమతములును మనంబునగోసి, వేదాంతయోగానుష్ఠానముజేయు యేచిత్తవిశ్రాంతి దేహతత్వమనగ యిరువదినాలుగు తత్వంబులును దెలుసుకొని చైతన్యస్వరూపుండగు, జీవునకు యిరువదియైదవదియగు జ్ఞానమే గురుస్వరూపముగానున్నదని యెరింగిన జ్ఞాని, ఏదొకకాలమందైనను, తనకు మోక్షాపేక్ష కలిగి సద్గురువును జేరిన, ఆమహాత్ముండాతని యాదరించి ఆత్మబోధ నెరింగించి ముక్తునిగాను జేయకుండునా? పంచమహాభూతంబులవలననే పిపీలకము మొదలుకొని, బ్రహ్మపర్యంతముగానుండు జీవరాసులన్నియును గల్పింపంబడినవి. ఇటులగల్పింపంబడిన సమస్తచేతనకోటి పంచభూత వికారంబులని మనంబునభావించి ద్వంద్వములగు సుఖదుఃఖములను విడచి, సస్వరూపమగు సర్వసాక్షియే తానని జ్ఞానదశ బొందినయెడల ఇప్పుడేవిదేహముక్తుండౌదువు- గాన యీసంసారము, యింద్రియసమూహము ప్రపంచము యొక్క సర్వవృత్తులకు కారణముగానున్నది. అట్టి ప్రపంచవృత్తులగు వాసనలను లేకయుండుటవలన, మోక్షమను పదవి విడువక వారిని యంటుకొనే యుండును. కాబట్టి ప్రపంచసంబంధములగు శరీరవృత్తుల

యందు యేవిధములైన వృత్తులయందును ఏవిధములైన కష్టములనుబొం
దక యథాస్థితిఁ బొందియుండు మహాత్ముఁడే యీలోకంబున మహాప్రభుం
డగును. కావున సంసారమనగా యింద్రియసమూహము లేగాని ధారాపుత్రా
దివర్గంబులుగాదు. కావున ధనము సర్వవృత్తులకు మూలముగానున్నది. ద్రవ్య
మే మాయాప్రపంచమునకు సహాయముగానున్నది. అన్నిటికి శ్రేష్ఠముగా
నున్నది ఐనను కామశత్రువనగ సర్వకోరికలకు మూలమైనచిత్తమును ధరిం
పగూడనిదిగానున్నది. అట్టిచిత్తమును నిరాకరించి ప్రయోజనములేదని విడచి
పెట్టుము. అటులవిడచుటవలననే మోక్షప్రాప్తియగును. కాబట్టి-స్వప్నమును
కల యింద్రజాలమువంటి మాయగానున్నదేగాని నిజముగా నున్నదిగాదు.
భ్రాంతిరూపకంబులగు నీప్రపంచమంతయును తానుగానని తాను సర్వసాక్షి
స్వరూపుండను నిత్యుండను శరీరమందును స్నేహితులయందును భార్యయం
దును, గృహమందును, ధనమందును, విశేషములగు వైభవములయందు
మోహభ్రాంతులనుగలిగి వాటియందు సంతోషమును దుఃఖమునుబొందకుం
డుటే ముక్తి—ఏప్రదేశములయందు నామరూపసహితములగు చిత్రవిచిత్ర
ములు భ్రాంతివలనందోచుచుండునో అట్టివస్తువులయందు ఆశాపాశములను
గలిగియుండుటే సంసారబంధము.

అట్టిబంధమును విడిపించుకొనుటకు నొకయుక్తిగలదు. ఎట్లనిన విను
ము. తాను దృఢవైరాగ్యమునుబొంది సర్వఆశాపాశములనువిడచి సస్వరూప
సంధానముపొందుతూ తన్ను తాదెలసియుండవలెను. సమస్తబంధములకును
మొదటిదే ఆశాబంధము. దీనికి మితిమేరలు లేవు. దీనివల్లనే జన్మ మాదిగా
గల సమస్తదుఃఖములు గలుగుచుండును. ఇట్టి ఆశాబంధము లేకుండుటే
మోక్షంబని చెప్పంబడుచున్నది. ఎవనియొక్క మనంబున ఆశయనెడు బంధక
ము విడిచిపోవుచున్నదో అట్టిమహాత్ముఁడే సంతుష్టియనెడి ముక్తిపదమును
బొందునుగాన తనయొక్క నిజస్థితి విచారించగ తానే సత్తామాత్రుండగు ఆత్మ
యనియు, శుద్ధచైతన్యుండనియు, ద్రష్టస్వరూపుండనియు దెలియవచ్చుచున్న
ది. ఈప్రపంచము అసత్తనియు కేవల జడస్వరూపమనియు దెలియవచ్చు
చున్నది. కావున తనకు అవిద్యయనెడు మాయ లేనే లేదు. కేవలుండవై కోరి
కయనెడు గొప్పశత్రువును జయించినయెడల ముక్తుండవగుదువుగావున రాజ్య
మున్ను, స్త్రీలున్ను, కొమాళ్లున్ను ప్రారబ్ధవశంబున సుఖదుఃఖములును

దేహముతోడనే బోవుచుండును. ఇవియన్నియును విశేషంబులని మనంబున దలంచిన అజ్ఞానులకు నివియన్నియు యనుభవనీయంబులై ప్రతిజన్మమునందును తప్పకకలుగును.

తనకు ధనధాన్య మైశ్వర్యంబు లింకచాలుననియును చిత్తసంకల్పము లగు కోరికలు నింకవద్దనియును పూర్వజన్మసుకృతకర్మంబు లింకచాలుచాలనియును విడచి మనంబున వానివిధ మంతయు నెరింగి వీటివలననే యీసంసారతాపత్రయములు గలుగుచున్నవని యోచించి వాటిని అమేధ్యపుంజమని రోసి విడచి చిత్తవిశ్రాంతిని బొందుము. కావున అజ్ఞాని అట్టిచిత్తవిశ్రాంతిని బొందనేరడు-గాబట్టి నీవు అనేకజన్మములనుండి వాక్కు-చేతను మనస్సుచేతను దేహముచేతను చేయుంబడిన నానావిధకర్మములను వాంఛయనెడు సంకల్పమువల్లనే నీకుసంభవించినవి. దుఃఖమే నానావిధములైన కష్టములకు తోడు నీడయైయున్నది. ఇదియే ప్రారబ్ధకర్మ మనిభావించి యీజన్మమునందైనను ఏవాంఛలులేక-నిత్యానందుడవై ఆత్మైక్యానందసుఖమునుబొందుము. కాబట్టి యిందుకు కొన్నిదృష్టాంత దార్ష్టాంతికములు వేదాంతోపనిషత్సారవాక్యములు వ్రాయుచున్నవి. అవి యెవ్వియనిన—

నాదబిందోపనిషత్.

అధ్యస్తస్యకుతో జన్మ జన్మాభావేకుతస్థితిః। ఉపాదానం ప్రపంచస్య। మృద్భాణ్డస్యే నపశ్యతి అజ్ఞానంచేతివేదాంత్తైః తస్మిన్నష్టేక్వవిశ్వతా యథా రజ్జుపరిత్యజ్యా సర్పంగృహ్ణాతివైభ్రమాత్। తద్వత్సత్యమవిజ్ఞాయ జగత్పశ్యతిమూఢధీః। రజ్జుఖండేపరిజ్ఞాతే సర్పరూపం నతిష్ఠితం। అధిష్ఠానే తథాజ్ఞాతే ప్రపంచెశూన్యతాంగతే। దేహస్యాపిప్రపంచత్వాత్ ప్రారబ్ధావస్థితిఃకుతః॥

ఆత్మబోధోపనిషత్తు.

వివేకబుద్ధియుక్త్యాహం। జ్ఞానామృతాత్మసమద్వయం॥ తథాపిబాధమోహాదివ్యవహారప్రతీయతె నివృత్తోపిప్రపంచోమేసత్యవద్భాతిసర్వదా సర్పాదౌరజ్జుసత్తైవ బ్రహ్మసత్తైవకేవలం ప్రపంచాధారరూపేణవర్తతేతోజగన్నహియధేక్షురస సంవ్యాప్తాశర్కరావర్తతేతథా అద్వయబ్రహ్మరూపేణ-వ్యాప్తోహం వైజగత్రయం బ్రహ్మాదికీటపర్యంతం ప్రాణినోమయి కల్పితా బుద్బుదాదివికారన్తాస్తరంగాసాగరేయథా॥

నారదపరివ్రాజకోపనిషత్ మూడవ వుపదేశము.

అధ్యాత్మతత్వనిష్ఠాశుభాశుభకర్మనిర్మూలనపరం సన్యస్యపూర్ణానం దైకబోధస్తద్బ్రహ్మహమస్మీతి బ్రహ్మప్రణవమనుస్మరమ్ । బ్రమరకీటకన్యాయేనశరీరత్రియముత్సృజ్యసన్యాసేనైవదేహత్యాగం కరోతిసకృతకృత్యోభవతి॥

ఐదవ వుపదేశము.

చిన్తయస్వరమానన్దం బ్రహ్మైవాహమితిస్మరమ్॥

ఆరవ వుపదేశము.

అస్మద్వ్యతిరిక్తంసర్వం కృతకంనశ్వరమితిసత్యావిరక్తః । పురుషస్సర్వదాబ్రహ్మహమితివ్యావహరేత్॥ నాన్యత్కించిద్వేదితవ్యం స్వవ్యతిరేకేణ జీవన్ముక్తోవసేత్కృతకృత్యోభవతి । ననాహంబ్రహ్మేతివ్యవహరేత్కింతు బ్రహ్మహమస్మీత్యజస్రమ్॥

త్రిశిఖబ్రాహ్మణోపనిషత్తు.

సర్వవస్తున్యుదాశీన భావమాసన ముత్తమం॥ జగత్సర్వమిదంమిథ్యాప్రతీతః ప్రాణసంయమః॥ చిత్తస్యాన్తర్ముఖీభావః ప్రత్యాహారస్తుసత్తమః । చిత్తస్యనిశ్చలీభావో ధారణాధారణంవిదుః । సోహంచిన్మాత్రమేవేతిచింతనధ్యానముచ్యతే అహమేవపరంబ్రహ్మ బ్రహ్మహమితిసంస్థితిః సమాధిస్సతు విజ్ఞేయసర్వవృత్తివివర్జితః॥

మణ్డలబ్రాహ్మణోపనిషత్.

ఉక్తవికల్పంసర్వమాత్మైవతల్లక్ష్యంశుద్ధాత్మదృష్ట్వావాయః పశ్యతిసయేవబ్రహ్మనిష్ఠోభవతి । జీవఃపంచవింశకంస్వకల్పిత చతుర్వింశతితత్త్వంపరిత్యజ్యషడ్వింశః పరమాత్మాహమితి । నిశ్చయాజ్జీవన్ముక్తోభవతి॥

ఛాందగోపనిషత్తు త్రుతీయపాఠకము చతుర్దశఖండము ఒకటవవాక్యం.

సర్వంఖల్విదంబ్రహ్మ నేహననాస్తికించన॥

షష్ఠప్రపాఠకము- ప్రథమఖండము ౧, ౨ వ వాక్యములు.

యథాసౌమ్యైకేనమృత్పిణ్డేన సర్వంమృణ్మయం విజ్ఞాతంస్యా ద్వాచారంభణం వికారోనామధేయం మృత్తికేత్యేవసత్త్యం యథాసౌమ్యైకేనలోహమణి నాసర్వంలోహమయం । విజ్ఞాతంస్యాద్వాచారంభణం వికారోనామధేయం లోహమిత్యేవసత్యమ్॥ ౨.

షష్ఠమపాఠకము-ద్వితీయఖండము ౧, 3 వ వాక్యములు.

సదేవసోమ్యేదమగ్రఆసీత్ । ఏకమేవాద్వితీయమ్ తదైక్షతబహుస్యాం ప్రజాయేయేతి 3॥

అష్టమఖండము ౭ వ వాక్యము.

ఐతదాత్మ్యమిదగ్‌ంసర్వంతత్సత్యగ్‌ంసఆత్మాతత్త్వమసిశ్వేతకేతో॥౭॥

సప్తమప్రపాఠకము-ఇరువదినాల్గవఖండము-౧, ౨ వాక్యములు.

యత్రనాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతినాన్యత్ ద్విజానాతిసభూమా అథయత్రాన్యత్పశ్యతి అన్యచ్ఛృణోత్యన్యద్విజానాతి తదల్పంయోవై భూమాతదమృతం । అథయదల్పం తన్మర్త్యంసభగవఃకస్మిన్ ప్రతిష్ఠిత ఇతిస్వే మహిమ్నియదివాన మహిమ్నీతి ౧।

ఇరువదైదవఖండము- ౧, ౨ వ వాక్యములు.

సఏవాధస్తాత్సఉపరిష్టాత్సపశ్చాత్సపురస్తాత్స దక్షిణతస్సఉత్తరతస్సఏవేదంసర్వం ఇత్యథాతోహంకారాదేశఏవాహమేవాధస్తాదహ ముపరిష్టాదహం పశ్చాదహంపురస్తాదహం దక్షిణతోహముత్తరతోపరిష్టాదాత్మా పశ్చాదాత్మాపురస్తాదాత్మా దక్షిణత ఆత్మోత్తరత ఆత్మైవేదంసర్వమితి ౧॥ సవాఏష ఏవం పశ్యన్నేవం మన్వానఏవంవిజానన్నాత్మరతిరాత్మక్రీడ ఆత్మమిథునఆత్మానంద స్సస్వరాట్ — భవతి—౨.

బృహదారణ్యకోపనిషత్ లో ౧-3 వ యధ్యాయము.

బ్రహ్మవా ఇదమగ్రఆసీతదాత్మాన మేవావేదాహం బ్రహ్మాస్మీతితస్మాత్తత్సర్వమభవత్ । తద్యోయోదేవానాం ప్రత్యబుధ్యత సఏవతదభవత్తథాఋషీణాంతథామనుష్యాణాం తద్ధైతత్పశ్యన్నృషిర్వామదేవః ప్రతిపేదేఽహం మనురభవం సూర్యశ్చేతితదిదమప్యేతర్హియఏవం వేదాహంబ్రహ్మాస్మీతి సఇదంసర్వంభవతి॥

నాలుగవ బ్రాహ్మణము- ౧౦ వ వాక్యము.

తస్యహనదేవాశ్చనాభూత్యా ఈశతఆత్మాహ్యేషాంసభవతి అథయోన్యాందేవతాముపాస్తేన్యోసావన్యోఅహమస్మీతినసవేదయథాపశుః॥

నాలుగవ ఆధ్యాయము-౧ వ బ్రాహ్మణము- ౨౦ వ వాక్యము.

సయథోర్ణనాభిస్తన్తునోచ్చరేత్ యథాగ్నేఃక్షుద్రా విస్ఫులింగావ్య

చ్ఛ్వరన్త్యేవమేవాస్మాదాత్మనస్సర్వే ప్రాణాస్సర్వేలోకాసర్వేదేవాస్సర్వాణి భూతానిఉచ్చరన్తి— ౨౦.

నాలుగవ అధ్యాయము నాలుగవ బ్రాహ్మణము ౧౨, ౧౪ వవాక్యములు.

సయథాసైన్ధవఖిల్యఉదకేప్రాస్తఉదకమేవాను విలీయేతనాహాస్యోద్గ్రహణాయేవస్యాత్-యతోయతస్త్వాదదీతలవణమేవైవంవా అరఇదమహాద్భూతమనన్తమపారం విజ్ఞానఘనఏవ=౧౨=యత్రహిద్వైతమిభవతి తదితర, ఇతరం, పస్యతి, తదితర, ఇతరం, శృణోతి, తదితర, ఇతర, మభివదతి, తదితర, ఇతరం మనుతేతదితర, ఇతరం, విజానాతియత్రవా అస్యసర్వం ఆత్మైవాభూత్తత్కేనకం మన్మీతతత్కేనకం, విజానీయాత్, యేనేదంసర్వం విజానాతితం కేన, విజానీయాత్ విజ్ఞాతారమరేకేన విజానీయాదితి=౧౪.

౫ దవ బ్రాహ్మణము ౧ టవ వాక్యము.

ఇయంపృథ్వీసర్వేషాం భూతానాం మధ్వస్యైపృథివ్యైసర్వాణిభూతాని, మధుయశ్చాయమశ్యాం పృథ్వ్యాంతే జోమయోమృతమయః పురుషోయ శ్చాయమధ్యాత్మం శారీరస్తేజోమయోమృతమయః॥ పురుషోయమేవస యో యమాత్మేదమమృతమిదం, బ్రహ్మేవేదం సర్వమ్ ॥ ౧ ॥

నారాయణోపనిషత్.

నారాయణఏవేదం, సర్వం, యద్భూతంయచ్చభవ్యం నిష్కళంకో నిరంజనో నిర్వికల్పో నిరాఖ్యాతః శుద్ధోదేవ ఏకో నారాయణః, నద్వితీయోస్తి కశ్చిత్ యఏవం వేదసవిష్ణురేవభవతి॥

కైవల్యోపనిషత్.

యత్పరం బ్రహ్మసర్వాత్మా విశ్వస్యాయతనంమహత్॥ సూక్ష్మాత్సూక్ష్మతరం నిత్యంతత్త్వమేవ త్వమేవతత్ జాగ్రత్స్వప్నసుషుప్త్యాది ప్రపంచం యత్ప్రకాశతే, తద్బ్రహ్మహమితిజ్ఞాత్వా సర్వబంధైః ప్రముచ్యతే॥ యిత్యాదిద్యుపనిషత్ ప్రమాణంబులు చెప్పుచున్నవి. ఎట్లనిన—యీలోకంబున అనేకజన్మసుకృత సంసిద్ధిపరుండగు పుణ్యపురుషుడు సద్గురువును సేవించి యామహాత్ముని కరుణవడసి, దేహతత్వమును ఆత్మోపదేశమును బొంది, పరమశాంతుండును, బుద్ధిమంతుండును, కృతార్థుండును నగుచున్నాడు. మరియును యనేకజన్మపాపసంసిద్ధిపరుండగు అజ్ఞాని మిగులమూఢాత్ముండునునై తాను చచ్చుపర్యంతము నాత్మతత్వము దెలియవలెనని యోచించుచుండునేగాని

తెలియుటకు నేరదు గావున, బ్రహ్మవిద్యయనెడు అపవర్గమార్గమును విచా
రించగా, సర్వకోరికలకు మూలముగానున్న చిత్తమును నిరోధించుటే మోక్ష
మనియును చిత్తసంకల్పమువలననె బంధమనియును తెలియవచ్చుచున్నది.
జ్ఞానమనునది యింతేగాని అధికమేమియును లేదని, తెలిసికొనుమా. ఇదియే
శాస్త్రసమ్మతమును, యనుభవముగానున్నది. అట్టిశాస్త్రమునందు నీబుద్ధికి
ఏమిగా తెలియవచ్చుచున్నదో అదేప్రకారము చేయుము. కావున, యీలోకం
బున, నిశ్చయముగా సభలయందు మాటలాడునట్టి వాచాలకుడుగానుండిన
ను, గొప్పచదువరిగానుండినను, బుద్ధిశాలిగానుండినను, యుద్యోగవృత్తుల
యందు సమర్థుడుగానుండినను, యిట్టివారు యీతత్వబోధను పొందినయెడల
నోరులేని మూగవాడుగానుండినను, యేమియును తెలియని, అజ్ఞుడుగానుండి
నను, బుద్ధిలేని మనుజుడుగానుండినను, లోకవ్యవహారములయందు చొరవ
లేని మందునిగాను చేయుచున్నది. మరియును అజ్ఞానులైన లోకవాసులు అట్టి
మహాత్ముని జ్ఞానియని తెలిసికోనేరక, పిచ్చివానిగా భావించి యిల్లువెడలం
గొట్టుట, పరిహాసించుట మొదలగు దుర్మార్గములను జేయుదురు గాబట్టి
యీతత్వబోధ మిగుల చిత్రమైయున్నది.

పాంచభౌతికంబును మిగుల హేయంబును నగు నీశరీరము నీవుగావు,
శరీరము నీకు ఏకాలమునందును లేదు. సర్వవృత్తులను జేయునట్టి యహంకార
స్వరూపుండగు కర్తవున్ను నీవుగావు. అన్నింటిని యనుభవించునట్టి జీవుండగు
భోక్తవు నీవుగావు సర్వసాక్షిస్వరూపుడైన, ఆత్మవే నీవు. సదా నిర్మల
నిష్కళంకుండవైన పరమాత్మవుగావు. లోకంబున సామాన్యునిపగిది వర్తించు
ము. అనగ, తెలిసి తెలియని చందమున తెలపియుండవలెను. కావున కామ
క్రోధములనుగురించి విచారణచేయగా, నవి మనస్సుయొక్క గుణములుగా
తెలియవచ్చుచున్నవి. నీవు ఏగుణములులేని నిర్మలుండగు నాత్ముండవు సంక
ల్ప వికల్పములులేని శుద్ధతెలివియే స్వరూపకముగా గలవాడవు. సర్వసంగ
పరిత్యాగి విజ్ఞానస్వరూపుండవుగావున, తాననెడు ఆత్మస్వరూపునియందు
సమస్తజీవకోట్లయందున్న తాననెడు ఆత్ముండుండునని తన్నుదా తెలిసికొని స
దా అహంకార మమకారములును విడిచినవాడవై శరీరేంద్రియములే తా
నని దుఃఖమునుపొందక ఆత్మానందసుఖమునే పొందియుండుము. కావున,
మహాసముద్రమందు అలలువలెనే యీప్రపంచము సాధారణముగా భ్రాంతి

వలనం దోచుచుండును. నీవు అట్టిఅలలవంటి ప్రపంచముగావు. నిజముగా తరంగములులేని, పరిపూర్ణాచలమహాసముద్రమనే బ్రహ్మమే నీవు.

ముమ్మాటికి, కొంచెమైనను, యేమొక్కసంశయములను బొందనివాడవై నాయందు మిగుల విశ్వాసముగలవాడవై నావాక్యములను చక్కగా నమ్ముము. నీవే శ్రేష్ఠమగు బ్రహ్మస్వజ్ఞాన స్వరూపుండవు; భగవంతుండవు. మాయయనిచెప్పంబడు నీలతోయదమునకు నావల శుద్ధస్ఫటికరూపంబై తేజోమయంబై నీయాత్మదీపంబునుంబోలె ప్రకాశించెడు సర్వసాక్షిస్వరూపుండ వేనీవు. నీకు రెండవవస్తువులేదు. తన్నుతాదెలియుము. కావున, యీశరీరమునకు జననమరణంబులు స్వభావజన్యంబులై యుండుటచేతనే జననమునొంది వచ్చుటయును, మరణముజెంది పోవుటయును, యీరాకపోకలు సత్యములుగానే దెలియవచ్చుచున్నవి. కేవలాత్మనుగుఱించి విచారించగా దానికి రాకపోకలును, చావుపుట్టుకలును లేక సర్వకాలము స్థిరముగానేయున్నది. బుద్ధిమంతుడ వగునీవు ఈప్రకారము శరీరమునుగురించి మిగుల దుఃఖింపబనిలేదు. కావున ఏకమును నాశనమును లేనిదియును, చిదాకాశస్వరూపంబునునై సర్వమునిండి ప్రకాశించెడి కేవలాత్ముండవు. ఈదేహము అనృతజడదుఃఖములతో గూడుకొనిన మిగుల హేయముగాగలది. చూచుచుండగానే మటుమాయగాబోవును. అటులబోక యొకకల్పపర్యంతముండినను లేక యిప్పుడేపోయినను బోవునుగాక. ఈభ్రాంతిరూపకమైన శరీర మెంతకాలముండినను ప్రయోజనము—నీవు కేవలనిర్మలుండవు, నిష్కళంకుండవు గావున, తన్ను తావిచారించిచూడగ నీకు వృద్ధిక్షీణములులేవు. కావున ఆనందరసం బనుమహాసముద్రమువలె నిండియున్న నీకు సమస్తలోకములు తరంగములవలె నీయందు నావరించుకొని యున్నటులదోచుట భ్రాంతియేగాని నిజముగా నీయందు లోకములులేవు. ఒకవేళ అట్టిలోకములు నీయందుగలిగియున్నను, లేక నాశనముబొందినను నీకేమి. ఏకాలమందును పెరుగుటగాని, తరుగుటగాని, విరుగుటగాని యిట్టి యేవికారములునులేక సదా పరమాత్మవైయున్న నిన్ను సద్గురుముఖమున తత్వవిచారణచేయగ కేవల జ్ఞానస్వరూపుండగు తనకు యీదృశ్యమగు సమస్తప్రపంచము వేరుగాదు. సర్వము నీవేగాని నీకు అన్యమేమియునులేదు. నిజముగా లేదు అని తన్ను తాదెలియవలయును. తాను తానైన పరమాత్మస్వరూపుండవైన తనకు విధినిషేధములు జీవోపాధి ఈశ్వ

రోపాధులుగాని గలుగనేరవు. ఇవియన్నియు నిజముగా వ్యర్థపుభ్రాంతులు బొందుట నిష్ప్రయోజనముగావున ఏకమును, నాశనమునులేని తాను సర్వమునిండి ప్రకాశించెడు తనకు ఇకమీద జన్మమును, కర్మమునులేవు. తాను తా ననెడు జీవహంకారమును నీకులేవు. తా నొకండవే యేమియునులేక పరిపూర్ణుండవై నిండియున్నావు. నిర్మలాత్మ - యీలోకంబున బంగారమును విడచి కంకణములును, కిరీటాదిభూషణములును నెటులగనుపించకుండునో, అటువలెనే తన్నుమినహాగా లోకంబులులేవు. నీకు రెండవవస్తువు యేదియునులేక యెందుజూచినను నంతెల్ల సందులేక పూర్ణముగ నీవే నిండియున్నావు. కావున, వీడు, వాడు చెప్పబడుదురు. వాడే తాను. తానే వీడు. వీడే తాను. తానే వాడు. ఇదియే తాను. తానే యిదియు. అని చెప్పబడు యీ లోకవ్యవహారము లన్నియునువిడచి సర్వము పరమాత్మయైన తానే గాని పరమాత్మకు అన్య మేమియునులేదని మనోనిశ్చయమునొందినవాడై సమస్త కోరికలునువిడచి-నిష్కళంకుండవైయున్న తనకు యెరుకయనెడు శుద్ధతెలివి తానుకాని కారణముచేతనే భ్రాంతివలన నీకు ప్రపంచము దోచెనేగాని నిజముగా తనయందు ప్రపంచముదోచనేలేదు. తన్నుతా ననే పరమార్థతత్వమును విచారించగ సర్వముతానై తా నొక్కండవైయున్న తనకు భ్రాంతిరూపకమైన సంసార మనెడు కలలులేనివాడు యీలోకంబున నొకడుండు లేడుగావున యీప్రపంచమును, సంసారమును, శరీరేంద్రియములును కలవంటి భ్రాంతిరూపకములేగాని, నిజముగాలేవు. కావున, యీప్రపంచము భ్రమవలనందోచినదేగాని నిజముగా తనయందు ప్రపంచములేదు. తననిజస్వరూపముతప్ప యితర మేమియునులేదు. కాబట్టి తా నొక్కండవై జననమరణప్రవాహ మనెడు మహాసముద్రముగా నిండియున్నావు. తా నాసముద్రంబునం దిప్పుడున్నావు. ఇక కొంతకాలమున్ను నుండగలవు. మూడుకాలములయందును నాశనరహితుండవు. అందువలన తనకు బంధమోక్షములు గలుగనేరవు. నీకు అనేకజన్మసుకృతమువల్ల సద్గురుకరుణకు బాత్రుడవైతివి. అండపిండబ్రహ్మాండము లన్నియు తానుతప్ప మరేమియులేదు. కావున నీచిత్తంబున నేకోరికలునులేనివాడవై అట్టి చిత్తస్వభావజన్యకార్యములను తలంపునంబెట్టక చిత్తవిశ్రాంతినిబొందియుండుము; తనయందు బుద్బుదంబుపగిది జనించెడు అహంకారమును దృఢవైరాగ్య మనెడుఖడ్గముచేత నాశనముచేయుము. నీమన

స్సందు జాగ్రిత్తగాని, శరీరేంద్రియవృత్తులుగాని, నిలుపవలెను. నీవు సత్యముగా నాత్మస్వరూపుండవు. సదాముక్తుండవు. నీకు పైగా నేమియును లేదని సద్గురుకటాక్షమున నెరింగిన నీవు మరేమి తెలుసుకొనుచున్నావో నాకు చెప్పుమనిన యొందుకుబనికిరాని యీసూలజ్ఞకళామాత్రిశరీరమందు జీవోపాధి ఈశ్వరోపాధు లనెడు జీవేశ్వరులయందును యెంతకాలము తలంపుగలిగియుండునో అంతవరకు నెరుకకు మరణావస్థలు గలుగుచుండునుగాని యెరుకే యీఘోరమగు సంసారమునకు నాధారంబై మాయామయంబైయున్నది. కనుక యిట్టి ఛండాలమెరుకను విడుటచే అనగ తన్ను తాదెలసి తానుతానై జీవభ్రాంతిని విడచుటచేత జన్మరహితంబైన మోక్షసామ్రాజ్యమును పొందును గావున లోకంబునంగల మనుష్యులకు సాధారణముగా ప్రవృత్తికర్మయును, నివృత్తికర్మయును తనంతటతానే ప్రారబ్ధవశంబునంగలిగి హరించిపోవుచుండును. ధీరాత్ముండగు సద్గురుపుత్రుండు వీటివిధ మంతయు నెరింగి వాటిగొడవలంజిక్కక ఉన్మత్తునివలె ద్వంద్వములగు బంధమోక్షము లనెడు జీవభ్రాంతిని విడచియుండవలయును గావున అనురాగముగల యజ్ఞాని తనకుగలిగిన వివిధదుఃఖములను విడువవలెనని మనంబునగోరుచు పత్నిపుత్రివర్గంబులగు సంసారమును విడచిపోవలయునని దలంచుచుండును. అనురాగములేని జ్ఞాని అఘోరమగు దుఃఖసముద్రిమును విడచియుండును గావున లోకంబున నేను మనుజుండనైనను తొలుత తనదేహమునందును, పిమ్మట మోక్షమందును మమతగలిగియుండునో అట్టి మనుష్యుడు యోగిగాడు. జ్ఞానిగాడు. వాడే విశేషములగు దుఃఖముల ననుభవించు పామరుండు. జననమరణములనుబొందుచుండును. కాబట్టి యిందుకు యుపనిషత్ ప్రమాణంబులు వ్రాయుచున్నవి గావున—

## స్కంధోపనిషత్తు.

సంవిన్మాత్రిస్థితశ్చాహమజోస్మికిమతః పరం । వ్యతిరిక్తంజడంసర్వం స్వప్నవచ్చవినశ్యతి । సఏహింపరంబ్రిహ్మతద్బ్రిహ్మహంనసంశయః । జీవశ్శివశ్శివోజీవస్సజీవః కేవలశ్శివఃతుషేణబాధోవ్రిహిస్స్యాత్తుషాభావేతుతణ్డులః॥ ఏవంబద్ధస్తథాజీవః కర్మనాశేసదాశ్శివః. పాశబద్ధస్తదాజీవః । పాశముక్తసదాశ్శివః దేహోదేవాలయప్రోక్తో । జీవోదేవసదాశ్శివః త్యదజ్ఞాననిర్మాల్యమ్ సోహంభావేనపూజయేత్॥ అభేదర్శనంజ్ఞానంధ్యానం నిర్విషయంమనః॥

మహానారాయణోపనిషత్తు- ఒకటవ అధ్యాయము.

త్వమేవసర్వం త్వమేవసర్వం త్వమేవసర్వం త్వమేవమోక్ష స్త్వమేవ మోక్షత్వమేవఖిలమోక్షసాధనం నకించదస్తితద్వ్యతిరిక్తం యత్కించిత్ప్రతీయ తేతత్సర్వంభాధితమిదినిశ్చితమ్॥ సగుణనిర్గుణరూపంబ్రహ్మ ఆదిమధ్యాంతశూన్యం బ్రహ్మసర్వంఖల్విదంబ్రహ్మ॥

రెండవ అధ్యాయము.

సచ్ఛబ్దవాచ్యం బ్రహ్మవిద్యాశబళంభవతి । తత్రతత్వాత్గుణాతీత శుద్ధసత్వమయోలీలాగృహీతనిరతిశయానందలక్షణో మాయోపాధికోనారాయణ ఆసీత్॥

మూడవ అధ్యాయము.

సంకోచవిసాత్మక సుహామాయావిలాస ఏవసర్వోప్యవిద్యాప్రపంచః। పరమార్థతోనకశ్చిదస్తిలక్షణశూన్యానాదిమూలావిద్యావిలాసత్వాత్ । తత్కథమితి । ఏకమేవాద్వితీయంబ్రహ్మనేహనానాస్తికించన తస్మాద్బ్రహ్మవ్యతిరిక్తం సర్వబాధితమేవ అవ్యక్తం విశేద్బ్రహ్మణిసిరింధనో వైశ్వానరోయథాతస్మాన్మాయోపాధిక ఆదినారాయణ స్థథాసస్వరూపంభజతి । సర్వేజీవాశ్చసస్వరూపం భజన్తె యథాజపాకుసుమ సానిధ్యాద్రక్తస్ఫటిక ప్రతీతిః॥ తదభావేశుద్ధస్ఫటిక ప్రతీతిః । బ్రహ్మణోపిమాయోపాధివశాత్సగుణపరిచ్ఛిన్నాదిప్రతీతిః వ్రుపాధి విలయంస్నిర్గుణ నిరవయవాది ప్రతీతిః।

నాలుగవ అధ్యాయము.

కార్యకారణోపాధభేదా జీవేశ్వరభేదోపిదృశ్యతే । కారణోపాధిరీశ్వరః కార్యోపాధిరయంజీవః బ్రహ్మచైతన్యంతేషు ప్రతిబింబితం భవతి॥ ప్రతిబింబా ఏవజీవాఇతికథ్యంతె । అంతఃకరణోపాధికాసర్వేజీవాః॥

ఆరవ అధ్యాయము.

త్వంబ్రహ్మాస్మి అహంబ్రహ్మాస్మి అవయోరన్తరంనవిద్యతే । త్వమేవాహం అహమేవత్వం ఇత్యభిధాయేత్యుక్త్వాదినారాయణస్థిరోదధౌ॥

ఎనిమిదవ అధ్యాయము.

యథాభూమేః పర్వతవృక్షగుల్మలతాద్యనన్తవస్తుభేదః । తథైవాద్వైతపరమానందలక్షణం । పరబ్రహ్మణోమమ సర్వాద్వైతముపపన్నంభవత్యేవ

మత్స్వరూపమేవసర్వంమద్వ్యతిరిక్తమణుమాత్రం నవిద్యతె అహంబ్రహ్మేతి భావనయా యథాపరమతేజో మహానదీప్రవాహాపరమతేజః పారావారే ప్రవిశంతి యథాపరమతేజః। పారావారతరంగాఃపరమతేజః। పారావారే ప్రవిశన్తి । తథైవసచ్చిదానందాత్మోపాసకసర్వపరిపూర్ణాద్వైతపరమానందలక్షణ పరబ్రహ్మణినారాయణేనయి సచ్చిదానందమాత్మకోమహాజోహం పరిపూర్ణోహమస్మీతిప్రవివేశ॥ మదుపాసకస్తస్మాన్నిరతిశయాద్వైతపరమానందలక్షణపరబ్రహ్మాభవతి । యోన్వైముముక్షుర నేనమార్గేణసమ్యగాచరతి సపరమానందలక్షణపరబ్రహ్మాభవతి॥

అద్వయతారకోపనిషత్.

జీవేశ్వరౌమాయికావితివిజ్ఞాయ సర్వనిశేషం నేతినేతీతివిహాయయదవశిష్యతె తదద్వయంబ్రహ్మ॥

రామరహస్యోపనిషత్.

రామమంత్రాణాం కృతపురశ్చరణో రామచన్ద్రోభవతి సదారామో అహమస్మీతితత్వతః ప్రవదంతియే నతేసంసారిణోనూనం రామఏవనసంశయః॥

రామపూర్వతాపిన్యుపనిషత్ - ఒకటవ వాక్యము.

రమంతెయోగినోనన్తే నిత్యానందే చిదాత్మని ఇతిరామపదేనాసౌపరం బ్రహ్మాభిధీయతె చిన్మయస్యాద్వితీయస్య నిష్కళస్య శరీరిణః—ఉపాసకానాం కార్యార్థంబ్రహ్మణో రూపకల్పనా॥

రామోత్తరతాపిన్యుపనిషత్తు.

తత్పదత్వత్పరంబ్రహ్మ రామచంద్రశ్చిదాత్మకం॥ సోహమోంతద్రామ.భద్రపరంజ్యోతీరసోహమోం ఇత్యాత్మానమ మాదాయమనసాబ్రహ్మణైక కుర్యాత్ సదారామోహమస్మీతితత్త్వతః ప్రవదన్తియే నతేసంసారిణోనూనం రామఏవనసంశయః॥

శాండిల్యోపనిషత్తు- ఒకటవఅధ్యాయము.

అథధ్యానం తద్ద్వివిధం సగుణం నిర్గుణంచేతి, సగుణమూర్తిధ్యానం॥ నిర్గుణమాత్మయాథ్యాత్మం॥ ౧౧॥ అథసమాధిః॥ జీవాత్మపరమాత్మైక్యావస్థా త్రిపుటిరహితః, పరమానందస్వరూప శుద్ధచైతన్యాత్మికాభవతి॥ ౧౨ ॥ యిత్యాద్యుపనిషత్ ప్రమాణంబులు చెప్పుచున్నవి. కాబట్టి ఆత్మసమాధియందు మనోమారుతదృక్కులు లయముజేసి అనగ ఏకముచేసి తానొక్కడై పర

బ్రహ్మమే తానై ఆకళలో నిష్కళాస్వరూపంబైన పరమాత్మను సగుణరూప మనిన్ని నిర్గుణరూపమనిన్ని రెండువిధము లుగా నుపాసింతురు. ఎట్లనగ తనకన్న అన్యముగా ఆత్మయున్నదని ధ్యానింతురు. వారు సగుణధ్యానముచే నుపాసకు లు ద్వైతవిశిష్టాద్వైతులు యిదిభావింతురు గావున, నిర్గుణోపాసకులు తానే పరమాత్మస్వరూపమునిన్ని తనకన్న అన్యము లేదనిన్ని తానే అంతాయనిన్ని యనుభవజ్ఞానముచేతను శాస్త్రదృష్టముచేతను ఆత్మనిశ్చయముచేతను చెప్పె దరు గావున వికారరహితుడైన ఆత్మదేహాద్యుపాధులు నశించినప్పటికిన్ని దాను నశింపనివాడును ప్రత్యక్షాదిషడ్శాస్త్రములచేతను కాలదేశస్వరూపములచే తను తెలియబడనివాడు నగు దేహియైన ఆత్మయొక్క వ్యవహారదశలో వ్యవ హారికజీవుడుగాను పారమార్థికదశలో బ్రహ్మముగాను యుండును. కావున, శరీరము నాశనముగలది. అజ్ఞానమని చెప్పబడియున్నది. కాబట్టి నిత్యుడును అవినాశియు— ప్రత్యక్షప్రమాణములచేత కొత్తగా సిద్ధింపజేసికొనదగని వాడు. అధ్యాసజన్యమగు నీదృశ్యప్రపంచమే శరీరముగాగలవాడు నగు పర మాత్మ ఆశ్రయమైనదియు అసత్తైనదియు నగు దేహాదిసర్వప్రపంచమును యెండమావులను మొదటచూచినతోడనే అదినిజమని జూచినపిమ్మట అదిజల ముకాదని తెలసిన మరియొకప్రాజ్ఞునిమాట నమ్ముటవలనగాని, నమ్మి దగ్గరకు బోయి చూచినందువలనగాని అదిజలముగాదని నమ్మక మెట్లునశించునో యటువలెనే స్వప్నమందు యథార్థములైనవి గనబడు ॥శ్రుతి॥ అనాత్మదృష్టె అవివేకనిద్రా అహంమమ స్వప్నగతింగతోహం॥ బను విచిత్రపదార్థములు మేల్కొనినతోడనే యెట్లుకనబడునో యటువలె అవిద్యాసంబంధముండువర కున్న సత్యముగాదోచును. గురూపదేశముచేత తత్వమస్యాదిమహావాక్యము లచేత అహంబ్రహ్మస్మియను యనుభవమువలన అట్టిప్రపంచమంతయు మిథ్యామాత్రమనితోచును. కాబట్టి అట్టివివేకముగలవాడై అవిద్యాజన్యము లగు నీదేహాదులయందు అభిమానమును యీదేహాదుల నాశనమునకున్ను దుఃఖమును బొందకయుండును గావున, నిత్యుడు-అవినాసి యను రెండుశబ్దము లకు అర్థమేమనగా అవినాశి, వ్యాధి మొదలగునవి కలుగుటయు అవి పోవు టయు మొదలగునవి లేనివాడున్ను నిత్యుడు, జన్మమరణములు లేనివాడున్ను యని యర్థము గాబట్టి ప్రత్యక్షప్రమాణమనగ తాను స్వయముగాగాని మరి యొకరుచూపినగాని చూచియునది యిట్టిపదార్థమని తెలసికొనుట, ఎట్లనగ కాశీ

పట్టణమున్నదని చెప్పినప్పుడు తాను స్వయముగాచూచి కాశీయున్నదని దెల సికొనుట ప్రత్యక్షము. అమూల్యరత్న మొకటియున్నదనిచెప్పి దానినొకరు చూపగచూచి అట్టిరత్నముకలదని దెలసికొనుట ప్రత్యక్షము. కాబట్టి అను మానప్రమాణ మనగా యెద్దియనిన ఒకవస్తువుతో సంబంధించిన మరియొక వస్తువుకుజూచి అట్టివస్తువుగూడ అచ్చటనుండునని యూహించి తెలిసికొనుట. ఎట్లనగ అగ్నితోసంబంధ మగుపొగను యింటిమీదజూచి యింటిలోనిప్పున్న దని యూహించుట — అనుమానము. కాబట్టి ఉపమానమనగ ఒకవస్తువును బోలు మరియొకవస్తువును జూచి యావస్తువుగూడ యిట్లేయుండునని తెలసికొ నుట యెట్లనగ చంద్రునివలె ముఖమున్నదనివిని చంద్రునిజూచి యిట్లే ముఖ మును సంతోషముగానున్నదని తెలసికొనుట. కాబట్టి శబ్దమనగా మరియొక్క ప్రమాణమువలన దెలియబకుటకు వీలులేనివస్తు విట్టిదని తెలియజేయు ప్రాజ్ఞు నివాక్యమునుబట్టి యెట్టివస్తువును అట్టివస్తువును దెలసికొనుట. ఎట్లనగా యూర ఫుదేశమందుండి వచ్చి యొకపెద్దమనుష్యుడు ఆదేశ మిట్లున్నదనియు ఆదేశము అనేక యాపదార్థములున్నవనియును జెప్పిన వినినప్పుడు మరియు యితర ప్రమాణాగోచరమగు బ్రహ్మవస్తుస్వరూపమును బ్రహ్మ సాక్షాత్కారము గల ఋషివాక్యములనుబట్టి తెలసికొనుట. కాబట్టి ప్రకృతియును పురుషుడు ను అనగా జీవుడును వీ రిద్దరును అనాదిగానుండువారేగాని యొకప్పుడు క్రొత్త గవచ్చినవారుగారు. ఏది కలిగినదిగా వున్నదని చెప్పబడునో అది అంతయును ప్రకృతివలన గలిగినదే.

అట్టిప్రకృతిగూడ క్రొత్తగాపుట్టినదని కలిగినదని యొప్పుకున్న యెడల ప్రకృతినిబుట్టించుటకు మరియొక ప్రకృతియుండవలయునుగదా. దానినిగలుగ జేయుటకు మరియొక ప్రకృతియుండవచ్చునుగాన యిట్లు ప్రకృతి పరంపర నంగీకరించినచో అనవస్థాదోషము సంభవించును. కాబట్టి ప్రకృతికొత్తగబుట్టిన దిగాదనియు నిత్యమనియు అనాదియనియు అంగీకరింపవలెను. జీవుడోయనిన, బ్రహ్మముయొక్క హంశముగనుకను, బ్రహ్మము నిత్యముగనుకను, బ్రహ్మాం శమగుజీవుడును నిత్యుడనవలసివచ్చును. కాబట్టి జీవుడు అనాదియని అంగీక రింపబడును. జీవప్రకృత్తుల నిత్యమెట్టిది యనగ ప్రకృతియెన్నివిధములుగా మారుచున్నను, జీవుడుమారక యెన్నటికి నొక్కరూపునుండునుగాన, జీవునక నిత్యత్వమును ప్రవాహముతో నిత్యమును, గలుగవు. స్వతశ్సిద్ధమైన నిత్యత్వమే

కలుగును. నామరూపములుగలదెల్ల ప్రకృతియనబడును. అయితే యొకప్పు డున్ను నామరూపములు మరియొకప్పుడున్ను లేకుండుటచేత ప్రకృతి అనిత్య మనియు, నామరూపము లేకుండుట కలుగకపోవుటచేత ప్రవాహరూపము నిత్యమనియు జెప్పబడును. జీవుడు, ఆత్మ, బ్రహ్మము, మొదలగు నామము లును. బ్రహ్మవిష్ణురూపములును, ప్రకృతిసంబంధమైనవేయని యూహించు నది, బ్రహ్మమునకు గూడ ప్రకృతిసంబంధముకలదా యనిన శ్రుతి॥ ఉప దేశాదయంవాదః జ్ఞాతేద్వైతం నవిద్యతే॥ అను మాండూకోపనిషత్ వాక్య ప్రకారముగా బ్రహ్మ ఆదినామములన్నియు, శిష్యునకుపదేశించుటకై సంకే తము చేయబడినవిగాని పరబ్రహ్మమునకు, స్వతసిద్ధములుగాలేవు. కాబట్టి మాయ ఈశ్వరునికి అపరాప్రకృతియనియు- జీవు డీశ్వరునకు పరాప్రకృతి యనియు అధ్యాత్మరామాయణమందు- గీతలయందును జెప్పబడియున్నది. ఇట్టిమాయాజీవులు ప్రకృతిపురుషులనియు, క్షేత్రక్షేత్రజ్ఞులనియు చెప్పుట యేకాక పైనజెప్పబడినట్లు, అనాదులనియు, నిత్యులనియు, యీగ్రంథమం దు వివరింపబడియున్నది. ఈశ్వరుని అనాదిగ నంగీకరించు మనము అట్టి యీశ్వరుని, పరాపరప్రకృతులగు మాయాజీవులను నిత్యులుగా నంగీకరింప వలసినదే. ఈరెండుప్రకృతులమూలముగా ఈశ్వరునికి సృష్టిస్థితిసంహార కారణత్వము చెప్పబడుచున్నది కాబట్టి—

పైంగలోపనిషత్ - నాలుగవ అధ్యాయము.

అహమేవపరం సర్వం మితిపశ్యేత్పరంసుఖం॥ యథాజలేజలేక్షిప్తం క్షీరంక్షీరేఘృతంఘృతే॥ అవిశేషోభవేత్తద్వ జీవాత్మపరమాత్మనోః॥ యత్ర యత్రమృతోజ్ఞానీ, యేనవాక్యేనమృత్యునా యథాసర్వగతంవ్యోమ, తత్రతత్ర లయంగతః ఘటాకాశమివాత్మానం విలయంవేత్తితత్వతః స్వాగశ్చతిసికాలం బ జ్ఞానలోకం సమంతతః॥ అహంబ్రహ్మేతినియతం, మోక్షహేతుర్మహాత్మ నాం నాహంబ్రహ్మేతి జానాతి తస్యముక్తిర్నజాయతే॥

మహోపనిషత్ - రెండవ అధ్యాయము.

అహంబ్రహ్మైవాస్మినచేతరః॥ ౪ వ అధ్యాయము॥ బ్రహ్మైవాహ మితిజ్ఞాత్వా వీతశోకోభవెన్మనిః॥ వినష్టదిగ్భ్రమస్యాపియథాపూర్వం విభాతి దిక్ తథావిజ్ఞానవిధ్వస్తం జగన్నాస్తీతిభావయ॥ మత్తైరావతోబద్ధస్పర్షపీఠా ణుకోటరే మశకేనకృతంయుద్ధంశింహౌఘైరణుకోటరే పద్మాక్షేస్థాపితో

మేరుర్నిగీర్ణేభృంగసూనునా నిధాపువద్ధితాదృక్త్వం జగదేతద్భ్రిమాత్మకం॥ అహంహేతినియతం మోక్షహేతుర్మహాత్మనాం జీవేశ్వరాదిరూపేణచేతనా చేతనాత్మకం ఈక్షణాది ప్రివేశాంతాసృష్టిరీశేనకల్పితా జాగ్రిదాదివిమోక్షాంత సంసారోజీవకల్పితః॥ మరుభూమౌ జలంసర్వ మరుభూమాత్రిమేవ తత్ జగత్రియమిదంసర్వం చిన్మాత్రిం స్వవిచారతః॥

ఎనిమిదవ అధ్యాయము.

నతదస్తినయత్రాహం నతదస్తినతన్మయం కిమన్యదపివాఛామి సర్వం సచ్చిన్మయంతతం॥ సమస్తంఖల్విదం బ్రిహ్మసర్వమాత్మేదమాంతతం॥ అహమన్యదిదంచాన్యదితి భ్రాన్తింత్యజానఘ॥

సస్వరూపానుసంధానముగ యోగపురుషుడు బ్రహ్మనిష్ఠయందు నెట్లుండవలయునో వినుము. స్వానుభవశాలి సర్వభూతములు ఆత్మయే తానని యు తానెయని యెరిగియుండుటవలన తనకుకలుగజేసిన ప్రాణియందుగూడ ద్వేషబుద్ధిలేకయుండును. సమస్తప్రాణులకు మిత్రుడు అనగ స్నేహముగలవాడువలెనుండును. దుఃఖపడుచుండు సమస్తభూతములయందు గనికరముగలవాడై తనకు శక్యమైనమట్టుకు అట్టిసంసారదుఃఖమునుండి విడిపించుకొనుట కు ప్రియత్నముచేయునప్పుడును నేనుజేసితినసే కర్తృత్వము లేకయుండును. తన్ను యితరులు కొట్టినను తిట్టినను కోపగించక యోర్పుగలిగియుండవలయును. దేహధారణకుమాత్రిము తప్ప తగిన యల్పాహారము తటస్థించినను అంతటిచేతనే తృప్తిగలవాడై యట్లుతటస్థించిన పదార్థమైనను మంచిదైనను చెడ్డదైనను, యెల్లప్పుడు ఆనందించుచుండును గాప్రన, తనచిత్తమును తాను లోబరుచుకొనియుండుటకు సాధనము కార్యకారణరూప సకలప్రిపంచకము ను మిథ్యయని, నిశ్చయించుకొని అందు ప్రివర్తింపకుండును. శాస్త్రజ్ఞానము వలన గలిగిన బ్రిహ్మ, సస్వరూపజ్ఞానమునకు తర్కవాదముల వల్ల చెడగొట్టుకొనక సద్గురూపదేశముద్వారా కలుగు లాభమువలన దృఢనిశ్చయము చేసుకొని సకలమైన యితరవిషయములయందు మనోబుద్ధిచిత్త అహంకారములయందు జొరనీయక స్వరూపానుభవమందు నిలుపును. అట్టివాడె నిజమైన అంతరసన్యాసియనబడును. లోకమందన్నివస్తువులకన్న తాను తనకు కర్తవ్యములేక ఆత్మకు ధర్మముతోడను సంయోగవియోగములు గలవనుటకు నెట్టిపీలు లేదు. కాబట్టి క్షేత్రిజ్ఞునకు ఈశ్వరత్వము నిత్యముగానున్నదే

యని తెలిసినది. ఈయర్థము॥ శ్లోకం ॥ అనాదిత్వాన్నిర్గుణత్వా॥ అని గీతలయందు చెప్పబడియున్నది. కావున పైనిచెప్పినప్రకారము సంసారత్వము లేనియెడల అనగ వ్యవహారికమందు ప్రకృతికృత్యములు లేనియెడల, శాస్త్రములు వ్యర్థములుగావలసివచ్చును గావున దోషముగలుగును. ఎట్లనగా నేలవిడిచిన సామున్ను, చేర్లులేని వృట్టియున్ను, మెగరవేయుబంతియును, సూత్రముతెగిన గాలిపడగయున్ను యిట్లు యాధారములేనిదేదియును యుండదుగనుక భూమిలేనిదే నివాసముయెక్కడగలదు. నాలుగుచేర్లులేనిదే వృట్టిమీద పాలకుండ యెట్లుపెట్టగలము. భుజబలములేనిదే బంతి మెగరవేయుటయెట్లు సూత్రములేనిదే గాలిపడగ యెట్లుండును. కాన సంసారత్వము లేనియెడల శాస్త్రము వ్యర్థములని చెప్పుట దోషముకాదా? కావున తన్నుతా విచారించినవెనుక- అనగ నిత్యానిత్య వివేకజ్ఞానము గలిగినపిమ్మట యెల్లమతస్థులును అంగీకరించిన హంశమేగాన, అంగీకరించిన దోషమును, బరిహారించబడిన బాధ్యత యొకనియందుండదుకదా. అందరు నెట్లు అంగీకరించినవారనిన, వినుము. ముక్తులకు సంసారీసంసారత్వము వ్యవహారము లేదనుట ఆస్తికులందరు అంగీకరించిన హంశమే. వారికిశాస్త్రములు వ్యర్థములగుటవలన దోషముకలదా, లేను. అట్లే క్షేత్రజ్ఞులమగు మనకు నీశ్వరునితో నైక్యమునుగలిగించు, బ్రహ్మజ్ఞానదశయందు శాస్త్రము నిరర్థకము గలిగిననేమి, అజ్ఞానదశయందు సార్థకములేకదా. శాస్త్రములు భేదవాదుల భేదవాదులకందరకును, బంధావస్థయందుమాత్రము, ప్రయోజనములగుటయు, ముక్తావస్థయందు నిష్ప్రయోజనములగుటచేత నెట్లో అద్వైతులకు నట్లే యగును——

భేదవాదులు శాస్త్రజ్ఞానమునేని బంధనగాజేసి శాస్త్రానుభవమును చెప్పుచున్నాడు. అద్వైతులు శాస్త్రసారాంశమనగా వేదసారాంశమును- యోగస్వానుభవమును బొందియుందురు, ఎట్లనగ॥ క్షీరనీరవిభాగే నహంసో హంసబకోభికః॥ అనునట్లు, పాలునీళ్లు కలిసినట్లు శాస్త్రానుభవములు కలిసినట్లు యున్నవి- గావున యెట్లనగ॥ శ్లోకం॥ అనంతశాస్త్రం బహువేదితవ్యం అల్పశ్చకాలో బహవశ్చవిఘ్నా, యత్సారభూతం తదుపాశితవ్యం హంసోయథాక్షీరయివాంబు మిశ్రమం॥ ఇట్లుచెప్పబడియున్నది. శాస్త్రములయందనునే సారమున్నది. దీనినే వేదసారమని అద్వైతానుభవము చెప్పుచున్నది.

కావున ఆత్మానాత్మ వివేకజ్ఞానులు యోగశాస్త్రానుభవమును, సస్వరూపావలోకముచేత, తన్నుతా దెలసి జీవబ్రహ్మైక్యానుసంధానముబొంది నిర్వికల్పసమాధిపరులై యుందురుగావున, ఆత్మకు బాధముక్తావస్థలు రెండును, పరమార్థముగానుండునవి గాన నొకటి విడువదగినదనియు రెండవది యపేక్షింపదగినదనియు, నేర్పడియుండుటంబట్టి శాస్త్రములకు సార్థక్యత కలుగవచ్చును. ఇంక అద్వైతులకు పరమార్థమగుటవలనను అవిద్యచేత గల్పింపంబడినదగుటను బంధావస్థయే యాత్మకు పరమార్థమగుటవలన శాస్త్రమునకు విషయమె లేకపోవలసివచ్చును. కనుక శాస్త్రమునకు విరోధమే గలుగును గావున, శాస్త్రమార్గేణ యనుభవమును బొందవచ్చును.

ఎట్లనిన, ఆత్మకవస్థాభేదము అంగీకరించుటకే వీలులేదు. అవస్థాత్రయవిలక్షణాం ఆత్మగావున అంగీకరించుటకు వీలులేదు. ఎట్లనగ అంగీకరించినయెడల ఆత్మకు బాధముక్తావస్థలు ఒక్కమారుగానే కలుగునా లేక ఒకదానితరువాత ఒకటియా? ఒకవస్తువునకు ఏకాలమందును నడచుటయు, నిలుచుటయు. నెట్లు సందర్భింపవో అట్లాత్మకు రెండవస్థలు వొక్కమారే కలుగుననుట సందర్భింపదు కదా. కావున ఒకదానికొకటి సందర్భములేకుండగ ఒకటి తరువాత ఒకటి కలుగవలయును. అట్లయినయెడల బంధోవిముక్తః- బంధము తెగుటయేముక్తి.-అనగ సంసారబంధమునుండి విడువబడినవాడే ముక్తుడు గావునయిట్లు యుపనిషత్ ప్రమాణములు ఘోషించుచున్నవి.

యోగశిఖోపనిషత్ - ఒకటవ అధ్యాయము.

క్షేత్రజ్ఞః పరమాత్మాచతయోరైక్యం యథాథవేత్॥ తదైక్యేసాధితే బ్రహ్మన్ చిత్తంయాతివిలీనతాం పవనఃస్థైర్యమాయాతిలయయోగోదయేసతి లయాత్సంప్రాప్యతేసౌఖ్యం స్వాత్మానందంపరంపదం॥

నాల్గవ అధ్యాయము.

ఓంచైతన్యస్యైకరూపత్వాద్భేదోయుక్తోనకర్హిచిత్ । జీవత్వంచతథాజ్ఞేయం రజ్జ్వాంసర్వగ్రహోయథా । రజ్జ్వజ్ఞానాత్క్షణేనైవయద్వద్రజ్జుర్హిసర్పిణీ । భాతితద్వచ్చితిసాక్షాద్విశ్వాకారేణకేవలా । ఉపాదానం ప్రపంచస్య బ్రహ్మణోన్యన్నవిద్యతే । తస్మాత్సర్వం ప్రపంచోయం బ్రహ్మైవాస్తినచేతనరత్ । వ్యాప్యవ్యాపకతామిథ్యాసర్వమాత్మేతిశాసనాత్ ॥ ఇతిజ్ఞాతేపరేతత్త్వేభేద

స్యావసరః కుతః॥ బ్రహ్మణస్సర్వభూతానిజాయన్తేపరమాత్మనః । తస్మాదేతా
నిబ్రహ్మైవ భవన్తీతి విచిన్వయబ్రహ్మైవ నామానిరూపాని వివిధానిచకర్మా
ణ్యాపిసమగ్రాణి భానన్తేవేతిభావయ । సువర్ణాజ్జాయమానస్యసువర్ణత్వం
చశాశ్వతం । బ్రహ్మణోజాయమానస్య బ్రహ్మత్వంచతథాభవేత్ । స్వల్ప
మప్యన్తరంకృత్వాజీవాత్మ పరమాత్మనోః॥ యత్తిష్ఠతిసమూఢాత్మాభయం
తస్యాపిభాషితం । యదజ్ఞానాద్భవేద్వైతమితరస్తత్ప్రపశ్యతి । ఆత్మత్వేన,
తదాసర్వం నేతరస్తత్రచాణ్వపి । అనుభూతోప్యయం లోకో వ్యవహారక్షమో
పినః। అసద్రూపోయథాస్వప్నం । ఉత్తరక్షణబాధితః॥ స్వప్నేజాగరితం
నాస్తిజాగరేస్వప్నతానహి । ద్వయమేవలయం నాస్తిలయోలయోపిహ్యా
నయోర్నచ । త్రయమేవభవేన్మిథ్యా గుణత్రయవినిర్మితః॥ అస్యద్రష్టా
గుణాతీతో నిత్యోహ్యేషచిదాత్మకః । యద్వన్మృదిఘటభ్రాంతిశుక్తౌహిరజత
స్థితిః । తద్బ్రహ్మణిజీవత్వం వీక్షమాణేవినశ్యతి । యథామృదిఘటోనామ
కనకేకుండలాభిధా శుక్తౌహిరజతఖ్యాతిర్జీవశబ్దస్తథాపరే । యథైవవ్యోమ్ని
నీలత్వం యథానీరంమరుస్థలే । పురుషత్వంయథాస్థాణౌ తద్వద్విశ్వంచిదా
త్మని యథైవశూన్యేవేతాలోగంధర్వాణాం । పురంయథా యథాకాశేద్విచం
ద్రత్వంతద్వత్సత్యేజగస్థితిః । యథాతరంగకల్లోలైః జలమేవంస్ఫురత్యలం ।
ఘటనామ్నా యథాపృథ్వీ । పటనామ్నాహితన్తవః జగన్నామ్నాచిదాభా
తి । సర్వంబ్రహ్మైవకేవలం యథావంధ్యాసుతోనాస్తి । యథానాస్తిమరౌజలం
యథానాస్తినభోవృక్షః । స్తథానాస్తిజగస్థితిః గృహ్యమాణేఘటే యద్వన్మృ
త్తికాభాతివైబలాత్ । వీక్షమాణేప్రపంచేతు బ్రహ్మైవాభాతిభాసురం ।
సదైవాత్మావిశుద్ధోస్తిహ్యశుద్ధోభాతివైసదా । యథైవద్వివిధారజ్జుః జ్ఞానినో
జ్ఞానినోనిశం । యథైవమృణ్మయః కుంభస్తథైతత్పరమం బ్రహ్మయోవేదవైము
నిః॥ బ్రహ్మైవభవతిస్వస్థసచ్చిదానందమాత్మకః॥ ఇత్యాద్యుపనిషత్ప్రమా
ణంబులు జీవజగత్తులగురించి దార్ష్టాంతికదృష్టాంతపూర్వముగా వ్రాయనై
యున్నదిగావున—

పైనచెప్పబడిన ప్రకారము సర్వము ఆత్మనిస్సంగస్థితియే జీవన్ముక్తి
యని చెప్పుచున్నది. ఎట్లనిన,

॥శృతి॥ జీవన్ముక్తిస్తుతద్విద్వాన్పూర్వోపాధి గుణాంస్త్యజేత్, సచ్చి
దానంద రూపత్వాద్భవేద్భ్రమరకీటవత్॥

॥భావార్థః॥ విద్వాన్ బ్రహ్మైక్యానుభవశాలి పూర్వోపాధిగుణాన్, పైనచెప్పబడిన స్థూలసూక్ష్మకారణశరీరము లనెడు వుపాధులును సత్వరజస్తమోగుణములును ॥త్యజేత్॥ ఇతియత్॥ విడుచుననునది యేదికలదో ॥తత్తు॥ అదియే జీవన్ముక్తుడు అనేస్థితి ॥భవతి॥ అయియున్నది. సచ్చిదానందరూపత్వాత్ యీమాయోపాధివలన ప్రపంచరూపముగానాభాసించు తాను స్వతసిద్ధముగానే సచ్చిదానందస్వరూపుడు గనుక ॥సః॥ అట్టిజీవన్ముక్తుడు భ్రమరకీటకన్యాయముగ ॥బ్రమరకీటవత్॥ భవేత్॥ సస్వరూపావిర్భావము పొందినవాడగును. అనగా యనుభవజ్ఞానము గలవాడగును.

ఈజీవునికి యనాదిగా గలిగియుండు అజ్ఞానమే కారణస్వరూపము. అట్టికారణస్వరూపుడైన వ్యవహారికజీవుడని వ్యవహారికనామమును, తన్నుతా విచారింపగ, తానుపరబ్రహ్మస్వరూపమగుటను మరచి, దేహాభిమానముగలవాడవై, స్థూలశరీరముద్వారా నానావిధతలంపులుగలవాడై లోకంబునందలి విషయంబులను స్మరించుటవల్లను, స్పృశించుటవల్లను, చూచుటవల్లను, మోహించుటవల్లను పుణ్యపాపకర్మములను చేయుచు ఆకర్మఫలంబులగు సుఖదుఃఖములను ననుభవించుటకుగాను, స్థూలశరీరంబును విడచిపెట్టి సూక్ష్మశరీరముతోడ స్వర్గనరకంబులనుండి సుఖమును నరకమునందలి దుఃఖమును ననుభవించి పూర్వకర్మానుసారముగా, ఆదేవతాశరీరమును విడిచిపెట్టి, సూక్ష్మశరీరముతోడ భూలోకంబునందు తల్లిగర్భంబునందు- తల్లిగర్భమే పూర్వజన్మకర్మఫలంబనబడును. స్థూలశరీరమునందు ప్రవేశించి శిశువుగా జన్మించును. ఇట్లుభూలోకంబునకును, స్వర్గలోకంబునకును, పలుమారు సంచరించుచు, జననమరణంబులుబొందుచు, దుఃఖించుచుండును. ఈజీవుడు స్థూలశరీరమును విడిచిపెట్టి సూక్ష్మశరీరముతోడ స్వర్గలోకమునకు బోవుటయె మరణమనబడును. మరలస్వర్గమునందుండి, సూక్ష్మశరీరముతోడ భూలోకంబున తల్లిజఠరగర్భంబునందు, స్థూలశరీరంబులోపల ప్రవేశించి, భూమిమీద శిశురూపంబుగ పుట్టుటే జననమనబడును. కాబట్టి జీవునికి కర్మానుసారముగా స్థూలశరీరములు వచ్చుచు పోవుచుండును. ఐతే సూక్ష్మశరీరముమాత్రము ఒక్కశరీరమేగాని యనేకములు లేవు. కాబట్టి శ్రద్ధగా తన్నుతావిచారించినయెడల జీవుడు సదా సూక్ష్మశరీరమును యెడబాయక జననమరణప్రవాహరూపమగు సంసారసముద్రమునందు మునుగుచుం

డును. కావున ఆసూక్ష్మశరీరమును యెడబాయక దానితో గూడియుండును. కావున జీవునికి సూక్ష్మశరీరమే సహజముగానుండును గాని స్థూలశరీరము సహజముగాదు. కావున, ఈసూక్ష్మశరీరము అగ్నిలో కాలదు. ఆయుధములచే ఖండింపదు. జలముచే చెమ్మగించదు. వాయువుచే చెలించదు. ఈసూక్ష్మశరీరము మహాప్రళయకాలములయందున్ను నశింపదు. ఐతే ఈసూక్ష్మశరీరము దీనికి కారణమైన యజ్ఞానమనెడి కారణశరీరము యెందాకనశింపకుండునో అందాకనశింపకుండును. కారణశరీరమనగా అజ్ఞానము జ్ఞానాగ్నివలన నశించిన యెడల తోడనే సూక్ష్మదేహము తనకుతానే నశించును. అట్లు సూక్ష్మశరీరము నశించినతోడనే జీవుడు జననమరణసాగరంబునుదాటి ముక్తినిపొందును. కాబట్టి లింగదేహభంగమే అనగా సూక్ష్మశరీరనాశనమే ముక్తనిపొందుటకు కారణముగానున్నది.

ధర్మనోపనిషత్తు-ఒకటవఖండము.

సర్వంసత్త్వం పరంబ్రహ్మనచాన్యదితియామతిః । తచ్చసత్యంపరం ప్రోక్తం వేదాన్తజ్ఞానపారగైః॥

నాల్గవఖండము.

విభేదజనకేజ్ఞానెనష్టేజ్ఞానబలాన్మనె । ఆత్మనోబ్రహ్మణోభేదమసన్తం కరిష్యతి॥

ఆరవఖండము.

ఊర్ధ్వరేతం విరూపాక్షం । విశ్వరూపం మహేశ్వరం । సోహమిత్యాదరేణైవధ్యాయేద్యోగీశ్వరేశ్వరం । ఆత్మానం సచ్చిదానందం అనంతమవ్రిత అమస్మీత్యభిధ్యాయేత్ । ధ్యేయాతీతంవిముక్తయే॥

పదియవఖండము.

తస్మాదద్వైతమేవాస్తినప్రపంచోనసంసృతిః । యథాకాశోఘటాకాశో మఠాకాశఇతీరితః । తథాభ్రాన్తైర్ద్విధాప్రోక్తోహ్యాత్మాజీవేశ్వరాత్మన నాహందేహోనచప్రాణోనేంద్రియాణిమనోనహి సదాసాక్షిస్వరూపత్వాచ్ఛివఏవాస్మికేవలః । ఇతిధీర్యామునిశ్రేష్ఠా । సాసమాధిరిహోచ్యతే । సోహం బ్రహ్మనసంసారీనమత్తోన్యఃకదాచన, యథాఫేనతరంగాది సముద్రాదుత్థితంపునః । సముద్రేలీయతేతద్వజగన్మయ్యనులీయతే । తస్మాన్మనఃపృథఙ్నాస్తిహి । జగన్మాయాచనాస్తిహి యథాసర్వాణిభూతాని । స్వాత్మన్యేవహిప

స్యతిఏకీభూతఃపరేణాసౌతథాభవతికేవలం । యథాపశ్యతిచాత్మానం కేవలం పరమార్థతః । మాయామాత్రంజగత్కృత్స్నందథాభవదినివృత్తిః॥

తారసారోపనిషత్తు.

ఓమ్ యోహవై శ్రీపరమాత్మానారాయణఃస్సభగవాన్తత్పరః । పరమపురుషః । పురాణపురుషోత్తమోనిత్యశుద్ధబుద్ధముక్తసత్యపరమానందానన్తాద్వయపరిపూర్ణః । బ్రహ్మైవాహంరామోస్మి॥

పంచబ్రహ్మోపనిషత్తు.

ఏకేనైవతుపిండేన మృత్తికాయాశ్చగౌతమ । విజ్ఞాతంమృణ్మయంసర్వం మృదభిన్నంహికార్యకం । ఏకేనలోహమణినాసర్వంలోహమయంయథా । విజ్ఞాతంస్యాదథైకేనన ఖానాంకృన్తనేనచ । సర్వంకార్ష్ణాయసంజ్ఞాతం తదభిన్నంస్వభావతః॥ కారణాద్భిన్నరూపేణకార్యంకారణమేవహి । తద్రూపేణసదాసత్యంభేదేనోక్తిర్మృషాఖలు । తచ్చకారణంహి నభిన్నంనోభయాత్మకం భేదస్సర్వత్రమిథ్యైవ । ధర్మాదేవనిరూపణాత్ । అతశ్చకారణంనిత్యమేకమేవాద్వయంఖలు అత్రకారణమద్వైతం । శుద్ధచైతన్యమేవహి॥ ఇత్యాద్యుపనిషత్ ప్రమాణాబులు చెప్పుచున్నవి.

నిర్గుణసగుణ-శుద్ధనిర్గుణతత్వములగురించి వ్రాయుచున్నారు.

అయితే సూక్ష్మశరీరము దీనికి కారణమగును. అజ్ఞానమనెడి కారణదేహము నశించనియెడల నశింపదు. అయితే అజ్ఞానమనెడి కారణశరీరము జ్ఞానాగ్నివలన నశించునుగాని తక్కినదానివలన నశింపదు. కాబట్టి ఒక్కొక్కమనుష్యుడున్ను తనకుగలిగియుండు అజ్ఞానమనెడి కారణశరీరమున్ను సూక్ష్మశరీరమున్ను నశించి తాను ముక్తిపొందుటకుగాను ముఖ్యముగ ప్రయత్నపడి బ్రహ్మజ్ఞానమును సంపాదింపవలయును. కాబట్టి ॥శృతి॥ పాకస్యవహ్నివద్జ్ఞానంవినా మోక్షోనైవసిధ్యతే॥ అన్నట్లుబ్రహ్మజ్ఞానము లభింపనియెడల యెంతటివారికన్ని మోక్షము లభింపదు. కావున, అయితే బ్రహ్మజ్ఞానమనగ యెట్టిదనిన జీవుడువేరు, పరమాత్మవేరని భావించుట. అద్వైతము, భేదజ్ఞానమనియు చెప్పబడును. ఇట్టిభేదజ్ఞానమువలన జీవునికి జననమరణములుగలిగి దుఃఖించుచుండును. అయితే జీవస్వరూపియగునేను దేహేంద్రియములకు వేరుగానున్నాను గాన, దేహేంద్రియములు నేనుగాను. మరియు, జీవస్వరూపియగు నను పరమాత్మయొక్క అంశగానున్నాను గాన, నేనే పరమాత్మ పరమా

త్మయేనేను అని తెలిసి యెల్లప్పుడు యభేదముగా జీవబ్రహ్మైక్యానుసంధానము చేయుచుండుటే అద్వైతమనియు, బ్రహ్మజ్ఞానమనియు చెప్పబడును. కాబట్టి యిట్టి అభేద అద్వైత బ్రహ్మజ్ఞానమువల్లనే జననమరణరహితమైన మోక్షం అనగా జీవబ్రహ్మైక్యము సిద్ధించును. కాబట్టి జీవుడే బ్రహ్మమని తెలియనివారికి యెన్నటికిని మోక్షముగలుగజాలదు. కాబట్టి కేవల కుంభక ప్రాణాయామయోగ పంచముద్రాభ్యాసముచేతను సాంఖ్యతత్వవిచారణచేతను జపతపవ్రతదానయాగాదికర్మానుష్ఠానముచేతను వ్యాకరణ చందస్సు జ్యోతిష్యము మొదలైన అరువదినాలుగువిద్యలచేతను మోక్షము సిద్ధింపదు. అయితే నేనే బ్రహ్మము బ్రహ్మమే నేను యని భావించి యెల్లప్పుడు జీవబ్రహ్మైక్యాను సంధానమును చేయుచుండుట వల్లనే మోక్షముసిద్ధించును. లోకములో విద్యలు యెన్ని నేర్చినను ఫలములేదు. మోక్షములభింపదు. అయితే జీవుడేబ్రహ్మము బ్రహ్మమేజీవుడని తెలసి యెల్లప్పుడు జీవబ్రహ్మైక్యానుసంధానమనెడి బ్రహ్మవిద్యను అభ్యసించి తానుతానై తానుబ్రహ్మస్వరూపుడై యుండుటవల్లనే మోక్షములభించును. కాబట్టి యిట్టిసద్రూప మగు బ్రహ్మమే ఆత్మయనబడుచున్నది. అనునట్లు యేదిసకలవస్తులయందు వ్యాపించి తనకు రెండవదిలేక సర్వముతానై యున్నదో అదే ఆత్మయనబడును. మరియు ఒకదేశమందున్నది ఒకదేశమందులేదు ఒకవస్తువయందున్నది ఒకవస్తువయందు లేదనియు, ఒక కాలమందున్నది ఒక కాలమందులేదనియు చెప్పబడక యేది సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందు యున్నదో అది పరిపూర్ణముగా వ్యాపించి తనకు రెండవదిలేక సర్వము తానైయున్నదో, అదే బ్రహ్మమనబడును. బ్రహ్మము, ఆత్మయను శబ్దంబులుమాత్రమే భేదములుగానున్నవి. కాని, యీరెండుశబ్దంబులకు అర్థములు ఒకవస్తువుననే తెలియజేయుచున్నవి గాన, బ్రహ్మమే ఆత్మయనబడును.

అట్టిపరబ్రహ్మమగు ఆత్మయొక్కటియేమాయావిద్యోపాధులవలనపరమాత్మయనియు, ప్రత్యగాత్మయనియు రెండువిధములుగా చెప్పబడుచున్నది గాని, ఉపాధినివిడచి చూచినయెడల పరమాత్మ ప్రత్యగాత్మ భేదములేక సర్వము యేకాత్మస్వరూపముగానే యున్నది. కాబట్టి ఆత్మయే పరబ్రహ్మమనబడును. పరబ్రహ్మమే యాత్మయనబడును. పరబ్రహ్మమగు ఆత్మకంటెను యితరములైన వస్తువులన్నియు అనాత్మయనియు చెప్పబడును. అట్టి అనాత్మ

యగు వస్తువులన్నియు పరబ్రహ్మమగు ఆత్మయందుత్పత్తియగుచు మరల ఆత్మయందే లయించుచుండును. కాన, పరబ్రహ్మమగు ఆత్మనాశనములేనిదని యు, సత్యమైనదనియు, అనాత్మవస్తువులు నశించునట్టివనియును చెప్పబడును. శృతి। అనాత్మదృష్టె అవివేకనిద్రాఅహంమను స్వప్నగతింగతోహం। అనగా కలలోతోచిన శరీరములు యేలాగో ఆలాగే అనిత్యమగును. కాబట్టి దేహేం ద్రియములు నేనుగాను. జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, మనోబుద్ధి చిత్తాహంకారములు, పంచప్రాణములు నేనుగాను. నేను ప్రాణములేనివాడను మనస్సులేనివాడను బుద్ధిమొదలగువానికంటె విలక్షణమైనవాడను పరిశుద్ధుడ ను దేహేంద్రియాదులకు సాక్షిగానున్నాను.

వేదాంతంబులనే యుపనిషత్తులచేత దెలియదగిన పరబ్రహ్మము నేనే. వేదశృతి। అహంబ్రహ్మాస్మి। ఆకాశము, వాయువు మొదలగు పంచభూతము లుకీతిగాను, పంచభూతమయంబగు ప్రపంచంబుకీతిగాను దృశ్యవస్తువును నేనుగాను, రూపము నేగాను, నామము నేగాను, కర్మ నేగాను, నేనురూప నామక్రియలు లేనివాడను. నేను సచ్చిదానంద పరబ్రహ్మను. ఇట్లుభావిం చు ఆత్మను సంధానముపొందువాడె బ్రహ్మజ్ఞాని యని చెప్పబడును. పై చెప్పబడినట్లు బ్రహ్మమే ఆత్మయనియు అట్టి ఆత్మయే తాననియు తానే సర్వమనియు తనకన్యమేమియు లేదనియు తా తెలసి సంకల్పరహితుడై సదా ననుసంధానముజేయునట్టి బ్రహ్మజ్ఞాని తనకు యేకోరికలు లేనివాడుగావున ఆత్మనిష్ఠను తప్ప బ్రహ్మరుద్రేంద్రాది దేవతులును ఉపాసింపజాలరు. వారు ఐశ్వర్యములను కోరజాలరు. వారువరప్రసాదులను గోరి అన్నపానాదులను విడచి దేహమును కష్టపెట్టి జీవాత్మను పీడించి ఉగ్రమైన తపస్సులను చేయ జాలరు. అనగా బ్రహ్మనిష్ఠాగరిష్ఠులై నిర్బీజసమాధి నిష్ఠాగరిష్ఠులై యుందు రుగాబట్టి తన్నుతా దెలియుట ముఖ్యమైన మోక్షసాధనమని యిట్లుపనిషత్సా రములు ఘోషించుచున్నవి.

## గోపాలతాపిన్యోపనిషత్.

పరంబ్రహ్మకృష్ణాత్మకో. నిత్యానందైకస్వరూపా, సోహమోంతత్సత్ గోపాలోహమేవపరం సత్యమభాధితం, సోహమిత్యానమాదాయమనసైక్యం కుర్యాదాత్మానం గోపాలోహమితిభావయేత్॥

## యాజ్ఞవల్క్యోపనిషత్.

ప్రణమేత్కుంతథాత్మజ్ఞో న కార్యం కర్మణా తథా, ఈశ్వరో జీవకలయా ప్రవిష్టో భగవానితి, ప్రణమేద్దండవద్భూమావాశ్వచండాలగోఖరమ్॥

## వరాహోపనిషత్ - రెండవఅధ్యాయము.

స్వపూర్ణాత్మాతిరేకేణ జగజ్జీవేశ్వరాదయః న సన్తి నాస్తి మాయా చ తేభ్యశ్చాహం విలక్షణః అజ్ఞానం తమోరూపం కర్మధర్మాదిలక్షణం స్వయంప్రకాశమాత్మానం నైవ మాం స్ప్రష్టుమర్హతి సర్వసాక్షిణమాత్మానం వర్ణాశ్రమవివర్జితం బ్రహ్మరూపతయా పశ్యన్ బ్రహ్మైవ భవతి స్వయం భాసమానమిదం సర్వం భానరూపం పరం పదం పశ్యన్ వేదాన్తమానేన సద్య ఏవ విముచ్యతే చిన్మాత్రం సర్వగం నిత్యం సంపూర్ణం సుఖమద్వయం సాక్షాద్బ్రహ్మైవ నాన్యోఽస్తీత్యేవం బ్రహ్మవిదాం స్థితిః॥ సన్స్వరూపం తు చిన్మాత్రం సర్వదా సర్వదేహినాం నైవ దేహాదిసంఘాతో ఘటవద్దృశిగోచరః స్వాత్మనోఽన్యత్తథాభాతం చరాచరమిదం జగత్ స్వాత్మమాత్రతయా బుద్ధ్వా తదస్మీతి విభావయ స్వస్వరూపం స్వయం భుఙ్క్తే నాస్తి భోజ్యం పృథక్స్వతః అస్తి చేదస్తితారూపం బ్రహ్మైవాస్తిత్వలక్షణం బ్రహ్మవిజ్ఞానసంపన్నః ప్రతీతమఖిలం జగత్॥ పశ్యన్నపి సదా నైవ పశ్యతి స్వాత్మనః పృథక్ అహం బ్రహ్మేతి చేద్వేద సాక్షాత్కారస్స ఉచ్యతే యస్మిన్కాలే స్వమాత్మానం యోగీ జానాతి కేవలం తస్మాత్కాలాత్సమారభ్య జీవన్ముక్తో భవత్యసౌ॥ అహం బ్రహ్మేతి నియతం మోక్షహేతుర్మహాత్మనాం ఘటాకాశమఠాకాశౌ మహాకాశే ప్రతిష్ఠితౌ ఏవం మయి చిదాకాశే జీవేశౌ పరికల్పితౌ యా చ ప్రాగాత్మనో మాయా తథాన్తే చ తిరస్కృతా బ్రహ్మవాదిభిరుద్గీతా సా మాయేతి వివేకతః మాయాతత్కార్యవిలయే నేశ్వరత్వం న జీవతా బ్రహ్మత్వే యోజితే స్వస్మిన్ జీవభావో న గచ్ఛతి అద్వైతే బోధితే తత్త్వే వాసనా వినివర్తతే ఆరబ్ధాంతే దేహహానిః మాయేత్యక్షీయతే ఖిలా అస్తీత్యుక్తే జగత్సర్వం సద్రూపం బ్రహ్మ తద్భవేత్ భాతీత్యుక్తే జగత్సర్వం భానం బ్రహ్మైవ కేవలం మరుభూమౌ జలం సర్వం మరుభూమాత్రమేవ తత్ జగత్త్రయమిదం సర్వం చిన్మాత్రం స్వవిచారతః అజ్ఞానమేవ న కుతో జగతః॥ ప్రసంగో జీవేశదేశికవికల్పకథాతిదూరే ఏకాన్తకేవలచిదేకరసస్వభావే బ్రహ్మైవ కేవలమహం పరిపూర్ణమస్మి॥

బ్రహ్మము సర్వత్రనిండియున్నదని యుపనిషత్తులు చెప్పుచున్నవి. సత్య
జ్ఞానందమనుటవలన, సత్యమును, జ్ఞానమును, ఆనందమును అని బ్రహ్మము
నకు మూడుస్వరూపములున్నవే యంటే అట్లుకాదు. అగ్నిలోహితోష్ణప్ర
కాశము అనగ ఎఱ్ఱనిది, వేడిది, వెలుతురయినది అనుటవలన యెఱుపు వేరు
గా వేడిమి వేరుగ వెలుతురు వేరుగ ఇట్లు మూడుస్వరూపములు అగ్నికిలేవు.
ఇవిఅన్నియు అగ్నినే యెట్లుతెలియజేయునో నట్లు ।సత్॥ అనగ ననృతముగా
నిది॥ చిత్॥ అనగ జగడముకానిది. ఆనందమనగ దుఃఖముకానిదనియున్నది.
మూడుకానిది బ్రహ్మమే. అనాత్మవస్తువును నిషేధించెడి ॥శృతి। నేతి నేతీతి
నేతీ, శేషితంపూర్ణముచ్ఛతే' యనునట్లు ఇదికాదు ఇదికాదనెడివాక్యములనను
గురూపదేశపూర్వకముగా వేదాంతవిచారణచేయుటవలన అఖండానందమును
ఏకమైయున్నదే బ్రహ్మమని తెలిసికొనవలయును. కాబట్టి చతుర్ముఖబ్ర
హ్మములయొక్క విషయసుఖములు, నిరతిశయసుఖములుగా శాస్త్రముల
యందు చెప్పంబడుచున్నవేయని ఆలోచించిన, అవియన్నియు లోకమందు
ధనధాన్యాదులయందు సంపన్నుండైయున్న యొక గృహస్తుని మహారాజని
చెప్పునటులనలె నొపచారికలగుటచేత, బ్రహ్మాదులు జననమరణరహితమై
నిరతిశయసుఖములు కానేరవని చెప్పుచున్నారు. కాబట్టి బ్రహ్మాదులు పర
మాత్మయొక్క హంశస్వరూపులుగనుక వారిఆనందములు పరమాత్మయొక్క
ఆనందమనె హంశములోనివెగాని, నిరతిశయానందము గానేరవు. కాబట్టి దృ
శ్యప్రపంచభ్రమయనె చిదాభాసుడు జీవాత్మయనే భ్రమను అధిష్ఠానమైన
పరమాత్మయందే కలిగినవిగనుక పరమాత్మకంటె నితరములేదు. కాబట్టి
తనకన్నా అన్యములేదని సత్యమైన బ్రహ్మమేతానని తెలియవలెను. కాబట్టి
ఏది అణుప్రమాణముగలదికానిదో, స్థూలపరిణామముగానిదో, పొట్టిదిఅయి
నదికానిదో, పొడవైనదికానిదియో, జన్మవికారములేనిదో, మరణమునాశము
వికారములేనిదో రూపము, సుగుణదుర్గుణములు, తెలుపుమొదలగు రంగు
లు జీవేశ్వరాదినామములులేనిదో, ఆవస్తుపరబ్రహ్మమని దృఢముగా తా తెలి
సికొనవలయును. సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు, మాణిక్యము, దీపము
మొదలగు ప్రకాశములన్నియు నేయాత్మప్రకాశమువలన ప్రత్యేకప్రత్యేక
ముగా దెలియబడి ప్రకాశించుచున్నదో తనచేత ప్రకాశింపజేయబడుటకు
యోగ్యమైయున్న సూర్యాదులచేత ఇదియే ఆత్మవస్తువని తెలియబడునట్టిదేది

ప్రకాశింపబడదో, సూర్యాదిప్రకాశవస్తువులను ప్రకాశింపజేయు నేత్రేంద్రి యమును, తత్ప్రవృత్తికి ముఖ్యసాధనమగు మనస్సును ఇదిమొదలగు బా హ్యాంతరప్రపంచములయియున్న సకలవస్తువులను ఏఆత్మవలన ప్రకాశించు చున్నదో అదియే బ్రహ్మమని, జ్ఞానినిశ్చయముగా తానుదెలిసికొనవలయును. శృతి॥ స్వయమంతర్బహిర్వ్యాప్త్య భాసయన్నఖిలంజగత్॥ బ్రహ్మప్రకాశతే వహ్నిప్రతప్తాసపిండవత్॥ అగ్నియినపముద్దను బాగుగ గాల్చి తానులోను వెలుపలను వ్యాపించియుండి, యాయినుపముద్దను ప్రకాశింపజేయుచు తాను ప్రకాశించునో నట్లు పరమాత్మ సమస్తమైన దృశ్యప్రపంచమునందును లోప లను, వెలుపలను వ్యాపించినట్లు ప్రపంచమును ప్రకాశింపజేయుచు తనకు దానుగూడ మరియొక ప్రకాశవస్తువుయొక్క యపేక్షలేక ప్రకాశించుచుం డును. బ్రహ్మసత్యమైన పరమాత్మ మిధ్యయైన జగత్తుకన్న వేరైనది. బ్ర హ్మసత్యం జగత్తుమిధ్యాయను వేదప్రమాణముబట్టి కాబట్టి సత్యమైనబ్ర హ్మముకన్న మరియొకటి సత్యమైన వస్తువు ఏదియులేదు. వ్యవహారదశయం దు బ్రహ్మముకన్న వేరైన సర్వమును సత్యమువలె నజ్ఞానికి తోచినయెడల, నీరులేనిప్రదేశమందు నీరువలెగనబడు నెండమావు లేప్రకారము భ్రమపడిన వాని సమీపించి విచారణచేసినపిమ్మట అసత్యమగునో ఆప్రకారముగా జగ త్తుయొక్క అసత్యత్వవిచారణగల బ్రహ్మజ్ఞానికి అసత్యమగును. ఏదేదిచూ డబడుచున్నదో వినబడుచున్నదో అట్టిబాహ్యంతరింద్రియములను వాటితో జేరిన విషయప్రపంచమును పరమాత్మకంటె వేరైనది ఏమియు అణుమా త్రమైనను లేదు. ఇటగాక సర్వప్రపంచభ్రమాధిష్ఠానమైనయట్టి పరమాత్మ తత్త్వవిచారణరూపమైన యనుభవముచేత సచ్చిదానందస్వరూపముగను, ఏ కముగను తానుగానే అనుభవశాలికి తెలియబడును. తన్నుతాదెలియబడు ను గాబట్టి దృశ్యప్రపంచమంతయు మిధ్య, పరబ్రహ్మమొక్కటియే సత్యమ ని గురూపదేశమువలన తన్నుతాదెలిసికొని ఇట్టిసంగతిని బరిశీలించి నిశ్చయిం చుకొను తత్త్వానుభవశాలి జ్ఞానమనదృష్టిచేత సర్వవ్యాపియై సచ్చిదానంద స్వరూపిణియైయున్న ఆత్మ తానేయని తెలిసికొనును గాని దృశ్యప్రపంచ మంతయు స్థిరమనే యభిప్రాయముతో బ్రహ్మస్వరూపవిచారముతో నేత్ర ములేని పామరుడు, గుడ్డివాడు సూర్యుని చూడలేనట్లు బ్రహ్మస్వరూపమును దర్శించలేడు. అనగ తన్నుదా దెలియలేడు గాబట్టి నిత్యముక్తబుద్ధశుద్ధపరి

పూర్ణానందపరబ్రహ్మవస్తువును విషయాకరించు తాత్పర్యముతోజేయబడిన శ్రవణాదులచేత లెస్సగానె ప్రకాశింపజేయబడిన యఖండాకారవృత్తి జ్ఞానమనెడి అగ్నిచేత జక్కఁగా దహింపంబడిన పరిశోధింపంబడినది. చిదాభాసుడు, సత్వరజస్తమోగుణములతో గూడిన సంసారమునకు హేతువైనయజ్ఞానము విడువబడినవాడై బాగుగ ప్రజ్వలింపంజేయబడిన అగ్నియందు ఘృతము వేయబడి మాలిన్యమంతయు బోవుటవలన తనకు తాస్వయంప్రకాశమానమై పరిపూర్ణమై అచలమై బ్రహ్మమై అంతటా వ్యాపించి లోపల వెలుపల వ్యాపించి నిండియున్న బ్రహ్మమే తానై యున్నది.

వరాహోపనిషత్తు-మూడవ అధ్యాయము.

నహినానాస్వరూపంశ్యాదేకంవస్తుకదాచన । తస్మాదఖండం ఏవాస్తి యన్నదన్ననకించన, దృశ్యతే, శ్రూయతేయత్తద్బ్రహ్మణోన్యన్నతద్భవేత్ । నిత్యశుద్ధవిముక్తైకమఖండానందమద్వయం సత్యంజ్ఞానమనన్తంయత్పరంబ్రహ్మమేవతత్ ॥

హయగ్రీవోపనిషత్తు.

ప్రజ్ఞానంబ్రహ్మ అహంబ్రహ్మాస్మి తత్వమసి అయమాత్మాన్తర్యామ్యమృతః॥ అహంబ్రహ్మాస్మీతి మహావాక్యైప్రతిపాదితమర్థంతప తేమన్త్రాప్రతిపాదయన్తి॥

సరస్వతీరహస్యోపనిషత్తు.

మయిజీవత్వమీశత్వం కల్పితంవస్తుతః నహి ఇతియస్తువిజానాతి సముక్తోనాత్రసంశయః॥

బృహదోపనిషత్తు.

ప్రజ్ఞానంబ్రహ్మేతివా అహంబ్రహ్మాస్మీతివా భాష్యతే అయమాత్మాబ్రహ్మైవాతివా బ్రహ్మైవాహమస్మీతివా యోహమస్మీతివా వాసోహమస్మీతి వాయోసౌసోహమితివాయాభాష్యతేసైషాషోడసీ శ్రీవిద్యాపంచదశాక్షరీః॥

ముక్తికోపనిషత్తు-రెండవ అధ్యాయము.

అశక్యమవ్యం ప్రయత్నేనమారుతేజ్యోతిరాన్తరం దర్శనాధర్శనేహిత్వా స్వయంకేవలరూపతః యఆస్తేకపిశార్దూలబ్రహ్మణి బ్రహ్మవిత్స్వయమ్॥

ఇదివరకు నుదహరింపబడిన యుపనిషత్తువాక్యములయం దద్వైత

ప్రతిపాదనమునకు సాధనముగ అనేకవాక్యములుండినను గ్రంథబాహుళ్యమగు ననుతలంపుతో పైన నుదహరింపబడిన శృతివాక్యములుమాత్రి మిచ్చట నుదహరింపబడినవి. కావున, జీవేశ్వర జగత్తు మొదలగునవి కల్పితములనియు బ్రహ్మమే సత్యమనియు అట్టిబ్రహ్మమునకు రూపాదికము లేదనియు చెప్పంబడినను ॥శృతి॥ ఆదివర్ణమ్ సువర్ణజ్యోతి మొదలగు శృతులచేత బ్రహ్మమునకు రూపము చెప్పబడుచున్నదే యనిన—నందుకు సమాధానము అట్టిశృతి వాక్యములు బ్రహ్మమునకు అంధకారత్వము లేదని తెలుసుకొనుటకై పుట్టిన వియేగాని రూపమును దెలియజేయుటకై గావని గ్రహించునది. ॥శృతి॥ ఉమాసహాయం పరమేశ్వరం నీలకంఠం । ప్రశాన్తమ్ । యను నీమొదలగు శృతివాక్యములు రుద్రాదిరూపములను జెప్పుచున్నవే యంట యిట్టివాక్యములు వ్యవహారదశయందుండు పామరులను రక్షించుటకొరకై సగుణబ్రహ్మోపాసనయందు మనస్సు స్థిరపడినగాని నిర్గుణబ్రహ్మోపాసనయందు దగిలి యుండదనితలచి అభ్యాసదశయందుండువారు అభివృద్ధినిబొంది నిర్గుణోపాసన జేయుటకు గుదరదనుతలంపుతో ఈశ్వరాదిరూపములను తెలియజేయుచున్నవని దెలసికొనవలసినది. ఈయర్థము నే పంచ్ఞ్రిండవ అధ్యాయమున ననేకస్థలములయందు జెప్పబడియున్నది. నిర్గుణోపాసన నందరికిని నసాధ్యముగనుక చిత్తముయొక్క నిలుకడకై సగుణోపాసనను శృతులు విధించినవి. సగుణోపాసనయందు నిశ్చలతనుబొందినవాడే నిర్గుణోపాసనకు దగును. పైచెప్పబడిన ఈశ్వరాదులవలె రూపములేని బ్రహ్మవస్తువును దెలసికొనుట యెట్లు? తెలిసికొనినప్రకారము ధ్యానించుట యెట్లనిన వినుము. బ్రహ్మజ్ఞానమనునది బ్రహ్మముయొక్క నాకారమును, రూపములను దెలసికొనుటగాదు. మరియు బ్రహ్మస్వరూపానుభవమే. ఆకారమనగా పొడుగు పొట్టి మొదలగునవి. రూపమనగా నలుపు, తెలుపు మొదలగునవి. మార్పులనుబొందక యేకరీతి గానుండునది. ఆకారము రూపముపొందదగినది. స్వరూపమో, మార్పును పొందనే పొందదు. ఎట్లనిన, జలాకారమే స్థానమున్నచోటునుబట్టి యాకారము పెద్దది చిన్నదని వ్యవహరింపబడును.

అయినను జలస్వరూపముమాత్రము మార్పునుబొందదు. స్థలము భూసంబంధము మొదలగు నుపాధులనుంచి విభజించి చూచు నెడల యెట్లుమార్పుండదో, అట్లే బ్రహ్మస్వరూపము స్వతస్సిద్ధముగా మార్పు లేదని యెరుంగుము,

బ్రహ్మస్వరూప మెట్టిదియనగా నిర్మలతత్త్వమును సద్గురూపదేశమువలన బొంది ప్రపంచవిషయములను మరచి గురూపదేశప్రకార మెడతెగక ధ్యానించుటయే బ్రహ్మనిష్ఠ. సామాన్యముగా యీనిష్ఠ యందరిచేతను బొందుట యశక్యము. ఏలననగా ప్రపంచమందుండువారెల్లను విషయజ్ఞానమును, తదాసక్తియును గలిగియుండుటయే కారణము. అందువలన దేహమే యాత్మయనియును, ఇంద్రియములే యాత్మయనియును, ప్రాణమే యాత్మయనియును మనమే యాత్మయనియు, విజ్ఞానమే యాత్మయనియు, అవ్యాకృతమే యాత్మయనియు ఇట్లు పలువిధములుగా నజ్ఞానముచే నిజమును దెలిసికొనలేక విపరీతజ్ఞానముగలవారై విషయాసక్తిగలిగియుందురు. ఇట్లు చెప్పబడినవారు జ్ఞానాధికారులుగారు. కావున జ్ఞానాధికారియగువాడు ॥గీతాభాష్యే॥ ప్రభుః- ఆత్మదేహీ, లోకస్య- దేవమనుష్య పశుపక్షిస్థావరాదిరూపములైనదియు, ప్రకృతిసంబంధముతోగూడుకొనునదియు నగు యీలోకమునకు వానివానికి ప్రత్యేకప్రత్యేకమున కర్తృత్వముగలుగజేయడు. వానివానికి ప్రత్యేకప్రత్యేక కర్మములయందును దుల్యములేకదా. ఎట్లనిన ఒకయవస్థయందుండునప్పుడు రెండవది మిథ్యవలెదోచుచుండును. అను నీమొదలగు శ్రుతులవలన జాగ్రత్స్వప్నావస్థలు మిథ్యలను హాంశములో సమానములనియే ఘోషింపబడుచున్నవి. తనస్వరూపముచేతనే మిథ్యయగునట్టి జాగ్రదవస్థ మనోరథరూపమున నసత్యమగుటకు యేమిసంశయముగలదు. జగద్గురువైన శ్రీకృష్ణస్వామి యుద్ధవునకు నుద్ధరించి దెలియజేసెను. అట్టిమనోరథము సంభావితమనియు, అసంభావితమనియు రెండుతెరంగులుగలది. అందు ప్రతిదినము తటస్థముగునుండు అన్నపానాదివిషయములు ననుభవించుటకుగలుగు మనోరథము, సంభావితము యనబడును. రాజ్యప్రాప్తి మొదలగు సకలభోగములచే మనస్సును రంజింపజేయుట అసంభావితము యనబడును. ఇట్టిమనోరథము మిథ్యయని యెరింగియు మనోరథపరంపరలను వృద్ధిచేసుకొనుచుండును. అవి లేకున్నప్పటికి నీసంసారసముద్రమును దాటలేరనుట ఈసంశయమునుగూర్చి వుపనిషద్భాష్యములు గీతాశాస్త్రము ఘోషించుచున్నవి.

భాష్యే' ఆత్మసంభావితాః॥ తాము సమస్తమైనగుణములతోగూడిన వాండ్రైనట్లు తమ్మందామే గారవించువారును, ॥స్తబ్ధాః॥ పెద్దలయెడల మర్యాదలేనివారును, పెద్దలను నిరాకరించువారును, ॥ధనమానమదాన్వితాః। ధన

ముకలదను దురభిమానముతోను, ధనముగలుగుటవలన మదముతోనుగూడి నవారును. ॥అహంకారమ్॥ వున్నవి లేనివియు నగుగుణములను తమయందు ఆరోపించుకొని అవియన్నియు గలవారము మే మనితలంచుట యనెడు అహంకారముగలవారు. వీరలే అసురులు. వారల యభిప్రాయము లెట్లనిన, గోభూహిరణ్యాదికము నగునీద్రవ్యము నాకు సంప్రాప్తమైనదనే అహంకారముగలను. నాకోర్కెల నీడేర్చుకొనియెద. మనస్సునకు సంతోషకరమగు నింతద్రవ్యము నావద్దనున్నది. మరియు నేకసంవత్సరములో యింకాధనము సంపాదించుకొనియెదననే అహంకారము. నాయంతధనికుడు యెచ్చటనులేడని ప్రసిద్ధిబొందెదను యనేడి అసంభావన. కావున, యితరులచేత జయింపబడని యిట్టిబలశాలియగు శత్రువును జయించితిని, దుర్బలులను నితరశత్రువులనుగూడ తలంచినంతనే చంపగలను, యెన్నవిధములచేజూచినను నాకు సమానుడీలోకమునందు గలడా? నేనే సర్వమునకు సమర్థుడను. సమస్తవిధములైనవి ననుభవించువాడను నేనే. పుత్రపౌత్రాదిసంతాన సమృద్ధిగలవాడను. నేను యితరులవలె సామాన్యపు మనుష్యుడనుగాను. మరేమనిన, శరీరమనోదారుఢ్యముగలవాడను. రోగములులేక సకలసుఖములుగలవాడను. అన్యులు నావలె బుట్టినవారలుగారు. భూభారముకొరకు పుట్టినవాడను అని తలంచుచుండును. పామరుడు యిట్లు యనుకొనుచుండును. ఉత్కృష్టమైనకులమున బుట్టినవాడను; ఏడుతరములనుంచి శిష్టాచారముగల వంశమునందు బుట్టినవాడను అయివున్నాను. అన్నివిధములయందును నాతో సమానుడులేడనె దురభిమానాసంభావనమైనవాడు యితరుడు యెవ్వడున్నాడు నేనే యజ్ఞముజేసెదను. నేను యత్యుత్కమైన యాగమును జేసెదను. నావలె యజ్ఞములు, యాగములు, దానములు, జేసినవాడులేడు. చేయువారల యవమానపరచెదను. నన్ను పొగడినవారలను ధనమునిచ్చి సంతోషపరచెదను. అని యీవిధముగా యవివేకులై మోహితులైనవారు, యనేకవిధములైన చాంచల్యములలోగూడిన మనస్సుచేత భ్రమనుబొందినవారును, దారాపుత్రపౌత్రధన వాహన క్షేత్రాదులయందు అభిమాన మనెడివలచేత జిక్కబడినవారున్ను, విషయభోగములయందు అధికమైన యాశచేత తగులుకొన్నవారును యగుచు అపరిశుద్ధమైన నరకమందు పడుచున్నారు. కావున, ॥శ్రుతి॥ అసతః- లేనిదానికి, భావః- కలిమి, నవిద్యతే- లేదు, సతః- కలదానికి, అభావః- లేమి,

నవిద్యతె- లేదు, అనయోః యుభయోః అపి- యీరెంటియొక్కయు, అస్తస్తు- నిశ్చయమన్ననో, తత్వదర్శిభిః- జ్ఞానులచేత, దృష్టః- తెలిసికొనబడినది. ఎట్లనిన, ఏది ఉన్నదని యనుకొనినపిమ్మట లేనిదిగదోచునో యది అసత్తు. ఏదియున్నది ఉన్నట్లేయుండునో అదిసత్తు. ఎట్లనగా, కుండగలదు, చట్టిగలదు గూనకలదు, అభిన్నముగా చెప్పినప్పుడు, కుండ, చట్టి, గూన, అను మున్నా ములయందును కలదు అనువాచ్యమున్నది. ఐతే గూన, కుండ, చట్టి అను వ్యవహారమునకు యెప్పుడైనను నాశనముకలుగవచ్చును. అట్లు భంగముగలిగినచో పెంకులుగలవు యను వ్యవహారము (సంజ్ఞ) వచ్చును. అప్పుడు గలదనునదియున్నది. వానికిని భంగమువచ్చినయెడల మన్నుగలదు అను వ్యవహారమువచ్చును. అప్పుడును గలదనుటయున్నది. దానికిని భంగమువచ్చినప్పుడు అణువులుకలవను వ్యవహారమువచ్చును. అప్పుడు గలదు యనుమాటవచ్చును గనుక వస్తు వెన్నివికారములుబొందినను కలదు అను వ్యవహారముండును గాని లేకపోదు. ఇక మధ్యవచ్చిన కుండ, గూన, చట్టి, అను నీమొదలగు వ్యవహారములు మాత్రము పోవుచున్నవి. అవి మొదలే లేవు తుదకును లేకపోవును. కనుక కలదాని కెన్నటికిని, కలిమియును, లేనిదాని కెన్నటికిని లేమియును సిద్ధమగును. అట్లే వికారమైన జగత్తులేనిదే గాబట్టి శృతిః అనాత్మ దృష్టైః అవివేకనిద్రా అహంమను స్వప్నగతింగతోపి మ్

॥శృతి॥ అణిశూన్యాంబరశూన్యాసర్వాన్ నాస్తికేనలమ్ కాబట్టి యది అసత్తనమనబడును. అట్టి జగద్వికారమున కాశ్రయమై సత్యమైన బ్రహ్మము మాత్రమేకలదు. కాబట్టి ఆత్మా, నాత్మా ॥సదసత్॥ వివేకరూప మగుతత్వమును దెలసికొని నీవును మధ్యవచ్చు శీతోష్ణాదిద్వంద్వములు అసత్తులు, మరుమరీచికలవలె, యెండమావులయందునీటివలె, మిధ్యలని దెలసికొని అందు చేతగలుగు శోకమోహములుజెందక స్థిరచిత్తుడై యుండుము. కావున, తత్వవేత్తలనిసను, తత్వదర్శులనినను, బ్రహ్మజ్ఞాననిష్ఠుల కర్థము. ఎట్లనగా తత్వదర్శియను శబ్దమునకు అర్థము యెట్లనిన, తత్ యనునది సర్వనామశబ్దమంతయు బ్రహ్మస్వరూపము గనుక బ్రహ్మము తత్ అనిపేరు. తత్ అనుదానియొక్క యదార్థస్థితి తత్వ మనబడును.

అనగ బ్రహ్మముయొక్క యదార్థస్వరూపము దానిదెలసికొని నిశ్చలతగలవాడు తత్వదర్శియని చెప్పబడును.

శ్రుతి॥ ఇదంసర్వమ్॥ యీసకలప్రపంచమును ఏవస్తువుచేత యేబ్రహ్మముచేత వ్యాపింపంబడియున్నదో, యీవస్తువును నాశనములేనిదనియు, నాశనములేనిదానికే, నాశనముగలుగజేయుటకు యెవ్వఁడును అర్హుఁడుకాఁడు. భ్రమజన్యమైన దృశ్యప్రపంచమందంతట నిండియున్నదియు భ్రమాశ్రయమైనదియు నగు పరబ్రహ్మము తనకుదానే నశించు స్వభావముగలదిగాదు. లోకములో ప్రతిమనుష్యుఁడును ధనలాభాదికారణములచేత బలియునట్లును, ధనాధిహానిచే కృశించునదియును, వృద్ధిక్షయములు బొందనియట్టి సద్వస్తువు అన్యులచే నశింపఁజేయబడదగినదియుగాను ఆ సత్తయిన పరబ్రహ్మముయొక్కటియే యెల్లప్పుడును వృద్ధిక్షయనాశనములులేనిదియై స్వయంప్రకాశమై యుండును. కాబట్టి సూర్యుఁడు ప్రకాశించనప్పుడు సర్వవస్తువులు నెట్లుప్రకాశించవో అట్లు సర్వపరిపూర్ణుఁడైన పరమాత్మ ప్రకాశింపకున్న నేదియు ప్రకాశింపదు. అనగ నన్నియు పరబ్రహ్మాధిష్ఠానంగానె ఆభాశించును.

లోకములో నరుణోదయమగుటచేత ముందుగా జీకటి అంతయుఁబోయినను, గన్నుదెరచి చూచినగాని, సూర్యుఁడు కనబడని గురూపదేశమువలన సంశయవిపర్యయము లేనినిశ్చయమై స్వానుభవమువలన గాని పరమాత్మానుభవము గలుగదు. కాబట్టి అహంకారాది సకలదృశ్యములకును సాక్షియైన యాత్మ బాల్య, యౌవన, కౌమార, వార్ధిక జాగ్రత్స్వప్న సుషుప్తి తూష్ణీభావమూర్ఛామరణ స్వర్గనరకాది సకలావస్థలయందును ప్రత్యక్షముగా తనకు దానెయున్నవాఁడైనను దేహేంద్రియాధ్యాసరూపమైన యవివేకముచేత నప్రత్యక్షుడువలె తానున్నాఁడుగావున, అట్లుబహుకాలమువరకును, అప్రత్యక్షుడువలె గనబడినను, చిరకాలము యెడతెగక అభ్యశింపబడు శ్రవణమనననిదిధ్యాసలవలన గలుగు బ్రహ్మాపరోక్షజ్ఞానమువలన ఆ యవిద్యకు నాశనమువచ్చినప్పుడు ప్రత్యక్షముగా స్వయంప్రకాశముగా ప్రకాశించుచుండును. ప్రకాశించుటకు కారణమేమనగా అవిద్యయగు మాయయే కారణము. ఈమాయచేత జీవులకు, సప్తావస్థలు గలుగుచున్నవి. కాని తనకు స్వతస్సిద్ధముగా లేవు. తాను ప్రత్యగాత్మైక్య పరమాత్మనగ ఆకళలో నిష్కళాస్వరూపుండైన పరబ్రహ్మము. ఆపరబ్రహ్మమే తాను తానే సర్వము పరిపూర్ణం- బని ఇత్యాద్యుపనిషత్ప్రమాణంబులు చెప్పుచున్నవి.

## ముక్తికోపనిషత్.

స్వాత్మన్యారోపితానేషాభావవస్తు నిరాసతః స్వయమేవ పరంబ్రహ్మ పూర్ణమద్వయమక్రియం అసంకల్పో వికల్పోయం విశ్వమిత్యేకవస్తుని నిర్వికారే నిరాకారే నిర్విశేషేభిదాకుతః ద్రష్టదర్శనదృశ్యాది భావశూన్యేనిరామయె అల్పార్ణవఇవాత్యన్యన్తః పరిపూర్ణే చిదాత్మని తేజసీవతమోయత్ర విలీనం భ్రాన్తికారణం। అద్వితీయేపరేతత్త్వే నిర్విశేషేభిదాకుతః ఏకాత్మకే పరేతత్త్వే భేదకంతత్కథం వసేత్ మాయావిద్యేవిహాయైవ ఉపాధీపరజీవయోః। అఖణ్డసచ్చిదానన్దంపరంబ్రహ్మ విలక్ష్యతే ఇత్థవాక్యైస్తదర్థానుసన్ధానం శ్రవణంభవేత్॥ అహంబ్రహ్మేతివిజ్ఞాత్కల్ప కోటిసమార్జితం సంచితం విలయంయాతి ప్రబోధాత్స్వప్నకర్మవత్॥ ఏకమేవాద్వయం బ్రహ్మనేహనానాస్తికించనీ స్వానుభూత్యాస్వయం జ్ఞాత్వాస్వమాత్మాన మఖండితం ససిద్ధసుఖంతిష్ఠ నిర్వికల్పాత్మనాత్మని॥ అసంగోహ మసంగోహం పరిపూర్ణశ్చిరన్తనః॥ అకర్తాహమభోక్తాహమవికారోహమవ్యయః శుద్ధబోధస్వరూపోహం కేవలోహం సదాశివహః॥ ఇత్యాద్యుపనిషత్ ప్రమాణంబులు చెప్పుచున్నవి. ఎట్లనిన- దృశ్యప్రపంచంబంతయు మిథ్య. పరబ్రహ్మమొక్కటియే సత్యమని గురూపదేశమువలన దెలిసికొని యట్టిసంగతిని, మననాదులచేత బరిశీలించి నిశ్చయించుకొని, తత్త్వానుభవశాలి జ్ఞానమనెడి దృష్టిచేత సర్వవ్యాప్తియై సచ్చిదానంద పరబ్రహ్మమైయున్న యాత్మ దానేయని తన్నుతా దెలసికొనినగాని దృశ్యప్రపంచమంతయు స్థిరమనే యభిప్రాయముతో బ్రహ్మజ్ఞాన విచారమనే నేత్రములేని అజ్ఞానుడు, గుడ్డివాడు, సూర్యసాక్షాత్కరింపలేనట్లు బ్రహ్మస్వరూపమును సాక్షాత్కరింపజాలడు. కాబట్టి యీదృశ్యప్రపంచమంతయు మాయాకల్పితమనియు, నిర్మలంబై నిష్కళంకంబై నిర్వికారమైన పరమాత్మమైన తానొక్కటియే సత్యమని తన్నుతాదెలసి, గురూపదేశముద్వారా శ్రవణమననాదులచేత తననిజమును దెలిసికొనినవాడు అనేకవిధములైన పేర్లను ఆకారమును రంగులును మొదలగు భేదములుగల దృశ్యప్రపంచమంతయు మిథ్యయని విడచిపెట్టి, దేశకాలవస్తుపరిచ్ఛేదశూన్యంబై తానొక్కటియై బ్రహ్మంబునై యుండెను. కాబట్టి ఎల్లప్పుడునుండువాడున్ను, శరీరత్రయవిలక్షణుండున్ను, బంధమోక్షరహితుడును, సర్వమాలిన్యరహితుడను అయితిని. కావున పుట్టుక, ముదిమి, చిక్కుట, చావు

మొదలగునవి లేవు. జ్ఞానేంద్రియ కర్మేంద్రియప్రాణాదులు లేనివాడనగుట చేత శబ్దాదివిషయభోగములతో తనకు సంబంధము లేదు. అవిద్యాకల్పితమగు నదియు, జడమైనదియు శరీరము మొదలగు నది నీటిబుగ్గవలె నాశనము నొందు నట్టిది ఈశరీరాదులకంటె భిన్నమయినదియు, నిరుపాధికమైనదియునగు నిర్గుణ సాక్షాత్కారమైన బ్రహ్మమే తానని తన్ను తా దెలసికొనవలయును. పర మాత్మ స్వతస్సిద్ధముగా వికారములులేనివాడు. అంతఃకరణమునకు వీమాత్ర ము జ్ఞానవాసన లేదు గావున అంతఃకరణమునకు విలక్షణత్వము సంభవించినది గావున అంతఃకరణవిలక్షణుడు కాలత్రయాబాధ్యత్వము యెల్లప్పుడు విషయ జన్యమాలిన్య రహితమును, నామరూపరహితమైనట్టిదియు, త్రిగుణరహిత మైనట్టిదియు, అసద్వచనీయమును ఆదిమధ్యాంత శూన్యమునైన పరమాత్మ స్వరూపుడైన తానే సర్వత్రి నిండి, దేహత్రయ, గుణత్రయ, అవస్థాత్రయ తాపత్రయ, శక్తిత్రయ మొదలయిన త్రిపుటులులేనివాడై అఖండసచ్చిదా నంద పరమాత్మునిం దక్క తక్కినదంతయు మిథ్యగాజూచి- తాను అభేద అద్వైత బ్రహ్మజ్ఞానమువలననే తాను బ్రహ్మమై తానుతానై- ఇట్టిఅభేదా ద్వైతబ్రహ్మైక్యానుభవమువల్లనే జననమరణ రహితమై మోక్షసామ్రాజ్య మును పొందుదురు. సర్వోపనిషత్సారరహస్యార్థమగు ననుభవము సద్గురు ముఖమున తా దెలసి తానుతానైయున్న బ్రహ్మమె తానుగాబట్టి ఇత్యాద్యు పనిషత్తులు చెప్పుచున్నవి.

పాశుపతబ్రహ్మోపనిషత్.

వ్యావహారికదృష్ట్యేయం విద్యావిద్యానచాన్యథా తత్వదృష్ట్యాతునాస్త్యేవ తత్వమేవాస్తి కేవలంయథాబ్రహ్మాత్మకం సర్వం విభాతిస్వతఏవతు, తథా దుఃఖాదిభేదోయమాభాసోపిచభాసతే జగజ్జీవాదిరూపేణ పశ్యన్నపిరాత్మవిత్ నతత్పశ్యతిచిద్రూపం బ్రహ్మవస్త్వేవపశ్యతి బ్రహ్మవిత్ గ్రసతిజ్ఞానాత్స ర్వం బ్రహ్మైవనైవతత్ అస్తిచేదస్థితారూపం బ్రహ్మైవాస్తిత్వలక్షణం అస్థి తాలక్షణ సత్తాసత్తాసత్తాబ్రహ్మన చాపరానాస్తిసత్తాతి రేకేణనాస్తి మాయా చవస్తుతః। యోగినామాత్మనిష్ఠానాం, మాయాస్వాత్మవికల్పితా సాక్షి రూపతయాభాతి బ్రహ్మజ్ఞానేనభాధితా బ్రహ్మాదిజ్ఞానసమత్పన్నః ప్రతీత మఖిలంజగత్ ॥ పశ్యన్నపిసదానైవపశ్యతి స్వాత్మనఃపృథక్॥

కఠోపనిషత్.

జ్ఞాత్వాబ్రహ్మాహమస్మీతి బ్రహ్మైవభవతిస్వయం సర్వాంతరేణ పూర్ణశ్చబ్రహ్మానాన్యేన కేనచిత్॥ సద్రూపంపరమంబ్రహ్మాత్రి పరిచ్ఛేద వర్జితం యదాహ్యే వైషఏతస్మిన్నల్పమత్యంతరంనరః। విజానాతితదాతస్య భయంస్యాన్నాత్రసంశయః ఇత్యాదిప్రమాణంబులు చెప్పుచున్నవి. ఎట్లనగ ఆద్యంతవర్జితంబును, దృశ్యసంస్పర్శరహితంబును, ద్వైతాద్వైత రహితంబును, పుణ్యపాపవిహీనంబును, బాధమోక్షరహితంబును, కార్యకారణ విహీనంబును నైన బ్రహ్మంబొక్కటియె దక్క రెండవది లేనేలేదు. కావున సుఖదుఃఖములు లేనిదియు, ఆశాపాశములు లేనిదియు, జన్మకర్మములు లేనిదియు, తెలియబడనిదియు తెలియనైయున్నది.

సద్గురూపదేశవాక్యార్థశ్రవణమనననిధిధ్యాసలచేత, "సోహంబ్రహ్మ" యను దృఢజ్ఞానసంపత్తి తనకుగలిగి, తనుపంచకోశ విలక్షణునిగాను, అసంగ చిద్రూపునిగాను, సకలప్రపంచవివర్తమున కధిష్ఠానముగాను తెలసికొని, జీవన్ముక్తుడైనను మగుమరీచికా (యెండమావులు) ॥శృతి। మృగతృష్ణజల పీత్వా త్వ ప్తిశ్చేదస్త్వదంజగత్॥ అనునట్లు ప్రపంచమును జూచుచు రజ్జుసర్ప భ్రాంతి స్వప్నములవలెనే, ప్రారబ్ధరూపకర్మానుభవమును జూచుచు, దగ్ధ పటన్యాయంబున అనగ మడతబట్ట కాలినను మడతవలెనేయుండి గాలివీచి నప్పుడు బూడిదవలె నెగిరిపోయినట్లు శరీరపతనముపర్యంతమును, సంసారి వలెనుండును. కాబట్టి బ్రహ్మైక్యానుభవమునొందు జ్ఞాని బహిర్ముఖదృష్టి చేత ప్రపంచమును, ప్రపంచమునకును తనకునుగల సంబంధమును సత్యము గనున్నట్లు వ్యవహరింపుచున్నను, అంతర్ముఖదృష్టిచేత నిదంతయు, ఆనంద విలాసరూపమనియు, అసత్యమనియును దెలియును. కాబట్టి యాగంతుక మైనభయమును ॥శృతి॥ మూలాభావఇదంజ్ఞాతుంశరీరంనాస్తి కేవలం॥ అనునట్లు భయమునువదలి నిర్భయుడైయుండును. ఐతే అట్టి భయాగమనమును తన్నివృత్తియు సత్యములుగావు. అవియు ఆత్మవిలాసమే కాబట్టి యాగంతుకమైన భయమునువదలి నిర్భయుడైయుండును.

అట్టిభయాగమనమును తన్నివృత్తియు సత్యములు కావు. అవియు ఆత్మవిలాసమే. కాబట్టి యజ్ఞానవివేకముచే గలిగిన బంధమోక్షములు కాలత్రయమందును, ఆత్మకుసంబంధింపవు. అవియు నాత్మకు స్వానందోల్లాస

విలాసమాత్రములే గనుక గురూపదేశప్రకారము అనుభవనిష్ఠులైన మహాత్ములకేగాని కేవల సంసారులకేగాని ఈరహస్యము దెలియుట దుర్లభము. కాబట్టి యట్టి మహాత్ములకు సకలవ్యవహారము లాత్మస్వరూపముగా నుండుటచేత నట్టి మిధ్యాబంధమోక్షములను నిర్వహించుటకు సత్యుడును అద్వితీయుడు నగు నాత్మకంటె అన్యముగా యొకచిదాభాసుని వ్యవహారదశయందంగీకరింపవలసివచ్చినది. పారమార్థికదశయందు యది యెంతమాత్రము నావశ్యకముగాదు. ఏవస్తువు- అనగా, ఏపరమాత్మమధ్యనుండు ప్రపంచమందును, ప్రపంచమునకు బైనను, ప్రపంచమునకు క్రిందుగను వ్యాపించియుండునో కాలత్రయాతీతమైయున్న, సమానాధికరహితమైనదో, నాశరహితమైనదో, కాలత్రయములయందు శాశ్వతమైనదో, స్వజాతి, విజాతి స్వగతభేదములు లేనిదియో అట్టిది బ్రహ్మమని దృఢముగా తెలిసికొనవలసినది గాబట్టి ఏపరబ్రహ్మము నాశనరహితమైనదియునై, నిరతిశయానంద స్వరూపమయ్యు అద్వితీయమయ్యును, ప్రస్థానత్రయమునకు విలక్షణమైనదియునై, ప్రస్థానత్రయవాక్యములచేతను, గురూపదేశమువలనను, అనాత్మవస్తువులను, నిరసించు ప్రకారముచేత బాగుగా నూహించి అనుభవింపబడునో ఆవస్తువు పరబ్రహ్మమని దృఢముగా తెలిసికొనవలసినది. స్వరూపానుభవముగ బ్రహ్మజ్ఞానాజ్ఞాన మనెడు సముద్రమును, గురూపదేశమువలన జ్ఞాన మనెడి నిరపాయమైన తెప్పచే దాటి రాగద్వేషములు మొదలగు రాక్షసులను, ఆత్మయసంగు డనెడు విశేషజ్ఞానమను నస్త్రముచేత నాశనముచేసి శమదమాదిగుణములతోగూడి రాజయోగసమాధి నిష్ఠాసంపన్నుండైయుండును. సర్వకాలము తనయందు తానే రమింపుచున్న ఆత్మారామ పరబ్రహ్మమై యుండెను.

ఈపరమరహస్యమును శాస్త్రదృష్టం గురువాక్యం తృతీయం ఆత్మనిశ్చయం బనునట్లు తన్ను తా తెలియవలెను.

త్రిపురతాపిన్యుపనిషత్తు. నాల్గవ అధ్యాయము.

తదేవంనిష్కళంబ్రహ్మ । నిర్వికల్పంనిరంజనం । తద్బ్రహ్మామితిజ్ఞాత్వా బ్రహ్మసంపద్యక్రమాత్ ॥ ఏకఏవహిభూతాత్మా భూతేభూతేవ్యవస్థితః ఏకధా బహుధాచైవదృశ్యతే జలచంద్రవత్ ॥ ఘటసంవృతమాకాశం । నీయమానె ఘటెయథా । ఘటోనీయేతనాకాశం తథాజీవోనభోపమః॥ గవామనేకవర్ణానాం । క్షీరస్యాప్యేకవర్ణతాం క్షీరవత్పర్యతే జ్ఞానంలింగవసుగవాంయథా ।

జ్ఞాననేత్రం సమాధాయ । సముహృత్పరమంపదం । నిష్కళం నిశ్చలంశాంతం బ్రహ్మాహమితిసంస్మరేత్—ఇత్యాద్యుపనిషత్తు ప్రమాణంబులు బ్రహ్మసాక్షాత్కారమునుగురించి చెప్పుచున్నవి. బాహ్యోద్భవములయిన అనిత్యములై యున్న యిహపరవిషయములు, సుఖదుఃఖములయెడ గలుగు నాశనము సంపూర్ణముగా విడచివేయవలెను. నిరతిశయ నిర్విశేష నిష్కళంక, నిర్వికల్పం నిరంజనంబైన బ్రహ్మం బొక్కటియే బ్రహ్మానందముతో తానై పరిపూర్ణ సంతోషముతో ననుభవించుచున్నవాడై సత్యమైన పరమాత్మ మిథ్యమైన జగత్తుకన్న వేరైన దనగ జగత్తుమిథ్యా బ్రహ్మమే సత్యము. సత్యమైన పరబ్రహ్మకన్న మరియొక సత్యమైన వస్తువులేదు. వ్యవహారదశయందు బ్రహ్మముకన్న వేరైన రసము సత్యమువలె జ్ఞానికిదోచినయెడల యెండమావులయందు నీరులేనిదే వున్నట్లుగా దోచినప్రకారము నీరని భ్రమపడినవానికి సమీపించి విచారణచేసిన పిమ్మట అసత్యమగునో, ఆప్రకారముగా జగత్తుయొక్క యట్టి సత్యత్వము విచారణగల బ్రహ్మజ్ఞానికి అసత్యమగును. కావున, యేదేది చూడబడుచున్నదో, యేదేది వినబడుచున్నదో, అట్టి బాహ్యాంతర యింద్రియములును, వాటితో జేరిన విషయప్రపంచములును పరమాత్మకంటె వేరైనదిగాదు. ఏమియు అణుమాత్రమైనలేదు. ఇదిగాక సర్వప్రపంచ బ్రహ్మాధిష్ఠానమైన యట్టి పరమాత్మ తత్వవిచారణరూపమైన యనుభవముచేత తానే పరబ్రహ్మముగ అనుభవశాలి తన్ను తా దెలియవలెను.

బ్రహ్మమందు, జగద్భ్రాంతి, బ్రహ్మాంశమే. అది యెట్టియనిన, రజ్జువును జూచి సర్ప మనుకొనినట్లు ఆత్మస్వరూపమైన తనను కర్తృత్వాది కర్మసహితుడైన చిదాభాసునిగ తలంచి అనేక జననమరణ ప్రవాహరూపమైన దుఃఖసాగరమందు మునిగినవాడుగనుంచి భయప్రతీతిని పొందుచుండును. తాను ఆత్మకంటె వేరైనవాడనుగాను. పరమాత్మస్వరూపుండును అని స్వానుభవముచేత తన్ను తా దెలిసికొనినట్టయితే పైనచెప్పిన జననమరణరూప సంసార భయప్రతీతిలేనివా డగుచున్నాడు. కాబట్టి పరిపూర్ణమై అద్వితీయమగు, పరమాత్మయందు మాయాకల్పిత శరీరత్రయ పరిచ్ఛిన్నత్వ మవివేకముచే గలిగినదేకాని, పరమార్థ విచారదృష్టిచేగాదు. కాబట్టి తత్వవివేకముచే నవివేకమునకు నాశనము గలిగినప్పుడు మేఘావరణము పోయిన తక్షణమే సూర్య

డేలాగున ప్రకాశించునో, అలాగున ఆత్మ ప్రకాశింపుచున్నాడు. తాను సత్వరజస్తమోగుణములు లేనివాడును, ఇంద్రియవ్యాపారముల సంబాధము లేనివాడును, యెల్లప్పుడుండువాడును, ఉత్పత్తినాశనములు లేనివాడును, మనోసంబంధములైన వ్యాపారములు లేనివాడు అసంగుడు, శరీరత్రయవిలక్షణుడు, బాధమోక్షరహితుడు, సర్వమాలిన్యరహితుడునైన తాను ప్రత్యక్షముగ నాదరిచేతను ననుభవింపబడు యీసంసారము కేవలము అసత్తని యేలాగు చెప్పనచ్చుననగ యిచ్ఛాద్వేషాదులచే మిక్కిలి దట్టముగనుండు అహంకార మమకారములతోగూడిన జననమరణ ప్రవాహరూపకమగు సంసారము తా ననుభవించినప్పుడు నిజమువలె దోచి మేలుకొనిన తరువాత కల్పిత మనితోచు స్వప్నముతో సమానమగునది, ఎట్లనగా తనకు గారణభూతమైన యజ్ఞానము బలీయముగ నుండువరకు నిజముగనుండునట్లు తోచును. గురూపదిష్ట మహావాక్యార్థ శ్రవణాదిజన్య, బ్రహ్మాత్మైక్యానుసంధానదశయందు లేనిదగును, అవ్యక్తాదిస్థూలప్రపంచపర్యస్తమైన యనాత్మవస్తువుల యారోపణకు స్థానమైనదియును, ఏకమైనదియు నగు పరబ్రహ్మమునందు యంతవరకు అవ్యక్తప్రపంచము నారోపించినది.

ఆత్మోపనిషత్తు.

ఆత్మసంజ్ఞశ్శివశ్శుద్ధ ఏక ఏవాద్వయస్సదా । బ్రహ్మరూపతయాబ్రహ్మ కేవలం ప్రతిభాసతే । జగద్రూపతయాప్యేత ద్బ్రహ్మైవప్రతిభాసతే। విద్యావిద్యాదిభేదేన భావాభావాదిభేదతః । గురుశిష్యాదిభేదేన, బ్రహ్మైవప్రతిభాసతే । బ్రహ్మైవ కేవలం శుద్ధంవిద్యతే తత్త్వదర్శనే న చవిద్యా న చావిద్యా నజగచ్చనచాపరం । సత్యత్వేన జగద్భానం సంసారస్యప్రవర్తకం । అసత్యత్వేన భానస్తు సంసారస్యనివర్తకమ్ । లక్ష్యాలక్ష్యగతింత్యక్త్వాయత్తిష్ఠేత్కేవలాత్మనః శివఏవస్వయం సాక్షాదయం బ్రహ్మవిదుత్తమః। జీవన్నేవసదాముక్తః కృతార్థో బ్రహ్మవిత్తమః । ఉపాధినాశాద్బ్రహ్మైవసన్ । బ్రహ్మాప్యేతినిర్ద్వయం శైలూషో వేషసద్భావ భావయోశ్చయథాపుమాన్॥ తథైవబ్రహ్మవిచ్ఛ్రేష్ఠస్సదాబ్రహ్మైవనాపరః । ఘటేనష్టే । యథావ్యోమా వ్యోమైవభవతిస్వయం। తథైవోపాధివిలయే బ్రహ్మైవ బ్రహ్మవిత్స్వయం । క్షీరంక్షీరేయథాక్షిప్తం తైలంతైలె జలంజలె । సంయుక్తమేకతాం యాతితథాత్మవిన్ముని: । అస్తీతి ప్రత్యయోయశ్చ యశ్చనాస్తీతివస్తునిబుద్ధె గుణావేతౌనతునిత్యస్యవస్తునః ।

అతస్త్వామాయయాక్ల్ప్తౌబన్ధమోక్షౌనచాత్మని । నిష్కళే నిష్క్రియే శాన్తేనిరవద్యే నిరంజనే । అద్వితీయే పరేతత్త్వేవ్యోమవత్కల్పనాకుతః । ననిరోధోన చోత్పత్తిర్నబన్ధోనచసాధకః ముముక్షుర్నవైముక్త ఇత్యేషాపరమార్థతా॥

ఇత్యాద్యుపనిషత్ ప్రమాణములు చెప్పుచున్నవి. ఇందు కొంకయభిప్రాయము వ్రాయుచున్నాను.

బంగారమునందు కడియములు మొదలగునవి యనేకరూపములు నామములు భేదాభేదములుగా దోచబడుచున్నవో యట్లనేక ఆభరణములు వలెనే శాశ్వతమైనదియు సర్వవ్యాపకమైనదియు సకలాంతర్భూతమనునగు సచ్చిదానందస్వరూపకమగు నాత్మయందు నానావిధములైన సకలదేవతలను కనబడెడి మనుష్యతిర్యగాది నానావిధచరాచర రూపములును కల్పింపంబడినవి గావున, బంగారం వక్కటె శృంగారములు యనేకభంగులయినట్లుగనే, తాపరమాత్మ్మం డఖిలప్రపంచమయుడై భాసిల్లునట్లవుటచే, అనగ ప్రకాశించుచుండును. సకలాంతర్ భూతములగు సచ్చిదానందస్వరూపమగు నాత్మయందు నానావిధములయిన సకలదేవతలును కనబడెడి మనుష్యతిర్యగాది చరాచరరూపములును కల్పింపబడినవి, యీకల్పితనామరూప ప్రపంచము, మిథ్యాభూతమని శృతులు వక్కాణించుచున్నవి, సర్వవ్యాపకమైనది నంతట నొక్కటిగానున్నది బ్రహ్మంబొక్కటియే యున్నది. ॥అచలః. చలములేనిది, పరిపూర్ణం- అంతటనిండినదియు, బ్రహ్మం- పరబ్రహ్మంబనియు, తన్నుతా దెలసిన తానే పరమాత్మయని – చెప్పుచున్నవి. అట్టి పరమాత్మ వాక్కులచే చెప్పశక్యముగానిదియు, ఆదిమధ్యాంతములు లేనిదియు నగు అజ్ఞానము స్థూలసూక్ష్మశరీరాది ప్రపంచభ్రమకు కారణమునబడు శరీరమని చెప్పబడుచున్నది. ఆత్మను స్థూలసూక్ష్మకారణములనే మూడుదేహములకంటె వేరైనవాడుగా వివేకనిశ్చయముచేసి, ఆత్మానాత్మ వివేకనిశ్చయము వలన, తన్నుతా తెలిసికొనదగినది. ఈమూలంలేని గుర్తు మెరిగేయెరుకకు కారణమేమనగ, కలలోదోచిన శరీరములు యేలాగో ఆలాగే, తనంతట తానే, రజ్జువునందు సర్పభ్రాంతివలె ఆరోపింపబడినది. లేనిది యున్నట్టుగాను వున్నది లేనట్టుగాను, యెట్లన, గాఢసుషుప్తియందు మెళుకువ తనంతట తాను యెట్లు మెలుకువవచ్చినదో, నాలాగే పరబ్రహ్మమందు, సృష్టిశక్తి

ఆలాగుననే తోచబడినది. ఆరోపింపబడినది. తన్నుతా విచారించగా, తానే స్వతస్సిద్ధమైయున్నది. ॥శృతి॥ పరిపూర్ణం, పరమాత్మానం పరాకాశం పరం శివః, ఏకమేవాద్వితీయం బ్రహ్మ॥ తానొక్కడై అంతట నిండియున్నది.

రుద్రహృదయోపనిషత్.

ఘటాకాశ మఠాకాశౌ యథాకాశ ప్రభేదతః, కల్పితౌ పరమాజీవ శ్శివరూపేణకల్పితౌ తత్వతశ్చశివసాక్షాచ్చిజీవశ్చ స్వతస్సదాచిదేకత్వ పరిజ్ఞానేన శోచతినముహ్యతి అద్వైతం పరమానందం శివంయాతతు కేవలం అధిష్ఠానం సమస్తస్య జగతస్సత్యచిద్ఘనం అహమస్మి నిశ్చిత్య వీతశోకోభవేన్ మునిః॥ ఆకాశమేకం సంపూర్ణంకుత్రచిన్నైవగచ్ఛతి తద్వతాస్వాత్మాపరిజ్ఞానీకుత్రచిన్నైవగశ్చతి।

రెండవ ప్రాహ్మణము.

ప్రపంచస్యమనః కల్పితత్వా తతోభేదాభావాత్ కదాచిద్బహిర్గతో పిమిథ్యాత్వభావాత్ సకృత్ విభాతసదానందానుభవైక, గోచరోబ్రహ్మవిత్తదేవభవతి, శుద్ధాద్వైత బ్రహ్మాహమితిభిధాగంధంనిరస్య విగతప్రపంచగన్ధస్సర్వజగదాత్మత్వే నపశ్యన్ త్యక్తాహం కారోబ్రహ్మాస్మితిచిన్మయన్నిదం సర్వంయత్ అయమాత్మేతిభావయన్ కృతకృత్యోభవతి॥ నిత్యశుద్ధఃపరమాత్మాహమేవేతి తత్వమశిత్వ పదే శేవత్వమేవాహామహమేవత్వ మితితారక యోగ మార్గేణా ఖండానందపూర్ణః కృతార్థోభవతి॥ అట్టి మూలప్రకృత్తియనెడి మహామాయవలన గలిగిన ఆకాశాది పంచమహాభూతములయందు అంతర్యామిగాను యట్టి పంచమహాభూతములు ఆతిక్రమించినదిగాను సకలమైన ప్రపంచమునకు ఆధారభూతమైనదిగాను, నిష్కామకర్మముచేతను, అజ్ఞానముచేతను పొందదగినదిగా, తనకు రెండవదిలేక, స్వయముగా తానైనదిగా, సకలప్రపంచోపాధులు వాటిశక్తులతో గూడ తనయందు లయింపదగినదిగాను ఆద్యంతములు లేనిదిగాను హృదయాకాశమందుదయించిన, బ్రిజ్ఞానమనెడి సస్వరూపానుభవమనెడి జ్ఞానసూర్యుడు అనాద్యవిద్యారూపమైన అజ్ఞానాంధకారమున, హరింపుజేయువాడున్ను, సర్వపరిపూర్ణుడును, సర్వాధిష్ఠానముగలవాడున్ను, సమస్తము ప్రకాశింపజేయువాడున్ను కాబట్టి బాహ్యాంతరమైన సమస్తప్రపంచము ప్రకాశింపచేయుచున్నది గాన పరమాత్మ

దృక్కు చూపునకందనిదిన్ని, శ్రీవణేంద్రియముచేత వినదగనిది, వాక్కుల చేత వచింపరానిదిన్ని మనస్సుతో దలంచచూడనలవిగానిదిన్ని, శృతులు చెప్పుచుండుటచేత, అట్టి పరమాత్మను యట్టిదృష్టిగలవాడు చూచును. అట్టి దృష్టిగలవాడున్ను జూడకు. అనగ జ్ఞానమనేదృష్టికలవాడు గురూపదేశము వలన తాననుభవముగలవాడై సమస్తప్రపంచంబునందు వ్యాపించి నిండి యున్నదియు, పరబ్రహ్మమైనదియు నగు పరమాత్మను తన్నుతాదెలిసికొనును. జ్ఞానమనే దృష్టిలేనివాడు, గురూపదేశములేనివాడు, గుడ్డివాడు సూర్యునిచూడలేనట్టి, అపరోక్షసాక్షాత్కారమైన పరమాత్మ; తెలుసుకొనజాలడు. అజ్ఞానమనే మేఘావరణము కప్పబడియున్నది గనుక బ్రహ్మపదార్థం మరుగు పడియున్నది. గావున ॥ నిరాలంబోపనిషత్తు ॥ పూర్ణమధః, పూర్ణమిదం, పూర్ణాత్పూర్ణముదీరితం, పూర్ణస్యపూర్ణమాదాయ, పూర్ణబోధో శిష్యతె ॥ ఓం శాంతిశ్శాంతిః ॥ అక్కడయిక్కడ యక్కడను అఖండ సచ్చిదానంద పర బ్రహ్మమగు పరిపూర్ణమె లోకమున, సూర్యుడు చంద్రుడు మొదలగునవి ఎద్ది యేది పరిపూర్ణమని చెప్పబడుచున్నదో దానికన్నిటికి ఈ అఖండపరబ్రహ్మమగు పరిపూర్ణమే శ్రేష్ఠమైనది. లోకములో ఏదియేది పరిపూర్ణవస్తువులో వానియందంతట ఈ సర్వపరిపూర్ణ బ్రహ్మమే నిండియున్నది గాబట్టి అజ్ఞానసహితులగు ఈపామరజనులకు సకలదుఃఖములు నివృత్తియగుటకొరకు, ఏదియేది చక్కగా తెలియగలదో అది తన్నుతా దెలియదగినది గావున తన్నుతా దెలియువరకు, తాను జీవుడనె వ్యవహారం నామధేయం గలిగినది. తన్ను దాదెలసిననో తాను పరమాత్మనామధేయంగలిగి తాను పరమాత్మ యేమైనది. శ్రీగురుముఖ వివేకజ్ఞానముచే తన్నుదా దెలియవలెను. తన్ను తా దెలియుటకు యుపనిషత్ ప్రమాణములు ఘోషించుచున్నవి. కావున జీవబ్రహ్మల కభేదజ్ఞానము బోధించుచున్నవి.

ఛాన్దోగ్యోపనిషత్ _6 వ పాఠము _12 వ ఖండము.

న్యగ్రోధఫలమతలఆహరేతి ఇదంభగవఇతి భిన్ధీతి భిన్నంభగవఇతికిమ త్రపశ్యసీతి అణ్వ్యఇవెమాధానాభగవఇతి ఆసామంగైకాంభిన్ధీతి, భిన్నా భగవతి కిమత్రపశ్యశీతినకించన భగవఇతి తంహోవాచయంవైసోమ్యై తమణిమణిమానం ననిబాలయస ఏతస్యవైసో మైషోణిమ్న ఏవంమహాన్న్య గ్రోధ స్తిష్ఠతిశ్రద్ధత్స్వసో మ్యేతి సయేషోణిమైతదాత్మ్యమిదంసర్వం తత్సత్యం

సఆత్మాతత్త్వమసి శ్వేతకేతో ఇతి భూయఏవమాభగవాన్ విజ్ఞాపయత్వితి యథాసోమ్యేతిహోవాచ॥

13 వ ఖండము.

లవణమేతదుదకే వధాయాథమా ప్రాతరూపసీదదా ఇతి సహతథా చ, కార తంహోవాచ, యద్దోషాలలవణముదకే, వాథా, అంగతదాహరేతి తద్ధావమమ్యశ్యసవివేద యథాలీనమేవాంగ అస్యాతాదాచామేతి, కథమితి లవణమితి మధ్యాదాచామేతి కథమితి లవణమితి అభిప్రాస్యైన దథమోపసి దవాయితి, తద్ధతథాచకార తశ్చశ్వవత్సంవర్తతే॥ తంహోవాచాత్రవావకిల సతోస్త్వనభాలయసె, త్రైవకిలేతి॥

౧౪ వ ఖండము.

సయఏషోణిమైతదాత్మ్యమిదంసర్వం తత్సత్యంస ఆత్మాతత్త్వమసి, శ్వేతకేతో ఇతి భూయఏవమాభగవాన్ విజ్ఞాపయత్వితి తథాసోమ్యేతిహో వాచయథాసోమ్యపురుషం గన్ధారేభ్యోభినద్ధాక్షమానీయ తంతతో విజనే విశృజేత్॥ సయథాతత్రప్రాఙ్వోదఙ్వా అధరాఙ్వా ప్రధ్మాయీతాభినద్ధాక్ష ఆనీతో భివద్ధో విశృష్టః॥ తస్యయథాభినహనం ప్రముచ్యప్రబ్రూయాదేతాం దిశంగన్ధారాఏతాం దిశంవ్రజేతి, సగ్రామాత్ గ్రామం పృచ్ఛన్ పణ్డితో మేధావీగన్ధారానేవోపసం పద్యేతైవమేవేహాచార్యవాన్ పురుషోవేదతస్య తావదేవచిరంయావత్ నవిమోక్ష్యేథసంపత్స్యఇతి॥ సయఏషోణిమైతదాత్మ్యమిదసర్వం తత్సత్యంసఆత్మాతత్త్వ మసి శ్వేతకేతో ఇతి॥

ఈ ఆత్మ తాను అయినూత్మాబ్రహ్మ ఈ బ్రహ్మమే తాను ॥శృతి॥ అయంమర్ధబాహ్యకోపినభవతి॥ ఈవృత్తపరిపూర్ణం అస్థిపున్నది. తత్త్వమసి, ఈ ఆత్మేతాను, తానే ఈ ఆత్మ. ॥ జీవాత్మపరమాత్మనోః॥ జీవాత్మ పరమాత్మలకు అభేదముగా జెప్పుచున్నవి. ఎట్లనిన చక్కెరయును, లవణంబును నుదకమందు గరగినయటులనే, జీవాత్మ పరమాత్మలకు అభేదజ్ఞానం కలిగినది. తత్త్వమసీతి మహావాక్యమునుబట్టి విచారించగ ఘటాకాశ, మహాకాశములకు, అభేదజ్ఞానము గలిగినది. ఘటభిన్నంబైన అనగ ॥శృతి॥ నేతి నేతీతి నేతితిశేషితం పూర్ణముచ్యతే, పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాముదీరితం పూర్ణస్య పూర్ణస్య మాదాయపూర్ణబోధోవశిష్యతే॥ ఘటభిన్నంబైన ఘటా

కాశము మహాకాశమున నేకమైనపగిది పంచవింశతి తత్వములు తా గానని నిషేధించి మిగిలిన పదార్థే బ్రహ్మపదార్థమని అదే తానైన పరమాత్మ ఆ కళలో నిష్కళతానైన పరమాత్మ ఈ పరమాత్మే తాను. లోపల, వెలుపల, పైన, [illegible] అంతట నిండి నిబిడీకృతమై యున్నతాను బ్రహ్మమై ఏకమై పరమై విశోకమై సుఖదుఃఖములులేనిదై, బాధమోక్షములులేనిదై, అజ్ఞానంబున దోచు సంసారసర్వ దృశ్యజడదుఃఖ ప్రపంచమంతయును॥

॥శృతి॥ అనాత్మదృష్టె అవివేకనిద్రా అహంమను స్వప్నగతింగతోహం కలలోదోచిన శరీరం యేలాగో, ఆలాగేశోచును గావున యీమూలంలేని గుర్తెరిగి శరీరం కలలోదోచిన శరీరం యేలాగో ఆలాగేశోచును. జడదుఃఖాత్మకమైన ప్రపంచమనే సజ్ఞానము ఆత్మజ్ఞానంబున నాశనంబగు గురుముఖ వివేకజ్ఞానము నాశనంబగు దదాత్మజ్ఞానము పరమేశ్వరానుజ్ఞనుగాని సంఘటింపదు. ఈశ్వరుడు సంతోషించు వేదోక్తమార్గానుగాన బ్రహ్మజ్ఞాని సద్వృత్తికి ఆకరైచేయు కర్మములు, కార్యములు, నిష్కామకర్మచేయుచు తా జేయు సర్వకర్మములు సర్వం బ్రహ్మార్పణముగా జేయుచుండును. కావున, ఫలకాంక్ష వదలి నిష్కామకర్మ విధివశమున ప్రారబ్ధకర్మ జేయుచుండును.

కేనోపనిషత్. ఒకటవ ఖండము మూడవ వాక్యముమొదలు
ఎనిమిదవ వాక్యమువరకును.

నతత్రచక్షుర్గచ్ఛతిసోమనః । నవిద్మో, నవిజానమో యథైతదనుశిష్యాత్ । అన్యదేవతద్విదితాదథో అవిదితాదధి । ఇతిశుశ్రుమ । పూర్వేషాం యేనస్తద్వ్యాచచక్షిరే । యద్వాచానభ్యుదితం । యేనవాగభ్యుద్యతే । తదేవబ్రహ్మత్వంవిద్ధినేదం యదిదముపాసతే । యన్మనసానమనుతే । యేనాహుర్మనోమతం దేవబ్రహ్మత్వం విద్ధినేదం యదిదముపాసతే॥ యచక్షుషానపస్యతియేన చక్షూంశిపశ్యతి । తదేవబ్రహ్మత్వం విద్ధినేదంయదిద, ముపాసతే యచ్ఛోత్రేణ ననశృణోతియేనశ్రోత్రమిదంశ్రుతం । తదేవబ్రహ్మత్వంవిద్ధి నేదం యదిదముపాసతె యత్ప్రాణేనన ప్రాణితియేనప్రాణః ప్రణీయతే తదేవబ్రహ్మత్వంవిద్ధి నేదం యదిదముపాసతే॥

రెండవఖండము.

యశ్యామతంతస్యమతం । మతంయస్యనవేదనః॥ అవిజ్ఞాతం విజ్ఞానతాం విజ్ఞాతమవిజానతాత్

రెండవ ఖండము—ఐదవ వాక్యము.

ఇహచేదవేదీ దథసత్యమస్తినచేదిహా వేదీన్మహతీవినష్టిః భూతేషు భూతేషు విచిత్యధీరాః॥ ప్రేత్యాస్మాల్లోకాదమృతాభవంతి॥ యిహాముత్రార్థ ఫలభోగవిరాగుడై కోరికలులేనివాడై సంకల్పరహితుడై, మనోమారుతము లను నేకముజేసి తాను, బ్రహ్మమందు ఐక్యమై తాను నిర్వికల్పసమాధి నిష్ఠాగరిష్ఠుండై తానుతానైయుండినంత గుర్వోర్ముఖేనజ్ఞాతవ్యాం అన్యథానోప లభ్యతే॥ ఇతినిశ్చయమేవహి గురువాక్యం యథాతథా, గురువాక్యేనలభ్యతే, గురుముఖవివేకజ్ఞానముచేత, అంతర్ముఖత్వంబున అణిమమూలజ్ఞప్తి కళామాత్రశరీరం నాస్తి కేవలం॥ గురువాక్యం అణిసూన్యాం బరసూన్యం సర్వంబాస్తి కేవలం బని పరబ్రహ్మమేయున్నదని, నాస్థిస్థూలసూక్ష్మ కారణశరీరములు మూడుదేహములుగానిది లేనిది! మూలాభావఇదంజ్ఞాతుం శరీరం॥ త్రాటియందు సర్పభ్రాంతితోచినటులనే, బ్రహ్మమందు జీవభ్రాంతి ఆరోపిత మైనది. ఇదియె అధ్యారోపాపవాదం॥శ్రుతి॥ అధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచతే॥ లేనిదేవున్నట్లుగ వున్నదానియందు తనకు తానే లోచబడినది. నిర్మూలమె తథాజ్ఞానశ్చరీరం [illegible]స్తికేవలం, గురువాక్యం యథాతథా ప్రకారం విదేహకైవల్య మోక్షసామ్రాజ్యంభవతి.

— x ద్య . —

ఇతి శ్రీ భీమనిరంజన నిగమాగోచర గురువర కరుణాకటాక్ష వీక్షణాయత్త చిత్తచైతన్య జాగ్రదీయమాన ప్రకర్షితాత్మితత్వనై, సచ్చిదానంద గుణగణాతీత వేదవేదాంగ మంత్రముత్రార్థశ్రీమద్గురు పాదుకాపూర్ణదీక్షాపక్షదక్షత్వసుద్ధనిర్గుణ నిజబోధపరాయణా పారీణ పారాయణధురీణ అజ్జరపు సూర్యనారాయణాఖ్య విరాజమాన ప్రభాశిత ప్రజ్ఞాప్రకర్షిత ప్రబోధితనై, వేమూరివంశపయః పారావారరాకాసుధాకరస్య కౌండిన్యసగోత్ర వీరయభాగమాంబా గర్భకనిష్ఠజనిత హారితసగోత్ర సౌభాగ్యవతీ సామ్రాజ్యభోజ్య విద్యోపాసనా వర ప్రసాద కవనకవిత సూర్యనారాయణ యోగినీ ప్రణీతంబగు శ్రీమహాఋషినిఘంటితయోగ శాస్త్రేబ్రహ్మవిద్యాయాం దైవతాయోగ బ్రహ్మజిజ్ఞాస కర్మజిజ్ఞాస జన్మజిజ్ఞాసాత్మ సూత్రము సంపూర్ణము.

శ్రీరస్తు

# శ్రీ మహాఋషి నిఘంటిత యోగశాస్త్రము

## ద్వితీయప్రకరణము.

### అవస్థాపంచకయోగ సాంఖ్యయోగము.

—। సనత్కుమారుడు నారదునకు అవస్థాపంచకయోగ సాంఖ్యయోగము జెప్పుట. । —

అవస్థాపంచీకరణ విభాగము ఎట్లనగా,

5. జాగ్రదవస్థ॥ స్వప్నావస్థ। సుషుప్త్యవస్థ॥ తుర్యాదవస్థ। తుర్యాతీతం॥
1. జాగ్రిదవస్థ॥ రక్తవర్ణం॥ పృధివిహంశ॥ స్థూలము.
2. స్వప్నావస్థ శ్వేతవర్ణం॥ అపహంశ। సూక్ష్మము.
3. సుషుప్త్యవస్థ కృష్ణవర్ణం॥ అగ్నిహంశ। కారణము.
4. తుర్యావస్థ। నీలవర్ణం॥ వాయువహంశ॥ మహాకారణము.
5. తుర్యాతీతం। సునీలం॥ ఆకాశహంశ॥ ఆత్మ.
1. రక్తవర్ణమైన పృధివితత్వము॥ జాగ్రదవస్థలో శ్వేతవర్ణమైన॥ జలతత్వం స్వప్నావస్థ.
2. రక్తవర్ణమైన పృధివితత్వము। జాగ్రదవస్థలో కృష్ణవర్ణమైన॥ అగ్నితత్వ॥ సుషుప్త్యవస్థ.
3. రక్తవర్ణమైన పృధివితత్వము। జాగ్రిదవస్థలో పృధివితత్వమైన॥ జాగ్రిదవస్థ.
4. రక్తవర్ణమైన పృధివితత్వము॥ జాగ్రదవస్థలో నీలవర్ణమైన వాయువతత్వం తుర్యావస్థ.
5. రక్తవర్ణమైన పృధివితత్వము॥ జాగ్రిదవస్థలో॥ సునీలమైన మహాబిందాత్మకళాస్వరూపము॥ ఆకాశతత్వమైన తుర్యాతీతం.

1. శ్వేతవర్ణమైన జలతత్వము॥ స్వప్నావస్థలో॥ రక్తవర్ణమైన పృథివితత్వము జాగ్రదవస్థ.
2. శ్వేతవర్ణమైన జలతత్వము॥ స్వప్నావస్థలో॥ కృష్ణవర్ణమైన అగ్నితత్వము॥ సుషుప్త్యవస్థ.
3. శ్వేతవర్ణమైన జలతత్వము॥ స్వప్నావస్థలో॥ జలతత్వమైన స్వప్నావస్థ.
4. శ్వేతవర్ణమైన జలతత్వము॥ స్వప్నావస్థలో ॥ నీలవర్ణమైన వాయువతత్వము॥ తుర్యావస్థ.
5. శ్వేతవర్ణమైన జలతత్వము స్వప్నావస్థలో సునీలమైన మనోబిందుకళాత్మస్వరూపమె తుర్యాతీతము.
1. సునీలమైన మనోబిందుకళాత్మ స్వరూపమైన॥ ఆకాశతత్వము తుర్యాంతర్యములో రక్తమైన పృథివితత్వము జాగ్రదవస్థ.
2. సునీలమైన మనోబిందుకళాత్మస్వరూపమైన॥ ఆకాశతత్వము తుర్యాంతర్యము॥ శ్వేతవర్ణమైన జలతత్వము ॥ స్వప్నావస్థ.
3. సునీలమైన మనోబిందుకళాత్మస్వరూపమైన ఆకాశతత్వములో॥ కృష్ణవర్ణమైన తేజోతత్వము॥ సుషుప్తి.
4. సునీలమైన మనోబిందుకళాత్మస్వరూపమైన॥ ఆకాశతత్వములో ॥ నీలవర్ణమైన వాయువతత్వము॥ తుర్యావస్థ.
5. సునీలవర్ణమైన మనోబిందుకళాత్మస్వరూపమయిన॥ ఆకాశతత్వములో॥ సూక్ష్మకళాత్మస్వరూపమయిన తుర్యాతీతము.
1. కృష్ణమైన అగ్నితత్వము॥ సుషుప్తిలో ॥ రక్తవర్ణమైన॥ పృథ్వితత్వము జాగ్రదవస్థ.
2. కృష్ణవర్ణమైన అగ్నితత్వము॥ సుషుప్తిలో శ్వేతవర్ణమైన స్వప్నావస్థ.
3. కృష్ణవర్ణమైన అగ్నితత్వము సుషుప్తిలో ॥ అగ్నితత్వమైన సుషుప్తి.
4. కృష్ణవర్ణమైన అగ్నితత్వము॥ సుషుప్తిలో ॥ నీలవర్ణమైన వాయువతత్వము॥ తుర్యావస్థ.
5. కృష్ణవర్ణమైన అగ్నితత్వము॥ సుషుప్తిలో॥ సునీలమయిన మనోబిందుకళాత్మస్వరూపమై తుర్యాతీతము.
1. నీలవర్ణమైన వాయువతత్వము॥ తుర్యావస్థలో ॥ సునీలమైన మనోబిందుకళాత్మతత్వమె॥ తుర్యాతీతము.

2. నీలవర్ణమైన వాయువతత్వము॥ తుర్యావస్థలో॥ కృష్ణవర్ణమైన॥ తేజోతత్వము॥ సుషుప్త్యవస్థ.
3. నీలమైన వాయువతత్వము తుర్యావస్థలో॥ శ్వేతవర్ణమైన జలతత్వము। స్వప్నావస్థ.
4. నీలవర్ణమైన వాయువతత్వము॥ తుర్యావస్థలో॥ రక్తవర్ణమైన పృధివితత్వము జాగ్రదవస్థ॥
5. నీలవర్ణమైన వాయువతత్వము తుర్యావస్థలో॥ వాయువతత్వమైనతుర్యావస్థ॥ త్రినేత్రమంధు, హృదయాకాశమధ్యమందు, ఈ పంచభూతములున్ను, వర్ణములున్ను, నివాసస్థానమైయున్నవి.
1. పృధివితత్వము, ఆత్రినేత్రమునందు, చుట్టూయుండే రక్తవర్ణమై పృధివిహాంశ॥ జాగ్రదవస్థ॥
2. జలతత్వము దానిచుట్టూయుండె శ్వేతవర్ణమే॥ ఉపహాంశ॥ స్వప్నావస్థ.
3. అగ్నితత్వం॥ దానిచుట్టూయుండె॥ నలుపువర్ణమే॥ తేజోహాంశ॥ సుషుప్త్యవస్థ॥
4. వాయువతత్వం। దానిచుట్టూయుండే। నీలవర్ణమె। వాయుహాంశ॥ తుర్యావస్థ.
5. ఆకాశతత్వం॥ దానిమధ్యనుండె. సునీలమైనజ్ఞాత। బిందువనేమనస్సు॥ తుర్యాంతర్యము॥ యీ యిరువది ఐదుతత్వములు॥ అవస్థాపంచీకరణమనబడును.

ఈఅవస్థాపంచీకరణము పూర్వులు వారివారి పాండిత్యములచేత॥ కైవల్యనవనీతం॥ శీతారామాంజనేయం ఇంకా మొదలైన కొన్నిగ్రంథములలో వ్రాసియుంటిరిగాని, అవస్థాపంచకముయొక్క అంతరార్థము ఏగ్రంథములయందును వ్రాసియుండలేదు. ఆకారణంబుచేత కొందరువేదాంతులు యీసాంఖ్యమును విచారించక, దీనిని పూర్వపక్షంబుజేసిరి. కొందరు ఆత్మవిచారణపరులు ఆరుదుగ అవస్థాత్రయమునే, వాచ్యార్థముగ విచారించుచుంటిరి. అంతటితోనే సంతుష్టినొందచుంటిరిగాని, ముందువ్రాయబోయే॥ అవస్థాపంచకముయొక్క॥ లక్ష్యార్థము, నాకు గోచరించినంతవరకు వ్రాసితిని. బుద్ధిమంతులగువారు మీదుమిక్కిలిగ నాయనుభవమునకు వ్యతిరేకార్థము గాకుండగ నూహింపవచ్చును.

ఈ అవస్థాపంచకము శ్రీ ఆదిశంకరులవారు అవస్థాత్రియంలో చెప్పియున్నారు. ఇది భాష్యమందు నాగరలిపిలో మాతృభాషలోనున్నది. కాబట్టి దీనిని విచారింతము.

అవస్థాపంచకమునకు అంతర్లక్ష్యము.

1 రక్తవర్ణమైన జాగ్రతావస్థనగ—బాహ్యవ్యావహారికమందు ఉత్పత్తి స్థితిలయములు, యజ్ఞయాగాదిక్రతువులు మొదలయిన పుణ్యకర్మలు, కించిత్‌జ్ఞత్వాదిగుణములచే చేయబడిన పాపకర్మములు, కర్మేంద్రియ వ్యావహారికమున్ను, జ్ఞానేంద్రియ వ్యావహారికములు, ధర్మార్థకామ మోక్షములును దానధర్మవ్రతారాధన ఆవాహనాది షోడశకర్మ, షోడశదాన, షోడశపూజావిధానములును, పితృకర్మ, దేవకర్మ, శుభకర్మ మొదలయిన సర్వవ్యావహారికములున్ను కార్యోపాధిరయంజీవః॥ కార్యోపాధిరూపుండైన, కించజ్ఞుండైన పంచవింశతితత్వాత్మకుండైన వ్యవహారికజీవుడు యింద్రియమిత్రుండైన వ్యావహారికజీవునియొక్క అవస్థ, జాగ్రతావస్థ, విశ్వుడభిమాని, సృష్టికర్త.

2 రక్తవర్ణమైన పృథివిహంశ, జాగ్రదవస్థలో జాగ్రత్తనగ, తెలివి, జ్ఞానం, గుర్తెరిగే యెరుక, యెరుకలో యెరుక, తలివిలో తెలివి, యెరుకమరుపుల నెరిగెడియెరుక. అంతర్బాహ్యేంద్రియములనే విషయములు, వాటి వ్యవహారికములు గ్రహించేదే తన్ను తా గుర్తెరిగేదే లో జాగ్రతావస్థ. ఈయవస్థ సమస్తజ్ఞానములుకలది. పంచవింశతితత్వములయొక్క ఉత్పత్తి స్థితిలయములు వాటివాటి వ్యవహారములున్ను గ్రహించే గ్రాహ్యకశక్తే లోజాగ్రతావస్థ.

3 శ్వేతవర్ణమైన ఉపహంశ, స్వప్నావస్థనగ 17 తత్వములచేతకూడినదే స్వప్నం. 25 తత్వములలో ను 8 తత్వములు తగ్గుటచేత సూక్ష్మదేహ మనబడెను. ఈ 17 తత్వములచే వ్యవహరించుచున్నది. బాహ్యేంద్రియములు మరచినవాడు జ్ఞాత. ఈజ్ఞాతే తైజసుడు, అభిమాని. దీనినే లింగదేహమనికూడా చెప్పవచ్చును. అంతరింద్రియ వ్యావహారికము చేయునది స్వప్నము. పాన్పున బవ్వళించినను పెక్కుదేశములు దిరుగు కల గాంచుచున్న నిద్రితునిభంగి తాను సచ్చిదానందస్వరూపుడై జననమరణబాధలను జెందినట్లుండుటచేత సూక్ష్మదేహస్వరూపుడై మనోరూపంబున అనగా, వాయువేగ మనోవేగంబున అంతరసూక్ష్మలింగదేహ వ్యవహారమునకు అభిమానియై, తైజసుడై విష్ణుహంశగలవాడై వృద్ధిజేయుచున్నదే స్వప్నావస్థ.

4 శ్వేతవర్ణమైన అపహంశ, స్వప్నావస్థ. లో స్వప్నమనగ, అంతరేంద్రియ వ్యవహారము చేయుచున్న లింగదేహం. ఇదే సూక్ష్మదేహం. ఈలింగదేహమే పంచవింశతితత్వమయిన ప్రజ్ఞానస్వరూపంబైన జ్ఞాత. ఈజ్ఞాతయనే జీవుడే ఆకాశాంశంబైన సునీలమయిన బిందువనే సూక్ష్మదేహమనే మనోబిందువే లింగదేహం. ఈస్వప్నమందునకూడ ఉత్పత్తి స్థితిలయములున్ను, సర్వవ్యవహారములున్ను తనంతట తానేవచ్చి తనంతటతానే మటుమాయముగా బోవుచుండెను.

॥శృతి॥ అనాత్మదృష్టే అవివేకనిద్రా అహంమను స్వప్నగతింగతోహం॥ అనునట్లు తనకుతానే అనాత్మదృష్టిచేత అవివేకమయిన తనయందు తనకుతానే అనేక సంవత్సరములు సంసారపరిశ్రమలు బొందుతూ తుదకు తానున్ను తానుచేసిన అంతరేంద్రియ వ్యవహారమున్ను యేమీ లేకయున్నది. ఈలింగదేహమే జననమరణములకు కారణబీజం. ఇదే మూలప్రకృతి, మూలమాయ. ఇదే ప్రజ్ఞానస్వరూపమయిన సునీలమయిన మనస్సనే బిందువనే జ్ఞాతే లోస్వప్నం.

5 సుషుప్త్యవస్థనగ, సుషుప్త్యవస్థ - నలుపువర్ణమయిన తేజోహంశ. దేహేంద్రియములు మరుచుట. జ్ఞానేంద్రియవ్యవహారము, అంతరేంద్రియ వ్యవహారము, కార్యకారణములు, కర్మేంద్రియ వ్యవహారములు, 25 తత్వముల వ్యవహారములున్ను మరచుట జడస్వరూపం, గాఢనిద్ర, అవ్యక్తం, మరుపు, స్థూలదేహేంద్రియ వ్యవహారం మరచుట, సూక్ష్మదేహ వ్యవహారం మరచుట. సుషుప్త్యవస్థ యెట్లనిన బీజమందు వృక్షము యిమిడీయున్నట్టున్ను, జాగ్రిత, స్వప్నములు, సుషుప్తియనే బీజమందు యిమిడీయున్నవి. అనగా, నవరసపదార్థములు భుజించిన వాటిసారమున్ను, ఆహారనిద్రాభయమైథునములు సమానములుగా ననుభవించుచుండుటచేతను, దేహేంద్రియ వ్యవహారం మరచుటకు కారణం పంచతన్మాత్రలయొక్క విషయవ్యవహారమున్ను, కర్మేంద్రియములయొక్క వ్యవహారమున్ను, అంతరేంద్రియములయొక్క వ్యవహారమున్ను సారాయితాగినవానివలె దేహేంద్రియముల వ్యవహారము మరచి అజ్ఞానాంధకారమయిన మరుపుయందున్నవి. దీనినే కారణదేహమని ఈశ్వరుడు, అభిమాని దీనినే ప్రాజ్ఞుడనిన్ని, యీప్రాజ్ఞుడు లయకర్త

యని యీలయకర్తయొక్క అవస్థ సుషుప్త్యవస్థయని అవ్యక్తుడని కళాస్వరూపుడు. ఈకళే బిందుకళ.

6 నలుపువర్ణమయిన, అగ్నిహంశమైన సుషుప్త్యవస్థలో సుషుప్తి. బిందుబీజములయందు యీడే ఉత్పత్తి స్థితిలయములు, కామక్రోధలోభమోహమదమాత్సర్యంబులచే కల్పింపబడి సృష్టికి కారణమై తిరిగి మెలుకువ వచ్చి వ్యవహరించును తిరిగి లయస్థానమునజేరి కూర్మము అవయవంగములు ముడుచుకొనియున్నట్లో తాను ఆలాగుననే దేహేంద్రియములను లోబరుచుకొని తాను హృదయాకాశమందు సూక్ష్మబిందుబీజకళారూపంబున యిమిడియున్నది. సుషుప్తియందు సూక్ష్మబిందుబీజకళాస్వరూపము వకపరి లోపలికిని వకపరి వెలుపలికిని వుభయము తానై యున్నదే సుషుప్త్యవస్థ. ఇది కారణోపాధిలో సుషుప్త్యవస్థ.

7 నీలవర్ణమయిన వాయువహంశ, తుర్యమనగ జాగ్రిత స్వప్న సుషుప్త్యవస్థలకు సాక్షి కూటస్థుడు. ప్రత్యగాత్మ, నిష్కళాస్వరూపము, తాను తానైన తత్వము బాహ్యత్రిపుటి, అంతర్త్రిపుటి, అంతరాంతరత్రిపుటులకు విలక్షణమయిన ప్రత్యగాత్మ, హృదయాకాశమందు జ్యోతిర్మయాకారంబుగ స్వయంప్రకాశమాత్రంబైయున్నది. కూటస్థచైతన్యమాత్రంబైన యీప్రత్యగాత్మ బ్రహ్మచైతన్య నిర్గుణ సాక్షాత్కార పరోక్ష కేవలాత్మస్వరూపము. తాను మహాకారణ తత్వస్వరూపుడైన తుర్యావస్థయందు సాక్షిత్వమును బొంది అధర్వణవేదోక్తోపనిషత్తులో ఐయాత్మా బ్రహ్మంబని పల్కినట్లు మానవిష్ఠాగరిష్ఠ నిర్వికల్పసమాధినుండి తాను తానైన దృక్కుదృశ్యములకు విలక్షణుడై, తాద్రష్టయై త్రికూటమధ్యమందు ప్రకాశించే కళ ఆకళలో నిష్కళాస్వరూపంబైన ద్రష్ట పరిశుద్ధయెరుక. ప్రజ్ఞానంబ్రహ్మము తా నైనదే తుర్యము.

సూత్రభాష్య, గీతాభాష్య ఉపనిషద్ భాష్యములకు విలక్షణుడై విజ్ఞానమయకోశంబుననుండి కులాలచక్రంబువలె శింశుమారచక్రంబనగ శిమ్మరసానవలె కాలచక్రంబు జాగ్రత, స్వప్న, సుషుప్త్యవస్థలయందు వ్యవహరించుచూ తాను మోక్షస్థానమునుజూచుచు విలక్షణుడైయుండు. ఇదే తుర్యావస్థ మహాకారణతత్వం నిర్వికల్పసమాధి తానుతానైన తత్వంతుర్యాతీతం.

8 సునీలవర్ణమయిన ఆకాశాంశ. ఇది శబ్దగుణాకాశము. ఎట్లనగ—కూటస్థచైతన్య మాత్రుండౌటచేత మహాకారణమౌటచేతను ప్రత్యగ్భిన్నపరమాత్మ కేవలాత్మస్వరూపం తుర్యాతీతం.

॥శృతి॥ ఆకాశస్యగుణశబ్దో నిశ్శబ్దో బ్రహ్మోచ్యతే॥ ఇత్యాదిశృతులు చెప్పుచున్నవి. నిశ్శబ్దాకాశమే తుర్యాతీతము. తత్వమసీతి మహోపనిషద్వాక్యములు చెప్పుచున్నవి.

॥శృతి॥ తశ్శాఖ్శిఖాయామధ్యే పరమాత్మేవ్యవస్థితః॥ మేరుశిఖాగ్రమందు మహాకారణస్వరూపమయిన తుర్యావస్థయందు నివసించియున్న ప్రత్యగాత్మస్వరూపమయిన సాక్షి తేజోమయరూపంబైన నిష్కళాస్వరూపం తుర్యం. ఈతుర్యస్వరూపునకు ప్రత్యగ్భిన్న పరమాత్మే తుర్యాతీతం. ఈతుర్యాతీతము అకళలో నిష్కళ. యీనిష్కళాతీతమే కేవల పరిపూర్ణ శుద్ధచైతన్యస్వరూపం తుర్యాతీతం.

॥శృతి సర్వాతీతం సమరసగతం శాంతినిర్వాణదీపం తుర్యాతీతం తత్వమస్యతివాక్యం బ్రహ్మైక్యబోధ మన్వయం.

జాగ్రత, స్వప్న, సుషుప్తి, తుర్య, తుర్యాతీతములనే
పంచావస్థలకున్ను లక్ష్యార్థము.

1 జాగ్రతావస్థలో జాగ్రతావస్థనగ— ఇరువదిన్నాలుగు తత్వములతోగూడి వ్యవహరించుచున్నవాడే వ్యవహారికజీవుడు. కార్యోపాధి కించిద్జ్ఞత్వాది గుణములుగలవాడు వ్యష్టిజీవాత్మ, విశ్వుడు, సృష్టికర్త జాగ్రత - మెరుక గ్రాహ్యశక్తిగలని—స్థూలశరీరములో జాగ్రతనగ, సర్వేంద్రియ విలక్షణం, పంచకోశవ్యతిరిక్తంబైన కూటస్థసాక్షి చైతన్యంలో మెరుక - మెరుకమరుపుల నెరిగెడిమెరుక, హృదయాకాశమధ్యమందు ప్రకాశించే కళాస్వరూపంలో జాగ్రత, ఆత్మానాత్మవివేకమైన నీసాక్షిస్వరూపంలోజాగ్రత.

తెలివిలోతెలివి, మెరుకలోమెరుక, జ్ఞానంలోజ్ఞానం, సత్యజ్ఞానానందస్వరూపంబైన తానే జాగ్రతస్వరూపం. తన్ను తా గుర్తెరుగునది తెలివి, 2వ వాసు—లోజాగ్రత.

2 స్వప్నం, స్వప్నములోస్వప్నమనగ, జాగ్రతావస్థ లేనిదే వున్నట్టుగ తోచబడినది స్వప్నభ్రమ. అనాత్మదృష్టిచేత తోచబడినదే స్వప్నము.

లింగదేహ వ్యవహారికము, ఇదే సూక్ష్మదేహ వ్యవహారికము, అధ్యారోపాప వాదము, రజ్జుసర్పభ్రాంతి. త్రాటియందు సర్పభ్రాంతితోచిన దానిపేరు స్వప్నం. దీనినే ఆభాసచైతన్యభ్రాంతి జాగ్రతే స్వప్నంబని భావించిసదే లోస్వప్నము.

3 సుషుప్తిలో సుషుప్తనగ, నిర్వికల్పసమాధి, అమనస్కరాజయోగము. ఈసుషుప్తియందు మనస్సు యున్నయెడల స్వప్నంలో జాగ్రత్తకూడా యున్నదేకదా. సుషుప్తియందు స్వప్నజాగ్రత్తలు, మరుమరీచికభ్రాంతివతుగా తోచబడినవి. జాగ్రిత్త, లేనిది వున్నట్లుగా తోచినది స్వప్నం. వున్నది లేనట్లుగా తోచినది జాగ్రిత్త. ఈరెండుకానిది సుషుప్తిలో సుషుప్తి. సుషుప్తియందున్న తెలివి లోసుషుప్తి.

4 తుర్యా, తుర్యాతీతమనగ, హృదయాకాశమందు జ్యోతిర్మయాకారముగ ప్రకాశించే తేజస్సే ప్రత్యగభిన్న పరమాత్మస్వరూపము.

కళాస్వరూపం ప్రకాశించేదే కారణదేహము, సుషుప్త్యవస్థ. ఆకళలో నిష్కళేతుర్యం, తుర్యాతీతము, నిష్కళము, నిరంజనం, నిరామయం, నిర్గుణం, పరాత్పరం, కేవలాత్మ శుద్ధచైతన్యంబైనదే తుర్యాతీతము.

5 స్వప్నంలో స్వప్నమనగ, మనోసంకల్పం 17 తత్వములచేకూడినదే జ్ఞాత. లింగదేహము, సూక్ష్మదేహము, అపాంచీకృతములైన వ్యవహారిక జీవుడు, జీవకళాస్వరూపం, లోప్రపంచవ్యవహారకుడు, భ్రూమధ్యస్థానమందు కళాస్వరూపము, మూలజ్ఞప్తి, కళామాత్రశరీరము.

6 లోస్వప్నమనగ, హృదయాకాశమధ్యమందు సునీలమైన బిందువనే హంసయనే మనస్సు. యీమనస్సే ఇరువైయొక్కవెయ్యి ఆరువందల హంసల చేకూడిన మనస్సే లోపలివ్యవహారం చేయుచున్నది. ఇది సూక్ష్మశరీరవ్యవహారము.

7 సుషుప్త్యవస్థనగ, కారణశరీరం, కళాస్వరూపం, నిర్వికల్పం, మనోలయం, ఉత్పత్తి స్థితిలయకారణం, స్థూలసూక్ష్మలయం, అంతరింద్రియ లయము, వుపాధిలయము, బాహ్యేంద్రియ వ్యవహారలయము, ఇది లో సుషుప్తి.

8 తుర్యం లోతుర్యమనగ, హృదయాకాశమధ్యమందు స్వయంప్రకాశమైన తేజస్సు. వెలుగులకెల్ల వెలుగు, అఖండతేజోమయాకారముగా ప్రకా

శించే తేజస్సు, సాక్షి ప్రత్యగాత్మ, ఆకళలో నిష్కళ, నిర్బీజసమాధి, తాను తా నైనతత్వము, నిర్గుణసాక్షాత్కార ప్రత్యగ్భిన్న పరమాత్మ.

9 తుర్యాతీతమనగ, హృదయాకాశమధ్యమందు ప్రకాశించే కళ, ఆకళలో నిష్కళే తాను. తానే సాక్షి. ఈసాక్షే ప్రత్యగాత్మ. తుర్యా, యీతుర్యాతీతమైన ప్రత్యగ్భిన్నపరమాత్మ. ఈపరమాత్మే తాను. తానే సర్వాంతర్యామి. సుఖదుఃఖరహితం, బంధమోక్షరహితం, బీజరహితం, గురుశిష్యరహితం, జీవభ్రాంతిరహితం, నిష్కళాతీతం, అవాఙ్మానసగోచరం. ఇదే అమనస్కరాజయోగం. ఇది సద్గురుముఖవివేకజ్ఞానమున తన్ను తా తెలియవలెను.

అవస్థాపంచకముయొక్క లక్ష్యార్థము.

1 జాగ్రత్త లోజాగ్రత్తనగ, తెలివి, లోతెలివి.

2 స్వప్నం లోస్వప్నం, యెరుక లోయెరుక.

3 సుషుప్తి లోసుషుప్తి, జ్ఞానం లోజ్ఞానం.

4 తుర్యం లోతుర్యం, జీవాత్మ లోపరమాత్మ.

5 తుర్యాతీతం లోతుర్యాతీతం, ప్రత్యగాత్మ లోపరమాత్మ.

1 జాగ్రత్త లోజాగ్రత్తనగ, 25 తత్వములచేత కూడినదైన సునీల బిందువనే మనస్సు. జ్ఞాత, యీజ్ఞాత లోజ్ఞాతనగ, యీజీవాత్మే తానని తెలియుటే లోజాగ్రత్త.

2 స్వప్నం లోస్వప్నమనగ, భ్రూమధ్యస్థానమందు జ్యోతిర్మయాకారముగ ప్రకాశించే కళ లింగదేహం. ఇదే సూక్ష్మదేహము.

3 సుషుప్తి లోసుషుప్తనగ, సహస్రారమధ్యమందు ప్రకాశించే వెలుగు సుషుప్తి. అనేక చిత్కళాసమూహములు దశవిధనాదములు. పంచాకాశములు, పంచవర్ణములు, పంచబీజములు లయమై మనోలయమైనదే తాను తా నైన కూటస్థబ్రహ్మ సుషుప్తి.

4 తుర్యం తుర్యాతీతమనగ, హృదయాకాశమందు ప్రకాశించే కళే సర్వసాక్షితుర్యం. ప్రత్యగాత్మ, ఆకళలో నిష్కళే తుర్యాతీతం. తాను తానాట తుర్యం. తాను బ్రహ్మంబాట తుర్యాతీతము. తన్ను తా దెలియుట జాగ్రత్త. వ్యవహారికజీవుడు స్వప్నావస్థ.

1 తానే జాగ్రత్త. తానే స్వప్నం. తానే సుషుప్తి. తానే తుర్యా. తానే తుర్యాతీతంబైన పరమాత్మ.

2 తానే వ్యవహారికజీవుడు జ్ఞాత. తానే కూటస్థుడు. తానే ప్రత్యగాత్మ. తానే సాక్షి. తానే పరమాత్మ. తనకంటె అన్యమించుకైనను లేదు. అంతా తానే. సర్వం బ్రహ్మమయం జగత్తు.

॥శృతి॥ అన్యధా శరణం నాస్తి త్వమేవశరణం మమ॥ యని సద్గురునకు త్రికాలములయందు ద్వాదశశిరసాష్టాంగదండప్రణామంబులాచరించి యనవరతము మనోమాయతపుష్పంబులచే పూజించి నిరంతరం వకదళం యిస్తూ యుండవలెను. పూఁడుగబీజవతు గానున్ను, లతకూనవలెనున్ను, యనవరతము శ్రవణమనన నిధిధ్యాసములచే తన్నుదా దెలియవలెను. తనచేత నిరూపించిన వ్యష్టిస్థూలసూక్ష్మకారణశరీరములకంటె వానియందున్న జాగ్రిత స్వప్న సుషుప్తవస్థారూపమయినట్టి రజస్తత్వతమోగుణాత్మికమైనట్టి అవిద్యకంటె వానియందభిమానముగలిగియున్న విశ్వతైజసప్రాజ్ఞులనే జీవులకంటె వేరైన యీ వ్యష్టిప్రపంచకమునకు సాక్షియైనవాడే కూటస్థుడు. అతడే ఆత్మ.

2 తాను నిర్వికారుడగుటచే కూటస్థుడనియు, యింద్రియములకు గోచరుడుగాక లోపలనుండువాడగుటచేత ప్రత్యగాత్ముండనియు, నాశనరహితుడగుటచే నక్షరుండనియు, జ్ఞానస్వరూపుడై సర్వము గుర్తెరుగుటచేత సాక్షియనియు, పిలువబడుచున్న తానే పరమాత్మయనియు, దృష్టాంతమందు జూపబడిన ఘటాకాశ మహాకాశములకు భేదములేనట్టి సాక్షినైన తనకున్ను పరబ్రహ్మమునకున్ను భేదములేదని నిశ్చయమే నిరూపింపబడిన మహాకాశము వలెనే నిశ్శబ్దాకాశమువలెనే సమిష్టిస్థూలసూక్ష్మకారణములకంటె అందు యవస్థాత్రియములకంటె త్రిగుణములనే మాయకంటె అందు ప్రతిబింబించిన విరాట్టుహిరణ్యగర్భ అవ్యాకృతులకంటె విలక్షణమై సాక్షియై పరమాత్ముండు తుర్యాతీతుండై ప్రకాశించుచుండె.

1 జాగ్రదవస్థయొక్క మిశ్రమముల యేకభావసమిష్టి.

జాగ్రత్తలో జాగ్రత్త, విశ్వునిలో విశ్వుడు, రక్తవర్ణంలో రక్తవర్ణం, పృధివితత్వంలో పృధివితత్వం, అకారంలో అకారం, రజోగుణంలో రజోగుణం, జ్ఞానశక్తిలో జ్ఞానశక్తి, అండాండంలో అండాండం, నాదంలో నాదం

చిత్తులో చిత్తు, తత్పదంలో తత్పదం, యిడలో యిడ, గంగలో గంగ, తనలో తాను.

ఈఅంతరత్రిపుటి అవస్థాత్రియ సాంఖ్యమని చెప్పబడును. దహరాకాశపంచకమధ్యమందు యీ అంతరత్రిపుటి విచారణ చేయవలెను.

స్వప్నంలో స్వప్నం, తైజసునిలో తైజసుడు, శ్వేతవర్ణంలో శ్వేతవర్ణం, జలతత్వంలో జలతత్వం, అకారంలో అకారం, సత్వగుణంలో సత్వగుణం, ఇచ్ఛాశక్తిలో ఇచ్ఛాశక్తి, పిండాండంలో పిండాండం, బిందువలో బిందువ, సత్తులో సత్తు, తత్పదంలో తత్పదం, పింగళలో పింగళ, యమునలో యమున, తానే తాను.

ఈరహస్యం యేకస్థానమందు తన్ను తా తెలిసి తెలియనిచందమున తెలిసియుండవలెను.

సుషుప్తిలో సుషుప్తి, ప్రాజ్ఞునిలో ప్రాజ్ఞుడు, కృష్ణవర్ణంలో కృష్ణవర్ణం, తేజస్సులో తేజస్సు, మకారంలో మకారం, తమోగుణంలో తమోగుణం, క్రియాశక్తిలో క్రియాశక్తి, బ్రహ్మాండంలో బ్రహ్మాండం, కళలో కళ ఆనందంలో ఆనందం, అశిపదంలో అశిపదం, సుషుమ్నలో సుషుమ్న, సరస్వతిలో సరస్వతి, తాను తానాట.

అంతరత్రిపుటి వివరం. మిశ్రితత్వములు, పీఠములు.

1 పృథివిహంశమైన, రక్తవర్ణమైన, అకారంమాతృక, అవిద్యాపాదం, అజ్ఞానజడం, స్థూలదేహం, జాగ్రదవస్థ అభిమాని, విశ్వుడు, విరాట్టు, ఓత, సద్యోజాతముఖం, నకారం, నివృత్తికళ యీపండ్రెండున్నుచేరి బ్రహ్మపీఠ తారకము.

2 అపహంశమైన, శ్వేతవర్ణమైన, ఉకారంమాతృక, విద్యాపాదం, సూక్ష్మదేహం, స్వప్నావస్థ, తైజసుడు, హిరణ్యగర్భుడు, అనుజ్ఞాత, వామదేవముఖము, జలతత్వము, మకారము, ప్రతిష్టాకళ, దండము యీపదుమూడున్ను చేరి విష్ణుపీఠము.

3 అగ్నిహంశ, కృష్ణవర్ణము, మకారంమాతృక, ఆనందపాదం, కారణదేహం, సుషుప్త్యవస్థ, ప్రాజ్ఞుడు, అభిమాని, అవ్యాకృతుడు. అనుజ్ఞయికరసుడు, అఘోరముఖం, సికారం, విద్యాకళ, కుండలాకారం, యీపండ్రెండున్నుచేరి రుద్రపీఠము.

4 వాయువహాంశ, నీలవర్ణము, అర్ధమాత్రి, తురీయవస్థ, మహాకారణదేహం, కూటస్థుడు, పరమాత్మ, అవికల్పుడు, తత్పురుషముఖం, వాయువతత్వం, వకారం, శాంతికళ, అర్ధచంద్రాకారం, యీపదునొకటిన్ని జేరి మహేశ్వరపీఠము.

5 ఈపైనచెప్పిన తత్వములన్నియు చేరి, సదాశివపీఠము. ఈశాన ముఖము- ఆకాశతత్వము సునీలవర్ణం, యకారం, శ్యాంత్యాతీతకళ బిందు రూపం, ॥శృతి॥ ప్రథమంతారకాకారం, ద్వితీయం దండముచ్యతే, తృతీయం కుండలాకారం, చతుర్థం అర్ధచంద్రమం, పంచమం బిందుసంయుక్తం, ఓమితి జ్యోతిరూపకం॥ యివి యన్నియుజేరి శక్తితత్వములైనవి.

ఈశివతత్వములును, శక్తితత్వములును, మీరినదే తుర్యాతీతం, నిర్గుణపరబ్రహ్మము ఇదినిష్కళము, నిరీహవము, నిష్ప్రపంచము, నిర్మలము, నిరంజనము, నిర్వికారము, నిర్ముక్తము, నిత్యము, బుద్ధము, శుద్ధము, అవ్యయము, అనుపమానము, కేవలము, అఖండము, అప్రమేయము, ఆద్యంతరహితము, పరాత్పరం, అపరోక్షం, స్వయంజ్యోతి, సర్వవ్యాపకము, నిరతిశయానందము, ఇది తుర్యాతీతము.

వ్యష్టిసమిష్ట్యుపాధులనగ, జీవతత్వములు, ఈశ్వరతత్వములు. జీవోపాధి, ఈశ్వరోపాధులనగ, క్షేత్రక్షేత్రజ్ఞులను, కార్యకారణములు, క్షరాక్షరములు, ఆత్మానాత్మవివేకదృష్టిచేత నిరాకరించి, నేతినేతీతి మహావాక్యానుభవముచేత- నిరాకరించి- ఘటాకాశమహాకాశములు నొక్కటిమైన తన్ను తాదెలసి, తానుతానై, నామరూపములు వేరైనంతమాత్రమున, యదార్థపదార్థమైన తానొక్కటియై యున్నదని తెలిసికొనవలెను. ఇందుకు వక దృష్టాంతంబు కలదు. ఘటము, కుండ, ముంత, మూకుడు, మొదలైనవానికి నామరూపములలో భేదమున్నను, నీవస్తుపదార్థములను బట్టి చూడగ, అవియన్నియు మృత్తికయేయని- మట్టి వకటిగానేచూచిన భేదమేమియులేదు కద, ఆత్మానాత్మ వివేకజ్ఞానముచేత యోచించిన మృణ్మయపాత్రములన్నియు మృత్తికయేయని తెలసికొనవలెను. ఇట్లె కుండలయందు, చెరువులయందు, నూతులయందు యున్న నీరు వకటియేయని దెలసికొనవలెను. రెండుదీపములయందుయున్న వత్తులు భేదమేగాని, దీపముయొక్క కాంతి వక్కటేయని తెలసుకొనవలెను. ఘటముయందు ఆకాశము, మహాకాశమునకు

న్ను- ఘటభేదమేకాని- ఆకాశమువక్కటిగానే- తెలసుకొనవలెను. యట్లే జ్ఞానదృష్టిచేత, ప్రకృతిజీవేశ్వర ప్రతిబింబములకు, పైసంబంధమువలెనే, వ్యష్టిసమష్ట్యుపాధులను వివేకదృష్టిచే దొలగించి, యదార్థస్థితిలో నవిలేనివే యని అప్పుడు ప్రతిబింబములు లేనేలేవు. కావున బుద్ధిమంతులగువారు పరబ్రహ్మమునకు, వికారమెప్పటికిని లేనేలేదు. తాను సర్వపరిపూర్ణుడని దెలసికొనవలెను.

అంతరమిశ్రమ త్రిపుటుల వివరం, అంతరార్థము.

(1 పృథివితత్వం, రక్తవర్ణం అకారం, జలతత్వం, శ్వేతవర్ణం ఉకారం అగ్నితత్వం కృష్ణవర్ణం, మకారం, ఈ మూడుమాతృకలున్ను కలిసి ఓంకారమైనది. ఈ ఓంకారమె బ్రహ్మప్రణవం.)

(2 జలతత్వం, శ్వేతవర్ణం, సత్వగుణము. పృథివితత్వం, రక్తవర్ణం, రజోగుణము. అగ్నితత్వం, కృష్ణవర్ణం, తమోగుణము. ఈ మూడుగుణములున్ను కలసి, త్రిగుణాత్మకమైన మూలప్రకృతి.)

(3 పృథివితత్వం, రక్తవర్ణం, జాగ్రదవస్థ. జలతత్వం, శ్వేతవర్ణం, స్వప్నావస్థ. అగ్నితత్వం, కృష్ణవర్ణం, సుషుప్త్యవస్థ. ఈ మూడవస్థలు కలసి కూటస్థుడు.)

(4 పృథివితత్వం, రక్తవర్ణం, విశ్వుడు. జలతత్వం, శ్వేతవర్ణం, తైజసుడు. అగ్నితత్వం, కృష్ణవర్ణం, ప్రాజ్ఞుడు. ఈమూడున్ను గలసి ప్రత్యగాత్మ.)

5 ఆకాశతత్వం, సునీలం, విరాట్టు. హిరణ్యగర్భ, అవ్యాకృతులు మూడుకలసి కారణోపాధి యీశ్వరుడు, ఆత్మతత్వము.

6 పృథివితత్వం, రక్తవర్ణం, అండాదం. సునీలవర్ణం, ఆకాశతత్వం, పిండాదం. కళాస్వరూపం, బ్రహ్మాండం. యీమూడున్నుకలసి హృదయకమలము.

7 వాయువతత్వం, నీలవర్ణం, ప్రణవం, నాదం- ఆకాశతత్వం, సునీలమైన బిందువ, ఆమధ్య ప్రకాశించేకళ, యీమూడున్నుకలసి జ్యోతిర్మయాకారం, తేజస్సు.

8 ఆకాశతత్వమైన సునీలమధ్యమందు జ్యోతిర్మయాకారంగ ప్రకాశించేదె సూర్యమండలం. వాయువతత్వం నీలవర్ణం, చంద్రమండలం.

అగ్నితత్వం, కృష్ణవర్ణం, అగ్నిమండలం. ఈమూడున్నుకలసి ఆత్మజ్యోతి స్వరూపము.

9 ఆకాశతత్వమైన సునీలమధ్యమందు ప్రకాశించే కళే సత్తు. పంచ భూత పంచవర్ణ సమన్వితమైన ప్రకృతి చిత్తు. సర్వసాక్షిస్వరూపమైన, సచ్చిదానంద స్వరూపమె, ఆనందము. ఇది సచ్చిదానందమయినది.

10 ఆకాశతత్వమైన సునీలమయిన మనోబిందువనే తత్పదం భ్రూ మధ్యస్థానమందు ప్రకాశించే తేజస్సు, త్వంపదం ఆకళలో నిష్కళే అసిప దం, యీమూడూకలసి శివజీవైక్యము.

11 వాయువతత్వం, నీలవర్ణం, యిఛ్ఛాశక్తి, ఆకాశతత్వం, సునీల వర్ణం, బిందువనేజ్ఞాత. ఇఛ్ఛాశక్తి, ఆమధ్యప్రకాశించే కళే, క్రియాశక్తి. ఈ మూడూకలసి, సృష్టికారణమైన కామకళాస్వరూపమయినది. ఇదియే జీవకళయనబడును.

12 వాయువతత్వం, నీలవర్ణం, యెడమనాసికరంధ్రం యీడ, సునీ లవర్ణం, ఆకాశతత్వం, కుడినాసికారంధ్రం, ఆమధ్య నీవారసూకంవలెను న్నది. భ్రూమధ్యస్థానమందువున్నది సుషుమ్నానాళం, యీ మూడుకలసి, బ్రహ్మరంధ్రమయినది. ముక్తిమార్గం మోక్షమార్గము.

13 వాయువతత్వం, నీలవర్ణం, గంగ, ఆకాశతత్వం, సునీలం, యమున, ఆమధ్య ప్రకాశించేకళ, సరస్వతి, యీమూడూ కలసి స్వయంప్ర కాశమయిన బ్రహ్మతేజస్సైనది.

14 పంచవింశతితత్వములు కలసి, జీవాత్మైనది. షడువింశతితత్వములు కలసి వేరై, అంతరాత్మైనది. సప్తవింశతితత్వములకు విలక్షణమయినది పర మాత్మ. ఈమూడూకలసి పరబ్రహ్మంబైనది.

—మిశ్రమతత్వములకు అంతరార్థం, ఇది బ్రహ్మప్రణవసాంఖ్యతారకము.—

(ఇది అకారమాత్రకకు అంతరార్థం.)

1 అకారంలో అకారం, రక్తవర్ణంలో రక్తవర్ణం, పృథివితత్వంలో పృథివితత్వం, ప్రణవమునకు ప్రథమమాత్రక.

2 అకారంలో ఉకారం, రక్తవర్ణంలో శ్వేతవర్ణం, పృథివితత్వము లో జలతత్వము, ప్రణవమునకు ద్వితీయమాత్రక.

3 అకారంలో మకారం, రక్తవర్ణంలో కృష్ణవర్ణం, పృధివితత్వం లో అగ్నితత్వం, ప్రణవమునకు తృతీయమాతృక.

4 అకారంలో అర్ధమాత్ర, రక్తవర్ణంలో రక్తవర్ణం, అజ్ఞానంలో అజ్ఞానం, ప్రణవమునకు అర్ధమాత్ర.

— అవిద్యాపదమునకు, అంతరార్థం. —

1 అవిద్యాపాదములో అవిద్యాపాదం, పృధివితత్వం, ఉపాధిలో-అజ్ఞానం, రక్తవర్ణంలో కృష్ణవర్ణం, జడంలో జడం.

1 అవిద్యాపాదమున విద్యాపాదము, రక్తవర్ణంలో సునీలవర్ణం, పృధివితత్వములో ఆకాశతత్వం, జ్ఞానంలో, అజ్ఞానము.

2 అవిద్యాపాదంలో ఆనందపాదం, రక్తవర్ణంలో, తేజోమయాకారము, అజ్ఞానంలో జ్ఞానము, పృధివితత్వంలో ఆత్మతత్వం.

3 అవిద్యాపాదములో తురీయపాదం, రక్తవర్ణంలో కళాతత్వం, పృధివితత్వంలో సాక్షితత్వం, అజ్ఞానంలో విజ్ఞానం.

—చతుర్ దేహములకు-అంతరమిశ్రమతత్వములకు అంతరార్థం.—

1 స్థూలదేహములో స్థూలదేహం, జడంలో జడం, పృధివితత్వంలో పృధివితత్వం, రక్తవర్ణంలో రక్తవర్ణం.

2 స్థూలదేహంలో సూక్ష్మదేహం, పంచవింశతితత్వాత్మికమైనదే స్థూలశరీరం- జడం అజ్ఞానం, సూక్ష్మదేహం, లింగదేహం- జ్ఞాత, రక్తవర్ణం లో సునీలమైన మనోబిందువ యనే జీవుడు.

3 స్థూలదేహంలో కారణదేహం, పృధివితత్వములో ఆకాశతత్వం, రక్తవర్ణంలో సునీలమయినవర్ణం, పంచభూతమిశ్రమమైనదే స్థూలం, తేజోమయాకారంగా ప్రకాశించే కళే కారణదేహం.

4 స్థూలదేహంలో మహాకారణం, పృధివితత్వంలో ఆత్మతత్వం, రక్తవర్ణంలో స్ఫటికవర్ణం, పృధివితత్వమైన పంచభూతమిశ్రమతత్వముల కు విలక్షణమయిన సాక్షియే మహాకారణము.

— చతురవస్థల మిశ్రమతత్వములకు లక్ష్యార్థం. —

1 జాగ్రత్తలో జాగ్రత్త, తెలివిలో తెలివి, రక్తవర్ణంలో రక్తవర్ణం, పృధివితత్వంలో పృధివితత్వం.

2 జాగ్రత్తలో స్వప్నము, ఎరుకలో ఎరుక, పృధివితత్వంలో జల తత్వం, రక్తవర్ణంలో శ్వేతవర్ణం.

3 జాగ్రత్తలో సుషుప్తి, ఎరుకలో మరుపు, పృధివితత్వంలో అగ్ని తత్వం, రక్తవర్ణంలో కృష్ణవర్ణం.

4 జాగ్రత్తలో తుర్యా, జ్ఞానంలో విజ్ఞానం, పృధివితత్వంలో ఆకాశ తత్వం, రక్తవర్ణంలో తేజోతత్వం.

జీవచతుష్టయ మిశ్రితతత్వములు, అంతరార్థం.

1 విశ్వునిలో విశ్వుడు, సగుణంలో సగుణం, పృధివితత్వంలో పృధివి తత్వం, రక్తవర్ణంలో రక్తవర్ణం.

2 విశ్వునిలో తైజసుడు, పంచవింశతితత్వాత్మకుడు, జ్ఞాత లో 17 తత్వములచేతకూడినవాడు, సూక్ష్మదేహమైన లింగదేహం. రక్తవర్ణంలో శ్వేతవర్ణం, పృధివితత్వములో జలతత్వం.

3 విశ్వునిలో ప్రాజ్ఞుడు, కార్యోపాధిలో కారణోపాధి, సగుణములో నిర్గుణం, పృధివితత్వంలో అగ్నితత్వం, రక్తవర్ణంలో కృష్ణవర్ణం.

4 విశ్వునిలో ప్రత్యగాత్మ, 25 పంచవింశతితత్వాత్మకుండైన వ్యవహారజీవునకు విలక్షణుండైన 26 రో వాడు సాక్షిప్రత్యగాత్మ, స్వయంప్రకాశం. పృధివితత్వంలో తేజోతత్వం, రక్తవర్ణములో స్ఫటికవర్ణం.

కారణచతుష్టయ మిశ్రితతత్వము, అంతరార్థం.

1 విరాట్టులో విరాట్టు, 26 ప్రత్యగాత్మలో పరమాత్మ, ఆకాశతత్వములో నిశ్శబ్దాకాశం, స్ఫటికవర్ణంలో స్ఫటికవర్ణం.

2 విరాట్టులో హిరణ్యగర్భుడు, ప్రత్యగాత్మలో జీవాత్మ, ఆకాశ తత్వంలో ప్రతిబింబచైతన్యము, స్ఫటికవర్ణంలో సునీలం.

3 విరాట్టులో అవ్యాకృతుడు, తేజోమయాకారముగ ప్రకాశించే ప్రత్యగాత్మలో 25 దో వాడైన కించజ్ఞత్వాదిగుణములుగల కార్యోపాధి 26 రో తత్వంలో 25 దో వాడు, తేజోమయాకారములో సునీలమైన మనోబిందువనే జ్ఞాత.

4 విరాట్టులో పరమాత్మ, ప్రత్యగాత్మలో పరమాత్మ, కళలో నిష్కళ, తేజస్సు బ్రహ్మతేజస్సు.

జీవేశ్వరచతుష్టయ మిశ్రితతత్వములు, అంతరార్థం.

1 ఓతలో ఓత, జ్ఞాతలో జ్ఞాత, తెలివిలో తెలివి, ఓంకారంలో ఓంకారం, శబ్దంలో శబ్దం ఓంకారం, ఆకాశంలో ఆకాశతత్వం, సునీలములో సునీలం.

2 ఓతలో అనుజ్ఞాత, జ్ఞాతలో సర్వజ్ఞాత్వాదిగుణములుగలవాడు, సర్వేంద్రియసమన్వితుడు. సునీలంలో కళ, ఆకాశంలో ఆకాశం.

3 ఓతలో అనుజ్ఞైకరసుడు, యీజ్ఞాతలో గ్రహించేవాడు మెరుక, మెరుకలో మెరుక, ఆకాశతత్వంలో ఆకాశతత్వం, 25 టింటిలో 26 వాడు.

4 ఓతలో అవికల్పుడు, సగుణంలో నిర్గుణం, సవికల్పంలో నిర్వికల్పం సంకల్పములేనివాడు సర్వసాక్షి నిర్గుణబ్రహ్మ. శ్వేతవర్ణంలో స్వయంప్రకాశము.

అకార ఉకార మకార మిశ్రమతత్వములు, అంతరార్థం.

1 మకారంలో అకారం, కృష్ణవర్ణంలో రక్తవర్ణం, అగ్నితత్వంలో పృథివితత్వం, ప్రాజ్ఞుడైన కారణోపాధిలో విశ్వుడైన కార్యోపాధి.

2 మకారంలో ఉకారం, కృష్ణవర్ణంలో శ్వేతవర్ణం, అగ్నితత్వంలో జలతత్వం, కారణదేహంలో సూక్ష్మదేహం, లింగదేహం.

3 మకారంలో మకారం, కృష్ణవర్ణంలో కృష్ణవర్ణం, అగ్నితత్వంలో అగ్నితత్వం, కారణతత్వంలో కారణతత్వం, పంచవింశతితత్వాత్మకుడు.

4 మకారంలో అర్ధమాత్ర, కృష్ణవర్ణంలో శ్వేతవర్ణం, అగ్నితత్వంలో జలతత్వం, సుషుప్తిలో స్వప్నం, లింగదేహం, జ్ఞాత.

అవిద్యా విద్యానందతురీయపాదముల మిశ్రమసమిష్టితత్వములు.

1 ఆనందపాదమున అవిద్యాపాదము అనగ, సచ్చిదానందబ్రహ్మమందు అజ్ఞానం జడమైనజ్ఞాతయనే జీవుడు, కించజ్ఞుడు కార్యోపాధి తానే వ్యవహారికుడు తానే ప్రత్యగాత్మలో తానే జీవాత్మ.

2 ఆనందపాదములో విద్యాపాదం, సచ్చిదానందపరబ్రహ్మమందు విద్యాజ్ఞానం, ప్రజ్ఞానం స్వరూపం మెరుకలో మెరుక, విజ్ఞానంలో జ్ఞానం, తెలివి.

3 ఆనందంలో ఆనందం, ప్రత్యగాత్మలో పరమాత్మ, విషయానందంలో బ్రహ్మానందం, శివజీవైక్యం తాను తానౌట.

4 ఆనందపాదములో తురీయపాదం, సవికల్పసమాధిలో నిర్వికల్ప సమాధి, తారకంలో సాంఖ్యం సాక్షి, ఆత్మతత్వములో పరమాత్మతత్వము.

స్థూలదేహ చతుష్టయ మిశ్రితతత్వములు, అంతరార్థం.

1 కారణదేహంలో స్థూలదేహం, జాగ్రత్తయందు వుత్పత్తిస్థితిలయములకు కారణమైన పంచవింశతితత్వములచే కూడినదే స్థూలదేహం. సుషుప్త్యవస్థ. కారణదేహంలో పంచభూతములచే కూడినది స్థూలదేహము. 24 తత్వములచే కూడినది స్థూలదేహం. 25 తత్వములచే కూడినది కారణదేహం.

2 కారణదేహములో సూక్ష్మదేహం, సుషుప్తిలో స్వప్నం, ఆత్మతత్వములో జీవతత్వం, సుషుప్తిలో తెలివి, లింగదేహం, కళాస్వరూపం, మనోరూపం, జన్మకారణమైన బీజం.

3 కారణదేహంలో కారణదేహం, తనలోతాను జీవాత్మలో అంతరాత్మ, ఆత్మలో ఆత్మ, సుషుప్తిలో తెలివి, కారణదేహం, తమోగుణం, కార్యోపాధి వ్యవహారికజీవుడు.

4 కారణదేహంలో మహాకారణదేహం, జీవాత్మలో పరమాత్మ, తాను తానౌటలో కారణంలో మహాకారణం, ప్రత్యగాత్మే పరమాత్మ, కార్యకారణతత్వములకు మీరినదే మహాకారణం, ప్రత్యగ్బ్రహ్మచైతన్యం, సాక్షి, చైతన్యం, శుద్ధచైతన్యం.

అవస్థాచతుష్టయ మిశ్రితతత్వములు, అంతరార్థం.

1 సుషుప్తిలో జాగ్రత్త, కారణోపాధియందు కార్యోపాధి, కించిజ్ఞనిలో సర్వజ్ఞుడైన తెలివి, సమాధియందు మెలుకువ తనయందు ఆత్మశక్తి.

2 సుషుప్తిలో స్వప్నం, కారణదేహంలో సూక్ష్మదేహం, ఆత్మయందు సృష్టిశక్తి, మూలప్రకృతి లింగదేహం, జన్మాంకురబీజం స్వప్నం.

3 సుషుప్తిలో సుషుప్తి, జీవాత్మలో ప్రత్యగాత్మ, నిర్వికల్పంలో సవికల్పం, పరమాత్మలో ప్రత్యగాత్మ, యీయాత్మే తాను, తానే ప్రత్యగాత్మ.

4 సుషుప్తిలో తురీయం, కారణతత్వంలో మహాకారణం, ఆకళలో నిష్కళ, సర్వసాక్షి నిర్గుణతత్వం, తాను తానైనదే తారకం.

1 స్వప్నములో జాగ్రత, శ్వేతవర్ణంలో రక్తవర్ణం, జలతత్వంలో పృథివితత్వం, సూక్ష్మదేహంలో స్థూలదేహం, లింగదేహంలో స్థూలదేహం, మెరుకలో మరుపు.

2 స్వప్నంలో స్వప్నం, శ్వేతవర్ణంలో శ్వేతవర్ణం, జలతత్వంలో జలతత్వం, సూక్ష్మంలో సూక్ష్మం, తెలివిలో తెలివి, లింగదేహంలో లింగదేహం, కించజ్ఞునిలో కించజ్ఞుడు.

3 స్వప్నంలో సుషుప్తి, జలతత్వంలో అగ్నితత్వం, శ్వేతవర్ణంలో కృష్ణవర్ణం, జ్ఞానంలో అజ్ఞానం, సూక్ష్మదేహంలో కారణదేహం.

4 స్వప్నంలో తురీయం, శ్వేతవర్ణంలో తేజోవర్ణం, లింగదేహమునకు సాక్షి, వ్యవహారికజీవునకు సాక్షి, యీతురీయావస్థ, మహాకారణా సర్వసాక్షిచైతన్యం, జాగ్రత స్వప్న సుషుప్తి యీయీ యవస్థలు స్వప్నమువంటివే. వున్నట్టున్నదే లేనిదే, భ్రాంతి, భ్రమ, లేనిదే వున్నట్టుతోచిన ఆనాత్మదృష్టిచేత తోచబడిన స్వప్నభ్రాంతి.

జీవచతుష్టయ మిశ్రమతత్వములు, అంతరార్థం.

1 తైజసునిలో విశ్వుడు, కించజ్ఞునిలో సర్వజ్ఞుడు, శ్వేతవర్ణమైన విష్ణుహంశలో, రక్తవర్ణంలో, బ్రహ్మ సృష్టికర్త, జలతత్వంలో పృథివితత్వం, తనలో తానే.

2 తైజసునిలో తైజసుడు, యెరుకలో యెరుక, తెలివిలో తెలివి, తనలో తాను, కార్యోపాధిలో చిదాభాసుడు, కళాస్వరూపం, శ్వేతవర్ణంలో శ్వేతవర్ణం.

3 తైజసునిలో ప్రాజ్ఞుడు, కార్యంలో కారణం, చిదాభాసునిలో కారణాస్వరూపం, జ్ఞాతలో జ్ఞానస్వరూపం, శ్వేతవర్ణంలో కృష్ణవర్ణం, జలతత్వంలో అగ్నితత్వం, చైతన్యంలో చైతన్యం.

4 తైజసునిలో ప్రత్యగాత్మ, సూక్ష్మంలో కారణంలో సాక్షి జ్ఞానంలో సత్యజ్ఞానానందప్రత్యగాత్మ.

— ఈశ్వర చతుష్టయ మిశ్రమతత్వములు, అంతరార్థం. —

1 హిరణ్యగర్భునిలో విరాట్టనగ, వ్యవహారికజీవునిలో పరమార్థకజీవుడు, కించజ్ఞునిలో సర్వజ్ఞుడు, 25 తత్వములచే కూడుకున్న జీవాత్మలో పరమాత్మ.

2 హిరణ్యగర్భునిలో హిరణ్యగర్భుడు, అనాత్మలో ఆత్మ, జీవాత్మలో పరమాత్మ.

3 హిరణ్యగర్భునిలో అవ్యాకృతుడు, గ్రాహ్యకశక్తిలో అగ్రాహ్యం, ఆభాసచైతన్యంలో చిదాభాసుడు.

4 హిరణ్యగర్భునిలో పరమాత్మ, సాక్షిలో సాక్షి, తనలో తాను, సర్వజ్ఞానంలో సత్యజ్ఞానం, జ్ఞానంలో జ్ఞానం.

— జీవేశ్వర చతుష్టయ మిశ్రమతత్వము, అంతరార్థం. —

1 అనుజ్ఞాతలో ఓతనగ, జ్ఞాతయందు ఓంఅనే శబ్దం పుట్టెను. ఆశబ్దమే ప్రణవం, యీప్రణవమె సోహంఅనే హంస.

2 అనుజ్ఞాతలో అనుజ్ఞాత, తెలివిలో తెలివి, తనలో తాను, జీవాత్మలో పరమాత్మ, జీవాత్మలో జీవాత్మ, పంచవింశతిలో పంచవింశకుడు, మెరుకలో మెరుక.

3 అనుజ్ఞాతలో అనుజ్ఞైకరసుడు, యింద్రియవిలక్షణుడు, అనుజ్ఞాత యింద్రియమిత్రుడు అనుజ్ఞాత.

4 అనుజ్ఞాతలో అవికల్పుడు, కార్యోపాధిలో కారణోపాధి, కల్పరహితుడు వికల్పనలేనివాడు, యింద్రియమిత్రుడు జ్ఞాత.

1 స్థూలప్రపంచంబు జాగ్రత్త వ్యష్టిసమిష్టిభేదములుగలది, జాగ్రదవస్థయైయున్నది. స్థూలశరీరంబువంటు దానికి సంబంధించిన వ్యష్టిసమిష్టియను భేదములు జాగ్రదవస్థే. వ్యష్టిసమిష్టిభేదోపాధికుండు లింగదేహోపాధికుండయిన సూక్ష్మోపాధిగల తైజసుండైన జీవుడు. అభిమానించి చిదాభాసుండైన చిత్తుస్వరూపం యొక్క, పరబ్రహ్మముయొక్క లక్షణములు లేకయున్నను చిదాభ్రుడుగాన, చిదాభాసుడనియు, నామధేయము. చిదాభాసుడనగ ఆభాస లేనిదే యున్నట్లు తోచినది. మూలాభావం ఇదంజ్ఞాతుం శరీరమునకు అభాసయని లేనిదే యున్నట్లు తోచినది. సకలవ్యవహారములు నిగ్రహించి వ్యవహారికుండని, విశ్వుండని, తనశరీరమునందేగాక ప్రపంచమంతట వ్యాపించి తన్నుదా వెలియుటయందభిమానము గలవాడై విశ్వుడని, జాగ్రత్తయని వ్యవహార నామధేయము.

— అకార ఉకార మకార అర్ధమాత్రి మిశ్రమతత్వములు అంతరార్థం. —

1 అర్ధమాత్రములో అకార మనగ, కించజ్ఞునిలో సర్వంజ్ఞుండు, 17 సూక్ష్మదేహములో స్థూలం.

2 అర్థమాత్రిమున ఉకారము, జీవకళలో బ్రిహ్మకళ, సూక్ష్మదేహంలో లింగదేహం.

3 అర్థమాత్రియందు మకారం, జీవకళలో కారణకళ, తనలో తానె.

4 అర్థమాత్రిలో అర్థమాత్రి; జ్ఞాతలో జ్ఞాత, జీవునిలో సర్వజ్ఞుడు, జ్ఞానంలో జ్ఞానం, తెలివిలో తెలివి.

అవిద్యా విద్యానంద తురీయపాదముల మిశ్రిమతత్వములు, అంతరార్థం.

1 తురీయపాదములో అవిద్యాపాదమనగ, ఆత్మయందు అజ్ఞానం, ప్రిత్యగాత్మయందు అజ్ఞానజడమైన మాయ.

2 తురీయపాదములో విద్యాపాదము, సర్వసాక్షి స్వయంప్రకాశంబైన, ప్రత్యగ్బ్రహ్మ పరాత్మయందు జ్ఞానం తెలివి కలిగినది.

3 తురీయపాదములో ఆనందపాదం, జీవబ్రహ్మైక్యజ్ఞానం, నిర్విషయానందములో బ్రహ్మానందం.

— స్థూలాదిదేహ చతుష్టయ మిశ్రిమతత్వములు. అంతరార్థం. —

1 మహాకారణదేహములో స్థూలదేహమనగ, యెరుకలో మరుపు, స్వయంప్రికాశమైన ఆత్మయందు, జడం.

2 మహాకారణదేహములో సూక్ష్మదేహం, కళయందు బిందువ, ఆ తేజస్సులో జీవకళ.

3 మహాకారణములో కారణం, సాక్షియందు జ్ఞానం, తెలివి.

— అవస్థాచతుష్టయ మిశ్రిమతత్వములు- అంతరార్థం.

1 తురీయములో జాగ్రిత్తనగ, ఆత్మయందు జ్ఞానశక్తి.

2 తురీయంలో స్వప్నం, ఆత్మయందు మూలప్రకృతి.

3 తురీయంలో సుషుప్తి, నిర్వికల్పములో సవికల్పము, యెరుకలో మరుపు.

— జీవచతుష్టయ మిశ్రమతత్వములు- అంతరార్థం. —

1 కూటస్థునిలో విస్వుడనగ, సగుణబ్రిహ్మయందు సృష్టిబ్రహ్మ.

2 కూటస్థునిలో తైజసుడు, నిర్గుణబ్రిహ్మమందు, సృష్టిశక్తి.

3 కూటస్థునిలో ప్రాజ్ఞుడు, కూటస్థబ్రిహ్మ ప్రిజ్ఞానందబ్రిహ్మయందు, త్రిగుణశక్తికల్పన.

— ఈశ్వరచతుష్టయ మిశ్రమతత్వములు- అంతరార్థం. —

1 పరమాత్మలో విరాట్టనగ, పరబ్రహ్మమందు ప్రత్యగాత్మ.

2 పరమాత్మలో హిరణ్యగర్భుడు, పరబ్రహ్మమందు జీవాత్మ.

3 పరమాత్మలో అవ్యాకృతుడు, మహాతత్వమందు అవ్యక్తం.

— జీవేశ్వరచతుష్టయ మిశ్రమతత్వములు అంతరార్థం. —

— బ్రహ్మణోరవ్యక్తః —

1 అవికల్పునిలో ఓతనగ, బ్రహ్మమందు అవ్యక్తం.

— రవ్యక్తాన్మహతః —

2 అవికల్పునిలో అనుజ్ఞాత, బ్రహ్మమందు మహత్తు.

— మహతోఽహంకారః —

3 అవికల్పునిలో అనుజ్ఞైకరసుడు, బ్రహ్మమందు అహంకారం.

— మిశ్రమసమిష్టితత్వములు. అంతరార్థం. —

1 అర్ధమాత్రంలో అర్ధమాత్ర, ప్రత్యక్జీవునకు సాక్షి. ప్రజ్ఞానంలో విజ్ఞానం.

2 తురీయపాదంలో తురీయపాదం, భావాతీతము, పరతత్వము మనోలయం, తురీయాతీతం.

3 మహాకారణంలో మహాకారణం, క్షేత్రక్షేత్రజ్ఞులకు పరబ్రహ్మము, కళలో నిష్కళ.

4 తురీయములో తురీయము, పరాపరాప్రకృతికి విలక్షణం, కేవలాత్మ, నిష్కళాతీతం.

5 కూటస్థునిలో కూటస్తుడు, కూటస్థుడు జీవసాక్షి, జీవాత్మ పరమాత్మ.

6 పరమాత్మలో పరమాత్మ, క్షరాక్షరసాక్షి పరమాత్మ.

7 అవికల్పునిలో అవికల్పుడు, ఆత్మానాత్మలకు విలక్షణం, శుద్ధ నిర్గుణం.

ఈశివతత్వము శక్తితత్వములకు వేరైనదే నిర్గుణపరబ్రహ్మము. ఆపరబ్రహ్మము నిష్కళము నిరీహము నిష్ప్రపంచము నిర్మలము నిరంజనము నిర్వికారము నిరాలంబము నిర్ముక్తము నిత్యము బద్ధము కేవలము అఖండము అప్రమేయము ఆద్యంతరహితము పరాత్పరము అపరోక్షము

స్వయంజ్యోతి సర్వవ్యాపకము అవాఙ్మానసగోచరం అవ్యయం అను పమానం అమలం నిత్యానందం అగోచరం అనంతం శుద్ధనిర్గుణం నిరుప మానం నిరంజనం నిగమాగోచరం నిర్మోహం స్వయంప్రకాశం పరిపూర్ణం నిర్భయం అచలం సాక్షాత్కారం సగుణాతీతం సంకల్పరహితం సర్వాం తర్యామి త్రిగుణాతీతం పరంధామం ప్రకృతిరహితం అమోఘం సాక్షాత్కా రం కేవలపరబ్రహ్మమందు,

తనయొక్క బలముచేత అపరబ్రహ్మ సన్నిధానబలమువలన ఆత్మశక్తి అనాదిమూలజ్ఞప్తికళామాత్రశరీరంబనే జీవభ్రాంతి ఆరోపితంబై చంద్రచం ద్రికన్యాయంబున ఘటప్రతిబింబచందమున ఆవరణ విక్షేపరూపంబులు అనం తకోట్ల రూపంబులు దాల్చి రూపనామక్రియలు వర్ణాశ్రమనిర్ణయ కర్మ ములచే నొప్పి సృష్టిస్థితిలయములకు కారణంబై కులాలచక్రంబువలె నవగ కుమ్మరసానవలె అవస్థాత్రయములయందు సంసారచక్రము తిరుగుచుండె. దీనినే శింసుమారచక్రమని శాస్త్రములు చెప్పుచున్నవి. పంచవింశతి తత్వా త్మకుడైన జ్ఞాతయని వ్యవహారికజీవుడు కార్యకారణములకును నిమిత్తకార ణము ఉపాధానకారణమునకు హేతువై సర్వారోపితంబని, జీవభ్రాంతి నారోపితంబై తనకుతానే లోచబడి తన్నుతాదెలసి, తాను పరమాత్మయని వివేకజ్ఞానముచే తెలియవలెను.

మరియొక విషయము విచారించెదము. లోకములో నెల్లవారికిని నిదుర నుండి మేల్కొనినపిదప నాకు నిదురయందేమియు దెలియలేదు. ఎంత నిదుర పోయిలేచితిని యని స్మరించుట అనుభవసిద్ధమైయున్నది గదా! పూర్వము అనుభవించని విషయము స్మరణకురాదనుట లోకము ప్రత్యక్షసిద్ధమేకదా. ఈస్మృతికి అనుభవసిద్ధ మేలకలుగునో విచారింతము. నిదురయందు రెండవ స్థలు అనుభవింపబడుచున్నవి గాన, అందు స్వప్నావస్థయందు బాహ్యేంద్రి యములు లేకున్నను మనస్సుకలదు. అందుచేత దానినిగురించి అంతగయో చింపవలసిన పనిలేదు. సుషుప్త్యవస్థయందు మనస్సు నసించదుగాన సా మాన్యముగ నందరు. మనస్సునె సాక్షిగా భావించువాడు, చూచువాడు యెవ్వడో వాడె సర్వసాక్షి. అతడె తానుతానైన బ్రహ్మము, ఈవిధము గా మనస్సుకూడ లేనప్పుడు, సాక్షియొక్కడనున్నాడనుట సిద్ధాంతమగుట చేత మనఃసంచారము జాగ్రదవస్థయందుకూడ తానే సాక్షిగనున్నాడనుట

నిశ్చయము. ఉత్పత్తి స్థితిలయములుగల తాను సాక్షియని చెప్పుట యసంభవమే. ఇప్పుడే పుట్టుచున్నది యిప్పుడే నశించుచున్న దని తెలుసుకొనువాడు లేకున్నను యీవస్తువునకు నుత్పత్తి నాశనములుకలవు గాన నిర్వికారుడనైన నేనే బ్రహ్మమునై సర్వావస్థలయందు సాక్షినైయుండె. ఇట్లుండుట తనకు స్వభావమేకాని క్రియకాదు. సర్వపదార్థములను సర్వావస్థలను సర్వకార్యములను కారణములను సర్వవ్యవహారములును తన్నాశ్రయించి వ్యవహరించుచున్నవేగాని తనకు వానిని అంతఃకరణ సర్వేంద్రియ సర్వావస్థల సర్వపదార్థ వ్యవహారిక మవసరములేదు. వాట్లనుగూర్చి ప్రయత్నమైనను లేదు. కార్యమునకును, కారణమునకును, వ్యష్టికిని, సమిష్టికి యీద్వంద్వములకు విలక్షణమైయున్న తనకు నెట్టియు లేదనుట సిద్ధాంతమే. జీవభ్రాంతివలన నొకవేళ జాగ్రత్స్వప్నములయందు సంకల్పముతోచినను సుషుప్త్యవస్థయందది లేదనుట నిర్వివాదమైన విషయమే గనుక కర్తృత్వములేదు. కర్తృత్వాద్య వ్యవహారములకు తాను ఆశ్రయభూతుండైన వాడే కర్తనుట యనుభవసిద్ధము. ఇది వకవిమర్శము. ఈవిధముగనే జాగ్రితావస్థయందు వచ్చుచు బోవుచున్న తనయందలి సర్వపదార్థవ్యవహారములకున్ను సాక్షినై నొక్క దినమునందు వారములయందు, పక్షములయందు, మాసములయందు, సంవత్సరములయందు, ఋతువులయందు స్వయంప్రకాశంబునై నిష్కళానందంబై భవిష్యత్కాలములయందును, భూతకాలములయందు ఆదిమధ్యాంతములులేక తానై ఏకరూపమై ప్రత్యగ్భిన్నపరమాత్మ స్వరూపమై సర్వాంతర్యామియై తాను తానై ప్రకాశించుచుండె. సర్వప్రపంచసాక్షి నగుటచేత ప్రపంచోత్పత్తి వినాశంబులు కలుగవు. సర్వకాల సర్వావస్థలయందు ఏకమేవద్వితీయం బ్రహ్మ॥ యను శృతిప్రమాణంబుచేత స్వజాతి విజాతి స్వగతభేదశూన్యంబైన పరమాత్మ తానై ప్రకాశింపుచుండెను. తాను పంచవింశతితత్వాత్మకుండై వ్యవహారజీవోపాధి జాగ్రదవస్థ తానే 17 తత్వములచేత వ్యవహరించుచున్న స్వప్నదేహాభిమానియై యిరువదియారోవాడైన సాక్షి సుషుప్త్యవస్థాభిమానియై తన్ను తా దెలసి తాను తానై హృదయగ్రంధిరహితంబైన లింగదేహాభంగమైన విదేహాకైవల్యమోక్ష సామ్రాజ్యముపొందును.

అది యెట్లంటివేని శాశ్వతరూపంబై బ్రహ్మస్వరూపమునందు యీవిశ్వంబు యెట్లుదోచు ? భ్రమించి తత్పరిత్యాగహేతుర్భూతంబులైన బ్రహ్మ

విచారణమాత్రముజేసి వాటినింజెందక ప్రపంచభ్రమనుజెంది పుత్రమిత్ర కళత్రాది సర్వబంధంబులంజిక్కి వాటివలన జననమరణాది భయంబులంజిక్కి వాటి నోర్వజాలక సర్వదుఃఖపాత్రులైరి విచారం బిట్టి దని యెరుంగక తత్వ జ్ఞాన ప్రకాశంబులేక యజ్ఞానంబులంజెంది భ్రమింతురేగాక విలక్షణాద్వైత మార్గంబులనియు, యోగంబులనియు, భక్తిమార్గంబులనియు, తారకంబులని యు, యమనస్కంబనియు నానావిధంబులైన యనుభవమార్గంబులంజిక్కి సం కల్పరూపంబుల జిక్కి సంకల్పత్యాగంబు జేయజాలక మాయలలోజిక్కి జనన మరణాదులయం దాశచేత ప్రజ్ఞానస్వరూపుండైన జీవుడు వలలో జిక్కుబడి యుండె. శృతి॥ గురోర్ముఖేనజ్ఞాతవ్యం అన్యథానోభలభ్యతే॥ అనునట్లు సద్గు రుముఖ వివేకజ్ఞానంబున తన్ను తా దెలసినవాడే జీవన్ముక్తుండౌను. ఇన్నియు జెప్పనేల దేశాటనంబులంజేసి యనేక యాత్రంబులం దిరుగుచు యనేక శాస్త్రంబుల విచారించుచు సజ్జన సహవాసంబుల చేయుచు తీర్థయాత్రంబు లు దిరుగుచు పుణ్యనదులయందు మునుంగుచు రమణీయంబులైన దేశంబుల యందు తపోనిష్ఠలు జేయుచు యుద్యానాదిపుణ్యస్థలంబులు గట్టించి సర్వవికా రసూన్యంబైన దైవస్వరూపంబులే ముక్తికారణంబులని నానావిధ దివ్యస్థలం బుల సేవించి శైవశాక్తేయాది నానావిధ దైవభేదంబుల నాచరించి పలువా దంబులాడి తద్భక్తివలన దైవపూజాదు లాచరించి ప్రాణాయామాదులైన వాయువువలన బిగబట్టి కుండలాదిమర్మస్థాన భేదంబుజేసి భ్రూమధ్యనాసికా గ్ర లలాట ద్వాదశాంతంబులం దిరిగిన నన్నియు బంధకారణంబులేగాని నిర్వి కార ప్రజ్ఞామాత్రంబైన బ్రహ్మస్వరూపంబునం దెలియంజాలరు. వినుము ఛండాలాదికర్మంబు లాచరించిన మద్యపానంబులను జేసిన బ్రహ్మహత్యాది కర్మంబులంజేసిన పరదారాదిగమనంబు లాచరించిన పాపంబులన్ని భ్రాంతి వాదంబు లింతియేగాక, పుణ్యములనియు, పాపములని యెచట. వీటి నన్ని యుం దెలసి దాని నెరింగి ప్రజ్ఞామాత్రమున నుండెనేని నదియే పరమదివ్య సాక్షాత్కారము. ఇదియునుంగాక భోగములను జెంది సర్వభోగముల యను భవముగనున్న జనులజూచి. యట్టికర్మముల వినుటయేగాక యన్ని దేహంబులు మృత్యువర్ణాది ఘటభేదంబులన్నిటియం దేకాకారమయియున్న గగనంబు చందంబున తాను పరిపూర్ణుడైయుండె. విచారించగ నెచ్చోట ఫలంబు దారి ద్ర్యంబులన్న కష్టరూపములుగావు. భాగ్యములన్న సుఖరూపములుగావు.

వాటినిం దెలసి యనుసంధించెనేని అదియే పరమసుఖము. అట్టి అనుసంధాన శూన్యమై యుండెనేని అదియే స్వప్రకాశమైన సుఖరూపము. సర్వలోకాతీతంబైన బ్రహ్మస్వరూపంబునందు యఖిలవిశ్వములు యగుపడకయు సాక్షిభావము దోచకయుండెనేని నదియే శుద్ధాద్వైత పరమరహస్యము. గురురహస్యము. శృతి॥ గుహ్యాద్గుహ్యతమగుహ్యాం చతుష్టానేషుతిష్ఠతి—గురోర్ముఖేనజ్ఞాతవ్యాం అన్యధానోపలభ్యతే॥

సర్వతుర్యాతీతంబైన పరబ్రహ్మస్వరూపమునందు నిర్వికల్పసమాధి జెందిగోరి వికల్పవృత్తిలేక సంకల్పములులేక మరచి కర్మములను మరచి కర్మములను విడచి ప్రకృత్యాదిధర్మముల నంటక నీవాతదీపము చందమునయున్న నదియే పరమరహస్య నిర్వికల్పసమాధి. అట్టి నిర్వికల్పసమాధి యెవ్విధంబున సిద్ధించు. మనోవృత్తి సర్వావస్థల నంటక శుద్ధస్ఫటిక సంకాశంబు నుండుట యెవ్విధంబన్న, యాహారంబులను విడచి, రాజస తామసాదివృత్తులను మరచి స్థిరముగ దలచి యఖిల దృశ్యాదికార్యంబులం విడచి యవిద్యాకార్యవిరక్తుండై విద్యామాత్రమున నిలచి జలరేణుకాన్యాయమున యవిద్యాభంగముజేసి దానిం దెలసి అధర్వణవేదోపనిషత్తులో అయమాత్మబ్రహ్మంబని పలికినట్లు మానం నిర్వాణనంచతత్ యని శుద్ధకేవల పరమరహస్యమని చెప్పుచున్నవి.

మునోత్తమా! వినుము. నీవంటి ప్రజ్ఞావంతునకు యట్టి పరమగురురహస్యార్థంబు యుపదేశించుట కష్టముగా దది యెట్లంటివేని పాషాణంబులం జనించిన యతికఠినంబైన నీలాకారంబై యున్న అయఃపిండంబునకు స్పర్శవేది శోకినంతమాత్రంబున స్వచ్ఛంబైన స్వర్ణంబగుటమాత్రంబున విచిత్రంబుగాదె. సూక్ష్మాగ్రహతంబైన కాంతంబు సాన్నిధ్యమువలన సూదియు ఆకాంతంబుజేరుట విచిత్రంబుగాదె. ఇది పరమదృష్టాంతంబు. ఇదియునుం గాక సర్వకర్మరహితంబైన ప్రజ్ఞానమాత్రంబై నందు మయిలన్ననేమి మడియన్ననేమి శుచియన్ననేమి మయిలంటివేని దేహంబునకుగాదు. అశుద్ధంబైన దేహంబు రక్తమాంస పురీషమూత్రసముదాయ పూరితంబైన దేహంబు సర్వకాలంబుల నుంచియుండి దానిని పోగోరుట పరభ్రాంతిస్వరూపంబు ఆత్మకంటె వేరుగాని పరిపూర్ణచిదాకాశరూపంబైన ఆత్మస్వరూపంబునందు సర్వవికారశూన్యంబైన పరమతత్వరహస్యంబని యెరిగి ప్రజ్ఞానమాత్రంబైన తానే పరబ్రహ్మమాత్రంబైయున్నది.

ఏయొక్కయుక్తివల్లనైన విచారించినయెడల స్వస్వరూపజ్ఞానశూన్యుం డుగాక విచారజ్ఞానశీలుండునై మేధావియనబడు. దానిం దెలసెనేని సాక్షియ నబడు. దాని ననుసంధించెనేని పంచవింశకుడు. మరచెనేని షడ్వింశకుండు. అట్టిభావంబు యోగాదిసాధ్యంబుగాదు. అన్నియు కర్మరూపంబులగుటవలన చిత్తశుద్ధికారణంబులేగాక జ్ఞానసాధనంబులుగావు. గురూపదేశంబంటివేని గురువులన్న బహుపదార్థంబులను దెలసి వాటిని నేరింగి ప్రసంగకుతూహలం బుచేత యుక్తాయుక్తవిచారంబు చేయువారు కారు. సర్వసంగకర్మత్యాగంబైన ప్రజ్ఞామాత్రంబున నిలచి యనుసంధానంబులేకయున్నవారియొక్క యుపదేశ క్రమం బేరీతి నుపయోగించు గావున యవి యన్నియు మిథ్యాభూతంబులు. మరి యేమంటివేని గురూపదేశంబే కారణం బట్టిగురుండు స్వవివేకచాతుర్యం బువలన ప్రజ్ఞామాత్రంబున నిలచి సర్వవాదంబులాడి శేషించిన ప్రజ్ఞామా త్రంబున మౌనస్వరూపంబే యని నిలచియుండెనేని యట్టి శిష్యునకు నుపదే శం బదియే. పరమరహస్య జ్ఞానసాధనంబు. అట్టి బ్రహ్మజ్ఞానమే శుద్ధాద్వైతభా వం బదియే సర్వోపనిషత్సార సంగ్రహము,

ఇవి యన్నియు జెప్పనేల, సర్వవిలక్షణంబన్న సర్వాతిరిక్తంబన్న కాదు. సర్వస్వరూపంబుగాదు. సర్వంబును దెలసిన తెలివిగాదు. దానిని మరచిన మరుపుగాదు. మరి యేదంటివేని సర్వవిచారంబులు మరచి మౌనమాత్రంబు న నుండెనేని అదియే పరమపదకైవల్యమార్గము. లోకంబునందు జనులు శుభాశుభంబులు మెంచి శుభంబునకు ఆమోదించి యనుభవంబునకు దుఃఖిం చి పాపపుణ్యంబుల జెందుదురు. అది యెట్లంటివేని, సూర్యోదయకాలంబున పద్మంబులు వికసించి యస్తమయకాలంబున ముకుళీభవించెనేని వికాసముకు ళీభావంబుల నేకాకారంబై పరిపూర్ణంబైన మాధుర్యంబు నిలచియున్న చందమున సుఖదుఃఖముల రెంటినిం దెలిసెనేని యదియే పరమచైతన్య స్వస్వరూపమోక్షసామ్రాజ్యంబు నొందుగాక—

సింధుతరంగన్యాయంబున అనుసంధానాదిన్యాయంబున కార్యంబు లన్నియు ప్రజ్ఞామాత్రంబున జనించి యచ్చటనే వ్యవహారంబులనుదోంచి అన్నియు లయించి ప్రజ్ఞామాత్రంబైన నదియే పరమరహస్య స్వప్రకాశంబు యెన్నివిధంబులయిన కార్యంబులు దోంచెనేని యన్నియు బ్రహ్మస్వరూపంబు తోచకయుండెదనంటివేని దానిం దెలసిన ప్రజ్ఞామాత్రంబు దానైయుండ

చింతయేమి. సూర్యచంద్రాది ప్రకాశంబున జగత్ప్రకాశంబు తోచినట్లు ప్రజ్ఞామాత్రంబున జగంబున వెలుగుచుండు సందియమేల. అద్వైతంబన్న దైవాధీనంబుగాదు. అది యెట్లంటివేని సర్వలోకాతీతంబు పరమరహస్య తత్వార్థస్వరూపంబయిన బ్రహ్మమార్గంబు లగోచరంబు లవియు స్వానుభవైక్యంబులగుటవలన వాటిని దెలియఁజేయ గురుని యపేక్షించవలయును. అట్టిగురుం డెట్టివాడనిన స్వబోధమాత్రంబుననుండి మనోవాక్కాయకర్మాది రూపంబులయిన బాహ్యవ్యాపారాదు లన్నియు విడచి జ్ఞానమాత్రంబున శిష్యుల నందరిని ప్రజ్ఞామాత్రులుగా జేయువాడే గురుండు. అట్టి గురుండు యెవ్విధంబున నుండుననిన నైశానగ్రస్థ సురాపాన ప్రమత్తాది రూపంబులై యుండు కొంతకాలంబున బాలునింబోలు క్రీడాసక్తుండై యుండు మరికొంత కాలంబున దేహంబు మరచియున్న పిచ్చివానింబోలె ఆశభాషణచలనాదులం జెందకయుండు. అట్టిగురుని పరిహరించక చిరకాలసహవాసంబుసేయువారి వృత్తులన్నియు స్పష్టంబుగ దెలియంబడు. అట్టిగురుని సహవాసంబుచేత పరమోపదేశంబు యది పరమరహస్యంబు. ఈపై వ్రాసియున్న అవస్థాపంచక సాంఖ్యము, అంతరత్రిపుటియొక్క అనుభవము, సద్గురు వివేకజ్ఞానమున తన్ను తా తెలియవలెను. తెలిసి తెలియనిచందమున తెలిసియుండవలెను. అంతర్ముఖులై తారకసాంఖ్య అమనస్క-రాజయోగానుభవంబులచే అంతరబాహ్య లక్ష్యంబులు సద్గురుముఖవివేకజ్ఞానము చే తన్ను తా తెలియవలెను.

సమాప్తము.



శ్రీరస్తు

# శ్రీ మహాఋషి నిఘంటిత యోగశాస్త్రము

## గాయత్రీ త్రిగుణ సాంఖ్యయోగము.

తక్షకుడనే భుజంగమహాఋషి, చంద్రాంగదమహారాజునకు గాయత్రీ త్రిగుణసాంఖ్యయోగము బోధించుట.

ఏకమేవ అద్వితీయంబ్రహ్మ॥ అనగ అదెట్టిదనిన అపరిచ్ఛిన్నంబును, ఆద్యంతరహితంబును, స్వజాతీయ విజాతీయ స్వగతభేద శూన్యంబును, సచ్చిదానంద స్వరూపంబునునై, శుద్ధచైతన్యంబైన, బ్రహ్మంబొక్కటియే వెలుంగుచుండు. ఆబ్రహ్మంబునందు, నవిద్యయై మిథ్యాభూతమై తచ్ఛక్తియై త్రిగుణాత్మికమై యనిర్వచనీయమై కలుగఁదోచు మూలప్రకృతి, మూలజ్ఞప్తికళామాత్రశరీరంబగు, అనాదిమూలప్రకృతి.

తన్నాశ్రయించుటచేత, తద్విషయత్వబలంబుచేత తద్వస్తువునుంబోలి ప్రకాశించుచు, నాత్మసత్తాస్ఫూర్తులవలన స్ఫురద్రూపంబై, ఆవరణవిక్షేపరూపంబులు దాల్చియుండు, అమలసత్వప్రభావముగలిగి, చంద్రునియందు చంద్రికలవలె, మూలజ్ఞప్తికళామాత్రంబనే మూలప్రకృతి మలినసత్వప్రభావముచేత, సత్వరజస్తమోగుణ స్వరూపిణియై, జ్ఞానశక్తియై పంచవింశతి తత్వస్వరూపిణియై పరబ్రహ్మమునందు యభిన్నముగనున్నది. అనాదిమూలజ్ఞప్తికళామాత్రశరీరంబనే మూలప్రకృతి, జలఘటప్రతిబింబమువలె, మలినసత్వప్రభావముచేత, తనఆత్మశక్తి ప్రభావముచేత సత్వరజతమోగుణమువలె, స్వరూపముగలదై, ఘోరవృత్తితోఁగూడిన రజోగుణముగల బ్రహ్మరూపముచేత, సృష్టించుచుండును. శాంతవృత్తితోఁగూడిన సత్వగుణముతోఁగూడిన విష్ణురూపముచేత లోకములను వృద్ధిజెందించును. ఘోరవృత్తితోఁగూడిన తమోగుణముగల రుద్రరూపముచేత లోకములను నశింపజేయును. అట్టి

అనాదిమూలప్రకృతియనే మూలజ్ఞప్తికళామాత్రశరీరంబైన యీజ్ఞానశక్తి నిర్గుణపరబ్రహ్మమందు శాంతమూఢ ఘోరవృత్తులు లేనివాడైన, అసంగుడు, అవికారుడు, త్రిగుణరహితుడైన ఆత్మయందు తన ఆత్మశక్తిబలముచేత, లోకములను వుత్పత్తిస్థితిలయములుజేయుచు— సగుణబ్రహ్మాది దేవతాజంగమస్థావరాంతమైన బ్రహ్మాండకోట్లను పుట్టించుచు, అవికారుడయ్యును, కనకము వివిధాభరణంబులైన విధమున ఇతడే భువియై, కవియై, రవియై, సర్వాత్ముడై ప్రకాశించునుగాన, త్రిగుణాత్మికయై యనిశము జగముల బుట్టింపబెంప సమయింపదగు మూలప్రకృతియే నేనగుదు॥మీ సత్యముగ మహాగుణశాలీయనునట్లు, అమలుడగు ఆతనిసాన్నిధ్యమువలన సృజింతు జగమతందిరి తనై ఇట్లమరజనులచేత కల్పింపంబడు నీయసంగునియందు గావున,

తన రజోగుణముచేత జ్ఞానశక్తి జాగ్రదవస్థయందు గల్పించు నఖిల లోకములనెల్ల, తన సత్వగుణముచేత ఇచ్ఛాశక్తి స్వప్నావస్థయందు పోషించు నీసర్వభూతములను, తన తమోగుణముచేత క్రియాశక్తి సుషుప్త్యవస్థయందు జగములనెల్ల సంక్షయముచేయు, తాను శుద్ధసత్వపరిధానయైయే యాత్మవామాంకమున నజస్రమువసించునట్టి భువనైకమాత దయాసమేత సద్గుణవ్రత వ్రాతనిర్మలస్వాంతపూత భక్తజనమానసోద్యాన పారిజాత సీత కరుణించు నన్ను రక్షించుగావున ॥శృతి॥ అసద్వా ఇదమగ్రమాసీత్॥ అను శ్రుతిచేత సృష్టికి బూర్వమునందు నిజగుణత్రియసంకోచావస్థచేత నవ్యక్తమైయుండ ॥శృతి॥ తదైక్షతబహుస్స్యాం ప్రజాయేయ॥ యనుటచే సృష్టికాముగాగా సర్వేశ్వర సంకల్పశబలితంబగు నారజోగుణముచే నీకార్యకరణసంఘాతమునెల్ల సృజించి పిదప దనదగు సత్వగుణము నవలంబించి, తనచే సృజింపంబడిన ప్రపంచమును గొంతకాలము వినోదార్థమునకు బోలె బాలింపుచు దరువాత.

శృతి॥ బాలోవాలుకకేళివత్॥ బాలుడు ఇసుకపోకలను బెట్టి కొంతదనుక క్రీడించి యాయిసుకపోకలన్నిటిని జెరుపునట్లు ప్రళయకాలమున నాయాలోకములనెల్ల తన తమోగుణముచే నుపసంహరించి వెనుక నీజగద్వ్యరచనావననాశన రూపక్రీడచేత నలసటనొందినదియుంబోలె స్వాధిష్ఠానభూతంబగు పరబ్రహ్మము యొక్క అంకతలమున నిశ్చింతతోనున్న యాదిశక్తియగుత్రిగుణగాయత్రి దేవిపరబ్రహ్మంశమైన విశ్వరూపిణి.

గాయత్రిత్రిపాదములు త్రిగుణములయొక్క మిశ్రమసమిష్టి త్రిగుణ త్రియావస్థాత్రియాత్మాత్రియ సమేళనచేత తనయొక్క శక్తిబలముచేత సప్తవింశతియై ఇట్లు ప్రపంచోత్పత్తిస్థితిలయముల నొనరించు సత్వరస్తమోగుణాత్మిక యగు నాదిశక్తినిగెకొని తద్గుణాంశసంభూతులైన బ్రహ్మవిష్ణు మహేశ్వరులయొక్క మాంశ ॥శృతి॥ సత్యాదుత్పద్య తే సర్వంసత్యే సర్వంప్రతిష్ఠితమ్॥ అనుటచే సమస్తసృష్టికి నుత్పత్తిస్థానమగునది.

— గాయత్రి త్రిపాదములు. —

( ఓంభూర్భువస్సువరోం॥ ఓంతత్సవితృవరేణ్యం॥ భర్గోదేవస్యధీమహి॥ ధీయోయోనః ప్రచోదయాత్॥

ఓంభూర్భువస్సువరోం॥ ప్రథమపాదం- రక్తవర్ణం.

జాగ్రదవస్థ, విశ్వాత్మ, రజోగుణం, సృష్టి, అకారంమాతృక, అండాడం, స్థూలదేహం, పృథివితత్వం, నాదం, చిత్తు, ఇచ్ఛాశక్తి, రేచకం, సోహం ఈ 16 రున్ను ప్రథమపాదం.

ఓంతత్సవితృవరేణ్యం ద్వితీయపాదం- శ్వేతవర్ణం.

స్వప్నావస్థ, తైజసాత్మ, సత్వగుణం, వృద్ధి, ఉకారం, మాతృక, పిండాండం, సూక్ష్మదేహం, అపుతత్వం, బిందువ, సత్తు, క్రియాశక్తి, పూరకం హం, ఈ 16 రున్ను, ద్వితీయపాదం.

భర్గోదేవస్యధీమహి తృతీయపాదం- కృష్ణవర్ణం.

సుషుప్త్యవస్థ, ప్రాజ్ఞాత్మ, తమోగుణం, లయం, మకారంమాతృక, బ్రహ్మాండం, కారణదేహం, అగ్నితత్వం, కళ, ఆనందం, ఆదిశక్తి, కుంభకం, సోహం, ఈ 16 రున్ను తృతీయపాదం. )

తొలుతనొక్కటి, మాయదొరతనముబూని తలపమూలములేక తరలక నిలచె, యనునట్లు ॥శృతి॥ అవ సదేవసౌమ్యేమి దమగ్రఆసీదేకమేవాద్వితీయమ్॥ అను శ్రుతిప్రమాణసిద్ధమగు, అపరబ్రహ్మమును శ్రేష్ఠదేవముగ భావించి పిమ్మట ॥శృతి॥ యతోవాఇమాని భూతానిజాయంతే యేన జాతాని జీవన్తి యత్ప్రయంత్యభిసంవిశంతి॥ అను శ్రుతిచేత ॥శృతి॥ జన్మాద్యస్యయవః॥ అను బాదరాయణశ్రుతిచేతను గోచరమగుచున్న శుద్ధసత్వప్రధానమాయోపాధికచైతన్య స్వరూపిణియు సృష్టిస్థిత్యంతకారిణియు నగు ఆ యాదిశక్తిని బేర్కొని తరువాత నాసృష్టిస్థితిలయములకు నాదికారికపురుషు

లగుత్రిమూర్తులగా గొనియాడి ఇపుడా యాదిశక్తియొక్క యంశసంభూతలగుటంజేసి తమభర్తలకు సస్వకృత్యములకుందగిన శక్తుల నొసంగుచు వారల నాక్రమించి యున్న తమ యావరణాదిశక్తుల నొసంగుచు వారల నాక్రమించియున్న తమ యావరణాదిశక్తుల దీసి వారికి మరలశుద్ధాత్మజ్ఞానము నొసంగు వాణీరమాభవానులను వేడుకొనుచున్నారు.

25 వ తత్వం జ్ఞాత, సునీలమైన హంసయనే మనోబిందువనే జీవజ్ఞప్తి ప్రజ్ఞానస్వరూపం పంచవింశతి తత్వాత్మకుడు, కళామాత్రస్వరూపం హృదయాకాశమధ్యమందు జ్యోతిర్మయాకారంగా ప్రకాశించేకళ. ఇదే అజపబ్రహ్మ గాయత్రి త్రిగుణాత్మక మూలప్రకృతి, సోహహంసోహ.

దీనియొక్క సృష్టివివరము.

1 ఘోరవృత్తితోగూడిన రక్తవర్ణమైన జ్ఞానశక్తి పృథివిహంశమైన రజోగుణముగల విశ్వరూపముచేత పృథివితత్వంతో కూడుటచేతనైన సృష్టి వివరం.

దేవతలు, మనుష్యులు, మృగములు, పశులు, పురుగులు, జలచరములు, పర్వతములు, వృక్షములు, మొదలైన స్థావరజంగమ ప్రాణిజాలముతోగూడి లోకములను సృష్టించుచున్నదివకముడి.

గాయత్రి ప్రథమపాదం—ఓం భూర్భువస్సువరోం.

శాంతవృత్తితోగూడిన, శ్వేతవర్ణమైన, అపహంశమైన, ఇచ్ఛాశక్తిమైన సత్వగుణముగల విష్ణురూపముచేత, అప్పుతత్వముతో కూడుటచేతనైన సృష్టివివరం. గాయత్రి ద్విపాదం రెండోముడి. ఓంతత్సవితృవరేణ్యం.

ఘోరవృత్తితోగూడిన కృష్ణవర్ణమైన తమోగుణముగల అగ్నితహంశమైన ఆదిశక్తిమైన రుద్రరూపముచేత, తేజోతత్వముతోగూడి కృష్ణవర్ణమైన అగ్నితత్వముతోకూడి లయముపొందును. ఇదితృపాదం భర్గోదేవస్యధీమహి-మూడోముడి.

శ్వేతవర్ణమైన జలతత్వముతోకూడిన సత్వగుణమువలన ముప్పైమూడు కోట్లదేవతలు, చతుర్ముఖబ్రహ్మ మొదలగువారు పుట్టిరి.

రక్తవర్ణమైన పృథివితత్వముచేకూడిన రజోగుణమువలన మనుష్యులు, పశువులు, పురుగులు, జలచరములు లోనగు సకలజంగమప్రాణులు పుట్టెను.

కృష్ణవర్ణమైన అగ్నితత్వము తమోగుణమువలన భూమి, పర్వతములు, వృక్షములు, పాషాణములు మొదలగునవి స్థావరములన్నియుపుట్టినవి.

ఈత్రిగుణములు, త్రిపాదములు, ఒక్కొక్కటితో నొక్కొక్కటి గలసి 9 తొమ్మిదివిధములాయెను. అవియెవ్వియనిన—

శ్వేతవర్ణమైన జలతత్వముతోచేరిన సత్వగుణమునందు, సత్వగుణము.

2 శ్వేతవర్ణమైన, జలతత్వమైన సత్వగుణమునందు రక్తవర్ణమైన, పృథివితత్వముతోగూడుటచేత రజోగుణము.

3 శ్వేతవర్ణమైన జలతత్వముతోచేరిన, సత్వగుణమునందు కృష్ణవర్ణమైన అగ్నితత్వముతోగూడుటవలన, తమోగుణము.

4 రక్తవర్ణమైన పృథివితత్వముతో చేరిన, రజోగుణమునందు శ్వేతవర్ణమైన జలతత్వముతో చేరుటవలన సత్వగుణము.

5 రక్తవర్ణమైన పృథివితత్వముతో చేరుటవలన రజోగుణమున్నుడిటో రజోగుణం.

6 రక్తవర్ణమైన పృథివితత్వముతోచేరిన రజోగుణమువలన కృష్ణవర్ణమైన అగ్నితత్వముతోగూడుటవలన తమోగుణము.

7 కృష్ణవర్ణమైన అగ్నితత్వముతోగూడిన తమోగుణమునందు శ్వేతవర్ణమైన జలతత్వముతోజేరుటచేత సత్వగుణము.

8 కృష్ణవర్ణమైన అగ్నితత్వముతోచేరిన తమోగుణమునందు రక్తవర్ణమైన పృథివితత్వముతోగూడుటవలన రజోగుణం.

9 కృష్ణవర్ణమైన అగ్నితత్వముతోగూడుటవలన తమోగుణమునందు డిటో తమోగుణం.

ఈవిధమున తొమ్మిది విధము లయ్యెను.

మూడుమూళ్లు తొమ్మిదిసూత్రములు తొమ్మిది జీవులైనవి.

మూడుమూళ్ళు తొమ్మిదిజీవులచేనైన సృష్టివివరం.

1 శ్వేతవర్ణమైన జలతత్వముతోకూడిన సత్వగుణములో డిటో సత్వగుణమువలన కలిగినవి.

విరాట్టు సూత్రేశ్వరుడు మొదలగువారు పుట్టిరి.

2 శ్వేతవర్ణమైన జలతత్వముతోచేరిన సత్వగుణములో రక్తవర్ణమై

న పృథివితత్వముతో కూడిన రజోగుణమువలన కలిగనవి. దేవతలు ఆరువది నాలుగుకోట్ల వాలఖ్యులు, వైఖానసులు మొదలగువారు పుట్టిరి.

3 శ్వేతవర్ణమైన జలతత్వముతో చేరిన సత్వగుణముతో చేరిన కృష్ణవర్ణమైన అగ్నితత్వమైన తమోగుణమువలన కలిగినవి.

యక్షులు, రాక్షసులు, విద్యాధరులు, లోనగువారు పుట్టిరి.

4 రక్తవర్ణమైన పృథివితత్వముతో చేరిన రజోగుణమువలన శ్వేతవర్ణమైన జలతత్వముతో చేరిన సత్వగుణమునందలి కలిగినవి—

జనసంఘము వుదయించెను.

5 రక్తవర్ణమైన పృథివితత్వముతో చేరిన రజోగుణమునందలి డీటో రజోగుణమువలన కలిగినవి—

నాలుగుకాళ్ళుగల పశువులు, మృగములు, మొదలగునవి పుట్టెను.

6 రక్తవర్ణమైన పృథివితత్వముతో చేరిన రజోగుణములో కృష్ణవర్ణమైన అగ్నితత్వము, తమోగుణమువలన కలిగినవి—

పైరులు, కసవులు, గడ్డి, పంటలు మొదలగునవి పుట్టినవి.

7 కృష్ణవర్ణమైన అగ్నితత్వమైన తమోగుణమునందలి శ్వేతవర్ణమైన జలతత్వముతో చేరిన సత్వగుణమునందలి కలిగినవి—

పైరులు, కసవు, గడ్డి, పంటలు మొదలగునవి.

8 కృష్ణవర్ణమైన అగ్నితత్వముతో చేరిన తమోగుణమువలన రక్తవర్ణమైన పృథివితత్వముతో చేరిన రజోగుణమునందలి కలిగినవి—

చెట్లు, పొదలు, తీగలు, లోనగునవి పుట్టెను.

9 కృష్ణవర్ణమైన అగ్నితత్వమైన తమోగుణమువలన డీటో తమోగుణమువలన కలిగినవి—

భూములు, కొండలు, రాళ్లు పుట్టెను.

మూడుతో మ్మిదలు యిరువైయేడు భేదములైన త్రిగుణ గాయత్రి
యొక్క సృష్టివివరం. 27 భేదములైన విధము.

1 జలతత్వము, శ్వేతవర్ణము, సత్వగుణములో అగ్నితత్వము, కృష్ణవర్ణము, తమోగుణము, యీతమోగుణము.

2 జలతత్వమైన శ్వేతవర్ణమైన సత్వగుణములో కృష్ణవర్ణమైన అగ్ని

తత్వముతో చేరిన యీతమోగుణమునందలి రక్తవర్ణమైన పృథివితత్వమైన రజోగుణం.

3 జలతత్వమైన శ్వేతవర్ణమైన సత్వగుణములో కృష్ణవర్ణమైన అగ్నితత్వముతో చేరిన తమోగుణములో సత్వగుణము.

4 జలతత్వమైన శ్వేతవర్ణమైన సత్వగుణములో రక్తవర్ణమైన పృథివితత్వమైన రజోగుణములో తమోగుణం.

5 జలతత్వమైన శ్వేతవర్ణమైన సత్వగుణములో పృథివితత్వమైన రక్తవర్ణములో రజోగుణములో రజోగుణం.

6 జలతత్వమైన శ్వేతవర్ణమైన సత్వగుణంలో పృథివితత్వమైన రక్తవర్ణమైన రజోగుణంలో సత్వగుణం.

7 జలతత్వమైన శ్వేతవర్ణమైన సత్వగుణములో సత్వగుణం. ఈసత్వగుణములో తమోగుణం.

8 జలతత్వమైన శ్వేతవర్ణమైన సత్వగుణంలో సత్వగుణం. ఈసత్వగుణములో పృథివితత్వమైన రజోగుణం.

9 జలతత్వమైన శ్వేతవర్ణమైన సత్వగుణంలో సత్వగుణం. ఈసత్వములో సత్వం.

1 శ్వేతవర్ణమైన పృథితత్వముతో చేరిన రజోగుణములో కృష్ణవర్ణమైన అగ్నితత్వమైన తమోగుణం. ఈతమోగుణం.

2 రక్తవర్ణమైన పృథివితత్వమైన రజోగుణంలో తమోగుణం. ఈతమోగుణములో రజోగుణం.

3 రక్తవర్ణమైన పృథివితత్వమయిన రజోగుణం కృష్ణవర్ణమైన తమోగుణంఅగ్నితత్వమయిన యీతమోగుణంలో శ్వేతవర్ణమయిన జలతత్వమయిన సత్వగుణం.

4 రక్తవర్ణమయిన పృథివితత్వము రజోగుణంలో రజోగుణం యీరజోగుణంలో తమోగుణం.

5 రక్తవర్ణమయిన పృథివితత్వం రజోగుణంలో రజోగుణం యీరజోగుణంలో రజోగుణం.

6 రక్తవర్ణమయిన పృథివితత్వం రజోగుణంలో రజోగుణం యీరజోగుణంలో జలతత్వమైన శ్వేతవర్ణమైన సత్వగుణం.

7 రక్తవర్ణమయిన పృథివితత్వం రజోగుణంలో సత్వగుణం యీసత్వగుణాంలో తమోగుణాం.

8 రక్తవర్ణమయిన పృథివితత్వంలో రజోగుణాంలో సత్వగుణం యీసత్వగుణాంలో రజోగుణం.

9 రక్తవర్ణమయిన పృథివితత్వం రజోగుణాంలో సత్వగుణంలో సత్వగుణాం.

1 కృష్ణవర్ణమయిన అగ్నితత్వం తమోగుణాంలో తమోగుణం యీతమోగుణాంలో తమోగుణాం.

2 కృష్ణవర్ణమయిన అగ్నితత్వం తమోగుణాంలో తమోగుణం యీతమోగుణంలో రక్తవర్ణమయిన పృథివితత్వమయిన రజోగుణాం.

3 కృష్ణవర్ణమయిన అగ్నితత్వం తమోగుణాం ఈతమోగుణాంలో శ్వేతవర్ణమయిన జలతత్వమయిన సత్వగుణాం.

4 కృష్ణవర్ణమయిన అగ్నితత్వం తమోగుణాంలో రజోగుణాం ఈరజోగుణాంలో తమోగుణాం.

5 కృష్ణవర్ణమయిన అగ్నితత్వం తమోగుణాంలో రజోగుణాం ఈరజోగుణంలో రజోగుణాం.

6 కృష్ణవర్ణమయిన అగ్నితత్వం తమోగుణంలో రజోగుణం ఈరజోగుణాంలో సత్వగుణాం.

7 కృష్ణవర్ణమయిన అగ్నితత్వం తమోగుణాంలో సత్వగుణం ఈసత్వగుణంలో తమోగుణం.

8 కృష్ణవర్ణమయిన అగ్నితత్వం తమోగుణాంలో సత్వగుణం ఈసత్వగుణంలో రజోగుణాం.

9 కృష్ణవర్ణమయిన అగ్నితత్వం తమోగుణంలో సత్వగుణం ఈసత్వగుణంలో సత్వగుణం.

ఈ యిరువదియేడు భేదములైన జీవులయొక్క సృష్టివివరం.

— ఈత్రిగుణగాయత్రి 27 భేదములచేనైన సృష్టివివరం. —

1 శ్వేతవర్ణమైన జలతత్వముతోచేరిన సత్వగుణంలో కృష్ణవర్ణమయి అగ్నితత్వమయిన తమోగుణం యీతమోగుణంలో తమోగుణంతో చేరుటవలన కలిగినవి-స-త.త.

శేషుడు, వాసుకి, తక్షకుడు, కర్కోటకుడు, శంఖుడు మొదలగు సర్పములు. ఆహా హూహూ మొదలగు గంధర్వులును, అశ్వముఖంబులును నరశరీరంబులునుగల కిన్నరులును, మణిభద్రుడు మొదలగు కింపురుషులును, కామరూపధరులును ముప్పదియార్వురు తుషితులు నైఋతులును మొదలగు రాక్షసులును అసురేంద్రుడు లోనగు అరువదిఆరుకోట్ల దైత్యులును, కుబేరుడు లోనగు యక్షులును మొదలగువారు పుట్టిరి.

2 శ్వేతవర్ణమైన జలతత్వముతో చేరిన సత్వగుణంలో కృష్ణవర్ణమయిన అగ్నితత్వమయిన తమోగుణంలో రజోగుణంవలన కలిగినవి-స-త-త.

ముప్పదిమూడుకోట్ల దేవతలును, యముడు, అంగీరసుడు, అగ్నిష్వాత్తుడు, కవ్యవాహనుడు, ఆజానుజానలు మొదలగు పితృదేవతలు పుట్టిరి.

3 శ్వేతవర్ణమైన జలతత్వం సత్వగుణంలో కృష్ణవర్ణమయిన అగ్నితత్వం తమోగుణంలో సత్వగుణం కలియుటచేత కలిగినవి-స-త-స.

భూలోకమునందలి జనులకును, అగ్నిష్టోమాది వైదికకర్మలుజేయు బుద్ధిపుట్టించుటకును వారికి తమ సారూప్యాదిపదవుల నిచ్చుటకును శక్తిగలిగి దేవలోకమునందుండు కర్మదేవతలును, సూర్యుడుమొదలగు నవగ్రహములును, వానిపరివారసమూహములును కల్పించు రూపములను పుట్టించును.

4 శ్వేతవర్ణమైన జలతత్వం, సత్వగుణంలో రక్తవర్ణమయిన పృథివితత్వం రజోగుణమువలన, కృష్ణవర్ణమయిన అగ్నితత్వం తమోగుణంకలియుటచేత కలిగినవి-స-ర-త.

అణిమాది సిద్ధులును గల విశ్వావసుపరావసు ప్రభృతిసిద్ధులును, మనుడు, అనుమంతుడు, విష్ణువు, ధర్ముడు, నారాయణుడు మొదలగు సాధ్యులును, బ్రహ్మఋషులును, సనకాదిమునులును మొదలైనవారు పుట్టిరి.

5 శ్వేతవర్ణమైన జలతత్వం, సత్వగుణం కృష్ణవర్ణమయిన అగ్నితత్వం, తమోగుణంలో రజోగుణం-స-త-త.

ఇంద్రుడుమొదలగు దిక్పాలకులును ముప్పదిమూడుకోట్ల వేలుపులును, బ్రహ్మవిష్ణురుద్రేశ్వర సదాశివులును, పుట్టిరి. బృహస్పతి విశ్వకర్మ నందికుమార గణనాథాదులును, దూర్వాస దత్తాత్రేయాది మహాఋషులను కాలాగ్నిరుద్రహాటకేశ్వరులును పుట్టిరి.

6 శ్వేతవర్ణమైన జలతత్వము, సత్వగుణంలో సత్వగుణమునందలి తమోగుణమువలన కలిగినవి-స-స-త.

విరాట్టుహిరణ్యాగర్భ అవ్యాకృత స్థూలగణేశ్వరుడు సవికల్పకజ్ఞాన నిష్ఠులు పుట్టిరి.

7 శ్వేతవర్ణమైన జలతత్వం సత్వగుణంలో సత్వగుణమునందలి కృష్ణవర్ణమయిన అగ్నితత్వం తమోగుణమునందలి కలిగినవి-స-స-త.

సూత్రాత్ముడు, సూక్ష్మనాయకుడు, నిర్వికల్పసమాధినిష్ఠులు బ్రహ్మవిదుడు, బ్రహ్మవిద్వరుడు, బ్రహ్మవిద్యాగరిష్ఠుడు, బ్రహ్మవిద్వరీయుడు మొదలగు జీవన్ముక్తులు పుట్టిరి.

8 శ్వేతవర్ణమయిన జలతత్వము సత్వగుణంలో సత్వగుణమునందలి రజోగుణమువలన కలిగినవి-స స-ర.

సర్వజ్ఞత్వము, సర్వేశ్వరత్వము సర్వాంతర్యామత్వము, కర్మకర్తత్వము, సర్వనియామకత్వము లోనగు మహాగుణములును సృష్టిస్థితి సంహారములు, తిరోధానము అను గ్రహములనెడి పంచకృత్యములును గల పరమేశ్వరుడు పుట్టెను.

9 శ్వేతవర్ణమయిన జలతత్వము సత్వగుణములో రక్తవర్ణమయిన పృధివితత్వమయిన రజోగుణంలో రజోగుణంవలన కలిగినవి స-ర-ర.

నిత్యపవిత్రులును వశిష్ఠాగస్త్య, దరిచి, గౌతమ, భరద్వాజాది ఋషులును, శుక, వామదేవ, జాబాల్యాది మౌనులును- భగవన్నామపరాయణులును ప్రహ్లాద, పుండరీక నారదాంబరీష పరమభాగవతులును పుట్టిరి.

1 రక్తవర్ణమైన పృధివితత్వం రజోగుణంలో అగ్నితత్వం కష్ణవర్ణమయిన తమోగుణంలో తమోగుణంవలన కలిగినవి-ర-త-త.

అడవియీగలు, తేళ్ళు, కందిరీగలు, ఉశిళ్ళు, చీమలు, ఈగలు, చీమలు, పాములు, మిడతలు, మింటను, జంతుప్రలు మిణుగురుపురుగులు, పట్టుపురుగులు ముఖముర్సుపురుగులు, చెమటవల్లపుట్టిన, పెనుఈగ, చీరపేళ్ళు, యర్రిలు, నల్లులు, దోమలు, లోనగునవి పుట్టెను.

2 రక్తవర్ణమైన పృధివితత్వముతో చేరిన రజోగుణంలో తజోగుణం, కృష్ణవర్ణమయిన అగ్నితత్వం తమోగుణంవలన కలిగినవి-ర-ర-త.

మొసళ్ళు, యొండ్రికాయలు, నత్తలు, గవ్వలు, కాకిచిప్పలు, ముత్తెపుచిప్పలు, సంకుచేపలు, నీటిపాములు, కప్పలు, జలగలు లోనగు జలజంతువులు పుట్టెను.

3 రక్తవర్ణమైన పృధివితత్వమయిన రజోగుణంలో సత్వగుణంలో తమోగుణంవలన కలిగినవి ర-స-త.

కాకులు, పిచ్చుకలు, చిలకలు, గోరవంకలు, నెమళ్ళు, హంసలు, కొంగలు, చక్రవాకములు, చకోరములు, గండభేరుండములు, శరభములు, గరుడపక్షులు, గ్రద్దలు, కౌజులు, వానకోయిలలు, గువ్వలు, కోళ్ళు, పావురాళ్ళు మొదలగునవి కలిగినవి.

4 రక్తవర్ణమైన పృధివితత్వమయిన రజోగుణంలో రజోగుణమునందలి తమోగుణమువలన గలిగినవి ర-ర-త.

సింహములు, పులులు, అడవిపందులు, ఎలుగులు, ఊరపందులు, ఎలుకలు, పందికొక్కులు, కుక్కలు, నక్కలు, పిల్లులు, బల్లులు, చివగలు, తోడేళ్ళు, సుండేళ్లు, గాడిదలు, చిఱుతపులులు, వృకములు.

5 రక్తవర్ణమైన పృధివితత్వమయిన రజోగుణంలో రజోగుణమందలి రజోగుణంవలన కలిగినవి-ర-ర-ర.

కోతులు, ఏనుగులు, గుర్రములు, మేకలు, గొర్రెలు, ఎనుములు, పునుగు, జవ్వాది, పిల్లులు, గస్తూరి, కస్తూరిమృగములు, ఒంటెలు, ఖడ్గమృగములు, మొదలగునవి పుట్టెను.

6 రక్తవర్ణమైన పృధివితత్వమయిన రజోగుణంలో రజోగుణమందలి సత్వగుణంవలన కలిగినవి-ర1ర-స.

కామధేనుకులమునబుట్టిన కపిలఆవులు, మొదలగు గోవులును, చమరీమృగములు, నల్లయర్రిలు, జింకలు, దుప్పులు మొదలగునవి పుట్టెను.

7 రక్తవర్ణమైన పృధివితత్వమయిన రజోగుణంలో శ్వేతవర్ణమయిన జలతత్వములో సత్వగుణంలో తమోగుణమువలన కలిగినవి-ర-స-త.

శూద్రులు, మంగల, చాకల, మాల, మాదిగలు, బోయ, ఎరుక, యానాది, ఛెంచు, కుమ్మరి, సాలి, అగసాలి లోనగు జాతులువారును మధ్యమాంసభక్షకులును, జనభయంకరులును, చోరులును, కటికవాండ్రును మరియు ఘాతకపనులుచేయువారలును మొదలగువారు పుట్టిరి.

8 రక్తవర్ణమైన పృథివితత్వమయిన రజోగుణంలో శ్వేతవర్ణమయిన జలతత్వముతో చేరి సత్వగుణములో రజోగుణమువలన కలిగినవి. ర-స-ర.

చదువుట, యిచ్చుట, పుణ్యకర్మలుచేయుట, దుష్టనిగ్రహ, శిష్టపరిపాలన, భూరక్షణలోనగు పనులుగల, రాజులును, దున్నుట, ఆవులగాచుట, బేరమాడుట లోనగుపనులు కోమట్లు బేరులును మొదలగువారు పుట్టిరి.

9 రక్తవర్ణమైన పృథివితత్వంలో రజోగుణంలో, రజోగుణమునందు సత్వగుణంవలన కలిగినవి ర ర-స.

బ్రహ్మదులును, వేదశాస్త్ర విద్యాయనసంపన్నులును, బ్రహ్మచర్యాశ్రమాచారవంతులును మైన, ఆంధ్రకర్నాట ద్రావిడ, ఘూర్జర మహారాష్ట్రులనెడు పంచవిధద్రావిడులును, వుత్కలమైదులు, గౌడలు, సౌజలు, పారసత్వ శార్వర్యులనెడి పంచగౌడులును, వీరె దశవిధబ్రాహ్మణులును మొదలగువారు పుట్టిరి.

1 కృష్ణవర్ణమైన అగ్నితత్వముతో చేరిన తమోగుణములో తమోగుణమునందు తమోగుణమునందుగలిగినవి-త-త-త.

నీళ్లులేని భూములు, కొండలు, ముండ్లుచెట్లు, గుండ్లరాళ్లు గలిగినవి. జనులుపోగూడని మార్గములు, జనులసంచరింపదగని కొండలుమార్గములు, మెరకనేలలు, చవిటినేలలు, తృణకాష్ఠజలసమృద్ధులు, లేక దేవబ్రాహ్మణవర్జితములైన పరోపకారరహితులును, కేవలతమోగుణజనులకు నివాసములు. వగరు, చేదు, వుప్పుగల జలములుగలిగి భూతదయా పశ్చాత్తాపములేక, భూతభేతాళ బ్రహ్మరాక్షసాది దుష్టగ్రహనివాసములయిన తామసయాహారములు, తామసదానములు, తామసతపస్సులు, తామసశ్రద్ధలు, తామసయఘములు, ఉగ్రజంతునివాసములు, నివశించుగ్రామములున్ను గల దేశశములు మొదలగునవి పుట్టెను.

2 కృష్ణవర్ణమైన అగ్నితత్వం తమోగుణంలో తమోగుణమువలన రక్తవర్ణమైన పృథ్వీతత్వం రజోగుణమువలన కలిగినవి-త-త-ర.

సారవంతమైన పంటలకుదగిన తియ్యనితేట, చల్లని నీళ్ళుగలిగి రాజసాహారములు, దానములు, తపస్సులు, శ్రద్ధలు, యజ్ఞములు, జనసంచారములకు తగిన యోగ్యములయిన భూములు, మృదువైన జార చోర కంటక రహి

తములయిన మార్గములును, మేలయిన కొండలును, రేగటిమన్ను యర్రని మన్ను గల నేలలును, మృదువులైన మనుష్యకార్యములును, యోగ్యములయిన రాళ్ళును, సామాన్యజనులచే పూజింపంబడిన దేవబ్రాహ్మణ నివాసములైన యోగ్యములయిన యూళ్లుగల దేశములు మొదలగునవి పుట్టెను.

3 కృష్ణవర్ణమైన అగ్నితత్వం తమోగుణంలో తమోగుణమునందలి సత్వగుణమువలన కలిగినవి-త-త-స.

పుణ్యక్షేత్రములు, గంగాదిపుణ్యనదులు, పవిత్రజలములుగలిగి దేవతలచేత, బ్రాహ్మణులచేత, నెల్లప్పుడు శేవింపుబడెడు కాశీ, కంచి, మధుర, అయోధ్య, ద్వారావతి, సింహాద్రి, అరుణాచలం, శ్రీశైలం, అగస్త్యగిరి, కైలాసం, హిమాలయం, మేరుగిరి, మంధరపర్వతములోనగు పుణ్యపర్వతములు, గోపీచందన, శ్వేతమృత్తికలు, ఫలపుష్పపత్రయోగ్యములగు చెట్లుగల నేలలు, సజ్జనసంసారమార్గములును, సాలగ్రామ, ప్రాణలింగ, సోణభద్రగణపతి, స్వర్ణవితుల, రాజావర్తములును, యమునారాళ్లులోనగు సిలలును, బంగారు వెండి మొదలగు లోహములును పుట్టెడుచోట్లును, వజ్రవైఢూర్యములులోనగు రత్నముల గనులనేకములును, బ్రహ్మవిద్వరీయ బ్రహ్మవిద్వరిష్ఠ బ్రహ్మవిద్వర బ్రహ్మవిదులు మొదలగు మహాఋషులును, సంచారనివాసములకు తగినస్థలములును స్వాత్వికఆహార దానతపోయజ్ఞ శ్రద్ధలుగల జనులకు నివాసపాత్రములగు క్షేత్రములును మొదలగునవి పుట్టెను.

4 కృష్ణవర్ణమైన అగ్నితత్వం తమోగుణంలో రక్తవర్ణమయిన పృథివితత్వం రజోగుణంలో తమోగుణంవలన కలిగినవి-త-ర-త.

చేదు, ముండ్లుగలిగి నీడలు, పువ్వులు, పండ్లు లేక, నిద్రా ఆలస్యములు సోమరితనము లోనగు తామసగుణములుగల దుర్జనులకు తగిన ముష్టి వేప, తుమ్మ, బలురక్కసి, నాగజముడు, తాటి, యీత లోనగు నికృష్టచెట్లను దుర్గంధసహితములైన అల్పజలములుగల యేళ్లున్ను, పిశాచ దుష్టజనసంచారములకు తగినయూళ్ళును.

5 కృష్ణవర్ణమైన అగ్నితత్వం, తమోగుణంలో రక్తవర్ణమయిన పృథివితత్వమయిన రజోగుణంలో తమోగుణమువలన కలిగినవి-త-త-ర.

రాజసజనులకు యోగ్యములైన ఫలపుష్పపత్రములున్ను గలిగి అవుషధములున్ను, భక్షణములకుతగిన నిమ్మ దానిమ్మ, కానుగ, నేరేడు చింత

లోనగు తరువులు, మనుష్యులచేత సేవింపఁదగిన పుష్పములు, తీగలు, పొదలు, పొదరిండ్లు మొదలగునవి పుట్టెను.

6 కృష్ణవర్ణమైన అగ్నితత్వం తమోగుణంలో రజోగుణమునందు సత్వగుణంవలన కలిగినవి-త-ర-స.

సాత్వికజనులకు దగిన అరటి, పనస, మామిడి, వెలగ, రాగి, తులశి బిల్వము, మల్లెలోనగు చెట్లును, యజ్ఞములకుతగిన చంద్రి, మేడి, ఉత్తరేణి, దర్భ లోనగునవియును దేవఋషులు, బ్రాహ్మణులు లోనగు నుత్తములచేత పూజింపఁదగిన పద్మములు, కలువలు, కల్పకములు, పారిజాతములు, మందారములు, హరిచందనములు, సంతానములోనగునవి కల్పవృక్షములును, సురపొన్నలు లోనగునవి పుట్టెను.

7 కృష్ణవర్ణమైన అగ్నితత్వం, తమోగుణంలో శ్వేతవర్ణముయిన జలతత్వం సత్వగుణమందలి తమోగుణంవలన కలిగినవి-త స-త.

తమిదవ ప్రులవలు, జొన్న, కొఱ్ఱ, సజ్జ, ఆరిక, వరిగ మొదలగు క్షుద్రధాన్యములు ఆవాలు, మిరియాలు, మిరపకాయలు మొదలైనవిపుట్టెను.

8 కృష్ణవర్ణమైన అగ్నితత్వం, తమోగుణంలో రజోగుణమందలి సత్వగుణమువలన కలిగినవి-త-ర-స.

నల్లవరి, కంది, నువ్వు, మినుములులోనగు పైరులుపుట్టెను. జాజికాయలు, లవంగములు, యాలకాయలు, పసుపులోనగునవి 12 నేలలు పుట్టెను.

9 కృష్ణవర్ణమైన అగ్నితత్వం, తమోగుణంలో సత్వగుణమందు కలిగినవి-త-స-స.

తెల్లవరి, సన్నవరి, నివ్వరి, సన్నవరి, పెసలు, గోధుమలు, యవలు, చామలు, చెరకు, మేలగు కాయలు, పండ్లు, ఆకులు, పూవులు మొదలయినవి 12 నేలలు పుట్టెను.

ఈవిధముగ సమిష్టిరూపమైన మూలావిద్య, మలినసత్వప్రధానమైన కించజ్ఞుండు కార్యోపాధిమైనదె మూలజ్ఞప్తికళామాత్రమనే మనోబింబురూపము. అట్టి అనాదిమూలప్రకృతి తన త్రిగుణములచేత మొదట జ్ఞానశక్తి, యిచ్ఛాశక్తి, ఆదిశక్తి యీత్రిశక్తులుగఁదోఁచి వెనుక యీత్రిగుణ పరస్పర

సమ్మేళనమువలన నవవిధములై పిదప ఆనవవిధవిద్యా అన్యోన్యసమ్మేళనము వలన, సప్తవింశతియై 27 డు జీవులై తనత్రిగుణములచేతను, గుణసాంఖ్య సృష్టికల్పనచేయుచుండెను. నిర్గుణపరబ్రహ్మమందు, చంద్రునియందు చంద్రికలవలెను, తెల్లనివస్త్రమునందు చిత్రములుకల్పితములయినట్లు పైచెప్పబడిన 27 భేదములచేతనైన సృష్టికి కారణమై ప్రకృతిమయమగు మూలజ్ఞప్తి కళామాత్రి శరీరంబనె మూలప్రకృతి--గాయత్రి మూడుపాదములున్న-భూర్భువస్సువః వ్యాహృతిత్రయముతోడ 27 డు భేదములైనది.

ఈగాయత్రిని ద్విజాతులు బ్రహ్మక్షత్రియ వైశ్య తారతమ్యత చేత వుపాస్యముగ నిర్ణయించిరి. మరియు యోగాయత్రికి బాహ్యయజ్ఞోపవీతమును ధరించి, సిఖాయజ్ఞోపవీతమును ధరించుచుండిరి.

ఈ యజ్ఞోపవీతము మూడుసూత్రములుగలది. అందొక్కసూత్రమునకు మూడేసి అంతరసూత్రములు గలవు. ఆ మూడు అంతరసూత్రములయందొక్కొక్కటి మూడుమూడు పోగులుగలవు. మూడు పెద్దపోగులుగల యజ్ఞోపవీతము 27 పోగులుగలదయ్యెను. ఆతంతువులే యిరువదియేడుభేదములుగల జగత్తు. ఆజగద్రూపమగు యజ్ఞోపవీతమునే గాయత్రియని ద్విజాతులుధరించి, సర్వకర్మములు జేయుచున్నారు. త్రిగుణగాయత్రిచేతనైన సృష్టి 27 డు భేదములై 27 సూత్రములై యజ్ఞోపవీతము. దీనినే దేవిగాయత్రి యని యందురు.

హంసగాయత్రి 27 భేదములై 27 సూత్రములుగల యజ్ఞోపవీతమును హంసగాయత్రి యని యందురు.

ఇరవైయొక్కవెయ్యి ఆరునూరుదల హంసలచేత అవస్థాత్రయమునందు యిడాపింగళనాడులయందు సంచరించుచు యీ అంతరయజ్ఞోపవీతము ధరించినవాడే బ్రాహ్మణుడు. శ్రీసద్గురుకరుణచేత యీ అంతరయజ్ఞోపవీత సూత్రములు 27 డున్న దేవిగాయత్రియొక్క అంతరసూత్రములను తెలుసుకొని 27 డు భేదములైన అంతరహంసగాయత్రియొక్క అంతరసూత్రములను తెలుసుకొని బ్రహ్మజ్ఞాన సంపన్నుడై గాయత్రియజ్ఞోపవీత ప్రపంచ విచారణచే యీ అంతరయజ్ఞోపవీతమునందలి మూడుతంతువులకు యనగ మూడు అవస్థాత్రయములకు కూటస్థానమైన ముడియే బ్రహ్మముడి యని యను యదియె అమలసత్వప్రధానయగు గుణసామ్యావస్థచేత భిక్షారించి అ

తరయజ్ఞోపవీతమునె పరిత్యజించుటే అంతరసన్యాసమని చెప్పుదురు. బాహ్య యజ్ఞోపవీతము పరిత్యజించుట బాహ్యసన్యాసమని చెప్పుదురు. బ్రహ్మజ్ఞానోపదేశంబున గురురహస్యార్థపూర్వకముగ తెలియవలెను. ఈత్రిగుణాత్మికమైన మూలప్రకృతి అనగ అనాధిమూలమాయ. నాసన్నిధానబలమున వుత్పత్తిస్థితిలయములు సకలప్రాణులకు అవస్థాత్రయమనే తాననే పరమాత్మయందు తనత్రిగుణములచేత కల్పింపబడిన త్రిశక్తులును వానియందు క్రీడించుచుండును ॥శృతి॥ శ్రీరామరామేతి శ్రీరామ, రామ, రామ, యనుచు రమియించు తురాముని యందురామ' యనునట్లు తనయందు తా నేరమియించుచుండును. తనశక్తిబలముచేత సకలజగత్తును కల్పింపం జేయుచున్నది. ఈత్రిగుణాత్మికమైన యనాదిమూలప్రకృతి స్వరూపిణి నాసన్నిధానబలమున సకలప్రాణులను నాయందు తనత్రిగుణములవలన కల్పించి నాయందు క్రీడించుచుండును. అస్మత్ ఆత్మస్వరూపుడనైన తన్నుతా తెలుసుకుని తన్నెరింగి పొందినవారు యీమాయ నతిక్రమింతురనిన్ని,

బాహ్యయజ్ఞోపవీతము పరిత్యజించుట. బాహ్యకర్మను విసర్జించుట సన్యాసముకాదు. అంతరబ్రహ్మయజ్ఞోపవీతమును ధరించి యీ 27 సూత్రములను తెలిసి విచారించుచు తన్నుతా దెలసి సర్వకర్మవిముక్తుండై జీవన్ముక్తుడై యీకిటుకు తటుకున తెలిసినవాడే మోక్షార్హుడని చెప్పబడును. పైనిచెప్పిన యీ యిరువదిఏడుభాగములును సారెసారెకు ఒకటికొకటి గలయగ అనేకవిధములైన సృష్టి కలుగజేసెను. ఇట్టిగుణత్రయ వివేకశాస్త్రమునుబట్టి నాకుగోచరించినంతవరకు వ్రాసితిని. బుద్ధిమంతులగువారు మీదుమిక్కిలిగ నూహింపవచ్చును.

మూలజ్ఞప్తికళామాత్రస్వరూపంబైన యనాదిమూలప్రకృతి సూర్యకాంతి సూర్యునకు వేరుకానిపగిది తన్నెడబాయక ఆత్మనెడబాయక తనస్వరూపమాత్రముగ నుండెడు శుద్ధసత్వప్రధానమైన పరిశుద్ధమెరుకయనే జీవజ్ఞప్తికళామాత్రస్వరూపంబైన గాయత్రి ఆసూర్యకాంతిని విడవకనే వెలపల లోపల వ్యాపించి చీకటిని తనయందు నణుచుకొని తనయందు ప్రకాశించు తీరున యాపరబ్రహ్మమును విడువకనే తన్నువిడువకనే బహిర్వ్యాపకముగలదై సృష్టిస్థితిలయాలులేని పరమాత్మను తానావరించి అదితనయందుగలయునట్లు దానికిసృష్టిస్థితిలయాములు కలిగినట్లుగను గనబడజేయుచు మలినసత్వ

ప్రధానమనెడి కించజ్ఞుడయిన, మూలజ్ఞప్తికళామాత్రస్వరూపంబైన త్రిగుణా త్మకమైన మూలప్రకృతి మలినసత్వప్రధానమాయాసమన్వితమై రక్తశ్వేత పీతనీలవర్ణముల కలదియై నానావిధరూపములతోగూడి బహువిధములయిన ప్రాణములను బుట్టించుచు పంచవింశతితత్వాత్మకంబై జాగ్రతస్వప్నసుషుప్త్య వస్థలయందు వుత్పత్తిస్థితిలయములుజేయును యింద్రియమిత్రసమ్మేళన వ్యవ హారములతోగూడినది. జీవజ్ఞప్తి తన్నుతాదెలసి వివేకజ్ఞానముచేత తాను మూలజ్ఞప్తి ప్రజ్ఞానస్వరూపంబైన కార్యోపాధి తానని దెలసి బాహ్యయజ్ఞో పవీతమును పరిత్యజించి అవస్థాత్రయములకు విలక్షణమై అమలశుద్ధసత్వప్ర ధాన సర్వజ్ఞత్వస్వరూపంబైన స్వయంప్రకాశమానంబైన కారణస్వరూపం బైన అవస్థాత్రయములకు విలక్షణంబై స్వజాతివిజాతి స్వగతభేద శూన్యంబై యుండు సృష్టిస్థితిలయములు లేనిదై సర్వవిలక్షణమై సర్వాంతర్యామియై పర బ్రహ్మమేతానై ఆప్రకృతియందె ప్రవేశించి మగ్నమైయుండును. అనుభవించి విడచిన భోగములుగల యీప్రకృతిసంబంధములేనివాడు సృష్టిశూన్యుడై ప్రకృతివిలక్షణుడైన స్వయంప్రకాశంబైన ప్రత్యగాత్మస్వరూపంబైన తానె ఆకళలో నిష్కళాస్వరూపం చైతన్యమాత్రంబైన ప్రతగ్భిన్నపరమాత్మ బ్రహ్మజ్ఞానియైనవాడు బాహ్యశిఖాయజ్ఞోపవీతముచు ముండనము మొదలగు కర్మములను విడువకవిడచి అకర్తయై కర్మఫలముపొందకయే కర్మయాచరిం చుచు బాహ్యయజ్ఞోపవీతము ధరించి బాహ్యసంసారమునందు వ్యవహరించు చుండును. బాహ్యయజ్ఞోపవీతమునే అంతరయజ్ఞోపవీతముగా దెలసి పంచ వింశతిహంసతత్వయజ్ఞోపవీతమును వ్యర్థముని ముక్తిమార్గమునకు అకార్యము ని విడచిపెట్టి బాహ్యయజ్ఞోపవీతధారణ ధరించి తెలుసుకొని బాహ్యసన్యా సమువల్ల మోక్షప్రాప్తికానేరదని అంతరయజ్ఞోపవీతధారణ ధరించి 27 డు భేదములచేగల బ్రహ్మసూత్రమును ధరించి తన్ను తా దెలసి ఆత్మయజ్ఞోపవీ తధారణజేయుచు హఠరాజయోగ అమనస్కబ్రహ్మయజ్ఞోపవీతము ధరించి పరమపదమని త్రికాలములయందు నిత్యం ఆత్మైక్యానుసంధానముజేయుచు ఆబ్రహ్మసూత్రమును ధరించినవాడే శృతి॥ బ్రహ్మజ్ఞానంతు బ్రాహ్మణః॥ బ్రాహ్మ ణుడు యని వేదార్థము నెరిగినవాడే.

త్రిగుణగాయత్రియొక్క వర్ణార్థము.

ఈదిగువ వ్రాయుచున్న వర్ణములచేకూడినదే గాయత్రి. యీభై

యూరు వర్ణముల చేకూడినదే గాయత్రియొక్క బీజములు.

అం ఆం ఇం ఈం ఉం ఊం ఋం ౠం ఌం ౡం ఎం ఏం ఐం ఒం ఓం ఔం అం అః కం ఖం గం ఘం ఙం చం ఛం జం ఝం ఞం టం ఠం డం ఢం ణం తం థం దం ధం నం పం ఫం బం భం మం యం రం లం వం శం షం సం హం ళం క్షం అం యిం తిం.

ఈ 54 రు వర్ణములు అంతరయజ్ఞోపవీతము. అకారం మొదలు క్షకారపర్యంతంలో 21600 యిరవైయొక్కవెయ్యి ఆరువందల హంసలు. షడాధారములయందు అంతరసూత్రం హంసరూపంబున సంచరించుచున్నదే బ్రహ్మసూత్రం. ఇదే హంసగాయత్రి. 27 ను సూత్రములచేతకూడినదే అంతరవ్యాహృతిత్రిపుటులచేతకూడినదే ఆత్మసూత్రము. బ్రహ్మయజ్ఞోపవీతం ఓంమిత్యేకాక్షరంబ్రహ్మ. ఈబ్రహ్మప్రణవమే బ్రహ్మయజ్ఞోపవీతం. బ్రహ్మకళాజ్ఞానం. త్రిపుటిమధ్యమందు హృదయాకాశమందు స్వయంప్రకాశమానమైన ఓంమిత్యేకాక్షరంబ్రహ్మ ఓంభూర్భువస్సువః ఓంతత్సవితృవరేణ్యం భర్గోదేవస్యధీమహి ధియోయోనః ప్రచోదయాత్.

ఈత్రిగుణగాయత్రి త్రిపాదములు వ్యాహృతిత్రయం 1 సత్వరజస్తమోగుణము ఓంభూః భువః సువః జ్ఞానశక్తి, యిచ్ఛాశక్తి, ఆదిశక్తి, రక్త, శ్వేత, కృష్ణవర్ణములు. జాగ్రత, స్వప్నం, సుషుప్తి, అవస్థలు. విశ్వ, తైజస, ప్రాజ్ఞులు, అకార, ఉకార, మకారములు, సోహం, హంసః, హంసోహం, గాయత్రి అంతఃసూత్రములు. దీనినే హంసగాయత్రియనిన్ని, బ్రహ్మగాయత్రియనిన్ని, రవిగాయత్రియనిన్ని వేదములు ఘోషించుచున్నవి.

ఈత్రిగుణగాయత్రి యొక్కపంచకళలుచేకూడినది.

5, నివృత్తికళ, ప్రతిష్ఠకళ, విద్యాకళ, శాంతికళ, నిష్కళ యీపంచకళాతీతమే తుర్యాతీతం. గాయత్రి పరబ్రహ్మస్వరూపం, నిష్కళము, నిరంజనం, నిర్మలం, నిర్గుణం, స్వరూపం.

శృతి॥ మకారం మననంచైవ త్రకారం త్రాణముచ్యతే మననత్రాణమిత్యాహు ర్మంత్రమిత్యభిధీయతే.

బ్రహ్మకళ, ఆత్మకళ, సూర్యకళ, చంద్రకళ, ప్రకృతికళ యీయైదున్ను బ్రహ్మగాయత్రికళలు. పరబ్రహ్మము పంచకళాతీతము స్త్రీగాదు పురుషుడుగాదు నపుంసకుడుగాదు మననమునకు అతీతము మంత్రమునకు

అతీతము తత్వానందకు అతీతము సర్వదేవతతీతము కళాతీతము అట్టి నిష్కళాతీతమైన పరబ్రహ్మము. అట్టి బ్రహ్మగాయత్రిస్వరూపంబైన పరమాత్మను శ్రీసద్గురువివేకజ్ఞానముచేత తన్ను తా దెలసినవాడే బ్రహ్మవేత్త, రాజయోగి, పరమహంస అని చెప్పబడును. యజ్ఞవరాహభగవద్గీతయందు॥ అహిరివ జనయోగం సర్వదావర్జయేత్కుణపమివసునారీంత్యక్తకా విరాగి విషమువిష మయాధ్ధీ-హా-న్యమానోదురంతా- జగతిపరమహంసో వాసుదేవహమేవ॥ ఇత్యాదిశృతులు చెప్పుచున్నవి.

ఇంద్రియాతీతుడు, యింద్రినిగ్రహుడు, అసంగుడు అయిన బ్రహ్మజ్ఞాని మనోనిగ్రహముగలవాడు.

ఓమ్ నాదమందు బిందువ, బిందువయందు కళ, కళయందు

1 అకార ఉకార మకారము యీమూడుమాత్రకళలుకలసి ఓంకారం. ఈఓంకారమే ప్రణవం.

2 జ్ఞానశక్తి, యిశ్చాశక్తి, ఆదిశక్తి. వీనిగుణములు-

3 రజోగుణ, సత్వగుణ, తమోగుణములు. వీనికి అవస్థలు-

4 జాగ్రత్త, స్వప్న, సుషుప్తి అవస్థలు. వీనికి అధిదేవతలు-

5 విశ్వ, తైజస, ప్రాజ్ఞులు. వీనికి అండత్రయములు-

6 అండ, పిండ, బహ్మాండములు. వీనికి కళలు-

7 నాదు, బిందు, కళలు. వీనికి తత్వములు-

8 ఆత్మతత్వ, జీవతత్వ, బ్రహ్మతత్వం. వీనికి ఆనందములు-

9 బ్రహ్మానంద, నిర్విషయానంద, విషయానందములు. సదసత్తులు-

10 సత్తు, చిత్తు, ఆనందములు. వీనికి జీవత్రయములు-

11 జీవుడు, ఈశ్వరుడు, ఆత్మ. వీనికి దేహత్రయములు-

12 స్థూలదేహ, సూక్ష్మదేహ, కారణదేహములు. వీనికి తాపత్రయములు-

13 అధ్యాత్మ, అతిభౌతిక, అతిదైవికములు. వీనికి కర్మత్రయము-

14 పుణ్యకర్మ, పాపకర్మ, మిశ్రమ, కర్మములు. కాలత్రయములు-

15 భూత, భవిష్యద్, వర్తమానకాలములు. వీనికి లోకములు-

16 స్వర్గలోకము, పాతాళలోకము, మర్త్యలోకము. వీనికి పదవులు-

17 సాలోక్య, సామీప్య, సాయుజ్యములు. వీనికిఈశ్వరత్రయములు-

18 విరాట్టు, హిరణ్యగర్భ, అవ్యాకృతులు. వీనికి భక్తిత్రయములు-

19 బాహ్యభక్తి, ఏకాంతభక్తి, అనన్యభక్తి. అని వీనికి దీక్షాత్రయములు.

20 గురుదీక్ష, మంత్రదీక్ష, పదదీక్షత్రయములకు స్థానములు-

21 నాభిస్థానము, హృదయస్థానము, త్రికూటస్థానము. వీనికి నేత్రములు-

22 వామనేత్ర, దక్షిణనేత్ర, నాసాగ్రములు. వీనికి లక్ష్యములు-

23 అంతర్లక్ష్య, బాహ్యలక్ష్య, అంతరాంతరలక్ష్యములు. వీనికి జ్ఞానత్రయములు-

24 సుజ్ఞాన, విజ్ఞాన, ప్రజ్ఞానములు. వీనికి మండలత్రయములు.

25 సూర్యమండల, చంద్రమండల, అగ్నిమండలములు. వీనికి ముక్తిత్రయములు

26 జీవన్ముక్తి, క్రమముక్తి, విదేహముక్తి, వీనికి కామత్రయములు-

27 ధర్మ, అర్థము, కామము. వీనికి బుద్ధిత్రయములు-

28 స్వాత్విక, రాజస, తామసములు. వీనికి దేవత్రయములు-

29 వసు, రుద్ర, ఆదిత్యులు. వీనికి విరక్తిత్రయములు-

30 ఐహిక, ఆముష్మిక, వైరాగ్యములు. వీనికి మతత్రయములు-

31 ద్వైతము, అద్వైతము, విశిష్టాద్వైతము. వీనికి యోగత్రయములు-

32 తారకయోగము, సాంఖ్యయోగము, అమనస్కయోగము. వీనికి పదత్రయములు-

33 తత్పద, త్వంపద, అశిపదములకు చైతన్యములు-

34 చైతన్యము, చేతనములు, శుద్ధచైతన్యము. వీనికి ఆత్మత్రయములు

35 జీవాత్మ, అంతరాత్మ, పరమాత్మ. వీనికి సమాధులు-

36 సవికల్పము, నిర్వికల్పము, నిర్బీజసమాధులు. వీనికి ఆశ్రమములు-

37 సన్యాసము, గృహస్తు, బ్రహ్మచర్యము. వీనికి లక్ష్యములు-

38 ద్రష్ట, దర్శన, దృశములు. వీనికి దృష్టులు-

39 వెలిచూపు, లోచూపు, అంతరచూపు. వీనికి త్రివిధప్రసాదములు

40 గురుపాదోదకం, గురుప్రసాదం, గురుపుచ్ఛిష్టం. వీనికి నిదిధ్యాసములు-

41 శ్రవణ, మనన, నిధిధ్యాసములు. వీనికి గుణత్రయములు-

42 సగుణము, నిర్గుణము, శుద్ధనిర్గుణం. వీనికి శాంతత్రయములు-

43 సత్యము, శాంతము, మౌనము. వీనికి రతిత్రయములు-

44 రతి, వుపరతి, సమరతులు. వీనికి అయిక్యత్రయములు-

45 ఆత్మైక్యము, శివజీవైక్యము, జీవబ్రహ్మైక్యము. వీనికి యోగత్రయములు—

46 జ్ఞానయోగం, భక్తియోగం, ఆత్మయోగం. వీనికిఆత్మత్రయములు

47 ఆత్మ, అనాత్మ, కేవలాత్మ. వీనికి గుణత్రయములు-

48 సగుణము, నిర్గుణము, శుద్ధనిర్గుణము. వీనికి రేతస్సులు-

49 వూర్ధ్వరేతస్సు, అధోరేతస్సు, ఆత్మరేతస్సు. వీనికి కూటత్రయములు-

50 కూటస్థుము, సాక్షి, ప్రత్యగాత్మ. వీనికి పైని త్రయములు లేవు.

ఈబాహ్యాంతరత్రిపుటుల కతీతమే పరబ్రహ్మము. నాకు గోచరించినంతవరకు వ్రాసితిని.

ఈబ్రహ్మగాయత్రి, మూలజ్ఞప్తి కళామాత్రస్వరూపంబైన త్రిగుణాత్మికమైన గాయత్రి మూలప్రకృతి. బ్రహ్మ గాయత్రిస్వరూపం. ఈరహస్యంగురురహస్యార్థపూర్వకముగా తన్ను తా దెలియవలెను. తెలిసి దెలియని చందమున దెలిసియుండవలెను. సద్గురునకు తనుమఃప్రాణపుష్పంబులచే పూజించి నిరంతరం ఆత్మైక్యానుసంధానంబున నిర్వికల్పసమాధిపరులైయుండవలెను.

సమాప్తము.



శ్రీరస్తు

# శ్రీ మహాఋషి నిఘంటిత యోగశాస్త్రము

## పిండోత్పత్తి సాంఖ్యయోగము.

—: పంచశిఖమహాఋషి జనకులవారికి పిండోత్పత్తి సాంఖ్యయోగము జెప్పుట :—

అది యెట్లనిన—

1 ప్రశ్న—తశ్చరీర బంధమోక్షంబు లెవ్విధంబున ప్రాప్తించు-1.

2 ప్రశ్న — జీవస్సశరీరసంబంధం బెబ్భంగి ప్రవర్తించు-

3 ప్రశ్న—జీవస్వరూపంబన నెద్ది-

4 ప్రశ్న—దేహస్వభావంబెట్లు- వివరింపుమని ప్రార్థించిన- యా పార్థివోత్తము వాక్యంబులాకర్ణించి హర్షోత్కర్ష మానసుండై అడిగితివి. వేదశాస్త్రసారాంశమైనదియు మహాపరమరహస్యమైనదియు- నగు ధర్మము- అర్థము, కామములను- నడుగుదురుగాని- నీభంగి మోక్షవిద్య అధ్యాత్మ విద్య అడుగరెవ్వరనిన వినుమని పంచపిఖమహాఋషిట్లనియె. పరంజ్యోతి స్వరూపుడై శుద్ధసత్వుడఖిలజగత్ కల్పనారక్షక సంహారకారణుండై- చిదాకారుడై. ఆదిమధ్యాంత మంగళదాయకుండై- అప్రమేయుండు- అభవుండు- ఆత్మస్వరూపుండు- అష్టమూర్తియై- యామహాపరమపురుషుని- యనగ పరమాత్మశక్తివలన అవయవములు పూర్ణమై వెలుంగుచుండ- యీ సకలభూత ప్రపంచంబు స్థావరంబులు జగంబులు జీవసంచయంతో గూడిన జీవాత్మ. పరమాత్మ- భేదంబులైయున్నను- భేదంబుసేయుట మర్యాదగాదు గావున- జీవాత్మ పరమాత్మలకు తన్నుతాదెలియుపర్యంతంబు భేదంబులై దోచుగాని- తన్నుతాదెలిసిన తానుతానైనపిమ్మట జీవాత్మ పరమాత్మలకు యించుకైన భేదంబులేదని జెప్పినంత—

అట్లగుటంజేసి యమ్మహాదేవుఁడైన యఖండతేజో మయాకారంబైన-కేవలాత్మయందు (వటబీజమునందు వృక్షంబు వృద్ధిఁబొందినట్లు వటబీజన్యాయంబున వహ్నియందు స్ఫులింగంబులు పొడమిన రీతిని యనగ అగ్నియందు వుష్ణశక్తివలెనే- పరమేశ్వరుని యంశభూతంబులైన జీవులని దెలియును. ॥శృతి॥ బ్రహ్మణో॰ రవ్యక్తః అవ్యక్తాత్ మహతః మహతో అహంకారః అహంకారాత్ పంచతన్మాత్రాణి పంచతన్మాత్రేభ్యో పంచభూతాని — పంచభూతేభ్యో నిఖిలంజగత్ ॥శంకరభాష్యే॥ యతిపంచకమునందు యతోవాఇమానిభూతాని జాయంతే॥ ఏపరబ్రహ్మమునుండి ఈభూతములు పుట్టుచున్నవో అను మొదలవేదవాక్యములు బ్రహ్మమె జగత్తునకు కారణమని జెప్పుటచేతను జీవాత్మకు యుత్పత్తిశక్తి లేకపోవుటచేతను యిద్దరకు ఐక్యమెట్లు సిద్ధించును. సమాధానమేమనగ- త్రిగుణాత్మక అవిద్యాప్రతిబింబరూపుఁడగు జీవుఁడు నిరుపాధికబ్రహ్మంబునందు మాయాసంబంధమున జీవస్వభావము ప్రసిద్ధంబయ్యె యట్టిజీవుండు శాంభవియోగమాయా మోహితుఁడై యనాదికర్మవశమున జీవునిచేత సృజింపబడిన స్వప్నచైతన్యాదులు నశ్వరమో యట్లే ఈశ్వరకల్పితమగు ప్రపంచమునైతము నశ్వరముగావున జీవబ్రహ్మలకు ఏకత్వము చెప్పుటచేత దోషమేమియు లేదుగావున యీవిషయమునుగూర్చి శృతి ప్రమాణమున్నది. ఎట్లనిన శంకరభాష్యమందు యథాస్వప్న ప్రపంచోయం మయిమాయావిజృంభితః ఏవంజాగ్రత్ప్రపంచోపి మయిమాయా విజృంభితః॥ ఇత్యాది ప్రారబ్ధ మెవ్విధంబున బ్రవర్తించు నెవ్విధంబున సచరాచరశరీరములెత్తి సుఖంబులు ఆత్మకులేకున్నను మహదహంకారభూతంబులైన కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యంబులం బ్రమత్తులై పురాకృతంబున సుఖదుఃఖములం మునుంగు దోషంబు లాత్మకు గలగనేరవు. విద్వాంసుండైన భూసురోత్తముండు సురాపానంబుచేసి నొడలెరుంగని చందంబున దుర్జయంబైన మూలప్రకృతివలననైన భ్రాంతిజేసి జీవకోట్లు యశ్వమేధాది స్వకృతవిశేషంబుల స్వర్గంబును బ్రహ్మహత్య మహాపాతకంబులన్ జేసి గర్భనరకంబు ననుభవింతురు. ఇట్లు సర్వప్రపంచము మిథ్యాభూతంబనియు నెరిగి అని ॥తత్ సృష్ట్వాతదేవానుప్రావిశత్॥ శృతివాక్యమునకు ప్రపంచమును సృజించి యాప్రపంచమునే ప్రవేశించెను గావున ప్రత్యగాత్మయు సాక్షాత్తుగ పరబ్రహ్మస్వరూపుఁడుగాని వేరుగాదు.

జీవాత్మకు పరమాత్మకు యభేదముకావుననే తత్వమసి మున్నగు వేదవాక్యములు జీవభావము జెందినవానికే స్వభావసిద్ధమైన బ్రహ్మభావమును చెప్పుచున్నవి.

శంకరభాష్యం॥ బ్రహ్మైవాహం మిదం జగత్సకలం చిన్మాత్రవిస్తారితం సర్వంచైతదవిద్యయా త్రిగుణయా సేశం మయాకల్పితం ఇత్థంయస్య దృఢామతిస్సుఖతరే నిత్యేపరేనిర్మలె ఇత్యాది చైతన్యముతో నిండియున్నట్టియు జీవేశ్వరాదిభేదములుగల యీప్రపంచమంతయు సత్వరజస్తమోగుణాత్మకమగు యవిద్యచేత నావలన కల్పింపబడినది. నేను నిర్మలమై పరబ్రహ్మమును అని యీవిధముగా సుఖరూపముయున్నట్టియు నాశనములేనట్టియు స్వచ్ఛమైనట్టియు పరబ్రహ్మమునందు కల్పింపబడిన నామరూపాది బహువిధభేదములుగల యీప్రపంచమంతయు చిద్రూపమైన బ్రహ్మయందు ఆరోపింపబడినదిగాని వాస్తవముగ యీప్రపంచమనునది లేదు. అంతకు యధిష్ఠానభూతమగు బ్రహ్మముమాత్రమే సత్యముగాని మరియొకవస్తువుగాదు. సత్వరజస్తమోగుణాత్మకమగు అవిద్యను సాధనముగాగ్రహించి నేనే యీప్రపంచమును గల్పించినాడను. జగత్తునకు యధిష్ఠానభూతమగు పరమాత్మయే నేను యనునట్టిబుద్ధి నిరతిశయానందరూపుడగు పరమాత్మయందు మోక్షేచ్ఛగలవానికి నిరతిశయానంద నిత్యశుద్ధస్వప్రకాశబ్రహ్మ విషయైక్యానుసంధానముచేత దృఢమగుచున్నదో యట్టివాడు నిత్యశుద్ధస్వరూపముగల పరబ్రహ్మమేయయి యుండెను. కావున జీవబ్రహ్మముల కభేదముసిద్ధించుచున్నది. ॥శృతి॥ శుక్తిరజితవత్॥ కొందరు ముత్తెపుచిప్పలయందు భ్రమచేత ఆరోపింపంబడిన వెండివలె జగత్తుగూడా బ్రమచేత ఆరోపింపంబడినది. వాస్తవముకాదు యని చెప్పెదరు. ఆవిషయము ప్రమాణముకాదు. ఏలననగా లోకమందు సార్థకమైన వ్యవహారాదికము క్రమముగ జరుగుచున్నది కావున ముత్తెపుచిప్ప వెండియని శుక్తిరజితదృష్టాంతముగా చెప్పగూడదనుయనే పూర్వపక్షమురాగ యీప్రపంచము ద్రష్టయగు పరబ్రహ్మమునందె యారోపింపబడినది. అద్వైతపరబ్రహ్మమునందు ద్వైతప్రపంచము యారోపింపబడినది గావున దృశ్యము మిథ్యయగుటచేతను ప్రపంచమునకు మిథ్యాత్వము సిద్ధించుచున్నది.

కావున సత్యజ్ఞానానందరూపమగు పరబ్రహ్మమె మిగులుచున్నదను విషయము నిశ్చయము. ॥శ్రీశంకరమనీషాపంచకం॥ శశ్వన్నశ్వరమేవవిశ్వ మఖిలం నిశ్చిత్యవాచాగురోః ఇత్యం బ్రహ్మనిరంతరం విమృశతా నిర్వ్యాజశాం తాత్మన భూతంభావిచతుష్కృతం ప్రదహతా సంవిన్మయేపావకె ప్రారబ్ధా య సమర్పితం స్వవపురిత్యేషామనీషామమ—

భావార్థం॥ దృగ్గోచరమగు యఖిలప్రపంచము అనిత్యమే యనువిష యమును బాగుగనెరింగి సద్గురువాక్యముచేత నిత్యుడగు పరమాత్మనుగూర్చి విమర్శనాపూర్వకముగ నిరంతరము విచారణము సల్పను దంభదర్పాద్య సురవాసనలులేని మనస్సుగలవారై జ్ఞానరూపమైన యగ్నియందు సంచితా గామికర్మరూపమగు సుకృత దుష్కృత రూపఫలములను దహించుకొనియుం డునట్టి బ్రహ్మవేత్త తనదేహమును ప్రారబ్ధఫలము ననుభవించునిమిత్తము ధరియించియున్నాడని చెప్పియుండిరి. ఈశ్లోకమునందు పరబ్రహ్మమును నిత్యునిగా విశేషించి చెప్పియున్నారు. నిత్యుడనగా కాలత్రయమునందు వుం డువాడని యర్థము. ప్రపంచము కాలత్రయములయందు వుండునదిగాదు. కావున యనిత్యమని అర్థము. ఇట్టిపరమాత్మనుగూర్చి నిరంతరము విమ ర్శింపవలయునని చెప్పుటచేత ॥పతంజలీయోగసూత్రములు యోగములందు చెప్పియున్నది. సతుదీర్ఘకాలనైరంతర్యసత్కారాసేవితో దృఢభూమిః॥ యని సూత్రార్థము నిచటగ్రహించునది. కాలత్రయమునందుండునట్టియు ప్రపం చాతీతముయినట్టియు సప్రకాశమైనట్టియు జ్ఞానరూపమును సర్వకాలానంద స్వరూపమగు పరబ్రహ్మమె నేనను భావన—సకలవిధకర్మములను విస్పష్ట ముగా విడచి చిరకాలము విమవక చేసిన కర్మచేతగాని ధ్యానముచేతగాని కలుగదనియు ఆచార్యులవారు సూచించియున్నారు. పరబ్రహ్మమునుగూర్చి ॥వుపనిషత్॥ మనీషాపంచక సూత్రభాష్యము చెప్పుచున్నది. గావున—జీవ స్వరూపంబుయొక్క నిజస్వరూపం బ్రహ్మస్వరూపమని ప్రమాణంబులచే చెప్పియున్నది.

ఈప్రపంచమునందు దేహస్వభావం బెవ్విధంబున ప్రవర్తిల్లు. పుడమి యందు యీమర్త్యలోకంబున జరాయుజ అండ శ్వేదదుద్భిజంబులు, జంగమంబు లందు, పశు పక్షి మృగాది తిర్యగ్జంతువులకు అభివ్యక్తి లేకుండుటంజేసి యీపుణ్యపాపంబులం పొందవు. చతుర్విధజన్మంబులలోన జరాయుజంబు,

అముఖ్యాంబు. అందు మానుష్యదేహంబు దుర్లభంబు. ధర్మార్థకామమోక్షంబులకు మానుషజన్మంబు కారణంబు కావున క్షితిమీద మదవతులు ప్రకృతి పురుషులు ఋతువైన నానాళ్ళ వెనుక మజ్జనమాడి పురుషునిముఖము చూచుట యుత్తమధర్మం బని తరుణికి అన్యులనుజూచి అట్టి రూపవంతుడౌ పుత్రు డవస్యంబు గావున రతులు సల్పుదు రట్టి సద్వ్రతము పదియారు దినములకు మదవతులకు ఋతుకాల మని పెద్దలు చెప్పుదురు. బేసదినమునను గర్భ మొదవిన తెరవబుట్టుచుండు. సరిదినంబున నిల్చిని పురుషుడౌను. మిశ్రమవేళల పొందుగావింప నందుబుట్టి నొక్కటై తోడ్తోడ నపుంసకుడు పుట్టును. పదియారవదినమున స్త్రీకి గర్భమైన మానవపతియై పురుషసింహుండు. ఇది పరమరహస్యమంచు మహాఋషులు చెప్పుదురు.

కావున సృష్టిప్రకారంబు చెప్పెద నాకర్ణింపుము.

మరియు పురుషసింహునియొక్క వీర్యంబు హెచ్చిన పురుషుడై జన్మించును. తరుణిశోణితం బెచ్చిన స్త్రీయై బుట్టును. ప్రకృతిసరియైన సిఖండియై బుట్టును. కావున కుడిప్రక్క పురుషుండు మెసలును. వామభాగమునందు స్త్రీకి యిరువుగానుండును. ఆనట్టనడుమ బృహన్నల స్థానంబు. మగవానిని గనబోవు మగువలకు మదిపొడమిన కార్యాదిభావములకు స్త్రీయైన భయము, లజ్జయు దోచు. అపగిదిని రెండుభాగముల మిశ్రమగుణములను ప్రబలియుండును. పుట్టి ఆగర్భమున నపుంసకుడు కాంణములేక కార్యము గలుగదు గావున పురుషుండు తెలయక ప్రకృతిబొందు సమయమున శుక్లము భావమన్మథకారమలో నజార్ భిన్నమైన సుషుస్థితి రక్తముగూడ యొక్కటై జేరును. సూక్ష్మచర్మమున భయముచేత స్త్రీగర్భమందు ఓందురుపుడై ప్రవేశించి వటబీజమున వటమహావృక్షంబు ఒరగినటు గర్భమందు ప్రవేశించి పెరుగుచుండెను.

అస్థిసంధులు మున్నూటపదిగలవు. రౌరవనరకంబులు, ప్రసవంబులు, శేచనంబులు, నలూకఖండంబులు, సముద్రమంబులు, మండలంబులు, శంఖంబులు, ఘాతంబులు, వాయసతుండంబునం బేరుకొన్న కీకసంబులు, గూడుకొని మూడుకోట్ల పదిలక్షలు రోమకూపంబులు విలసిల్లు. భువనత్రయంబున నిట్టి శరీరముకన్న సారంబైన, శృతి॥ జ్ఞానంనరాణాం మధికోవిశ్శేషః॥ పదార్థం బెయ్యది దేహాభిమానంబునం బట్టువడి సాహంకారులై ప్రాలుమాలి

మహాపాతకోప పాతకంబులు సేయుచున్న వారలిట్టి దేహలక్షణంబులు మోక్షాపేక్షగల మాన్యులకు గాని యన్యులకు ధన్యు లుపన్యసింపబోరు. మహాత్మా! నీకతంబున నిమ్మనానీయ రహస్యంబు, పరమరహస్యంబు ప్రకాశంబయ్యె. ౧౧౦ జీవస్వరూపం బన యెయ్యదియో నెరింగింపవలయు మహాత్మా యని వేడగ ౧౧౧— నిరావరణభావార్థ సూత్రములు. శంకర భాష్యం। ద్వైతాద్వైతవినిర్ముక్తం పూర్ణబోధావశిష్యతే॥ నతిథిః నచవారః ననక్షత్రం నయోగో నకరణో నదేవో నభక్తిః ననియమోనాదిష్టానం కామో నచరాచరం నచరణం నకుక్షిః నశరీరో నత్యాగో నగ్రహణం నజపః నప రాయణం నపూజా నహోమోనకార్యం నయాత్రావలోకనం నవిధిః నిషే ధో నాభిమానః నదృశ్యం నవిశ్వం నలోకోనబంధుః నశత్రు నమిత్రం నబం ధమ్ తర్మ్ముక్తిః నభావః నబంధనం నరాజ యోగో నపితృకార్యం నసంత్సరం నమాసో నస్నానం నసంధ్యా నకర్తా నబోధో నక్షేత్రం నక్షేత్రజ్ఞః నప్ర త్యగాత్మ నకూటస్థో నసాక్షి నప్రకృతి నపురుషో నస్తానం నతేజో నతపః నఘర్ నశిష్యః నప్రకాశం నదృష్టం నాంతరం నబహిర్ స్వప్నం నజాగ్రన్న సుషుప్తిః నగోత్రం నకులం నశూన్యం సూన్యోత్కేనకంవదంతి త్కేనకం పసేత్ పసేత్ త్కేనకం శృణోతిత్కేనకం సర్వోపాస్థి విజానాతి భావాభావ వివర్జితః పరమాకాశః శివాదన్యంనకించన అత్యంతవివర్జితశ్శివః ఆదిమధ్యాం తరహితః శ్శివహ సపకానిత్యః అకాలసమద్వయం వాచారంభణం వికారో నామధేయం కాలత్రియాబాధ్యస్సపకోశ్శివః॥

ఇట్టి శృతిప్రమాణములు చెప్పుచున్నవి. జీవాత్మయే పరమాత్మ. జీవాత్మయే తన్ను తా దెలసి తాను తానై తాను జీవుడుగాడని నేతినేతిత్తైవె శృతిః శృతి॥ నేతినేతీతినేతీతి శేషితంపూర్ణముచ్యతే పూర్ణమదః పూర్ణ మిదం పూర్ణాత్పూర్ణముదీర్యతే పూర్ణశ్యపూర్ణమాదాయ పూర్ణమేవా వశిష్యతే—ఇత్యాదిప్రమాణములు జెప్పుచున్నవి. కాబట్టి జీవాత్మయే పర మాత్మ. ఎట్లులనిన నిరహంకారుండు, చిన్మయాత్ముడు, సదానిర్వాణసంధా యకుండు, తేజోమయాకారుండు, మహాయోగానురక్తుండు, పరిపూర్ణానంద భావుండు, జగత్కళ్యాణపారీణుడై యాడించువాడు దానై యాడెడువాడును దానేయై సకలార్థమునకు సర్వసాక్షియైన దానై సర్వము తానై యుండు పరమాత్మ జగముల యోనిబీజమాత్ర ప్రధానుడై అచ్యుతుడై అవ్యయుడై

శక్తిసహితుడై యఖిలలోకాధినాయకుండైన పరమేశ్వరుండు తనమాయ దాటగల శక్యమే మానవులకు గావున సుశీయాత్మునకు యెందునను మోక్షుంబు లేదు గావున దేహాభిమాన మెల్లయు వదలి తాను జీవుడుగాడని నిశ్చయించుకొని తా సర్వసాక్షియైన పరమాత్మనని తానే దలచిన వేదాంతశాస్త్రములుగల తత్వజ్ఞాన మొదవెనేని వానికే గల్గు మోక్షసామ్రాజ్యపదము.

సంసారబంధంబు సమసిపోయిన మనుజునకు విదేహకైవల్యప్రాప్తి గల్గునని దేహాభిమానకర్మబంధంబు జెగిపోయిన మానవునకు జీవన్ముక్తిగలుగునని యు సకల సంశయములును సమసిపోయినగాని దుఃఖప్రారబ్ధంబు దగ్ధమై లింగదేహభంగమగును.

తాపత్రియంబులు చల్లారితేగాని చిత్తవిశ్రాంతిమార్గము గలుగుచుండును. కాబట్టి నిర్మలాద్వైతభావన యనుభవముగలిగియుండు మోక్షేచ్ఛగలవారలకు కేవలానందభావనికేతనంబునొంది అరూఢనిర్వికల్పపూర్ణసమాధిపరుండైయున్న విదేహకైవల్యమోక్షప్రాప్తి గలుగునని శృతి స్మృతి ఉపనిషత్ భాష్యములు చెప్పుచున్నవి.

గర్భమందుండు జీవుని దేహాభివృద్ధి యెట్లులనిన—

ప్రథమమాసమందు పదునైన బుద్బుదభాతిగనుండును. నాల్గవపక్షమునకు అనగ ద్వితీయమాసమునకు పిండరూపమగుచు పెంపొందుచుండును. తృతీయమాసమునకు అవయవములు పుట్టుచుండును. చతుర్థమాసమందు చరణంబులు, హస్తంబులు, గక్షంబులు, గర్ణయుగంబులు, జిహ్వయు, ముక్కును సంభవించును. ఆకాలములోన జీవులకు అప్పుడు కొంత విచారబుద్ధి దుఃఖాలయమైన గర్భగోళమందు నాపదబొందలుచు వేదనబొందుచుండ పంచమమాసంబున మనస్సు అధికస్ఫురణజెదు. షణ్మాసమున మాంసరక్తంబున నరము లెముకలు, నఖములు, జనితములగు రోమములును గలుగును. సప్తమమాసంబున బలము, వర్ణము గలిగియుండును. ఈసప్తమమాసమందు వివేకముగలిగి గర్భనరక మనుభవించి వేదనలను బొందుచుండును. తల్లియొక్క జఠరాగ్నివలన యాతనపుదూలి పక్కలెముకలు రంపాలపగది సోకుచుండగ శోణితము జీము గోళ్లుమ సూక్ష్మమైన క్రిమిచయంబువలె ముండ్లవలె మేను నిశిగి నలిగి మలమూత్ర పైత్యరసముల దులదూగుచు దుఃఖాంపుచు చేతులు మూసుకొని పదములసందున కేలుమోడ్చి ముణుకుచునుండె.

ఎట్లనిన తాబేలువలె నుండును. తల్లిగర్భమునందుండి చదివిన చదువు ఆవేళ దలపోయు. పూర్వజన్మ వ్యాపారములు గొన్ని దుఃఖావేశంబున మున్నుబొందు గర్భనరకప్రారంభదుర్గంధబాధావిస్ఫూర్తి బాహుళ్యమై ఆమీఁద మహాఘోరమైన భారోపద్రవ మొందజేయుట, ప్రారబ్ధసంబంధంబులు, ప్రారబ్ధం భోగతోనశ్యేత్ — యీగర్భగోళమందున్న జీవుడు ఆకాలంబున నీవు నేను మతిలో అన్యోన్యప్రీతిగా — జీవుడు దుఃఖప్రారబ్ధం యనుభవించుచుండుట, అని శోకింపుచు దైనమూభయాది దుఃఖ గర్భవేదన దుఃఖంబు మాన నుపాయంబైన గర్భంబునొదవ భద్రమైయున్న పానంబుజేయు రక్తంబు తజ్జీవునకు జీవనంబు తన్నిమిత్తమునగదా మాతృగర్భమందు జంచలత్వంబున ప్రాప్తించు. ఆకాలంబున బీడితాంగుడై మావిచేత బాదవంగబడి యంతమొదలులేక ప్రాణములులేనివానివలె వైభవముగాంచి జనని భక్షించుచున్న రసంబు హృదయనాడీముఖమున దిగజారి నాభిచెంత బొందుకతనమున అనగ తల్లి భుజించిన పదార్థములయొక్క సారమువలన బ్రతికి విస్ఫూర్తిగలిగి తెలివిగలిగి అంత నవమాసమున ప్రసూతిసమయంబున బవనవశంబున కకత్రయంబుల విముక్తుండై కుక్షిమార్గంబున వెలువడి మేధోరుధిరపిక్తాంగుడై దుఃఖింపుచు యధోముఖంబున సూక్ష్మద్వారంబున వెలువడి జంత్రపుసూత్రమువలన దప్పిజారిన బొమ్మవిధమున భూపతనంబైన పూర్వజ్ఞానం బంతయు మరచి సారమేయబిడాల జంతుసంతాన దంష్ట్రలబాలు పడకుండ దండహస్తులచేత రక్షితుండై తన్ను నెరుంగక దనుజుం గనుంగొని జనకుండని దలంచుచు మోహినీభూతుండై బొడగట్టిన జననియంది భావింపుచు శోణితంబుల జ్ఞానము లపోలిక ద్రావుటంజేసి దీర్ఘనష్టంబులని ఆర్యులు జెప్పుదురు.

దేహంబునందుగల నాడులు శ్లేష్మవిదితంబులైయుండు నట్లు గావున సుషుమ్నానాళమందు శ్లేష్మపూరంబు నిర్యాణంబగు నందాఁక సువ్రితము లాడ శక్తిలేదు. దానం జేసిగదా గర్భస్థుండగు జీవుండు గర్భగోళంబున రోదనముజేయ సమర్థంబుగాక యివ్విధంబున మూఢభావంబున బాల్యయౌవన కౌమారంబులు గడచినపిమ్మట యవ్వానేకనిద్రితుండై భద్రేభయానలను గాంక్షింపుచు మన్మథజ్వర విహ్వలుడై వృథాయాసంబున గొంతకాలంబు తరించినయంతరంబున సంసారమోహపాశములం గట్టుబడి యీషణత్రయబాధితుండై వ్యర్థంబులగు కుటుంబపోషణార్థంబుగ సకలమాయోపాయం

బుల సంశయంబుల బరిభ్రమించుచు గొన్నివత్సరంబులు జనినమీదట జరాభారంబువచ్చిన భ్రాంతికి మూలంబై సంతాపించుచు సర్వేంద్రియసాంద్రవిలాసంబుదప్పి శ్లేష్మవాతాది ఘోరరోగపీడితుండై బ్రాణావసానకాలంబున విహంగపుంగవుచేత గ్రహింపబడిన భుజంగంబుతెరంగున మృత్యువుచేత బ్రాణంబులు గ్రహింపబడి వృక్షంబాశ్రయించిన పక్షులు వృక్షములు విడచి తమతమ తోవలం బోవురీతి దేహంబుదిగనాడి పన్నగంబు కుబుసమువిడచిన మాట్కి స్వచ్ఛంబగుభాతి యాతన, తనువుదాల్చిన యాజీవునికి కర్మశేషనబున యమలోకమనే గర్భనరకంబులోనికి వచ్చి గర్భనరకంబు లనుభవించి ప్రాణంబులు దేహంబులబాయక కులాలచక్రంబువలె అనగ కుమ్మరసానవలె మగ్గములో కండెవలె శిథిలవస్త్రములు విడచి నూతనవస్త్రములు ధరించినట్లుగా తేజోబిందూపనిషత్॥ చిదేవదేహశ్చిదిమేవలోకాః చ్చిదేవభూతాని చ్చిదేంద్రియాణి కర్తాచిదంతః కరణంచిదేవ చ్చిదేవసర్వం పరమాత్మమేకం॥ యనునట్లు,

ఈజీవునకు సంజీవియనే గాలి యనగ పునరావృత్తియనే జన్మకు కారణంబై పూర్వజన్మవాసనకర్మ బనే సంజీవియనే గాలి తగిలి పునర్జన్మం బెత్తుచుండిరి. ఈజననమరణములు అనాదికల్పితంబులని తెలియందగును. దీనికి బీజము, జన్మము. జన్మమునకు బీజము, కర్మము. కర్మమునకు బీజము, కోరిక. కోరికకు బీజము, మరణము. మరణమునకు బీజము, వృద్ధిపొందుట సిద్ధంబగును. మహావ్యాఘ్రరూపమైన యనాది పరమేశ్వరుండైన జగద్గురుంకు తప్ప తక్కినవారలు యెరుంగ శక్యంబుగాదు. పరమేశ్వరుండు తేజోమయాకారుండు యఖండజ్యోతిరానందస్వరూపుడైన సనాతనుండు బ్రహ్మమయుండు. అట్టి పరమాత్మ నిర్వికల్పు డనంతుండు నిర్లేపుడు యార్యుండు యపరిమేయుండు అమలభావుండు సచ్చిదానందవిగ్రహుండు.

శృతి॥ నిరాలంబసూత్రములు॥ అథతః నిరంజనం నిరామయం సర్వగత మస్థూల మణన్మ మదీర్ఘ మతిర్య గూర్ధ్వ మతర్క్య మనిర్వచనీయ పరమాకాశమలక్షణ మభవం శివ ఏకోవశిష్యతె॥ ఇత్యాది సూత్రములు.

బ్రహ్మసూత్రములు॥ అథ శివఏవసనాతనం బ్రహ్మభగవానచలఏవ సత్యం నిరంజనం నిర్వికల్పం నిరింద్రం పరాత్పరం బాహ్యాముపైతివిద్వాన్ ఇత్యాది బ్రహ్మసూత్రాణి॥ భావార్థదీపికసూత్రః॥ అవేద్య మసంగ మభా

ధ్య మబోధ్యమలక్ష్యమకర్మ మప్రిమేయమద్వయ మనిష్క్రియ పరమాకా శమచలం సర్వదా భాతిపూర్ణం" ఇత్యాది సూత్రిభాష్యములు. బ్రహ్మసూత్రిములు భావార్థసూత్రములు మొదలైనవి పరబ్రహ్మనుగురించి చెప్పుచున్నవి. అట్టి పరబ్రహ్మమందు విద్యుచ్ఛక్తి ఆద్యస్ఫూర్తి యనగ అణిమూలజ్ఞప్తి కళామాత్రశరీరంబనే యనాది త్రిగుణాత్మికమైన మూలప్రకృత్తి శోభిల్లుచున్నది. ఆ దృష్టాంతము లన్నియు మునుపే చెప్పియున్నవి. అదిగాక పరమేశ్వరుని మాయవాగ్బుద్ధుల కలవిగాదు. కావున పెద్దలైనవారు పెంపుగా జెప్పినట్టి రాజతారకసాంఖ్యసాధులన్ని రాజసంబును సత్వంబు తామసంబును వరుసగ యివిమూడు సంజ్ఞలను గుణములును వాటిలక్షణములను వరుసగ వినుమనిన సత్వగుణంబు విజ్ఞానంబునకు స్ఫటికవర్ణమై శుభ్రమై యాస్పదమై ప్రకాశించుచుండు.

తామసంబు జడప్రధానమై కోపోద్రేకమై యహంకారమై నలుపు వర్ణమై అనగ శ్యామలవర్ణమై ప్రబలియుండి సౌఖ్యసుజ్ఞాన భాస్వద్భాసనుందకజనము లజ్ఞానభాజనంబులు నిజముగా నొక్క పురుషుండు నియతిదప్పి చిత్ప్రకాశుడై మోక్షసామ్రాజ్యుడై ప్రకాశించె. రాజసంబు పాంచభౌతిక మఖిలప్రపంచమగుచు దాని నెరింగింతు ననిన దేహస్వభావం బెట్టులనిన తల్లిదండ్రులు భక్షింపందగిన యన్నపానరసమున శోణితపరివశముగ దేహము సృష్టియై తండ్రియొక్క కితమున గలుగు మజ్జయును గ్రోలు మొముకలును.

ఎట్లులనిన శ్రోత్రతక్కు చక్షు జింహ్వ ఘ్రాణంబులు యైదును శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు యైదును వాక్కు, పాణి, పాద, పాయు, యుపస్థలు యైదున్ను, మనో, బుద్ధి, చిత్త, హంకార, జ్ఞాతలు యైదున్ను, వ్యానో, పాన, సమాన, ప్రాణ, ఉదానములు యైదున్ను, ఐదైదులు యిరువది యైదు తత్వములున్ను కలసి కలదై ప్రపంచంబాయెను యనగ విశ్వరూపంబాయెను.

త్రిగుణభేదంబైన మూలప్రకృత్తియని జెప్పబడును. సత్వగుణంబున పరిశుద్ధగుణంబును ప్రసన్నత్వంబును నారోగ్యమును బుట్టెను. రాజసగుణమున రాజసభావంబు బుట్టెను. కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యంబులు తామసభావంబున బుట్టెను. దీనివలననే ఆలస్యంబును, నిద్రయు బ్రమాదంబును, వంచనగుణము మొదలైనవి బుట్టెను. శరీరము పాంచభౌతి

కంబు గావున యందుబుట్టిన గుణంబులు అంతఃకరణముచేత పరితపింపంబడు చున్నవి. అవి కర్మేంద్రియములవలన వినంబడు శబ్దం, ఆకాశమువలన బుట్టెను. తద్బలముగూడుకొని ఆకాశమువలన వాయువు పుట్టెను. వాయువు స్పరముగావున అందు త్వగింద్రియము పుట్టెను. ఎగయుట, బడుట, చచ్చుట, పోవుట, మునుంగుట నివి వాయునగుణములు. ప్రాణాపాన వ్యానోదాన సమానసప్రాణములు. పంచప్రాణంబులు నాగ, కూర్మ, కుకుర, దేవదత్త ధనంజయము లనెడి మొదలైన దశవిధవాయువులందు. ప్రాణవాయువు ముఖ్యంబు యని చెప్పంబడు. కంఠగోళమునకు కిందు, నాభి, ప్రదేశమునకు మీద సంచరించు నాశికారంధ్రములు. నాభికుహరమునందు హృత్పద్మమున వ్యాపించియుండునది గదా భాషాశక్తికి మూలకారణము నపానవాయువు గుదస్థానమునందు మేఢ్రస్థానమున కటిస్థలమున జంఘాయుగమున జఠరనాభి ప్రదేశమున వృషణముల నూరుప్రదేశములు హరించుచున్నది. మలమూత్ర వీర్య విసర్జనమునకు ప్రధానము వ్యానవాయువు. దృక్కర్ణము కర్ణరంధ్రముల మెలంగి ప్రాణాపానవ్యాపారముల గూడియుండు. ఆమూడు వాయువులు నేకభాగముగ సమానవాయువు జఠరాగ్ని సహచరత్వము గైకొని యన్నపానాదిరసము దేహమందు సమముగా పంచిపెట్టును. సర్వనాడీరూపంబుల దిరుగాడు నుదానవాయువు కరచరణాద్యవయవములు జరించుచు తృష్ణా క్షుధావ్యధలు మొదలైనవి పుట్టించు చర్మరోమ రక్తమాంస మేధాస్థి మజ్జాది సప్తధాతువులుయందు నుపరివాయువులయందు విహరించియుండు పావకులవలన రూపవ్యక్తి దీప్తశక్తి ప్రకాశము శౌర్యరూఢి తేజోవిలాసము ధీవిశేషము సూక్ష్మభావము కోపము ప్రబలుచుండును. అకల్పితము జింహ్వాయును శైత్యమును శరీరద్రవమును ఘ్రాణంబు గంధంబు గౌరవధైర్యము లివి భూమిగణంబులని రెరుగవలయును. తత్వములలోన పృధివితత్వము ప్రధానభూతం. అదిగదా సస్యములకెల్ల నాలయంబు. దానబుట్టిన సమస్తవస్తువులు మానవులకు జీవనోపాయములు సుమీ యని చెప్పంబడియె. కావున పృధ్విభూతము కేవలము ముఖ్యంబు. మహానుభావులు గీర్తింతురు. త్యాగాదితావులు ఆవిర్భావంబు జెందు. పుడమిని జఠరవహ్నివలన జంతువులు భక్షింపబడియున్న అంత్యభాగమగుచుండ పక్వమై బరగుచుండు. పంకంబురీషమై గర్భగోళమందుండును. అన్నసారంబు మధ్యాంశమాయె. మాంసమువలన సూక్ష్మాంశ

మున మనంబాయెగాన యన్నమయమని మనస్సు బ్రఖ్యాతినొందును. ఆహారంబు మూత్రిమైయుండు. అందు మధ్యాంశము రక్తమాయె. దాని సూక్ష్మ భోగంబు ప్రాణమాయె కావున ప్రాణంబు భువనాత్మకంబనంగ మాన్యులు యెన్నుదురు. పెద్దల సమ్మతముగ అగ్నికనిష్టమాయె. నగశల్యములు మధ్య భాగంబులు మజ్జయొదవె. సూక్ష్మభాగమున వాస్పురణోద్భవంబయ్యె. అట్లుగావున తేజస్సు అఖిలలోకములకు భిన్నాత్మకమని చెప్పబడును. శోణితంబున కీకసములుగల్గె. అందు మజ్జయు బుట్టె. కొవ్వున సుసనంబున నరములయ్యె మరియు,

దేహస్వభావం బెట్లు ప్రవర్తిల్లు.

శరీరము పదిదోసిళ్ల జలంబును, 7 దోసిళ్ళ పురీషంబును, 6 దోసిళ్ళ శ్లేష్మంబును, 5 దోసిళ్ళ పైత్యంబును, 4 దోసిళ్ళ మూత్రంబును, 3 దోసిళ్ళ మజ్జయు, 2 దోసిళ్ళ మేధఃపంకంబును, సర్ధాజని శుక్లంబును గలదు. తద్వీర్యంబుగదా దేహంబునకు మూలంబు. అదియుంగాక జలంబు రుచికరంబులు దగుణంబులు నవకంబున చతుర్విధంబులైన షష్టిశతత్రయ శల్యంబులు గలిగి యుండునని బుధోత్తములు చెప్పుదురు.

కాబట్టి యట్టి వివేకజ్ఞానసంపన్నులు తన్మధ్యమందు అనగా హృదయ పీఠమునందు తేజోమయాకారమైన పరమేశ్వరుని ధ్యానానుష్టాన యోగధారణ ఆత్మవిచారణ జీవబ్రహ్మైక యమనస్క రాజయోగసంధానంబు జేయుచు జననమరణభ్రాంతి రహితసిరాలంబ చిత్తవిశ్రాంతి మోక్షకైవల్యపదమునొందుదురు. కావున ధీనిధులైన మహాత్ములు యీ ఆత్మతత్వము నెరింగి స్వయం తారతీతిపర పరంతారయని తాను తెరించి యితరులను తరింపుజేయు మహాత్ములు యిహపరసౌఖ్య విరాగములనుబొంది నిర్వికల్పసమాధినిష్టాగరిష్టులై యుందురు.

సమాప్తము.



శ్రీరస్తు

# శ్రీ మహాఋషి నిఘంటిత యోగశాస్త్రము



## షడాధారయోగవివరము.



—త్రితలుడనే ఋషి భాగీరథునకు షడాధారయోగము బోధించుట.—

1 మూలాధారకమలం స్థూలశరీరమునందు గుదస్థానమునకంటె రెండంగుళములు మీదను, లింగస్థానమునకంటె రెండంగుళముల క్రిందను, అగ్రకోణము అధోముఖముగాగ △ మూడుకోణంబులతో శరీరమునకు మధ్యను మూలాధారచక్రమున్నది. అందు □ నాలుగుదళములుగల కమలముండును. వ శ ష స అనెడు నాలుగును బీజములు. ఈకమలమున కధిపతియగు గణపతికి అజపాగాయత్రిమంత్రజపమున 600 హంసలు సమర్పింపబడును. ఇది పృథ్వికి స్థానముగాన దీనికిని ముక్కునకున్ను సంబాధమున్నది. ఇది మలవిసర్జనకు గారణము. △ మనో నేత్రమును అనగ త్రినేత్రమును మూలాధారం రక్తవర్ణం పృథివితత్వం గణపతి అధిదేవత.

2 స్వాధిష్ఠానకమలం మూత్రద్వారమునందు ఆరుదళములుగల కమలముండును. బ భ మ య ర ల అనెడు నారును బీజములు 6 కోణములు గలది. ఈకమలములకు నధిపతియగు సరస్వతితో గూడియుండు బ్రహ్మకు అజపాగాయత్రిమంత్రజపమున 6,000 హంసలు సమర్పింపబడును. ఇది జలస్థానము సృష్టిస్థానము గాన దీనికిని నాలుకకున్ను సంబాధమున్నది. ఇది మూత్రవిసర్జనకున్ను శుక్లశోణితములకున్ను విసర్జనకును కారణము దీనినే పద్మగర్భమని జెప్పబడును. దీనినే జఠరగర్భమనియు అధోమండలియనియు జెప్పబడును

3 మణిపూరకకమలము నాభియందు పదిదళములుగల కమలముండును. డ ఢ ణ త థ ద ధ న ప ఫ అనెడు పదియును బీజములుండును. ఈకమలమున కధిపతియగు లక్ష్మితోఁగూడియుండు విష్ణువునకు అజపాగాయత్రిమంత్రజపమున 6,000 హంసలు సమర్పింపబడును. ఇది అగ్నికి స్థానము గాన దీనికి కన్నులకును సంబంధమున్నది. ఇందలి యగ్ని భుజించిన సమస్తపదార్థములను జీర్ణము చేయును. ఇదియే చిత్తమునకు స్థానము.

4 అనాహత కమలము వక్షస్థలమునందు రొమ్ము యెముకకును వీణాదండమునకును మధ్యనుండెడి హృత్పద్మము. ఇది పన్నెండు దళములుగల కమలము క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ అనెడి పన్నెండు బీజములు యీకమలమున కధిపతియగుపార్వతితోఁగూడియుండు రుద్రునకు అజపాగాయత్రిమంత్రజపమున 6,000 హంసలు సమర్పింపబడును. ఇది వాయువునకు స్థానము గాన దీనికి త్వగింద్రియమునకును సంబంధమున్నది. ఇది ప్రాణవాయువు సంచారమునకును అహంకారమునకును స్థానము.

శృతి॥ తైత్తిరీయోపనిషత్తు। పద్మకోశప్రతీకాశం హృదయంచాప్యధోముఖం అధోనిష్ట్యావితస్త్యాంతు నాభ్యాముపరితిష్ఠతి హృదయం తద్విజానీయాద్విశ్వస్యాయతనంమహత్॥ అనగ కంఠమునకు క్రిందుగను బొడ్డునకు జానెడుమీఁదుగనుండి యధోముఖముగ వ్రేలాడు మాంసపిండమగు హృత్పద్మమందు పరమాత్మ యున్నాడు. ఉత్తరగీత॥ అనాహతస్య శబ్దస్య తస్యశబ్దస్య యోధ్వనిః ధ్వనేరంతర్గతం జ్యోతిర్జ్యోతి రంతర్గతంమనః తన్మనోవిలయం యాతి తద్విష్ణోః పరమం పదం కొట్టబడకయే మ్రోగుచుండెడు అనాహతమందు శబ్దము పుట్టును. ఆధ్వనియందు వెలుగును, ఆవెలుగునందు మనస్సును యున్నవి. మనోలీనమైనచో ముక్తిగలుగును. దీనినే అమనస్కమనియును చెప్పుదురు.

మనస్సు స్వాధీనము జేసుకొనుటకు మునుముందుగా అనాహతమందు దృష్టినిలిపినచో శబ్దమంతయు నణగి ప్రణవనాదము ధ్వని వినబడును. అట్లు అభ్యాసం చేయంజేయను ప్రణవనాదము తగ్గి స్వప్రకాశము కనబడును. దీనినే ఆత్మజ్యోతియని చెప్పుదురు. పిమ్మట హిరణ్మయకోశమగు మనస్సుయొక్క నిజమగు స్వరూపము తెలియును. అప్పటికిని స్వాతిశా అహంకారముండును. మనస్సు పరబ్రహ్మమును జూడలేకపోయినను పరబ్రహ్మముం దైక్య

మగును. ఈచక్రమందు గొట్టబడకయే దశవిధప్రణవనాదములు మ్రోగు చుండును గనుక యీచక్రము అనాహతచక్రమని శాస్త్రములు చెప్పుచున్న వి. ఈనాదానుభవము మూలాధారమునుండి హృదయమున బుట్టిన సంగీత ధ్వని పూర్ధ్వకుండలీయోగముచేత నాదబ్రహ్మమును లేపి యానందమును జెందవలయును. ఇది లోపాముద్రాయోగముచేత తనలో తానే చూడవల యును. ఇదే తారకయోగమని శాస్త్రము చెప్పుచున్నది.

5 విసుద్ధకమలము అనగ పదియారుదళములుగల కమలముండును. అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ అం అః అనెడి పదునారు బీజములు యీకమలమున కధిపతియగు నీశ్వరునకు అజపాగాయత్రి మంత్రజపమున 1,000 హంసలు సమర్పింపబడును. ఇది ఆకాశ హంశము గాన చెవులతో సంబంధము గలిగియుండును. ఇదియే మనస్సునకు స్థానము. సమస్తభూతములయందుండెడి ఆత్మస్వరూపమే శ్రీకృష్ణుడనియు, నాకృష్ణుడే సహస్రారమందుండుననియు విశుద్ధచక్రంబునందలి పదియారుదళంబులును వీక్షించుచుండుననియు పదహారుదళంబులే పదహారువేల గోపికలనియు నీతీక్షణమువలననే కృష్ణుడు గోపికలతో బొందెననియును నాకృష్ణుడు అస్కలితు డనియు బ్రహ్మచారియనియు సదోపవాసియనియు చెప్పుదురు. కావున ఇంద్రియములనెడి గోపికలకు తన జ్ఞానస్వరూపుడైన కృష్ణునియొక్క సాన్ని ధ్యముచే పరమానందమును గలిగించును. బ్రహ్మదండియనెడి వృక్షశాఖ నాశ్రయించియున్న మూలాధారము మొదలగు షట్కమలములనెడు కోయి లలు సంతోషముతో మారుపల్కునట్లు చేయుచు మూలాధారచక్రమునందు అధోకుండలియు గలదని యోగులు చెప్పుదురు. వీనినిగూర్చికూడ ముందు ముందు వివరింపబడును. ఇచ్చట మాత్రము కుండలీశబ్దమునకు సర్పమని యర్థము కావున యోగులుకూడ నీకుండలి సర్పస్వరూపములేయని చెప్పి యుండుటచేతను కుండలీంద్రుడు అని సర్పరాజు అని కవి చెప్పియున్నాడు. పూర్ధ్వకుండలి యధఃకుండలియునను నాగేంద్రునకు స్వయముగనే పడగ విప్పి యాడునంత ప్రమోదమును జనింపజేయుచు జ్ఞానరూపుడైన అనగా పర బ్రహ్మరూపమును శ్రీకృష్ణుండు భ్రూమధ్యభాగమనెడు బృందావనమునజేరి ప్రాణము మనస్సు అనెడు రెండుచేతులతో సుషుమ్నానాడియను వేణువును బట్టుకొని గానముచేసెనో యనునట్లు ప్రణవనాదము పిదప వేణునాదరూప

ముతో ప్రకాశించుచుండును. కావున —

6 ఆజ్ఞానచక్రమనగ భ్రూమధ్యమునందు రెండుదళములుగల కమల ముండును. హం క్షం అనునవి బీజములు. శృతి॥ హం క్షం త్యక్షరసంయుక్తం వర్తతేవాయుమండలా॥ యీకమలమున కధిపతియగు సదాశివునకు నజపా గాయత్రిమంత్రజపము 1,000 హంసలు సమర్పింపబడును. ఇది బుద్ధికి స్థానము. మనస్సు కంఠము స్థానమైనను సకలేంద్రియవ్యాపారములు చేయుటయందు ఆజ్ఞాచక్రమునకు వచ్చును గనుక మనస్సునకు విషయములగు సంకల్ప వికల్పములే యీచక్రమునకు రెండుదళములని చెప్పబడును. మొదటి అయిదు చక్రములందు హఠయోగులు క్రమక్రమముగ మనస్సు నిలిపి వాయువు నిరోధము జేసి అభ్యసించెదరు. రాజయోగులు ఆజ్ఞాచక్రమున సహస్రారచక్రములందు అభ్యాసము చేసెదరు. ఇదియే ముక్తికాంతకు స్థానము. ఇచ్చట ముక్తికాంత లేక, జ్ఞానకాంత లేక, వాత్రికాంతతో సంయోగమే జీవన్ముక్తి. ఇదియే శివజీవైక్యము. దీనినే త్రినేత్ర మని చెప్పుదురు.

భ్రూమధ్య మనే త్రినేత్రమందు జ్యోతిర్మయాకారముగ ప్రకాశించే కళాస్వరూపమే ముక్తికాంత. ఆముక్తికాంత అనేక చిత్కళాసమూహముల చేత ప్రకాశించుచున్నదియు చంద్రోదయకాలమందు అనగ పున్నమవెన్నెల బైలుయందు యిట్లు చంద్రోదయకాలమప్పుడు నీవు సుషుమ్నయనెడు అంతఃపురమునుజేరి యచ్చట తురీయావస్థ వనోలయము యనెడు శయ్యపై బరుండును. అప్పుడు జీవరూపుడగు హంసయనే పక్షియే వాహనముగా గలిగి లేక హంస పక్షివలె గమనాగమనములు గలదియు ఉపరితమై చూచుటకు గూడ నశక్యమైన దివ్యతేజస్సుగలదియు మూలాధారచక్రమనెడు నందియములతోను స్వాధిష్ఠానమనెడు వడ్డాణముతోను మణిపూరకమనెడు మొలనూలుతోను కంఠమందు విశుద్ధచక్రమనెడు మంగళసూత్రముతోను భ్రూమధ్యమునందు రెండుదళములుగల యాజ్ఞాచక్రమనెడు రావిరేకతోను ప్రకాశించునదియు ప్రత్యక్షములగు సూర్యచంద్రమండలములే కర్ణభూషణములుగాను గలదియును మిగుల ప్రకాశించుచున్న మెరుపుతీగవంటి దేహముగలదియు రజస్తమోగుణసంపర్కములేని శుద్ధసత్వమనెడు శుభ్రవస్త్రమును ధరించినదియు సత్యజ్ఞానానందములే స్వరూపములుగా గలదియును ముక్తికాంత భార్యమై నిన్ను జేరును. నీవు రాజయోగము జ్ఞానము అను హస్తములచేత

నాయువతిని గాఢాలింగనము చేసికొని దశవిధప్రణవనాదములే అంతరింద్రియములుగాను మొదలగు భూషణములు నాదములుగాను కంఠధ్వని మణితము మొదలగు నితరధ్వనులుగాను వెలుగుచుండును. బ్రహ్మవిచారణవలన జనించిన యపరోక్షానుభవమువలన కలిగిన బ్రహ్మానందమనెడు అధరామృతమును పానముచేయుచు రతిక్రీడలందేలుచు బ్రహ్మైక్యసమాధినుండును. అప్పుడు చిత్తశాంతియనెడు యొడలెల్ల చమట నాక్రమించును. మరియు మిగుల జాగరూకులై శ్రేష్టులగు ముముక్షువులు నాని నిజామ దృష్టిని వాక్కును మనస్సును మనోగతములగు వాసనలను జ్ఞానమును వీని నన్నిటిని నొక్కటిగాజేసి యాము క్తికాంతయొక్క మనస్సును నీమనస్సును నొక్కటినై యొప్పారు నధికమై సాటిలేనిదై యున్న చిత్తశాంతియనెడు రతిసుఖము నీకు పరమానందకరమగును. సర్వభూతములయందును పరబ్రహ్మరూపము సమానమయ్యే యున్నదనుట నీకు సంతసము గలిగించును. ఏశీవులకుగూడ లేని సుఖము నీకు దొరకదుగదా. నీ కప్పుడు సకలకర్మములును రహస్యములలో నెల్ల రహస్యమగు —శృతి॥ గుహ్యాద్గుహ్యతమం గుహ్యం చక్షుస్తానేషుతిష్ఠతి। యనునట్లు బ్రహ్మము మన్మథకళాస్థానము, కామకళాస్థానమని చెప్పుదురు. అది గోచరములగును. బహువిధములగు విద్యామన్మథశాస్త్రముల జూపనవకాశము దొరకును. బుద్ధి లయమునుబొందును. ఇట్లు చంద్రోదయమగున పరమహంస ననుభవించును.

7 సహస్రారకమలము అనగ ఇది మనస్సును సహస్రారచక్రమందు నిలుపవలసిన స్థానము మునుముగా మనస్సును విషయములనుండి మరలించి అభ్యాసమందు ఆజ్ఞాచక్రమనె భ్రూమధ్యస్థానమందు నిలిపి పిమ్మట సహస్రార చక్రమందలి యాస్థానమందు నిలుపుట అభ్యాసముచేయగ వృత్తిరహితమగును. ఆరూఢియందు విదేహముక్తిగలుగును. ఇది సహస్రారకకమలముయొక్క అగ్రమమున నుండెడి కేసరములమధ్యను దుద్దుహంస. ఈ దుద్దుపైనుండి స్వప్నావస్థయగును. ఇది హంసపద్మనాళమున దిగుటకు మార్గము యీనాళమునదిగిన సుషుప్తిఅవస్థయగును. యీపద్మమును విడుచుటయే తురీయము. ఇదియే సన్యాసము.

సహస్రారము ఈకమల మాజ్ఞాచక్రమునకు మీదుగ గపాలకుహరమందుండును. ఈ కమలమున 8 దళములుండును. ఒక్కొక్క దళమునం

దు 125 రేకులుండును. అట్లు కమలమునకు 1000 రేకులుగలిగియుండును. ఈచక్రాధిపతియగు పరమాత్మకు అజపాగాయత్రీమంత్రజపమున 1000 హంసలు సమర్పింపబడును 8 యెనిమిదిదళములు గలిగియుండుటచేతను అష్ట దళకమలమనియు 1000 వెయ్యి రేకులుగలిగియుండుటచేత సహస్రారమనియు ను చెప్పబడును. ఈయెనిమిది దళములందు యెనిమిదివృత్తులు గలవు. ఆ వృత్తులనుబట్టియే యెనిమిదిదళములని చెప్పబడును. ॥శృతి॥ జిహ్వాగ్రేపూ ర్వదిగ్భాగే త్రికోణాకారమండలె స్రవంతీ మమృతంపశ్యేనేత్రాభ్యాం సుస మాహితః।

త్రిపుటీంరసనముగుతరి వ్రుపజిహ్వకు సూటినుండి ప్రదయింపుచుదా దపనుని పగిదిని బరగెడు నిపుణంగను గొన్నవాడు నిత్యుడు రామా॥

యీ మొదలగు ప్రమాణంబులు అనేకంబులు గలవు. అనుభవజ్ఞుల యొద్ద నీవిషయములను జక్కగ దెలిసికొని యోగానందము లేక బ్రహ్మానం దమనెడు అమృతమును గ్రోలి నిత్యసుఖము ననుభవింపవలయును.

తైత్తిరీయోపనిషత్తు। అంతరేణ తాలుకే య ఏష స్తన ఇవావలంబతే సేంద్రయోనిః యత్రాసౌ కేశాంతో వివర్తతే వ్యపోహ్య శీర్షకపాలే

దౌడలమధ్యను స్తనములవలెనే వ్రేలాడు మాంసఖండముండును. అదికపాలకుహరమును జీల్చుకొని వెలుపలికివచ్చి వేరుగా గనుబడుచున్నది. ఇదియే బ్రహ్మస్వరూప ప్రాప్తికి మార్గము. దీనినే కొండనాలుకయని చె ప్పుదురు.

సహస్రారమందు పరమాత్మస్థానములు స్థూలశరీరమందు రొమ్మయె ముకకును పీఠావంశమునకును మధ్యను వ్రేలాడు మాంసఖండముండును. అనాహతచక్రమందు సూక్ష్మశరీరము నేత్రస్థానమందుండుననియు కారణ శరీరమందు దౌడలమధ్యను వ్రేలాడుమాంసఖండమందుండుననియు మహాకా రణశరీరమందు కపాలకుహరమందు సహస్రారచక్రమందుండును. శరీరరహి తమందు సర్వవ్యాపకమై అంతర్బాహ్యములయందు సర్వత్ర నిండి నిబిడీ కృతమైయుండుననియు పెద్దల అభిప్రాయము. తాలువులమధ్యను వ్రేలాడు చుండెడి మృదువగు మాంసఖండమందు నుండియె యోగానుభవముగలవార లకు సుధ అమృతము స్రవించుచుండును. ఆసుధాపానమువలన నిరంతర సుఖ

ము వారికే తెలియవలెను గాన ఇది పరమాత్మస్థానముగా నెంచబడినది. గ్రంథవిస్తరభీతిచే నింతట విరమించితి. అజ్ఞానచక్రమునకు మీద 12 అంగుళముల దూరమున సహస్రారచక్రముండుటచేత ఇది ద్వాదశాంతమని చెప్పబడును. ఆజ్ఞాచక్రమునకు పైన ఒక అంగుళమువరకు శక్తియని దాని పైన మూడు అంగుళములవరకు వ్యాపినీయని నాలుగు అంగుళలములదాక సమనయనియు ఆమీద నాలుగంగుళములవరకు ఉన్మనియనియు సుషుమ్నకు పేర్లు. ఈ అష్టదళపద్మమందు హంస పూర్వదళముమీద వ్రాలిన పుణ్యమతియై పుణ్యకర్మలను జేయు తలంపును హంస ఆగ్నేయదళముమీద వ్రాలిన నిద్రాఆలస్యములు సోమరితనమును కలుగును. హంస దక్షిణపుదళముమీద వ్రాలిన క్రూరపుబనులు జేయుతలంపును కలుగును. హంస నైరుతిదళముమీద వ్రాలిన పాపకర్మములు చేయును. పశ్చిమదళముమీద వ్రాలిన నాటపాటలయందు దలంపును వాయువ్యమున వ్రాలిన గురువుల యొద్దకు బోవలెననే కోరికయును గమనాగమనంబులును చేయు తలంపును గలుగును. ఉత్తరదళముమీద వ్రాలిన సభోగములయం దిచ్ఛయును వివిధపదార్థములను యనుభవించవలెనని తలంపును ఈశాన్యదళముమీద వ్రాలిన అన్నదానము ద్రవ్యదానము భూదానము మొదలుగాగల దానములు చేయుతలంపును గలుగును. కమలమధ్యమునందుండిన వైరాగ్యమును పరమోపశాంతియు శమదమ ఉపరతితితీక్షశ్రద్ధ సమాధానముల నెడు మొదలగు సత్వగుణములు గల్గును. కమలముయొక్క అగ్రమున అనగ కేసరముల యందుండిన జాగ్రదవస్థయును ఆకేసరములమధ్య దుద్దుపైనుండిన స్వప్నావస్థయును పద్మనాళమున దిగిన సుషుప్తి అవస్థయును గలుగును.

ఈపద్మమును విడుచుటయే తురీయము. అదియే సన్యాసము. ఎట్లనగ మనస్సు ప్రాణవ్యాపనముజేసి మెల్లన మూలాధారంబు దాటుటవలన పృథివీతత్వము జయంబగును. పిమ్మట స్వాధిష్ఠానకమలంబున కెక్కిన యొక్కనిముషమునుండి అంతనదియు నతిక్రమించుటవలన జలతత్వంబు జయంబగును. అనంతరము మణిపూరక కమలమందు బ్రవేశించి యందుండెడి సమానవాయువునుగూడి యాకమలము దాటుటవలన తేజోతత్వంబు జనించును. అంత అనాహతకమలమును జేరి యచలిప్రాణవాయువును గలిసి యాకమలమును దాటుటవలన వాయువతత్వంబు జయంబగును. విశుద్ధకమలంబు జేరి

న యుదానవాయువును జేరి యూకమలమును దాటుటవలన ఆకాశతత్వము జయింబగును.

పిమ్మట ఆజ్ఞాచక్రమందు చేరి అంకుస్థిరముగా నిలిచి మిట్టమధ్యాహ్న మందలి సూర్యునివలెనే నివాతస్థానం గాలిలేనిచోటు నందుండెడి దీపంబు బోలియుండి యదియు నతిక్రమించుటవలన మస్తతత్వంబు జయంబగును. అం దుండి మెల్లన చంద్రమండలము దాటుటవలన సహస్రారకమలవాసుండును గురుస్వరూపుండును నగు నాదబిందుకళల నతిక్రమించి సహస్రారకమల మందు జేరి సుఖాసీనుండై అణిమాద్యష్టసిద్ధులును దూరశ్రవణ ఆకాశగమన ముల సిద్ధియును గలిగి త్రికాలజ్ఞానియై సమస్తలోకములయందలి సమస్తవ్యా పారములును కరతలామలకముగా గనుగొనుచు సర్వజ్ఞుండైయుండును. ఇది సమస్తయోగులకును రాజుగా శ్రేష్ఠమైనదిగా నుండునుగనుక, రాజయోగ మని చెప్పబడును. అట్టి రాజయోగ మభ్యసించి కృతార్థులుగావలయునని చెప్పెను. సుషుమ్నానాడికామధ్యే విద్యుల్లేఖేవభాస్వరమ్॥ శృతి॥ సుషు మ్నానాడిమధ్యమందు మెరుపుతీగ యున్నది యీ మెరుపుతీగయందలి కాం తికే కళయనియు నాకళలో నిష్కళయె పరబ్రహ్మస్వరూపమనియు శృతు లు జెప్పుచున్నవి.

ప్రత్యక్షముగ కనుబడెడు యీస్థూలదేహమందు మూలాధారమునం దుండి కపాలకుహరమువరకు వీణాదండమువలె వెన్నుపెముక యుండును.

దేహస్యపశ్చిమేభాగే వీణాదండస్వరూపభృత్ దీర్ఘాస్థి మూర్ధపర్యం తం బ్రహ్మదండీతికథ్యతే॥ శరీరముయొక్క వెనుకభాగమున వీణాదండము వలె శిరస్సుపర్యంతమును వెన్నుపెముకయున్నది. దానిని బ్రహ్మదండియని చెప్పుదురు. ॥శృతి॥ తస్యాంతేసుషిరం సూక్ష్మం బ్రహ్మనాడీతిసూరిభిః ఇడపిం గళయోర్ మధ్యేసుషుమ్నా సూక్ష్మరూపిణి॥ వెన్నుపెముకమధ్యను గొ ట్టమువలె సూక్ష్మరూపముగనుండు రంధ్రమును బ్రహ్మనాడియందురు. ఆ నాడి యిడాపింగళానాడులకు మధ్యనుండినదై సుషుమ్నయను పేర బరగు చున్నది. ఈ సుషుమ్నయే బ్రహ్మైక్యప్రతిపాదకమైనది. కనుక బ్రహ్మ నాడియని చెప్పుదురు. ఈసుషుమ్నకంతర్గతముగ కుండలీశక్తి గలదు. ఈవీణాదండమునకు వీణమెట్లవలెనే యొకటిమీద నొకటిగ ముప్పదిమూ డు పూసలుండును. అందు మొదటి యేడిటినే మెడపూసలనియును చెప్పు

దురు. ఈ వెన్నుయెముకకే బ్రహ్మదండి మెరుప్రు అనుపేరులు. ఈపూసలనడుమ నడినాళముండును. అదియే సుషుమ్నానాళము. ఈనాళముగుండ సుషుమ్న అధోముఖముగ మూలాధారమునకువచ్చి మనస్సును విషయములకు పోవునట్లుచేసి తాను తిరుగ యూర్ధ్వముఖముగ వ్యాపించుచు వెన్నుపూసలను మెడపూసలను దాటి పెద్దనాళములలో గలియును. ఈపెద్దనాళమునకే బ్రహ్మరంధ్రమని పేరు. ఈసుషుమ్న సర్పాకారముగ నున్నందున వెన్నుపామని వాడెదరు. ఈసుషుమ్న కడుకోమలమైనదియు బహుసూక్ష్మమైనదియు గావున యే అపాయమును గలుగకుండ శిరస్సునందలి కపాలకుహరమనెడి దట్టమైన యెముకలపెట్టెలో యిముడ్చబడి యతిజాగ్రత్తతో గాపాడవలసియున్నది. ఈసుషుమ్నయుండెడు స్థానము బ్రహ్మరంధ్రము. ఇదియే ప్రాణాధారము. సహస్రారము వెన్నుయెముకయందుండెడి ముప్పదిమూడుపూసలనె ముప్పదిముగ్గురు దేవతాపరులని శరీరమందు ముప్పదిమూడుకోట్ల రోమంబులె ముప్పదిమూడుకోట్ల దేవతలనియు అధ్యాత్మశాస్త్రమందు చెప్పబడియున్నది. ఇంద్రుడు, బ్రహ్మ, అష్టవసువులు 8, ఏకాదశరుద్రులు 11, ద్వాదశాదిత్యులు 12, మొత్తమున ముప్పదిముగ్గురు దేవతలనియు తెలియబడుచున్నది. శరీరమునందుండు ముఖ్యములైన నూరునాడులలోను ఒక్కొక్కదానికి నూరేసిశాఖానాడులును అందు యొక్కొక్క శాఖానాడికి 72000లు సూక్ష్మనాడులును గలవు. నాడులనేకముగా గలవు. అందు ముఖ్యములగు 10 పదినాడులు వుండును. అందు 1 సుషుమ్నానాడి అనగ అతికోమలమును సుకుమారమును యిడాపింగళా నాడులతో మూలాధారమునుండి యూర్ధ్వముఖముగా బోయి కుండలీశక్తియను పేరుతో గపాలకుహరమున ప్రవేశించి యచటనుండి నాలుకకొనకుజేరి సరస్వతియను పేరిట బ్రసిద్ధమగుచున్నది. ఈసుషుమ్నమూలాధారమునుండి సహస్రారమువరకు వ్యాపించుచు పశ్చిమాభిముఖమై భ్రూమధ్యమందు యిడాపింగళనాడులతో గలసియుండును. ఆస్థానమే త్రివేణీసంగమము త్రికూటము ఆజ్ఞాచక్రము అనిచెప్పబడును, సుషుమ్న తెల్లనిరంగుగలది గాన శుక్లనాడియని పరబ్రహ్మమును గురించిన జ్ఞానమునకును సాధకముగావున బ్రహ్మనాడియనియును చెప్పబడును.

ఉత్తరదేశమునందు కాశీమహాక్షేత్రమునకు సమీపమున ప్రయాగ

లో సరస్వతి గుప్తగామిగానున్నది. అటులనే సుషుమ్నయును గుప్తగామినిగా నున్నది. కావునే

2 ఇడ, యెడమముక్కునందుండి వాసనలను గ్రహించును. ఇదియే చంద్రనాడి. ఈనాడి ముక్కునుండి కపాలమువరకు పోవును గనుక వాసనలను గ్రహింపజేయును.

3 పింగళ, కుడిముక్కునందుండి వాసనలను గ్రహించును. ఇదియే సూర్యనాడి. ఈనాడి ముక్కునుండి కపాలమువరకు పోవును. కనుక యిదియు వాసనలను గ్రహించును. ఈ ఇడ పింగలనాడులు సుషుమ్నతోగూడ నాధారచక్రమునుండి యూర్ధ్వముఖముగాబోయి భ్రూమధ్యమందుజేరి గంగ యమున యను పేరులుగలవి యగును. వీనివలననే ప్రాణవాయువునకు సంచారము కలుగును. గంగ యమున సరస్వతులు కలియు స్థానము గనుక భ్రూమధ్యమునకు త్రివేణీసంగమము అను పేరుగలిగెను.

4 పూషాలంబనాడి, 5 అలంబసునాడి అను నాడులు రెండున్ను గన్నులలోనుండి కపాలమువరకును బోవును గనుక నిశ్శబ్దములను గ్రహింపజేయును. ఈనాడులు లేనిచో శబ్దములను వినజాలము.

6 గాంధారినాడి, 7 హస్తిజింహ్వానాడి అను నాడులు రెండును గన్నులలోపలినుండి కపాలమువరకును బోవును గనుక రూపములను గ్రహింపజేయును.

8 కుహూనాడి గుదస్థానమునుండి మలమును విడుచునట్లు చేయును.

9 సినీవాలికీనాడి గుహ్యస్థానమునుండి మూత్రమును వదలునట్లు చేయును.

10 రక్తాహ్వయనాడి గుహ్యస్థానమందుండి శుక్లశోణితములను వెడలగొట్టు. లింగలేపనము గలుగజేయును.

చెవులు, కన్నులు, ముక్కు, నాలుక వీనినుండియే నాడులు మేదస్సునందు మనస్సుతో గలియును. ఆ స్థానముననే బ్రహ్మరంధ్రమనియు సప్తపథ యనియును చెప్పుదురు. అచ్చటనే సహస్రారముండును శ్రోత్రచక్షుజింహ్వాఘ్రాణములనుండి పోవు నాడులు కలియుస్థానము గనుక దీనినే చతుష్పథమనియు శృంగాటకమనియుం జెప్పుదురు.

11 బ్రహ్మరంధ్రము భూపతనమైనతోడనే బిడ్డలకు నడినెత్తిన మృదువైన గుంటయొకటి యుండును. ఆగుంటకు దిగువతట్టున నొకకమలముండును. దీనికే సహస్రారకమలమని పేరు. శిశువు గర్భములో నున్నప్పుడు యీకమలము వికసించియుండును. ఆకారణముననే గర్భములోని బిడ్డలకు యేడవమాసము మొదలుకొని భూపతనమువరకు జ్ఞానము పొందై భూపతనమైనతోడనే అజ్ఞానమైన మాయ యావరించి యాకమలము ముకుళించుకొనిపోవును. గర్భములో నున్నప్పుడు శ్రోత్ర త్వక్కు చక్షు జిహ్వా ఘ్రాణములయందు ఆత్మ విసరించలేదు గావున ఆ యింద్రియములయొక్క విషయములయందున్ను లేవు. బ్రహ్మరంధ్రమునుండియే జ్ఞాననేత్రముద్వార శిశువు గర్భములోనుండియును సమస్తమును తెలిసికొనగలదు. నాభివద్దనుంచి వచ్చెడి తీగెగుండా తల్లి భుజించిన పదార్థములుయొక్క రసమును అనుభవించగలదు. బ్రహ్మరంధ్రముగుండా ఆత్మ స్థూలశరీరములో ప్రవేశించును. మొదటనే ద్వారముననే తిరుగవెడలుటయే యుక్తమార్గమని పెద్దలు తలంచెదరు. భూపతనమైనది మొదలు బిడ్డలకు మాడున జమురుపెట్టి పసుపురాచుట యాచారమని సర్వత్రి దెలిసినవిషయమే. ఇట్లుదినదినమును జమురు రాయరాయ బిడ్డలకు నడినెత్తిన నుండెడి గుంట పూడి కనుపడకుండును. పండ్రెండుసంవత్సరములకు యెముకలన్నియు నతుకుకొని తెలగట్టిపడును.

సహస్రారకమలముననె బ్రహ్మరంధ్రమనియు ఆకమలముయొక్క మధ్యనుండెడి నాళముననె సుషుమ్నానాళమనియుం బేరులు. బ్రహ్మరంధ్రము పదియవద్వారమని చెప్పెదరు. ॥శృతి॥ పురమేకాదశద్వారమ్- కఠోపనిషత్॥ కన్నులు రెండును చెవులు రెండును ముక్కురంధ్రములు రెండును, నోరు మలమూత్రముద్వారములు రెండున్ను నాభిద్వారము బ్రహ్మరంధ్రము పదునొకండు ద్వారములు.

కఠోపనిషత్॥ నవద్వారంతు ప్రత్యక్షం దశమం, మనవుచ్యతే మనోద్వారేసితం గోప్యం గురువాక్యే నలభ్యతే గురోర్ముఖె నజ్ఞాతవ్యం అన్యథా గ్రంధకోటిభిః॥ నవద్వారములు కనుబడుచున్నవి. దశమద్వారమగు మనోద్వారముగనున్నది. గ్రంథములు చదివితె తెలియదు. సద్గురువులవలన తెలియవలెను. తన్నుతా దెలిసిన తారకయోగమనబడును. పదిద్వారములని చెప్పినప్పుడు నవద్వారములును బ్రహ్మరంధ్రమును గూడి లెక్కకు వచ్చు

ను. మూలాధారంబునకు యెనిమిదిఅంగుళములమీాదను సుషుమ్నానాళము ననుసరించి నాడీచక్రమున్నది. ఆనాడీచక్రమునుండి కుహూనాడి శినీవాలినాడి రక్తాహ్వాయనాడి యను మూడునాడులు నధోముఖవ్యాపకముగలవై యుండును. ఆనాడీచక్రమునుండి అనేకనాడులు వూర్ధ్వముఖవ్యాపకము గలవై యుండును. నాడులకు కుండలీస్థానమైనవానిలో గొన్నిటిని అధోముఖముగను కొన్నిటిని వూర్ధ్వముఖముగను వ్యాపింపజేయు మధ్యమస్థానముగను నాడీచక్రము (గనబడును.) చెప్పబడును. రొమ్ము యెముకకును వీణాదండమునకును మధ్యను అధోముఖముగాను వ్రేలాడు మాంసఖండమునే హృదయమని చెప్పుదురు. ఇదియే హృత్పుండరీకము. ఇందు జీవాత్మయుండును. మేధస్సునుండియే సుషుమ్నానాళద్వారమున యిక్కడికి నాడులువచ్చును. మరియు యీసుషుమ్న మూలాధారమునుండియె తిరిగి వెళ్ళునప్పుడు తనతోడనుండెడు యిడ పింగళ యను నిరుపురుచేడియల నిరుపక్కల నిడుకొని నూరునాడులతో అనహతమునకు వచ్చి యానూరునాడుల నక్కడ విడచి యూర్ధ్వముఖవ్యాప్తినియై శిరస్సునకు బోవును. మరియు పసిబిడ్డలు గర్భములోనున్నకాలమందు తల్లిభుజించిన యన్నపానాదుల రస మును దమ నాభియందుండెడు తీగెగుండ గ్రహించి అందువలన వృద్ధిబొందెదరు. భూపతనమయినతోడ్తోడన నాతీగెను గోయుదురు. గర్భమందున్న కాలములో వ్యాపారములేదు. నోటితో దినుటయును లేదు. ఈతీగెయె రసగ్రహణమునకాధారము. ఈ నాభినాళము యీ నవద్వారములకంటె మించిన యొకద్వారమని చెప్పుదురు.

శ్రవణమననసిధిధ్యాసలును శమ దమ వుపరతి తితీక్ష శ్రద్ధ సమాధానములను షడ్గుణసంపత్తియును సర్వభూతదయాళుత్వమును యమనియమంబులును గలిగినచో సహస్రారకమలము వికసించి తోడ్తోడను విజ్ఞానము గలుగును. అందువలన ముక్తిగలుగును. ఇంద్రియసుఖమే పరమార్థము కాదు కనుక విషయములకు లోబడక విజ్ఞానమును సంపాదించవలయును.

కావున హంసయనగ యుచ్ఛ్వాసనిశ్వాసంబులు. దీనికె ప్రాణమని చెప్పుదురు. హకారబిందు సకారములె హంస. హకారము శివబీజము. సకారము శక్తిబీజమును. ఈ రెంటిమధ్యను శివశక్తులకు ఐక్యస్థానమై బిందురూపము గు బుద్ధితత్వము ప్రకాశించుచుండును. హకారమే శుక్లము. సకారమె

రక్తము. ఈరెంటియొక్క సంయోగమే బిందువు. హకారమే సూర్యనాడి లేక పింగళయని చెప్పబడి కుడిముక్కున వాయువును పీల్చును. సకారమె చంద్రనాడి లేక యిడయని చెప్పబడి యెడమముక్కున వాయువును పీల్చును. మధ్యనుండెడి బిందువునకె తేజోనాడియని లేక సుషుమ్నయని చెప్పబడును. సకారము శక్తిబీజము గనుక బుద్ధి సకారము వైపున తిరిగినప్పుడు ప్రపంచవిషయజ్ఞానమును హకారమువైపున తిరిగినప్పుడు నిర్విషయజ్ఞానమును కలుగును. ఈసూక్ష్మనాదబిందుకళలు. ఈహంస ప్రకృతిమయమైనది. ప్రపంచజ్ఞానము శివమయమైన పరబ్రహ్మజ్ఞానము అనెడు రెండు రెక్కలతో చిద్బిందురూపమున సకలప్రాణులయొక్క సహస్రారకమలములయందు సంచరించుచుండును. ఈహంస ప్రాణవాయురూపమున ప్రత్యక్షముగ కనబడును. ప్రాణము లోపలికిపోయి వెలుపలికివచ్చు శ్వాసము. దీనినె ఉచ్ఛ్వాసనిశ్వాసములని చెప్పుదురు. ప్రతిదినమునకు 21600 హంసలు దినమునకు తిరుగుచుండును. ఈహంసలు అజపాగాయత్రి మంత్రజపమున ఆధారచక్రమున కధిపతియగు గణపతికి 600 నందలు. స్వాధిష్ఠానచక్రమున కధిపతియగు బ్రహ్మకు 6000 వేలు. మణిపూరకచమున కధిపతియగు విష్ణుకు 6000 వేలు. అనాహతచక్రమున కధిపతియగు రుద్రునకు 6000 వేలు. విశుద్ధచక్రమున కధిపతియగు ఈశ్వరునకు 1000 వెయ్యి. ఆజ్ఞేయచక్రమున కధిపతియగు సదాశివునకు 1000 వెయ్యి. సహస్రారచక్రమున కధిపతియగు పరమాత్మకు 1000 వెయ్యి. మొత్తం 21600 హంసలు. ఈప్రకారముగ నిత్యము అజపాగాయత్రిమంత్రజపమున వారి వారికి 21600 హంసలు పంచిపెట్టగను తనకు కర్తవ్యము లేదు. తాను సర్వసాక్షి. జ్ఞాతయనే జీవుడు మనోబుద్ధి చిత్తహంకారంబు లనియెడి ఆకాశపంచకంబును సమానవ్యానోదానప్రాణాపానంబు లనెడి వాయువపంచకంబును శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణంబులనియెడు అగ్నిపంచకంబును శబ్దస్పర్శరూపరసగంధములనెడు జలపంచకంబును వాక్పాణిపాదపాయుపస్థలనెడు పృధ్విపంచకంబును యీయిరువైఅయిదుతత్వములు సహస్రారమందుండెడు సుషుమ్నతో సంబంధముగా యుండుటచే 25000 హంసలగును. అందులో 3400 హంసలు కుంభకమందుండును. అది యోగులకె అనుభవము కరతలామలకము నగును. కడమ 21600 హంసలు అజపాగాయత్రి మంత్రజపమున ఆయాచక్రాధిదేవతలకు

సమర్పింపబడును. ఈ హంస షడాధారములను జుట్టుకొనియుండి తిరుగుచుండును. ఆరోహణ అవరోహణములె సోహము గనుక నాదబ్రహ్మమును లేపి యానందించవలయును. రేచక పూరకములే ఆరోహణ అవరోహణములని తెలియవలయును. అజపాగాయత్రి మాత్రజపమున 21600 హంసలు ఆయాచక్రాధిదేవతలకు సమముగా పంచిపెట్టబడుటకు కారణంబేమని విచారించినచో ఆయాచక్రములయందు సుషుమ్న యొక్క సంచారము చక్కగ తెలియగలరు. సూర్యోదయము మొదలు తిరుగ సూర్యోదయమువరకు 21600 హంసలు సమర్పించబడును. దినమునకు 60 ఘడియలు 3600 విఘడియలు. పగలు ముప్పదిఘడియలు రాత్రి ముప్పదిఘడియలు సుషుమ్న 600 హంసల కాలము మూలాధారచక్రమందుండుననియు 6000 హంసలు స్వాధిష్ఠానమందుండుననియు 6000 హంసల కాలము మణిపూరకమందుండుననియు 6000 హంసల కాలము అనాహతచక్రమందుండుననియు 1000 హంసలు కాలము విశుద్ధచక్రమందుండుననియు 1000 హంసలుఆజ్ఞాచక్రమందుండుననియు 1000 హంసల కాలము సహస్రారచక్రమందుండు ననియు అనుభవమున అనగ యోగాభ్యాసపరులకు తెలియునుగాని తదితరులు తెలియలేరు. కావున నిత్యము తారకరాజయోగము నభ్యసించి తన్నుతా తెలియవలెను. తన్నుతా దెలియుటె తారకము.



శ్రీరస్తు

# శ్రీ మహాఋషి నిఘంటిత యోగశాస్త్రము

## అధ్యాత్మసాంఖ్యయోగము.

— వ్యాసమహాఋషి మైత్రేయునకు అధ్యాత్మసాంఖ్య
యోగము బోధించుట. —

అనగ మొదట సృష్టికిముందు అనగ సనాతనంబై కేవలనిర్గుణపరబ్ర
హ్మము అపరోక్ష పరిపూర్ణసాక్షాత్కార స్వజాతి విజాతి స్వగతభేదరహితం
బైన రూపనామక్రియారహితంబైన ఉపాధిద్వయదోషరహితంబైన ప్రకృతి
పురుషద్వయరహితంబును క్షేత్రక్షేత్రజ్ఞరహితంబును క్షరాక్షరరహితంబును
భేదాభేదరహితంబును ద్వంద్వాద్వంద్వరహితంబును శూన్యాశూన్యవిహీనం
బును కర్మాకర్మరహితుండును కారణకార్యరహితుండును సర్వద్వంద్వవినిర్ము
క్తుండును సర్వానుభవవినిర్ముక్తుండును సర్వాభావవివర్జితుండును భావభావ
రహితుండును ప్రపంచనిరసనుండును మాయాప్రకృతిరహితుండును జీవ
భ్రాంతిరహితుండును జ్ఞానాజ్ఞానవిహీనుండును విద్యావిద్యారహితుండును
అహంకారనిరసనుండును అంతఃకరణవిలక్షణుండును త్రిగుణాతీతుండును
భ్రాంతిరహితుండును సచ్చిదానందరహితుండును ఆదిమధ్యాంతరహితుం
డును అవాఙ్మనసగోచరుండును ఆత్మాతీతుండును అవ్యయుండును అను
పమానుండును అఖండస్వరూపుండును అమలుండును అనంతస్వరూపుండు
ను అచలుండును అశరీరుండును అగోచరుండును అనంతుండును అప్రమే
యుండును అద్వితీయుండును అపరోక్షుండును అక్షరుండును అగోచరుండును
నిర్వికల్పుండును నిర్గుణుండును నిరుపమానుండును నిరామయుండును నిరా
కారుండును నిరీశ్వరుండును నిర్వికారుండును నిరంజనుండును నిగమాగోచ
రుండు నిర్ముక్తుండు నిష్ప్రపంచుండును నిరీహారుండును నిష్కళంకుండును నిర్మ
లుండును నిరాలంబుండును నిత్యుండును నిర్మోహుండును స్వయంప్రకాశుం

డును సహజామనస్కుండును సదానందుండును సాక్షాత్కారుండును సంపత్కరుండును సగుణాతీతుండును సంకల్పరహితుండును జగద్గురుండును పరాత్పరుండును సర్వసాక్షిస్వరూపుండును పరబ్రహ్మస్వరూపుండును పరమేశ్వరుండును పరంధాముండును ప్రకృతిరహితుండును ప్రపంచాతీతుండును పురాణపురుషుండును పురుషోత్తముండును పరమోపశాంతుండును ప్రవృత్తిరహితుండును ప్రమేయాతీతుండును ద్వైతాద్వైతరహితుండును సంసారత్రియరహితుండును భోగాభోక్తరహితుండును అభోక్తయు అకర్తయు అసంగుడు త్రిపుటిరహితుండును అసాధ్యుండును అనంతుడును ఇంద్రియాగోచరుండును నిత్యసంతుష్టుండును నిర్బీజుండును పరబ్రహ్మ అపరోక్షుండును నైన కేవలాత్మస్వరూపుండును ప్రత్యగ్భిన్నపరమాత్మస్వరూపుండైన పరబ్రహ్మముండు —

శ్రుతి॥ బ్రహ్మణోఽరవ్యక్తః అవ్యక్తాన్ మహతః మహతో అహంకారః అహంకారాత్ పంచతన్మాత్రాణి పంచతన్మాత్రేభ్యో పంచభూతాని పంచభూతేభ్యో నిఖిలంజగత్॥

నిర్గుణపరబ్రహ్మముండు చంద్రునియందు చంద్రికలవలె పరబ్రహ్మమందు అవ్యక్తమనే మూలజ్ఞప్తి కళామాత్రమైన అనాదిమూలప్రకృతియనే ఆత్మశక్తి పుట్టెను.

ఆ యాత్మశక్తివలన మహత్తు పుట్టెను. ఆమహత్తుయందు అహం అనగ సోహం అనే అహం పుట్టెను. ఆ అహమందు పంచతన్మాత్రలు పుట్టెను. ఆ పంచతన్మాత్రలు శబ్దస్పర్శ రూప రస గంధములు పుట్టెను. వానివలన పంచభూతాని పృథివి అప్పు తేజస్సు వాయువు ఆకాశం పంచభూతములు పుట్టెను. వీనివలన జగత్తు పుట్టెను. ఈజగద్రూపమే విశ్వరూపము. ఈవిశ్వరూపమే పరమాత్మను ప్రత్యగాత్మ. అనగ ప్రతిబింబమని ఇత్యాదిశ్రుతులు పంచభూతములయొక్క సృష్టి స్థితి లయములు.

స్థూలసాంఖ్య పంచకరణం.

గాయత్రి త్రిగుణాత్మికమైన మూల ప్రకృతియనే విక్షేపశక్తి యనే ఆత్మశక్తి యందు—

1 సునీలమైన ఆకాశం గలిగెను.

2 దానివలన నీలవర్ణమైన వాయువు గలిగెను.

3 దానివలన కృష్ణవర్ణమైన అగ్నిపుట్టెను.

4 దానివలన శ్వేతవర్ణమైన జలముపుట్టెను.

5 దానివలన రక్తవర్ణమైన పృథివిపుట్టెను.

ఇందుకు శృతి॥ ఆకాశాద్వాయుః వాయువ్యోరగ్నిః అగ్నిర్వ్యాపః ఆపః పృథివి పృథివ్యో నిఖిలం జగత్॥

ఈపంచభూతంబులును మిశ్రమ మగుటచేత స్థూల సూక్ష్మ కారణ దేహంబులు నొంది బాహ్యప్రపంచవ్యవహారికం జీవు డాయెను.

ఈ అయిదు భూతంబులును ఒక్కొక్కటిని రెండుగా భాగించి యా రెంటిలో నొక్కొక్కటి రెండుభాగంబులై వానిలో నొక్కటి నిజాంశంబులగు.

జ్ఞానము, వ్యానవాయువు, నేత్రము, రసము, పాయువు, యామొదలయినవి పుట్టెను. ఈ అయిదింటిని వేరుగానుంచి తక్కిన నాలుగుభాగములును నితరభూతములలో జేర్చి ఐదైదు లిరువది యైదు తత్వములును గలయ పంచిన పంచీకృతంబయ్యెను.

25 తత్వములుగలిగిన విధము.

( 1 సునీలమైన ఆకాశములో సగభాగము రెండుభాగంబులై అందులో వకభాగము జ్ఞానం పుట్టెను. ఈజ్ఞాతే సునీలమైన ఆకాశతత్వంబైన వ్యష్టి భూతంబైనది

2 తక్కిన ఒక్కభాగము నాలుగు భాగంబులైనది. అవి యెవ్వియనిన

3 నీలవర్ణమైన వాయువు, కృష్ణవర్ణమైన అగ్ని, శ్వేతవర్ణమైన జలము, రక్తవర్ణమైన భూమినిం గూడుచున్నవి.

1 నీలవర్ణమైన వాయువునుం గూడుటచేత మనస్సు పుట్టెను.

2 నలుపువర్ణమైన అగ్నినిగూడుటచేత బుద్ధి పుట్టెను.

3 తెలుపువర్ణమైన జలముతో గూడుటచేత చిత్తము పుట్టెను.

4 రక్తవర్ణమైన పృథివితో గూడుటచేత అహంకారం పుట్టెను.

5 ఇటుల నాలుగు సమిష్టిభూతంబులును పుట్టెను.

6 ఈజ్ఞాత మనస్సు బుద్ధి చిత్త హంకారంబు లైదును అంతరింద్రియములనియును, నాకాశతత్వపంచకంబనియును చెప్పబడుచున్నది.

1 నీలవర్ణమైన వాయువతత్వంలో సగభాగం రెండుభాగంబులై—

2 అందులో నొకభాగం నీలవర్ణమైన వాయువహాంశమైన వ్యానవాయు వనెడు సమిష్టిభూతంబాయెను. తక్కిన యొకభాగము నితర నాలుగు భాగంబులైనవి

3 సునీలవర్ణమైన ఆకాశతత్వం, నలుపువర్ణమైన అగ్నితత్వం, తెలుపువర్ణమైన జలతత్వం, రక్తవర్ణమైన పృధివితత్వమున్ను గూడుకొనియున్నవి.

1 అందులో సునీలవర్ణమైన ఆకాశముతో సంబంధము చేయుటవలన ఆకాశాంశమైన సమానవాయువు పుట్టెను.

2 నలుపువర్ణమైన అగ్నితత్వముతో గలియుటవలన అగ్నిహాంశమైన నుదానవాయువు పుట్టెను.

3 శ్వేతవర్ణమైన జలతత్వముతో కలియుటచేత జలహాంశమైన ప్రాణవాయువు పుట్టెను.

4 రక్తవర్ణమైన పృథివితత్వముతో కలియుటవలన పృథివిహాంశమైన అపానవాయువు పుట్టెను.

ఈ నాలుగు సమిష్టిభూతంబులని జెప్పబడును.

వాయువుతత్వపంచకంబగు అయిదును పంచప్రాణంబులని చెప్పంబడుచున్నవి.

1 నలుపువర్ణమైన అగ్నితత్వములో సగభాగము రెండుభాగంబులై అందులో నొకభాగము నేత్రమనెడి వ్యష్టిభూతంబాయెను. తక్కిన యొకభాగము నితర నాలుగుభూతంబులైనవి.

1 సునీలవర్ణమైన ఆకాశతత్వమున్ను,

2 నీలవర్ణమైన వాయువుతత్వమున్ను,

3 తెలుపువర్ణమైన జలతత్వమున్ను,

4 రక్తవర్ణమైన భూమినిం గూడుటచేత,

5 1 సునీలవర్ణమైన ఆకాశముతో గూడుటవలన చెవులు పుట్టెను. యందు—

2 నీలవర్ణమైన వాయువుతో గూడుటవలన చర్మము బుట్టెను.

3 శ్వేతవర్ణమైన జలముతో కలియుటవలన నాలుకపుట్టెను.

4 రక్తవర్ణమైన పృథివితత్వముతో కలియుటవలన ముక్కుపుట్టెను.

ఈ నాలుగున్ను సమిష్టిభూతంబులని చెప్పబడును.

ఈ యైదున్ను అగ్నితత్వపంచకంబులగు జ్ఞానేంద్రియములు.

ఇవి జ్ఞానేంద్రియములకు విషయముల సృష్టివివరము.

శ్వేతవర్ణమైన జలతత్వములో సగభాగము రెండుభాగంబులై అందులో నొకభాగము జలహంశమైన రసమనెడి వ్యష్టిభూతం బాయెను. తక్కిన సగ భాగము యితరనాలుగుభూతంబులైనవి.

1 సునీలమైన ఆకాశతత్వము;

2 నీలవర్ణమైన వాయువుతత్వము,

3 నలుపువర్ణమైన అగ్నితత్వము,

4 రక్తవర్ణమైన పృధివితత్వము గూడుచున్నవి.

1 అందు సునీలమైన ఆకాశతత్వముతో గూడుటవలన శబ్దము పుట్టెను.

2 నీలవర్ణమైన వాయువుతో గూడుటవలన స్పర్శము గలిగను.

3 నలుపువర్ణమైన అగ్నితత్వముతో గూడుటవలన రూపముపుట్టెను.

4 రక్తవర్ణమైన పృధివితత్వముతో గూడుటవలన గంధము గలిగెను.

ఈ నాలుగు సమిష్టిభూతంబులు బ్రసిద్ధంబులని చెప్పబడును. ఉదక పంచకంబగు నీ యైదును జ్ఞానేంద్రియములకు విషయములు. ఇవే పంచతన్మాత్రలు.)

కర్మేంద్రియముల సృష్టివివరము.

రక్తవర్ణమైన పృధివిలో సగభాగము రెండుభాగంబులై అందులో నొకభాగము వాయువనెడి వ్యష్టిభూతంబాయెను. తక్కిన ఒకభాగము యితర నాలుగు భూతంబులైన విధము.

1 సునీలవర్ణమైన ఆకాశతత్వము,

2 నీలవర్ణమైన వాయువుతత్వము,

3 నలుపువర్ణమైన అగ్నితత్వము,

4 శ్వేతవర్ణమైన జలతత్వమును గూడుచున్నవి.

1 అందు సునీలవర్ణమైన ఆకాశముతో గలియుటచేత ఆకాశ అంశమైన నోరు కలిగెను.

2 అందు నీలవర్ణమైన వాయువుతో కలియుటచేత చేతులు కలిగెను.

3 అందునలుపువర్ణమైన అగ్నితత్వముతో కలియుటచేత కాళ్లు కలిగెను.

4 అందు తెలుపువర్ణమైన జలతత్వముతో గూడుటచేత శిస్నము కలిగెను.

ఈ నాలుగున్ను సమిష్టిభూతంబులని చెప్పబడును. ఇది భూమిపంచకంబున నైదున్ను కర్మేంద్రియములు.

1 సునీలవర్ణమైన ఆకాశతత్వమైన జ్ఞాత.

2 నీలవర్ణమైన వ్యానవాయువు.

3 నలుపువర్ణమైన అగ్నితత్వముతోగూడుటవలన నేత్రములు కలిగెను.

3 శ్వేతవర్ణమైన జలతత్వముతోకూడిన రసనేంద్రియము కలిగెను. జింహ.

4 రక్తవర్ణమైన పృథివితత్వముతోకూడిన గుదము కలిగెను.

ఈ నైదు నిజాంశములవల్లనె అనగ సునీలవర్ణమైన ఆకాశము ఆకాశముతోను నలుపువర్ణమైన అగ్ని అగ్నితోను తెలుపువర్ణమైన ఉదకము వుదకముతోను రక్తవర్ణమైన పృథివి పృథివితోను గలియుటచేత ఇవి సమిష్టిభూతంబులాయెను. తక్కిన యిరువదిభూతంబులును, మిశ్రమభూతంబులతో గలియుటచేత సమిష్టిభూతంబులాయెను. యీ సమిష్టిభూతంబులె మొదట లయించి పిమ్మట వ్యష్టిభూతంబులై లయించును.

25 దు తత్వములు కూడినవిధము యెట్లంటేని,

1 ఆకాశపంచకం ఇవి అంతరింద్రియములు.

మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారం, జ్ఞానం సునీలవర్ణం 5.

2 వాయువపంచకం ఇవి పాణేంద్రియములు.

సమానవాయువు, వ్యానవాయువు, ఉదానవాయువు, పాణవాయువు, అపానవాయువు నీలవర్ణం—౫.

3 అగ్నిపంచకం జ్ఞానేంద్రియములు.

శ్రోత్రము, త్వక్కు, చక్షు, జింహ్మా, ఘ్రాణం నలుపువర్ణం—౫.

4 ఉదకపంచకం పంచతన్మాత్రలు.

శబ్దము, స్పర్శము, రూపము, గంధము, రసము—౫ తెలుపువర్ణం.

5 పృథివిపంచకం కర్మేంద్రియములు.

వాక్కు, పాణి, పాద, గుహ్య, గుదము రక్తవర్ణం—5.

25 అయిదైదులు యిరువైయైదు తత్వములుకూడి పంచీకరణంబాయెనది.

1 ఆకాశతత్వములు—5 దు.

సునీలవర్ణం, జ్ఞానం, సమానం, సోత్రం, శబ్దం, వాక్కు యీ 5 దున్ను,

2 వాయువతత్వములు —5 దు.

మనస్సు, వ్యానం, త్వక్కు, పాణి, స్పర్శ యీ 5 న్ను నీలవర్ణం.

3 అగ్నితత్వములు—5.

నలుపువర్ణం బుద్ధి, ఉదానం, చక్షు-రూ. నలుపువర్ణం.

4 ఉదకతత్వములు —5.

చిత్తము, ప్రాణము, జింహ, రసము, గుహ్యం 5 శ్వేతవర్ణం.

5 పృధివితత్వము —5.

అహంకారం, అపానం, ఘ్రాణం, గంధం, గుదం రక్తవర్ణం—5.

ఈ యిరువైయైదు తత్వములున్ను కూడి పంచీకరణంబైనది.

1 యిరువైయైదు తత్వముల వివరం—25.

1 అంతరింద్రియములు.

జ్ఞాత, మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారం యీ 5 దున్ను ఆకాశతత్వములు.

2 పంచప్రాణములు.

సమాన, ఉదాన, వ్యాన, ప్రాణ, అపాన యీ 5 దున్ను వాయువతత్వములు.

3 జ్ఞానేంద్రియములు.

శ్రోత్రం, త్వక్కు, చక్షు, జింహ, ఘ్రాణం 5 దున్ను ఉదకతత్వములు.

4 జ్ఞానేంద్రియములకు విషయములు.

శబ్దం, స్పర్శ, రూప, రస, గంధం, 5 దున్ను ఉదకతత్వములు

5 కర్మేంద్రియములు.

వాక్కు, పాణి, పాద, పాయు, గుదం పృధివితత్వములు.

ఒకొక్కభూతములో ఒకొక్కభూతము కలసి చేయుపనులు వివరం.

1 ఆకాశతత్వం.

జ్ఞాత, అనగ, సునీలమైన హంసయనె బిందువనె జీవుడు అనగ తెలివి అనగ జ్ఞానం యెరుక.

25 దో తత్వమైన యీజ్ఞాతే ఆకాశతత్వమైన సమానవాయువుతోగూడుకొని చెవులద్వారా శబ్దము గ్రిహించి నోటిద్వారా మాట్లాడుచున్నది.

2 యీజ్ఞాతె 25 దు తత్వమైన ఆకాశతత్వమైన సునీలమైన బిందువనె మనస్సనే జ్ఞాత మనోరూపంబున, ఆకాశాంశంబైన వ్యానవాయువుతో గూడుకుని చర్మముద్వారా స్పర్శనుగ్రిహించుచు చేతులద్వారా యిచ్చి పుచ్చుకొనును.

3 యీజ్ఞాతె సునీలమైన ఆకాశతత్వమైన యీజ్ఞాతె బుద్ధిరూపకమై ఆకాశాంశంబైన ఉదానవాయువుతో కలసి అనగ నలుపువర్ణమైన అగ్నితత్వమైన నేత్రిముద్వారా రూపమును గుర్తెరిగి పాదముద్వారా నడుచుచుండును.

4 యీజ్ఞాతె సునీలవర్ణమైన ఆకాశతత్వమైన యీజ్ఞాతె చిత్తరూపమై ఆకాశాంశమైన ప్రాణవాయువుతోగూడె శ్వేతవర్ణమైన జలతత్వమైన నాలుకద్వారా రుచినెరింగి శిస్నముద్వారా ఆనందించుచున్నది.

5 యీజ్ఞాతె సునీలవర్ణమైన ఆకాశతత్వముతో నేరిన అహంకారమునుబొంది నీలవర్ణమైన వాయువుతత్వముతో చేరిన అపానవాయువునుగూడుకొని ముక్కుద్వారా గంధము గ్రిహించి గుదముద్వారా మలవిసర్జన చేయుచుండెను.

6 యీజ్ఞాతె కించజ్ఞత్వాదిగుణములతో గూడుకొని కార్యోపాధిమైన కించజ్ఞుడైన జీవుడైనది.

7 యీజ్ఞాతె సర్వజ్ఞత్వాది గుణములతోగూడుకొని కారోపాధియైన యీశ్వరుడయినది.

8 యీజ్ఞాతె యిరవైఅయిదోవాడైన జీవకళ అయినది.

9 యీజ్ఞాతె జ్యోతిర్మయాకారమైన తేజస్సయినది.

10 యాజ్ఞాతె జాగ్రిదస్థభిమాని బ్రిహ్మస్వరూపంబయినది.

11 యాజ్ఞాతె స్వప్నావస్థఅభిమాని విష్ణుస్వరూపంబయినది.

12 యాజ్ఞాతె సుషుప్త్యవస్థ అభిమాని ఈశ్వరుడయినది.

13 యాజ్ఞాతె అవస్థాత్రియసాక్షియైనది.

14 యాజ్ఞాతె జీవబిందుకళాస్వరూపమయినది.

15 యాజ్ఞాతె నాదబిందుకళాస్వరూపంబయినది.

16 యాజ్ఞాతె తేజోబిందుకళాస్వరూపమైనది.

17 యాజ్ఞాతె మనోబిందురూపంబయినది.

18 యాజ్ఞాతె ఆత్మబిందురూపంబయినది.

19 యాజ్ఞాతె సాక్షియైన ప్రిత్యగాత్మస్వరూపంబయినది.

20 యాజ్ఞాతె జీవాత్మైనది.

21 యాజ్ఞాతె విష్ణుకళాస్వరూపంబయినది.

22 యాజ్ఞాతె పరమాత్మైనది.

యీ జీవాత్మపరమాత్మలకు భేదం అభేదం ముందు వ్రాయనైయున్నది.

భూతముల కూడికచేత అధ్యాత్మలు పుట్టిన విధము.

1 రక్తవర్ణమయిన పృధివితో పృధివికూడిన వెంటనే గుదమనెడు అధ్యాత్మ పుట్టెను.

2 రక్తవర్ణమయిన పృధివితో శ్వేతవర్ణమయిన జలతత్వముతోగూడుటవలన గంధమనెడు అధ్యాత్మ పుట్టెను.

3 రక్తవర్ణమయిన పృధివితత్వముతో నలుపువర్ణమయిన అగ్నితత్వముతోగూడుటవలన ముక్కు యనెడు అధ్యాత్మ పుట్టెను.

4 రక్తవర్ణమయిన పృధివితత్వముతో నీలవర్ణమయిన వాయువుతో గూడుటవలన అపానవాయువనెడి అధ్యాత్మ పుట్టెను.

5 రక్తవర్ణమయిన పృధివితత్వముతో సునీలమయిన ఆకాశముతో గలియుటవలన అహంకారమనెడి అధ్యాత్మ పుట్టెను.

6 శ్వేతవర్ణమయిన జలతత్వముతో రక్తవర్ణమయిన పృధివికూడిన వెంటనే శిశ్నమనెడి అధ్యాత్మ పుట్టెను.

7 శ్వేతవర్ణమయిన జలముతో జలముకూడిన వెంటనే రసమనెడి అధ్యాత్మ పుట్టెను.

8 శ్వేతవర్ణమయిన వుదకముతో నలుపువర్ణమయి అగ్నిగూడుటచేత నాలుకనెడి అధ్యాత్మ పుట్టెను.

9 శ్వేతవర్ణమయిన వుదకముతో నీలవర్ణమయిన వాయువు కలియుటచేత ప్రాణమనెడి అధ్యాత్మ పుట్టెను.

10 శ్వేతవర్ణమయిన జలతత్వముతో సునీలవర్ణమయిన ఆకాశతత్వం కలియుటచేత చిత్తమనెడి అధ్యాత్మ పుట్టెను.

11 నలుపువర్ణమయిన అగ్నితో రక్తవర్ణమయిన పృథివిగూడుటచేత పాదమనెడు అధ్యాత్మ పుట్టెను.

12 నలుపువర్ణమయిన అగ్నితో శ్వేతవర్ణమయిన జలముగూడుటవలన రూపమనెడి అధ్యాత్మ పుట్టెను.

13 నలుపువర్ణమయిన అగ్నితోగూడుటచేత అగ్నిగూడిన నేత్రమనెడి అధ్యాత్మ పుట్టెను.

14 నలుపువర్ణమయిన అగ్నితో నీలవర్ణమయిన వాయువుగూడిన వెంటనే వుదానవాయువనెడి అధ్యాత్మ పుట్టెను.

15 నలుపువర్ణమయిన అగ్నితో సునీలవర్ణమయిన ఆకాశముతో కలియుటచేత బుద్ధియనెడి అధ్యాత్మ పుట్టెను.

16 నీలవర్ణమైన వాయువుతో రక్తమైన పృథివితో గలియుటచేత చేతులనెడి అధ్యాత్మ పుట్టెను.

17 నీలవర్ణమైన వాయువుతో శ్వేతవర్ణమైన జలము కలియుటచేత స్పర్శ అనెడి అధ్యాత్మ పుట్టెను.

18 నీలవర్ణమైన వాయువుతో నలుపువర్ణమైన అగ్నితత్వం గలియుటచేత చర్మమనెడి అధ్యాత్మ పుట్టెను.

19 నీలవర్ణమైన వాయువుతో వాయువుగూడినవెంటనే వ్యానవాయువనెడి అధ్యాత్మ పుట్టెను.

20 నీలవర్ణమైన వాయువుతో సునీలవర్ణమైన ఆకాశం కలియుటచేత మనస్సనెడి అధ్యాత్మ పుట్టెను.

21 సునీలవర్ణమైన ఆకాశతత్వముతో రక్తవర్ణమైన పృథివితత్వముతో కలియుటచేత నోరనెడి అధ్యాత్మ పుట్టెను.

22 సునీలవర్ణమైన ఆకాశముతో శ్వేతవర్ణమైన జలతత్వముతో కలియుటచేత శబ్దమనెడి అధ్యాత్మ పుట్టెను.

23 సునీలవర్ణమైన ఆకాశముతో నలుపువర్ణమైన అగ్నితత్వముతో కలియుటచేత చేతులనెడి అధ్యాత్మ పుట్టెను.

24 సునీలవర్ణమైన ఆకాశముతో నీలవర్ణమైన వాయువుచేరుటచేత సమానవాయువనెడి అధ్యాత్మ పుట్టెను.

25 సునీలమైన ఆకాశముతో కలియుటచేత ఆకాశముచేరుటచేత నే జ్ఞానమనెడి అధ్యాత్మపుట్టెను.

—— జ్ఞానేంద్రియములకు విషయములు. ——

1 చెవులకు విషయము శబ్దము.

2 చర్మమునకు విషయము స్పర్శము.

3 నేత్రమునకు విషయము రూపము.

4 జిహ్వకు విషయము రసము.

5 ముక్కుకు విషయము గంధము.

కర్మేంద్రియములకు విషయములు.

1 నోటికి విషయము, వచనము.

2 చేతులకు విషయము, దానము.

3 కాళ్ళకు విషయము, నడుచుట.

4 శిస్నమునకు విషయము, ఆనందము.

5 గుదమునకు విషయము, మలవిసర్జనచేయుట.

అంతరింద్రియచతుష్టయములకు విషయము.

1 మనస్సు విషయము, సంకల్పము.

2 బుద్ధికి విషయము, నిశ్చయము.

3 చిత్తమునకు విషయము, చింతన.

4 అహంకారమునకు విషయము, నేను నేననెడి, అహంభావన.

అంతరింద్రియచతుష్టయమునకు అధ్యాత్మ, ఆదిభూత, అధిదేవతలు.

1 మనస్సునకు అధ్యాత్మ సంకల్పము ఆదిభూతము చంద్రుడు అధిదేవత.

2 బుద్ధికి అధ్యాత్మ, నిశ్చయం అదిభూతం బ్రహ్మ అధిదేవత.

3 చిత్తం అధ్యాత్మ చింతించుట అతిభూతం జీవుడు అధిదేవత.

4 అహంకారం అధ్యాత్మ, నేనని వాదించుటే. అధిభూతం రుద్రుడధి దేవత.

పంచప్రాణములకు అధ్యాత్మ అధిభూతం అధిదేవతలు.

1 నీలవర్ణమైన సమానవాయువు అధ్యాత్మ, విజయుడు అధిదేవత.

2 డిటో వ్యానవాయువు అధ్యాత్మ జయుడు అధిదేవత.

3 డిటో ఉదానవాయువు అధ్యాత్మ విశ్వయోని అధిదేవత.

4 డిటో ప్రాణవాయువు అధ్యాత్మ విష్ణు అధిదేవత.

5 డిటో అపానవాయువు అధ్యాత్మ విశ్వకర్మ అధిదేవత.

జ్ఞానేంద్రియములకు అధ్యాత్మ అధిభూత అధిదేవతలు.

1 చెవులు అధ్యాత్మ శబ్దం అధిభూతం దిక్కులు అధిదేవత.

2 త్వక్కు అధ్యాత్మ స్పర్శ అధిభూతం వాయువు అధిదేవత.

3 నేత్రం అధ్యాత్మ రూపం అధిభూతం సూర్యుడు అధిదేవత.

4 జిహ్వ అధ్యాత్మ గంధం అధిభూతం అశ్వనీదేవతలు అధిదేవతలు.

కర్మేంద్రియములకు అధ్యాత్మ అధిభూత అధిదేవతలు.

1 నోరు అధ్యాత్మ వచనం అధిభూతం అగ్ని అధిదేవత.

2 చేతులు అధ్యాత్మ దానం అధిభూతం ఇంద్రుడు అధిదేవత.

3 కాళ్ళు అధ్యాత్మ నడుచుట అధిభూతం విష్ణు అధిదేవత.

4 శిస్నం అధ్యాత్మ ఆనందం అధిభూతం బ్రహ్మ అధిదేవత.

5 గుదం అధ్యాత్మ మలవిసర్జన అధిభూతం మృత్యువు అధిదేవత.

పంచకోశములకు వివరము.

1 అన్నమయకోశం అనగ ఆకాశపంచకంబైన సునీలమైన ఆకాశతత్వమైన అహంకారము వ్యష్టి సమిష్టి భూతములతోగూడినదే అన్నమయకోశము అనగ పృధివితత్వం శరీరం.

2 ఆకాశతత్వమైన సునీలమైన బుద్ధి నీలవర్ణమైన వాయువు తత్వమైన పంచప్రాణములతోగూడినదే ప్రాణమయకోశము ఉఛ్వాసనిశ్వాసరూపమైన హంసస్వరూపం ప్రాణం.

3 ఆకాశతత్వమైన సునీలవర్ణమైన మనస్సు రక్తవర్ణమైన పృధివితత్వమై కర్మేంద్రియములతోగూడి మనోమయకోశము అనగ యిరవైయొక్క

వెయ్యి ఆరువందల హంసలచేతగూడినదే మనస్సు. మనోమయకోశము 25దో తత్వం.

4 ఆకాశతత్వమయిన సునీలవర్ణమయిన నలుపువర్ణమయిన అగ్ని యున్నుఅగ్నితత్వపంచకముతోగూడినదే విజ్ఞానమయకోశము. ఇదే సూక్ష్మాంగము—పంచవింశతితత్వమయిన జ్ఞానం—పరిజ్ఞానం బ్రహ్మ— కళామాత్రి— తేజస్సు.

5 ఆకాశతత్వం సునీలవర్ణమయిన 25 దో వాక్యైన జ్ఞాతతోగూడిన ఆనందమయకోశం. ఇదే కారణాంగం నిష్కళానందం.

—। స్థూలశరీరముయొక్క క్రిమము ।—

1 అంతరింద్రియములు 5
2 పంచప్రాణములు 5
3 జ్ఞానేంద్రియములు 5
4 పంచతన్మాత్రలు 5
5 కర్మేంద్రియములు 5

ఈ యిరువదైదున్ను కలసి స్థూలశరీరమయినది. నానాస్త్రీలోకవ్యవహారం చేయుచున్నది. ఇదే మానుషజన్మం. దీనికే సృష్టిబ్రహ్మయని పేరు. జాగ్రిదావస్థ స్థూలశరీరం.

—। సూక్ష్మశరీరముయొక్క క్రిమము

1 పంచప్రాణములు 5
2 జ్ఞానేంద్రియములు 5
3 పంచతన్మాత్రలు 5

ఈపదిహేను యింద్రియములలోను—మనస్సు బుద్ధిన్ని — యీరెండున్ను కలసి సూక్ష్మశరీరమయినది. ఈ పదిహేనుతత్వములతోగూడినదే లింగదేహం. సూక్ష్మదేహం విష్ణువు అధికర్త స్వప్నావస్థ.

—। కారణాంగముయొక్క వివరము ।—

1 చిత్తము—జ్ఞాతయనే జీవునిలోగూడి యీజీవేశ్వరసన్నిధియే కారణాంగము. ఇదే ఈశ్వరతత్వం. ఇతనిపేరే ఈశ్వరుడు. సుషుప్తి కారణాంగము.

—। మహాకారణదేహముయొక్క వివరము ।—

ఏకమయి అద్వితీయమయి స్వయంప్రకాశమయి ఆపోజ్యోతికళాస్వ

రూపమయినదే సర్వసాక్షి, ప్రత్యగాత్మ.—ఇదే తుర్యం—మహాకారణం.

—॥ పంచభూతములవల్ల పుట్టిన వివరం ॥—

1 రక్తవర్ణమయిన పృథివితత్వంవల్ల పుట్టినవి—యెముకలు, చర్మము మాంసము, నరములు, రోమములు. ఈ వైయైదున్ను కలిగినవి.

2 నలుపువర్ణమయిన అగ్నితత్వంవల్ల పుట్టినవి—ఆకలి, దాహము, నిద్ర, ఆలస్యము, స్త్రీకూటము. ఈ వైయైదున్ను గలిగెను.

3 శ్వేతవర్ణమయిన జలతత్వమువలన బుట్టినవి—నెత్తురు, మూత్రము, యింద్రియము, కళ్ళె, మెదడు యీ మొదలైనవి కలిగెను.

4 నీలవర్ణమయిన వాయుతత్వమువల్ల పుట్టినవి—కదలుట, నడుచుట త్వరపడుట, సిగ్గు, భయము యీ వైయైదున్ను కలిగినవి.

5 సునీలవర్ణమయిన ఆకాశతత్వమువల్ల కలిగినవి—కామం, క్రోధం, లోభం, మోహం, మదం, మాత్సర్యం యనేటి షడ్వర్గములు పుట్టినవి.

—॥ దశవిధనాడుల వివరము ॥—

1 ఇడానాడి. ముక్కునకు యెడమభాగమందుండును. శివుడు అధిదేవత.

2 పింగళానాడి. ముక్కునకు కుడిభాగమందుండును. విష్ణువు అధిదేవత.

3 సుషుమ్నానాడి. ముక్కుకు పైభాగమందుండును. బ్రహ్మ అధిదేవత.

4 అస్థినీనాడి. జిహ్వయందు యెడమనేత్రమందుండును. వరుణుడు అధిదేవత.

5 గాంధారీనాడి. కుడినేత్రమందుండును. ఇంద్రుడధిదేవత.

6 పూషానాడి. కుడిచెవియందుండును. దిగ్దేవత అధిదేవత.

7 పయశ్వినినాడి. అనగ యెడమచెవియందుండును. బ్రహ్మ అధిదేవత.

8 అలంబసునాడి. అనగ శిస్నమందుండును. అగ్ని అధిదేవత.

9 కుహూనాడి. అనగ గుదస్థానమందుండును. భూమి అధిదేవత.

10 శంకిణీనాడి. అనగ నాభిస్థానమందుండును. చంద్రుడు అధిదేవత.

—॥ దశవిధవాయువులయొక్క స్థానవివరము ॥—

1 నీలవర్ణమయిన వాయువుతత్వం సమానవాయువు యిది నాభిస్థానమందుండును. ఆపాదమస్తకపర్యంతము నాడులయందు వ్యాపించి అన్నరసము

మొదలగువాటియొక్క సత్తువను సమస్తనాడులకు పంచిపెట్టుచుండును.

2 శ్వేతవర్ణమయిన జలతత్వం వ్యానవాయువు సర్వాంగములను వ్యాపించి దేహమంతయును నిండియుండును.

3 నలుపువర్ణమయిన అగ్నితత్వమయిన వుదానవాయువు కంఠమందుండి తుమ్మును, దగ్గును బుట్టించును. రుచులుగోరును. అన్నరసము ఆత్మకు భావన చేయించును. కలవరించును కలలుకనును.

4 సునీలవర్ణమయిన ఆకాశతత్వం ప్రాణవాయువు. హృదయస్థానమందుండి అంగుష్టము మొదలగునవి వెన్నెముక మొదటివరకు వ్యాపించి ఉఛ్వాసనిశ్వాసములచేత అన్నం జీర్ణముచేయించును.

5 రక్తవర్ణమయిన పృథ్వితత్వం అపానవాయువు. గుదస్థానమందుండి మలమూత్రములను విడిపించి అధోద్వారమును బంధించి అన్నరసమును వ్యాపించి సకలరోమనాడులయందు పంచిపెట్టును.

6 నీలవర్ణమయిన వాయువుతత్వం నాగవాయువు. గుదస్థానమందుండి చలనములేక గీతారాగాదులయందుండును పాడించును.

7 శ్వేతవర్ణమయిన ఉదకతత్వం కూర్మవాయువు. కంఠమందుండి ఆవలింతపుట్టించి యెక్కులుకూడా పుట్టించును.

8 రక్తవర్ణం పృథివితత్వం కుకురవాయువు. నాశికాగ్రమందుండును. తుమ్ము, దగ్గు మొదలగునవి పుట్టించును.

9 ఆకాశతత్వం సునీలవర్ణం దేవదత్తవాయువు. గుహ్యమందుగూడి నేత్రమందుండి తుమ్ము మొదలగు ధర్మములను బుట్టించును. ధర్మములను జేయించును.

10 నీలవర్ణమయిన వాయుపుతత్వం ధనంజయవాయువు. వాయువుతత్వమయిన సహస్రమయిన బ్రహ్మస్థానమందుండి చెవులరంధ్రములలో ప్రవేశించి సముద్రము భంగి ఘోషించును. చిత్రములుగా నాదములనుబుట్టించును. మరణకాలమునకు ముందుగ సిద్ధోషమయిపోవును.

— । అంతరేంద్రియముల స్థానములు । —

1 జ్ఞాత చక్షుస్థానం.

2 మనస్సు కంఠస్థానం.

3 బుద్ధి ముఖస్థానం.

4 చిత్తం నాభిస్థానం.

5 అహంకారం హృదయస్థానం.

—॥ పంచాగ్నుల వివరము. ॥—

1 జ్ఞానాగ్ని ఆత్మయందుండును.

2 కాలాగ్ని పదములయందుండును.

3 క్షుదాగ్ని నాభియందుండును.

4 శీతాగ్ని హృదయమందుండును.

5 కోపాగ్ని నేత్రమందుండును.

—॥ జ్ఞానేంద్రియములకు విషయములు ॥—

1 శ్రోత్రేంద్రియము అనగ చెవులు ఆకాశతత్వం దిక్కులు అధిదేవతలు శబ్దమే విషయం క్షరం అక్షరం దీనిభేదములు.

2 త్వగింద్రియమనగ చర్మము వాయువుతత్వం రుద్రుడు అధిదేవత స్పర్శమే విషయం శీతం వుష్ణం కఠినం మృదువు యీనాలుగున్ను స్పర్శభేదములు.

3 చక్షురింద్రియం అనగ నేత్రము అగ్నితత్వం సూర్యుడు అధిదేవత. రూపమే విషయం శ్వేత పీత హరిత రక్త మంజిష్ట కృష్ణవర్ణములు ఇవి రూపభేదములు.

4 జిహ్వేంద్రియము అనగ నాలుక వుదకతత్వం వరుణుడు అధిదేవత. రసమే విషయం మధుర ఆమ్ల తిక్త కటు కషాయ లవణములు యీయారున్ను రసభేదములు.

5 ఘ్రాణేంద్రియం అనగ ముక్కు పృధివీతత్వం అశ్వనీదేవతలు అధిదేవతలు. గంధమే విషయం సుగంధదుర్గంధములు యీరెండున్ను గంధభేదములు.

కర్మేంద్రియముల వివరము, అధ్యాత్మ, అధిదేవత, అధిభూతములు.

1 వాగింద్రియమనగ నోరు నాగవాయువు అతిభూతం అగ్ని అధిదేవత. వచనం విషయం సువాక్యం దుర్వాక్యములు రెండున్ను వచనభేదములు.

2 ప్రాణేంద్రియములు అనగ చేతులు కూర్మవాయువు అధిభూతం. యింద్రుడు అధిదేవత. దానమే విషయం దానాదానములు రెండున్ను దానభేదములు.

3 పాదేంద్రియము అనగ కాళ్లు కుకురవాయువు అధిభూతం విష్ణు వధిదేవత గుణమే విషయం గమనభేదములు.

4 గుహ్యేంద్రియమనగ ప్రజాపతి ధనుంజయవాయువు అధిభూతం మృత్యువు అధిదేవత మలవిసర్జనమే విషయము.

కర్మేంద్రియములు లయించు క్రమము.

1 రక్తవర్ణమైన పృథివితత్వముయొక్క కఠినాంశము సునీలవర్ణమయిన ఆకాశతత్వముతో గూడుకొనియున్న బయలాంశముతో కూడినయెడల వాక్కు లయించును.

2 రక్తవర్ణమైన పృధ్వితత్వముయొక్క కఠినాంశము నీలవర్ణమైన వాయువుతత్వముయొక్క చలనాంశముతో గూడినయెడల పాణిలయించును.

3 రక్తవర్ణమైన పృథివితత్వంయొక్క కఠినాంశము నలుపువర్ణమైన అగ్నితత్వముయొక్క తేజాంశముతో గూడినయెడల పాదములయించును.

4 రక్తవర్ణమైన పృథివితత్వముయొక్క కఠినాంశము శ్వేతవర్ణమయిన జలతత్వముయొక్క ద్రవాంశముతో కూడినయెడల గుహ్యములయించును.

5 రక్తవర్ణమయిన పృథివితత్వంయొక్క కఠినాంశముతో శ్వేతవర్ణమయిన జలతత్వముతో కూడినయెడల గుహ్యము లయించును.

పంచతన్మాత్రలు లయించు క్రమములు.

1 శ్వేతవర్ణమైన జలతత్వముయొక్క ద్రవాంశము సునీలవర్ణం ఆకాశతత్వముయొక్క బయిలాంశముతో కూడినయెడల శబ్దము లయించును.

2 శ్వేతవర్ణమైన జలతత్వముయొక్క ద్రవాంశము నలుపువర్ణమయిన అగ్నితత్వంయొక్క తేజాంశముతో గూడినయెడల రూపము లయించును.

3 శ్వేతవర్ణమైన జలతత్వముయొక్క ద్రవాంశము నీలవర్ణమయిన వాయువతత్వంయొక్క చలనాంశముతో గూడినయెడల స్పర్శలయించును.

4 శ్వేతవర్ణమైన జలతత్వముయొక్క ద్రవాంశముతో కూడినయెడల రక్తవర్ణమైన పృథివితత్వంయొక్క కఠినాంశముతో గూడినయెడల గంధం లయించును.

జ్ఞానేంద్రియములు లయించుక్రమము.

1 నలుపువర్ణమైన అగ్నితత్వంయొక్క తేజాంశము నీలవర్ణమయిన ఆకాశతత్వముయొక్క బయిలాంశముతో కూడిన యెడల స్రోత్రంలయించును.

2 నలుపు వర్ణమైన అగ్నితత్వంయొక్క తేజాంశము నీలవర్ణమైన, వాయువు తత్వముయొక్క చలనాంశముతో కూడినయెడల త్వక్కులయించును.

3 నలుపువర్ణమైన అగ్నితత్వంయొక్క తేజాంశము నీలవర్ణమయిన వాయువతత్వముయొక్క చలనాంశముతో కూడినయెడల త్వక్కులయించును.

4 నలుపువర్ణమైన అగ్నితత్వముయొక్క తేజాంశము రక్తవర్ణమైన పృథివితత్వయొక్క ద్రివాంశముతో కూడినయెడల జిహ్వాలయించును.

పాదేంద్రియములు లయించుక్రమము.

1 నీలవర్ణమైన వాయువతత్వముయొక్క చలనాంశము సునీలవర్ణమైన ఆకాశతత్వముయొక్క బైలాంశముతో కూడినయెడల సమానవాయువులయించును.

2 నీలవర్ణమైన వాయువతత్వముయొక్క చలనాంశము నలుపువర్ణమైన అగ్నితత్వముయొక్క తేజాంశముతో కూడినయెడల వుదానవాయువులయించును.

3 నీలవర్ణమైన వాయువతత్వముయొక్క చలనాంశము శ్వేతవర్ణమైన జలతత్వంయొక్క ద్రివాంశముతో కూడినయెడల ప్రాణవాయువు లయించును.

4 నీలవర్ణమైన వాయువతత్వముయొక్క చలనాంశమువలన రక్తవర్ణమైన పృథివితత్వంయొక్క కఠినాంశముతో కూడినయెడల అపానవాయువులయించును.

అంతరింద్రియములు లయించుక్రమము.

1 సునీలవర్ణమైన ఆకాశతత్వమైన బైలాంశముతో రక్తవర్ణమైన పృథివి తత్వముయొక్క కఠినాంశముతో కూడిన అహంకారము లయించును.

2 సునీలమైన ఆకాశతత్వముయొక్క బైలాంశముతో శ్వేతవర్ణమైన జలతత్వముతో ద్రవాంశముగూడినయెడల చిత్తము లయించును.

3 సునీలవర్ణమైన ఆకాశతత్వంయొక్క బైలాంశముతో నలుపువర్ణమైన అగ్నితత్వముయొక్క తేజాంశముతో కూడినయెడల బుద్ధిలయించును.

4 సునీలమైన ఆకాశతత్వంయొక్క బైలాంశముతో నలుపువర్ణమైన అగ్నితత్వముయొక్క చలనాంశముతో గూడినయెడల మనస్సులయించును.

వ్యష్టిభూతములు లయించు క్రమము.

1 రక్తవర్ణమైన పృథివితత్వంయొక్క కఠినాంశముతో నీలవర్ణమయిన వాయువతత్వంయొక్క చలనాంశముతో శ్వేతవర్ణమైన జలతత్వంయొక్క ద్రవాంశముతో కలియుటచేత ఉదకములయించును.

2 శ్వేతవర్ణమయిన జలతత్వంయొక్క ద్రవాంశముయొక్క నలుపువర్ణమైన అగ్నితత్వంయొక్క తేజాంశము కూడినయెడల అగ్నిలయించును.

3 నలుపువర్ణమైన అగ్నితత్వంయొక్క తేజాంశముతో నీలవర్ణమైన వాయువుతత్వంయొక్క చలనాంశముతో కూడుటచేత వాయువు లయించును.

4 నీలవర్ణమైన వాయువుతత్వంయొక్క ద్రవాంశముతో సునీలమైన ఆకాశము బైలాంశముతో బైలాంశము కూడుటచేత ఆకాశతత్వము లయమయినది.

5 ఆకాశతత్వమైన జ్ఞాత ఆత్మలో గలియుటచేత తానేపరబ్రహ్మంబయినది.

ఈపంచవింశతి తత్వములు లయమై మిగిలిన పదార్థం బ్రహ్మపదార్థం మాయ యెఱుక అవిద్యలు॥ శ్రుతి॥ అనేకమూల జ్ఞప్తికళామాత్రి శరీరం నాస్తినిశ్చయం॥ అని యీమాయాకూశబలిత బ్రహ్మమునకు మూలాభావం తనంతటతానే వచ్చిన యట్లు వచ్చినది. పంచవింశతి తత్వాత్మికంబైన జ్ఞాతయనే హంసయనే మనోబింబువనే వ్యవహారికజీవుడు నిర్గుణపరబ్రహ్మమందు అనాదిమూలజ్ఞప్తి అవ్యక్తమూలప్రకృతిత్రిగుణాత్మికమాయాశక్తి నామరూపక్రియాత్మకంబై పంచభూతమిశ్రిమజగత్రియంబయి పరమాత్మకు ఆరోపితంబైనది. ఎట్లనిన శ్రుతి. అనాత్మన్యాప్తె అవివేకనిద్రా అహంమనుస్వప్నగతింగతోహం॥ ఇత్యాదిశ్రుతిప్రమాణములు చెప్పుచున్నవి, కలలోదోచిన శరీరం యేలాగో ఆలాగే ఆప్రకారమే అనాత్మదృష్టిచేత తోచబడిన స్వప్నము తనంతటతానే వచ్చి తనంతటతానే మూలాభావమయినది. ఈమూల జ్ఞప్తికళామాత్రిశరీరమె సుషుప్తియందు మెళుకువ యేలాగువచ్చి సృష్టిస్థితిలయములై జననమరణములకు గారణమయినది. లింగదేహం కలలోన నరుకులాడిన గలవె గాయములు మేలుకాంచినవెనుక దెలియక మునుపటి సంశృతి కలకలు విజ్ఞానికేలగలుగ దోచును శయ్యనుండియు పెక్కుదేశముల దిరుగ కలగాంచుచున్న నిద్రితునివిధంగి దా సచ్చిదానందమయుడయ్యు దా

జననమరణబాధలను బొందినట్లుంట భ్రాంతిగాదే యనునావ్యోక్తి చెప్పుచున్నది.

శ్రుతి॥ అధ్యారోపాపవాదాభ్యాం అపమృత్యుర్భవిష్యతి॥ శ్రుతి। అధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచతే॥ ఇత్యాదిశ్రుతిప్రమాణంబులు ఘోషించుచున్నవి. ఎట్లనిన,

అధ్యారోపాపవాదమనగ లేనిదేవున్నదని యున్నదే లేదని చెప్పవలసివచ్చెను. లేనిదానిని కలుగజేసి జెప్పుట అధ్యాఆరోపణము. ఎట్లనిన, మహావాక్యరత్నావళి। మృగతృష్ణజంపీత్వాతృప్తిశ్చేదస్త్విదంజగత్॥ గగనే నీలిమాభాతిశ్చేదస్త్విదంజగత్॥

రజ్జౌ సర్పభ్రాంతివత్సర్వం దారువపురుషవత్సర్వం సుక్తిరజతతత్సర్వంజగత్ వంధ్యాపుత్రుషవత్సర్వం విద్యుద్భ్రమనిమిషవత్ స్వప్నభ్రాంతివత్ సర్వంజగత్॥

త్రాటియందు సర్పము ఆరోపితంబైనట్లున్ను దారువందు పుషాధ్యారోపంబును ముత్యపుచిప్పలయందు రజితాధ్యారోపంబును యండమావులయందు జలమధ్యారోపంబును ఆకాశమందు నీలపీతాధ్యారోపంబును గొడ్డువానికి పుత్రాధ్యారోపంబును మేఘమందు విద్యుద్భ్రమధ్యారోపంబును స్వప్నమందు లేనిపదార్థములు యున్నట్లు వున్నది లేనట్లు తోచబడిన స్వప్నభ్రాంతి.

యదార్థస్థితియందు ఆజీవభ్రాంతియనే మనస్సు పరబ్రహ్మమందారోపింపబడినదే కావున పరబ్రహ్మను నెరింగినవారికి ఆజీవభ్రాంతియనే మనస్సు కనబడనే కనబడదు. రజ్జువందు సర్పభ్రాంతిబొందినవానికి యిదిరజ్జువని అధిష్ఠానమును దెలసికొనగానే ఆరోపితమగు సర్పము కానరానట్లు అధిష్ఠానమగు దారువందున మనుష్యుడు ఆరోపితమగునట్లు మనుష్యుడు తోపనివిధమున నెండమావులని దెలసికొనినపిదప దానియందు ఆరోపితంబైన జలము దృష్టికి గోచరముగానిభంగి యిది ముత్యపుచిప్పయని యదార్థస్థితిని దెలసికొనగానే దానిపై భ్రాంతి నారోపింపబడిన వెండి మరల కానంబడనిమాట్కి ఇది ఆకాశముకాని నలుపుకాదు. అని గ్రహించినపిదప నానలుపు మరల గానరానిపగిది స్వప్నము మేల్కొనినపిదప స్వప్నపదార్థములు నిజముగానిపగిది గొడ్రాలికి బిడ్డ యెప్పుడూ పుట్టనేలేదు యని మేఘమందు

మెరుపుతీగ తానంతట తానేవచ్చి మరల క్షణమాత్రమైన కనపడనట్లున్న సర్వాధిష్ఠానమగు బ్రహ్మమైన తన్నుదా నెఱింగిన పరమాత్మయందారోపింప బడిన మనస్సు బొత్తిగానే కానరాదు. కావున శృతి॥ వుల్కాహస్తో యథా కచిత్ ద్రవ్యమాలో'క్యతాంత్యజేత్ జ్ఞానేనజ్ఞేయమాలోక్య పశ్చాదాజ్ఞానం పరిత్యజేత్॥

చోరుడు కాగడాను వెలిగించి ఆవెలుగువలననే ద్రవ్యమును గ్రహించి ఆకాగడాను త్యజేత్ పరిత్యజించినట్లుగనే జ్ఞానమనే మనస్సుచేత జ్ఞేయమనే బ్రహ్మమును తాదెలసి నేను తెలిసితిననే అహంకారమును పరిత్యజించినటుల ఆరోపితంబైన జీవభ్రాంతిని అట్లనే విడచి వాస్తవస్థితిలో యితడు జీవుడు కాడని తలంపు. ఇది పాము అని త్రాటిని చూచుచున్నను భ్రాంతిచే గలిగిన తలంపువలె సర్వపరిపూర్ణబ్రహ్మైన తను దా జూచుచున్నను భ్రాంతిచే గలుగుచున్నదియే కదా గావున పైవిధముగ వ్యష్టినుండి నీస్వరూపమును విభాగించి కూటస్థబ్రహ్మమాత్రముగ దెలసికొనిన పిదప సమస్తదేవమనుష్యాది పంచకోశములను అట్లే వాని కారణములగు పంచభూతములను ఆత్మ కాదని నిషేధించి బ్రహ్మరూపమును వానికంటె వేరుగా నిర్ణయింపబడును.

శృతి॥ శ్రవణమనన నిధిధ్యాసనసమాధిభ్రాంతిలక్షణం బ్రహ్మవిశ్వం ద్వయంమిథ్యా ఇతినిశ్చయమేవహి శిష్యోర్నాస్తి గురోర్నాస్తి నాస్తిజ్ఞప్తికథా చన ఏతద్వాక్యవిభేయం గురువాక్యే నలభ్యతే॥

శృతి॥ వేదశాస్త్రపురాణాసహితపరసాదికానిచ మంత్రయంత్రాది విద్యానాం శృతిరుచ్చాటనాదికం ఉపభ్రమశ సమస్తానా జీవానాం భ్రాంతిచేతసాం॥ శృతిప్రమాణములు చెప్పుచున్నవి.

ఏసమయమందు జీవభ్రాంతి అనగ అధిష్ఠానమగు బ్రహ్మము నెఱుంగలేక నేను జీవుడను బ్రహ్మమునకు ప్రతిబింబమైన నాకు కామక్రోధాదులు గలవు అను భ్రాంతికలిగియుండునో అప్పుడు యీప్రపంచమంతయు ప్రపంచాకారమైన మనస్సు జీవుడు కానవచ్చును. చేతనుడగు జీవునకు జడమగు ప్రపంచమునకు పరబ్రహ్మమే సస్వరూపమే యాధారము గావున నేను జీవుడను అని తనకు జీవత్వమున్నదని తోచినటే యధిష్ఠానజ్ఞానముచే యిది ప్రపంచమనికూడ ప్రపంచభ్రాంతి కలుగును. ఇట్లుగాక యదార్థస్వరూపవిజ్ఞానము కలిగి బ్రహ్మమును అని భ్రాంతితోపగానే భ్రాంతిలేకపోవుటచే దృశ్యప్రపం

చాకారమైన మనస్సనే జీవుడు కానరాడు. యదార్థస్థితియందు బ్రహ్మమునకు ప్రతిబింబమనునదియే లేదుగదా యీకారణమువలన—శ్రుతి॥ నారాయణోపనిషత్తు॥ నారాయణోపరోవస్తు తస్మిన్నాహంకదాచన గుణత్రియాన విద్యాంతే వికారరహితంసదా॥ ప్రమాణములు చెప్పియున్నవి.

ఈజగద్భ్రాంతి యెట్టిదనిన, ఒక చిన్నయితిహాసముకలదు. అది యెట్టిదనిన—

ఉళ్ళుక్కి యనే దేశములో కరచరణహీనుడనే వంధ్యాపుత్రుడుకలడు. అతను శశవిషాణములనే బాణములను ధరించి మహారణ్యమునకు వేటకువెళ్లుచుండగా దాహముగలిగి మృగతృష్ణలో నీరుద్రావి గంధర్వనగరం మీదికి యుద్ధమునకుబోయి గగనపుష్పము సాధించుకొనివచ్చి యుళ్ళుక్కునస్త్రీకి యివ్వగా అంధుడగు గుడ్డివాడు చూచి వినబడని చెవిటివానితో చెప్పగా తలలేని మొండివాడు శిరఃకంపనముజేసి నవ్వినట్లుగ యీజగద్భ్రాంతి లేనిదే వున్నట్లుగ తోచబడినది. అసిన మూలజ్ఞపికళామాత్రం శరీరంబనే యనాదిమూలప్రకృతియనే జగద్భ్రాంతి తోచబడినది. మూలాభావముగ తోచబడిన జీవభ్రాంతి తన్ను తా దెలియక సర్వచరాచరప్రపంచమంతయు మూలజ్ఞపికళామాత్రస్వరూపమనే మలినసత్వప్రధాన మాయాసమన్వితమైనది. శ్రుతి॥ మూలంభావం ఇదంజ్ఞాతుంసశరీరం నాస్తికేవలం॥ ఈజ్ఞాతయనే జీవభ్రాంతి పంచవింశతితత్వాత్మకుడైనవాడే క్షేత్రజ్ఞుడు క్షేత్రము క్షేత్రక్షేత్రజ్ఞద్వయదోషం గమనాగమనములకు రాకపోకలకు కారణం. ఉపాధద్వయదోష కళాస్వరూపమైన జీవాత్మ. ఈజీవాత్మే ప్రకృతిపురుషద్వయము క్షరాక్షరద్వయము క్షేత్రక్షేత్రజ్ఞద్వయము ప్రకృతిపురుషద్వయము కార్యకారణద్వయము జీవేశ్వరద్వయము ఆత్మానాత్మద్వయము యీద్వయదోషమే శరీరాత్మవై ప్రకాశించుచున్నవి. ఈశరీరాత్మలెలో కాలోకములు ఆదిమధ్యాంతములు లేక తనంతట తానై తనయందనగ పరమాత్మయందు—శ్రుతి॥ రజ్జగ్నానాత్ భాతిరజ్జుర్యదాహి స్వాత్మజ్ఞనదాత్మనో జీవభావః ఆప్తోక్త్యాహార్ భ్రాంతినాశేశరజ్జుర్. జీవోనాహం దేశికాక్తోశివోహం॥ త్రాటియందు సర్పారోపణంబువలె తనయందు తానే తోచబడిన జీవభ్రాంతి జగద్భ్రాంతి కల్పింపబడినది.

## అధ్యాత్మసాంఖ్యయోగము.

అది యెట్లనిన—ఒక చిన్నకథ దృష్టాంతముగ చెప్పబడియున్న ఉళ్ళక్కి యనే దేశములో దబ్బర యను నొకపట్టణముగలదు. ఆపట్టణమును యేమిూలేని ప్రభువు పాలించుచుండును. యాప్రభువుకే మంత్రులైన వంధ్యాపుత్రుడు, దారువపురుషుడు వీరిద్దరిని రాజు పిలిచి మిూరిద్దరు బోయి ఆకాశపుష్పము తెమ్మని శెలవిచ్చిన యా యిద్దరు ప్రయాణమై బోవుచు నామార్గమున వివిధవేడుకలను జూచుచు పోయిపోయి నొకప్రదేశమున రజతశుక్తికములు విశేషముగ నుండుటను జూచి యామంత్రులిద్దరు వెండిగనియని మిగుల సంతసించి ఆహా తమ్ముడ ఓహో యన్న మనము పోలిజన్మమున నెంతటిపుణ్యము జేసితిమో తెలియదు. మన కీజన్మమున వెండిగని సంభవించినది. కృతార్థులమైతిమని యాయిద్దరు పైవస్త్రములను భూమిమిూద బరచి యాగుల్లలను ప్రోగుచేసుకొని మూటకట్టుకొనిరి. ఆమూటలో వంధ్యాపుత్రుడు గట్టినమూట పెద్దదిగానుండుటను దారువపురుషుడు చూచి అన్నా మనయిద్దరము నక్కటిగగూడి వచ్చితిమి యేమిదొరకినను సమానముగా పంచుకోవలయునే గాని వ్యత్యస్తపుభాగములుగా నుండకూడదు. నీమూట పెద్దదిగాను నామూట చిన్నదిగా నున్నది. నాకు పంచిపెట్టుమని యడిగిన వంధ్యాపుత్రుడు నేను నీకు పంచిపెట్టను అనెను. నేను జాస్తిగా ప్రోగుచేసుకున్నాను. నీవును ప్రోగుచేసుకోరాదా యనెను. దారువపురుషుడు పంచిపెట్టక విడుబోనివ్వననెను. అతనిమూట బట్టుకొనెను. ఆవంధ్యాపుత్రుడు కోపించి అతనిని బిడికిటం బొడచెను. దారువపురుషుడు రౌద్రాకారుడై అతని నోమ్ముమిూద గొట్టెను. అంత నా యిద్దరు హస్తములతో బోరాడి ఆ యుద్ధము జేయుమని యోచించి శశివిషాణములను నూడబెరికి వాటితో యుద్ధముజేయుచు దేహములు గాయములుపడి రక్తములు గారుచుండగ మిగుల దప్పిగొని దాహముతీర్చుకొనినపిదప మగుడి యుద్ధము జేయుదమని యోచించి యెండమావులను చూచి నీళ్ళని భావించి అత్యంతదాహముచేత దప్పిగొని వారిద్దరు పరుగు బారి బోవుచుండిరి. ఆ దారిలో గొప్పరజ్జుపుసర్పముండి ఆసర్పవిషమువ తల కెక్కినవారలై వెంటనే ప్రాణవియోగము నొందిరి. ఇట్లు జరిగిన దృష్టాంతమంతయు యుళ్ళక్కి యెట్లనిన — దత్తాత్రేయోపనిషత్ ॥ బహుధా శ్రుతయః ప్రవదంతితదావియదాదిమిదం మృగతోయసమం యదిచైకనిరంతర సర్వమిదం ఉపమేయమథో హ్యుపమాచకథం — ఇత్యాద్యుపనిషత్ ప్రమా

ణాబులు చెప్పుచున్నవి.

త్వం నీవు ఏకనిరంతర సర్వశివం కేవలుండును నిత్యుండును ప్రపంచ స్వరూపుండును మంగళస్వరూపుండును యగు పరమాత్మ భవశి యదిచ యగుదువేని తథా యెప్పుడు ఇదం ఈవియ నాదిః ఆకాశాది పంచమహాభూత మయమైన ప్రపంచకము. మృగతోయసమం యెండమావులలో నీళ్ళవలె తవ నీక భవతి యగుచున్నది. బహుధా పెక్కుతెరంగుల శృతయః వేదములు ప్రవదంతి చెప్పుచున్నవి. అట్లుండగ అంతహి అందువలననే తత్ ఆపరమాత్మ యొక్క ఉపమేయం మరివకవస్తువుతో సరిపోల్చుటకు తగినదనిగాని లేక వుపమాచ వుపమేయమునకు వుపమానమనిగాని తతో సమానమైన వస్తువు మరియొకటి కలదనిగాని నాస్తి లేదనిగాని కధం వదామి యెట్లు చెప్పుచున్నారు. ఇత్యాద్యుపనిషత్॥ ప్రమాణతః ఆకాశస్యగుణశబ్దో నిశ్శబ్దో బ్రహ్మముచ్యతే॥ నిశ్శబ్దాకాశముబోలిన యాకారముగల పరమాత్మనైన నీకు విషయసంబంధం యెట్లుకలుగుచున్నది. పరతత్వస్వరూపమైన పరమాత్మకు రూపం అరూపం విరూపం కలుగనేరదు. పరమార్ధ విచారమునందు కర్మకు కర్మమువల్లగలుగు శరీరవిచారము నాస్తి లేదు. శృతి॥ కర్మాభావే జన్మనాస్తి జన్మాభావే ఫలం నహి ఫలాభావే భయంకృత్వా భయాభావే నసంశయః॥ శృతులు చెప్పుచున్నవి. జీవబ్రహ్మైక్యజ్ఞానముగలవానికి కర్మను కర్మవలనగలుగు శరీరం నాస్తి కేవలం—శృతి। మూలాభావ ఇదంజ్ఞాతుం శరీరంనకినుష్ఠి॥

జ్ఞాతయనే వ్యవహారిక జీవుడు॥ శృతి॥ నజాయతె నమ్రియ్యతే యోజ్ఞాతయనె జీవుడు పుట్టనేలేదు లయముగాలేదు యోజ్ఞాతయనె ప్రజ్ఞాన స్వరూపమునకు ధర్మ॥ శృతి। మాతానాస్తి-పితానాస్తి నాస్తిబంధు సహోదరః అర్థం నాస్తి- గృహంనాస్తి॥ తల్లిలేదు తండ్రిలేదు బంధువులు లేరు. సహోదరులు లేరు ధనంలేదు యిల్లులేదు.॥శృతి॥ నిర్మాలమేతథాజ్ఞాన స్వరూపమును గుర్తెరుగుట గురుద్రోహము. కక్కినకూటికి యాసించి మరల స్వీకరించినట్లై తిరుగ పునరావృత్తికి కారణము. ॥శృతి॥ జన్మనాజాయతె కర్మం కర్మనాజాయతె జన్మం॥ గుర్తుయెరుగుట గురుద్రోహము. పునర్జన్మను దానివల్ల కర్మను పుట్టని చావనిది నీనిజస్వరూపము యోజ్ఞాతయనే ప్రజ్ఞానం అట్టిపరమాత్మయందు తనంతటతానే వచ్చి కొన్నిదినములుండి తనంతటతానే మటుమాయముగా బోవును॥ శృతి॥ జన్మాభావె కర్మంనాస్తి కర్మాభావె ఫలంనహి ఫలాభావె

భయంకృత్వా భయాభావే నసంశః॥ తన్ను తా దెలసుకొనిన ప్రజ్ఞానస్వరూప మైన జీవభ్రాంతి యనే కర్మరహితమె జన్మరహితం జన్మరహితమె ఫలరహితం ఫలంనాస్తే బ్రమయనే జీవభ్రాంతిరహితమె తత్ మోక్షమ్ పునరావృత్తి రహితమ్ తననిజస్వరూపమే కేవలాత్మ.తననిజస్వరూపమే పరబ్రహ్మమ్ పరమాత్మ పరిపూర్ణం సద్గురుకటాక్షమున తన్ను తా దెలసి జీవభ్రాంతిరహితమై జననమరణప్రవాహమనే మహాసముద్రము దాటి తననిజస్వరూపమందు నిర్వికల్పసమాధిపరుండై యుండె నంతయీ సర్వప్రపంచకము జీవజ్ఞప్తియనే చిత్తసంకల్పము యీ చిత్తసంకల్పమే॥ శృతి అనాత్మదృష్టే అవివేకినిద్రా అహం మను స్వప్నగంతింగతోహం॥ అనాత్మదృష్టిచేత తోచబడిన కలలోవచ్చిన శరీరములు మొదటనుండివచ్చెను. ఎచ్చటికిబోయెను. జీవభ్రాంతిచేత తోచెనేగాని నిజముగా రాలేను. నిజముగాబోలేదు. ఆహా ఇదియేమి ఆశ్చర్యము గానున్నది. ఈ మూలజ్ఞప్తియె ప్రజ్ఞానస్వరూపము జీవభ్రాంతి యెన్నివిధముల భ్రమింపజేయుచున్నది. ఈ మాయాశబలితబ్రహ్మమనె మాయావిద్యయనే అవ్యక్తమనె యొకను విచారించిన కొద్ది చిత్తసంకల్పమనె జీవభ్రాంతి విస్తరించుచున్నది. ఈ సర్వచరాచర ప్రపంచకము ప్రజ్ఞానస్వరూపమె. జీవభ్రాంతియనె మూలప్రకృతి జీవేశ్వరులు ఆత్మానాత్మలు చిదాకాశము చిత్తు, సర్వసాక్షి, ద్రష్ట, ఐక్యము యీమొదలయినవన్నియు సర్వధర్మాన్ పరిత్యజ్య అనుగీతావచనాత్ సర్వసంగపరిత్యాగమనె వైరాగ్యము తత్వమునకు మూరమైన అజ్ఞానప్రపంచ సంసారబంధమునుండి విడువబడిన జీవభ్రాంతి రహితమైనవాడైన జీవునకు జననమరణంబులును కలుగనేరవు. నీ నిజస్వరూపము కల్పనారహితమైన నిస్సంకల్పము నీ నిజస్వరూపమె కేవలాచలపరిపూర్ణ పరబ్రహ్మస్వరూపము.

నీ నిజస్వరూపము శాశ్వతము. నీ నిజస్వరూపము రెండవది కాదు. రెండవది లేదు. నిన్ను దర్శించిన తన్ను తా దెలసిన మహాత్ములకు జన్మరహితము. తన్ను తా దెలియుటు॥ శృతి॥ దత్తాత్రేయ వుపనిషత్ గురుశిష్యవివర్జిత సర్వసమం నహిజాగ్రసుషుప్తి తురీయపదం నహిపుణ్యపదం నహిపాపపదం ఛందోలక్షణ నహినహిసర్వం॥ ఇత్యాద్యుపనిషత్ ప్రమాణంబు లున్నవి. గురుశిష్యవివర్జితమైన నీ నిజస్వరూపం జాగ్రత స్వప్నసుషుప్తుల విలక్షణము నీ నిజస్వరూపం పుణ్యపదమ్ము, పాపపదము నాస్తి. ఛందస్సు నాస్తి లేదు తన

కన్నా అన్యములేని నీ నిజస్వరూపమె నిజగురుస్వరూపమైన కేవలపరబ్రహ్మము॥ శృతి॥ సర్వసారపూర్ణోపనిషత్॥ సర్వాతీతం సాంప్రదాయేనబోద్యాం సర్వవ్యాప్త సచ్చిదానందరహితం అంతర్బహిశ్చయోర్విద్వాన్ అచలఏవ నసంశయః సర్వదా భాతిపూర్ణం నిర్వ్యజనం నిరామయం నిర్ద్వేశరహితం॥ ఇత్యాద్యుపనిషత్ ప్రమాణంబు లున్నవి. నిజస్వరూపమైన పరమాత్మ సర్వప్రపంచమునకు అతీతమున్ను బ్రహ్మవిద్యాసాంప్రదాయకమైన బోధయున్ను సర్వప్రపంచముంతా వ్యాపించినట్టిన్ని సత్తు చిత్తు ఆనందములకు విలక్షణమైనట్టిదిన్ని లోపల వెలుపలా మధ్యను॥ అచలః॥ కదలనటువంటిది సంశయరహితమైనట్టిదిన్ని సర్వదా పరిపూర్ణముగ ప్రకాశించేటటువంటిదిన్ని ఆవరణరహితమైనట్టిన్ని వృద్ధేశ్యరహితమైనట్టి నీ నిజస్వరూపం॥ శృతి॥ అవధూతగీతాశాస్త్రము ఇంద్రజాల మిదంసర్వం యథామరుమరీచికః అఖండితమనాకారం వర్తతె కేవలం సివం॥ మరుమరీచిక - దూరమునందలి యెండమావులు, యథా - యెట్లో, తథా - ఆప్రకారమె ఇదం - ఈసర్వం సమస్తప్రపంచమును, ఇంద్రజాలం - జాలమువంటిది. పరమాత్మా - పరబ్రహ్మము, అఖండితం భిన్నముగానిదియు, అనాకారః ఆకారములేనిదియు, కేవలః, అద్వితీయుడును శ్శివః - నిత్యమంగళస్వరూపమైనదియె పరబ్రహ్మం సర్వభూతాత్మైక్య రూపకమగు నిష్కామకర్మబుద్ధియే మోక్షమునకు మూలమగును. దీనినే అధ్యాత్మ తత్వవివేక జ్ఞానముచేత తన్నుతా దెలియవలెను. తన్నుదా దెలిసినబ్రహ్మాత్మైక్యజ్ఞానముప్రాప్తమగును. ఎట్లు ప్రాప్తమగును. ఆత్మానాత్మ తత్వవివేక జ్ఞానమున ప్రాప్తమగును. ప్రతిమనుజుడు సర్వధర్మానుసారము ప్రాప్తములైన సర్వకర్తవ్యములు నామరణాంతము ఏవిధముగా జేయవలసినదియు నింత పర్యంతము అధ్యాత్మ తత్వదృష్టిచే విచారింపబడినది. ప్రతిపాద్యమైనవిషయము అంతమాత్రముచే పరిపూర్ణముగాదు. ఇందుకుకారణ మేమియనగ బ్రహ్మాత్మైక్యజ్ఞానమనునది ఏనిజమైనదియుంసత్యమైనదియు, సాధ్యమైనదియునయి ఆత్మయోగము దానివంటిపవిత్రమైనదియు మోక్షకారణమైనదియు మరియొక వస్తువు లేదను విషయము నిస్సంశయముగ నుండినను యింతవరకు చేసిన విచారణయు తద్వారా ఆత్మయోగమును సాధించు బుద్ధిని సంపాదించుకో జెప్పబడినమార్గము బుద్ధికి యగమ్యములగుటచేత ప్రతిమనుజుడు యెవ్విధమున యేమార్గమువల్లను తా దెలుసుకొనవలయును. భక్తిజ్ఞానయోగమువలన కర్మయోగమువలన మోక్ష

మార్గము దెలిసికొనవచ్చును.

మరియు బుద్ధితీవ్రతలేనివాడు యన్నివిధములచేతను మునిగిపోవును గదా యనే శంక సామాన్యజనులకు కలుగుచున్నది. ఈశంక యుక్తము గనే యున్నది. గొప్పగొప్పజ్ఞానులుసహితము అవ్యక్తనామరూపాత్మకము నగు మాయచే ఆరోపింపబడిన అమృతస్వరూపమగు పరబ్రహ్మమును వర్ణించుచు నేతినేతీతియనే మహావాక్యమును చెప్పి యూరకుందురేని పిదప మన వంటి సామాన్యులకది ఆయోగము నెట్లు తెలియును. కావున ఈబ్రహ్మజ్ఞానము మావంటి అల్పగ్రాహ్యకశక్తులమైనవారలకు సులభమార్గము కలదా యని యెవరయిన అడిగినను దోషమేమి. ఆత్మను ఆశ్చర్యముగా వర్ణించుచున్నారు. వినేవారు అనేకులుండినను అది యెవరికిని దెలియదని గీతలలో 2 అధ్యాయం. 29 శ్లోకం కఠోపనిషత్తులో 2 అ॥ 7 శ్లో॥ ఈవిషయమై శృతి॥ యందు ఒకవిధము గలదు. అదెట్లనగా మహానుభావ నాకు బ్రహ్మజ్ఞానము నుపదేశింపుమని భాస్కరుడనువాడు బాహుళ్యుడనువానిని అడుగగా యతడేమియు జెప్పక యూరకుండెను. ఇటుల నాలుగైదుమారులు యడిగినను నేమియు జెప్పక తుదకు ఓరి వెర్రివాడా నీప్రశ్నకు సమాధానము నేనింత వరకు నొకవిధముగ జెప్పుచునేయున్నాను. నీకది తెలియలేదు. నేనేమి చేయగలవాడను. బ్రహ్మస్వరూపము ఏవిధముగ జెప్పుటకును సాధ్యము కానేరదు.

మాట్లాడక కూర్చుండు యనునదియే బ్రహ్మకులక్షణమని యెరంగితివా? యని భాస్కరుని బాహుళ్యుడడిగెను. నోరుమూసుకొని చెప్పుటకు సాధ్యమగునదియు కనుదోయి మూసికొనినపిదప గనబడునదియు దెలియుట మానిన పిదప దెలియునదియు నని యిందలిసారాంశమున కేనకోయుపనిషత్ ॥౨ అ॥ ౧౧ శ్లో॥ దృశ్యశృష్టివిలక్షణము అనిర్వాచ్యమని అచింత్యము నగు నీపరబ్రహ్మమును సామాన్యబుద్ధిగల మనుష్యులు యెట్లు తెలుసుకొందురు గావున సద్గతియెట్లుకలుగును. సర్వభూతములయందును ఒక్కయాత్మయేయను పరబ్రహ్మస్వరూపముయొక్క యనుభవాత్మకము యదార్థమునగు జ్ఞానము గలిగి మనుష్యులెల్లవారికిని పూర్ణముగా యున్నస్థితి సంభవించుటకు తీవ్రమగు బుద్ధిదక్క మరియొక్కటిలేనియెడల ప్రపంచమునందున్న వేలకొలదిమనుష్యులు బ్రహ్మైక్యయోగమునుగురించి యూశనైన జెందక స్వస్థముగ కూర్చుండ

వలసివచ్చును. కారణమేమియనగ బుద్ధిమంతులగు మనుష్యులు కొద్దిమంది గనేయుందురు. ఆత్మానాత్మవివేకముగల బుద్ధిమంతుడు జెప్పినదానిపై విశ్వాసముంచిన బ్రహ్మప్రాప్తికారణమని గ్రహించుననుకొన్నను ఈ బ్రహ్మవిచారణయందు బుద్ధిమంతులలో ననేకులు మతభేదములు స్పష్టముగ గాన్పించుచున్నవి. ఇంతియేకాక విశ్వాసముంచినయెడల బ్రహ్మప్రాప్తికి కార్యము నెరవేరునని జెప్పుదుమేని ఈపరమరహస్యమైన బ్రహ్మజ్ఞానము సంపాదించుటకు శ్రద్ధయును విశ్వాసమును వహించుటయును బుద్ధికంటె వేరగు మరియొక మార్గమున్నదని ముత్తముపై ప్రాప్తమగును.

మరియు నిజముగవిచారించితిమేని శ్రద్ధలేనిది ఆత్మానాత్మవివేకములేనిది బ్రహ్మజ్ఞానమునకు పరిపూర్ణత్వము సంభవింపనేరదు. ఇదియునుంగాక బ్రహ్మజ్ఞానమంతయు నిశ్చలజ్ఞానముచేతనే ప్రాప్తమగును. దానికి మరియొక మనోవృత్తిసహాయ్య మక్కరలేదు. యనునీ విచారణే ప్రధానముగాగల శాస్త్రమునందే జన్మమును వృథాజేయుట తర్కబుద్ధిగల పండితులయొక్క వృథాభిమానమై యున్నదిగాబట్టి—॥ శ్రుతి॥ క్లేశోధికతరస్తేషాం అవ్యక్తాసక్తచేతసాం అవ్యక్తాహిగతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే॥ అనగా అవ్యక్తమునందు జిత్తమును నేకాగ్రముగజేయుట చాలాకష్టమగును. కారణమేమనగ దేహేంద్రియధారులైన మనుజులు నీయుక్తమగు గతిని బొందుట స్వభావముగ గష్టమగును యని యీసిద్ధాంతమే స్థిరమైనది. ఈప్రత్యేకమార్గమునే భక్తిమార్గమనుచున్నారు. బుద్ధిచేత పరబ్రహ్మముయొక్క స్వరూపమును నిశ్చయించినపిదప ఆపరబ్రహ్మముయొక్క అవ్యక్తస్వరూపమునందు విచారణమాత్రముచేత మనస్సును స్థిరపరచుకొనుట యొకానొక బుద్ధిమంతునకు సాధ్యమగును. ఎవరికిని సాధ్యముకాకపోదు. కాక ఈతీరుననే అవ్యక్తమునందు మనస్సునదుపుటచేత ఏకార్యమైనను నమ్మకముచేతను శ్రద్ధాభక్తులచేతను ప్రేమచేతమాత్రమే సిద్ధించును.

కావున నిజముగ విచారించినయెడల నిర్గుణబ్రహ్మోపాసనను భక్తిశ్రద్ధాపూర్వకముగా చేర్పవలయును. అయినను యీజ్ఞానయోగమార్గమునందు నిర్ణయింపబడిన బ్రహ్మస్వరూపమునందు మొదటినుండియు వ్యక్తమును జ్ఞానగమ్యమును ప్రధానమగుటచే నీక్రియ యోగమునకు అధ్యాత్మవిచారణ నిర్గుణోపాసన లేక కేవలోపాసన లేక జ్ఞానమార్గమనుట పరిపాటి. మరియు

యుపాశించు బ్రహ్మము సగుణమూ, నిర్గుణమూ సగుణబ్రహ్మోపాసనచేయు చు తద్వారా నిర్గుణోపాసనయగును. కావున యీరెండుమార్గములయందు ఒక్క పరమేశ్వరునియందే బొందదగినవాడు తుదకు యొక్కసామ్యబుద్ధియే మనస్సునందు బుట్టును గాన తమతమ యధికారానుసారము ఒక్కమేడమీద కెక్కుటకు నీరెండును యనాదిసిద్ధములు వేరైయున్న నిచ్చెనలుగ గనబడుచున్నవి. మార్గములు వేరగుటచే స్థానము వకటిగా స్పష్టముగ గనుపించును. ఐనను యీరెంటికి అధ్యాత్మయొక్క పేరే గీతలయందు చెప్పబడినది. భక్తివైరాగ్యములు నిష్ఠగాదు. జ్ఞానమనునదియే బ్రహ్మనిష్ఠయని చెప్పుదురు. కారణమేమనగ కడపటిదియైన బ్రహ్మాత్మైక్యస్థితియందు భక్తిజ్ఞానము వైరాగ్యముగాని యితరమైన యేయుపాసనలు యుండనేరవు. బ్రహ్మాత్మైక్యము యొక్క యపరోక్షానుభవమను విషయము నాజ్ఞానమే నిష్ఠ. కడపటిస్థితి కాగలదని సారాంశము.

సర్వభూతములందొక పరమేశ్వరుడేయని బ్రహ్మస్వరూపముయొక్క యదార్థము ననుభవాత్మకమయిన జ్ఞానము కలుగుటకు దేహేంద్రియధారులైన మనుజులకు ముక్తి కరతలామలకమై యుండును.

— గద్య. —

ఇతి శ్రీభీమాసిరంజన నిగమాగమగోచర గురువర కరుణాకటాక్ష వీక్షణాయత్త చిత్త చైతన్య జగజ్జేగీయమాన ప్రకర్ష తాత్త్వికత్వ సచ్చిదానందగుణగణాతీత వేదవేదాంగమంత్ర మార్గ శ్రీసద్గురు పాదుకాప్రణిహిత పక్షదక్ష త్వాశుద్ధనిర్గుణ నిజబోధపరాయణా పారీణ పారాయణాధురీణ అజగవ సూర్యనారాయణాఖ్య విరాజమానప్రభాసితప్రజ్ఞాప్రకర్షిత ప్రబోధితమై వేమారివంశపయఃపారావార రాకాసుధాకరస్య కౌండిన్యసగోత్ర వీరయభాగమాంబా గర్భకనిష్ఠజనిత హారితస గోత్రి పవిత్రి సౌభాగ్యవతి సామ్రాజ్యభోజ్య విద్యోపాసనా వరప్రసాద కవనకవిత సూర్యనారాయణ యోగినీ ప్రణీతంబగు శ్రీమహాఋషినిఘంటిత యోగశాస్త్రి బ్రహ్మవిద్యాయాం అవస్థా పంచకత్రిగుణగాయత్రి పిండోద్భత్తిప డాధార అధ్యాత్మసాంఖ్యయోగ శాస్త్రము సమాప్తము.



శ్రీగస్తు

# శ్రీ మహాఋషి నిఘంటిత యోగశాస్త్రము.



## తృతీయప్రకరణము



### వివేకయోగము.

—। సనత్కుమారుడు శివునకు వివేకయోగము బోధించుట. ।—

మత్స్యలోకమందు నిశ్చయమైన వివేకయోగము తెలియవలయును. ఆత్మకు వివేకజ్ఞానముకంటెను నిజగును ప్రకాశమును నధికమగు వస్తువులేదు. నిత్యమంగళ స్వస్వరూపమును అమృతస్వరూపమునగు దేహాత్మస్వరూపము మానవజన్మము అనంతకోటిజీవరాసులకంటె యెక్కువయినది. ధర్మశ్రుతి ఆహార నిద్రాభయమైథునాది సమానమేతత్ పశుభిర్నరాణాం। జ్ఞానం నరాణామధికోవిశేషః జ్ఞానేనహీనః పశుభిస్సమానః' ఇట్లు వశిష్ఠమందు వశిష్ఠులవారు శ్రీరాములవారి కుపదేశించిరి గావున వివేకజ్ఞానములేనివాడు ఆహారము, నిద్ర, భయము, మైథునము అనునవి పశువులకు మనుష్యులకు సమానమే. మనుష్యులకు జ్ఞానమే గొప్పవిశేషము. జ్ఞానముచే జ్ఞానహీనులయినవారు పశువులతో సమానులని హితోపదేశము. వివేకయోగమునంను చెప్పుచున్నది. జన్మమెత్తిన ప్రతిమనుష్యుడు వ్యవసాయముగాని వర్తకముగాని,

శృతి॥ ఏతద్యోవేత్తి॥

శృతి॥ కార్యోపాధి రయంజీవః॥ కారణోపాధి ఈశ్వరః॥

కార్యకారణతాంహిత్వా పూర్ణబోధోవశిష్యతే॥

ఉద్యోగముగాని మరిఏవిధమైన వృత్తిని గల్పించుకుని జీవించుటగలదు. ఇవి కార్యోపాధియైన జీవునియొక్క యుపాధిసాధనములు. కావున నివ్వ

తి మళ్లుపాటునుగూర్చి చింతించువా రరుదుగాయున్నారు. సంసారములో నుండియు కార్యోపాధియైన జీవుడు తత్సంబంధము లేక సుఖముగానుండు మహాత్ములు గలరు. అట్టివారి సహవాసమునుగూర్చి ప్రియత్నముచేసి నిత్య సుఖమును అనగ ఆత్మవివేకయోగానుభవముచు తా దెలియవలయును. కాల ము గడచిపోవుచున్నది. కార్యములు వ్యర్థమగుచున్నవి. ఆయువు క్షీణించు చున్నది. కాబట్టి కారణోపాధియైన ఈశ్వరుడు సర్వజగత్ కారణుడై యున్నా డుగాపున కార్య కారణములను గురించి అనగ ఆత్మ అనాత్మల వివేకజ్ఞానము శృతి॥ బ్రిహ్మసత్యం జగన్మిధ్య॥ యనే వేదప్రమాణమును బట్టి యీదేహి దేహములు అనగ జీవాత్మలు కార్యకారణము. ఆత్మానాత్మలు బ్రిహ్మజగ త్తులు యీరెంటియొక్క విచారణ సద్గురువివేకజ్ఞానముచే తా దెలియవ లయును.

శృతి॥ యఏవంవేత్తిహన్తారం॥
పరిక్రుత్తేక్రియమాణాస గుణైఃకర్మాణి సర్వశః॥
నాదం షికస్యచిత్పాపం దధాకాలాహినాగ్రిస్తో
లోకోభోగనశాశ్వతః॥

ఇట్లు అధ్యాత్మరామాయణమందు అయోధ్యాకాండమందు చెప్పబడి యున్నది. చతుర్థసర్గమునందు కాలము వ్యర్థముగా జరుపుకొనుట ధర్మము గాదనిన్ని ఏలననగా జరాయుజ మావివలన పుట్టిన మనుష్యాదులు అండజ గ్రుడ్డువలనపుట్టిన సాములు మొదలగునవి స్వేదజ చెమటవలనపుట్టినవి దో మలు మొదలగునవి ఉద్భిజ భూమివలనపుట్టినవి కొండలు మొదలగునవి యీ నాలుగువిధముల సృష్టికలదు. ఇందు మానవజన్మము దుర్లభము. కావున పూర్వజన్మకృతకర్మహేతుకములగు మనుష్యత్వము మోక్షేచ్ఛగలు గుటయు పరమార్థజ్ఞానులగువారి సేవయు నను నీ మూడును బహుకష్టసాధ్య ములు. దైవానుగ్రిహము లేక లభింపనేరవు. వివేకయోగచూడామణియను గ్రింథమందు కూడ యిట్టి జన్మము దుర్లభము అనియున్నది. ఏలనన,

ఏమనుష్యుడు వివేకజ్ఞానయోగము విచారణచేసి జీవించుచున్నాడో వాడే జీవించినట్లును వివేకయోగజ్ఞాన విచారణలేనివాడు మృగములు పక్షు లు, వృక్షములు వీటితో సమానముగ జీవించువాడగుచున్నాడు. వివేకయో

గచూడామణియను గ్రంథమునందు తన్నుతా తెలియనందున విచారించవలసివచ్చినది. కస్తూరిమృగము తననాభియందున్న కస్తూరివాసనను తాను గ్రహించలేక చల్లని వాయువ వీచునప్పుడు మెచ్చుట,

శృతి। నహిదేహా భృతాశక్యమ్॥ భగవద్గీత పదునెనిమిదవ అధ్యాయములోని ౧౧ వ శ్లోకం.

శృతి సమాసేనైవకౌన్తేయనిష్టాజ్ఞాస్యమాపరా। పదునెనిమిదవ అధ్యాయములో ౫౦ వ శ్లోకం.

యథారోదతి పుత్రార్థం తదాత్మార్థమయంజనః॥ నుండియో సువాసనవచ్చుచున్నదని దానిని దెలిసికొనుటకు పరుగిడి శ్రమజెందినట్లు తనయందుయున్న యాత్మపదార్థమును తా దెలియనేరక యెచ్చోటనో దేవుడు తనకన్యాన్యముగాయున్నాడని భ్రమించి శ్రమపొందుట కలదు. కావున అవిద్యోపాధికుడు జీవుడనియు మాయోపాధికుడు ఈశ్వరుడనియు యిట్టికార్యకారణ రూపమగు వుపాధిద్వయమును విడచినయెడల స్వానుభసిద్ధిగలుగుననియు నెరుంగనది గనుకనే భాష్యమందు ఈశ్వరునికి కర్తృత్వభోక్తృత్వము లు లేవని యుపదేశించినారు.

గోవత్సన్యాయంబున తల్లిపిల్లకోసము రోదనముచేయునట్లుల ఈజనులాత్మకై రోదనము జేయుచున్నారు. ఇట్లు వాశిష్ఠము దెలుపుచున్నది. తన్నుతా దెలియకుండుటవలన సంసారములో బడి క్రిందనుండి మీదికి మీదినుండి క్రిందకు తిరుగుచున్నది. ॥శృతి॥ మాసంసారాఘట్టస్య చింతాజ్యాం ఘటీభవ॥ కావున,

తాను ఊర్ధ్వలోకమునందు అధోలోకమునకును అధోలోకమునుండి పూర్ధ్వలోకమునకును ॥శృతి॥ ఊర్ధ్వాదధ స్వ దస్తస్చ పునరూర్ధ్వం వ్రజం స్థిరం॥ యీప్రకారముగ చిరకాలము తిరుగుచు సంసారమను ఘటీయంత్రము యొక్క చింతయను త్రాటియందు ఘటముగా నందుండు కుండవలె క్రిందికి మీదికి భ్రమింపకుండుమని శ్రీరామహృదయమందు చెప్పియున్నది గావున,

గీతాభాష్యే 15 వ అధ్యాయం, 15 శ్లోకము.

అజ్ఞానేనావృతం జ్ఞానం తేనముహ్యన్తిజన్తవః॥

13 వ అధ్యాయము 19 వ శ్లోకం.

ఇహైవ త్తైర్జితస్సర్గో యేషాంసామ్యేస్థితంమనః॥

పరమపురుషునికళ, బ్రహ్మకళ, తాను పూర్వముఖముగా యున్నంత వరకు బ్రహ్మముగానే యున్నాడు. అజ్ఞానావస్థచేత ఇచ్ఛామాత్రింబున అవ్యక్తమై స్త్రీజఠరగర్భమందు ఆవరణయందు జీవబిందు కళాస్వరూపముగ ప్రవేశించి తన్ను తా మరచి వ్యవహారికజీవుడై సర్వేంద్రియ సమన్వితమైన మనోబిందుస్వరూపమై—దేహోదేహాలయప్రోక్తో జీవోదేవసనాతనః॥ దేహికి దేహమే ఆలయం. ఇదే ఆవరణ. జీవుడు సనాతనమైనవాడు. ఆదిమధ్యాంతములు లేనివాడు. కావున తన్ను తా మరచి శ్లోకం॥ పునరపిజననంపునరపి మరణం, పునరపిజననీజఠరేశయనం, యిహసంసారె బహుదుస్తారే కృపయాపారే పాహిమురారే॥ అని భజగోవిందయోగమందు చెప్పియున్నది. కావున జీవుడు అజ్ఞానవశంబున బావియందు గిలకవలెను శింశుమారచక్రము అనగ కుమ్మరసానవలెను ఊర్ధ్వభివతుగా తెంపులేక మొదతెగక జాగ్రతావస్థలోనుంచి స్వప్నములోకి స్వప్నములోనుంచి సుషుప్తిలోకి సుషుప్తిలోనుంచి స్వప్నములోకి యీప్రకారము కులాలచక్రమువలె గిరగిరతిరుగుచురాకపోకలకు కారణమై తెంపులేక అనంతకోటిజన్మము లెత్తుచు చచ్చుచు వృద్ధిబొందుచు ఆసులో కండెవలె తిరిగి యిటు అటు తిరుగుచుండును.

శృతి॥ శ్రేయశ్చప్రేయశ్చ॥

శృతి॥ విద్యావిమానదపన్థానా॥

శృతి॥ ఇమాంద్వావేనపన్థానా॥

జీవుడు కార్యోపాధికుడై అవిద్యావశుడగుటచేత నిట్టి అనిత్యసంసారము సమకూడును. కావున అవిద్యయందు ప్రతిబింబించుటచేత ఈశ్వరచైతన్యమునకు జీవుడని పేరు. జీవుడు అజ్ఞానవశుడగుటచేత స్థూలశరీరము సూక్ష్మశరీరము కారణశరీరమనే తనువాసలచేత అనుభవించుచు సేవించుచు కేవలము మూషప్రకృతితో మెలగుచుండెను. కావున ఆదిమధ్యాంతరహితంబును జగత్కారణుండును నగు యే యాత్మగలదో ఆ యాత్మయే అవిద్యతోగూడి జీవుడని చెప్పబడుచున్నది. ఆజీవుడు అజ్ఞానమునకు లోబడి స్థూలశరీర సంబంధములయిన, అహం బ్రాహ్మణః॥ అని అహంకారమనుకారము మొదలగు వాసనలచేతను ఆయాస్థూలలసూక్ష్మభోగముల ననుభవించుచు ఆ యనుభవ

మును దలపోయుచు అమితములైన మోహాలతలతో నీ సంసారచక్రమునబడి కడగానలేక దిరుగుచుండును. జీవుడనగ నవిద్యయు, అవిద్యయందు ప్రతిబింబించిన చైతన్యమును నీరెంటికిని యాధారభూతమై ఆత్మచైతన్యమును గలిసి జీవుడనబడును. జీవునకు ఆనందమయకోశమని పేరు. భిన్నమైన యజ్ఞానకారణశరీరము సుషుప్తియను నవస్థయగును. ఈ కారణశరీరమే సుషుప్త్యవస్థయగును. ఈ కారణశరీరమందు సుషుప్త్యవస్థయందును అభిమానముగల జీవుడు ప్రాజ్ఞుడని చెప్పబడుచున్నాడు.

శృతి॥ అథతస్యభయంభవతి॥

శృతి॥ అవిద్యాయామన్తరేవర్తమానాః॥

శృతి॥ సత్సంగత్వే నిస్సంగత్వం, నిస్సంగత్వే నిర్మోహత్వం, నిర్మోహత్వే నిశ్చలతత్వం, నిశ్చలతత్వే జీవన్ముక్తిః॥

అనగ సత్పురుషుల సహవాసములచేత సంగరహితుడగును. అనగ సంగములు—శృతి॥ కళత్రం ధనం పుత్రపౌత్రాదిసర్వం గృహంబాంధవా తద్ధిమేతద్ధిజాతుం॥ ఈ మొదలయినవి యన్నియుగూడిన సంగమగును. ఇది యునుంగాక సంగమనగ అపంచీకృతభూతములవలన పుట్టిన సూక్ష్మశరీరము భోగసాధనమైనదిన్ని, ప్రాణాపాన, వ్యానోదాన సమానము లైదును నీవాయువులును, మనస్సు, బుద్ధియును, అంతరింద్రియములును, త్వక్కు, చక్షు, శ్రోత్ర జిహ్వా ఘ్రాణములను, జ్ఞానేంద్రియము లైదును వాక్కు, పాణి, పాద పాయువు, ఉపస్థములను కర్మేంద్రియము లైదును గలసి సూక్ష్మశరీరసంగము. ఇది జీవునకు భోగస్థానము. ఇట్టి శరీరముగలవాడై తైజసుడను నామముతో నొప్పుచున్నాడు. ఈ 17 తత్వసంగముతో నున్న నీసూక్ష్మదేహముతోనున్న గూడి లింగదేహసంగమము.

పంచబడిన పంచభూతములుగాను పృధివిజలము తేజస్సు వాయువు ఆకాశములను భూతములవలన బుట్టినదియు కర్మలోగూడిన శరీరము సుఖదుఃఖభోగములకు స్థానమని చెప్పబడుచున్నది. ఈభూతముల పంచీకర్ణణ పంపగ పుతమునందుగలదు. అదిచూడగనే స్థూలశరీరనిరూపణము చక్కగా బోధపడును. ఈస్థూలము జ్ఞానేంద్రియప్రపంచకము, కర్మేంద్రియప్రపంచకము, ప్రాణాదిపంచకము, శబ్దస్పర్శరూపరసగంధములయందును, మనస్సు, బుద్ధి, చిత్త, అహంకారజ్ఞాతయు కలిసి 25 తత్వములగును. ఇదియే స్థూలశరీ

రము. దీనియం దభిమానముకలజీవునకు విశ్వుడని పేరు. మలిన సత్వరజస్తమో గుణాత్మకమగు అవిద్యయే కారణశరీరము. ఇట్టి శరీ త్రియముతో గూడిన జీవుడు కించిదజ్ఞుడనియు అహంకార మమకార యుక్తుడగుచు భోక్తయనియు చెప్పబడియున్నాడు. స్థూలమునకు జాగ్రత సూక్ష్మమునకు స్వప్నము, కారణమునకు సుషుప్తియను నవస్థాత్రియమున జీవుడు కల్పించుకొని పుణ్యము పాపము మిశ్రిములను కర్మత్రియబద్ధుడగుచు పంచకోశముల నాకర్షించుకొని అనగా నన్నమయకోశము, స్థూలశరీరము ప్రాణములయిదును, కర్మేంద్రియము లయిదును కలిసి ప్రాణమయకోశము, జ్ఞానేంద్రియము లయిదును, మనస్సు, చిత్తము కలిసి మనోమయకోశము, శబ్దాదు లయిదును బుద్ధియు కలిసి విజ్ఞానమయకోశము. ఈ మూడుకోశములును సూక్ష్మశరీరము కారణశరీరము ఆనందమయకోశము.

కారణశరీర మెట్లనిన, ప్రియము - ఇష్టవస్తువును జూచుట, మోదము- అది లంభించుటవలన గలిగిన యానందము. ప్రమోదము—అది యనుభవించుటవలన గలుగు సుఖప్రవృత్తి. మోహామువలన గలుగుచున్నది. అనాద్యవిద్యాంధకారపటలము, ఆనందమయకోశము. ఇట్టి పంచకోశకల్పనము గావించుకొని త్వక్కు, చర్మము, మాంసము, రుధిరము, మేదస్సు, మజ్జ అస్థి యను సప్తావరణములతో గూడి ప్రవాహపతితకీటకమువలె సంసారసాగరమున బడి తీరంబుగానక సుఖదుఃఖము లనుభవించుచు జననమరణములం జెందుచుండును. కాన సద్గురుసేవయు, సత్సాంగత్యమును సంపాదించి నిత్యసుఖముగు బ్రహ్మానందమును పొంది —శృతి॥ సమ్యక్సరతీతిసంసారం॥ లెన్నగా ప్రవహించు సంసారసాగరమును దాటి యుండవలయును.

పై వ్రాసిన పంచవింశతితత్వములతో గూడినదియే సంగమము. సంగములు సర్వమునుగల్గి సంగిగాడు. నిస్సంగుడు అనగ సత్ శాశ్వతమైనది నశించనిది యైనదే సత్పదార్థం బ్రహ్మపదార్థం. అట్టి సత్పదమైన బ్రహ్మపదం

శృతి॥ త్వమేవంవిద్వానమృత ఇహాభవతి।

నాన్యఃపంథావిద్యతేయనాయ॥

శృతి। ఆనందబ్రహ్మణోవిద్వాన్॥

మునందు సత్సాంగత్వే నిస్సంగత్వం బ్రహ్మైక్యమునుబొందుట మహాత్ముల సాంగత్యముజేయుట అనిత్యమైన సంసారసాగరమునందు మునుగుచు తేలుచు

న్న అజ్ఞానుల సంగమముకూడదని ఆ సహవాసమువలన జన్మకారణమైన హేతువుకలుగునని చెప్పుచున్నారు. కావున యట్టి సంగరహితమైన సద్గురువుల సహవాసముచేసి సంగరహితుడు గావలయును. స్వయంతరతిపరాంతారయ॥ తానుతరించి యితరుల తరింపుజేయు మహాత్ముల సహవాసము సత్సాంగత్వే సత్సాంగత్యము నిస్సాంగత్యము వైరాగ్యము దృఢబడుటయును పరతత్వజ్ఞాన మార్జించుటయును త్రిపుటినిరసనమైనదియును సంసారపరిత్యాగమాచరేత్ సర్వసంగపరిత్యాగమైనదియు నైనది సత్ అసంగత నిస్సంగతం గావున నిత్సంగత్వే నిర్మోహత్వం నిర్మోహత్వే॥ పై చెప్పిన నిస్సంగత్వమువలన నిర్మోహం కలుగుచున్నది. ఎట్లనగ నిర్మోహమనగ కామమువలన గలిన మోహం. మోహమనగ కోరిక. కావున సమస్తకోరికలను వదలుట నిర్మోహం. ఇహలోక కోరికలు, పరలోక కోరికలను వదలుట. నిష్కాముడైయుండుట నిర్మోహత్వమువలన నిశ్చలతత్వం సమస్తకోరికలును యెప్పుడైతే వదలునో ఆ వెంటనే నిశ్చలం చలనరహితమైన అనగ యింద్రియవిషయములను నిగ్రహించుట. కావున నిశ్చలతత్వమనగ ఆత్మతత్వమును దెలియుట. నిశ్చలతత్వే జీవన్ముక్తి తాను తానైన తత్వమును తా దెలసిన జీవన్ముక్తికలుగును. జీవన్ముక్తి అనగ పంచకోశవ్యతిరిక్తుడును పంచదేహావివర్జితం॥ అవస్థాత్రివిలక్షణమై ప్రస్థానత్రిసాక్షియై ఉత్పత్తిస్థితిలయములకు సాక్షియై విశ్వతైజసప్రాజ్ఞులకు విరాట్టుస్వరూపమైయున్న తాను తానైన జీవుడు తన్ను తా దెలసిన జీవన్ముక్తియగును. కాబట్టి నిశ్చలతత్వమువలన బ్రతికియుండగనే ముక్తిగలుగును. ప్రకటముష్టివత్ ముక్తిః విడిన లక్షణం బంధం విడుచుట ముక్తి పిడికిడివిడుట. జీవన్ముక్తిః॥ అని శ్రీశంకరులవారు సత్ సాంగత్యమును గూర్చి చెప్పియున్నారు. దానివలన లాభ మెట్టిదనగ—

తొల్లి వాల్మీకమహాముని దారిబోవువారిని జంతువులను హింసజేయుచుండెను. ఇట్లు జేయుచు దారాపుత్రాదులను పోషించుచుండెను. ఇట్లుండగ అతనిపూర్వపుణ్యమువలన సమస్తమహాఋషులు వచ్చి యేమికారణమున నీవిట్టి జీవహింసయనే పాపపుకార్యములు చేయుచున్నావని యడుగగా అతడు నా కుటుంబజీవనార్థ మిట్టులజేయుచున్నానని చెప్పెను. అప్పుడామహాఋషులు నీవు చేయుపాపములు

శృతి॥ బ్రహ్మవేద బ్రహ్మైవభవతి॥

శృతి॥ అన్యోసావన్యోహమస్మీతిన సవేదయథా
వసుదేవం సదేవానా మాత్మవిద్యాస్సఇదం సర్వం॥
భవతియథాచర్మవత్॥

నీ ధనము దినుచున్న దారాపుత్రాదు లనుభవించెదరో లేరో అడిగి రమ్మనిన అతడు అట్లేయని యింటికిబోయి దారాపుత్రాదులతో నేను దెచ్చిన ధనము అనుభవించుచున్న మీరు నే జేయు కార్యములవల్ల సంభవించు పాపములను గూడ పంచుకొనెదరాయని యడుగగ వారు ॥శృతి॥ పాపం దత్త్వైవ తత్సర్వం వయంతు ఫలభాగినః॥ యిట్లు చెప్పిరి. పాపం నీదియనియు నీవు తెచ్చుధనము మాదియనియు చెప్పిరి. అదివిని అతడు వైరాగ్యము తిరిగి ఋషులయొద్దకు వచ్చి వందనము లాచరించి యీవృత్తాంతమంతయు జెప్పి తాను తరించుమార్గముపదేశించుమని ప్రార్థించెను. పిదప వారు ఉపదేశించి నరీతిగ అతడు ప్రవర్తించినందున పుణ్యశాలియై తపోశ్రేష్ఠుడై ప్రసిద్ధుడయ్యెను ఇదివరకు దుష్టబుద్ధిగలవాడై యున్నను పెద్దల సాంగత్యమువలన జీవన్ముక్తిమార్గము లభించును. మహాత్ముల సహవాసమువలన తి భక్తులుగలిగి మోక్షసామ్రాజ్యముగలుగును. సంసారమోచనమునకు జ్ఞానమే ప్రధానమై యున్నది. ఇట్టి వివేకయోగమువలన భక్తిజ్ఞానములు గలుగుచున్నవి. నాస్త్యత్ర తస్సాధనమస్తికించిత్॥ దీనికంటె నితరసాధనములేదు. ధ్యాత్మరామాయణం బాలకాండమందు చెప్పియున్నది. మోక్షసాధనమునకు పైన చెప్పిన సత్సాంగత్యమునే భక్తియే ముఖ్యమైనది. కావున సత్స్వరూపమైనదే భక్తియని చెప్పుచున్నారు. ఇది ఏకాంతభక్తియని పూర్వు లిట్లు చెప్పుచున్నారు.

గురుపాదోదకము అవిద్యామూలనాశనముకొరకును జన్మకర్మనివృత్తి కొరకును జ్ఞానవైరాగ్యసిద్ధికొరకును అట్టి సత్సహవాసమువలనను శ్రీమహాఋషుల మహాప్రసాదమువలనను అహంకారము నశించును అహంకారమువలననే అవిద్యావశుడగుచున్నాడు. తరువాత అభిమానము విడుచును. అభిమానమున్నంతవరకే దేహాత్మభ్రాంతి. అదిక్షీణించగానే ఆత్మజ్ఞానము లభించును. ఈ వివేకయోగజ్ఞానముచేత సద్గురుసాంగత్యముచేసి అట్టి గురువుచేత నుపదేశింపబడు దీక్షాత్రియవిధానం బెట్టిదనిన, దృగ్దీక్ష॥ మత్స్యకిశోరన్యాయము. స్పర్శదీక్ష॥ కుక్కుటకిశోరన్యాయము. ధ్యానదీక్ష॥ కూర్మకిశోరన్యాయము. ఇట్టి దీక్షాత్రియములును మర్కటకిశోరన్యాయము. పాదదీక్షయు॥

మార్జాలకిశోరన్యాయము. హస్తదీక్షయు॥ భ్రమరకీటన్యాయము. గురుదీక్షయు॥ గోవత్సన్యాయము. మంత్రదీక్షయు॥ ఈ నాలుగుదీక్షలు పై వ్రాసిన మూడుదీక్షలు, యీ యేడుదీక్షలున్ను సద్గురుసాన్నిధ్యమువలన నుంచి అజపా గాయత్రివిధానమును మంత్ర మంత్రార్థ మంత్రానుభవములును గురునివలన దెలసి తనుమనఃప్రాణములు గురున కర్పించి బ్రహ్మార్పణముజేయుచు లింగదేహభంగముగాయించి అస్తమస్తకయోగమును చక్కగ గ్రహించి గురూపదిష్ట మంత్ర మంత్రార్థములను దెలసి ద్వైతభ్రాంతి విడచి దగ్ధబీజమువలె నుండువాడు ధన్యుడగును.

శ్రుతి॥ సఏష నేతి నేత్యాత్మా॥ బృహదారణ్యకోపనిషది
అ 6, బ్రా 4, వా 22॥
శ్రుతి॥ అస్థూలమవణు॥ బృహదారణ్యకోపనిషది॥
అ 5, బ్రా 8, వాక్యం॥
శ్రుతి॥ యతోవాచోనివర్తంతే॥

అగ్నిదగ్ధం యథాబీజం శాఖాపల్లవవర్జితం జ్ఞానదగ్ధం తథాయోగి పునర్జన్మనవిద్యతే॥ నేతీతిమహావాక్యములచేత తీసివేయగా మిగిలిన బ్రహ్మపదార్థం వాక్కుచేతను మనస్సుచేతను యిట్టిదని నిర్దేశింపరానిది గావున దగ్ధబీజవతుగానుండు బ్రహ్మజ్ఞాని ధన్యుడగును. కావున పైనజెప్పిన హంశము మిక్కిలి గోప్యము. జ్ఞానభక్తివివేకముగలవారలకు మహానుభావులుపదేశించిరి. కావున ఎంతపర్యంతము దేహము, మనసు, బుద్ధ్యాదులయం దభిమానముకలవాడో అంతపర్యంతము కర్తృత్వ, భోక్తృత్వములు, సుఖదుఃఖాదులు పొందినవాడగును. నేను దేహమనెడి యేబుద్ధిగలదో అది అవిద్యయని చెప్పబడుచున్నది. నేను దేహముగాను చిన్మయానందుడనుబుద్ధి విద్యయనబడును. కావున వివేకయోగము విమర్శించుటచే మోక్షము సిద్ధించుచున్నది.

శ్రుతి॥ అచ్ఛేద్యోయమదాహ్యోయ మక్లేద్యోయ శోష్యఏవచ నిత్యంసర్వగతస్థాణురచలోయసనాతనః॥ సనాతనమైన యీబ్రహ్మము ఛేదింపబడదు. దహింపబడదు. ఎండింపబడదు. నిత్యుడు అంతటనున్నవాడు చలనములేనివాడు సనాతనుడు యని తెలియవలెను అదియే ప్రకాశించుచున్నది. బ్రహ్మ మన్నిటికంటెను ప్రియమనుటకు ఒక చిన్నకథకలదు.

ఒకడు నది దాటుటకు ప్రయత్నించుచుండగ ప్రవాహ మధికముగా నుండును. తనవెంట దారాపుత్రధనాదులుండెను. ప్రవాహములో కొంతదూరమువరకు వెళ్ళియుండగ జల మధికమగుచుండెను. వారితో నదిని దాటబోవుచు తనను రక్షించుకొనుటకుగాను పుత్రునిపట్టుకొనినచో తనకున్న శ్రమ గలుగునని నదిలో పుత్రుని విడచెను. ఇంకను ప్రవాహ మధికమాయెను. అప్పుడు తనవద్దనున్న ధనమును విడచెను. ప్రవాహ మింకను మిక్కుటమాయెను. తనహస్తమును బట్టుకొనివచ్చెడి భార్యనుకూడ విడచెను. తీరమును జెందెను. శ్రుతి॥ అతతి తద్వస్తురూపేణవ్యాప్నోతీత్యాత్మా॥ యను శ్రుతి ఇట్లు చెప్పుచున్నది. వ్యాపన సర్వవస్తురూపముచే వ్యాపించియున్నది గనుక గన్పడు సమస్తమును పరమాత్మయనబడును. నామరూపములు కల్పితములు. అందువలననే అనామధేయుడని యందురు. వ్యవహారార్థమై నామముంచబడుచుండును పరమార్థతత్వముచే నాలోచించిన యెడల నామములేదు పేరు యూరులేదందురు. ఇవి యన్నియు కల్పితములు. ఇదిగాక నీపేరు యెవరని యడుగగా నాపేరు యుళ్ళక్కియని యనెదరు లేక స్వామి యనెదరు యని జవాబు చెప్పుచున్నారు. తనకు పేరులేనివాడు గావున పేరు చెప్పుటెట్లు ? స్వామి యనెదరు అనుటచే కల్పితమని దెలియవలయును. రూపుమాపుయనుటగలదు. ఆత్మకు రూపులేదు. ఆత్మయేనీవు. రూపుమాపుము. అహంభావము నశింపుజేయుము. అప్పుడుకర్తృత్వముండదు. ఆత్మయే యుండునని బల్కును గావున—

శ్రుతి॥ అన్యదేవతద్విదితాదథోదవిదితాదధ॥ అని కేనోపనిషత్॥ ప్రథమఖండమందు మూడవవాక్యము మొదలగు శ్రుతులచేత దెలియబడునవియు

శ్రుతి॥ నిష్కళం నిష్క్రియంశాంతం॥ నజాయతె నమ్రియ్యతెవాకదాచిన్నాయంభూత్వాభవితా వానభూయః॥ అజోనిత్యంశాశ్వతోయం పురాణో నహన్యతే హన్యమానే శరీరే॥

పరమాత్మ పుట్టుచుండువాడుగాడు చచ్చుచుండువాడుగాదు. జనులందరు అనుభవించు జననమరణములు పరమాత్మకంటవు. ఆత్మపుట్టుక లేకలేనివాడుగాడు. పుట్టనివాడుగాడు. నాశనములేనివాడు స్థిరుడు. ఎప్పుడు యపూర్వవస్తువువలెనే యనుభవించదగినవాడు. దేహము హతమగుగాని పరమాత్మ హతముగాదు. స్త్రీవాచకనామమునకు ఆత్మయనుటకు బ్రహ్మము స్త్రీ, పురుష

నపుంసకాదిభేదములు వానికేగాని ఆత్మకులేవు. ఆత్మలోను బైటను సమస్త పదార్థములయందు ప్రకాశించుచున్నాడు. కావున ఆత్మ స్త్రీ కాదు. పురుషుడు గాడు. నపుంసకుగాదు. ఇందుకు శృతి. నైవస్త్రీ నపుమానేషనచైవాయం నపుంసకః॥ యద్యచ్ఛరీరమాదత్తే తేన తేనసయుజ్యతే॥ ఇట్లుండగ పరబ్రహ్మము ఇంద్రియముల కగోచరమైనది వర్ణములేనిది గోత్రములేనిది జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు అంతఃకరణములేనిది గ్రహింపరానిది గాబట్టి—మైత్రేయోపనిషత్తు॥ దగ్ధబీజమునుగురించి అనగ తాను తానైన పరబ్రహ్మమును నుద్దేశించి చెప్పుచున్నది.

శృతి। అపాణిపాదోజవనోగ్రహీతాపశ్యత్యచక్షుస్సశృణోత్యకర్ణః॥

శృతి॥ అన్తోర్మణిమవిన్దల్॥

శృతి॥ అపాణిపాదః॥

శృతి। బ్రహ్మైవాహం సర్వవేదాంతవేద్యం నాహం వేద్యం వ్యోమవాతాదిరూపం రూపంనాహం నామసాహంనర్మ బ్రహ్మైవాహం సచ్చిదానందరూపం॥ ఇత్యాద్యుపనిషత్తులు చెప్పుచున్నవి.

వేదవేదాంతవేద్యమైన బ్రహ్మము నేను తెలియబడు ఆకాశవాయువాదులుగాను రూపనామములుగాను కర్మయునుగాను సచ్చిదానందబ్రహ్మమే నేనని తా తెలియవలయును. ఇది సర్వసారోపనిషత్తులో యున్నది. పామరులవలె బహిర్దృష్టితో నుండక అంతరదృష్టిచేత చూడవలయును. శృతి॥ అంతరదృష్టిచేతను తాను నిత్యము జూచుచుండవలయును. తనలో ననగ ఆత్మలో తన దేహాత్మలో తను దా జూచుట అంతరదృష్టి. ఈ అంతరదృష్టిచేత తాను బ్రహ్మమని బ్రహ్మము తా నని తెలియబడును. ఇదే స్వస్వరూపసందర్శనము యనిన్ని స్వస్వరూపావలోకన యనిన్ని ఆత్మావలోకన యనిన్ని తెలియవలెను గావున తన్ను దా తెలియుటే మోక్షము. మోక్షముకొరకు యితరమార్గము లేదు. శృతి॥ భిద్యంతేహృదయగ్రంథ శ్ఛిద్యంతే సర్వసంశయాః॥ క్షీయంతే చాస్యకర్మాణి తస్మిన్ దృష్టేపరావరే॥

శృతి॥ ఆత్మైవా ఇదంసర్వం॥

శృతి॥ బ్రహ్మైవాఇదగ్ంసర్వమ్॥

శృతి॥ తదేజతితన్నైజతితద్దూరేతద్వన్తికే తదన్తరస్య సర్వస్య తదుసర్వస్యాస్యబాహ్యతః॥

శృతి॥ ఏవణమ్। అ 4॥ శ్లోకం॥ 19॥
శృతి॥ శారీరం కేవలమ్ కర్మకుర్వన్॥ అ॥ 4 శ్లోకం॥ 21॥
శృతి॥ యదృచ్ఛాలాభసంతుష్టః॥ అ॥ 4 శ్లో 22॥
శృతి॥ బ్రహ్మార్పణం బ్రహ్మహవిః అ॥ 4 శ్లోకం॥ 24॥
శృతి॥ కర్మజాన్విధితాన్ సర్వాన్॥ అ॥ 4 శ్లోకం 32॥
శృతి॥ సర్వకర్మాఖిలం బ్రహ్మ॥ అ॥ 4 శ్లోకం 33॥
శృతి॥ జ్ఞానాగ్ని సర్వకర్మాణి॥ అ॥ 4 శ్లోకం 33।
శృతి॥ యోగసన్న్యస్తకర్మాణమ్। 4 అ॥ శ్లోకం 41 అనువరకు గల శ్లోకములచేత శ్రీకృష్ణస్వామి సర్వసన్యాసమును నుపదేశించెను.

తాను నిష్కామకర్మజేయుచు సర్వం ఆత్మమయమనిన్ని ఈసర్వము బ్రహ్మమయమనిన్ని దేహం కర్మవలననే కూడియున్నది గావున సర్వం బ్రహ్మార్పణముగా నిష్కాముడైనవాడు సర్వం కర్మంగాకూడినదే జ్ఞానాగ్ని దగ్ధకర్మాణి॥ కామ్యకర్మములు దహించును. జ్ఞానాగ్నిచేత సర్వకర్మలు దహించి యెరిగి పునర్జన్మం నవిద్యతే॥ పునర్జన్మ లేదు గావున పరమాత్మనిజూడగానే హృదయగ్రంథి భేదించబడును. సమస్తసంశయములు నశించును. సమస్తకర్మములు క్షీణించును. బాల్యము నమున్నప్పుడు తల్లిగారు నీకిందయంశమును నుపదేశించుచున్నారు. ఉయ్యాలయూచుచు ఈడోలాయంత్రమువలె క్రిందికి మీదికి ఊర్ధ్వలోకమునుండి యధోలోకమునకు సనత్కుమారుడు శిష్యునకు నసత్నాసల్ అధోలోకమునుండి యూర్ధ్వలోకమునకు వెళ్లుచున్నారు. హాయి హాయి లులు లులు, హాయి హాయి, హులక్కి హులక్కి, హాయి యని ఇది అబద్ధము. యీ ప్రపంచమబద్ధము, దేహ మనిత్యము. నీవు నిజమును దెలుసుకుని హాయినిజెందుము. సుఖముపొందుమని పాడిన పాటయగును. బాల్యమగుటవలన గ్రహించు తెలివి అప్పుడుండదు. కావున యిప్పుడు తెలివివచ్చినతరువాత తా తెలియవలెను. కావున నీరూపమె ప్రతిరూపము ప్రతిబింబము సుమా. ఈశ్వరుడు మాయచేత అనేకవిధములుగా జేసెను. ఆరూపమే నీరూపమని తెలియవలెను. అదేయుక్తము. ఉపనయనమున తండ్రిగారు బ్రహ్మోపదేశము జేసెను. అదియు మరుగుపడెను గావున కనుము. ఉపనయనమనగ సమీపనేత్రము అనగ మనోనేత్రము. జ్ఞానదృష్టియని దెలియుము. తండ్రియగును గావున లోన సమస్తమైన ఆశలు వదలి వైరా

గ్యవంతుడవగు వాసనారహితుడవై లోకమునందు పైకి సమస్తకృత్యములు చేయుచుండును. ఆత్మనిరాకారుండగుటవలన శూన్యంబనియును ఉపాదాన కారణమగుటవలన ప్రకృతియనియును విక్షేపహేతువగుటవలన మాయ యనియును బృహద్రూపుడగుటవలన బ్రహ్మమనియును.

గీతాభాష్యే॥ అ 5 ॥ శ్లోకం 3॥ తయోస్తు కర్మసన్యాసాత్కర్మ యోగోవిశిష్యతే॥ అవినాశితుతద్విద్ధి॥ అ 2॥ శ్లోకం॥ 16;

యఏనం వేత్తిహన్తారం॥ అ 2॥ శ్లోకం 16॥

వేదావినాశినం నిత్యం॥ అ 2 శ్లోకం 21॥

యీ మొదలగు శ్లోకములయందాత్మ వేత్తకు కర్మములతో బనిలేదు యని చెప్పబడియున్నది.

సర్వధర్మమపిచావేక్ష్య॥ అ 2॥ శ్లోకం 31॥

తస్మాద్యుధ్యస్వభారత॥ అ 2॥ శ్లోకం 18॥

కర్మణ్యేవాధికారస్తే॥ అ 2॥ శ్లోకం 47॥

అని గీతాభాష్యమందు చెప్పబడియున్నది గాపున ఆత్మవేత్తకు గర్మ యోగము లేదని యెట్లు చెప్పవచ్చును.

జ్ఞానయోగ నసంఖ్యానాం॥

తస్యకార్యం నవిద్యతే॥

కర్మణామనారమ్భాత్.

సన్యాసస్తు మహాబాహోదుఃఖ మాప్తుమయోగతః॥

యోగారూఢస్యతస్యైవశమః కారణముచ్యతే॥

నైవకించిత్కరోమీతియుక్తోమన్యేతతత్వవిత్॥

జ్యాయసీ చేత్కర్మణః॥

యచ్ఛ్రేయ ఏతయోరేకంతన్మే బ్రూహి॥

కాలాత్ సిద్ధింసమధిగచ్ఛతి॥

విజ్ఞానరూపుండగుటవలన విజ్ఞానమయమనియును కళ్యాణశీలుండగుట వలన శివుడనియును పూర్ణరూపుండగుటవలన పురుషుడనియును నియామకుం డగుటవలన నిశానుండనియు చెప్పబడుచున్నాడు. ఇట్టి బ్రహ్మస్వరూపమును యెవరు దెలిసికొనినను తరింతురు. అయితే స్త్రీలు దెలుసుకొనెదరా? తెలుసు కొనినచో దరించెదరా? యట్టి యధికారము వారికి గలదాయని యనెదరే

మో వినుడు. శృతి॥ స్త్రియస్సతీతా ఉమేపుంస ఆహుః" పశ్యదక్షణ్వా న్నవిచేతదంధః॥ యని గురూపదేశప్రకారము సత్పదార్థమును విచారణ చేసిన స్త్రీలు పురుషులని చెప్పబడుచున్నారు అటుల సత్పదార్థమును జూచువారె నేత్రములుగలవారు, లేనిచో నేత్రములున్నను గుడ్డివారగుదు యనిభావము. ఇట్టి ఆత్మను తెలియనివాడు గావున తనబుద్ధిచేత విచారించినమాత్రమున సాధ్యంబును సమస్త సకలాపత్తులును కలదియు నగు నీమోక్షవస్తువునందు యెవ్వడు మోహనశంబున ప్రివర్తింపడో ఆనరాధముడునిందార్హుడగును గనుక జన్మమెత్తిన నరుడు ఉచితమగు తత్వనిష్ఠబొందుటకు చింతనమగు సంసక్తిచే గలుగుచున్న దుఃఖములను రత్నముల కాటపట్టగు సంసార సముద్రమును దాటదలంచిన పురుషునకు నేనే యనెడు యీ జగమెట్లుగలిగినది పరమాత్మ యెవరు భోగములందో నేమిలాభమనెడు విచారము మోక్షమునకు అపాయమగుచున్నది. ఇటువంటువారికి భేదముండదు.

జ్ఞాని యాశలేనివాడు. నిగ్రహింపబడిన మనస్సుగలవాడు. విడువబడిన మమతగలవాడు. శరీరముండువరకుండు కర్మమును చేయుచున్నవాడు. సంసారబంధరూపమగు పాపకర్మను బొందడు. తనంతట ప్రాప్తించినదానికి తృప్తినొందినవాడును సుఖదుఃఖాదులకు లోబడనివాడును మత్సరములేనివాడును ప్రాప్తియందు అప్రాప్తియందును సమచిత్తుడునైన పురుషుడు కర్మముల జేసినను సంసారబాధమును బొందడు. ఇట్టికర్మల నాచరించును. ముందువ్రాయుచున్న గీతభాష్యమునందు వ్రాయుచున్నవి. గావున వానియభిప్రాయమును చెప్పుచున్నారు గావున యిట్టికర్మల నాచరించును. కాన కామ్యాది కర్మలను విడచి శరీరయాత్రనడచుచు కర్మలను జేయవలయును. కావున నాకిది కావలెననే వాంఛ లేదు. నేను ఇది విడచెదననెవాంఛగూడా లేదు. ఏదిరానున్నదో అది రానిమ్ము. ఏదిబోవుచున్నదో దానిని బోనిమ్ము. భోగవశుడైనను దృఢముండవలయును. ఏది యెటుల కాదలచినదో అటుల కానిమ్ము. కావున దుఃఖపడుటచేత కార్యము లేదు. దేహమునకెయ్యది వచ్చునో యది వచ్చుగాక. యాత్మ కవి యంటవు. నేను యాత్మస్వరూపుడనను నిశ్చయముతోనుండు భ్రాంతిని విడువవలెను.

సంతోషితాః! మంత్రారాధన తత్పరేణ మనసానీతా శ్వశానేనిశాః॥ ప్రాప్తగకాణవరాటకోపి సముద్యూతాతృష్ణె సకామభవ!

శృతి॥ యింద్రియేభ్యః పరాహ్యర్థాః॥

శృతివాక్యము॥ క్లమోనవాచశ్శిరసోనశూలం చిత్తతాపోనశూలం న చిత్తతాపోనతనోర్వ్యమర్దః

శృతి॥ నచాపిహింసాది రనర్థయోగః శ్లాఘ్యాపరంకోపిధజయేమామేకా॥

శృతి॥ దేహోదేవాలయప్రోక్తో జీవోదేవసనాతనాతనః॥ త్యజేదజ్ఞాన నిర్మాల్యం సోహంభావేన పూజయేత్॥

శృతి॥ యజ్ఞాద్యా వర్ణధర్మోచితమపినియతం కర్మశర్మప్రదంస్యాన్న త్యాజ్యా కార్యమేతద్విగుణమపియతో కర్మణః కర్మశస్మ జీవన్ముక్తః కదాచిత్కరచరణ యుతో నైవతిష్ఠత్యకర్మాతస్మాచ్ఛ్రేయాన్ సధర్మోయను కతిగదితాశాస్త్రసు త్యైతృతీయే॥ ఇత్యాదిశృతులు చెప్పుచున్నవి బంధముగాని, మోక్షముగాని, భేదముగాని, యభేదముగాని ద్వద్దియును లేదు. జ్ఞానసారాంశమగు బ్రహ్మమేగలదు గాబట్టి జలముయొక్కటియే ననేకములగు తరంగములు గాబట్టి రూపముతో ప్రకాశించునట్లు చిత్తుయొక్కటియే నానారూపంబుల ప్రకాశించుచున్నది. ఇంతియేకాని దృశ్యము కొంచెమైనను లేదు. అట్లుగావున నీవు బాధమోక్షకల్పనను దూరముగ విడచి సంసారభయరహితుండవగుము. బ్రహ్మమే సారాంశముగాగలవాడవై స్వస్థతగలవాడవగుము. కావున ప్రారబ్ధమనుభవించవలెను. తత్త్వవిచారణచే సంచితమునసించును. ఆగామి రెండువిధములగు కర్మయు జ్ఞానిని భూషించువారికి పుణ్యము. దూషించువారికి పాపముయగును. కాన జ్ఞానికి యాగామిసంచితములు లేవు. ఇదిగాక ద్వైతభ్రాంతిలేని ఈబ్రహ్మవేత్త రోగములేక కూర్చుండి ప్రాణములువిడిచినను వ్యాధిపీడితుడై భూమియందు పొర్లాడుచు ప్రాణములువిడిచినను మూర్ఛపొంది ప్రాణములువిడిచినను అతనికి సర్వవిధములచేతను భ్రాంతిలేదని తెలియుము. ఇట్లు పంచదశయందు చెప్పబడియున్నది. కావున ఆద్యంతవర్జితంబును దృశ్యప్రపంచ స్పర్శరహితంబును కల్పాంతములయందు శేషించునదియు నగు బ్రహ్మంబేగలదని తాదెలియవలయును.

స మా ప్త ము.



శ్రీరస్తు

# శ్రీ మహా ఋషి నిఘంటి కే యోగ శాస్త్రము.



## దివ్యజ్ఞాన యోగము.



—। నారదమహాఋషి పుండరీకునకు దివ్యజ్ఞానయోగము బోధించుట. ।—

ఈ దివ్యజ్ఞానయోగము, శాస్త్రానుభవదివ్యజ్ఞానయోగముచే తెలియవలెను. ఎట్లన, బోపనిషదితి॥ నిత్యశుద్ధం నిరాభాసం నిరాకారం నిరంజనం, నిత్యబోధంచిదానందం, గురుబ్రహ్మం నమామ్యహం॥

భావార్థం. నిత్యశుద్ధం — ఎల్లప్పుడు పరిశుద్ధుడును,
నిరాభాసం — దూషణ లేనివాడును,
నిరంజనం — పాపము లేనివాడును,
నిత్యబోధం — ఎల్లప్పుడు బోధస్వరూపుడును,
చిదానందం — జ్ఞానానందస్వరూపుడును నగు,
గురుం — గురువు అనెడి బ్రహ్మ పరమాత్మనుగూర్చి,
అహం — నేను, నమామి — నమస్కరించుచున్నాను.

భావార్థం — నిత్యశుద్ధుండును, నిరాభాసుండును, నిరాకారుండును, నిరంజనుండును, యెల్లప్పుడు బోధస్వరూపుండును, జ్ఞానానందస్వరూపుండును నగు గురువునకు నమస్కరించుచున్నాను.

సర్వసారపూర్ణోహమితి॥ సకలభువనసృష్టిః, కల్పితాశేషసృష్టిః, ని, లనిగమదృష్టిః, సత్పదార్థైకసృష్టిః, అతగుణపరమేష్టి, సత్పదార్థైకదృష్టిః. భవగుణపరమేష్టిః మోక్షమార్గైకదృష్టిః, సకలభువనభంగస్థాపనాస్తంభయష్టిః, సకలరుచిరసవృష్టి స్తత్త్వమాలాసమష్టిః, సకలసమయసృష్టి సచ్చిదానందసృష్టిః, నివసతుమయినిత్యం శ్రీగురోర్దివ్యదృష్టిః॥

భావార్థం. సకః-సృష్టిః- సకల—సమస్తములైన, భువన—లోక ములను, సృష్టిః—సృజియించునదియును, కల్పిత-సృష్టిః-కల్పిత—రచింపబడిన, అశేష—సమస్తమును, సృష్టిః—సృజించునదియును, నిఖిలదృష్టిః-నిఖిల — సమస్తములగు, నిగమ—వేదములను, దృష్టిః—చూచునదియును సత్ప- సృష్టిః-సత్—శ్రేష్ఠములయిన, పదార్థ—వస్తువులను, ఏక—ముఖ్యముగ, సృష్టిః సత్—శ్రేష్ఠములయిన, పదార్థ—వస్తువులను, ఏక—ముఖ్యముగ, సృష్టిః—సృజించునదియును, అధగణపరమేష్టి-అధ—సాకల్యములగు, గణ—ప్రమథగణములకు, పరమేష్టిః—సృష్టికర్తయైనదియును, సత్ప- దృష్టిః-సత్—శ్రేష్ఠమైన, పదార్థ—పరమార్థవస్తువునందు, ఏక—ముఖ్యమైన, దృష్టిః—చూపుగలదియును, భవగుణపరమేష్టిః భవ॥ ఈశ్వరుని యొక్క గుణ—గుణములకు, పరమేష్టి—సృష్టికర్తయైనదియును, మోక్షమార్గైకదృష్టిః॥ మోక్ష—ముక్తియొక్క, మార్గ—దారియందు, ఏక—ముఖ్యమైన, దృష్టిః—చూపుకలదియును, సక- యష్టిః- సకల— సమస్తములైన, భువన— లోకములయొక్క, భంగ—నాశము, స్థాపన—నిలుపుటకు, స్తంభయష్టిః॥ స్తంభ—స్తంభరూపమయిన కొయ్యయైనదియును, సకరుణావృష్టిః—దయారసముతోఁగూడుకొనిన వర్షముగలదియును, తత్వమాలాసమిష్టిః॥ తత్వ పరమాత్మస్వరూపములగు, మాలా—పూలదండయొక్క, సమిష్టిః—సమూహముగలదియును, సకలసమయవృష్టిః॥ సకల—సమస్తములయిన, సమయ-ఆచారములను, సృష్టిః—సృజించునదియును, సచ్చిదానంద దృష్టిః॥ సత్-పరమాత్మయొక్క, చిత్—జ్ఞానమువల్లనైన, ఆనంద— సంతోషముయొక్క, దృష్టిః—చూపుగలదియునగు, శ్రీగురోః —ప్రకాశమానుడగు, సత్—గురువుయొక్క, దివ్యదృష్టిః—స్వప్రకాశమానమగు చూపు, మై—నాయందు, నిత్యం—యెల్లప్పుడును, నివసతు—యుండునుగాక.

సమస్తలోకములను సృజించునదియును సమస్తవేదములయొక్క చూపుగలదియును శ్రేష్ఠములయిన వస్తువులను ముఖ్యముగా సృజించునదియు, సంపూర్ణులగు ప్రమథాదిగణములకు సృష్టికర్తయును పరమాత్మవస్తువునందు ముఖ్యమైన చూపుగలదియును ఈశ్వరగుణముల సృజించునదియును ముక్తి మార్గమునందు ముఖ్యమైన చూపుగలదియును సమస్తలోకములయొక్క నాశమును నిలుపుటకు స్తంభమైనదియును దయారసముతోఁగూడిన వర్షముగల

దియును పరతత్వము నెడి పూలదండయొక్క సమూహాము గలదియును సమస్త ములగు నియమములను సృజించునదియును సచ్చిదానందస్వరూపమగు పరమాత్మయందు చూపుగలదియును నగు సద్గురువుయొక్క స్వప్రకాశమగు చూపు యెల్లప్పుడు నాయందుండుగాక, పరమాత్మయందుండుగాక యని యిప్పుడు దృఢపడడము నిమిత్తమై తన నిజస్వరూపమును చెప్పుచున్నది యెట్లనగా—

శృతి॥ నిత్యశుద్ధవిముక్తైక॥ నిత్య — ఎల్లప్పుడు యుండే దివ్యజ్ఞానస్వరూపుడు,

శుద్ధ — పరిశుద్ధమైనదియును అనగ విముక్తమైనదియు నిజస్వరూపమైనదియు,

ఏకం— కేవలస్వరూపముగాను,

అఖండానందం॥ అఖండ—భంగము లేని, ఆనందం— నశించనిది, వస్తుతత్వజ్ఞానమువల్ల కలిగే దుఃఖనివృత్తి రూపకమైన దుఃఖనివృత్తిపూర్వక సుఖశాశ్వతమైన స్వరూపముగలది ఆనందస్వరూపముగాను అమృతస్వరూపముగాను అమృతః- చావుపుట్టుకలు లేని తన నిజస్వరూపమైన దివ్యజ్ఞానము అద్వయం- తానొక్కటై స్వయంప్రకాశముగా ఆత్మవ్యతిరిక్తము లేదనుట తనకన్న అన్యము లేదనుట, సత్యం — శాశ్వతమైనదియు. త్రికాలములయందు బాధింపబడనిదియును, జననమరణప్రవాహరూపకముగానిదియు, అనంతం— అంతము లేనిదిగాను, ఆది లేనిదిగాను, మితి లేనిదిగాను, యత్ —ఏస్వరూపము, ఏదివ్యజ్ఞానముగలదో, అస్తి — కద్దో, తత్ —అటువంటి, పరం - శ్రేష్ఠమైన, ఘనమైన — దివ్యమైన, బ్రహ్మ— సర్వపరిపూర్ణస్వరూపము తానై, అస్మి— అయితిని.

నిత్యమై కామక్రోధరహితమై సర్వబంధురహితమై అఖండమై అభేదమై అభేద్యమై అద్వితీయమై తానొకడైన దివ్యజ్ఞానస్వరూపము నిష్ప్రపంచకమై నిజస్వరూపమై సత్యమై చరాచర సర్వప్రపంచమునందు తానిట వ్యాపించియుండునదియై సర్వసమమై పరిశుద్ధమయి పుణ్యపాపరహితమయి క్రియారహితమయి త్రిగుణాతీతమయి సంకల్ప వికల్పవర్జితమయి నిరాకారమయి నిరవయవమయి అవయవములు లేనిదియై శరీరత్రయవిలక్షణమయి జాగ్రత స్వప్న సుషుప్తులయందు నాశనము లేనిదియునై అందుకు విలక్షణమయి సర్వసాక్షియై

వ ప్రత్యగాత్మస్వరూపమయిన బ్రహ్మశుద్ధచైతన్యమాత్రుండైన తాను దివ్యజ్ఞానయోగానుభవముచేతను శృతులయొక్క అనుభవముచేతనున్ను తన్ను తా దెలియవలయును. కాబట్టి యీదివ్యజ్ఞానయోగము మననము బహుకాలము అభ్యసించుటవలన నిధిధ్యాసముఖముగా మోక్షము స ప్రాప్తమగుచున్నది. ఈమీద జెప్పబడిన ప్రకారముగ తాను బ్రహ్మైవ—సర్వపరిపూర్ణవస్తువే, అస్మీతి—అయితిని. ఎల్లప్పుడు యీదివ్యజ్ఞానయోగము వినుటవల్లను చూచినదానివలనను కలిగినదానివలనను శ్మృతిని పుట్టించడమునకు మనస్సునందు వుండే ధర్మము రసాయనం—మంచి అవుషధము, రోగానిన—వ్యాధులను పోగొట్టువిధముననే, అవిద్యావిక్షేపాః॥ అవిద్యా—మాయవలనగలిగిన, విక్షేపాః—ఆవరణవిక్షేపశక్తులును, జడములును, తనను తా చూచుచున్నప్పటికిన్ని దానిని దెలియకుండా తను దా దెలియకుండా చేసి భేదముచేత కూడియుండి తిరుగ భేదమునకు గారణముగా నుండేది.

ఇందుకు దృష్టాంతము నిద్రయనే గాఢసుషుప్తియే విక్షేపశక్తి. అనగ జాగ్రత స్వప్నములయందు భేదబుద్ధినిగలుగజేసెడిశక్తి హారతి—నశింపుచేయుచున్నది. కాబట్టి యీదివ్యజ్ఞానయోగమనే సర్వోత్తమమయిన ఘౌషధమును సేవించుటవల్లను అనుభవించుటవల్లను రోగములు నశించినట్లు యెల్లప్పుడును తానే బ్రహ్మమని కాని బ్రహ్మవ్యతిరక్తుడనుగాను అని యభ్యాసము జేయుటవల్ల కలిగిన సంస్కారరూపమయిన సద్వాసన ఆవరణవిక్షేపశక్త్యాత్మకమైన అవిద్యను బొత్తిగా శీదాగా బోగొట్టునని దృఢముగా నమ్మియుండవలయును. సారాంశము యేమనగా దివ్యజ్ఞానయోగమును విని గ్రంథముచూచి చదివిన మాత్రముచేతనున్ను శాస్త్రములు చదివినంతమాత్రముచేతను దివ్యజ్ఞానయోగమనే బ్రహ్మైక్యానుభవము గలుగనేరదు. కావున గురువాక్యమనే దివ్యౌషధమును సేవించినంతమాత్రమున జీవబ్రహ్మైక్యరాజయోగానుభవము యుత్తరక్షణమందుననే మోక్షసామ్రాజ్యము పొందవచ్చును. కాబట్టి యిపుడు యీదివ్యజ్ఞానయోగము మననముజేయడమునకుగాను కొన్ని నియమములు యున్నవి. ఎవ్వియనిన—శృతి॥ వివిక్తదేశఆశీనో విరాగో జితేంద్రియః భావయేదేకమాత్మానం తమనంతమనన్యధీః॥ వివిక్తదేశే—జనసమర్దములేనిచోటను, ఆశీనః—కూర్చున్నవాడై, విరాగః ఆశలేనివాడై దారేషణ ధనేషణ పుత్రేషణములనే ఆశలేనివాడై, విజితేంద్రియః—ఇంద్రియము

లను జయించినవాడై, అనన్యధీ—ఆత్మ, వ్యతిరిక్త—వస్తువునందు బుద్ధిఁబోరనీయనివాఁడై, ఏకం—తా నొక్కఁడైనటువంటిన్ని, అనంతం—దేశకాలవస్తుపరిచ్ఛేదశూన్యుఁడైన, తం—అటువంటి, ఆత్మానం—దివ్యజ్ఞానస్వరూపునిగా తానే భవతి—అగుచున్నది. కాబట్టి జనసమర్దనలేని నిర్మలప్రదేశమందు పద్మాసనాశీనుఁడై—కూర్చున్నవాఁడై, ఈషణత్రయములు, వాసత్రయములు, తాపత్రయములనే యిహాముత్రార్థఫలభోగములనే సమస్త ఆశలను వర్జించి అంతరేంద్రియములను వ్యాపారములయందు ప్రవేశించకుండా అణచిపెట్టి మనస్సు చలింపకుండా ఉత్తరహరివంశమందు ఫల్గుణమాసము మొదలగు ఫల్గుణసఖుశతులతపఃచరణముసక్ వర్గదరివర్గహయఖుర భల్గుగానీక మనసుపదిలముజేసెన్। యనియు చెప్పియున్నది. గుర్రముయొక్క కళ్ళెమును అణచిపెట్టినటులనగ గుర్రముయొక్క తీవ్ర అహంకారమంతయు కళ్ళెముచేత అణచిపెట్టినటుల రాగద్వేషాదులనే యీషణత్రయములు తాపత్రయములనే అంతరింద్రియవ్యాపారములన్నియు అణచిపెట్టి ఫల్గువుగానీక మనస్సు చంచలమునకు బోనీయక—చలించనీయక పదిలముజేసెక్—పదిలపరచవలయును. జాగ్రత్తగ బ్రహ్మమును జేర్పవలయును. ఏవంకమనసునిలిపిన అవంకకే యింద్రియములు నన్నియు నేగెక్। తోనైన పరమాత్మయందు మనస్సు నిలిపిన యేవంకకున్ను యింద్రియములు చలించకుండాయుండును. కాబట్టి ఖండములుగాను భేదరూపకమగు ప్రపంచము జాగ్రదవస్థయందుండునప్పుడు ఈదివ్యజ్ఞానబ్రహ్మైక్యయోగము యిట్లు ప్రాప్తమగును.

నిద్రయందు ప్రపంచమగపడక లయించినట్లు గాఢసుషుప్తియందుండునప్పుడు తాను పరమాత్మయై యుండగా అంతరేంద్రియవ్యావహారికము బాహ్యేంద్రియవ్యావహారికము అనగ జాగ్రతయందు వ్యవహారము స్వప్నమందుండు వ్యవహారము లయించినట్లుండగ యీ కనపడు నామరూపాత్మకమగు సర్వప్రపంచమును నిష్కళంకమైన బుద్ధిని ఆత్మయందు లయింపజేసి అనగ మనోలయముజేసి యెల్లప్పుడు తన్ను తా చూచుచుండుటచేత వెన్నెలచేత నిష్కళంకమైన ఆకాశమువలెనే ఆత్మను తన్ను తాగా తెలియవలయును. తను తా తెలియుట లోబైలు. ఈ లోబైలే వెన్నెలబైలు. ఈ బైలే తాను. తానే నిష్కళాస్వరూపంబైన మహాకాశంబైన పరమాత్మ. కాబట్టి నామరూపక్రియారూపమైన సమస్తప్రపంచమున్ను అవిద్యచేత గలుగజేయబడినందున లేదని

తోసివేసి అంతట నిండియుండెను. అఖండానందస్వరూపాత్మ తానే యని తను దా దెలియవలెను. కాబట్టి వస్తుతత్వయదార్థజ్ఞానముగలవాడు దివ్యజ్ఞానయోగసిద్ధిని బొందిన బ్రహ్మవేత్త. అవిద్యాకార్యమైన నామరూపప్రపంచమును ప్రపంచాధారభూతమైన పరమాత్మకంటె వేరులేదని నిశ్చయించి దివ్యజ్ఞానస్వరూపుడైన గాఢనిద్రయందు సుఖదుఃఖములు హెచ్చుతగ్గులు బంధముక్తులు పాపపుణ్యములు లేనందున యున్నవని విభాగించకూడదు. కావున భాగించకూడని అఖండానందభేద్యంబైన పరమాత్మయందు మనస్సులేని లేకపోయినమాత్రముచేత సమస్తప్రపంచమున్ను లేకపోవుచున్నది గనుక యిది అంతయు మనఃకల్పితమే గాని మనస్సె స్థూల, సూక్ష్మములు. మనస్సె కళత్రధనం పుత్రపౌత్రాది సర్వం సంసారము మనస్సె, మనస్సె కామరాగరోషమత్సరాది వృత్తులున్ను, మనస్సె సర్వధర్మములున్ను, మనస్సె బంధమోక్షములున్ను మనస్సె దృశ్యప్రపంచమంతయు గావున క్రమముగా తనుతాదెలిసి తానే బ్రహ్మమని మనస్సు నేది లేకపోయినమాత్రముచేత సమస్తజగత్తున్ను లేకపోవుచున్నది గనుక యిదియంతయు మనోకల్పితమేగాని యధార్థము గానేరదు. కావున జ్ఞాతృజ్ఞాన జ్ఞేయత్రిపుటి అనగ ద్రష్ట, దర్శ, దృశ్యములు ప్రత్యక్షముగా గనబడుచుండగా పరమాత్మయందు ఏకత్వభావము యెట్లుసమకూడును. అనగ జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలయందు జ్ఞాతృజ్ఞేయ జ్ఞానభేదములు పరమాత్మయందు దోచినప్పటికిన్ని ఈభేదము పరమాత్మయందు లేనందున అసత్యమైనట్లు అవిద్య కల్పింపబడి వ్యవహారికసత్తములో ఈభేదము పరమాత్మయందు తోచుచున్నదేగాని శృత్యానుభవములచేత విచారించినట్లైతే పరమార్థమందు ఈభేదమందు యెంతమాత్రమున్ను సర్వాత్మనా పరమాత్మయందు లేదు. అది యెందుచేతనంటే ఆపరమాత్మకు బ్రహ్మానందస్వరూపమే గనుక తాను తానై ప్రకాశించుచున్నది.

శృతి॥ ఏవం ఆత్మారణౌ॥ ఆత్మ ॥అరణౌ॥

ఏవం॥ ఈపైనను దహరించిన

ఆత్మారణౌ॥ ఆత్మ—అంతఃకరణమనే

అరణౌ॥ కొయ్యయందు

ధ్యానమధనే॥ ధ్యాన.—ధ్యానమనే

మధనె॥ చిలకడము
సతతం॥ ఎల్లప్పుడును
కృతే॥ (సతి) చేయబడుచుండగ
ఉదితా॥ ఉదయించిన
అవగతిజ్వాలా॥ అవగతి- జ్ఞానమనే
జ్వాలా॥ తేజస్సు
సర్వాజ్ఞానేంధనం
సర్వ॥ సమస్తమైన
అజ్ఞాన॥ మూలాజ్ఞానమనే
ఇంధనం॥ కట్టెలను
దహేత్॥ శీఘ్రముగా కాల్చి నసింపజేయును.

అరణ్యమందు అగ్ని యెట్లుయున్నది. కట్టెలయందున యున్నది. ఆకట్టెలు ఒకదానికొకటి రాపాడి దానంతతానే ప్రజ్వలించి అరణ్యమంతయు నసింపుచేయును. ఆ అగ్ని యెచ్చటనుంచి వచ్చినదో అచటనే దహింపుచేసి తానుకూడా లయమైనది. అలాగుననే ఈదేహమనే అరణ్యమందు అనగ జడమైన దారువయందు॥ శృతి॥ చారుహృద్గతాంకురం విరాజితే యథాతథా॥ హృదయమందు జ్ఞానాగ్ని మనస్సును మనస్సుచేత తరచి ప్రజ్వలింపజేసిన తాను అజ్ఞానజడమైన కార్యములన్నియు నసింపుజేసి తాను కేవలదివ్యజ్ఞానానంద స్వరూపమై తానుతానై ప్రకాశించును. ఇంకొక చిన్నదృష్టాంతము వజ్రం వజ్రేనభిద్యతే॥ యను నార్యోక్తివలన వజ్రంచేత వజ్రమునే కోయవలయు గావున మనస్సుచేత మనస్సును తరచవలయును. తరచిన శేషము తానే మిగిలియుండును. ఎట్లనగ పాలు పెరుగై తరచంగ యా నవనీతము యిక చల్లలోగలియునా గలియదనుట. తానువేరై తానుకేవల సర్వసాక్షిస్వరూపమై మిగిలి తానై ప్రకాశించును. కాబట్టి జీవాత్మ పరమాత్మలయొక్క ఐక్యజ్ఞానము గలుగగా అవిద్యచేత కల్పింపంబడిన దేహేంద్రియవ్యవహారము అనగ దేహేంద్రియాదులు తాననే భ్రమ నిశ్శేషముగా బోవుచున్నది. అంతట దివ్యజ్ఞానస్వరూపమై తనకుతానే ప్రకాశించుచున్నది. కాబట్టి లోకమునందు సూర్యోదయమువల్ల చీకటి నశించిపోగానే సూర్యుడు తనకుదానే ప్రకాశించునట్లు జ్ఞానమువల్ల అజ్ఞానము నివర్తించిపోగానే ఆత్మ తనకు తానే ఆవిర్భ

వించి ప్రకాశించును. శృతి॥ స్థాణౌపురుషవద్భ్రాంత్యాకృతాబ్రహ్మణి జీవతా—జీవస్య॥ తాత్వికేరూపే తస్మిన్దృష్టే నివర్తతే॥ ప్రపంచమందు గాఢాంధకారములో ఒక మొద్దునుచూచి దొంగని భ్రమించినప్పుడు దానివలన భయకంపములు మొదలైనవాటిని పొంది దుఃఖపడినప్పటికిన్ని విచారించి దానియదార్ధస్వరూపము తెలుసుకొన్నమాత్రముచేత ఆమొద్దునందు కల్పింపబడిన చోరత్వము నివర్తింపబడి దుఃఖరహితుడైనట్లు బ్రహ్మమందు కల్పింపబడిన జీవభ్రమయున్ను శృతిస్మృతులచేత విచారించినట్టయితే ఆజీవభ్రాంతి నివర్తింపబడి కర్తృత్వాదిరహితుడుగాను దుఃఖరహితుడుగానున్ను తాను బ్రహ్మస్వరూపుడగుచున్నాడు. కావున ఆత్మస్వరూపము తాను గుర్తెరిగి అనగ తనుదా నెరిగినవాడు సమస్తము తానైన పరమాత్మకు వ్యతిరిక్తమెంతమాత్రము గాదని వివేకదివ్యజ్ఞానదృష్టిచేత దెలుసుకొనుచున్నాడు. కావున సంశయభావన విపరీతభావనారహితుడైన బ్రహ్మజ్ఞాని సమస్తప్రపంచకమున్ను తనయందే వుండుననిన్ని తనకన్నా వేరులేదనిన్ని దివ్యజ్ఞానదృష్టిచేత తాదెలసి॥ శృతి॥ ఆత్మైవేదం జగత్సర్వం మాత్మనోన్యన్నకించన మృదోయద్వద్ఘటాదీనిస్వాత్మానం సర్వమీక్షతే॥ ఇత్యాది శృతులు చెప్పుచున్నవి. ఎట్లనగ ముఖ్యకారణమైన మట్టిచేత యేర్పరచబడి వికారరూపములుగా తోచే కుండమూకుడు మొదలయినవాటిని విచారించినట్లయితే ఆమట్టికంటె వేరుకానట్లు పరమాత్మయందు కల్పితమైనటువంటిన్ని వికారరూపమైనటువంటిన్ని కార్యరూపమైన నామరూపాత్మక ప్రపంచమున్ను అత్యనుభవముచేత విచారించినట్టయితె యెంతమాత్రమున్ను పరమాత్మ ముఖ్యకారణము గావున ఇదియే జీవన్ముక్తి.

భ్రమరకీటవత్॥ దివ్యజ్ఞానయోగానుభవమును దెలసిన బ్రహ్మజ్ఞాని పూర్వమందుయున్న ఉపాధులు స్థూల సూక్ష్మ కారణోపాధులున్ను సత్వరస్తమోగుణములున్ను విడిచిపెట్టుచున్నాడనేది ఏది కలదో అదిజీవన్ముక్తి జీవన్ముక్తి అనగ సత్తు, చిత్తు, ఆనందము అనే గుణములుగలవాడగుటవలన చచ్చిపోయిన పచ్చపురుగున్ను తుమ్మెదస్వరూపముబొందినదానివలె జీవాత్మ పరమాత్మనోః- జీవాత్మ పరమాత్మను బొందుచున్నాడు. కావున తన్నుతా విచారించగ జీవగుణములను విడచి నిర్గుణపరబ్రహ్మమును పొందుటయే జీవన్ముక్తి. కాబట్టి శ్రీరాములు అనగా ఆత్మారాముడు. శ్రీరామ పరబ్రహ్మము

సముద్రమును దాటి రాక్షసులను సంహరించి సీతనుబొందినవాడై తిరిగి అయోధ్యకువచ్చి ప్రకాశించుచున్నట్లు బ్రహ్మజ్ఞానమనే తెప్పచేత మోహమనే సంసారమనే వారధి దాటి కామక్రోధాదులనే రాక్షసులను జయించి శాంతినిబొందినవాడై సర్వకాలములయందు గాఢసుషుప్తియందుండె. పూర్ణసమాధినిష్ఠుండైయుండె. అప్రకారముగా వృత్తిరహితుడై నివృత్తియనే జీవన్ముక్తిని బొందియుండును. సమస్తవిషయములను వదలి వాటివాసనలను వదలి జీవన్ముక్తుడు కుండయందుండు దీపమువలె గాజ గ్లాసులో దీపమువలె ప్రకాశించుచుండును. కాబట్టి జీవన్ముక్తుడు ప్రారబ్ధము నశించువరకు యుండవలసిన స్థితి యెట్లనిన,

శృతి॥ ఉపాధిస్థోపి- స్థూల, సూక్ష్మ కారణదేహములయందు సాక్షినైయున్నప్పటికిన్ని బ్రహ్మజ్ఞాని॥ వ్యోమవత్॥ ఆకాశమువలెనే, తత్॥ అయుపాధులయొక్క, ధర్మైః॥ స్థూలకృశత్వాది ధర్మములతో, అలిప్తః॥ చేరనివాడు తానేయని, భావయేత్॥ మననముచేయవలసినది. సర్వవిదపి॥ సమస్తమును న్ను గుర్తెరిగియున్నప్పటికిన్ని, మూకవత్॥ తెలియనివానివలెనె, తిష్ఠేత్॥ ఉండవలసినది. అసక్తః॥ కోరక సంభవించిన భోగములయందున్ను ఆశలేనివాడై, చరేత్॥ సంచరించవలయును.

శృతి॥ యద్దృష్ట్వానాపరందృశ్యంయద్భూత్వానపునర్భవః యజ్జ్ఞాత్వానాపరంజ్ఞేయం తద్బ్రహ్మేత్యవధారయేత్॥ అనియు దేనినిచూచినవెనుక మరియొకటి చూడతగినదిలేదో ఏదితానుగానైన తర్వాత మరలపుట్టుకలేదో దేనిని తెలుసుకొన్నపిదప వేరుతెలుసుకొనదగినదిలేదో అది పరమాత్మయని తెలిసికొనవలయును. సర్వదిక్కులయందు॥ శృతి॥ పూర్ధ్వపూర్ణం అధఃపూర్ణం మధ్యపూర్ణం యథాత్మనః సర్వపూర్ణం తథాత్మేతి సమాధితస్యలక్షణం పైన క్రిందు మధ్యను వ్యాపించి నిండియున్నదియు నిర్గుణపరబ్రహ్మమైనదియు తనకంటె వేరువస్తువు లేనిదియు పరిమితిలేనిదియు శాశ్వతమైనదియు ఒక్కటియైనదియు ఏదికలదో అది బ్రహ్మమని తెలియవలయును.

బ్రహ్మ వ్యతిరక్తమైన దేహేంద్రియాదులు అసత్తని నిషేధించె. ఉపనిషత్తులచేత బ్రహ్మము చూపబడే మార్గము గాబట్టి దేహేంద్రియాదులను ఉపనిషత్తులు అసత్తని నిషేధించుటవలన మీద చెప్పినప్రకారముగా శేషించిన బ్రహ్మస్వరూపమే యనుట. శృతి॥

అఖిలం— సమస్తమైన
వస్తు- పంచభూతాత్మకమైన ప్రపంచము
తదుక్తం—
తత్ - ఆ అఖండానందస్వరూపమైన బ్రహ్మముతో
యుక్తం- చేరియున్నది
వ్యవహారః- లౌకికవ్యవహారమున్ను
చిదన్వితః- జ్ఞానస్వరూపాత్మతో జేరియున్నది.
తస్మాత్ —అందువల్ల
బ్రహ్మ—బ్రహ్మము
అఖిలే—సమస్తమైన
క్షీరే—పాలయందు
సర్పిరివ— నెయ్యివలెనే

సర్వగతం—అంతట వ్యాపించియున్నది. కాబట్టి పాలు అంతటా సత్తైన నేతితో జేరియుండుటవలన మనకు యిష్టముగాదోచినప్పటికిన్ని తరచిన మాత్రముచేతనే దానియందుండి దొరికిన నెయ్యి మిక్కిలి ప్రియమైనట్లే దేహేంద్రియాదులున్ను పరమాత్మతో జేరియుండుటవల్ల యిష్టముగ తోచుచున్న వేగాని శృత్యనుభవములచేత విచారించినయెడల పరమాత్మకంటె ప్రేమాస్పదమైనది యేదన్ని లేదని తెలుసుకోవలసినది.

ఆత్మ అంతట వ్యాపించియున్నాడనడము యెట్లు తెలుసుకొనవలయును? ఆత్మకు వ్యతిరిక్తమైన దేహేంద్రియాదులను నిషేధించుటవలన శేషించిన తనస్వరూపమే పరమాత్మ. కాబట్టి అట్టి పరమాత్మ స్థూల సూక్ష్మత్వాది ధర్మరహితమైన సృష్టిస్థితి నాశనరహితమై నామరూపజాతిక్రియలులేనిదై అన్నిటిని తెలియజేయు ప్రత్యగ్బ్రహ్మ తానేయని తెలియవలయును.

శృతి॥ ఇదం— ఈసర్వము, యీయగుపడు దృశ్యప్రపంచమంతయు, సర్వం—సమస్తమున్ను, భాంతి—ప్రకాశించుచున్నదో, తత్ —ఆస్వరూపము, బ్రహ్మేతి—బ్రహ్మమని, అవధారయేత్ — నిశ్చయించవలసినది. ఎట్లనగ అర్కాది—సూర్యుడు మొదలైన సర్వమున్ను, భాస్యతే— ప్రకాశింపజేయబడుచున్నదో యట్లే ఆత్మయొక్క ప్రకాశమానముచేత సర్వేంద్రియములు ప్రకాశింపబడుచున్నవి. కావున—

శృతి॥ తప్తాయఃపిండాంతర్ వ్యాప్తాలనుండలంబువమపున మాయుంగు ప్తసముద్దీప్తచిదాత్మకుడను నేను ధీవరేణ్యా అనునట్లు—

శృతి॥ స్వయమంతర్బహిర్వ్యాప్య భాసయన్నఖిలంజగత్ బ్రిహ్మ ప్రికాశతేవహ్ని ప్రితప్తాయసపిండవత్॥ యిట్లుచెప్పుచున్నది.

అగ్నిహోత్రిము యినుమునకు లోపలను వెలుపలను వ్యాపించి దానిని ప్రికాశింపజేయుచు తాను మరియొక ప్రికాశవస్తువు నపేక్షించక ప్రికాశింపుచున్నట్లు ఆత్మయున్ను అంతట వ్యాపించి అన్నింటిని ప్రికాశింపజేయుచు తనకు తానే ప్రికాశింపుచున్నదని తెలియవలయును.

ఆత్మను ఆత్మజ్ఞానియే చూచుచున్నాడు. జ్ఞానచక్షుః' ఆత్మజ్ఞానమనో నేత్రిముగలవాడవ్రుటచేతనే సమస్తమును వ్యాపించియుండే పరమాత్మ. అజ్ఞానచక్షుః॥ దేహేంద్రియాదులే ఆత్మయనే అజ్ఞాననేత్రిముగలవాడు సూర్యుని చూడనేరనట్లు తన్ను తా చూడనేరడు. జ్ఞాననేత్రిముచేత తన్ను తా చూడగలవాడగును. ఎట్లనగ బంగారం సమస్తలోహములయందున్ను వాటిమాలిన్యముచేత కప్పబడి తను దా తెలియకయున్నప్పటికిన్ని వాటికి వాటికి అను లినము పోగలందులకు జేయవలసిన పుటాదిసంస్కారములచేత వాటియందుండే మాలిన్యమును బోగొట్టబడి బంగారు తనకు దానే ప్రికాశించునట్లు జీవుడున్ను శ్రివణాద్యభ్యాసమువల్ల వాడుకపడి సంసారహేతుభూతమైన మూలజ్ఞానమువల్ల నివర్తింపబడినవాడై తనకు తానే ప్రికాశించుచుండును. కాబట్టి సూర్యుడు ఆకాశమందు అంధకారమును నివృత్తిచేసి అంతటను తాను వ్యాపించినవాడై తనకు తానే ప్రికాశించుచున్న నన్నిటినిన్ని ప్రికాశింపజేసినట్లు ఆత్మయున్ను అజ్ఞానమును నివృత్తిచేసికొని అంతఃకరణమందు అఖండాకారవృత్తిస్వరూపుడై తాను ప్రికాశించుచు అన్నిటిని తనయందే ప్రికాశింపజేయుచున్నది. కావున లోకమునందు బాహ్యతీర్థములను ఉత్తరదిక్కు మొదలైన దిక్కులనున్ను అర్ధోదయాదికాలములనున్ను కాశీరామేశ్వరం మొదలయిన క్షేత్రిములనున్ను అపేక్షించి స్నానముజేసినంతనే శీతోష్ణాదిద్వంద్వసుఖములుగలుగజేయుచు స్నానఫలమును అనుభవించిన వెనుక తిరుగ జననమునకు హేతువగుచున్నది. ఆత్మతీర్థమన్ననో దేశకాలవస్తుపరిచ్ఛేద శూన్యముగానున్ను దుఃఖములేనిదిగానున్ను పరిపూర్ణముగానున్ను నిజస్వరూపముగానున్ను జననమరణములను లేకుండా జేయునదిగానున్ను వుండుటవల్ల యీ

తీర్థమునకు బాహ్యతీర్థము సమానమ్ముకానందున యీదివ్యజ్ఞానయోగమను గ్రంథార్థమును చక్కగా దెలుసుకొన్న ఆత్మతీర్థస్నాన పుణ్యపాపరహితుడుగానున్ను జననమరణరహితుడుగానున్ను కర్మరహితుగానున్ను సర్వపరిపూర్ణుడుగానున్ను నిత్యానందుడుగా నున్నవాడు దివ్యజ్ఞానయోగియని చెప్పబడును.

ఓం నమో బ్రహ్మదిభ్యోబ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృభ్యో వంశఋషిభ్యః పరమగురుభ్యః. సర్గోపప్లవరహితః ప్రజ్ఞానఘనః ప్రత్యగర్థో బ్రహ్మైవాహమస్మి॥

సమాప్తము.



శ్రీరస్తు

# శ్రీ మహాఋషి నిఘంటిత యోగశాస్త్రము.

## సుజ్ఞానయోగము.

### విదురుడు ధర్మరాజునకు సుజ్ఞానయోగము బోధించుట.

ఇది సర్వశాస్త్రోపనిషత్సార అనుభవముచే తా తెలియవలయును.

శ్లోకం॥ ఆత్మానాత్మవినాశహేతుమనిశం
సర్వాతిరిక్తంశుభం
పూర్ణాపూర్ణమనామయం
సఖతరంసర్వాపదధ్వంసకం
సర్వజ్ఞానవినాశకం గురుపదం
సర్వాత్మకంనిర్మలం
సర్వభ్రాంతివివర్జితం
గుణహరంసంపూర్ణబోధంనమః॥

సుజ్ఞానయోగమనునది 'సు' లెస్సైనటువంటిదియు ఘనమైనదియు గొప్పదైనదియు నైన జ్ఞానం. పరబ్రహ్మజ్ఞానమును దెలియునది యోగము 'సు' జ్ఞానము యోగము యీమూడున్ను ఘనమైన బ్రహ్మాత్మైక్యజ్ఞానయోగము. అనగ మనోలయము, చిత్తశుద్ధి, హృదయగ్రంధిరహితము, భ్రాంతిరహితము, బంధరహితము, లింగదేహరహితము, సంకల్పరహితము, జీవభ్రాంతిరహితము, ఉపాధిద్వయదోషరహితము, మనో, మారుత, దృక్కులు మూడున్ను అఖండతేజోమయాకారముగా స్వయంప్రకాశముగా పరబ్రహ్మమొక్కటియే సర్వపరిపూర్ణమైయున్నది. దీనినే సుజ్ఞానయోగమనబడును. అన్ని పూసలధారమున్న యున్నట్లు పరమాత్మ తా నొక్కడై సర్వాంత

ర్యామియై లోపల వెలుపల ప్రకాశించునదియే యోగము. ఇట్టిసుజ్ఞానము గలవాడే యోగియగును. వాడు సర్వసుజ్ఞానసమబుద్ధితో లోకములో వర్తించును. ఇట్టి సుజ్ఞానయోగమును సాధించుట యెట్లు, దేహేంద్రియ విషయజ్ఞానముచే మనుష్యుని మనస్సు దేహేంద్రియ విషయదుఃఖపుంజములలో జిక్కి క్షోభజెందుచుండు మనస్సు నిశ్చలముగ నుండుటదుర్లభముగాదా? ఈవిషయదుఃఖపుంజములు సుజ్ఞానయోగమునకు నడ్డమువచ్చును. తనయందు నిఖిలభూతములయందు సర్వసమత్వభావముగాంచి సర్వంబు నొక్కటియేయనియు యెరుంగునది యోగము. ఈసుజ్ఞానయోగమునందు చంచలమగు మనస్సు సమముగా నిశ్చలముగా నిలిపికొనియుండిన యోగమునకు సాధనము. ఈసుజ్ఞానయోగమునకు మనస్సు చంచలంబగుటంజేసి దానిని స్థిరంబుగా నిలుపుట సాధ్యంబుగాదని తోచుచున్నది. మనంబు చంచలంబగుటంజేసి దేహేంద్రియవిషయదుఃఖపుంజముల క్షోభకరంబును, బలవంతంబును, దృఢంబును నైనది. అట్టి మనస్సును నిగ్రహించుట వాయువును నిగ్రహించుట దుస్తరంబని తోచుచున్నది. అటులనే యొక్కొక్కడు యోగసాధనగలవాడు. తనకుమాత్రము యీమార్గము బహుకష్టతరమని తలంచుచుండును. అట్టిమహాయోగులకే మనస్సుచంచలంబు నిగ్రహించుట కష్టసాధ్యముగనుండె యితరులకు నెట్లుచెప్పుదురు.

శ్లో॥ యోయం యోగస్త్వయాప్రోక్తః॥ సామ్యేన సద్గురుః॥
ఏతస్యాహంనపశ్యామి చంచలత్వాత్॥ స్థితిస్థిరామ్।
చంచలం మనఃకుగోః॥ ప్రమాదిబలవదృఢం॥
తస్యాహం నిగ్రహంమన్యే॥ వాయోరివసుష్కరమ్॥

శ్లో॥ అసంశయం మహాబాహో॥
మనోదుర్నిగ్రహంచలమ్॥
అభ్యాసేన నతుకుగోజ్ఞానం॥
వైరాగ్యేణచగృహ్యతే।
అసంయతాత్మనాయోగో॥ దుష్ప్రాపఇతిమేమతిః।
వశ్యాత్మనామయతతా॥ శక్యోవాప్తుముపాయతః॥
ఇతిభావార్థః॥

మనంబు చంచలంబును నిగ్రహింబునకు శక్యంబుగానిదియు ననుట కు సందేహము లేదు. అనగ కళ్ళెమువదలిన అశ్వమువంటిది. అయినను వైరాగ్యము దృఢంబు జేసి పరతత్వజ్ఞాన మార్జించి సర్వసంపూర్ణబ్రహ్మైక్య యోగానందమును బొంది తురీయానందమునుబొంది ఆరూఢస్థితినుండి సర్వమును మరచి శుద్ధబ్రహ్మమే తానని సంశయరాహిత్యమై ఆమీఁద మోక్షప్రాప్తి చేకూరు. కాన వైరాగ్యసుజ్ఞానయోగమువల్లను ఆరూఢబ్రహ్మైక్య అమనస్కయోగానుభవములను చంచలమైన మనస్సు నిగ్రహింపవచ్చును. చిత్తనిగ్రహము లేనివాఁడు ఈసుజ్ఞానయోగానుభవము బొందుటకు శక్తుండుగాడు. చిత్తనిగ్రహముగల మహాయోగులు విడువక నిత్యము నిశ్చలమనస్కులైన మహాఋషులకే యోగానుభవము బొందుదురు. మనస్సు మహాచంచలమగుటచేత మాటిమాటికి మనంబునిగ్రహించుట బహుదుస్తరంబుగదా యనినచో యోగీశ్వరేశ్వరులైన మహాఋషులు మాటిమాటికి మనస్సు చంచలంబనియు దానిని నిగ్రహించుట సాధ్యంబుగాదనియును మనకందరకు దెలిసియే యున్నదిగదా. దానిని గ్రహించుటకు యెంతప్రయత్నపడియెదమో అదఆమనస్సు అంతచంచలముగునట్లు గాన్పించుచున్నదిగదా. అట్లయినను మనస్సు నిశ్చలము నిలుపసాధ్యంబగునని మహాఋషులు వక్కాణించిరి. ఆసుజ్ఞానయోగము రెండువిధములు. అవి సుజ్ఞానయోగము వైరాగ్యయోగము అని రెండువిధములు అని మహాఋషులు చెప్పియున్నారు.

శృతి॥ యతోయతో నిశ్చరతి మనశ్చంచల మస్థిరమ్॥
తతస్తతో నియమ్యైతదాత్మన్యే వవసంనయేత్॥

చంచలమైన నిలుకడ లేని మనస్సు తాను ఏకోరికలంగోరిపోయే విషయేంద్రియంబులనుండి మరలించి ఆపరమాత్మయందే మనో, మారుత, దృక్కులు మూఁడూ స్థిరంబుగ నిలిపినదియే నిత్యమై సుజ్ఞానయోగమార్గము. ఈ నిశ్చలమైన చలనరహితమైన సుజ్ఞానమార్గము లేనివానికి దుర్లభము. నానా కర్మజవాసనామయంబై అనేక జన్మములయందు మనుష్యుని మనస్సు అనేక విధంబుల దేహేంద్రియవిషయ కోరికలచే కూడియుండి అశ్వమునకు కళ్ళెము విడిచినట్లుగనే పరుగులెత్తుచుండునుగదా కావున ఈసుజ్ఞానయోగము బహు కష్టమగుట యేకవింతకాదు. ఈవిధముగ దేహేంద్రియవిషయంబులయందు కోరికతో కూడియుండుటయె చంచలంబగు మనస్సునకు కొంతకాలము

జననమరణ ప్రవాహరూపకమైన విలాసమునకు హేతువగును. ఈమనస్సు కేవలము తొలుత విలాసముతో వచ్చి కూడి తామసదశయందు యున్నది. ఆమనస్సు తామసగుణముచే నుండుటచేత అప్పుడు నిద్రాలస్యముల కునికి పట్టయి యున్నది. విషయేంద్రియసుఖములు గోరి గాఢస్పర్శాలింగనములచే జలించుచున్నది. మనస్సు బహిర్విషయేంద్రియసంగతంబై యుండుటచేత విలాసంబుగలుగుచుండును. దీనినే యానందమని చెప్పుదురు. కావున బాహ్యవిషయేంద్రియసుఖవిలాసమును జెందకున్న ఆనందముకలుగదు. మనస్సు చలింపకయున్న జీవాత్మకు సంతోషమెక్కడది. అట్టి చంచలత్వము జీవాత్మయనే పరమాత్మయనే యున్నతదశయందు ద్రష్ట, ధర్మ దృశ్యవిరామము జేసినవాడై ఆమనస్సును స్థిరపరచుకొనుటకు ప్రియత్నపడుటకు సమయము వచ్చును. అట్లగుటచేత విసువక, మరచియుండక మనస్సుచలింపకుండా యేనుగను అంకుశముచేత బంధించినటుల చంచలంబగు మనస్సు గురువాక్యమనే అంకుశముచేత బంధించి యింద్రియవిషయంబులలో జిక్కుటకు పారిపోనివ్వక పారిపోయినచో మాటిమాటికి మరల్చి గురువాక్యమనే అంకుశముచేత మరలించిన బ్రహ్మమందైక్యమునొంది తానుతానై యుండును. తానే బ్రహ్మమైయుండును. ఇదియే నిరంతరము సుజ్ఞానయోగము అభ్యాసముచేయవలయును. సుజ్ఞానయోగి కాగలవాడు సుస్థిరప్రజ్ఞునివలె మహాశ్రద్ధ పట్టుదల నిలకడచేత నిశ్చయజ్ఞానమును వదలక దృఢప్రజ్ఞగలవాడై సాధించవలయును. మహాకష్టము లెన్నివచ్చినను రాతిగుండెగలవాడై సందేహమనునది కొంచెమైనను నుండరాదు. ఇతరవేదకర్మకామ్యశాస్త్రములవలెనే ఈసుజ్ఞానయోగము నీతితప్పిన పద్ధతులకు లోబడునదిగాదు. నియతపద్ధతులకు లోనగునదిగాన దానిని దేహముండగనే సాధించవచ్చును. అది ఆసుజ్ఞానయోగము అనుష్ఠానములచేత ధ్యానావాహనషోడశపూజావిధానములచేత లోబడదు. దాన, ధర్మ, స్నాన, జప ధారణములగు సుగుణములు వృద్ధిచేయుచు నిరంతరము అభ్యాసమువలన శాంతచిత్తంబు గలుగునుగాని ఇది సుజ్ఞానయోగము క్రమక్రమముగ సుస్థితప్రజ్ఞునకు దీనింగాంచు మార్గంబులు అనేకంబులు గలవు.

ఒక్కొక్కనికి యొక్కొకమార్గమునందు సులభముగ నుండును. అనగా యేమార్గమును అవలంబించువానికి ఆమార్గము సులభముగా గనబడును.

ఆకారణము చేతనే మహాఋషులు,

శృతి॥ శృతియశ్చభిన్న, శృృతయశ్చభిన్న, మహాఋషీణాం మతయశ్చభిన్నః॥ అనునట్లు అనేకమార్గములు దెల్పిరి. ఇదియేగాదు- ఆమార్గములలో నొక్క దానికిని మరియొకదానికిని భేదము, స్పష్టముగ దెలుపక యుండుటయేగాక, యొకవిషయమును దెల్పుచు మరియొకదానిని తెల్పియున్నారు. ఒకశ్లోకమున నొకమార్గమును చెప్పి దానివెనుక మరియొక శ్లోకమునకు మరియొక అభిప్రాయమును దెల్పిరి. ఆకారణముచేత యంత మిక్కిలి తెలివితో సావధానముగా విచారించి చదివినగాని ఈసుజ్ఞానయోగమును గ్రహింపజాలరు. ఈసుజ్ఞానయోగమునందు, జేర్చుమార్గములు మూడుగలవు. ఎవ్వియనిన సన్యాసయోగము, బుద్ధియోగము, కర్మయోగము యీమూడును యోగసాధనములు. ఒక్కొక్కటియు తత్పదవినిం జేర్చునవి. అనగ బ్రహ్మైక్యయోగపదవిని జేర్చునవి. ఈ మూడుయోగములయొక్క అనుభవమార్గము యొక్కటియే. ఈ మార్గములలో మనుష్యుడు యొక్కటియే అనుష్ఠించి అన్నిమార్గములు అనుష్ఠించకుండును. తత్పదవి అనగ బ్రహ్మపదవిని జెందును. అజ్ఞానులు యీ యోగములను వేరువేరుగా భావింతురు. కాని బ్రహ్మజ్ఞాన నిష్ఠులకు అన్నియు నొక్కటియే యగును.

సంసారచక్రమునందు అనగ జననమరణ ప్రవాహరూపకమైన, సింశుమారచక్రము కుమ్మరిసానవలె సుషుప్తవస్థయందు, మెలుకువవచ్చి, జాగ్రత్త, స్వప్నము, సుషుప్తి ఒక్కొక్క అవస్థల నుంచి మరియొక అవస్థకు మారుచున్నది. ఇదే జరామరణములకు కారణమైన సంసారచక్రము. దీనినే మనోమారుత కళాస్వరూపములు మూడింటిచేత కూడిన హంసోహమననే యుచ్ఛ్వాస నిశ్వాస రూపమై యిడాపింగళ నాడులయందు దినంవక్కంటికి 21600 లు హంసచొప్పున షధారములమీదను సంచరించుచున్నది. ఈహంసయోగము, హఠయోగశాస్త్రమందు, పతంజలిశాస్త్రమందును చెప్పియున్నది. ఈ హంస, మనస్సు కూడి, సుషుమ్నానాళిమందు జేరి, కళియందు లయమగుచుండును. కొంతతడవువరకు దేహేంద్రియములను మరచి, కొంతలో తానంతట అదిమెళుకువయునే, జన్మలనికి వచ్చుచుండు. ఈప్రకారముగానే అవస్థాత్రియమందు సంచరించుచుండునని, ఇదె జన్మమునకు కారణమైన బీజ

మని, దీనినే యోగశాస్త్రములయందు, లింగదేహమని, సూక్ష్మదేహమని, చెప్పియున్నది. జన్మానికి కారణమెట్లనగ॥ శయ్యనుండియు పెక్కుదేశముల దిరుగుచు గలకాంచుచున్న నిద్రితునిభంగి తాను సచ్చిదానందమయుడైయ్యు తాను జననమరణ బాధలను బొందినట్లుంట భ్రాంతిగాదె॥ యని యున్నది. కాబట్టి సంసారచక్రమునందు పూర్వభాగము ప్రవృత్తిమార్గమనియు నుత్తర భాగము నివృత్తిమార్గమనియు, చెప్పెదరు. ఇవిరెండు రెండును ఆవశ్యకములు. ఒక్కొక్కజీవుడు నీరెండుమార్గములును, విచారించనలయును. ఇవి జగత్తునకు శాశ్వతములైన మార్గములు. ప్రవృత్తిమార్గమున జరించు జీవుడు పూర్వపుప్రవృత్తి ప్రజ్ఞకు తనజన్మస్థానమునకు దూరమగుచున్నాడు. నివృత్తిమార్గము విచారించువాడు॥ తత్ మోక్షంభవతి। మోక్షమును పొందుచున్నాడు. అనగ బ్రహ్మపదమందు జేరుతున్నాడు. ప్రవృత్తిమార్గమున నరుడు తనకోరికలు నెరవేరుచోట్లకు మాటిమాటికి అనగ అడుగుదీసి అడుగు వేసి అతివేగముగా నడచినట్లున్న శిథిలమైన పాతవస్త్రమును వదలి నూతన వస్త్రమును ధరించునటులనున్న అవస్థాత్రయమే రుజువుగా జీవుడు ప్రవృత్తి మార్గమందు త్రిలోకసంచారుడై తిరుగ జన్మకు కారణభూతమై యుండెను. కావున జీవుడు పుట్టుచు గిట్టుచు నొక్కొక్క జన్మమునందు కర్మబంధమును, భోగుచేసుకొనుచుండును. ఎటులనిన యేనుగు చెత్త తననెత్తిన వేసుకున్నట్టుల పూర్వకర్మబంధకము లన్నియు మూటగట్టుచుండును. నివృత్తిమార్గమున కర్మఋణము దీర్చుకొనుటకు జన్మించుచు కర్మబంధముల నొక్కొక్కటి తెగగోయవలయును. ప్రవృత్తిమార్గమునందు జీవుడు॥ శృతి॥ అనేకజన్మసంప్రాప్తకర్మధర్మ విదాహినే। జ్ఞానానలప్రభావేన, తస్మైశ్రీగురవేన్నమః॥ శృతి॥ జన్మాభావే కర్మంనాస్తి కర్మాభావే ఫలంనహిం ఫలాభావే భయంకృత్వా భయాభావే సంశయః॥

శృతి॥ కర్మమధ్యే జగద్భ్రాంతి, పూర్ణమధ్యే జగన్నహి సదాజ్ఞానికం సర్వం కర్మనాస్తి నిశ్చయః॥

శృతి॥ జన్మనాజాయతె, కర్మం, కర్మణాజాయతే జన్మః॥ వేదాభ్యాసేన జన్మానాం బ్రహ్మాన్యం జ్ఞానశిద్ధితః॥

శృతి॥ కిమత్రిబహునోక్తేన, శాస్త్రకోటిశ॥ తైరపిదుర్లభా చిత్త విశ్రాంతి ర్వినాగురు రాకరాం। ప్రవృత్తిమార్గమునందు, జీవుడు, ప్రకృతి

బద్ధుడై అవిద్యా అజ్ఞానమున మునింగి, కించజ్ఞుండై ప్రాకృతపదార్థములయం దు కోరికగలవాడై, ఆకోరికలకు ప్రయత్నముచేయుచు, కొంతకాలమునకు, బాహ్యదేహేంద్రియజ్ఞాన ముద్భవించినప్పుడు తెలివితో ప్రవర్తింపజొచ్చి, తనయిష్టమువచ్చిన కోరికలనే కోరుకొనుచు ప్రకృతిసంబధముచేతగలిగిన, యనుభవమువలన తనకుశక్తి యింతేయని యెరిగియుండి తనగతి జననమరణ ప్రవాహమువలె యుండెనుగదా ఇహాముష్మార్థఫలభోగములయందు కోరిక గలిగియుండుటయేగదా యని తెలివితెచ్చుకుని యింద్రియవ్యవహారములకు స్థాననియమములుగయుండు అంతరింద్రియవ్యాపారములు క్రమక్రమంబుగ ప్రకృతిని వశపరచుకొని, యింద్రియగోళకములను కల్పించుకొనుచు ఆకారణ ముచేత యింద్రియవ్యాపారములు స్పష్టంబగు త్వక్కు, చక్షు, శ్రోత్ర, జిహ్వా, ఘ్రాణంబులను, పంచేంద్రియంబులును చక్కగ తెలియబడును. అప్పుడు సుఖదుఃఖరూపమగు ద్వంద్వములచే సంకల్ప ముద్భవించె.

దానంజేసి ప్రజ్ఞావిలాసంబు కనబడుచున్నది. ప్రకృతిజయింపగోరువా రికి యివియెల్లయు గావలయునుగదా. జీవుడు ప్రవృత్తిమార్గమున బహుకాల ము పరిభ్రమించి అనగ జీవుడు జననమరణ ప్రవాహరూపకమైన మహాసము ద్రములోబడి దరిగానక బహుకాలము అనగ అనేకజన్మములనుండి గర్భనర కము ననుభవించుచు ఈషణత్రయములయందు జిక్కి దరిగానక సత్సాంగ త్యమువలన సద్గురువుల వాక్యమువలన దేహేంద్రియవిషయసుఖంబులయం దు విరక్తిగలిగి, క్రమక్రమంబుగ ఆత్మానాత్మ వివేకజ్ఞానసంపత్తిగలిగి, నిత్య ము ఆత్మావలోకనముచేయుచు దేహేంద్రియంబులయందు విరాగముగలిగి శ్లో॥ నిర్మాలమేతధాత్మానం నశరీరం నాస్తికేవలం॥ యని యున్నదిగావున అప్పుడు ఆత్మైక్యానుసంధానమునకు కాలముసమీపించి అంత జీవుడు నివృ త్తిమార్గమునందు ప్రవేశించి, ప్రస్థానత్రయభాష్యంబులెల్ల విచారించి॥ క్షీర నీరవిభాగేన, హంసోహంసః బకోబకః॥ అనునట్లు పరమహంసవలె, పాలుయ నే సారమును దీసికొని, ప్రవృత్తిమార్గమున ప్రవర్తించు జీవునకు అవి నిష్ప్ర యోజనములు. కొంగకు పాలు నీళ్ళు విడదీసేనేర్పు లేనట్టులనే వానికవి కీడు వాట్లిల్లజేయును. నత్తగుల్లలుతినే కొంగకు పాలుయెందుకు. పాలుద్రా గే హంసకు నీళ్లు యెందుకు. కావున వాటికి వికటించును. జీవులలో గొంద రు ప్రవృత్తిమార్గమున గొందరు, నివృత్తిమార్గమున గొందరు జరించుచుం

డుటవలన, జీవులనెల్ల రెండుతెగలుగా భాగింపవచ్చును. మొదటితరగతి వారు పృథగ్భావంబును గాంచుచున్నారు. అనఁగ దిగువభాగముచూచుచు న్నారు. కామ్యమైన పునర్జన్మకోరికలు కోరుచున్నారు. రెండవతరగతివారు నిష్కాములై బ్రహ్మైక్య భావంబుగాంచెదరు. లోకమందు సామాన్య జనులందరు మొదటతరగతి కామ్యప్రవృత్తిగలవారు. రెండవతరగతివారు లోకములో మిగుల స్వల్పముగానుందురు. ఒక్కొక్క అభిప్రాయముగలవా రు, వారివారియభిప్రాయములచే, అనగ సహజగుణములచేత మూఁడుఅంత ర్భాగములు గలవు. జీవునికి శక్తులు మూఁడు. వానికి యిచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తి యనియందురు. ప్రకృతికి సత్వము, రజము, తమముఅని మూఁడు గుణములుగలవు. ఈజీవశక్తులను ప్రకృతిగుణంబులు సమ్మేళనంబుగా గాం చునెడ నద్దానికిని, ప్రాకృతిస్వభావముగలుగునది సహజగుణమగును. ఈ బ్రహ్మాండమున నొక్కొక్కటియు త్రిగుణాత్మకంబైయున్నదిగదా ప్రకృతి మాత్రమేగాక ఈశ్వరతత్వముకూడా మూఁడుశక్తులతో కూడియున్నది. సగుణ బ్రహ్మము సచ్చిదానందస్వరూపము. ఇవి జీవునియందు త్రిశక్తులుగా పరి ణమించుచున్నవి. అవిప్రకృతి గుణంబులగు రజ, తమ, సత్వము ఇవ్విధంబుగ నొక్కొక్కటియు లోకంబున మూఁడుతెరఁగులుగ గాన్పించుచున్నవి. ఇంతి యేగాదు యీమూఁడును అయిక్యభావంబున బాదుకొనియున్నవి. ఒకపదార్థ మునందొక గుణము ముఖ్యముగ కాన్పించును. తక్కినగుణంబులు దానంతట దానే ప్రకాశించును. ఒక్కొకయణువునందు మూఁడుగుణంబులు పుట్టును. ఏఅణువును కేవలము సత్వమని గాని, రజస్సనిగాని, తమస్సనిగాని, చెప్ప సాధ్యంబుగాదు. అయినను ఆయణువులనేకములుగ నొక్కొక్కటిగ సమ్మే ళనముగాంచి అప్పుడొక్కగుణంబె ముఖ్యమైనది గాంచవచ్చును అప్పుడట్టి పదార్థమును సత్వగుణప్రధానమనిగాని, మరియొకటిగాని, చెప్పవచ్చును. నప్పుడును తక్కినగుణంబులు దానియందుండును. అదియు సమయమువచ్చి అప్పుడు తక్కిన గుణంబులు దానియందుండును. సమయమువచ్చినప్పుడు విలాసముగా సంచరించును.

కావున, యీ త్రిగుణములయొక్క సృష్టిన్ని వాటివాటి స్వభావగుణ ములును త్రిగుణగాయత్రి సాంఖ్యఘట్టమందు చూడవలయును. కావున, యీ సుజ్ఞానయోగమునందు యెప్పుడు మనస్సు పరిశుద్ధత గలిగిన పుణ్యపురు

షులు పరిశుద్ధులు పాపిష్ఠకర్మకులకును అపరిశుద్ధులకును ఈ సుజ్ఞానయోగ
మనే గుప్తవిద్య యనియు పరమపవిత్రమైనదనియు మహాఋషులు చెప్పి
నారు —

యోగములలో, నుత్తమయోగము, సుజ్ఞానయోగము. శ్రేష్ఠమైనది
యు గుప్తమైనదియు, అనుపమానం బైనదియు, పవిత్రమైనదియు, అని చెప్ప
బడినది. ఇట్లు పవిత్రమైనది అపవిత్రత చేత యెట్లు ప్రకాశించును ప్రకా
శించదనుట పవిత్రులెవ్వరు, అపవిత్రులెవ్వరు, సుజ్ఞానయోగమును దెలిసిన
వారు, పవిత్రులు జ్ఞానమును తెలియనివారు, అపవిత్రులు.

॥శృతి॥ యత్రజ్ఞానం మనాశంకాచరేయుర్ద్విజసత్తమాః॥ భవేత్తత్రవ
శేత్సైవపుణ్యాశీలేషుసాధుషు। జ్ఞానధర్మ నిమిత్తం చచరేయుర్యత్రమాన
వాః॥ నతాన నవసేజ్జాతుతే హిపాపకృతోజనాః।

సుజ్ఞానమును యెవరు నిస్సంశయముగ మత్సరము లేక అనుష్ఠించు
చున్నారో అట్టి యుత్తమపురుషులగు సాధువులుండుచోట నుండవలయునని
యు యెవరు ద్రవ్యనిమిత్తమై ఇతరధర్మమును అవలంబించి ఆచరించుచున్నా
రో వారు పాపముచేయువారనియు శ్రీమహాభారతమునందు శాంతిపర్వము
నందు చెప్పబడియున్నది. తిరుగుగా నిప్పుడు యెక్కడ చూచినను సకల
కర్మములు ధనమునిమిత్తమే ఆచరించుచుంటయే గాక ధనమునకై యెట్టి
పాపకృత్యమైనను జేసి జీవించుచున్నారు. ॥శృతి॥ ఎక్కడనైతే జీవనాధార
మునకు పాపకర్మచేయుచున్నారో అక్కడ నివసించి యుండకూడదని చెప్ప
బడినది. జనులు ముఖ్యముగా బ్రాహ్మణులు వారి స్వకర్మ పుణ్యకర్మను
వదలిపెట్టి పాపకర్మములు నడపడి నడుచుచుండుటచే బట్టి సుజ్ఞానమను గుప్త
విద్య వీరినుండి తొలగిపోయినది. బ్రాహ్మణులు బ్రహ్మజ్ఞానమనే కర్మను ఆచ
రించుట న్యాయముగదా అట్టి స్వభావకర్మను వదలి యితరకర్మల ననుష్ఠిం
చుటచేత బ్రహ్మవిద్య తొలగపోయినది. కావున, వీరినుండి తొలగిపోవుటచేత
బ్రహ్మవిద్య లేదని చెప్పవచ్చునా బ్రహ్మవిద్య స్వాధీనముగా నున్నది. దాని
నెవ్వరును నశింపుజేయజాలరు. వివేకజ్ఞానముగలవారు ఆబ్రహ్మవిద్యను పొం
దుచునే యున్నారు. ఆబ్రహ్మవిద్యను పొందినవారికి లోకాంతరములను
అచ్చటనుండు నివాసులును చూచుచుండు శక్తి గలిగియుండును.ఆలో
కభాషకూడ వేద్యమై యుండును. అనగ తెలిసేయుండును. మన కిప్పు

దు కర్మేంద్రియములు జ్ఞానేంద్రియములకును మనోబుద్ధులకును గోచరమగు తత్వవివేకము బాహ్యవిద్యకు చేరినదిగాని బ్రహ్మవిద్యకు జేరినదిగాను బహిః ప్రజ్ఞకు విషయమైన స్థూలప్రపంచమాత్రయు బహిర్విద్యకు జేరినది. సామాన్యజనులందరు పక్వముకాని అంతరింద్రియమునకు గోచరమగు తత్వవివేకము గుప్తవిద్యకు చేరినది ఆత్మవిద్య బ్రహ్మవిద్య యీరెండుగుప్తముగా యున్నవి. శ్రీకృష్ణుడు యీరెండువిద్యలను గుహ్యతమమని చెప్పినారు. ॥శృతి॥ సర్వగుహ్యతమం భూయశ్శృణు మే పరమంవచః॥ అనియు ॥శృతి॥ యఇదం పరమం గుహ్యం॥ అనియు ॥శృతి॥ గుహ్యగ్గుహ్యంచక్షుస్థానేషు తిష్ఠతి॥ యని యు గీతలయందు రాజరాజేశ్వరియోగమందు చెప్పియున్నారు. అంతరింద్రియమునకు గోచరంబగు భువర్లోక, సువర్లోకంబులను ఆయానివాసులగు యక్షగంధర్వసాధ్యరాక్షసకిన్నరకింపురుషులను ఇంద్రాదిదేవతలును చూచుట యును ఆయాభావను దెలిసికొనుటకును ఏర్పడినవిద్య. గుహ్యగ్గుహ్యతరము లనియు పరమాత్కృష్టమగు జీవాత్మ పరమాత్మలను తెలిసికొనుటకుగా నేర్పడిన ఆత్మవిద్య బ్రహ్మవిద్యలు గుహ్యతమములని దెలియవలెను. సామాన్యముగా గుప్తవిద్య అని చెప్పినప్పుడు గుహ్యతర గుహ్యతమ విద్యలన్నియు చేరినట్లు భావించవలెను. గుహ్యతమమగు ఆత్మవిద్య బ్రహ్మవిద్యలు తప్ప తక్కినవన్నియు అపరావిద్యకు చేరినవి. ఆత్మవిద్య బ్రహ్మవిద్య మాత్రము పరావిద్యకు చేరినవని ముండకోపనిషత్తునందు చెప్పియున్నది. ॥శృతి॥ తత్రాపరాఋగ్వేదో యజుర్వేదస్సామవేదోథర్వవేదశ్శిక్షాకల్పోవ్యాకరణం నిరుక్తంఛందోజ్యోతిషమితి॥ బ్రహ్మవిద్య అరువదినాలుగు విద్యలంలో నొక్కటిగా నున్నది. ॥శృతి॥ క్షుద్రాస్త్రిషష్టి విద్యాస్యుః తత్ఫలం నశ్వరం భవేత్॥ చతుష్షష్టితమీ విద్యా బ్రహ్మవిద్యాత్వమృతదాయినీ॥ అరువదినాలుగు విద్యలలో అరువదిమూడువిద్యలును వాని ఫలంబులును అశాశ్వతములుగా నుండుటను బట్టి క్షుద్రవిద్యలనియు అరువదినాలుగవ విద్యయగు బ్రహ్మవిద్య మృతత్వఫలంబు నిచ్చునది రాజవిద్యయనియు చెప్పియున్నారు. కావున సమస్తచేతనాచేతనములు బ్రహ్మమయమని భావించి యఖండపరిపూర్ణానందము ననుభవించుచుండెను.

సమాప్తము.



# శ్రీమహాఋషినిఘంటీత యోగశాస్త్రము.

## జీవన్ముక్తియోగము.

—॥ విదేహుడనుమహాఋషి కర్కటయను రాక్షసునకు జీవన్ముక్తియోగము బోధించుట ॥—

ఈజీవన్ముక్తి యోగమును విచారించిన మనోనాశనము గలుగును. ఎట్లనిన యితరవృత్తులు మనస్సునందు పుట్టకుండ మనస్సును వశపరచుకొనుటయే అంతఃకరణపరిణామము. మనస్సునందు అప్పుడప్పుడుకలిగెడు సంస్కారములు బ్రహ్మభావనచేత తిరస్కరింపబడును. నిరోధలక్షణములగు వృత్తులతో మనస్సుతో చేరుటయే మనోనాశన మనబడును. మనోనాశనము లేనిసమయమందు చిత్తవృత్తులు కలుగుటయు బాహ్యనిమిత్తముచేత దంబాద్యసురవాసనలు కలుగుటయు కలదు. కావున వాసనాక్షయము లేదు. వాసనాక్షయము లేనప్పుడు మనోనాశనము లేదు. ఇదేవిషయమును గురించిన శ్లోకము యెట్లనిన. ॥శృతి॥ యావద్విలీనం నమనోనతావద్వాసనాక్షయః నక్షీణా వాసనాయావత్తావత్తావ చిత్తం నశామ్యతి॥ మనోనాశనము యగునంతవరకు వాసనాక్షయము కాజాలదు. వాసనాక్షయము అయినగాని మనోనాశనము కాజాలదు. వాసనాక్షయమన్నను మనోనాశన మన్నను ఒకటియే యని గ్రహించవలయును. కావున ఈవాసనాక్షయ మనోనాశనములు జ్ఞానమునకు కారణములని ఉపనిషత్తులు మున్నగునవి స్పష్టముగా ప్రతిపాదించుచున్నవి. దైవవాసనలు కలగుటయే వాసనాక్షయము అని వెనుక చెప్పియున్నారము. కావున ఇచట దైవవాసనలు జ్ఞానసాధనములను శృతిస్మృతులు నుదహరించుచున్నవి. కావున ॥శృతిస్మృతులు॥ శు॥ శాంతో దాంత ఉపరతస్తితిక్షు శ్రద్ధాసమాహితో భూత్వాఆత్మస్యేవాత్మానం పశ్యేత్॥

అనగ శాంతుడు దాంతుడు విషయములనుండి మరలినవాడు సుఖ దుఃఖములు గలవాడు శ్రద్ధాయుతుడునై తనయందె ఆత్మను చూచుచున్నాడు.

శృతి॥ అమానిత్వమదంభిత్వా మజ్ఞానంయదతోఽన్యథా॥ అనగ తన కంటె వేరైనదేహేంద్రియాదులందు నేననెడితలంపు అభిమానము ఇంతకం టె విలక్షణమైనది జ్ఞానమేకావున అభిమానరాహిత్యమునకు జ్ఞానమే సాధన ము యగుచున్నది. శృతి॥ తతస్తుతం పశ్యతిధ్యాయమానః॥ అధ్యాత్మయో గాధిగమేనదేవంమద్వా అనగ మనోనాశనమైనపిదప పరిశుద్ధుడగు పరమా త్మను ధ్యానించుచు జ్ఞానయోగముచేత స్వప్రకాశుడగు పరమాత్మను తెలు సుకొనుచున్నాడు గావున సుఖదుఃఖములను పొందడు। శృతి॥ యంవినిద్రా జితశ్వాసాస్సం యత్తాస్సంయతేంద్రియాః జ్యోతిఃపశ్యన్తియుంజానా! యో గాత్మనేనమః॥ నిద్రారహితులును ప్రాణజయముగలవారలును నియమవంతు లును జితేంద్రియులును యగు మహానుభావులు యోగసాధనముచేత యే జ్యోతిస్వరూపమును చూచుచున్నారో అట్టియాత్మకొరకు నమస్కరించుచు న్నాను. కావున యింద్రియనిగ్రహము నిష్కామకర్మ జన్మరహితము అమన స్కరాజయోగసమాధిపరుండై పరబ్రహ్మస్వరూపజ్ఞానముగలవాడై జితేం ద్రియుడై నిత్యనైమిత్తిక కామ్యప్రతిషిద్ధములనెడు సమస్తకర్మములను కర్మ లయందు అకర్మజ్ఞానమనెడు వివేకముచేతత్యజించి వాఙ్మనఃకాయవ్యాపార ములులేనివాడై పరమార్థయతియై యాయాసము లేమియు లేనివాడై నిర్మల చిత్తముకలవాడై స్వానుభవముకంటె నితరప్రయోజనములేనివాడై తొమ్మి దిద్వారములతో గూడిన పట్టణమునందు తనపరిజనముతో నుండు ప్రభువవలె రెండుముక్కులును, రెండుచెవులు, రెండునేత్రములు, నోరు, గుదము, ఉపస్థ యనెడు తొమ్మిదిరంధ్రములును, తొమ్మిదిద్వారములుగాగల శరీరమనెడు పట్టణమందాత్మయనెడు ప్రభువు ఆత్మనిమిత్తము సకలకార్యములను జేయు యింద్రియములను మనోబుద్ధులనెడు పరిజనముతో గూడి కర్తృత్వమూలమగు నహంకారమును ప్రవర్తకమూలమగు మమకారమును లేనివాడై సుఖముగా నుండును. సన్యాసియెట్లు దేహమందె యున్నాడో అట్లె సమస్తప్రాణు లును దేహమందె యున్నారుగదా. అట్టిసంగతిలో సన్యాసి, దేహమందు న్నాడు అని చెప్పుటవలన విశేషమేమి యందువేమో వినుము. యింద్రియ ములతో గూడిన దేహమే ఆత్మయనియు తలంచు అజ్ఞులు దేహులందరును,

గృహమందుగాని, భూమిమీదగాని యున్నామని తలంతురుగాని యట్టివారికి గృహమందువలె దేహమందున్నామనెడు తలంపునుగలుగదు. దేహేంద్రియాది సముదాయముకంటె ఆత్మ వేరుగనున్నదను జ్ఞానముకలవారికి దేహవ్యతిరిక్తుడనగు తానుదేహమందున్నానను తలంపుకలుగును. వివేకజ్ఞానముచేత పరమాత్మయందు అవిద్యాసంబంధముచేత నారోపింపబడిన కర్మముల యొక్క త్యాగమును సందర్భించును కాబట్టి యట్టివివేకి సర్వకర్మపరిత్యాగము జేసినను ప్రారబ్ధఫలకర్మసంస్కారము శేషముగు వెంబడించుటచేత గలిగిన యీ దేహమందే విశేషవిజ్ఞానము పుట్టుటవలన తొమ్మిదిద్వారములుగల దేహమనెడి పట్టణమందు గృహమందువలె దేహపాదపర్యంతమును జీవన్ముక్తుడైయున్నాడని చెప్పుటయందు విశేషముకలదు. ఉట్లుండుట వివేకియొక్కయు అవివేకియొక్కయు అభిప్రాయభేదమును బట్టి భేదముగానుండునని తెలిసికొనవలెను. అనగా ప్రారబ్ధమువలన దేహమందు దేహమునకంటె ఆత్మ వేరుగనున్నాడను నిశ్చయముతో వివేకిదేహపాతపర్యంతమును దగ్ధపటల న్యాయమున నుండును. అవివేకి దేహమే యాత్మయనియును నిశ్చయముతో కర్మబద్ధుడై యుండుననుట॥ శ్రు॥ శరీరస్థాపి కౌంతేయనకరోతి నలిప్యతే॥ అని చెప్పబడియున్నది. భగవద్ గీతాశాస్త్రమందు.

13 వ అధ్యాయములో 32 వ శ్లోకము గాబట్టి యీ శ్లోకము చెప్పబడినవారు యీఅధ్యాయము మొదలుకొని ర 9-శ్లోకములవరకు చెప్పబడిన జ్ఞానాధికారి యని యెరుంగవలయునని చెప్పియున్నారు గాపున యీ సంసార సముద్రమును దాటలేరనుట యీసంశయమును గూర్చి టీకయందు జెప్పబడియున్న శ్రుతులు యెవ్వియనిన.

శ్రు॥ స్వాప్నంసుఖం దుఃఖమసత్యమేవథా పితత్స్యానుభవస్తదానమ్,
తథైవసుక్తౌరజతస్తమిథ్యామనోరథోస్తంతువినానుభూతిమ్.
సర్వగతస్తనుభృతామఖిలోపిస్యాన్నోరథ మయోన్యవహారః
యుక్తితస్త్వనుభవాదను వెలం తస్మైప్రపాత్వేము దితంము వర్త్యేః॥

వశీ॥ వశీకరము అనగ యింద్రియనిగ్రహముగలవాడు.

మనసా॥ ఆత్మానాత్మవివేకము గల మనస్సుచేత

నవద్వారే॥ తొమ్మిదిద్వారములు గల

పురే॥ ఇవ॥ పట్టణమునందు

దేహీ॥ శరీరమందు.

సర్వకర్మాణి॥ సమస్తకర్మలను.

సన్న్యస్య॥ విడచిపెట్టి వానికది యగునట్లు చేసి

నైవకుర్వన్॥ చేయకున్నవాడును

నకారయన్॥ చేయింపకున్నవాడైనను

సుఖం॥ ఆనందమును కలుగునట్లుగా

ఆస్తే- ఉన్నాడు, పరిపూర్ణమస్థి- సర్వం నిండినవాడు, సర్వం బ్రహ్మేతి వ్యజానాత్- అహం బ్రహ్మేతి వ్యజానాత్- తాను సర్వం నిండియున్నవాడును, పరబ్రహ్మస్వరూపమును, నైయున్న తానే, పరబ్రహ్మమని॥ శృతి॥ త్వమేవాహం, త్వమేనాహం నసంశయః॥ త్వం నీవు, అహం- నేను, త్వం- నీవు, ఏవిధమైన సంశయము లేదు అని చెప్పుచున్నది. కావున యిట్టి బ్రహ్మమైన తనయందు జగద్భ్రాంతి తోచబడినదని ప్రస్థానత్రియమునందు చెప్పబడియున్నది. యత్- ఏది, ఏబ్రహ్మము సాక్షాత్కారమై సర్వపరిపూర్ణమైనది అవధారయేత్- నిశ్చయింపవలసినది, యెట్లనగ॥ శృతి॥ బుద్ధేః పరమ్॥ బుద్ధికంటె వ్యతిరక్తమైనదియు, శ్రేష్ఠమైనదియు ఆత్మానమ్ ఆత్మను, అనగ తన్నుదాను తెలిసికొని ఆత్మనా నిశ్చయాత్మకమైన బుద్ధిచేత ఆత్మానమ్- మనస్సుచేత, సంస్థభ్య- నిశ్చలముగ జేసి, దురాసదమ్- జయింపనసాధ్యమైన కామక్రోధాదులనె అరిషడ్వర్గము, కామం- అనగ, కోరికను అశాశ్వతరూపమైనది శత్రువు కామమనేశత్రువు నశింపజేయవలయును. యుపనిషత్ —

శృతి॥ మనోరథానాం నసమాప్తిరస్తి వర్షాయుతేనాపి తథాపి లక్షైః పూర్ణేషు పూర్ణేషు పునర్నవానా ముత్పత్తయస్సన్తి మనోరథానామ్॥

పద్భ్యాంగత యౌవనతశ్చ జాతా దారైశ్చ సంయోగమితాః ప్రసూతాః॥

దృష్టాస్సుతాస్తత్తన యప్రసూతిం దృష్ట్వా పునర్వాంఛతిమే న్తరాత్మా॥

యట్టీవతోనైవ మనోరథానామన్తోస్తి విజ్ఞాత మిదం మయాద్య మనోరథాసక్తి పరస్యచిత్తం నజాయతేవై పరమార్థ సఙ్గతి॥

ప్రభుః-ఆత్మ, దేహీ.

లోకస్య- దేవమనుష్య పశుపక్షిస్థావరాది రూపములైనదియు ప్రకృతి సంబంధములో గూడుకొనునదియు నగు ఈలోకమునకు.

కర్తృత్వమ్- వాని వానికి ప్రత్యేక ప్రత్యేక కర్తృత్వమును.

న-సృజతి- గలుగజేయడు.

కర్మాణి- వాని వానికి ప్రత్యేక ప్రత్యేక కర్మలను చేయువారును.

ఆత్మసంభావితాః- తాము సమస్తమైన గుణములతోను గూడిన వారైనట్లు తమ్మును దామే గారవించువారును.

స్తబ్ధాః- పెద్దలయెడల మర్యాద లేనివారును పెద్దల నిరాకరించు వారును.

ధనమానమదాన్వితాః- ధనముకలదను దురభిమానముతోను ధనము కలుగుటవలని మదముతోను గూడువారును.

అహఙ్కారమ్- ఉన్నవియు లేనివియునగు గుణములను తమయందు ఆరోపించుకొని అవి యెల్లగలవారము మేమని తలంచుట యనెడు అహంకారమును.

అభిజనవాన్- ఉత్కృష్టమైన కులమున బుట్టినవాడనుగా ఏడుతరముల నుండి సిష్టాచారముగల వంశమునందు బుట్టినవాడను అయి,

అస్మి-ఉన్నాను,

మయా-అన్నివిధము లయందును నాతోటి,

సదృశః-సమానుడు,

అన్యః-ఇతరుడు,

కః-ఎవ్వడు,

అస్తి-ఉన్నాడు,

యక్ష్యే- యజ్ఞము చేసెదను నేను అధికమైన యాగములను జేసి వారలె యాగములను జేయునివారిని అవమానము జేసెదను.

దాస్యామి- తన్ను పొగడినవారికి అనగ తన్ను తా పొగడుకొను వారికి అనగ తన్ను తా తెలియనివారికి ద్రవ్య మిచ్చెదను సంతోషింపగలను.

ఇతి-అని ఈవిధముగా,

అజ్ఞానవిమోహితాః- అవివేకముచే మోహింతులైనవారును,

అనేకచిత్తవిభ్రాంతాః - అవివేకములైన చాంచల్యములతో గూడిన మనస్సుచేత భ్రమనొందినవారును.

మోహజాలసమావృతాః దారాపుత్రపౌత్రధనవాహనక్షేత్రాదులయందు అభిమానమనెడి వలచేత చిక్కుబడినవారును.

కామభోగేషు విషయభోగములయందు,
ప్రసక్తాః సన్తః - అధికమైన ఆశచేత దగులుకొన్నవారును అగుచు,
అశుచౌ అపరిశుద్ధమైన,
నరకే - నరకమునందు,
పతన్తి - పడుచున్నారు,
అసతః - లేనిదానికి,
భావః కలిమి,
నవిద్యతే - లేదు,
అభావః - లేమి,
నవిద్యతే - లేదు,
అనయోః ఉభయోః - అపి - ఈరెంటియొక్కయు,
అన్తస్తు - నిశ్చయమున్ననో,
తత్త్వదర్శిభిః - జ్ఞానులచేత,

దృష్టః - తెలిసికొనబడినది. అనగ తన్నుతా దెలియునది, జఠరగర్భమె నరకమని॥ శ్రుతి॥ గర్భనరకంయా ॥ అని యున్నది గావున దేహాదివిషయములు దేహమును ప్రకాశింపజేయుచున్నవి. ఇంద్రియము దేహమునకంటె యెక్కువైనవి. అట్టియింద్రియములను, వ్యవహరింపజేయునదిగాన, సంకల్పాంతకమైన మనస్సు, యింద్రియములకు, రాజు అనగ శ్రేష్ఠమైనది. అట్టి మనోసంకల్పము నిశ్చయించునదిగాన, నిశ్చయాత్మకమైన బుద్ధి మనస్సుకన్నా యెక్కువైనది. బుద్ధిమొదలగువానికి, ఆత్మ సాక్షిభూతుడు. ఆత్మయే బుద్ధిమొదలగువానికంటె యెక్కువైనవాడు. కాబట్టి అట్టియాత్మస్వరూపుడు అనగ, ఆత్మసమాధినిష్ఠను బొందినవాడు నిష్కాముడు. కోరికలేనివాడై కామమును జయింపవచ్చును. ఆత్మతత్వము తెలిసికొనదగినవాడు బుద్ధ్యాదులకు సాక్షియైన ఆత్మను తన్నుతా దెలిసికొనవలయును. కావున బుద్ధిచేత, మనస్సుచేత ఆత్మనిశ్చయము జేసుకొని అసాధ్యమైన కోరికను శత్రువునసింపజే

యవలయును॥ శ్రుతిః క్లమోనవాచ, శ్శిరసోనశూలం, నచిత్తతాపో, నతనో ర్విమర్ధః సచాపిహింసాది అనర్ధయోగః॥ శ్లాఘ్యాపరంకోఽధ్విజయేః హమేకా— అనగ కామమును తద్వారా క్రోధమునువిసర్జించు విషయములో, జింహ్మాదోషములేదు. శిరస్సుయందుంను నొదను చంచలముపొందదు మనస్సు పరితపించదు. దేహముశుష్కించదు. కావున దేహహింస యింద్రియములయొక్క విషయములకు అనర్థకమే కలుగబోదు గావున సోహంబ్రహ్మమను హంపదార్థమును ఆత్మైకజ్ఞానమునుపొంది బ్రహ్మనిష్ఠాగరిష్ఠుండై, ముఖ్యమైన శత్రువులను జయించుట ముఖ్యసాధనము. మరియు॥ శ్రుతి॥ దేహోదేవాలయఃప్రోక్తో, జీవోదేవస్సనాతనః॥ త్యజేదజ్ఞాన నిర్మాల్యసోహంభావేన పూజయేత్॥

కావున దేవునకు మన దేహమే దేవాలయము అనియు, జీవుడు పురుషోత్తముడనియు, పరమపురుషుడనియు, పరబ్రహ్మమనియు భావించి అజ్ఞాన జడమైన ప్రాంతములను తీసివేసి సోహంబ్రహ్మ॥ అహంబ్రహాస్మి॥ బ్రహ్మనిష్ఠ యనే పుష్పంబులచే బూజించిన ప్రతిష్ఠ చేయచేయగా కామమనే కోరికలు తామాతట తామేవిషయములను విడచియుండును. సమస్తజీవకోటులు॥శ్రుతి॥ అద్వేష్టా॥ సర్వము తానని యోగివపిస్మట తనకుదుఃఖము గలుగజేసినవాని యందు యిష్టమును, [illegible] యుండును. మైత్రః॥ తనతో సమానులయందు స్నేహబుద్ధికలిగియుండును. దుఃఖపడువానియెడలను, సుఖపడువానియందును సమానమైన బుద్ధిగలవాడు॥ శ్రుతి॥ దేహేంద్రియాదులయందును దేహసంబంధమైన పుత్రమిత్రకళత్రాదులయందును, మావారు అనెడి అభిమానములేనిదియు॥ శ్రుతి॥ నిరహంకారః॥ దేహమే తానను నీమొదలగు కర్తృత్వాద్యభిమాన రూపమగు అహంకారములేనివాడు॥ సమదుఃఖసుఖః॥ దుఃఖములుకలుగునప్పుడు, ద్వేషంబును సుఖముకలుగునప్పుడు అనురాగము లేనివాడును యితరులు తన్ను దిట్టినను॥ శ్రుతి॥ తుల్యావ్యవహృతిస్సర్వాస్వప్న జాగ్రదవస్థయోః ఏకస్యావసరేన్వయన్నిధ్యా [illegible] ప్రేయతే సతతమ్॥ ఎల్లప్పుడును, సంతుష్టః యోగి యతాత్మా సం[illegible] ష్టః॥ దేహసంరక్షణకొరకు దొరికిన పదార్థములను భుజించునేగాని తానుకోరదు. తానుభుజించు పదార్థము యుక్తముగా భుజించును లేక తృప్తిగా ప్రాప్తమైన పదార్థములు శ్రేష్ఠమైనవైనను లేక ఒకవేళ ఏమియు దొరకకున్నను నిత్యసంతోషముగల

వాడైయుండును గావున విశేషమేమనగ కోరదు ఏపదార్థమును కోరకవచ్చిన రానివస్తువులు కోరకరాకపోయినను, వెలితిబొందక సజ్జనులు కోరరు ప్రాప్త ప్రాప్తములు కొందరు విచారింపరు. వస్తువుయొక్క హానివృద్ధులు చింతింపకయుందురు గావున లోకమును నిష్కాముడై గతించిన కర్మనియోగమై నిష్కల్మషుడై, అవిద్యావరణంబు బాసి సముదంచితబోధను బొంది లీలావిభవంబుచేత సకలంబును బ్రహ్మముగా నెరుంగును. తద్భావననిశ్చలంబైన బ్రహ్మముతానై నిర్విషయమనుయుండైయున్న సర్వసంసారసంగములు గలిగి సంగిగాడు. సర్వసాక్షి గావున భోగములు సర్వమును పొంది భోక్తయును గాడు. సర్వకార్యములు జేసి కర్తయును గాడు. సంకల్పరహితమైన వాడు గాబట్టి,

శృతి॥ యః-ఎవ్వడు ఆత్మనః- తనయొక్క- సర్వద్వారాణీ- సర్వేంద్రియ ద్వారములకు, సంయమ్యచక్క నియమించి, మనస్సును హృది హృదయకమలమందు అనగ తనయందు సస్వరూపమందు॥ నిరుధ్యచ॥ అరికట్టియు నిశ్చలముగా నిలిపియు, మూర్ధ్ని శిరఃప్రాంతమైన భ్రూమధ్యమందు॥ ప్రాణం॥ ప్రాణవాయువును ఆదాయ ఉంచి యోగధారణామ్ అనన్యభక్తియోగమునకు ఆఖరుభక్తికి అనగస్థిని॥ ఆస్థితః॥ సః॥ పొందినవాడై॥ బ్రహ్మ॥ పరబ్రహ్మ ప్రతిపాదకమగు॥ ఓమిత్యేకాక్షరం బ్రహ్మ॥ ఓంకారమనెడు ఏకాక్షరమును అనగ ముఖ్యమైన ఒకవస్తువను ఒకఅక్షరముచేత॥ అవిర్యానే॥ గర్భః॥ గర్భమందుండెడు శిశువు ఉల్బేన మావిచేత॥ యథా॥ ఏలాగున అవృతః॥ కప్పబడియుండునో॥ తథా॥ ఆలాగుననే॥ ఇదమ్॥ ఈజ్ఞానము సత్వగుణముచేత॥ తేన॥ ఆకామముచేత అనగ కోరికచేత। అవృతం॥ కప్పబడియున్నది గాబట్టి అది యెట్లనిన అగ్ని పొగచేతకప్పబడీయున్నట్లు అద్దము మాలిన్యముచేత గప్పబడినట్లు గర్భములోని శిశువు మావిచేత జుట్టబడియున్నది. సత్వగుణమగు బ్రహ్మజ్ఞానము కామముచేత గప్పబడియున్నది. పైనవ్రాసిన యుదహరణములనుబట్టి ఆలోచింపగ కామముచేత అనగ కోరికలచేత గప్పబడినవారు జ్ఞానముగలవారు మూడువిధములైయున్నవారు. వారు యెట్లుకనబడుచున్నట్లున్నారు అనగా ఆశయనే ధూమ్రముచేత గప్పబడిన బ్రహ్మజ్ఞానమనెడు అగ్నికలవారు కొందరు. వీరు ఆత్మజ్ఞానముగలవారలేగాని, నిశ్శంకముగా నాత్మజ్ఞానమందు నిలుకడలేనివారు. విషయాసక్తిని పూర్ణముగా విడువనివా

రు అయియున్నారు. అగ్నియందలి పొగ గాలిచేతగాని, అగ్నిజ్వాలలవలన గాని యెట్లుపోవునో॥ శృతి॥ గురోముఖేనజ్ఞాతవ్యం అన్యథానోభలభ్యతే॥ అను శృతిప్రకారము గురూపదేశమువలనను॥ శృతి॥ సత్సంగత్వే నిస్సంగత్వం నిస్సంగత్వే నిర్మోహత్వం, నిర్మోహత్వే నిశ్చలతత్వం, నిశ్చలతత్వే జీవన్ముక్తిః॥ అను ధర్మశాస్త్రము చెప్పుచున్నది. కాబట్టి సత్సంగమునకు వీరలకు కామమను కోరిక యెట్లుపోవునో అట్లునశించును. కావున వీరలు మొదటి తరగతిలోవారు గావున రెండవతరగతిలోవారియొక్క దృష్టాంతము యెట్లనిన, మాలిన్యమగు అద్దము నూయబడియున్న అద్దము ముఖము గనగ ముఖము మాలిన్యమైన అద్దము మాలిన్యముగా గనుబడును. అద్దము మాలిన్యంబైన ముఖము మాలిన్యమగును. కావున ముఖము ప్రకాశముగాను మాలిన్యముగాను గనబడుచున్నను ఈరెండుదృష్టాంతములు ఒకటే అర్థముగా దెలియవలెను, అయినను ముఖముప్రకాశము దెలియవలెనను తలంపుమాత్రముండును. అద్దము, ముఖము ఈరెండు మాలిన్యములు తుడిచివేసిన అద్దము ప్రకాశముగనే ముఖమును గనబడును. మాలిన్యమైన ముఖమును తుడిసివేసిన యట్లే కనబడును. కావున ఆలోచనయందు ఆప్రకారముగానే వీరలకు బ్రహ్మజ్ఞానము సంపాదించుట కుపేక్షగలుగును. అయితే యీ ఆశను వదలుకొనినవెంటనే బ్రహ్మైక్యజ్ఞానమును బొందవచ్చునను నిశ్చయజ్ఞానము లేకయుండును. వీరలకు సద్గురుముఖవివేకజ్ఞానముచేతను, సత్సాంగత్యము నిర్మోహత్వముచేతను చిరకాలమునకు బ్రహ్మజ్ఞానముగలిగి ముక్తిప్రాప్తించును. వీరు రెండవతరగతివారు —

ఉపదేశాదయంవాదః జ్ఞాతేద్వైతంనవిద్యతే॥ ఇతి మాండూకోపనిషత్ చెప్పుచున్నది. మావిలోనుండు శిశువు తానుగానుండి బయటికివచ్చుటకెట్లు శక్తిలేకయుండునో అట్లు బ్రహ్మజ్ఞానములేనివారు ఆత్మ యిట్టివాడనుట నెరుంగక ఆశయను వలలోజిక్కుబడియుందురు. కాబట్టి యాశనునివర్తింపజేసికొనుటకు శక్తిలేకయుందు నీతెగవారికి గురూపదేశముచేత నిశ్చలతత్వముచేతను సాధుసాంగత్యముచేతను బ్రయోజనములేదు గాబట్టి వీరు మూడవతరగతిలోవారు. ఈమూడుదృష్టాంతరములు మగ్గురికి జెప్పబడియున్నది. కావున, సర్వమునిండినదియు, అశక్యమైనదియు, చెప్పుటకసాధ్యమైనదియు యన్నికట్టెపుల్లలచేత దహించినను తృప్తిపొందనిదియు, అగ్నివం

టిదియు, ఆశారూపమైనదియు ఆత్మజ్ఞానియొక్క వెనుక జెప్పబడిన యీఆశయను శత్రువుచేత బ్రహ్మజ్ఞానము గప్పబడియున్నది గాబట్టి ఆశయుంకాయెట్టిదని సవిస్తరముగ చెప్పబడియున్నది. ఎట్లనగా ఆలోచించుటకు అశక్యమైనదియు, అనాదియైనదియు, అవ్యక్తమైనదియు, అగ్నిహోత్రమువంటిదియు ఆదిమధ్యాంతములు లేనిదియు॥ శృతి॥ అగ్నావపథ్ఘృతం సర్వమగ్నిరేవభవేద్యథావిదితం, విదితం, విదితం, వేద్యం, సంవిదేవభవేత్తదా॥ కర్పూరోదీపసంపర్గాదీపవభవేద్యథా వేద్యవేదన, సంసర్గాత్సంవిదేవభవేత్తథా॥ సంవిదితం, సంవిదితం, సంవిన్మైవభవతిసంవేద్యమ్ అగ్నావాహితమాహితమగ్నిమయం కింనజాయతే కాష్ఠమ్॥

ఆదిమధ్యాంతములు శూన్యమైనట్టి ప్రకృతియనె ఆశయనే నిత్యమైన శత్రువుచేత బ్రహ్మజ్ఞానము కప్పబడియున్నది. ఈపదార్థము చాలునని సంతుష్టి గ . గజేయనిది గావున కామమనే ఆశ తీర్పశక్యముగానిది. తాను కోరిన పదార్థము సంప్రాప్తము కానియెడల అగ్నిహోత్రుడు తా నాశ్రయించిన దారువ నెట్లు నశింపుచేయునో॥ శృతి॥ దారుమధ్య సంజ్ఞాతోరు రుజ్వలప్రమర్ధన చారుహ్యద్గతాక్షరం విరాజితే యదాతథా జ్ఞానమందనాస్వయం రభేదకోవైధైర్యసంగోపరూపకం స్వరూపప్రాపకం గురుంభజే॥ అను శృతిప్రకారీతిగా చెప్పుచున్నది. అట్లు దురాశమనస్సును నసింపజేయును గాబట్టి అగ్నివంటిది మూఢుడు వకవస్తువను గోరునప్పుడు తనకోరిక మంచిదనియే యూహించును. ఆకోరిక అనర్థకమైనప్పుడు ఆశవలన నాకిట్టికష్టము సంప్రాప్తమైనదని తలంచుకొను బ్రహ్మజ్ఞానియో అట్లుచేయడు అనుకొనడు యెప్పుడు ఆశకు లోబడకూడదని జాగరూకుడై యుండును గాన అనగ వివేకముగలవాడై యుండును. కావున బ్రహ్మజ్ఞానికి ఆశయనే శత్రువు యనబడును. ఆశ తీర్చుటకు శక్యము గాదనుటకు ॥శాతపథిశృతియందు ॥ఏతావాన్వైకామోనేత్సంశ్చనాతో భూయోవిన్దే తస్మాత్తపైతర్హ్యేకాకీ కామయతె జాయామేస్యాదథప్రజాయేయాథవిత్తం మేస్యాదథకర్మ కుర్వీయేతి సయావదప్యేతేషామేకైకం నప్రాప్నోత్యకృత్స్నఏవతావన్ మన్యతె తశ్యోకృత్స్న॥ అర్థము॥ వెనుకటి శృతిచేత తెలియజేయబడిన కామమిట్టిది ఎట్టిదనగ కామము కోరిక ఆశ కర్మను ఆశయాబద్ధతేలో కేకర్మణా బహుచింతయేత్॥ పైవ్రాసినవికలవాడు సత్పురుషుడుగాడు కాబట్టి ఆశాపాశములచేత కట్టబడినవాడు ఆశకంటె అధికము

లేదని తలంచును. అట్టివాడు తల్లిగర్భమునుండి మొదట దానొక్కడే జన్మించియు తనకు భార్యకావలయును. తరువాత ఆత్మావైపుత్రనామాసి॥ యెట్లనగ నీవె పుత్రుడవై పుట్టితివి. అనగ నీవె కుమారుడవై మారుపేరుగలిగి పుట్టితివి అను శృతిప్రకారము సంతానము గలుగవలయును. కందును అట్టి భార్యాపుత్రుల సంరక్షించుటకొరకు ధనము నాకు కావలయును గాబట్టి అందునిమిత్తమై వ్యవసాయము మొదలగు వ్యవహారములు జేసెదను అనుకొనునదియే ఆశ యనబడును. వెనుకజెప్పబడిన ఆశలలో ఏది నెరవేరకున్నను తాను కృతార్థుడనుగానని తలంచును. ఇదే ఆశగలవాని కృత్యము. అకృత్యము అని చెప్పబడియున్నది. ఎట్లనగ॥ శృతి॥ ఉత్ఖాతం నిధిశంక్కయాక్షితితలం ధ్మాతాగిరేర్ధాతవో నిస్తీర్ణస్సరితాంపతి ర్నృపతయో యత్నేన సంతోషితాః మంత్రారాధన తత్పరేణః మనసా నీతాశ్శ్మశానేనిశాః ప్రాప్తః కారణవరాటకోపి సమయాతృష్ణేసకామాభవ। అనగ పేరాసగల తనచేత పాత్రలు అనగ నిధులు దొరుకునను తలంపుతో భూమి అంతయు త్రవ్వబడి బంగారము వెండియు నుండునని తలంపుతో గొండలలో నుండు మంటి అంతయు మూసలుకట్టి వానిలోవేసి గరగించి సముద్రములోని దీవులలో గనులు దొరకునను తలంపుతో సముద్రయానము జేయబడినది.

శృతి॥ యద్ జ్ఞాత్వామృత మశ్నుతె॥ ప్రభువులు బహుమతులిచ్చెదరని నమ్మకముతో సంతోషముతో వారు అనేక విధములుగా పొగడి సంతోష పెట్టెదరు. ధనము సంపాదనకొరకై మంత్రపునశ్చరణలు జేయుదురు. ఇట్టి యుద్దేశ్యముతో రాత్రులన్నియు సమాధులలో నె గడిపెదరు. ఇన్నికష్టములు బడినను గుడ్డిగవ్వయైనను దొరకలేదు. కొండత్రవ్వి యెలుకనుబట్టినట్లు యున్నది. ఓమనసా యికనైనను నీయాశవదలునా, నీకోరిక నెరవేరెనదా, గావున నన్ను జిక్కులలో బెట్టుటకు కిదా యని అభిప్రాయము. అన్నో బాధలు పడితిని, ఇంకను జిక్కులు పెట్టెదవా, వదలిపోయెదవా విడిచెదవా యింకెంతకాలము వుండెదవు, యన్ని చిక్కులుపడుచున్న నాశమాత్రము తీరదు. ఇట్టి ఆశ ఆత్మానాత్మవివేకము గలుగనీయదు. కనుక ఆశనువదలినవాడు వివేకజ్ఞాని యని చెప్పబడును. అనగ బ్రహ్మజ్ఞానియని చెప్పబడును.

సమాప్తము.



# శ్రీ మహాఋషి నిఘంటిత యోగశాస్త్రము.

## గురుతత్వయోగము.

—— గౌతమమహాఋషి హైమరథుండనే రాజునకు గురుతత్వయోగము బోధించుట. ——

ఈగురుతత్వయోగము గురుముఖంబున తా తెలియవలయును. శృతి॥ వందేగురూణాం, చరణారవిందం, సందర్శితస్వాత్మసుఖాంబుధీనాం, జనస్య ఏషాం, గుళికాయమానం, సంసారహాలాహలమోహశాంత్యై॥

భావార్థము. జనస్య॥ జనులయొక్క

సంసారహాలాహల మోహశాంత్యై

సంసార॥ సంసారమనెడి

హాలాహల॥ విషమువల్లనైన

మోహ॥ మూర్ఛయొక్క

శాంత్యై॥ శాంతికొరకు

గుళికాయమానం॥ మాత్రలుగానుండెడు

సందర్శధీనా॥ సందర్శిత॥ చూపింపబడిన

స్వాత్మ॥ సుఖ॥ తనఆత్మసుఖముయొక్క

అంబుధినాం॥ సముద్రములుగల

ఏషాం॥ ఈ॥ గురూణాం॥ గురువుయొక్క

చరణారవిందం॥ పాదపద్మములనుగూర్చి

వందే॥ నమస్కరించుచున్నాను.

మనుష్యులయొక్క జననమరణాదిస్వరూపమైన దేహమనెడి విషయములవల్లనైన అజ్ఞానస్వరూపమగు మూర్ఛయొక్క శాంతికొరకు మాత్రలై

న జ్ఞానబోధము చేత చూపింపబడిన పరమాత్మ స్వరూపమును సుఖసంసుదర్శ్రి ములుగల సద్గురువులయొక్క పాదపద్మములను గూర్చి నమస్కరించుచున్నాను.

సమస్తఉపనిషత్తులయందును చెప్పబడిన గురుస్వరూపమైన పరమాత్మస్వరూపమునకు స్థానమైనదియును- స్వర్గలోకము మొదలైన మూడులోకములకు, అనగ బ్రహ్మలోకము, విష్ణులోకము, యింద్రలోకము యీమూడు లోకములకు వేరైనదియునైన ఓంకారమనే సింహాసనమైనదియు, సమస్తవేదములయందు చెప్పబడినదియు చతుర్వేదములకు మూలకుంభమైనదియునైన గురుస్వరూపము మూలాధారాది షట్కమలములయందు సంచరించునదియు, అనగ॥ హంసోహంసాయవిద్మహే॥ సోహంహంసాయధీమహి॥ తన్నోహంసగురుప్రబోధయాత్॥ అని వేదమంత్రము గురుపాదుకామంత్రము చెప్పియున్నది. కాబట్టి పరమహంసస్వరూపమైనదియు అద్వయబ్రహ్మమైనదియునై ప్రకాశించునట్టి తేజోమయమును, అద్వితీయమును, నిర్మలమును నిండియున్నదియు, స్వయంప్రకాశమైనదియు అఖండతేజోమయాకారంగా పరిపూర్ణమైనదియునైయున్న శ్రీసద్గురుపాదపద్మములకు నమః॥ నమస్కారము. అట్టిగురుస్వరూపం॥ శ్రుతి॥ వందేగురుపదద్వంద్వం, అవాఙ్మానసగోచరం॥ అట్టిగురుపదము వాక్కుచేతను మనస్సుచేతను యిట్టిదట్టిదని నిర్దేశించరానిదియు॥ శ్రుతి॥ యోస్థంయోగ, జీవ, బ్రహ్మైక్యమనెడి పీఠస్థ సింహాసనమునందుండు జగద్గురుం, జగత్తునకు ఆధారభూతమైన శ్రేష్ఠమైనగురుత్వమునకు శిరసా॥ శిరస్సుతో నమామి॥ నమస్కరించుచున్నాను. ప్రత్యక్షస్వరూపమైన, జీవ బ్రహ్మైక్యమైన సద్గురువునుగూర్చి విచారించెదము. ఎట్లనగ సద్గురువు, అఖండానందతేజోమయాకారముగాను స్వప్రకాశముగాయున్నదియు, జననమరణ ప్రవాహరూపకమైన సంసారభయమును పోగొట్టునట్టి సద్గురుతత్వము — సర్వదేవతాస్వరూపములకు ఆదిదేవతయైనదియు॥ తస్య॥ ఆసద్గురువుయొక్క — జీవాత్మ — పరమాత్మయనెడు॥ హం॥ సః॥ అనెడు రెండుజీవాక్షరములనే జీవాత్మపరమాత్మలనే సద్గురుతత్వయోగము ముఖ్యసాధనము. తన్నుతా దెలియుటె గురుతత్వయోగము. సంసారాగ్నియందు పరితప్తులగువారియొక్క తాపమును హరింపచేయునదియును శౌనకాదిమహామునులచేత స్మరింపతగినదియు, వినదగినదియు, చూడదగినదియు, తెలియదగినదియునైన సద్గురుస్వరూపతత్వయోగము బుద్ధిమొదలగువాని అంతరేంద్రియములకు

గోచరముగానివాడనియు, చూచుటకు శక్యమైన నామరూపములు లేకపోవు టవలన రూపములేనిదియు, అంతఃకరణకు విలక్షణమైనదియు, త్రిగుణముల కతీతమైనదియు, అపరబ్రహ్మమైనదియు నైయున్నదిగావున,

జీవుడు-ఏమార్గముద్వారా పరబ్రహ్మస్వరూపమగును —అని ప్రశ్న-యొట్టులనిన—గురుతత్వమును దెలియజేయునట్టి గురువు పరబ్రహ్మముగాను, పరబ్రహ్మమే గురువుగాను, సమస్తానందములకు కారణమైనట్టిదియు, సమస్త సౌఖ్యములను యిచ్చునట్టిదియు, భుక్తిముక్తుల నిచ్చునట్టిదియు, వేదశాస్త్ర పురాణేతిహాసములలో సారమైనదియు, మంత్రతంత్రాదికములను మణ్మతము లు, అనేకములగు సాంఖ్యాదిమతములు యివియన్నియు అవిద్యాజ్ఞానమువలన తననిజస్వరూపము తా దెలియక వాస్తవముగా దేహాదిప్రపంచమును జూచు చుండెడి జీవులయొక్క అవిద్యాజ్ఞానముచేత మనుజుడు గురుతత్వమును దెలిసి కొనక జేసెడి జపమును, తపస్సును, నియమమును, గంగాదిపుణ్యతీర్థసేవ యును, యోగమును, యజ్ఞ, షోడశమహాదానము మొదలైనవన్నియును, కామ్యకర్మ అనగ గురుతత్వమును దెలియకచేయుకర్మలు యవ్వటచేత నిష్ఫ లమైనవేయగును. కాబట్టి సద్గురుజ్ఞానముచేత గురుతత్వమునకంటె అన్యమై నదేదియును లేదు ఇదిసత్యము. ఇట్టిగురుతత్వమును బొందుటకు బ్రహ్మజ్ఞా ననిష్ఠాత్ములచే ప్రయత్నముచేయవలయును. సర్వప్రపంచకము అజ్ఞానకృ తమై అతిరహస్యమైన ప్రకృతిగానున్నది. దేహేంద్రియములకు గురుతత్వజ్ఞా నము లేకపోవుటవలన కలుగుచున్నది. అట్టి అజ్ఞాననాశనమైనతరువాత గురు తత్వయోగజ్ఞానము కలుగును. ఈగురుతత్వజ్ఞానము లేకపోవుటచేతనే దే హేంద్రియములు కలుగుచున్నది॥ శృతి। దేహీబ్రహ్మ, భవేద్యస్మాత్ — తత్కృపార్థం వధామితత్, సర్వపాపవిశుద్ధాత్మా శ్రీగురోః పాదశేవనాత్॥

భావార్థ. దేహి॥ జీవుడు, యస్మాత్॥ ఏకారణమువలన, శ్రీగురోః॥ ప్రకాశమానుడగు సద్గురువుయొక్క, పాదసేవానాత్॥ పాదములయొక్క సేవ వలన, సర్వ॥........త్మా॥ స్వరూపముగలవాడగునో, తత్॥ దానిని త్వం॥ నీయందలి, కృపార్థం॥ దయకొరకు, వదామి చెప్పుచున్నారు—

జీవుడెందువలన సద్గురుపాదపద్మములు సేవనుండి సమస్తపాపకర్మము లు నశించుటవలన పరిశుద్ధస్వరూపుడై, పరబ్రహ్మస్వరూపమైన గురుతత్వమ గునో దానిని నీయందుండెడి దయతో చెప్పెదము— వినుము. పాపమనెడి

బురదను శుష్కింపజేయునదియు, పరబ్రహ్మమగు గురుతత్వమునకు ప్రకాశమగు శ్రీగురుమంత్రానుష్ఠానము॥ శృతి॥ సంసారకారకాజ్ఞానం తమః ఖండభాస్కరః॥ అనునట్లు అజ్ఞానాంధకారమైన సంసారమును సూర్యుడుయుదయమైనతోడనే చీకటినశించునట్లుగ, వాగధిదాటుటకు నావవలెను. సంసారసాగరము దాటించుటకు శ్రీగురుతత్వజ్ఞానము॥ శృతి॥ బుద్ధిపూర్వాకృతంపాపం కృత్స్నందహానివహ్నివత్॥ బుద్ధిపూర్వకముగా చేయు పాపకర్మములు అగ్నిహోత్రముచేత దహించునట్లుగ జ్ఞానముచేతదహించు గురుతత్వజ్ఞానముచేత దహించును వాడదాటించు చుక్కానినడుపువాడే సద్గురుతత్వమని పరబ్రహ్మమునుదెలియజేయు కారణములుగావున తాను తాననే రూపమును తన్నుదాదెలియుట యెట్లనగ,

శృతి॥ గురొవక్త్రేస్థితంబ్రహ్మ ప్రాప్యతేతత్ప్రసాదతః గురోర్ధ్యానం తథా కుర్యా త్పురుషంస్వైరిణీయథా॥ అని యిట్లు॥

భావార్థః. గురువక్త్రే—గురు-గురువుయొక్క, వక్త్రే-ముఖమునందు,

స్థితం॥ ఉన్నటువంటి॥

బ్రహ్మ॥ పరబ్రహ్మము

తత్ప్రసాదతః॥ తత్॥ ఆగురువుయొక్క

ధ్యానం॥ ధ్యానమును

కుర్యాత్॥ చేయవలయును.

మనుష్యులు గురుతత్వజ్ఞానస్వరూపమైన పరబ్రహ్మస్వరూపమైనట్టి గురువనుగ్రహమువలన పొందబడిన రాజగుహ్యమైన బ్రహ్మైక్యామనస్కగురుతత్వయోగమును నిత్యము చిత్తవిశ్రాంతి కలిగి గురుతత్వమనే పరబ్రహ్మము మనోమారుతమ్ములు ఏకముజేసి బ్రహ్మానందమును బొందవలెను. ఇటుల బ్రహ్మైక్యసంధానము జేయు యుత్తముడు

శృతి॥ ప్రాప్యతే॥ పొందబడుచున్నది.

స్వైరిణీ॥ స్వేచ్ఛగా తిరిగెడి స్త్రీ విటకత్తె, పురుషం॥ అన్యపురుషుని యథా॥ యేప్రకారమో, తథా॥ అప్రకారము, గురోః॥ గురువుయొక్క, ధ్యానం॥ ధ్యానమును, కుర్యాత్॥ చేయవలయును. కాబట్టి అట్టి బ్రహ్మజ్ఞానిగురువును యెల్లప్పుడు యెడతెగకుండ వ్యభిచారియగు స్త్రీ, తనకొన్ని పనులుండియు పరపురుషునియందు మనస్సుంటవలెనే ఏకాగ్రచిత్తులై ధ్యానించవలయును,

శ్రీకామహృదయమునకు పరపురుషానురక్తి గల భామిని యెల్ల ఘనుల్ గృహంబునకా బోరిబోరి జేయుచుకా ప్రియుని పొందు సుఖంబున బాయునరీతి భాస్వరపరతత్వవేది నిజవర్ణ విహారిమయోగధర్మముల్ నిరతము సల్పుచుకా పరమనిర్మలసౌఖ్యము గాంచు నమ్మదిక॥ అని శ్రీరాములవారు ఆంజనేయులకున్ను- ఈశ్వరుడు పార్వతికిని యిట్లు బోధించిరి. కావున॥ శృతి॥ గురోః పరతరం నాస్తి, తస్మై॥ గురుతత్వయోగముకన్న తదితరమైన దించు కైనను లేదు. ఆకారణముచేత గురుముఖముయందున్న బ్రహ్మవిద్య॥ శృతి॥ గురోర్ముఖేనజ్ఞాతవ్యం॥ అనునట్లు గురువుయందలి భక్తిచేత బొందవచ్చును గాని తదితరసాధనములవల్ల సాధ్యముకానేరదు. ఇట్లు పొందినవారు త్రిలోకములయందు నిశ్చలమైన బుద్ధిగలవారై గురువులకు గురువులై, వేల్పులకు ఆదివేల్పులై యుందురు. కావున గురు-అనే, రెండుబీజములకు అర్థమేమనగ గోచరించినంతవరకు చెప్పెదము --

శృతి॥ గుకారశ్చాంధకారోహి రుకారస్తేజ ఉచ్యతే । అజ్ఞాన గ్రాసకం బ్రహ్మ । గురుదేవ నసంశయః॥

భావార్థం- గురువక్త్రే, గురువుయొక్క, వక్త్రే- ముఖమునందు, స్థితా- ఉన్నటువంటి, విద్యా- పరబ్రహ్మవిద్య, గురుభక్త్యా- గురువుయందలి, భక్తి చేతను, లభ్యతే- పొందబడుచున్నది, త్రై- లో- త్రైలోక్య- మూడులోకముల యందు, స్ఫుట-వక్తారః- పలుకునట్టి, దె...గాః- దేవ- దేవతలు, ఆది- మొదలుగాగల, అసుర- రాక్షసులును, పన్నగాః- పన్నగులును. భవంతి- అగుచున్నారు.

గురుముఖమునందున్న పరబ్రహ్మవిద్య గురువుయందున్న భక్తి పొందబడుచున్నది. ఇట్లు పొందినవారు యెల్లలోకములకు పూజ్యులై యుందురు.

పైశ్లోకమునకు అర్థము, వ్రాయబడుచున్నది.

భావార్థము॥ గుకారశ్చ- గురువర్ణము అంధకారోహి- గాఢమైన చీకటిగాను, రుకారః- రువర్ణము, తేజస్సుగాను, ఉచ్యతే- చెప్పబడుచున్నది, అజ్ఞానగ్రాసకం- అజ్ఞానమును, భక్షించునట్టి బ్రహ్మ- పరబ్రహ్మము, గురు రేవ-బ్రహ్మజ్ఞానోపదేశమును జేసిన, గురువే- భవతి- అగుచున్నాడు, నసంశయః- సందేహము లేదు.

గుకారమే గాఢచీకటిగాను,

ఆ గాఢచీకటిని హరించెడి తేజస్సుగాను చెప్పబడుచున్నది. గనుక, అజ్ఞానాంధకారము ను నశింపుచేసెడి పరబ్రహ్మము గురువే యగుచున్నాడు. దీనికి సంశయములేదు.

శృతి॥ గుకారస్త్వాంధకారస్తు- రుకారస్తన్నిరోధకృత్ అంధకార వినాశిత్వా- ద్గురురిత్యభిధీయతే।

భావార్థం॥- గుకారశ్చ- గుకారమును,

అంధకారస్తు కటికచీకటియును,

రుకారః- రుకారమును,

తన్నిరోధకృత్ -త్- ఆయాంధకారమునకు,

నిరోధ- అడ్డను,

కృత్ - చేయునది,

అంధకారవినాశత్వాత్ -

అంధకార- చీకటిని,

వినాశిత్వాత్ - నశింపజేయుటవలన,

గురురితి గురువని,

అభిధీయతే- చెప్పబడుచున్నాడు.

శృతి॥ గుకారశ్చగుణాతీతో, రూపాతీతో రుకారకః గుణరూపవిహీనత్వా, ద్గురురిత్యభిధీయతే।

భావార్థం- గుకారశ్చ గుకారమును,

గుణాతీతః- సత్వాదిగుణము లతిక్రమించినది త్రిగుణాతీతమైనది.

రుకారః- రుకారము,

రూపాతీతః- ఆకృతిని నతిక్రమించునది రూపములకు అతీతమైనది.

గుణత్వాత్ - గుణరూప గుణరూపములతో,

విహీనత్వాత్ - శూన్యమౌటవలన,

గురురితి- గురువని,

అభిధీయతే- చెప్పబడుచున్నది.

సత్వాదిగుణముల నతిక్రమించి యుండునది గుకారమును కరచరణాద్యాకృతి లేనిది రుకారమును. యిట్లు గుణరూపములు లేకపోవుటవలన గురువని చెప్పబడుచున్నది.

శ్రుతి॥ గుకారః- ప్రథమోవర్ణో మాయాదిగుణభాసకం రుకారోస్థి పరం బ్రహ్మ మాయాభ్రాంతివిమోచకం॥

భావార్థం॥ ప్రథమః- మొదటిదియగు,

గుకారః- గుకారమనెడి,

వర్ణః అక్షరము,

మా-కం, మా- మాయాది, మాయ మొదలైన దానియొక్క,

గుణ-గుణములను,

భాసకం- ప్రకాసింపజేయునదిగా,

అస్థి అగుచున్నది,

రుకారః- రువర్ణము,

మా- కం, మాయా- మాయవల్లనైన,

భ్రాంతి- చలనమును,

విమోచకం- విడుపించునట్టి,

పరం- శ్రేష్ఠమగు,

బ్రహ్మ- బ్రహ్మముగా,

అస్థి, వుండుచున్నది,

కాబట్టి గురుపదముల నందలి మొదటివర్ణమగు గుకారము మాయ మొదలైన గుణములను ప్రకాశింపజేయుచున్నది. రెండవవర్ణమగు రుకారము ఆమాయయొక్క భ్రాంత్యాదిగుణములను నశింపుజేసెడి పరబ్రహ్మమై యున్నది. ఇట్లు గురుపదమే మాయగాను పరబ్రహ్మముగాను ఉన్నది. కావున

శ్రుతి॥ ఏవంగురుపదం శ్రేష్ఠం దేవానామపి దుర్లభం హాహాహూహూగణైశ్చైవ । గంధర్వాద్యైశ్చపూజితం॥

భావార్థం।- ఏవం- ఈప్రకారము,

గురుపదం- గురువనుపదము,

శ్రేష్ఠ- అధికమైనదిగాను,

దేవానామపి- దేవతులకును,

దుర్లభం- పొందుటకు శక్యము కానిదిగాను,

గంధర్వాద్యైః- గంధర్వులు మొదలైన,

హాహాహూహూగణైశ్చైవ హాహాహూహూ లనువారియొక్క సమూహములచేతనున్ను,

పూజితం- అర్పింపబడినదిగాను,

భవతి- అగుచున్నది.

కాబట్టి ఇట్లు శ్రేష్ఠమైన గురుపదము దేవతలకును పొందుట కశక్యమైనదై హాహాహూహూ మొదలైన గంధర్వులచే పూజింపబడినదై యుండుచున్నది. అందరికిని గురుతత్త్వయోగమునకంటె నన్యమగు పరమాత్మ స్వరూపము లేదు. గురువునే పూజించవలయును. తన బ్రతుకునంతయు తాను జేయు సర్వకర్మలు గురుబ్రహ్మార్పణమని అర్పించవలయును. ఈగురుతత్త్వయోగమనే పరబ్రహ్మవిద్యను సాధించవలయుననెడి కోరికగలవాఁడు చేతి గురువునకు సంతోషము గలుగజేయునట్టి అంగ, స్థాన, అన్న, శుశ్రూషయనెడు చతుర్విధ శుశ్రూషలు చేయుచు గురుసన్నిధౌ- గురువుయొక్క సమీపమునందు, నిర్లజ్జః- దేహాభిమానము లేనివాఁడై, దీర్ఘదండం- పొడుగైన కొయ్యవలె అనగ నిశ్చలమైన మనస్సుగలవాఁడై సాష్టాంగముగా నమస్కృత్య, నమస్కరించి కర్మణా కర్మము చేతను, మనసా- మనస్సు చేతను, వాచా- వాక్కు చేతను, గురు- గురువును, సర్వదా- యెల్లప్పుడును, ఆరాధయేత్- పూజింపవలయును. కాబట్టి సద్గురునకు తనదేహేంద్రియములను ప్రాణము, మనస్సు, యీ మొదలయినవన్నియు పరమేశ్వరార్పణముచేయుచు నిత్యము నిష్కామకర్మ జేయుచు, ఆత్మారామ పరబ్రహ్మమును అంతరంగమున మానసపూజచేయవలయును గాబట్టి సమస్తమైనజనులకు గురువుయొక్కడె. బ్రహ్మవిష్ణు శివాత్మకస్వరూపకమగుచున్నాడు. గురువుకంటెను శ్రేష్ఠమగునది ఏదియు లేదు. అందువలన సద్గురుస్వామిని పూజింపవలయును గాన వేదోపనిషత్తులనెడి గొప్పరత్నముల కాంతులచేత ప్రకాశింపఁబడినట్టి పాదపద్మములు గలవాడును, ఉపనిషత్తుల తాత్పర్యమును జెప్పెడువాడును నగు సద్గురువును మిక్కిలి పూజింపవలయును. కాబట్టి ఈదేహము అనేకపురుగులతోఁగూడినదియును చెడువాసనగలదియును, మలమూత్రముగలదియును, తెమడ, కఫ్ఫము, రక్తము, మాంసము ఈమొదలయినవాటితో కూడుకొనినదయ్యెనే యున్నది. కావున ఈసంసారవృక్షమనె, వేదవృక్షమనె చెట్టునుయొక్క యున్న జీవులు, నరకసముద్రమునందు బడుచున్నారు. అటువంటివారలనందరిని గురుతత్త్వ

యోగజ్ఞానోపదేశముచేత రక్షించుచున్నాడో అట్టిసద్గురువుకొరకు నమస్కారము గావున ఏగురువుచేత అజ్ఞానమనెడు చీకటిచే గుడ్డివాడగు మనుష్యుని యొక్క జ్ఞాననేత్రము పరబ్రహ్మజ్ఞానమను, అంజనం- కాటుకయొక్క- కణికతో తెరవబడుచున్నదో అట్టిసద్గురువుకొరకు నమస్కారము గావున గురుతత్వయోగజ్ఞానముచేత అంతట వ్యాపించియుండెడి స్థావరజంగమాత్మకమును చరాచరాత్మకముతో గూడుకొనిన యుష్మత్పదార్థమైన జీవస్వరూపమును జూపింపబడినదో అట్టిసద్గురువుకొరకు నమస్కరించెదను. కాబట్టి ఏపరబ్రహ్మము సమస్తజగత్తును వ్యాపించి నిర్గుణమును, నిర్మలమును, శాంతమును జంగమస్థావరాంతికమైనదో అట్టిపరబ్రహ్మస్వరూపమగు సద్గురుస్వరూపము కొరకు ఆత్మానాత్మవివేకజ్ఞానముచేత తాదెలియవలయును. కాబట్టి ఏపరబ్రహ్మముయుండుటచేతనే ఈజగత్తంతయు నున్నదో గురుతత్వయోగానందముచేతనే జగత్తంతయు ప్రకాశించుచున్నదో, గురుతత్వజ్ఞానానందముచేతనే లోకులందరును ఆనందించుచున్నారో అట్టిపరబ్రహ్మస్వరూపమైన పరబ్రహ్మముకొరకు నమస్కారము. ఈగురుతత్వయోగానుభవమునందు ఈసమస్తజగత్తును ఉండి పరబ్రహ్మస్వరూపమైన తాను సూర్యునివలన ప్రకాశించుచున్నదియో, భ్రమరూపకమైన దారాపుత్రాదులు మొదలయినవారందరు ఏపరమాత్మయొక్క దయచేత కలుగుచున్నదో అట్టిపరమాత్మస్వరూపమైన గురువునకు నమస్కారము — కావున అనేకవిధములగు యోగములయొక్క యుపదేశములచేత శిష్యులయొక్క పారంపర్యము తరింపచేయబడినది. గురుతత్వజ్ఞానయోగసారము దెలిసికొనుటచేత గురుసంబంధమగు బ్రహ్మపదము నశించునది గావున, సంసారబంధమునుండి తొలగించి ఉద్ధరించెడువాడవును, భక్తులకార్యములను నెరవేర్చుటకు ముఖ్యమైన సమర్థుడవును జ్ఞానానందస్వరూపుడవును గురుతత్వజ్ఞానయోగస్వరూపుడవును, అవికారుండవును, త్రిగుణరహితుండవును బ్రహ్మప్రణవమంత్రస్వరూపుండవును నగు గురువునకు నమస్కారము—

శృతిః ఏత్- ఈశరీరము, క్రిమికోటిభిః- క్రిమి- పురుగులయొక్క, కోటిభిః- కోట్లచేతను, ఆక్రష్టః- గూడుకొనునదియును, దుర్గంధిః- చెడువాసన గలదియును, మలమూత్రములుగలదియును, శ్లేష్మరక్తకఫైః- శ్లేష్మ॥ తెమడచేతను, రక్త- రక్తముచేతను, కఫైః- కఫముచేతను, మాంసైః- మాంసముచే

తను, నర్ధం-రూపనామకనికయను, భవతి. అనుచున్నది. కాబట్టి, ఏగురుత త్త్వజ్ఞానముచేత సమస్తప్రపంచము పరిపూర్ణమై అఖండస్వరూపమైనట్లు, వ్యాపింపబడియున్నదో అట్టి గురుతత్త్వజ్ఞానయోగస్థానము ఏనిజగురుపుచేత తెన్నుతా దెలిసికొనబడినదో అట్టి సద్గురుతత్త్వజ్ఞానయోగమునకు నమస్కారము. కావున ఏగురుతత్త్వజ్ఞానముచేత జంగమస్థావరములతో గూడియున్న సర్వలోకములను వ్యాపింపబడినదై, పరమాత్మస్వరూపముగ జీవేశ్వరులయొక్క ఐక్యస్వరూపమగు పరమాత్మానుభవమును జూపింపంబడినదో అట్టిగురుతత్త్వమును,

శృతి। యద్వాక్యాత్॥ యత్॥ ఏగురువుయొక్క, వాక్యాత్॥ వాక్యమునుండి, నిమి.....తార్ధాద్వా॥ నిమిష॥ నిమషకాలముయొక్క, అర్ధ। సగములో, అర్ధ॥ సగము, పాతాద్వా॥ గడచిపోవుటనుండియును, ఆత్మా॥ పరమాత్మస్వరూపము, విలోక్యతే॥ చూడబడుచున్నదో, స్థిరం॥ శాశ్వతమైన, స్వాత్మానం॥ స్వ॥ తనయొక్క, ఆత్మానం। ఆత్మస్వరూపమును, ఆదత్తే॥ గ్రహించుచున్నాడో, తస్మై॥ అటువంటి, శ్రీగురవే। ప్రకాశమానమైన సద్గురువు కొరకు, నమః। నమస్కరించుచున్నాను. కావున, ఏగురుతత్త్వము సమస్తజగత్తును వ్యాపించియున్నదో నిర్గుణము, నిర్మలము, శాంతము, జంగమస్థావరాత్మకమై యున్నదియో, అట్టిపరమాత్మమైన గురుతత్త్వమును ఇహాముష్మార్థఫలభోగవిరాగియై తన్నుతా దెలుసుకొనవలయును— కాబట్టి ఏగురుతత్త్వము యుండుటచేతనే ఈజగత్తంతయు యున్నదో, ఏగురువుయొక్క ప్రకాశమానముచేతనే జగత్తంతయు వెలుగుచున్నదో, ఏతత్త్వజ్ఞానముయొక్క ఆనందముచేతనే లోకమునందు జనులందరును ఆనందించుచున్నారో, ఆకారణముచేతనే ఈగురుతత్త్వయోగానందముచేత సర్వము ఆనందింపుచున్నారు కాబట్టి—చిత్తను చలనాదివ్యాపారము గలిగి చేతనముగ దానిని జేయుచున్నదో, ఏఆత్మయొక్క ప్రకాశముచేత నరుడు జాగ్రత్స్వప్నసుషుప్త్యాది సర్వప్రపంచమును గూర్చి చలనాదివ్యాపారముగలవాడుగా చేయబడుచున్నాడో అట్టి ఆత్మస్వరూపుడైన సద్గురువుకొరకు శమాదిషట్కసంపత్తిగలిగి సాధించవలయును. కాబట్టి ఆత్మసంబంధమగు మెరుకయే సమస్తజగత్తునునై ప్రపంచమునందలి వేరువేరు వస్తువులయొక్క భేదమువలన తెలియబడకయున్నదో అటువంటి గురుతత్త్వయోగమును సాధించినవాడు యెల్లప్పుడు అద్వితీయస్వరూ

పుష్పనైన పరమాత్మస్వరూపము తానై ప్రకాశించును. అట్టిఆత్మజీవేశ్వర స్వరూపముచేత ప్రకాశించుచు తెలియవచ్చెడి ఈసమస్తము కేవలము గురుతత్వస్వరూపమైయ్యే యున్నది. కావున తానైనపరమాత్మయొక్క నిజస్వరూపము తానైనను తనకువేరొకటిలేకపోవుటవలన తనకన్నా వేరుగా తెలిసికొనుటలేదు. కావున అద్వితీయుడగు తాను పరమపదస్వరూపమై ప్రకాశించును. కాబట్టి సర్వకారణుడగు భగవంతునికొరకు కార్యరూపమైన సమస్తప్రపంచము ప్రకాశించుచున్నది. అట్టికార్యకారణ స్వరూపమైన భగవంతుడగు సద్గురుని కొరకు ముముక్షువులై విచారించవలయును. కావున నానారూపాత్మకమగు సమస్తప్రపంచకము తానైన పరమాత్మకు వేరుగాకయున్నదో అట్టికార్యకారణాత్మకమగు గురుతత్వము రాజయోగామనస్కులై తన్నదా దెలియవలెను —

శృతి॥ గురుస్సకలధర్మాత్మా॥ సమస్తమైనధర్మములే ఆత్మస్వరూపముగాగలగురువే, బంధు॥ చుట్టము, భవతి॥ అగుచున్నాడు. విపమే॥ ఎక్కువతక్కువలు, ఆపద। సుఖము, సముపస్థితే॥ పొందబడుచుండగా, పరః॥ శ్రేష్ఠుడును, ఏకః। తానొక్కడైన, గురవే। ప్రకాశమానమగు గురుతత్వమునకు నమస్కారము — కావున ఈప్రపంచమంతయు శ్రీగురుతత్వమైయున్నది. గురువు ప్రపంచమైయున్నాడు. ప్రపంచమంతయు గురుతత్వమే. అట్టిసస్వరూపుడైన పరమాత్మ జననమరణప్రవాహరూపకమైన శరీరమునెడి యరణ్యమునందు ప్రవేశించి సస్వరూపజ్ఞానము మరచిపోవుటచేత చంచలాత్మమైన మనస్సుగలవానికి ఏగురుతత్వయోగముచేత సస్వరూప సాక్షాత్కారమగు జ్ఞానమార్గముచూపింపంబడునో, తన్నుతా దెలియబడునో అట్టిగురుతత్వయోగజ్ఞానకి జ్వరాదిరోగములవల్లనైన ఆధ్యాత్మికతాపము సర్పవృశ్చికాదులవల్లనైన అధిభౌతికతాపమును, పిడుగులుమొదలైనవానివలన కలిగెడు అతిదైవికతాపమును, యీమూడుతాపములనెడు అగ్నిచేత దగ్ధముచేయబడి శాంతము, ఓర్పులేని మానవునకు ఆతాపత్రియబాధలను బోగొట్టి సంతోషమునుగలుగజేయుటకు, ఆనందమునుగలుగజేయుటకు॥ శృతి॥ ఆనందోబ్రహ్మా। అనుశృతి ఏశాంతమనె సముద్రమందు స్నానముజేసిన తాపముచల్లారునుగాబట్టి, ప్రపంచమునందు జీవులు అజ్ఞానమను గొప్పసర్పముకరచి విషముతలకెక్కి ఆవిషబాధతాపము బడుచున్నారు. అటువ

విషబాధబడుచున్న జీవులనుగూర్చి అజ్ఞానమనేవిషహరణముచేయు మహానౌషధవైద్యుడగువాడు॥ శృతి॥ వైద్యో నారాయణోహరిః॥

అటువంటిగురువు అనగ వైద్యుడు భగవంతుడైయున్న శ్రీమన్నారాయణమూర్తికి తప్ప తదితరులకు సాధ్యముకాదు. కావున॥ శృతి॥ జగతామె లోకములకు కారణుడు, సంసార॥ సంసారమనెడి, ఆర్ణవ॥ సముద్రమునకు, సేతవే॥ వారధియైనవాడు, సర్వవిద్యానాం॥ అన్నివిద్యలకును, ప్రభవే॥ జన్మకారణుడగు, గురుతత్వజ్ఞానయోగమును తాదెలుసుకొను విధము యెట్లనిన,

శృతి॥ మధులుబ్ధోయథాభృంగః పుష్పాత్పుష్పాంతరంవ్రజేత్, జ్ఞానలుబ్ధస్తథాశిష్యో గురోర్గుర్వంతరంవ్రజేత్॥ మధులుబ్ధః॥ మధు॥ పూదేనెయందు, లుబ్ధః॥ ఆశగల, భృంగః॥ తుమ్మెద, యథా॥ ఏప్రకారము, పుష్పాత్॥ ఒక పువ్వునుండి, పుష్పాంతరం॥ వేరొకపుష్పమునుగూర్చి, వ్రజేత్॥ పొందునో, తథా॥ ఆప్రకారము, జ్ఞానలుబ్ధః॥ జ్ఞాన॥ స్వాత్మజ్ఞానమునందు, లుబ్ధః॥ ఆశగల, శిష్యః॥ శిష్యుడు అనగ- అవిద్యాసంబధమైన జీవుడు, గురోః॥ యొకగురువునుండి, గుర్వంతరం॥ వేరొకగురువును, వ్రజేత్- పొందవలయును, కాబట్టి॥ శృతి॥ తన్ను దాటలియు అనగ స్వయంతారతీతి పరమ్ తారయ॥ అనునట్లు తాను తరించి యితరులను తరింపుజేయు నిజగురువుని జేరవచ్చును. అట్టి నిజగురువు యెట్టివాడనగ [illegible] ములకు నగోచరుడును శివశక్తిస్వరూపము గలవాడును ఘనమైన గురుపాదద్వందముగూర్చి విరళముగ విచారించెదము.

గు- అనగ, గువర్ణము- రక్తవర్ణము, పృథివితత్వము, అనగ దేహము, త్రిగుణాత్మికయా ప్రకృతిని దగిలియుండిన సగుణుడని యందురు. ఆ త్రిగుణములను విడచినచో గుణాతీతుడైన [illegible] డనియు అనగ- దేహము, దేహి యివిరెండును గుకారము గుణాతీతము, గుకారం అనగ చీకటి, అజ్ఞానం- అవిద్య- కించజ్ఞుడు, దేహము, పంచభూతమిశ్రమమైన దేహేంద్రియ సమన్వితమైనది. పంచవింశతితత్వాత్మకుడు కార్యోపాధి- స్థూలదేహం, జాగ్రదవస్థ- ఇది గుకారశబ్దమునకు అర్థము ఇది [illegible] మునకు ఆవరణ, దీనినే ఆవరణవిక్షేపశక్తి యనియును, చిచ్ఛక్తి గునియును చెప్పుదురు.

గుకార, మనగ రువర్ణం, రూపవర్జితం- అని యున్నది. రువర్ణం-అగ్నితత్వము, అగ్నిబీజము- నలుపువర్ణము, రూపవర్జితం అనగ, రూపములకు అతీతము- ఆకారములేనిది. అరూపంచ, చరాచర చిజ్జడనామరూపములు

లేనిదియు నగు సస్వరూపము. యః- యెవ్వఁడు, దద్యాత్ - ఇచ్చునో, సహ-వాఁడు, గురుః- గురువుగా, స్మృతః- చెప్పబడుచున్నాఁడు. కావున ప్రపంచమునందు జీవుఁడు దేనివలన ఆశ్చర్యమగు సంసారబాధనుండి మోక్షమును బొందుచున్నాఁడో, ఆమోక్షము దయచేయవలయునని యడిగిన—

శ్రుతి॥ మందభాగ్యాః- మంద- అల్పమైన, అవివేకమైన, భాగ్యాః అదృష్టముగలవారలు, అవిద్యాజ్ఞానముగలవారు అగ్రతః- ముందుగా, శ్రీగురోః- సద్గురువుయొక్క, అనఁగ, గురుతత్త్వజ్ఞానముయొక్క పరమం రూపం- శ్రేష్ఠమైన రూపమును, పరబ్రహ్మస్వరూపమును వివేకంచక్షుః జ్ఞాననేత్రముచేత, అంధః- గ్రుడ్డివాఁడు, సూర్యోదయం యథా- సూర్యునియొక్క, ఉదయం యథా- ఉదయమును వలెనే, నపశ్యంతి- చూడరు, కాబట్టి గ్రుడ్డివాఁడు, సూర్యుని యెదుటనున్నను, చూడలేనట్లుగనే అదృష్టఅవిద్యాజ్ఞానము గలవారు పరబ్రహ్మస్వరూపమైన సద్గురువుయొక్క నిజమైన రూపమును, దెలిసికొనజాలరు. కావున, శ్రుతి॥ విశ్వస్థితి ప్రళయనాటక నిత్యసాక్షి॥ అని శ్రుతి జగత్తుయొక్క ఉత్పత్తి స్థితిలయములనెడి ప్రళయనాటకములకు సాక్షియైన పూజ్యుఁడు గావున॥ శ్రుతి॥ మోక్షం వినాముక్తిపదం లభ్యతే గురుభక్తితః॥ గురోః సామాన్యతో నాన్యత్ సాధనం గురుమార్గిణాం॥

మోక్షస్థానము జ్ఞానము లేకుండానే గురుభక్తివలన పొందబడుచున్నది. కనుక గురుతత్త్వయోగము గలవారలకు సామాన్యముగా గురువుకంటె వేరైన యుపాయము లేదు.

శ్రుతి॥ యస్మాత్పరతరం నాస్తి నేతి నేతీతి వైశ్రుతిః॥
మనసావచసాచైవ సత్యమారాధ యేద్గురుమ్॥—

॥నేతి నేతియను శ్రుతి॥ ఏగురుతత్త్వయోగజ్ఞానముకంటె నధికమైనది లేదని చెప్పుచున్నదో అట్టి సత్యమగు గురుతత్త్వయోగమును వాఙ్మనస్సులతో పూజించవలయును. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుఁడు, సనకసనందనాదులు మహాఋషులు మునీశ్వరులు మహా గొప్పవారైన విష్ణుహంశాసంభూతులైన, నవఖండాధిపతులైన మహారాజులు వారందరు గురుతత్త్వయోగమును దెలియుటచేతను గురుసేవ జేయుటచేతను అట్టి సామర్థ్యములను బొందిరి. కావున,

శ్రుతి॥ మహాహంకార గర్వేణ । తపోవిద్యాబలేనచ॥
బ్రమంతి తాస్మిన్ సంసారే । ఘటీయంత్రం యథా పునః॥

భా- జనాః- జనులు, మహాహంకారగర్వేణ- గొప్ప అహంకారము యొక్క అభిమానముచేతను, తపోబలేనచ- తపస్సుయొక్కయు, విద్యా- చదువులయొక్కయు, బలేనచ- బలముచేతనున్ను, అస్మిన్- ఈ, సంసారే- సంసారమునందు, పునః- మరల, ఘటీయంత్రిమ ఘా- బావిగిలకవలెనే- నీళ్ళు తోడుటకు బావికి సర్పరచిన గిలక, భ్రమంతి- పుట్టుచున్నారు.

కాబట్టి, ప్రసిధసిద్ధులును, గంధర్వులును, దేవకిన్నరగంధర్వులును, పితృదేవతలును, యక్షులును, వీరు అందరుగురుతత్వజ్ఞానయోగమును సద్గురుపుద్వారా దెలిసినవారు కారు. అనగ, తన్నుదా దెలిసినవారు కారు అని స్కాంధపురాణములు శ్రుతి శృతియుపనిషద్వాక్యములు, యోగశాస్త్రములు, శంకరభాష్య ప్రస్థానత్రియము మొదలైనవి ఒప్పుకోబడలేదు.

ఈపూర్వము చెప్పినవిధముగానే సద్గురుతత్వయోగము సాధించుట వలన పరమాత్మజ్ఞానము తానంతట తానే దెలియబడుచున్నది. అప్పుడు గురుముఖ వివేకజ్ఞానముచేత తన్నుదా దెలసి తా బ్రహ్మమైతినని అయమాత్మా బ్రహ్మమని శృతిప్రకారము తాను తానై, బంధరహితమైన మోక్షసామ్రాజ్య సుఖమును బొందును గాబట్టి గురుతత్వయోగముచేత చెప్పబడిన దశవిధయోగములుచేతను యీదశవిధయోగములలో జ్ఞానయోగమువలను మనస్సు పరిశుద్ధమైన మనోసంకల్పముగు నీసమస్తమును ఖండించవలయును. కావున, జీవాత్మయైన బ్రహ్మజ్ఞానమును పరమాత్మయై యున్నది. ఈరెండున్ను మనస్సుగాన చెప్పబడుచున్నవి. ఈజీవాత్మ పరమాత్మలు రెండున్ను గురుపదములు. ఈరెండున్ను భేదములుగాక యొకటి ఏకమేవాద్వితీయం బ్రహ్మమైన యెడల తాను తానై యున్నది. కాబట్టి అనేకశాస్త్రములయొక్క సారాంశముతోను మాటలతోను ప్రయోజనములేదు. విశేషమై ఘనమై, శ్రేష్ఠమైన, సద్గురుతత్వజ్ఞానయోగము లేకుండా మనోవిశ్రాంతి అనగా చిత్తవిశ్రాంతి గలుగనేరదు. గురు అనెడి వర్ణములయొక్క జంటయే మంత్రరాజము రాజగుహ్యము పరమరహస్యము పరమగుహ్యము శ్రుతిస్మృత్యుపనిషద్ వేదార్థములయొక్క అనుభవవాక్యముల నుపదేశించెడి గురువే పరమపదము. అట్టి పరమగురుతత్వయోగమును దెలిసినవాడు సన్యాసిగాని సత్కారమానసపూజలకొరకు దండకాషాయములను ధరించెడివాడు సన్యాసియని

చెప్పగూడదు. జ్ఞానమునం దాసక్తిగలవారె సన్యాసియగును. గురుతత్వజ్ఞాన యోగమును యెవ్వరైతే గురుపాదపద్మముల సేవచేతను మహావాక్యముల చేతను దెలుసుకొనుచున్నారో వారె అంతర సన్యాసులని చెప్పబడుచున్నారు. సద్గురుతత్వజ్ఞానయోగముచేత తనలో తా దెలసినవానికి తన్ను తా జూచు వానికి సర్వసమభావము మోక్షమార్గము ఆత్మజ్ఞానము గలుగుచున్నది. బ్రహ్మ మొదలుకొని తృణపర్యంతముండెడు స్థావరజంగమాత్మకమగు సద్గురుస్వరూప పరమాత్మనుగూర్చి యింతవరకు విచారించితిమి. కావున, బ్రహ్మజ్ఞాని రెప్ప పాటుకాలములో అతిసూక్ష్మముగ పరమాత్మయందు మనోలీనత బొందు చున్నాడు. కావున, అనేకజన్మములయందు యున్న కర్మము అప్పుడే నశించు చున్నది. కాబట్టి॥ శృతి॥ ఏకాక్షర ప్రదాతారం। యోగురుం నైవమన్యతే। శ్వానయోనిశతం గత్వా। ఛండాలేష్వభిజాయతే॥ అనగా- ఏమనుష్యుడు, తానొక్కడైన పరమాత్మ నాశరహితమై ప్రణవోపదేశమును జేసిన సద్గురువును దలంచడో వాడు నూరుసార్లు కుక్కయోనులయందు జన్మించి కడపటఛండాలురయందు పుట్టుచున్నాడు. కావున, సద్గురుతత్వజ్ఞానయోగము విడుచుటవలన మరణమును మంత్రము విడుచుటవలన దారిద్ర్యమును కలుగు ను గురువును మంత్రమును రెంటిని విడుచుటవలన రౌరవాది మహానరకము బొందును. సంసారసముద్రమునుండి దాటించి రక్షించుటకు ముఖ్యమైన మహా మంత్రము బ్రహ్మమొదలైన దేవతలచేతను ఋషులచేతను పూజింపంబడి విడచి సిద్ధి పొందింపబడిన గొప్పమంత్రము, దరిద్రదుఃఖములను సంసారరోగములను మాన్పెడు ఘనమైన మంత్రము, పుట్టుట చచ్చుట పెరుగుట యనే గొప్ప భయమును హరింపుజేయునదియు నగు ఈదివ్యగురురాజ మహామంత్రమును గూర్చి నమస్కరించెదను.

గద్య. ఇతి శ్రీభీమనిరంజన నిగమాగోచర గురువరకరుణాకటాక్ష వీక్షణాయత్తచిత్త చైతన్య జగజ్జేగీయమాన ప్రకర్షితాత్మితనై సచ్చిదానంద గుణగణాతీత వేదవేదాంగమంత్ర మంత్రార్థ శ్రీమద్గురుపాదుకాపూర్ణ దీక్ష పక్షదక్షత్వశుద్ధ నిర్గుణనిజబోధపరాయణాపారీణ పారాయణాధురీణ అజ్జాడపు సూర్యనారాయణాఖ్య విరాజమానప్రభాసిత ప్రజ్ఞాప్రకర్షితప్రబోధితనై వే మూరివంశపయః పారావారరాకాసుధాకరస్య కౌండిన్యసగోత్ర వీరయభాగ మాంబా గర్భకనిష్ఠిజనితహారితసగోత్ర సౌభాగ్యవతిసామ్రాజ్యభోజ్యవిద్యో పాసనావరత్రిసాదకవనాకవిత కాట్రాపులపల్లి సూర్యానారాయణయోగిసీ ప్రణీతంబగు శ్రీమహాఋషినిఘంటితయోగశాస్త్రే బ్రహ్మవిద్యాయాం వివేక యోగము దివ్యజ్ఞానయోగము సుజ్ఞానయోగము జీవన్ముక్తియోగము గురుత త్వయోగము తృతీయప్రకరణము సమాప్తము.



# శ్రీ మహాఋషి నిఘంటిత యోగశాస్త్రము.

## జన్మసూత్రము.

— । శ్రీకృష్ణుడు సూర్యునకు జన్మసూత్రము బోధించుట. । —

జీవన్ముక్తులయిన శ్రీసద్గురులైన మహాదేవాచార్యులవారికి నమస్కారము. జన్మసూత్రమునుగురించి తెనుగాఖ్యానించుటకు- శృతి॥ నిత్యంనిరామయం పూర్ణనిరంజనమనామయం॥ నిద్వంద్వనిర్వ్యయంలింగవస్తు మద్రహితం నమః॥ వేదాంతార్థమును సవిస్తరముగ జన్మసూత్రవిచారణచేయుచున్నారము. మోక్షదాయకమైన మానవజన్మయొక్క సూత్రము సూత్రమనగా దారము. తననిజస్థితిని తెలిసికొనుట బంధవిముక్తి మార్గమును తాదెలియుట యనియున్నది. ప్రకృతిపురుషుడు, క్షేత్రము, క్షేత్రజ్ఞుడు, జ్ఞానము, జ్ఞేయము- యీ మొదలయినవన్నియు త్వంపదానకువాచ్యార్థమున్ను, యేది-యెవరు లక్ష్యార్థము, యేదియెవరు, వీటియర్థమును తెలియుటకొరకున్ను పొందియుండుటకున్ను దృష్టాంతము తెప్పియనగ, త్వంపదమునకు- వాచ్యార్థము—చిదాభాసుడనె- క్షేత్రమైన- జ్ఞానమనే ప్రకృతిపురుడు వాచ్యార్థము ప్రస్తాన త్రియము చెప్పుచున్నది. త్వంపదార్థమునకు- లక్ష్యార్థము- కూటస్థుడు- క్షేత్రజ్ఞుడైన పురుషుడు- అక్షరుడు- లక్ష్యార్థము. ఇందుకుదృష్టాంతము, దర్పణప్రతిబింబదీప్తియును- స్వభావదీప్తియును- ఏకముగా ఒకచోటున ప్రకాశింపజేయునట్లు కూటస్థుడైన చిదాభాసుడైన- క్షేత్రము క్షేత్రజ్ఞుడున్ను ఏకముగ నున్నారు॥ గీ॥ ఇదంశరీరం కౌంతేయ క్షేత్రమిత్యభిధీయతే, ఏతద్యో వేత్తిం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతితద్విదః॥ యీదేహము క్షేత్రము చిదాభాసుడు అని చెప్పబడుచున్నది. ఎవ్వడు యీదేహమును తెలసికొనుచున్నాడో ఆ తెలిసినవానిని క్షేత్రజ్ఞుండని- గీతలు చెప్పుచున్నవి. కావున- అట్లయినపక్షు

మునందు వీరలిద్దరున్ను యేకముగాయుంకుటచేత తోచుచున్నారు. వీరిరువురి ని- పృథక్కరించుకుని యెరుంగుట యేలాగుననో కదా——

సమస్తమైన క్షేత్రములయందు క్షేత్రజ్ఞునిగాను తెలియుము- క్షేత్ర క్షేత్రజ్ఞులయొక్క తెలియుటయేదో- అదిజ్ఞానమన్నిన్ని—అవివేకముచేత యిద్ద రు వక్కటిగాతోచుచున్నారు. అవివేకముచేత ఒక్కటిగా తోచుచున్నారు. ఒకొక్క అవస్థయందు ఏకదేశముగా మరుగుపడె చిదాభాసునికిన్ని నిత్యప్ర కాశముగానుండు కూటస్థునికిన్ని యేకదేశమునందు ఉపాధిచేతచలించు యెం డవలెను- ఖండముగాని ఎండవలెనున్ను గురుతుగా తెలియవలెను. ఆక్షేత్ర ముయేదో, ఎట్టిదో- యేవికారముగలదియో- యేకారణమువలన అదిపుట్టె నో- దానిని ఆక్షేత్రజ్ఞుడు యెవ్వడో యెట్టిప్రభావముగలదో ఆస్వరూపము ను సంక్షేపముగా తెలియవలయునని వేదవేదాంత శాస్త్రములు చెప్పుచు న్నవి గావున——ఘటజ్ఞానముగలుగునది చిదాభాసునికి ఘటవృత్తిజ్ఞానము గ లుగునది కూటస్థుడుగానుండు తనకు ఘటమని తెలియగానే అందున పొందిన వాడు చిదాభాసుడు- దానినిచూచువాడు కూటస్థుడు- గావున- క్షేత్రక్షేత్ర జ్ఞుల స్వరూపములు వసిష్ఠాదిమహామునులచేతను నానావిధములైన వేదము లచేతను- బహుప్రకారములుగా చెప్పబడును. మరియు సందేహాస్పదము లేని బ్రహ్మసూత్రముల వాక్యములచేతను చెప్పుచున్నవి గావున, ఘటజ్ఞానము గలుగుటకు పూర్వము వెనుక ఘటమునందు కూటస్థుడు వున్నందుకు ఏమి గురుతు. ఘటజ్ఞానమువచ్చుటకు మునుపు తెలివిలేకగాదు. వెనుక తెలిసిన ట్టుగాను చూచేతనయనుభవమే గురుతుగావున, పృథివ్యాదభూతములన్ను, అహంకారమున్ను, బుద్ధిన్ని మాయయును, జ్ఞానేంద్రియ, కర్మేంద్రియములు పదిన్ని మనస్సున్ను, మెదుశబ్దాదివిషయములున్ను, యివన్నియు యిరువది నాలుగుతత్వములచే కూడినదే క్షేత్రము. ఘటమును ఒక్కకాలమునందు తెలి సినట్టును, ఒకకాలమునందు తెలియనట్టును- సాక్షినందు రెండువిధములుగా తోచవలసినదేమి అనగ సర్వకాలసర్వావస్థలయందు, యెక్కడాయుండు స్వ భావచైతన్యమునందు కల్పింపబడిన ఘటము అజ్ఞానముతోకూడియుండునపుడు తెలసినట్టుగ తోచబడెనుగనుక- కోరికయును, ద్వేషమును, సుఖమున్ను, దుఃఖమున్ను దేహేంద్రియాది సమూహమున్ను మనోవృత్తిన్ని ధైర్యమున్ను అవికారములతోకూడినది క్షేత్రమనిసంగ్రహముగా శృతిప్రమాణములు చె

ప్పుచున్నవి. కావున—జ్ఞానాజ్ఞానములు అనగా నేమిటి. లోహాంతకుంతము వలెనే చిదాభాసాంతవృత్తియే జ్ఞానము. తోచకయుండుటయే అజ్ఞానము. అయితే వృత్తికిమునుపు చిదాభాసుడులేడు- గనుక తెలియబడని ఘటమ్మును సాక్షి తానెయని యెరుంగవలయునుకదా. వృత్తివెనుక తెలియబడిన ఘటమును, చిదాభాసునిచేతనే తెలియవచ్చును. కనుక సాక్షి తెలిసికొనుననివేలచెప్పవలయును- గావున—గీతాభాష్యే॥ అమానిత్వ మదంభిత్వా మహింసాక్షాంతి రార్జవమ్- ఆచార్యోపాసనం శౌచంస్థైర్యమాత్మవినిగ్రహః॥ అనగా- తన్నుతా పొగడుకొనకయుండుటయు- తనధర్మమును ప్రకాశముచేసుకొనకయుండుటయు- హింసజేయకయుండుటయు- క్షమించుటయు- కపటములేకయుండుటయు- బాహ్యాభ్యంతరసుచిత్వంబును- చంచలములేకయుండుటయు- మనోనిగ్రహముగలుగుటయు- విషయములయందు ఆశలేకయుండుటయు- అహంకారములేకయుండుటయు- జన్మమరణ జరారోగదుఃఖములయందు దోషములనున్ను- పుత్రదార గృహాదులయందు ఆసక్తి లేకయుండుట, అనన్యాత్మభావనాలక్షణమైన విశేషము లేకయుండుట యిష్టానిష్టప్రాప్తులయందు యెల్లప్పుడును సమబుద్ధిగలిగియుండుటయున్ను ఆపరమాత్మయందె- బ్రహ్మేతరగతి లేదనెడి- రాజయోగముచేత వ్యభిచారమున్ను పొందనట్టి భక్తిన్ని, విజనస్థలనివాసమున్నగునవి జనసమూహమందు యనురాగము లేకయుండుటయు- ఆత్మజ్ఞానమందు- నిత్యభావమున్ను మోక్షజ్ఞానమునకు ప్రయోజనముగల దృష్టిన్ని- అనగ అంతరదృష్టిన్ని యివియన్నియు జ్ఞానమని, జ్ఞానయోగమని చెప్పబడును. ఈయోగమునకంటె యితరమునదేదియో- యదియజ్ఞానమని చెప్పబడును—సూత్రం॥ జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వామృతమశ్నుతే- అనాదిమత్పరం బ్రహ్మనసత్తన్నాసదుచ్యతే॥ అనగ తెలియదగినది యెద్దియో యదియున్ను ఏబ్రహ్మముదెలసి మోక్షముపొందగలదో- యాబ్రహ్మము ఆదిలేనిదిన్ని, యుత్కృష్టమైనదిన్ని సత్తున్ను- అసత్తుకానివాడని- త్రైభాష్యములు బ్రహ్మమునుగురించి చెప్పుచున్నవి- ఎట్లాఅనగ.—

ఘటమని తెలసినప్పుడే చిదాభాసుడు వృత్తితోకూడా నష్టమైపోయినందువల్ల ఆయనసరమునందు కూటస్థునిమినహాగా వేరేచైతన్యములేదు. అందువల్ల వృత్తి మునుపుదెలియబడకయుండుదానిని తెలసికొనుచుండును, కూట

స్తుడు తానవృత్తికి వెనుక తెలిసికొనినాడని తోపింపచేయుటకు సందేహము పనిలేదు. కాబట్టి యీ రెండుకాలములయందును ఘటమును తెలసినవాడు కూటస్థుడే యగునుగావున ఘటజ్ఞానముగాగానే చిదాభాసుడు నష్టమైనవాని తోకూడ నష్టముగాకయుండు వృత్తిచేత ఘటము తెలియబడుననునది లోచ వచ్చును. సాక్షిచైతన్య తోచబడునని చెప్పవలదా ఏమి- చిదాభాసుడులేని వృత్తి ప్రకాశమైనా తెల్లమృత్తికవలె జడమైనందునవలన తెలియబడు దానిని తోపింపచేయ నేరదు. సాక్షి తానే తోపింపజేయుచున్నాడుగావున, సాక్షియందు కల్పింపబడిన ఘటము అజ్ఞానముతోకూడిన వృత్తితోకూడి తెలియబడుననునది కూడకపోయినపక్షమునందు తెలియబడెను- కావున—చిదాభాసుడు ప్రతిఫలించినందుననే ఘటమని తెలియబడి తోచుచున్నదిగావున, తెలియబడుటకు చైతన్యసంగమమే మూలమైతే, మునుపుసాక్షిచైతన్యముతో కూడినందుచేత తెలియబడకూడదా యేమి. కాబట్టి వృత్తికి వెనుక ప్రతిబింబ చైతన్యమునకే ప్రయోజనము కావలయును గాని మునుపున్న కూటసునికి ప్రయోజనమని చెప్పకూడదు- గావున—యిట్లు యినపక్షమునందు- సాక్షి చిదాభాసునకు యేమిభేదమున్నదియోకదా- ఘటము మాత్రముచూచినవాడు చిదాభాసుని వృత్తిని, ఘటమును- యీమూటిని తెలుసుకొనువాడు కూటస్థుడుయని సాంఖ్యశాస్త్రము చెప్పుచున్నది-గాబట్టి—యిట్లైనపక్షమునందు సకలశాస్త్రకర్తలున్ను విషయజ్ఞానమునందు రెండుచైతన్యములున్ను యేలవిభజించిచెప్పినారుగారు-. కావున॥ గీ॥ బహిరంతశ్చభూతానామచరం, చరమేవ చ, సూక్ష్మత్వాత్తద॥ విజ్ఞేయందూరస్థంచాంతికేచతత్ ॥ యని యిత్యాదిగీతా వచనము. ప్రాణులయొక్క- లోపలనున్ను- వెలుపలనున్ను ఆబ్రహ్మను, స్థావరరూపముగానున్ను, జంగమరూపముగానున్ను, రూపులేకయుండుటవలన యున్ను, పొందదగినదిగానున్ను, సమీపముగాను యున్న- ఆబ్రహ్మను అపరిచ్ఛిన్నమైనదై సమస్తప్రాణులయందు పరిచ్ఛిన్నమై భూతములను భరించునట్టిదిన్ని, హింసించునట్టిదిన్ని- బ్రహ్మను సూర్యాదితేజస్సులకున్ను ప్రకాశమైనదిన్ని, అజ్ఞానముకంటె వ్యతిరిక్తమైనదిన్ని, ప్రకాశమైనట్టిదిన్ని తెలియవలయును. జ్ఞానగోచరమైనదిన్ని సమస్తప్రాణులహృదయమందున్నదిన్ని మైయున్నది-గావున—ఈరీతిగ క్షేత్రమును జ్ఞానమును సంగ్రహముగా చెప్పియున్నది గావున కూటస్థుడని చెప్పక, వ్యవహారజ్ఞానమని పేరుపెట్టుకొని- విచారించి

టకు కారణమగును గాబట్టి కార్యకారణవ్యాపారములయందు దృష్టమైనది న్ని ఆమోదించునట్టి భరించునట్టి యనుభవించునట్టి నియామకుడైనట్టిన్ని పరమాత్మయని చెప్పబడును. అట్టిక్షేత్రజ్ఞుడు యీదేహమందు దుష్కృతమైనవాడు యెవ్వడు? ఈప్రకారముగా క్షేత్రజ్ఞుని వికారములతోకూడా క్షేత్రమున్ను ప్రకృతిని యెరుంగుచున్నాడో వాడు సర్వవిధములచేత వర్తించినప్పటికిన్ని తిరుగపుట్టడు. కాబట్టి గీతాభాష్యం॥ యావత్సాంజాయతేకించిత్సత్వం స్థావరజంగమమ్। క్షేత్రక్షేత్రజ్ఞసంయోగ త్తద్విద్ధిభరతర్షభ॥ గీతావచనము చెప్పుచున్నది గావున స్థావరజంగమాత్మకమైన స్వల్పమైన వస్తువు యెన్నిమారులు పుట్టుచున్నవో ఆవస్తువు ప్రకృతిపురుషసంసర్గమువలన కలిగినదని తెలియుము. కాబట్టి వృత్తియైనది ఘటమువలెనే తనకు అన్యముగానందున ఒక కాలమునందు జ్ఞానవ్యాప్తివచ్చినదని చెప్పకూడదు. అన్యపదార్థమునందుండు నజ్ఞానమును పోగొట్టుటవల్ల యీవృత్తియందు నజ్ఞానవృత్తిరాబోదు గావున యీప్రకారముగా లోపల వెలుపల నేనని తోచె చైతన్యము రెండువిధములని చెప్పుచున్నవి గావున యీరెండుచైతన్యములలోను కల్పితముగానుండువాడు జననమరణసంసారియును కూటస్థుడై స్వభావముగానుండు తనకు యెప్పుడును సంసారములేదనుటయు చెప్పుచున్నవి. కాబట్టి బుద్ధియందు ఆరోపించిన కూటస్థచైతన్యమునకే సంసారమునకేగాని చిదాభాసునికి లేక యుండగూడదా యేమి. కావున అసంగచైతన్యమునకు ఒకవుపాధిలో ఆవరించినందున సంసారమువచ్చినప్పటికి ఘటమునందు ఆవరించిన చైతన్యమునకుగూడ సంసారము రావలయును. అట్లురాలేదని తాను చూచును గావున ఘటమువలెనే అంతఃకరణము మలినముగానందున స్వచ్ఛద్రవ్యమునందు వ్యాపించినపట్ల సంసారము రావచ్చును అని చెప్పుచున్నారు. కావున కంచుకూముతో కొలిచినందుచేత ఒకటి రెండు మూడు కాసేరదు గనుక స్వచ్ఛపదార్థమైనందున యెక్కువలేదు గాబట్టి మాని, కూము, కంచుతూము, కొలలో సరియైన కంచుతూమునందు ప్రతిబింబము కనుపించినట్లు ఘటమునందు ప్రతిబింబించినదానికంటె బుద్ధిలో ప్రతిబింబించినదానికి యెక్కువ యేలకూడదు. కావున యీప్రకారమైన పక్షమందు అప్రతిబింబుమగదా చిదాభాసుకు యీచిదాభాసునకే సంసారియని పేరున్నది. కావున ఆత్మకు సంసారములేదు గాబట్టి వుపాధి వినాగా చిదాభాసుకి వేరు స్వరూపములేనందువల్ల

అంతఃకరణ ప్రతిబింబుడైన చిదాభాసునకే సంసారము రావలయును గావున శరీరము నశించిన బుద్ధి నశించ లేదని శాస్త్రములు చెప్పుచున్నవి. కావున శరీరము మినహాగా అంతఃకరణము వేరుగాదు. ఈపక్షమునకు బుద్ధిమినహాగా చిదాభాసుడు వేరుగాగలడని ప్రశ్నోపనిషత్తు చెప్పియున్నది. కాబట్టి చిదాభాసునకే సంసారముగాని అంతఃకరణమునకు లేవుగావున ప్రశ్నోపనిషత్తులో బుద్ధితోగూడినవానికే శరీరప్రవేశము చెప్పుచున్నది గాని బుద్ధికి అతీతుడైన సాక్షికి చెప్పలేదు గావున జడదేహమనే వాక్యమునందు తానులేకున్న శరీరము ఇంద్రియములు జీవించనేరవనియు ఆత్మ ప్రవేశించెననియు నందువల్ల అంతఃకరణమునకు అన్యుడుగానుండువానికే ప్రవేశము చెప్పుచున్నది గావున అసంగునికి ప్రపంచశృష్టిలేదనియును మాయాకల్పితునకు శృష్టియని యుగదా శృతులు చెప్పుచున్నవి. శృష్టించినవాడును ప్రవేశించినవాడును కల్పితులనుటయందు కారణమేమి? మాయ, అవిద్య యీరెండును జీవేశ్వరులనే ఆభాసుల కల్పించెనని వేదములు చెప్పుచున్నవి. వీరిరువురిని లెస్సగా విచారించిన పక్షమందు నష్టమైపోవును అనే తన అనుభవములోనే తెలియవలెను గావున గీ॥ క్షేత్రక్షేత్రజ్ఞయోరన్యనామరూపవివర్జితః । సదాత్రిపుటిరహితః సర్వద్వంద్వవివర్జితః॥ ఇత్యాది ప్రమాణములు చెప్పుచున్నవి. ఈప్రకారము జీవేశ్వరోపాదులు రెండున్ను మాయావిద్యలవలన కల్పితములనియు వీనికి అతీతమైనది ఆత్మయనియు గీ॥ క్షరాక్షరాభ్యాం విలక్షణః॥ చెప్పుచున్నవి. జీవేశ్వరులు భూతభవిష్యత్ ప్రకృతిచేగూడా తోచబడి నశించుచున్నారు. వీరికి అతీతుడైనవాడే అవినాశియనియు మైత్రేయికి యాజ్ఞవల్క్యులు చెప్పియున్నారు.

ఇట్లు శరీరము నశించిన జీవుడు నశించడని ప్రమాణము కొన్నివేదములు భూతప్రకృతిమోక్షమును చెప్పుచున్నవి. అజ్ఞానావస్థయందు లోకాంతరముగ మనము చెప్పుచున్నారము. ఆత్మకు అన్యమంతయు అనిత్యమగును.

శృతి॥ యదృశ్యంతనస్యం యదృశ్యభావనానాస్థిదృశ్యమేవతద్వినశ్చతి॥ యని యున్నది.

ఈప్రకారము జీవుడు అనిత్యమైనందుచేత శృతి॥ గుణత్రయానవిద్యాంతే వికారరహితఃసదా॥ యను ప్రమాణతః నిత్యముగానుండు బ్రహ్మతో అహంబ్రహ్మాస్మి బ్రహ్మైవాహమస్మి॥ అను వేదప్రమాణములు చెప్పుచున్నవి.

నిర్గుణోపనిషత్॥ దారువపరుషవత్సర్వం జగద్భ్రాంతిః॥ ముఖ్యసామా న్యాకరణము కూడకపోయిన స్థాణువపురుషజ్ఞానమువలె బాధ సామాన్యాకర ణముకూడను యిట్లుయినపక్షమునందు వివరణాచార్యులువారు సామాన్యాధిక రణ్యమును ఖండించ పనియేమున్నది. నేను అనేశబ్దమునకు కూటస్థుని అర్థ ముచేసికొని ఖండించినారు గనుక యిట్లు కూటస్థుం శ్రుతి॥ కూటస్థోబ్రహ్మ ముచ్యతే॥ అనునట్లు తన్ను తానుగా చూచితే తత్పదమునకు త్వంపదమునకు అర్థభేదమేమి గాబట్టి దేహేంద్రియములయందు గలిగిన జీవభ్రాంతికి అధిష్ఠాన మునకున్ను జగచ్ఛరీరములుగల యీశ్వరభ్రాంతికి అధిష్ఠానమని యర్థము. తత్పదమునందును త్వంపదమునందును ఒక్కబ్రహ్మమునే యేకముగా చెప్పి నట్లుగ ఆరోపితమైన శరీరమందునుంచి, మనుస్మృతి॥ అధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచేతే॥ ప్రమాణము లేకపోవన జగత్తునుంచి భేదమేమనగ అధిష్ఠాచైతన్యమునుంచి భేదములేదు. అద్వైతస్యము యొక్కటియే యగును. కాబట్టి ప్రత్యక్షముగ నిర్ణయింపబడియుండు జీవేశ్వరులును భ్రాంతియని చెప్పుచున్నవి.

శ్రుతి। కార్యోపాధిరయంజీవః కారణోపాధిరీశ్వరః కార్యకారణ తాం హిత్వాపూర్ణబోధోవశిష్యతే॥ అనునట్లు చైతన్యమువలెనే యేకలక్షణము గా నిర్ణయము కానందువల్లను చిత్తుగాను జడముగానున్ను నిత్యముగానున్ను అనిత్యముగానున్ను బహువిధములుగానున్ను యున్నందుచేత భ్రాంతియనుట కు సందేహము లేదు. ప్రపంచమునందు యుక్తిగా వ్యవహరించుచున్న భ్రాంతికిని వివేకజ్ఞానికిని తారతమ్యమేమి? బుద్ధియనగనేమి? చిదాభాసుడన గనెవ్వడు? ఆత్మయనగనెద్ది? జగత్తు యెటువలెతోచును? యనే సంశయము లుగలవాడే యజ్ఞానము. వీనికే సంసారము. దానిస్వభావములతోడ పృథక్క రించి తాను జడబ్రహ్మమని నిశ్చయించినవాడే ముక్తుడగుననుటకు గురుతు అని వేదాంతశాస్త్రములు చెప్పుచున్నవి. తాను యెల్లప్పుడు బ్రహ్మమైయుం డుటకు యేమిగురుతు. మాయావృత్తులు, మనోవృత్తులు కలుగనందుకు వుం డినందుకు నశించునందుకు సాక్షిగానుండు ఆత్మ శాశ్వతమైన పదార్థం సకల మున్ను ప్రకాశింపజేసి యెరుంగుటవల్ల చిత్తనేదిగూడును. పంచకోశములతో టి సంబంధములు విడిచిన తన్ను విడువకూడదని వస్తువైనందువల్ల ఆనందము నుకూడును. అట్లుగనుక వీడు యీసత్యజ్ఞానం బ్రహ్మమను పురాణవచనములు

ప్రమాణములు గావున యీకూటస్థునికి అన్యులుగానుండు జీవేశ్వరులు మాయామయమైన భూతభౌతికములవలె జడములుగాక చైతన్యముగానుండు వారలకు మాయాకల్పితులు గావున సకలభాండములు మృత్తికయందు పుత్పత్తియైన స్ఫటికకుంభములు నిర్మలముగానుండునట్లు మాయావిద్యలయందు కల్పితములైన జీవేశ్వరులు స్వచ్ఛమైనవారగుదురు గావున అన్నమువలన బుట్టిన శరీరేంద్రియములలో మనస్సు బోధరూపముగానున్నట్టి మాయాకల్పితములలో జీవేశ్వరులు బోధారూపులుగా యుందురుగావున మాయాజడములనుమాత్రము కల్పించగలదు గాని చైతన్యములను కల్పించును. అనగ ఒక జీవునియందు నిద్రామోహము లనేక చేతనాచేతనములను కల్పింపగ జీవేశ్వరులను మహామాయ కల్పించుననుటకు యేమియాశ్చర్యమోగదా కించజ్ఞత్వము అనీశ్వరత్వము మొదలైన జీవగుణములను మాయకల్పించగలదుగాని సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వ పంచకృత్యములు మొదలైన కళ్యాణగుణములను కల్పించుటకు మాయకు శక్తిగలదు. బిడ్డనికన్నవాడు పేరుపెట్టినట్లు యీశ్వరుని కల్పించినమాయ ఆయనకు కావలసినకార్యములను కల్పించుటకును కారణము యింతసామర్థ్యము గలిగిన మాయకు ఒక్కకూటస్థుని కల్పించుటకు శక్తిలేకపోవును. జీవేశ్వరులు కల్పితులని వేదప్రమాణమున్నట్లు కూటస్థుడు మాయాకల్పితుడని వేదప్రమాణమైనా యేమి యితడే నిజమైన ఆదిపరమాత్మస్వరూపమని సకలశ్రుతీతిహాసములు మొరబెట్టుచున్నవి కాబట్టి నీశంకకు అవకాశములేదుగదా- మాయకార్యములు విస్తరించేటట్లు చూచినచూపు మొదలైనవి సృష్టిలంతమువరకు ఈశ్వరకృతములగును- జాగ్రత స్వప్నసుషుప్తిపర్యంతము గలిగిన సంసారము జీవకృత్యమగును గావున యిట్లయినపక్షమునందు కూటస్థునియొక్క కార్యములేమి అతడు అసంగుడే గాని ఆకూటస్థబ్రహ్మయందు ఏకృత్యములేదుగావున యీప్రకారము ఆత్మజిజ్ఞాసచేసినవాడు యెట్లుండును- బద్ధుడు, ముక్తుడు మోక్షముత్పత్తినాశనము మొదలయిన సకలము మాయాకల్పితములేగాని తమకు స్వభావముగా ఒక్కటియు లేదని తెలియవలయును గావున యిట్లుఒక్కటియూ లేనియట్లు- జీవుడు ఈశ్వరుడు జగత్తుయనే మర్యాదలంతయు శ్రుతియందు చెప్పియుండవలసిన కార్యమేమనగ— అతిసూక్ష్మముగానుండు ఆత్మని చూపించునిమిత్తము- స్థూలారుంధతిన్యాయముగా చెప్పుచున్నది- ఇట్లు తెలసిన వివేకికి ప్రా

ర్భములో నుండగ దానిని ఆపాత్రభమును యెటులచూచుచునుండును-శాస్త్రము యెరుంగనివాడు సంశయించినట్లు సంశయములేక మాయయను మేఘము ప్రపంచమనే వర్షమును కానలసినట్లు వర్షించినా, చిదాకాశముగానుండు తనకు హానియెక్కడిది లాభమెక్కడిది అని సంశయములేకయుండును గాబట్టి గీ॥ యఏవంవేత్తిపురుషం ప్రకృతించగుణైస్సహ సరదావర్తమానో పిన సభూయోభిజాయతే॥ గీతావచనము చెప్పుచున్నది. ఎవ్వడు యీప్రకారముగ క్షేత్రజ్ఞునిన్ని వికారములతో కూడా క్షేత్రమును ప్రకృతిన్ని యెరుంగుచున్నాడో- ఆక్షేత్రజ్ఞుడు సర్వవిధములచేతను వర్తించినప్పటికిన్ని తిరుగ పుట్టడు గావున—

సూత్రం॥ అనాదిత్వా న్నిర్గుణత్వా త్పరమాత్మాయమవ్యయం శరీరస్థోపి కౌంతేయనకరోతి నలిప్యతే॥ సూత్రములు చెప్పుచున్నవిగావున మొట్టమొదట లేకపోవుటవలనను, గుణములులేకపోవుటవలనను, నాశరహితుండైన యీపరమాత్మ శరీరమందున్నప్పటికిన్ని కర్మనుచేయడు. చేసినా నిష్కామకర్మ చేయునుగావున- కర్మములయందు అంటడు గాబట్టి సూత్రం॥ ఏప్రకారముగా ఆకాశము సర్వవ్యాపియైనప్పటికిన్ని సూక్ష్మమవుటవలన సంబంధించదో అప్రకారముగా క్షేత్రజ్ఞుడు శరీరమందు ఉండెటను యున్నవాడైనప్పటికిన్ని కర్మలను అంటడుగావున, శ్రుతి॥ యథాప్రకాశయత్యేకః కృత్స్నం లోకమిమంరవిః క్షేత్రం క్షేత్రీ తథాకృత్స్నం ప్రకాశయతిభారత॥ ఇత్యాదిప్రమాణములు చెప్పుచున్నవి. ఏప్రకారమెక్కడైన సూర్యుడు సమస్తమైన యీజగత్తును ప్రకాశింపచేయుచున్నాడో అరీతిగానే క్షేత్రజ్ఞుడు సమస్తమైన శరీరములను ప్రకాశింపచేయుచున్నాడు. కావున శ్రీరామహృదయమందు భానుతేజము నాశ్రయించు స్వభావకర్మలందు నీమానవుల్ విహరించు కైవడి మన్త్రప్రకారము నంట ధీమాన సేంద్రముల్ స్వకీయ సమస్తకార్యములొందగీ మానకీ జయించు నందధీమానపూర్వకవృత్తులకె॥ అనియున్నదని చెప్పుచున్నవి. ఈప్రకారము ప్రకృతిపురుషులయొక్క విలక్షణత్వమును- భూతములయొక్కయు మాయయొక్కయు అభావగమనము జ్ఞానదృష్టిచేత యెవరుయెరుంగుచున్నారో వారలు పరమబ్రహ్మమును పొందుచున్నారుగాబట్టి- యీప్రకారముగ ఆత్మ మాయాశక్తికి ఆధారముగానుండు అద్వైయానందచైతన్యము ఈఆత్మకు సృష్టికర్తత్వమెందుచేత ననగా—

ఆత్మనిర్వికారచైతన్యముగానుండు ఆత్మకు తనయొక్క మాయోపాధిచేత వచ్చెను. జగత్తనేవస్తువు ఏదిరజ్జుసర్పన్యాయమువలె జగత్తుగా తోచుచున్నది గావున జీవుడను అంతఃకరణప్రవాహములో ప్రతిబింబించి శరీరములయందు ప్రవేశించి వ్యవహరించు చిదాభాసుడే జీవుడుగావున సంసారబాధము చిదాభాసుకు మొదలైన జనమైన ద్వైతమే బాధము. ఈబాధమును విడదీయు ముక్తి విచారముచేత మాయనష్టమైనవెనుక సిద్ధించెడి అద్వైతమె ముక్తియగును. ముక్తికిసాధనము వేదాంతయోగవిచారణచేతను పుట్టిన జ్ఞానమేసాధనము. వేదాంతవిచారణయు యెవరికి అనేకజన్మములయందు యీశ్వరోపాసనగలవారికి గలుగును. గురువును ఆశ్రయించుట యెందుకు కావలెను. దేహాభిమానిగానుండె చైతన్యమె విచారణకర్తయగును గావున గురుముఖముగా జ్ఞానముయిచ్చువారు యెవరు. జగదీశ్వరుడే గురుమూర్తిగావచ్చి జ్ఞానముదెలుపును. ఏమిచేసిన జ్ఞానమిచ్చును. నిష్కామకర్మ చేసిన యెడల ఏకాంతభక్తిచేత జ్ఞానముగలుగును. ఈశ్వరుడు అనగ సర్వోపాధిలో ప్రతిబింబించిన త్రిమూర్తిరూపముగా తోచిన చైతన్యమే గారణోపాధి గావున—మాయా అవిద్యలనెడి ఉపాధులు రెండుభేదములు. ఎందుకు కావలెనుగాని —ఆత్మచైతన్యమునుంచి గలిగినవి కావు. ఈచైతన్యము మాయవలన సృష్టికికారణమేమి సర్వోపాధిచేత యీశ్వరుడు రాజసోపాదిచేత జీవులను తామసోపాదిచేత మనస్సును, మొదలైన భూతభౌతిక ప్రపంచమునకు సృష్టించెను ప్రకృతియొక్క గుణత్రయము సృష్టికి పరంపరసాధనము గావున నేను నాది యనువృత్తులె సాధకములుగావున సృష్టియన్నివిధములలో అణగియుండును. నేను అనెడి వృత్తిలో కర్తమైయున్నది. ఇది యనెడి వృత్తిలో విషయములుగా వుండుటయందు సృష్టియణగియుండును. కావున యీవిధముగా తోచుచున్నది. ఆత్మలోపింపచేయునది. ఆత్మతానేయగును. నేను నేననెడు వృత్తి ఒక్కటైనకర్తను మాత్రము కల్పించవలసినదేమనగ, నేను అనెడు వృత్తి ఏకాగ్రమైనందుచేత తానొక్కడైన కర్తనుమాత్రము కల్పింపబడును. ఇది నేననెడు వృత్తి యింద్రియభేదములచేత నైను ఆకారములుగా భిన్నములైనందువల్ల నైనువిషయములను కల్పించు గావున కర్త ఒకటెగలదనుటకు అదివృత్తియనుటకు అవృత్తికల్పితమనుటకును కారణమేమి. నాటకశాలయందు దీపమైనది రాజును పరిచారకులును- అంటించెస్త్రీ

ని తాళమద్దెలగాండ్లును తారతమ్యములేక తోపింపజేసినవారలు లేని సమయములలోగూడ- దీపముతానే ప్రకాశించునట్లు కర్తమొదలైనవి కలిగిన వేళలందు సాక్షితాననే యనుభవము ప్రమాణము నాటకశాలయందుండు దీపమున్ను రాజుమొదలయిన దృష్టాంతములున్ను అంతరార్థముగ దేహమందు పంచిచూచుటలో తెలియవలయును. అహంకారమే రాజు, విషయాదులే పరిచారకులు. బుద్ధినటించు స్త్రీ యింద్రియాదులే తాళమద్దెలగాండ్లు. ఇన్నింటిని తోపింపజేయు సాక్షియే దీపము. ఇదియొకదృష్టాంతము. నాటకశాలయందు గోడయందు వ్రాసిన చిత్రపుప్రతిమవలెను ఆనాటకశాలయందు దీపమువలెను రాజుమొదలయిన దృష్టాంతములను శరీరపంచకం పంచి చూచుట యెట్లనగ- నాటకశాలయందుదీపము సాక్షి, చిత్రపుబొమ్మసాక్షి, రాజుసాక్షి గావున చలనములేకయుండుసాక్షికి చలనముగలిగిన దీపముయెట్లు దృష్టాంతమో అట్లనె శ్రీరామహృదయమందు ప్రస్థానత్రయవేద్యుడు, అవస్థాత్రియసాక్షి, ॥సర్వవస్తుస్వామాశస్తుండు. అస్థిరభవస్థిత్యంతాదిమూర్తి శాయుకునూరా యనిచెప్పియున్నది. ఎరుక మరుపులనెరిగెడు యరుకనేను. విధినిషేధములుగాంచు విభుడనేను. తర్కములనెల్ల తర్కించు తత్వనేను నేనని యెరిగెడి నేతనేను. ఔపాధికనామంబులు రూపంబులు లేవు. నాకు రూఢిగ సకలవ్యాపారములను చేసిన సర్వవ్యాపక చిన్మయుడనేను కీశాధీశా॥ గానంబున్ నటనంబు తాళగతులన్ గావించుచున్ జారువిద్యాస్త్రైపుణ్యము జూపుచున్ సిరముమీందన్ గల్గుపెన్ దొంతరన్ బూనన్ గ్రక్కొని నాట్యమెలునిగతిన్ పుంఖాను పుంఖోజ్వలన్ నానార్థానుభవజ్ఞుడయ్యు బుధుడానందాత్ము గాంచున్ మదిన్॥ సాతానివాడు సిరస్సుమీద యేడుదొంతర్లు చెంబులకు పట్టి వర్ధనములు పూలదండలు ధరించి శిరస్సున యేడుదొంతర్లు సమముగా ధరించి పిమ్మట కుడిచేత చిడతలు యెడమచేత తంబురయు గాళ్ళకు గజ్జలును మద్దిలతాళములు పిడేలు మృదంగములు నోటితో పాట యీమొదలైన నాట్యనాటకమును వినోదముగా ప్రజలకు వినిపించుచు తాను ఆనందించుచు సంగీత తాళ మృదంగములకు సమముగా నాట్యము జరుపుచు తనయొక్క దృష్టియే దొంతికుండయందు నిలిపియున్నవాడు. కావున, తాను రాజయైయుండి బాహ్యాంతర సంసారముల చేయుచుండును. కాబట్టి, చలనము లేకయుండు సాక్షికి చెలనము గలిగియుండు దీపము యెట్లు దృష్టాంతమగును.

కాలాన చలనములేక నాటించిన పగలు వత్తి తానున్నచోటునుంచి నలు దిక్కులు తోపింపచేయునట్లు అఖండపరిపూర్ణముగా కదలకయుండు ఆత్మయే లోపలను బయటను తోపింపచేయుచున్నది నిండియున్నది. కావున ॥బ్రిహ్మోపనిషత్॥ పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదీరితం। పూర్ణస్యపూర్ణస్యమాదాయపూర్ణబోధోవశిష్యతే॥ పూర్ధ్వశూన్యమధః శూన్యం మధ్యశూన్యం యదాత్మకః। సర్వశూన్యం తదాత్మేతి సమాధితస్య లక్షణం॥ లోపల అనగ దేనికి లోపల బైట అనగ దేనికి బైట లోపల బైట అనునది శరీరమును గూర్చియే గాని సాక్షినిగూర్చి గాదుగదా. కాబట్టి లోపల యుండునది యెద్ది బయటయుండునది యెద్ది అనగ నేను అను అహంకారి లోపలనుండువాడు బైట నుండునవి విషయములు గావున లోపలనుండువాడు చిదాభాసుడు బయటనుండునవి వానివిషయములు గాబట్టి లోపలను బైటను సంచరించునది యేది లోపలను బైటను సంచరించినది బుద్ధి, లోపలను బైటను కదలక నిలచియుండువాడెవ్వడు లోపలను బైటను సంచరించునది బుద్ధి అయినపట్ల అట్లు యెవ్వరు తెలిసికొనక నేను వచ్చితిని పోతిని అని వ్యవహరించుటకు కారణ మేమియున్నది. కావున,

గవాక్షిరంధ్రముద్వారా కనుపించిన యెండలో చేసితిని. కదలించిన యెండ కదలినట్లున్ను కాలువలలో నుంచి వోడ వెడుతుంటె గట్టుమీదనున్న చెట్లున్ను కూడా నడుచుచున్నట్లున్ను పిలనగోవిలు వూదుచున్నదనియును భేరి మోగుచున్నదనియును, బాడి నడుచుచున్నదనిన్ని॥ శృతి॥ అహభ్రిమశ సమస్తానాంజీవానాం భ్రాంతిచేత సాం॥ ఇత్యాదిశృతులు చెప్పుచున్నవి. ఇట్లు లేనిదే యున్నట్లు యున్నట్లుచెప్పెడి అహభ్రమవాక్యములు యెండ కదలినట్లు తోచురీతిగా లోపలయుండు బుద్ధి యింద్రియద్వారముల మార్గములగా బయలుదేరి తిరిగి అలసిన తనయొక్క అలసటను తన్ను తోపింపజేసిన సాక్షియందు ఆరోపించుచున్నది. ఐతే గాచున్నది. కాని పరమాత్మకు అలసట యెప్పుడూ లేదు యిప్పుడు యీతత్వము యీస్థలమునందున్నది యని పృథక్కరించి చూపించినట్లు సాక్షియందు స్థలమును యెట్లు గాబట్టి బుద్ధి మొదలైనవి యంతయు అణగియుండు సుషుప్త్యవస్థయందు సాక్షి యుండు స్థలము చూడవచ్చును. ఎట్టి యవస్థయందు తనకు దేహము దేహేంద్రియములు మొదలైనవి తోచడము లేదు. కనుగ సాక్షి యుండు స్థలమును తానే

చూపవలదా యేమి భూమిపై నుండువాడు నీటిలో మునిగినట్లువలె బుద్ధి మొదలైనవి అణగియుండునప్పుడు సాక్షి యుండు స్థలము తెలిసికొన శక్యము గాదు. కావున సాక్షి యొక్క దేహము రూపాత్రియు అనుసరించియుండువాడు కాడు దేహవిలక్షణుడు ॥ సాక్షీ నిత్యః ప్రత్యగాత్మాశ్శివోహం॥ యనునట్లు నతండు సకలజగత్ కల్పనకు అధిష్ఠానముగా నుండుటవలన అతండు సర్వపరిపూర్ణుడని తెలియవలయును. సకలజగత్కల్పన చేయునది యేదియో కదా. స్వప్నమునందు అంతరసూక్ష్మప్రపంచమును జాగ్రత్తయందు బాహ్యప్రపంచమును కల్పించునది బుద్ధి యగును. యీకల్పనలంతయు సాక్షియైనవాడు యేరీతిగా తెలియుచున్నాడు ఆసాక్షిని మనము ఎట్లు తెలిసికొనవచ్చును నతండు నీచేత తెలియబడువాడు గాడు. నీవే తానుగా శేషించు వస్తువు యేదియనగ యిటువంటి తెలివి నొప్పుటకు వుపాయము యెద్దియో గురుముఖముగా వేదాంతవిచారము చేయుటయె ఉపాయము గాన తానుగా నుండు తెలివిని తెలియనీయక చేయు ప్రతిబంధ మెద్ది దేహాదులే నేను ప్రపంచము సత్యమని లోచుటయే ప్రతిబంధము యీప్రతిబంధము యెట్లన వర్తించును అనగ బుద్ధిచేత కల్పితమైన ప్రపంచమును చూచు తెలివిగా తాను ఉండుటయే నివర్తించుటకు మార్గము బ్రహ్మాత్మైక్యానుసంధానము చేయువానికి సాక్షి తానుగా నుండువానికి తనయందె ప్రకాశించును. గావున,

శ్రీధరవ్యాఖ్యాన తత్వముష్టినందు
ఏతద్రూపం భగవతో, హ్యరూపస్య చిదాత్మనః
మాయాగుణైర్విరచితం, మహదాదిభిరాత్మని
యథానభసి మేఘౌఘో, రేణుర్వాపార్థివోనిలే
ఏవం ద్రష్టరి దృశ్యత్వమారోపితం, అబుద్ధిభిః॥

వ్యాఖ్యానః., అరూపస్య, చిదేకరసస్య, ఆత్మనో, జీవస్య, ఏతత్, స్థూలం, రూపం, శరీరం, భగవతో, మాయాయాః, తస్యాః గుణైః, మహదాదిరూపైః, విరచితం, కృతం, ఆత్మని, ఆత్మస్థానే- శరీరం, కృతమిత్యర్థః- కథమిత్యపేక్షాయాం, స్వరూపావరణేన, తదధ్యాస ఇతి సదృష్టాంతమాహ, యథా వాయ్వాశ్రితో మేఘౌఘో, నభసి, ఆకాశే, అబుద్ధిభిః, అజ్ఞైః, ఆరోపితః, యథా వా పార్థివో రేణుః తద్గతధూసరత్వాదిః, అనిలే, ఏవ , ద్రష్టరి, ఆత్మని, దృశ్య

త్వం, దృశ్యత్వాదిధర్మకం, శరీరమారోపిత, మిత్యర్థః, తెనుగున వ్రాయు నది యేమనగ అరూపుండైన జీవుండు చిదాత్మకుండై పరగు జీవునికి పర మేశ్వరగుణంబులైన మహంబాదిరూపములచేత నాత్మాధారాస్థానముగ విర చితంబైన స్థూలశరీరంబు గగనంబునందు బవనాశ్రితమేఘసమూహంబును కాలియందును బాద్ధనధూళిధూసరత్వంబును నేరీతి నట్లు ద్రష్టయగు నాత్మ యందు దృశ్యత్వము బుద్ధియంతుకు గాని వారిచేత నారోపింపంబడు ఆత్మని అన్నందుకు ఆత్మస్థానే అని అర్థము. ఇట్లు ఆత్మాధారస్థానముగా అనుట యొక్క స్థూలశరీరంబు అనుటకు క్రియయేది ఆరోపింపంబడినది స్థూలశరీర మూ దృశ్యత్వమూ అన్వయమేదియు గానరాదు. అంతగా మూలానుగుణ్యమును లేదు. కావున అరూపకుండైన యేకరసుండై యాత్మయనబరగు జీవునికి బర మే రూపంబులచేత నాత్మయందు విరచితంబైన స్థూలశరీరంబు దృశ్యత్వమై నారోపింపంబడును. కావున అట్లు నారోపింపంబడు చిదాభాసుడు రజ్జుసర్ప జగత్ భ్రాంత్యారోపణ అనాదిమూలమాయ మాయాకల్పిత జగద్భ్రాంతి గావున యీజగత్ భ్రాంతిని గురించి విచారించెదరు. ఎట్లనిన, యీప్రకార ము తెలివియైనది సమస్తకాలములయందు తానుగా యుండినపట్ల అజ్ఞానమనె జగద్భ్రాంతి కాలమందు తెలియక యుండవలసినదేమి సహాధ్యాయపాఠకు లలో అధ్యయనము చేయునపుడేయు తన కొమారునియొక్క కంఠధ్వని తెలి యునట్టువలె నేను అనాదిసిద్ధమైన అజ్ఞానముతో కూడి కలిసియున్నందుచేత తోచకయుండును. కాబట్టి, అజ్ఞానసిద్ధమైన అజ్ఞానము యెద్దియో గావున అగ్నియందు ఉష్ణమువలెను జలమునందు శైత్యమువలెను బ్రహ్మమునందు జీవజగత్తును ఈశ్వరుని గలుగజేయు మూలప్రకృతియే అనాదిసిద్ధమైన అజ్ఞా నము॥ శృతి॥ మూలాభావ ఇదం జ్ఞాతుం నశరీరం నకిమస్తి ఇదంశరీరం జ్ఞాత్వా మూలాభావమిదంశృణు శృణుమిదం శరీరత్వం క్షేత్రప్రకృత్తిత్వయాక్షరః క్షరం సర్వం ఇదం జ్ఞాత్వాలెక్షరం శృణుతామిదం ప్రకృత్తి ధ్వయాదోషేన భవేభవః పునఃసంజాయతో పురుషః క్షరయేవపుపాదిః క్షరసర్వాణి రూపాణి కూటస్థోక్షరఉచ్యతె వుత్తమః పురుషః స్థవ్యః పరమాత్మేత్యుదాహృతం॥ శృతిశ్మృత్యోపనిషత్ ప్రమాణములు చెప్పుచున్నవి. కాబట్టి అజ్ఞానజడదుః ఖాత్మకమైన మూలజ్ఞప్తి కళామాత్రశరీరం దేనియందు గలిగినవి. రజ్జువందు సర్పము తోచినట్లు బ్రహ్మమునందు గలిగెను రజ్జువు సర్పభ్రాంతి వత్సర్వం

జగత్ యోచింపబడిన మూలజ్ఞప్తి కళామాత్రశరీరంబనె మూలప్రకృత్తి యనె జ్ఞానమునకు లక్షణమేమి అనగ సత్తుగాదు. అసత్తుగాదు. సదసత్తును గాదు. ఒక్కటి అయినదియు కాదు. అనేకముగాదు సావయవముగాదు నిరవయవముగాదు ప్రమాణముగా నుండును. బాగా తన్ను తా విచారించిచూచిన గాని నిరూపించిచూచినగాని లక్షణ శూన్యముగా పోవును గాన అని చెప్పుచున్నది. ఇదియే అజ్ఞానమునకు లక్షణము ఈలక్షణములు గల మూలజ్ఞప్తి కళామాత్రశరీరం ఇదే నాది ఆరోపితమూలమాయ. ఇది అజ్ఞానమునకు కారణము యీలక్షణముల ప్రకృత్తి తన త్రిగుణములచేత జీవుని జగత్తును యీశ్వరుని గలుగజేసెను. కావున యీ అనాదిమూలప్రకృతి దేనిచేత నివర్తింపబడు ననగ గురువాక్యా.

శృతి। మూలాభావమిదం జ్ఞాతుం నశరీరనకిమున్తి అణినమూలజ్ఞప్తికళామాత్రి శరీరంనాస్తికేవలం॥ అని, శృతి॥ అణిశూన్యాంబరశూన్య సర్వబాస్థికేవలం॥ ఇత్యాదిశృతిప్రమాణములు చెప్పుచున్నవి. శృతి॥ అజ్ఞానమూలహరణం జన్మకర్మనివారణం జ్ఞానవైరాగ్యశిద్ధ్యర్థం గురుపాదోదకం పిబేత్॥ అని ఇత్యాదిశృతిప్రమాణములు చెప్పుచున్నవి. కావున వేదశృతి॥ అహం బ్రహ్మాస్మి॥ అను ప్రమాణమున బ్రహ్మమే నేను- నేనేబ్రహ్మమును బ్రహ్మైవాహమస్మి అను ప్రమాణమును అద్వైతజ్ఞానము చేతి నివర్తియగును గావున— తనత్రిగుణములచేత, జీవుని, జగత్తు యీశ్వరునిగలుగ జేసినవిధము యెట్లనిన, సూతసంహిత॥ సూతఉవాచ॥ నమో నంతాయసూక్ష్మాయ కూటస్థాయ విపశ్చితె॥ నానావాదానురోదాయ వాచ్యవాచ్యకశక్తయె॥ నను ప్రమాణము రూపయ కవయేశాస్త్రయోనయె.— ఋగ్వేదమునందు చెప్పబడినవాక్యమును ఏతెలివిచేత శబ్దమును మొదలయిన విషయములు, తెలియబడుచున్నవో ఆబోధయెబ్రహ్మమనియర్థము. ఇటువంటిబ్రహ్మము యను బహూచనములు యెన్నిగలవు. త్రిమూర్తులు మొదలయిన దేవతలందరును మనుష్యమృగాదులు మొదలయినవాటియందును చైతన్యమైన బ్రహ్మము యొక్కటియేగాని రెండవదిలేదని చెప్పుచున్నవి. కావున యిటువలె మొదట జ్ఞానంనిర్ణయమైనందుచేత మిగిలిన మూడువాక్యములకు అర్థమేమిటిరో తెలియలేదు. పరిపూర్ణముగానుండు పరమాత్మయెగావున యీదేహమునందు బుద్ధికిసాక్షిగానుండు చైతన్యము యిటువలె తానుగానుండు బ్రహ్మమే

అనంతాయ, అహంకారాపరిచ్ఛిదాత్, అతః, సూక్ష్మాయ, అదృశ్యత్వాత్, అతఏవ, కూటస్థాయ, ప్రపాధికృత, వికారాభావాత్, అతఏవ, విపశ్చితే, సర్వజ్ఞాయ, నానేతి, నానావాదానురోధాయ, అస్తి, నాస్తి, సర్వజ్ఞః, కించజ్ఞః, బద్ధః, ముక్తః, ఏకః, అనేకః, ఇత్యాద్దీనానావాదాన్, అనురుణద్ధి, మాయయాఽనువర్తతే, యస్తస్మై, వాచ్యవాచ, కశక్తయె, అభిదానాభిదానాభిదేయశక్తి భేదాదీపి, నానాత్వేప్రతీయమానాయ, ప్రమాణమూలాయ చక్షురాదీనాం. చక్షురాదిరూపాయ, అతఏవ, కవయే, స్వయం, తన్నిరపెక్షాయ, జ్ఞానాయ, కుతః, శాస్త్రయోనయే, వేదాత్మకనిశ్వాసాయ, ఇత్యాదిప్రమాణములు చెప్పుచున్నవి గావున, అనగ, మూడహంకృతులచే త్రిగుణములచేతను చిక్కబడక అనంతుండైన, దర్శనీయ, అపరోక్షసాక్షాత్కారమైనవాడవు, గాక నిర్వికారమహిమతోఁగూడి కూటస్థుడన, సమస్తంబునెఱిగి నిన్నుదెలియు దనగను తన్నుదెలియుదు విశ్వమని శౌనకాది మహామునులకు సూతమహామునీంద్రుడు చెప్పుచుండె గాబట్టి మఱియు కలదు లేదు సర్వంబునెరుంగు కించత్తుమెరుంగు బద్ధుండు ముక్తుండు నివిమొదలగు కార్యాధియగు కించజ్ఞుడు మాయవలన ననురోధింపుదువు నానావాదాను రోదన శబ్దములతోఁ కూడియుండియు, నభిదానాభిధేయశక్తిభేదంబులువలన బహుభావప్రతీతుండు వయ్యును చక్షురాదిరూపంబులవలన ప్రమాణమూలకుండవయ్యు నిరపేక్షజ్ఞానంబుగలిగి యెరుకగలిగి వేదస్వరూపంబువలన ఉశ్వాసనిశ్వాసత్వంబువలన శాస్త్రజ్ఞానివయ్యుండె గావున త్రిగుణాత్మకమైన మూలప్రకృతియొక్క సాత్వికగుణమైన శుద్ధమాయయందు ప్రతిఫలించిన యతండు ఈశ్వరుడు శృష్టి స్థితి సంహారము రోభావము అనుగ్రహము అను పంచకృతపరుండుగానుండు ఈ అంతర్యామిని గలుగజేసిన మాయ అతనికి కారణశరీరము గావున రాజసగుణమైన శుద్ధమాయమైన అవిద్యయందు ప్రతిఫలించిన చైతన్యము జీవుడు యీప్రాజ్ఞునకు కారణశరీరమైన అవిద్య తారతమ్యముగలిగినదై బహువిధము లైనందుచేత చిదాభాసులు అనంతులైరి గావున—

తామసగుణ ప్రకృతిలోనుండు జీవులకు భోగభోగవిధులను గలుగజేయుటకొరకు యీశ్వరాజ్ఞచేత ఆకాశము వాయువు అగ్ని అప్పుపృథివి అని త్రిగుణములతోఁగూడిన అయిదు సూక్ష్మభూతములను గలిగెను యీభూతా

దులయొక్క స్వాత్వికాంశమునందు భూతమునకు ఒక్కొక్కమాత్రయెత్తి ఒక్కటిగాకూర్చినది అంతఃకరణమాయెను. ఇది చంచలవ్యాపారముచేత మనస్సనియు నిశ్చయవ్యాపారముచేత బుద్ధియనియు రెండువిధములుగా నుండును గావున మరియు స్వాత్వికాంశమునందు భూతమునకు ఒక్కొక్క మాత్రచొప్పున ప్రత్యేకముగానుంచినది వాగాది కర్మేంద్రియములగును. అందు పదియేడుతత్వములచేత గూడినదే లింగశరీరమనియు సూక్ష్మశరీరమనియు భోగసాధనమనియు చెప్పబడును యీ సూక్ష్మశరీరముతో గూడిన అవిద్యాప్రతిబింబమునకు ప్రాజ్ఞుడనే పేరుమారి తైజసుండనే పేరుగలిగెను. సకలజీవులయొక్కయు సూక్ష్మశరీరములను సూక్ష్మభూతములనుకూడి సమిష్టిబుద్ధిచేత హిరణ్యగర్భుండనియును యీశ్వర సూక్ష్మశరీరమనియును చెప్పబడును యీ సూక్ష్మశరీరముతో కూడిన మాయాప్రతిబింబమునకు అంతర్యామునకు పేరుపోయి సూత్రాత్మయని పేరుగలిగెను. అంతటను తాదాత్మ్యముగా నుండుటచేతయీ హిరణ్యగర్భునకు యీయనకు సమిష్టియని చెప్పబడును. వానివాని శరీరము మాత్రముతాదాత్మ్యముగానుండుటచేత జీవులు వ్యష్టియనియు చెప్పంబడును. జీవులకు భోగములకునికియైన స్థూలశరీరములు గలుగజేయుటకై తామసగుణముగానుండు ఆకాశాదులు పంచీకరణము చేయవలయును. పంచీకరణమనగ పంచభూతములను ఒక్కొక్కటిని రెండుభాగములుచేసి మొదటిభాగమును నిలిపి రెండుభాగములును నాలుగుభాగములుగా పంచి పంచిన నాలుగుభాగములను యితర నాలుగుభూతములతో కూర్చునది. యీప్రకారము పంచకరణముచేసిన స్థూలపంచభూతములవల్ల అండము భువనములును నాలుగు విధస్థూలశరీరములును భోగములను మొదలుగా గల వస్తువులుగలిగెను. యీస్థూలభూత భౌతికములన్నియు ఒక్కటిగా యీశ్వరస్థూలశరీరమనియు విరాట్టనియు చెప్పంబడును. కీటితో కూడిన యీశ్వరునకు సూత్రాత్మయను పేరుపోయి వైశ్వానరుడని పేరుగలిగెను. కావున తైజసులందరు స్థూలశరీరములతోగూడి విశ్వులై దేవతలనియు మనుష్యులనియు తిర్యక్కులనియు నామములు గలవారైరి. యీశ్వరవాక్యములైన కర్మ భక్తి జ్ఞానములను ప్రతిపాదించి అనుష్ఠానముచేసి అంతర్ముఖ ముఖులైరి. అందరు రాగద్వేషపరులై చేసిన కర్మవశముచేత నదిలో సుడిమార్గములో పడి సంచరించు పురుగులవలెను జన్మబంధములలో బడి భ్రమించుచున్నారు.

దయాళుడైన పరమాత్మ ఆపురుగులను యెత్తినది వోడను ఎక్కించగ చెట్టు నీడ చేరి సుఖముపొందినట్లు సత్కర్మపరిపాకముచేత గురురూపముగా దర్శన మిచ్చిన యీశ్వరునియొక్క జ్ఞానోపదేశముచేత అపూర్వముగా ఒకానొకడు పంచకోశవివేకముచేసి ఆత్మకాదని నిశ్చయించి తాను పరమాత్మే యని నిశ్చయించి జీవన్ముక్తిని పొందును. కావున అయితే పంచకోశములనగా నేమి —1 అన్నమయ-2 ప్రాణమయ-3 మనోమయ-4 విజ్ఞానమయ-5 ఆనందమయములనెడి పంచకోశములు —

1. అన్నమయకోశమనగ స్థూలశరీరము అన్నమయం
2. ప్రాణములు కర్మేంద్రియములు కూడి ప్రాణమయం
3. మనస్సు జ్ఞానేంద్రియములు కూడి మనోమయం
4. బుద్ధి జ్ఞానేంద్రియములు కూడి విజ్ఞానమయం
5. కారణశరీరము ఆనందమయకోశము

ఈపంచకోశములతో ఆత్మకు తాదాత్మ్యము యెట్లనగా నలుపు వస్త్రము మొదలైనవాటితో కూడి ఆయావర్ణాకృతిగా తోచిన స్ఫటికము వలె ఆత్మగనుండు తాను పంచకోశములతో గూడి అవి తానుగా తోచుట యే తాదాత్మ్యము. కావున యీపంచకోశములను తాను గాదని తోచుట యెట్లనగ- యుపనిషత్॥ పంచకోశ వినిర్ముక్తం పంచదేహ వివర్జితం పంచ భూతాది సంగత్వంస ఏకపరమశ్శివః॥ అన్వయవ్యతిరేకములే వీటిని తోసివేయు వివేకములు గావున అన్వయ మనగా నేమి వ్యతిరేకమనగా నేమి ఆత్మానాత్మవివేకముచేత పంచకోశములను ద్రోసి అతీతముగా నుండు పరబ్రహ్మమును నేనని తెలియుట తానది వ్యవహరించిన స్థూలశరీరము తోచకనే స్వప్నావస్థయందు తాను తోచునది అన్వయము తాను తోచియు స్థూలశరీరము తోచకపోవుట వ్యతిరేకము సూక్ష్మశరీరము తోచకనే సుషుప్తి అవస్థయందు తాను తోచునది అన్వయము తాను తోచియు లింగశరీరము తోచకపోవుట వ్యతిరేకము స్థూల సూక్ష్మశరీరములు త్రోయగానే నాలుగు కోశములు త్రోసివేయబడెను. సుషుప్తికూడా తోచని సమాధిలో తాను తోచుట యెట్లు యన్వయము తాను తోచియు సుషుప్తి తోచకపోవుట వ్యతిరేకము పూంజీకనుపై ఆకులు వంచివేయగా నడిమిదంటుమిగినట్లు అన్వయ వ్యతిరేకము యుక్తిచేత తాను జీవుడని వ్యవహరించుచున్న పంచకోశముల

త్రోసివేసి అతీతముగా నుండు బ్రహ్మమే నేనను దృఢబుద్ధిగలవాడు తా దెలియును. కావున జీవునికి పరమాత్మకు యిటువలె యేకత్వము సాధించుటకు శాస్త్రప్రమాణము లున్నవనిన తత్వమసియను సామవేద మహావాక్యము ప్రమాణము. అది యెద్దియనిన వేదశ్రుతి॥ నేతినేతీత్యైశ్రుతిః నేతినేతీతి నేతీతి శేషితం పూర్ణముచ్యతే పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదీరితం పూర్ణశ్చపూర్ణమాదాయ పూర్ణబోధోవశిష్యతే॥

ఆమహావాక్యమునకు ఏమి అర్థమనిన మునుపు స్వయంపాకిగా నుండు వానికి కాలాంతరమునందు దొరతనము గలిగి అందలములో వచ్చు వానిని చూచునప్పుడు వాడే, వీడు అనునట్లు అనగ శ్రీరామహృదయమందు॥ రాజత్వ మమరినంతనె భోజనములు వానిజేరి పూజ చేగతిఁ రాజిలు సర్వము దనుగా యోచించినయపుడె గలుగు నుత్తమగుణముల్॥ అను వార్యోక్తి చొప్పున అని వ్యవహరించుటయందు వాడె అనునపుడు ఉపాధిలక్షణములను వీడు అనునప్పుడు అందలము మొదలైన వుపాధిలక్షణములును పరిహరించి రెండువార్తలలో శరీరమును మాత్రము భావనచేసికొని వాడె వీడు వీడె వాడు అని శ్రుతి॥ త్వమేవాహంత్వమేవాహం నసంశయః॥ అనునట్లు అని ఒక్కనినే సందేహములేక తెలిసినట్లు జగత్తుకు ప్రధానకారణమైన బ్రహ్మమును మాయాశబళితమైన యీశ్వరుని అతని శరీరత్రయమును చూపించును. తత్ పదమునకు మలినసత్వమైన అవిద్యను అవిద్యాప్రతిబింబుని వాని శరీరోపాధియందు అధిష్ఠాన కూటస్థునిగా చూపించును. త్వంపదము వీరిద్దరిని ఒక్కం డనునదియే మహావాక్యము యీరెండు స్థలములయందును ఉపాధులతో కూడిన చైతన్యములను విడచి అఖండముగా నుండు సచ్చిదానందము ఒక్కటియే అని సందేహములేక చూపించుటయే విభాగత్యాగలక్షణమైన జహదహల్లక్షణము గావున,

ఇటువంటి జ్ఞానము గలుగుటవలన గురుసన్నిధానమునందు చేయదగినకార్యమే మిట్టి- తత్వజ్ఞానసాధన చతుష్టయ మహావాక్య శ్రవణాదులు చేయవలసియున్నది. ఆశ్రవణాదులు యెన్నివిధములు వివరం యెద్దియో తెలియవలెను గావున, శ్రవణాదులు నాలుగువిధములు. అవియెవ్వియనిన, సకలవేదములకు ఆరులింగములుచేత అర్థము విచారణచేసి పరబ్రహ్మతాత్పర్యపదముగా చూచుకొనుట శ్రవణము. యుక్తిచే అనవరతము చింతచేయుట

మననము. మనస్సునేకాగ్రిపఱచుట నిధిధ్యాసము ధ్యాన్నము చేయువానిని ధ్యాన్నమును ధ్యానింపబడిన వస్తువ మాత్రిముగానుండు చిత్తము సమాధి-యిట్టి సమాధికి ఏమిఫలముయున్నది. అనాదికాలమునుండి చేయబడిన సంచితకర్మ నాశనము తన్ను నిర్ణయముచేయు ధర్మము వాసనాక్షయము అపరోక్షజ్ఞానమని ఫలము.

కావున, మహావాక్యములవలనగాని, అపరోక్షజ్ఞానము గలుగునుగావున- యీచతుర్ మహావాక్యములకు చతుర్ వేదములయందు- తెలిసవస్తువును, ప్రితిపాదించి చెప్పుటకు వాక్యములు మహావాక్యములగును. ఆవాక్యములెవ్వి. జ్ఞానస్వరూపముగా నుండునదియే బ్రిహ్మమని ఋగ్వేదవాక్యము ప్రిజ్ఞానం బ్రిహ్మ- అనియున్నది. నేనేబ్రిహ్మమని యజుర్ వేదవాక్యము- అహం బ్రిహ్మాస్మి అనియున్నది. నీవును అదియేనని సామవేదవాక్యము యీ ఆత్మయే బ్రిహ్మమని అధర్వణవేదము చెప్పుచున్నది. అయిమాత్మబ్రిహ్మయను అధర్వణ వేదవాక్యము. ఋగ్వేదమునందు, చెప్పబడినవాక్యమును, ఏతెలివిచేత శబ్దమును మొదలైనవిషయములు, తెలియబడుచున్నవో ఆబోధయే బ్రిహ్మమనియర్థము. ఇటువంటి బ్రిహ్మముయను బహూచనములు యన్నిగలవు, త్రిమూర్తులు మొదలైన దేవతలందరును మనుష్యాన్యగాదులు మొదలైనవాటియందును చైతన్యమైన బ్రిహ్మము యొక్కటియేగాని రెండవదిలేదని చెప్పుచున్నవి. గావున, యిటువలె మొదట జ్ఞానం నిర్ణయమైనందుచేత మిగిలిన మూడువాక్యములకు అర్థమేమిటయో తెలియలేదు. పరిపూర్ణముగానుండు పరమాత్మయె గావున, యీదేహమునందు బుద్ధికిసాక్షిగానుండు చైతన్యము యిటువలె తానుగానుండు బ్రిహ్మము అహమనియు ఋగ్వేదము చెప్పుచున్నది గావున జీవునియొక్క దేహేంద్రియములకు అతీతముగానుండు వస్తువు బ్రిహ్మమైనందువల్ల నీవెజగత్ త్కారణరహితమైన బ్రిహ్మమని సామవేదము చెప్పుచున్నదిగావున యిట్లు స్వయంప్రికాశముగానుండు ఆత్మ తానే బ్రిహ్మముగాని మరియొకటిగాదు అని అధర్వణవేదము చెప్పుచున్నది గావున యీవాక్యములకు అర్థము తన్నుతాదెలియుట తానుతానౌట తానె బ్రిహ్మమౌట అంతా నౌట పెద్దలసాంగత్యంచేసి యీవాక్యములు గురుముఖతా తెలసి విచారణచేసి యనుసందానము అనగ బ్రిహ్మైకాన్యను సంధానం చేసినయెడల బ్రిహ్మమేయగును, గాబట్టి—

త్రిభాష్యాసూత్రిములు॥ ఏకోవశీసర్వభూతాంతరాత్మ॥
ఏకంరూపంబహుధా యఃకరోతి తమాత్మస్థం యేనుపశ్యంతిధీరా స్తేషాంసుఖం శాశ్వతన్నేతరేషాం॥
ఏకోదేవసర్వభూతేషు గూఢసర్వవ్యాపి సర్వభూతాంతరాత్మా॥
కర్మాధ్యక్షా సర్వభూతాధివాస సాక్షీచేతా కేవలోనిర్గుణశ్చ॥
ఏకోనారాయణో నద్వితీయోస్తికశ్చిత్।
ఏకఏవోసిత్వ స్తథాన్యత్సకలంమృషా।
బహునాత్రికిముక్తేన సర్వబ్రహ్మమయంజగత్॥
అనేకభేదభిన్నస్తు క్రీడితేపరమేశ్వరం॥
ఇట్లుప్రిమాణములు అనంతంబులు ఆమ్నాయంబులును పురాణేతిహాసస్మృతులును చెప్పంబడుచున్నవి. కాబట్టి,

శ్లో॥ యావన్మనోరజసా। పూరుషస్య సత్వేనవా। తమసా వానురుద్ధం చేతోభిరాకూభిః రాతనోతినిరం। కుశలంకుశలం వేతదంవా। సవాసనాత్మా విషయోపరక్తాగుణప్రవాహో। వికృతశ్శోడశాత్మా॥—

వ్యా॥ పురుషస్య, కుశలం, ధర్మమితర, మధర్మంవా, ఆత్మనోతిశైః, చేతోభిః, జ్ఞానేంద్రియై, ఆకూతిభిః, కర్మేంద్రియైశ్చ, తతశ్చధర్మాధర్మవాసనాయుక్తం తదేవానేకదేహాదిస్సై, చిత్ర్యాంకరోతిత్యాహ, సఇతి తన్మనఇత్యర్థం వాసనాయుక్తం ఆశోమ్మేపాధిత్వాదాత్మా॥

తెనుగుఅర్థంయెట్లనగ పురుషునిచిత్తంబుత్రిగుణములను చెంది యెంత కాలముండునోమరి అంతకాలమువరకు కలియుగ విజ్ఞానకర్మేంద్రియములచేత మరగికూడిధర్మంబునుమరియధర్మంబుచునట్లుతగిలిపుట్టించుచుండు తనఅత్యంత మహిమచేత గావున ధర్మాధర్మవాసనాయుక్తంబు చిత్తంబుగావున అద్వైతపరముగా పైశ్లోకము వుపనిషత్తులు చెప్పియున్నవి, కాబట్టి మనోవృత్తుల నతిక్రమించిన జీవుండు, పరంజ్యోతియైన నారాయణస్వరూపంబుగా అనగ-బ్రహ్మస్వరూపంబుగా నెరుంగవలయును. కారణోపాధికుండైన ఈశ్వరుండు సర్వభూతాంతర్యామియై యగుచు కార్యోపాధికుండైన జీవాత్మస్వరూపంబుననుండు. యిట్లుఅద్వైతపరముగా తత్వఘట్టములయందు చెప్పబడియున్నది. కాబట్టి—స్థాలీపులాకన్యాయంబున కొన్నిప్రుదహారణములు చెప్పచున్నది.

శ్లో॥ ఇంద్రియార్థభ్రమో, జాగ్రితస్వప్నాంతఃకరణభ్రమః సుప్తం॥ తద్వాసనాబీజం॥ తుర్యామూర్తిస్తదన్మితః॥

ఇంద్రియార్థభ్రమణంబుచేసెడు దుర్మదులకు, సుషుప్త్యాద్యవస్థలు, వరుసనకలుగుటంజేసి పరబ్రహ్మము బొందరామియునైన- నాలుగోఅవస్థయు గలుగును- గాబట్టి ఆత్మమాయాకల్పిత మాయారూపం బగుటచేసి యెఱింగియు యెఱుంగని తెరంగున జేసియుండ్రు గావున శ్రీధరవ్యాఖ్యాన అద్వైతతత్వఘట్టములయందు చెప్పబడియున్నవి. ఇంకాకొన్ని సూతసంహితయందు కొన్ని పైయుదహరణలగురించి చెప్పుచున్నారు. ఎట్లనిన —

శ్లోకం॥ బుద్ధేజాగరణస్వప్నః, సుషుప్తిఃశ్చోచ్యతే, మాయామాత్రమిదం రాజనానాత్వం, ప్రత్యగాత్మనః, యథాజలధరావ్యోమ్నభవంతినభవంతిచ, బ్రహ్మణీదంతథావిశ్వమవయవ్యుదయాప్యయాత్, అన్యోన్యపాశ్రయాత్సర్వమాద్యంతవదవస్తుచ, నానాత్వంచద్వయోర్యద్వ్యజ్యోతిషో, ర్వాతయోరపి, యథాహిరణ్యం, బహుధాసమీయతే, నృభిక్రియాభిగర్వ్యవహారవర్త్మసు ఏవంచోభిరగవానధోక్షజో వ్యాఖ్యాయతే లఘుకికవైదికైర్జనైః ॥

ఇట్లు బహుప్రకారంబుల- యామ్నాయశ్రుతిస్మృతిపురాణేతిహాసంబులు చెప్పుచున్నవి. ఎట్లనిన స్వప్న, జాగరణ, సుషుప్త్యవస్థా, భేదం, బాత్మమయంబై- బుద్ధియుక్తంబై మాయనై, యోగంబునం బరిణమించు, ప్రాణిజాతంబున, కారణోపాధియైన- ఈశ్వరునందు లయోదయంబులగు, ఈజగంబు అన్యోన్యాపాశ్రయంబై యాద్యంతవస్తువై వర్తించు, ఒక్కతేజంబు, బహురంధ్రంబుల గానంబడు తెరంగున, ఒక్కపరమాత్మను, పెక్కువిధంబులుగా భావింతురు. హాటకంబు పెక్కురూపంబులైయ్యు బంగారం వక్కటయ్యు అనేకంబులైన తెరంగున- పరమాత్ముం డఖిలప్రపంచమయుడైన పరమాత్మను నొక్కటిగా భావింతురు.

ఇంకాకొన్ని అభిప్రాయములు చెప్పుచున్నారు. ఎట్లనిన- జాగ్రత, స్వప్నసుషుప్త్యవస్థలు బుద్ధిధర్మంబగు ప్రత్యగాత్మయందు- నానాప్రకారంబులఁదోచు- నీదృశ్యప్రపంచంబంతయు మిథ్యయని తెలియుము. ఒక్కతేజంబు బహురంధ్రమ్ముల గానంబడు తెరంగున నొక్కయాత్మయై పెక్కువిధంబులదోచుచుండు హాటకంబు పెక్కురూపంబులు గలదైన నేకంబైన తెరంగున పరమాత్మ వివిధచేతనాచేతన శరీరములయందు బెక్కువిధంబులం గనబడిన నేకంబుగా భావింపవలయును గాబట్టి- యీఅభిప్రాయము సువ్యక్తముగా అద్వైత- తత్వఘట్టములయందు చెప్పబడియున్నది. కావున

శ్రీకృష్ణుండు- యుద్ధవునకు- హంసరూపియై చేసిన, తత్వోపదేశమునందున్న శ్రీధరవ్యాఖ్యానములయందు సూతసంహిత తత్వఘట్టములయందును చెప్పుచున్నవి గావున నాకు గోచరించి నంతవరకు వ్రాయబడుచున్నది.

శ్లోకం॥ మనసా, వచసారదృష్ట్వాకదృశ్యతె, నైవ్యరపీంద్రియైః అహమేవనమత్తోన్య, దితిబుధ్యత్వమంజస॥

అను యీశ్లోకము పంచేంద్రియంబులకు దృష్టంబైన పదార్థంబు అనిత్యంబు అది నిత్యదృష్టిని బ్రహ్మంబని తెలియవలయును- అని తెనుగున చెప్పియున్నదిగాబట్టి—యింకొక శ్లోకంబును చెప్పుచున్నారు యెట్లనిన—

శ్లోకం॥ తస్మాత్వముద్దవోత్సృజ్యబోధనాం, ప్రతిబోధనామ్, ప్రవృత్తించ, నివృత్తించ, శోత్రివ్యం, శ్వతమేవచమామేకమేవశరణ మాత్మానం సర్వదేహినామ్॥

శంకరభాష్య, రామానుజభాష్యములయందు ఈశ్లోకములకే సర్వధర్మాన్ పరిత్యజ్యమామేకం శరణంవ్రజ, అహంత్వాసర్వపాపేభ్యోమోక్షఇష్యామిమ్మాశుచః॥యిత్యాదులు నాలుగుపంక్తులు చెప్పి పిదప విశిష్టాంశమును గొంతయు గొన్నిశ్లోకములయందు చెప్పబడియున్నవి. ఇరువదినాల్గవదానియందలి సాంఖ్యవిధియు సప్తవింశతియందలి బ్రహ్మతత్వంబును చెప్పబడియున్నది. అద్వైతోపనిషత్తు॥ గచ్ఛేదవమైయాధిష్టో బ్రదరాక్యం మమాశ్రమం॥ ఇత్యాదులు అద్వైతపరముగా గానుపించుచున్నది. విశిష్టాద్వైతపరముగా గానిపింపబడుచున్నది గాబట్టి, సర్వధర్మాన్ పరిత్యజ్యమామేకం,శరణం వ్రజ॥ యను యుపనిషత్తుత్యంబుగ గీతావచనప్రకారంబునయున్న యీశ్లోకమునకు విశిష్టాద్వైతపరముగ స్పష్టీకరించి మిక్కిలి ప్రాధాన్యముగ చెప్పుచున్నారు గావున మరియు జీవాత్మభేదంబు మొదలైనవి యెరింగించి విజ్ఞానవంతునిగా జేసి మన్నించితి యిట జీవాత్మభేదంబు ప్రతిపాదించుచున్నారు గావున విశిష్టాద్వైతపరము యెట్లనిన దేవాంతర మతాంతర సాధనాంతరంబులు వర్జించియుండెనేని వైకుంఠవాసియైన అర్థము వీరవైష్ణవత్వము సూచకముగా కొందరు చెప్పుచున్నారు.

ప్రత్యగాత్మయందు నానాప్రకారంబులందోచు నీదృశ్యప్రపంచంబంతయు మిథ్యయని తెలియవలెను. ఇట్లాత్మైక్యానుసంధానంబు ఆత్మస్వరూపునిగా తన్ను తాదెలసి తానుతానైయున్న బ్రహ్మంబుదక్క తక్కినదంతయు

మిథ్యావాక్యంబులు ప్రసిద్ధంబైయుండె గావున—

శ్రుతి॥ శ్రీధరవ్యాఖ్యానతత్వఘట్టములయందు॥ ద్రవ్యంకర్మచ, కాల శ్చ, స్వభావో, జీవఏవచ॥ వాసుదేవాత్పరోబ్రహ్మన్నత్వన్యోర్థోసితత్వతః॥ సవ్యాఖ్యానః॥ ద్రవ్యం, మహాభూతాని, ఉపాదానరూపాణి కర్మజన్మనిమిత్తం కాలః। తత్క్షోభకః॥ స్వభావన్॥ తత్పరిణామహేతుః॥ జీవో- భోక్తా॥ వా సుదేవాత్పర- అన్యోర్థోనాస్తి—

మరియు దేహంబునకు ద్రవ్యంబులైన మహాభూతంబులును జన్మనిమి త్తంబులైన కర్మంబులును కర్మక్షోభకంబులైన కాలంబును కాలపరిమాణ హేతువు అయిన స్వభావంబును- భోక్తయైన జీవుంపును పరబ్రహ్మంబైన వా సుదేవుండుగా సర్వము నెరుంగుము—నిరాకాశపరబ్రహ్మం నిశ్శబ్దాకాశ తత్వం- శ్రుతి" ఏవఆత్మాన, మాత్మస్థ, మాత్మనై వాత్మ్యశప్రభో॥ యిట్లాత్మ నాత్మస్తుతిగా- తన్ను తానుగా నెరుంగుము. కావున మనంబునందలంచుచుం డుము. కాబట్టి- శ్రుతి అద్వైహ్యవిద్యమానేపి, సంశృతిర్నవివర్తతే, మనసా లింగరూపేణ, స్వప్నేవిచరతోయథా —ననుత్వ్రాఅజ్ఞాన విలసితత్వేన, సం సృతిహేతోర్దేహాదేరప్రసత్యత్వాత్కింతర్వితన్నివర్తన ప్రయాసేనతత్రాహ॥ అర్థేహేతి॥ లింగరూపేణ- ఉపాధిభూతేన—వినుము స్వప్నంబు చందంబున- నజ్ఞానవిలసితంబగుట జేసితిరి గావున మిథ్యాభూతదేహాదికమునకు- అరయగ- నివర్తిమాయాసమేటికి, నర్థంబులేకున్న నర్థిసోపాధికంబునైన మనము ఆత్మా ధీనంబులైన సంకల్పాధీనంబులైన శరీరంబులయందు ప్రవేశించియున్న జీవస మూహంబు తనకుశేషభూతంబని తా తెలియవలయును. కొందరు సచరా చరవస్తుజాతంబులకు నంతర్యామివై సర్వంబు నీవయగుటందెలియలేక అ నిత్యంబని విపరీతబుద్ధిం దెలియుదురు- కావున కొందరు జగద్భరితుండవుగావు న జగద్రూపకుండైన తన్ను గటకమకుటకర్ణికాది వివిధభూషణభేదంబులు గనకంబు నిజస్వరూపంబు విడువకవర్తించుచందంబున జగద్వికారానుగతుం డైయ్యును నిఖిలహేయప్రనీయక కళ్యాణగుణాత్మకుండవై యుందువని ఆత్మ విదులైనవారుతా తెలియుదురు—

అట్టిజీవులు దేవతిర్యఙ్మనుష్యాది స్థావరాదిశరీరంబులు సొచ్చి అణు రూపులైయుందురు. అందు తానుయుండు తదంతరాత్మవగుచు- మాయావి శిష్టుండవగుచు కార్యకారణాత్మకుండవై కార్యోపాధిరయంజీవః, కారణో

పాధిరీశ్వరః, కార్యకారణతాం హిత్వాపూర్ణబోధో వశిష్యతే॥ ఇత్యాది జీవ బహుత్వాణురూపత్వ శేషత్వములు యీశ్వరుని జగదూపతత్వములు. చిదచిద్విశిష్టము- శేషిత్వము శరీరభూత చిదచిదాత్మకత్వము సర్వశబ్దవాచ్యత్వము ఈశ్వరునియందు శృతులయొక్క ముఖ్యాభిప్రాయము. విశిష్టపరముగాగూడా కొన్నిచోట్ల వుదహరించుచున్నవి.

ఇదియునుంగాక యిట్లు బ్రహ్మముగాక బ్రహ్మమునకు అన్యముగాక మాయాశక్తికలదనుటకు కారణమేమి. బ్రహ్మమునకు అనంతశక్తికలదని చెప్పువేదములును వాసిష్ఠమున్ను మొదలైనవి చెప్పుచున్నవి. వాసిష్ఠమునందు రామునకు వశిష్ఠులవారు చెప్పియున్నారు ఎట్లనిన, బ్రహ్మమునందు అనంతశక్తికలదు. ఆశక్తివలన బ్రహ్మము తానె శరీరాదులలో చిచ్ఛక్తియు ఆకాశమునందు నిరవయశక్తియు వాయువందు చలనశక్తియు, అగ్నిలో వుష్ణశక్తియు, జలమునందు శైత్యశక్తియు, పృథివియందు కఠినశక్తియు ఈరీతిగా అనంతశక్తి బ్రహ్మమునందు కార్యముచేత కనుపించుచున్నదనియును- సృష్టికి పూర్వము ఈశక్తి గుప్తమందు సర్వమున్నట్లుగ, బీజమునందు వృక్షమున్నట్లుగ కనుపించక- బ్రహ్మమునందుండుననియు వటబీజముకురగర్భన్యాయముగ బ్రహ్మమందుండుననియు, దేశకాలవిచిత్రములచేత భూమియందు పైరు మొలచినట్లు బ్రహ్మమునందు శక్తిమొదటి ఒకానొక కాలమందు జగత్తుని కార్యరూపకముగా ప్రకాశించును. మొదట మనస్సుకలిగెను. వెనుక బంధమోక్షములు కలిగెను. అటువెనుక ఆకాశాదిసృష్టి కలిగెననే క్రమమంతయు, బాలులకు కథజెప్పినట్లుగనే, మూఢులకు చెప్పినదేకాని నిజముగాదని వశిష్ఠులవారు చెప్పియున్నారు. ఎట్లనగ,

అసత్తనేపట్టణమునందు ముగ్గురురాజకుమాళ్ళు గలరు. వారిలోయిద్దరు ఇకమీదపుట్టబోవుచున్నారు. ఒకడు యికమీదట గర్భమునందు ప్రవేశింపబోవుచున్నాడు. పుణ్యశాలులైన యీ ముగ్గురు రాజపుత్రులు వేటకు పోయినచోట ఆకాశమునందు మంచితోపు ఒకటియున్నదని మూకలుమంది చెప్పగ విని ఆకాశమునకుపోయి ఆతోపునుచూచిరి. అచ్చట కుందేటికొమ్మును నరికి సింహనాదముచేసి ఇకమీదకలుగబోవు పట్టణమునందు నేడు ప్రవేశించినారని పాలుయిచ్చుచున్న దాది చెప్పిన కథనువిని విచారములేని శిశువునమ్మియుండును. ఎట్లనిన హుళక్కి- హాయి. లోడలోడ హుళ్ళక్కి-

హాయి యని పాడుతూయున్న దాయిపాట విచారములేని శిశువువిని నమ్మి యుండెను. అటువలెనే యీసంసారకల్పనయంతయు విచారములేని మూఢునకునిజమువలెచెప్పియున్నదనియు ఇదిమొదలైన ఉపకథలతోకూడ మాయాశక్తియొక్క విస్తారమును వశిష్ఠులు రఘురామునకు చెప్పిరి. మేమున్ను ఆ మాయాశక్తిని నిరూపించి చెప్పియున్నారు. వేరువేరుగా జలప్రవాహములు నదీనాం సాగరోగతిః॥ అనున్యాయంబున వచ్చినప్పుడు మధ్యయుండు పెద్ద బండ కదలకయున్నటువలె నామరూపములు వేరువేరుగా పరిపాకమై తోచినను ఏకరీతిగానుండు బ్రహ్మమేతానని తెలియవలయును. కావున దర్పణమును చూడకనే ప్రతిబింబముతోచనటువలె సచ్చిదానందబ్రహ్మముతోచకనే నామరూపములు తోచవు. కనుక మొదట తోచిన సచ్చిదానందమును చూచి అటుపైనతోచిన నామరూపములయందు బుద్ధిని వ్యాపింపనీయక నిలిపినపట్ల ద్వైతముచెడి అద్వైతమునిలచును. అనగ, బ్రహ్మముయొక్క నిలకడ తానుగానె శేషించును.

ఎట్లనగ సర్వత్ర సమముగానుండు తెల్లనివస్త్రము సత్యమనియు అందులో వేరువేరుగా కనుపించు చిత్రములు మిథ్యయనియు తెలసినట్లు సర్వత్ర సమముగా తోచు సచ్చిదానందము సత్యమనియు అందు వేరువేరుగ తోచిన నామరూపములు మిథ్యయనియు చూచి ఉపేక్షించవలయును గాబట్టి—

కార్యములతో కూడినవాడే తానుగాతోచుచున్నందువల్ల తాను అసంగుడని తెలిసికొనుట యెట్లనగ—కూపములో తనరూపము తలక్రిందుగా తోచినను దానిని తానుగాదని తోసి గట్టుమీదనుండు తన్నుతానుగా చూచి సందేహములేక చూచినట్లు మూడవస్థలయందు కర్తగ వ్యవహరించుచు తన్నుతానుగాదని నేతిమహావాక్యమురీతిగా నుపేక్షించి అందుకుసాక్షిగా నుండు ప్రత్యగభిన్నపరమాత్మే తానని సందేహముడిగి చూడవలయును. ఇదే అంతర్లక్ష్యమని శృతులుచెప్పుచున్నవి. కాబట్టి మనస్సులో ఘట్టిగపట్టి యుండు ప్రపంచకార్యమపేక్షించుట యెట్లు. క్షణక్షణమువరకు వేరువేరుగా వచ్చు మనోరాజ్యమనగ, శృతి॥ అనాత్మదృష్టై అవివేకనిద్రాఅహంమను స్వప్నగతింగతోహం॥ కలలోతోచిన శరీరములు యేలాగో ఆలాగే, స్వప్న మనోరాజ్యమును సకలజనులు అంతమట్టులోనే ఉపేక్షచేయునట్లును బాల్యమందు యవ్వనముకావలెనని కోరినా రాకయున్నందువల్లను యవ్వనమునం

దు వార్ధికముకావలసి రాకయున్నందువల్లను నిన్నటిదినము మృతమైపోయిన శిశువునేడు రావలెనని కోరినా రాకయుండుటచేతను నిన్నటిదినము నేను రావలెనని కోరినారాకయున్నట్లును మనోరాజ్యమువలె అక్కడక్కడ చూచినది అక్కడక్కడ నశించిపోవునట్లును నామరూపములుతోచినవాటిని అబద్ధమేనని నుపేక్షించవలయును. ఈతత్వఘట్టమునందు నాకుగోచరించినంతవరకు యామ్నాయములలోనివిన్ని శృతిస్మృతీతిహాసపురాణోపనిషత్ ప్రమాణంబులు వ్రాయబడినవి.



# శ్రీమహాఋషినిఘంటివేద యోగశాస్త్రము.

## కర్మసూత్రము.

—॥ అష్టావక్రమహాఋషి నధామ్యుడను బ్రహ్మచారికి
కర్మసూత్రము బోధించుట. ॥—

కర్మసూత్రమునుగురించి బ్రహ్మజ్ఞానప్రధానములును, యోగప్రధానములును, అనన్యప్రధానములును నైనయుపనిషత్తులు శృతిస్మృతులు గీతార్థరహస్యభాష్యములు మొదలగునదియు బ్రహ్మసూత్రములతో గీతలను నిజముగ యుదాహరణచేత చూచినయెడల నొక్కటియేయభిప్రాయము నిచ్చునుగావున దీనియందు కర్మ, మాయ పరబ్రహ్మము అను నీరెండువర్గములేయున్నవి. కారణమేమనగ, ఆయాయుపనిషత్తులలో ఆయాఋషీశ్వరులచేత వేరువేరు విధముగ జెప్పబడినయట్లు॥ మహాఋషీణాం మతయశ్చభిన్న॥ యనునట్లు వారివారి అభిప్రాయము నుదహరించి వారివారి యనుభవమును వేదసారాంశమును అధ్యాత్మతత్వసిద్ధాంతముయొక్క పద్ధతినే వివేచనచేయుటకై బాదరాయణులు బ్రహ్మసూత్రములు చెప్పుట ప్రకాశింపచేసిరిగాన, ఆబ్రహ్మసూత్రములయందుపనిషత్తులలోనున్నదానికంటె వేరుగా విచారణచేయుటకు వీలులేదు. కావున భాష్యమునందు బ్రహ్మసూత్రములయందు భేదము యించుకయినను దోచలేదు. గీత॥ ఋషిభిర్బహుధాగీతం ఛందోభిర్వ్విదైపృథః బ్రహ్మసూత్రపదైశ్చైవహేతుమద్భిర్వినిశ్చితైః॥

క్షేత్రక్షేత్రజ్ఞులు అనేకప్రకారములు అనేకరూపములు మొదలగు వివిధములగు ఛందస్సులచేతను అనేకములగు ఋషులచేతను వేర్వేరగు హేతుయుక్తములుగను పూర్ణమైననిశ్చయాత్మకములును నగు బ్రహ్మసూత్రపదములచేతను వివేచనచేయబడిరని స్పష్టముగ చెప్పబడినవి. మరియు నీబ్రహ్మసూత్రములును ప్రస్తుతమందున్న వేదాంతసూత్రములును వేరుకావనియుం

దురేని, ప్రస్తుతమందున్న వేదాంతసూత్రముల యనంతరము గీతలుపుట్టినవని
చెప్పవలసివచ్చును. కావున నీబ్రహ్మసూత్రములేవని గీతాకాలదృష్టితో
దప్పక విచారింపవలసివచ్చును. కారణమేమనగ ప్రస్తుత మందున్న
వేదాంత సూత్రములుగాక బ్రహ్మసూత్రములను పేరుగల మరియొక
గ్రంథమిప్పుడు గనబడదు. అట్టిగ్రంథ మున్నయటుల గనబడ లేదు.
మరియు, ప్రస్తుతమునందు బ్రహ్మసూత్రములకు వెనుక గీతలు పుట్టినవని
చెప్పుటయు కారణమేమనగ గీతలు పూర్వమని పరమని చెప్పుటకు నొక
కారణమున్నది. ఎద్దియనిన గీత బ్రహ్మసూత్రములకంటె ప్రాచీనములని పరం
పరాగతముగ దేలియున్నది. ఈయభిప్రాయమును మనస్సునందుంచుకొని
శంకరభాష్యమునందు బ్రహ్మసూత్రపదైః యనుదానికి శృతులయందు లేక
యుపనిషత్తులయందుగాని యున్న బ్రహ్మప్రతిపాదకములగు వాక్యములని
నర్థములు వ్రాసిరి. శంకరభాష్యమునకు వ్యాఖ్యానముచేసిన యానందగిరి
యు, రామాజాచార్యులును మొదలగు నితరభాష్యకారులును బ్రహ్మసూత్ర
పదైశ్చైవ యనునట్లును కర్మసూత్రపదశ్చైవ యనునట్లును పదముచే అథా
తోబ్రహ్మజిజ్ఞాసా మొదలగు బాదరాయణులయొక్క బ్రహ్మసూత్రములే
యిక్కడ సిద్ధములని శంకరభాష్యమునకు విరుద్ధముగ నర్థము చెప్పుచున్నారు.
శ్రీధరస్వామి యీరెండు అర్థములును చెప్పవచ్చునని చెప్పెను. ఇప్పు డీశ్లో
కమునకు సత్యమగు నర్థమేదియో స్వయముగ తన యనుభవముచేత నిశ్చ
యించి చూడవలయును. ఎట్లనిన క్షేత్రక్షేత్రజ్ఞవిచారము ఋషులచేత యనే
కవిధములుగా వేరువేరుగా పృథక్ చెప్పబడియున్నది. అదిగాక చైవహేతు
యుక్తములును వినిశ్చియాత్మకములును నగు కర్మసూత్రపదములచేత సహిత
మీయర్థమే చెప్పబడినది. ఈప్రకారముగ చైవ మరియు యనుపదముచే
నీశ్లోకమున క్షేత్రజ్ఞవిచారము చేయబడిన రెండు భిన్నాభిన్నస్థలములు లిఖిం
పబడినవని యర్థమగుచున్నది. ఈరెండుస్థలములను వేరుగనుండుటయేగాక
వీనిలో మొదటిదనగ చిన్నచిన్నవియు యనేకవిధములును నగుటచేతనే
ఋషిభిః అనుపదముచేత అనగ అనుతృతీయాతబహువచనపదముచేత నవి
యనేక ఋషీశ్వర్లచేత జేయబడినవనియు బ్రహ్మసూత్రములయందున్న రెం
డవ వర్ణన హేతుయుక్తమును కర్మసూత్రమును నిశ్చయాత్మకమునైనదని
యు యీరెండువర్ణములలోను విశేషభేద మీశ్లోకమందే స్పష్టీకరింపబడినది.

ఈహేతుమచ్ఛబ్దము మహాభారతమున ననేకస్థలములయందుండుటచేత నైయాయికరీతిగ కార్యకారణభావము నేర్పరచి చేయబడిన.ప్రతిపాదనమని యాశబ్దమునకు అర్థమగును. జనకులవారియెదుట సులభముచేయబడిన సంభాషణమునుగాని శిష్టాచారము తప్పకుండగను గౌరవమునకై కౌరవసభకు పోయినప్పుడు శ్రీకృష్ణమూర్తిచే చేయబడిన సంభాషణమునుగాని యుదాహహరణముగ గైకొందము. మొదటిసంభాషణ హేతువంతమును అర్థవంతమును రెండవది సహేతుకముగను అని మహాభారతములో చెప్పబడియున్నది. దీనినిబట్టి సాధకబాధకములగు కర్మసూత్రప్రమాణములను చూపించి తుదకు నిస్సందేహముగ అనుమానముచేయబడిన ప్రతిపాదకమునకే హేతుమద్భిర్వినిశ్చితైః॥ యను విశేషణమును సంబంధించును. ఒకచో నొకటి మరియొకచో నింకొకటియు నీయుపనిషత్తులయందు సంక్షిప్తముగ ప్రతిపాదించుట కీశబ్దములు పనికిరావని సిద్ధమగును. కావున నొకవైపున ఋషిభిః॥ బహుధావివిధైఃపృథక్॥ యను పదములకును వేరొకవైపున హేతుమద్భిఃవినిశ్చితైః॥ యను పదములయొక్క విరోధాత్మకమగు సారస్యము దృష్టపరుపవలసినచో గీతలయందున్న పూర్వోక్తశ్లోకములో ఋషులచే వివిధఛందస్సులయందును చేయబడినదియు ననేకవిధములైనదియు వేర్వేరైనదియు నగు విచారమేమనగ ఆ యుపనిషత్తులయందున్న సంకీర్ణములను వేర్వేరైన వాక్యములను మరియు హేతుయుక్తములును నిశ్చితాత్మకములును నగు బ్రహ్మసూత్రపదములను శబ్దములచే సాధకబాధకప్రమాణముల నిరూపించి తుదకు నిస్సందేహముగ సిద్ధాంతముగ నిశ్చయింపబడిన కర్మసూత్రగ్రంథమందున్న విచారమనేకులగు ఋషీశ్వరు లనేకవిధములుగ బొకగట్టినట్టులేవనగ విస్ఖలితముగ తీరుననే చెప్పబడియున్నది గాన దానిని విచారించి యేకవాక్యముచేసినగాని యుపనిషత్తుల భావార్థము బాగుగ తెలియుటలేదని మనంబున నిడికొనవలయును. కావున నుపనిషత్తులవలెనే వాని కార్యకారణభావములను నిరూపించి యే వాక్యముచేతను బోధించు వేదాంతసూత్రములను సహితము విచారింపవలెను. కావున —

జీవాత్మ పరమాత్మల సంబంధమేమియని విచారించుచు సృష్టియందున్న యితరపదార్థములవలె జీవాత్మ పరమాత్మవల్ల పుట్టలేదని బ్రహ్మసూత్రం॥ నాత్మాశ్రుతేర్నిత్యత్వాచ్చతాభ్యః॥ అను సూత్రముచేత నిర్ణయించి

జీవాత్మ పరమాత్మయొక్క హంశమని అంశో నానావ్యపదేశాత్॥ బ్రహ్మసూత్రి మనుమాత్రిమున చెప్పిన పిదప మంత్రివర్ణాశ్చ॥ శృతి నాధారముగ జేసికొనుచు అపిచస్మర్యతే॥ అనగ శృతియు నటులేయున్నది. ఈస్మృతి గీత మమైవాంసోజీవలోకె జీవభూతస్సనాతనః" గీతలయందున్న వచనమని భాష్యకారులును చెప్పుచున్నారు. కాని వీని యన్నిటికంటె కడపటచెప్పిన యుదాహరణము మిక్కిలి నిస్సందేహముగ నున్నది. దేవయాన పితృయానముల ను రెంటియందును నారుమాసములు ఉత్తరాయణమును ఆరుమాసములు దక్షిణాయణమని చెప్పుదురు. ఆరెండుశబ్దముల కర్ధము కాలపరముగా జేయక బాదరాయణు లీశబ్దములకు నాయాకాలాభిమానినులగు దేవతలే యర్ధమని యెన్నుచున్నారని సూత్రిభాష్యం పూర్వమున చెప్పబడియున్నది. దక్షిణాయణోత్తరాయణములకు కాలమను నర్ధము యెప్పుడును చెప్పగూడదాయను సందేహముగ నున్నది. బ్రిహ్మసూత్రి॥ యోగినఃప్రితిచస్మర్యతె యత్రికాలెత్వనావృతిమావృత్తించైవయోగినః॥ గీతావచనములో నీకాలము యోగులకు విహితమని స్పష్టముగ చెప్పబడినది. దీనింబట్టి భాష్యకారులు చెప్పిన పక్షమందైనను బ్రిహ్మసూత్రి కర్మసూత్రిములలోనున్న శబ్దములు గాన్నన,

బ్రిహ్మసూత్రిములు.

1. స్మృతేచ్ఛ.
2. అపిచస్మర్యతే.
3. ఉపపద్యతేచాప్యుపలభ్యతేచ.
4. అపిచస్మర్యతె.
5. దర్శయతిచాథో అపిస్మర్యతె.
6 అనియమః సర్వాసామవిరోధః. శబ్దానుమానాభ్యాం.
7. స్మరంతిచ.
8. యోగినఃప్రితిచస్మర్యతె.

ఈ యెనిమిదిన్ని బ్రిహ్మసూత్రిభావార్ధమే కర్మసూత్రార్థః గాన్నన ముందుగీతలయందు సూత్రార్ధమునేయున్న ప్రితిపాదిత శ్లోకములు.

కర్మసూత్రిములు గీతాభాష్యే.

1. ఈశ్వరః సర్వభూతానాం.

2. నతద్భాసయతే సూర్యో.

3. నరూపమస్యేహ తథోపలభ్యతే.

4. మమైవాంశో జీవలోకే జీవభూతః.

5. జ్ఞేయంయత్తత్ప్రవక్ష్యామి.

6. శుక్లకృష్ణేగతీహ్యేతే.

7. శుచౌదేశే.

8. యత్రకాలేత్వనావృత్తిమావృత్తించైవయోగినః.

ఇత్యాది బ్రహ్మసూత్రములెనిమిది. గీతాసూత్రము ఇతికర్మసూత్రములు మెనిమిది. ఈమొదలైనవాటియందు జీవాత్మ పరమాత్మల భేదాభేదములును వివరము చెప్పుచున్నవి.

త్రిభాష్యములు బ్రహ్మసూత్రములు ఋషిసూత్రములు అభేదార్థము పొందుబడియున్నది గాన బ్రహ్మసూత్ర కర్మసూత్రములు గీతలకంటె ముందుపుట్టినవని చెప్పుచున్నవి. పైనచెప్పి నిశ్చయింపబడిన కర్మసూత్రములు మొదలగునవి క్షేత్రక్షేత్రజ్ఞవిచారమునందే చేయుటకును మరియొక ప్రబలవాక్యమున్నదని కారణముగలదు. గీతలయందలి వాసుదేవభక్తియొక్క తత్వము మూలభాగవతధర్మములనుండి కాని లేక పాంచరాత్రధర్మములనుండిగాని గ్రహింపబడినను వాసుదేవునివలన సంకర్షణుడును అనగా జీవుడు, సంకర్షణునివలన ప్రద్యుమ్నుడును మనస్సు, ప్రద్యుమ్నునివలన అనిరుద్ధుడును అహంకారము బుట్టిరను చతుర్వ్యూహపాంచరాత్రధర్మములయందు మొట్టమొదట జీవునియొక్కయు మనస్సుయొక్కయు నుత్పత్తివిషయమై చెప్పబడిన మతము గీతకు సమ్మతముగాదని పూర్వప్రకరణమున చెప్పియున్నారు. జీవాత్మ యితరమగు నేవస్తువునందుండియు పుట్టలేదని వేదాంతసూత్రములయందున్నది. సూత్రభాష్యమందు కర్మసూత్రమందు సనాతనపరమాత్మయొక్క నిత్యమగు నంశమేయని కర్మసూత్రములయొక్క సిద్ధాంతము. దానినిబట్టి కర్మసూత్రములయందలి రెండవ యధ్యాయమునందలి రెండవపాదమందు వాసుదేవునివలన సంకర్షణుడు పుట్టెనను నీభాగవతధర్మీయమునగు జీవోత్పత్తి యసంభవము బ్రహ్మసూత్రమని దూషించెను.

జీవునకు మనస్సు నదియొక యింద్రియము గాన జీవునివలన ప్రద్యుమ్నుడు మనస్సు పుట్టుటకును వీలులేదు. సూత్రమునందు కారణమేమనగ

లోకవ్యవహారము జూచితిమేని కర్తవలన కారణముగా లేక సాధనముగాని పుట్టి నటుల స్పష్టముగ చెలియుననిభాగవతధర్మముల యుత్పత్తిక్రియుమునే బాదరాయణులవారును సయుక్తికముగ ఖండించిరి. దీనికి భాగవతధర్మములవారు నేను వాసుదేవుడను ఈశ్వరుడను సంకర్షణుడను జీవుడను ప్రద్యుమ్నుడను మనస్సు అనిరుద్ధుడను అహంకారము యీనలుగురును సమానులే యని జ్ఞానియగుచున్నాడనియు మరియు వారిలొకరినుండి మరియొకరియుత్పత్తిలాతుణికమందె చెప్పుదురు. కాని యిట్లొప్పుకొన్నను నొకమనుష్యుడగు పరమేశ్వరునికి మారుగ, నలుగురిని చెప్పవలసివచ్చును. గావున నీసమాధానమును సరియైనదిగాదని బ్రహ్మసూత్రములయందు చెప్పబడినది. తుదకు బరమేశ్వరుని పిదప జీవుడుపుట్టినాడనే మతము వేదములకు అనగ యుపనిషత్తులకు విరుద్ధముగావున, నొప్పుకొందగినదిగాదని బాదరాయణులవారు స్థిరపరచిరి. బ్రహ్మసూత్రము కర్మసూత్రమందు, భగవద్గీతయందు భాగవతధర్మములలో కర్మపరముగు భక్తితత్వము పాదింపబడినదను మాట సత్యమే అయినను, జీవుడు వాసుదేవునకు బుట్టినవాడుగాడు. నిత్యమగు పరమాత్మయొక్క (హాంశమే) యని గీతలలో నైతము సిద్ధాంతముచేయబడినది. గీతలయందు జీవునిసంబంధమైన ఈసిద్ధాంతము మూలభాగవతధర్మములలో లేదు. కావున ఆసిద్ధాంతమునకు బ్రమాణమేదియో చెప్పవలయును. కారణమేమనగా, అట్లు ప్రమాణము చెప్పిచో చతుర్వ్యూహరూపములగు భాగవతధర్మములయందున్న ప్రవృత్తిపరమగు భక్తితత్వమువలెనే జీవుని యుత్పత్తి విషయమైన కల్పనయును గీతలకు సమ్మతమని పొరబాటుబడుట నవకాశముండును—

కావున క్షేత్రక్షేత్రజ్ఞ విచారమందున, జీవాత్మయొక్క స్వరూపము చెప్పవలసివచ్చినప్పుడే క్షేత్రజ్ఞునియొక్క అనగ జీవునియొక్క స్వరూపవిషయమై యభిప్రాయము భక్తి భాగవత ధర్మానుసారముగ నిరూపింపబడలేదనియు నుపనిషత్తులయందున్న ఋషులయొక్క మతానుసారముగనే నిరూపింపబడినదనియు సిద్ధాంతమగును. మరియు నాయాఋషులచే, నాయాయుపనిషత్తులబట్టి వేర్వేరుగ నుపపాదింపంబడిన విషయముల కన్నింటికిని బ్రహ్మసూత్రములయందు చేయబడిన ఏకవాక్యతయే సూత్రములయందు సమ్మతమని సిద్ధాంతమగును. ఇట్లు విచారించితిమేని భాగవతధర్మములపై బ్రహ్మ

సూత్రకర్మసూత్రములు చేయబడిన యాక్షేపములు నీరీతిని భాగవతధర్మములయందున్న భక్తిమార్గము మాత్రము నీకర్మసూత్రములయందు చేర్పబడినట్లు కాన్పించుచున్నది. రామానుజాచార్యుడు తనుభాష్యములయందు పూర్వోక్తములగు సూత్రములయొక్క యర్థమును మార్పుజేసిరి. కాని యాయర్థము మాకుగాని మరికొందరికిగాని క్లిష్టమగుటచేత, సమ్మతముకానేరదు. గావున మహాభారతమునందు శాంతిపర్వమునందు కడపటచెప్పబడిన నారాయణీయములైన లేక భాగవతములైన ధర్మములలోనైతము వాసుదేవునకు (జీవునకు) అనగా సంకర్షణుడు పుట్టినాడని చెప్పక ఆవాసుదేవుడే (సవవ) ఆ సంకర్షణుడనగ జీవుడు, లేక క్షేత్రజ్ఞుడని మొదట చెప్పియున్నది. మరియు సంకర్షణునకు పిదప ప్రద్యుమ్నుడను నీక్రమముమాత్రము చెప్పబడియున్నది. మరియు కొన్నిస్థలములయందు భాగవతధర్మములయందనేకములు వప్పుకోనక వానిలో క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క పరస్పరసంబంధమైన యుపనిషత్తులకున్న, కర్మసూత్రములనుదు నుల్లేఖింపబడవలసివచ్చుటకు కారణము బాగుగ స్పష్టమగును. వేయేల మున్ముందుగీతలయందీసంస్కారము యొక్కటే చేయవచ్చునని చెప్పెను—

కావున, మహాభారతమునందు శాంతిపర్వమునందు సర్వేషాం యస్సుహృన్నిత్యం, సర్వేషాంచహితేరతః॥

కర్మణామనసావాచా సధర్మవేదజాజలె॥ యనియున్నది. బ్రహ్మజ్ఞానముగలిగి బుద్ధియాస్వాంతము, సముము నిష్కామము నైనపిదప మనుష్యునకు నేవిధమగు కర్తవ్యమును వశిష్టమై యుండదు. అందువలన క్షణభంగురమగు సంసారమునున్న సౌఖ్యములు, సుఖములు వ్యవహారములు కర్మములు నివి విరక్తిచే పూర్తిగ వదలవలయునని చెప్పుమతమునందలి పండితులకు కర్మయోగమనగ గృహస్థాశ్రమమునందున్న వర్తన యనునది యొకవిచారాస్పదముగు శాస్త్రముగనున్నదని యెంచుట యప్పటికిని సంభవింపదు. సన్న్యాసాశ్రమునందు బ్రవేశించుట సముఖతను చిత్తశుద్ధియు, జ్ఞానము నుండవలయును. కావున నారంభమున సంసారముజేయునప్పుడు చిత్తశుద్ధినిగలుగజేయు ధర్మముల నాచరించవలయునని యొప్పుకొందురు. కాని యప్పుడైనను సంసారమునందే యెల్లప్పుడునుండుట వైరితనమగుటచే బ్రతిమనుజుడును శక్యమగునంత త్వరలో కర్మసన్న్యాసమును గైకొనుటయే జగత్తునందు పరమమగు కర్తవ్యమని యంగీక

రింతుమేని కర్మయోగమునకు స్వతంత్రముగు మహిమ యుండ నేరదు. గావున సంసారమెట్లు చేయవలసినదియు విచారింపనవసరమే లేదు. ఒకవేళ విచారించి నను నాయా సందర్భములను కనుగుణముగునటుల స్వల్పముగ విచారించి మన్వాదిశాస్త్రకారులు చెప్పిన చతురాశ్రమధర్మములను సోపానమార్గములుగ పైపయికి బోవుచు శీఘ్రముగ సన్న్యాసమార్గమును తుదమెట్టుపైకి బోవలయును. గావున గార్హస్థ్యధర్మమందలి ధర్మాధర్మవిచారరూపముగు విషయమున కర్మసన్న్యాసమార్గమునందలి పండితులు విశేషముగ ప్రవేశింపరు. కర్మసన్న్యాశి ఈమార్గమునకు బురస్కారకర్తయగు శ్రీశంకరాచార్యులవారు భాష్యమునను గీతలలోనగు కర్మపరముగు వచనములు నుపేక్షించికాని, కేవలము ప్రశంశాపరము అర్థవాదము లని కల్పించికాని కర్మసన్న్యాసధర్మమే గీతలన్నింటిలోను ప్రతిపాద్యముగనున్నదని గీతలఫలితార్థమును తుదకు నిర్ణయించుటకును ననేకులగు టీకాకారులు నివృత్తిపరముగ కేవలము భక్తిపదముగను లేక పాతంజలిపరయోగముగను నిర్ణయించుటకును యీమోక్షమార్గమునే భగవంతుడు నిర్ణయించుటకు రణభూమియందు అర్జునునకు నుపదేశించెనని, తమతమ సంప్రదాయానుసారముగ గీతలరహస్యమును వర్ణించుటకును కారణమిదియే. కరసన్న్యాసమార్గమునందున్న అధ్యాత్మజ్ఞానము దోషసూన్యమైనదియగుటచేత దానిమూలమున బొందదగు సామ్యబుద్ధి లేక నిష్కామబుద్ధి చేత సర్వకర్మలను చేయును- అసంగుడై వ్యవహరించువాడు గావున బ్రహ్మజ్ఞానముచే సిద్ధించు వైరాగ్యముతోడను, సమత్వముతోడను జ్ఞానిజ్ఞానముకలిగినపిదప నైతము సర్వవ్యవహారములు జేయవలయుననుట జగత్తుజ్ఞానయుక్తముగు కర్మను వదలితిమేని, జగత్తుగుడ్డిదియై నసించును. మరియు యీతీరు ననే భగవంతుండు అర్జునునకు చెప్పియున్నాడు. కావుననే జ్ఞాని సకలప్రాపంచిక కర్మలను నిష్కామబుద్ధితో నొనర్చుచు సామాన్యజనులకు సద్వర్తన యను భారమును ప్రత్యక్షముగ జూపవలయును. యీమార్గమే మిక్కిలి శ్రేయస్కరమైనది. గావున జ్ఞానియొక్క ప్రవర్తన యెట్టిదనిన అనగ లోకులతనిచేత జెప్పబడినవిషయము యెద్దియునిన ధర్మాధర్మములు కార్యాకార్యములు లేక కర్తవ్యాకర్తవ్యములను వాని నిర్ణయించుటకు మనము సోధించుచున్న సాధనములు, యుక్తులును స్వయముగనే ప్రాప్తముగును. కర్మసన్న్యాసమార్గముకంటె కర్మయోగమార్గమందున్న విశేషమిదియేగావున, వేఫు

రుషునియొక్క వ్యవహారబుద్ధి యింద్రియనిగ్రహముచే స్థిరమై సర్వభూతముల యందు నొక్క యాత్మయే యనుసామ్యముయొక్క పరిచయము చేసికొనుటకు సమర్థమైనదో వానియొక్క వాసనయు పరిశుద్ధముగ నుండవలయును. మరియు వాసనాత్మకబుద్ధి ఈరీతిని శుద్ధము, సమము, నిర్మలము, పవిత్రము నగునేని యితనిచేతినుండి ఏపాపము లేకయే మోక్షప్రతిబంధకమగును. కర్మయు సంఘటిల్లుటయే యశక్యమగును. కారణమేమనగ, మొదట వాసనయు ననంతరము తదనుకూలముగ కర్మయునను క్రమముగలదు. పరిశుద్ధమైన వాసనచేతనే కాబోవు కర్మశుద్ధముగనే యుండవలయును. ఏది శుద్ధమో అదియే మోక్షానుకూలమగును. కావున సాకల్యకిక కళ్యాణమున కాటంకము లేక యీసంసారమున మనుష్యమాత్రుడెల్ల ప్రవర్తింపవలయునని మనము చేసిన కర్మాకర్మలయొక్క చికిత్సయొక్కగాని, కార్యాకార్యవ్యవస్థితియొక్కగాని, వికటమగు ప్రశ్నకు తననడతచేతనే నుత్తరమియ్యు గురువు లభించును. అని తాత్పర్యము. అర్జునునకు యటుల నిట్టిగురువు శ్రీకృష్ణరూపముగ నిలువబడియుండెను మరియు నాజ్ఞాని యుద్ధాదికర్మలను బంధకములని వదలవలయు కాబోవునని యర్జునునకు బొడమిన సంశయము నీగురువు తీర్చివైచి జగత్తునందున్న వ్యవహారములనే యుక్తిచే జేసిన పాపము తగులదో దానినధ్యాత్మశాస్త్రానుసారముగ నర్జునునకు బాగుగ బోధించెను.

తత్వజ్ఞానికి ప్రశస్తమగు శోభనకర్మయే శుభాకరము న్యాయమగును. సామాన్యులకీధర్మము తెలియనేరదు. జ్ఞానియొక్క నిర్ణయము యెప్పుడును తప్పులేనిదియై యుండును. అతనికి తత్వము తెలియుటయే దానికి కారణము. తన్ను తా దెలియుటయే దానికి కారణము. మరియు జ్ఞానియొక్క నిర్ణయమే లేక ప్రవర్తనయే యితరులకు ప్రమాణభూతమగునని చెప్పెను. అట్టి పరమతత్వజ్ఞుడు శాంతుడు సమబుద్ధిగలవాడును వేయేల పరమేశ్వరునివలె నెల్లప్పుడును ఆనందస్వరూపుడునై యుండును. కావున లోకులకు అజ్ఞానికి లోకులవలనను భయములేదు మొత్తమాత్రము మనము యిట్లు చెప్పియున్నారు. స్థితప్రజ్ఞునియొక్క లేక బ్రహ్మజ్ఞాని త్రిగుణాతీతునియొక్క పరమభక్తునియొక్క లేక బ్రహ్మభూతుడై యున్నవానియొక్కయు వర్ణనలో యీవర్ణనన యెంతసామ్యముండునదియు ధీరులైనవారికి తెలియును. గీత॥ యస్మాన్నోద్విజతేలోకా లోకాన్నోద్విజతేచయః॥ యవరివలన లోకులకు దిగ్నులు

కారో లేక యెవరికి లోకులను జూచినను ద్వేషముదోచదో యనియు ఎవడు నిత్యసంతుష్టుడును, హర్షము, ఖేదము, భయము, విషాదము సుఖము, దుఃఖము మొదలగు ద్వంద్వములనుండి ముక్తుడై యెల్లప్పుడును తనయందే సంతుష్టుడగునో ॥ఆత్మన్యే ఆత్మనాతుష్టః॥ యనియు త్రిగుణములచేయని మనస్సు చంచలము కానేరదో ॥సూత్రం॥ గుణైర్యోనవిచాల్యతే॥ అనియు స్తుతినిందలుగాని మానావమానములుగాని యెవరికి సమానములో యనియు సర్వభూతాంతర్గతములకు నాత్మైక్యము నెరింగి సామాన్యబుద్ధితో నాసక్తివదలి ధైర్యముతో సంతోషముతో నుండువాడు స్థితప్రజ్ఞుడని సూత్రములయందు చెప్పుచున్నది.

ఈసిద్ధావస్థస్థితినే యోగవాసిష్ఠమందు యీస్థితినే జీవన్ముక్తియని చెప్పెను. ఈబ్రహ్మస్థితి ప్రాప్తమగుట అతిదుర్ఘటము గావున నటులే ప్రత్యక్షానుభవము నైనను ప్రసిద్ధమై యున్నది ఐన నీవిషయము సామాన్యము కానందున వేయింటిలో నొకానొకడె దానింబడయుటకు ప్రయత్నించుచున్నాడు. మరియు నిట్టి ప్రయత్నముచేయు వేయుమంది మనుజులలో నొకానొకడే యనేకజన్మముల యనంతరమునందు పరమావధియగు నీస్థితిని తుదకు బొందునని త్రిభాష్యముల యందు స్పష్టముగ జెప్పబడినది. కావున స్థితిప్రజ్ఞావస్థ లేక జీవన్ముక్తావస్థయం దుష్ప్రాప్యమైనను నీపరమావధియైన పరమార్థమైనసిద్ధి బ్రహ్మైక్యసిద్ధి యొకపరి ప్రాప్తమైనవానికి కర్మయోగముయొక్క లేక నీతిశాస్త్రముయొక్క నియమములో నేమియు పని యుండదని చెప్పెను. ఎట్లనగ స్థితప్రజ్ఞులైన పురుషులకు నీతి నియమములను సంబంధింపజేయుటయనది యెట్లనగ సూర్యునియొద్ద నంధకారమున్నదని కల్పించి యాయనకు దివిటీ చూపించుటవలె సమంజసముగను. ఏపురుషుడు యీపూర్ణావస్థ పొందునా లేదా సంశయము వుండవచ్చును. కాని యేరీతిచేతనైనను పూర్ణావస్థ నొందినాడని యొకప్పుడు నిశ్చయింపబడినవానియొక్క పాపపుణ్యముల విషయమై అధ్యాత్మశాస్త్రమున పైనచెప్పబడిన సిద్ధాంతముకాక వేరొండవకల్పన జేయుటకు యేవీలు నుండనేరదు. అతని మనస్సునందు యేకామ్యబుద్ధియు నుండదు కావున కేవలము శాస్త్రముచే ప్రాప్తించిన కర్తవ్యములు చేయునే కాని యితరహేతువులచే కర్మల నొనర్చుట నతడు ప్రవర్తింపడు. ఆకారణముననే పాపము, పుణ్యము, నీతి, అనీతి అనుశబ్దము లత్యంతము నిర్మలము

శుద్ధమునకు సువాసనగల యాపురుషునియొక్క ప్రవర్తనకు నెప్పుడు సంబంధింపవు. పుణ్యపాపములు రెండింటికిని పరమమగు గమ్యస్థానము అనగ బ్రహ్మపదమును బొందియున్నాడు.

సుకోపనిషత్॥ భేదాభేదౌ సపది గళితౌ పుణ్యపాపే విశీర్ణే మాయామోహే! క్షయమధిగత నష్టసందేహవృత్తిః శబ్దాతీతం త్రిగుణరహితం ప్రాప్య తత్త్వావబోధాన్నిస్త్రైగుణ్యే పథి విచరతాం కో విధిః కో నిషేధః॥

అనిన త్రిగుణాతీతులైనవారికి విధినిషేధరూపములైన నియమములు బాధింపనేరవు. అని శ్రీశంకరాచార్యులవారు చెప్పియున్నారు. ఉత్తమమైన రత్నమునకు నానబెట్టుట యనావశ్యకమైనట్లు నిర్వాణపదవిధికారులైన వారి వారికర్మలను విధివిధానరూపములయొక్క యాటంకములు గలుగజేయ నవసరము లేదు. కౌషీతక్యుపనిషత్తునందు ఆత్మజ్ఞానికి మాతృహత్య పితృహత్య భ్రూణహత్య మొదలగు పాపములు సైతముగలవు. అని యింద్రుడు ప్రతర్దనునకు చెప్పినాడు. ఎవరహంకారబుద్ధి సర్వదా వదలిపోయెనో అతడు లోకులను చంపినను పాపపుణ్యములచేత లిప్తుడుకాడు. అని గీతలయందుగూడ యిదే యర్థము చెప్పియున్నది. కావున బ్రహ్మాత్మైక్యజ్ఞానమును సంపాదించుకొని కర్మయోగినవలె వ్యవహారాత్మకమగు బుద్ధియు తప్పక శుద్ధము నిర్మలము పవిత్రము నగును. కావున కర్మలయొక్క బంధనములు సంఘటిల్లినను అది గీతలయందు అర్జునునకు జేయబడిన సర్వోపదేశముయొక్కయు సారమై యున్నది. మరియు నీకారణమునే మనస్సుచేతను వాక్కుచేతను కాయముచేతను చేయు కర్మయోగము నిష్కామకర్మగా బ్రహ్మార్పణముగా జేయుచున్నవాడే జ్ఞాని స్థితప్రజ్ఞుడు గావున ఫలాశను త్యజించి కర్మలను జేయుటయే బ్రహ్మప్రాప్తికి కారణమగును. భారతమందు తులాధారుడు జాజలికి నిష్కామకర్మయోగమున్ను బ్రహ్మైక్యజ్ఞానయోగమున్ను సాంఖ్యయోగమున్ను ధర్మతత్త్వమును వాక్కు మనస్సులకు ప్రాధాన్యములను నిర్దేశించినటులే యీవాక్కు మనస్సులకంటె ముందుగ గర్మల సైతము ప్రధానములుగ నిర్దేశించెను. కావున అతడు జీవన్ముక్తుడనగ స్థితప్రజ్ఞుడతడు తనంతనే స్వయంప్రకాశుడు గావున కర్మలను వదలివేయుదునని వ్యర్థమగు భ్రమలలో బడక స్థితప్రజ్ఞుడైన జీవన్ముక్తివలె బుద్ధి నిశ్చలతత్త్వము నిల్పి బుద్ధిసామ్యమున నిల్పి స్వధర్మానుసారముగ ప్రాప్తములయిన సర్వసంసారికకర్మలను జేయుము.

అనుదానికంటె ఆతనికి విశేషముగ నుపదేసింపవలసిన యావశ్యకతయుండదు. అయిన నీసామ్యబుద్ధిరూపమగు యోగమందరకు నొకజన్మమునందే ప్రాప్తమగుటకు శక్యముకానేరదు. కావున సామాన్యజనులకొరకు స్థితప్రజ్ఞునియొక్క ప్రవర్తనము యింకను కొంత పరీక్షింపవలయునని పైన చెప్పబడియే యున్నది. కాన సర్వభూతములయందు నొకయాత్మయే కలదని తన్నుతా దెలసికొనుటయే దీనికి శ్రేయస్కరమగు విషయము గావున గీతయందు కర్మయోగమనే నొకతత్వమునే యుపదేశించిరి. కాని పూర్వమైన సామ్యబుద్ధియే సదాచరణమునకు బీజమైనది. కావున సర్వభూతములయందు నొకటే యాత్మ. కాని "సర్వంఖల్విదంబ్రహ్మ" అను నద్వైతబుద్ధితో బరోపకారముతో జేయుటకు బ్రవృత్తులైనవారికి యీశంకయే యుండకూడదు. సర్వభూతాత్మైక్యబుద్ధిచే నిష్పన్నమగు సర్వభూతహితముయొక్క యీఅధ్యాత్మతత్వము నొప్పియుండును. కావున సూర్యుడు ప్రకాశము నిచ్చుటకు సూర్యుని కెట్లు స్వభావమై యున్నదో సర్వభూతాత్మైక్యరూపమగు బ్రహ్మజ్ఞానముచే మనస్సున పూర్ణమగు జ్ఞానము పరిణమించినందున యీసాధువులకు దేహస్వభావములై పోవును. కావున దేహస్వభావ మీరీతిగ పరిణమించెనేని సూర్యుడితరపదార్థములను మరియు ప్రకాశింపజేయుమనే స్వయముగ ప్రకాశించునటుల స్వయముగ సిద్ధములగును గావున బ్రహ్మాత్మైక్యబుద్ధితో సాధువులు తమ యుద్యోగమును మానకయేయుందురు. మరియు సమయమువచ్చెనేని దేహమును వదలుటకుసైతము వెనుకదీయరు. కాని స్వార్థపదార్థములను భిన్నములుగా నెన్ని వానినితక్కెడలో బెట్టి పిదప హాల్లుయేమూలకు వంగునో చూచి అనగ వ్యవహారసమాధులు సమానముగచూచి- ధర్మాధర్మములను విచారించుటను ఆత్మానాత్మవివేకము విచారించుటను నేర్చుకొనినవారికి తీవ్రమైనలోకకళ్యాణేచ్ఛ పుట్టుట కెప్పుడును వీలులేదు. కావున సర్వభూతహితముయొక్క తత్వము భగవద్గీతకు సమ్మతమైనది. గావున వ్యాసులువారు దానియందున్న రహస్యమును వ్యాపకమైన అర్థమును స్పష్టముజేసిరి. యిందుకు వుదహారణము వుపనిషత్తులయందు గీతలయందును సంక్షేపముగ జేర్పబడిన యాత్మానుభవమును- యీబ్రహ్మతత్వమేయని వుదహరించియున్నారు. గావున బృహస్పతి యుధిష్ఠిరునకు జెప్పెను. భారతం శాంతి నతత్పరస్యసందధ్యాత్ప్రతికూలం యదాత్మనః॥ అనుశ్లోకము విదురునీతియందు గూడా చెప్పబడినది.

ఉద్యోగపర్వమందు శాంతిపర్వమందు మరల విదురు డీతత్వమునే యుధిష్ఠిరునకు జెప్పెను. కాని లోకులకు ఇది దుఃఖమునిచ్చునదిగాదు. కారణమేమనియనగ నీకు నేవిదుఃఖకరములగుచున్నదో లోకులకు అవి దుఃఖాకారములగుననునది యీ ఆత్మనిర్ణయములో నొక భాగము నీకేవి సుఖకరమని తోచునో యదియే లోకులకును సుఖకరముగును. కావున, లోకులకు సుఖకరములగు విధమున వర్తిల్లుమని దానినుండి నిశ్చయాత్మకమైన యనుమానము వెలువడదని యెవరికి నెప్పటికిని దీన్ని శంక గలుగకపోదు. కావున భీష్ముడు యుధిష్ఠిరునకు ధర్మలక్షణములను చెప్పుచు నింతకంటె బాగుగ వివరించెదరు. శ్రుతి: తస్మాద్ధర్మ ప్రధానేన, భవితవ్యం యతాత్మనా తథాచ సర్వభూతేషు వర్తితవ్యం యథాత్మని॥ శాంతిపర్వం॥ అని ఇంద్రియములు నిగ్రహించి ధర్మానుసారముగ నుండవలయును. మరియును తన యందువలెనె సర్వభూతముల యందు బ్రవర్తింపవలయునని విదురుడు చెప్పెను. కారణమేమనగ శ్రుతి॥ సుకాను ప్రశ్నలో వ్యాసులు యోవానాత్మని వేదాత్మాతాదానాత్మాపరాత్మనియ ఏవం సతతం వేద సోఽమృతత్వాయకల్పతే॥ అనగ, తనయొక్క శరీరమునం దెంతయంత యాత్మయున్నదో యంతయాత్మయే యితరుని శరీరమందును కలదు. దీని నెప్పుడెవరు తెలిసికొనుచున్నాడో వాడె అమృతతత్వమును (అనగ) మోక్షమును నొందుటకు సమర్థుడగును అని చెప్పిరి. బుద్ధుడు ఆత్మ యున్నదని యొప్పుకొనువాడు గాడు. యెప్పటికి ఆత్మవిచార మను యల్లరి లోపడకూడదని యాతడు స్పష్టముగ వక్కాణించే యుండెను గావున యీ మార్గమును యీతత్వమును ధృతరాష్ట్రునకు విదురుడు చెప్పినవెంటనే యుద్యోగపర్వమునందు శ్రీకృష్ణుండు యుధిష్ఠిరునకు బ్రహ్మైక్యజ్ఞానము చెప్పెను. గీత॥ ౧౮-౬౬-సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ అహంత్వా సర్వపాపేభ్యో మోక్ష యిష్యామి మాశుచః॥ అని యున్నది. సర్వభూతాత్మైక్యరూపమగు నిష్కామబుద్ధియే కర్మయోగమునకును మోక్షమునకును మూలమగుటచే నీపరిశుద్ధబుద్ధి బ్రహ్మాత్మైక్యజ్ఞానముచే నెట్లు ప్రాప్తమగునదియు నీ పరిశుద్ధబుద్ధిచే ప్రతిమనుజుడు సర్వధర్మానుసారములుగ ప్రాప్తములైన కర్తవ్యముల నామరణాంతమేల చేయవలసినదియు యింతపర్యంతము అధ్యాత్మదృష్టిచే విచారింపబడినది. కాని భగవద్గీతయందు ప్రతిపాద్యమైన విషయము అంతమాత్రముచే బూర్ణమాము కానేరదు. కారణ మేమియనగ బ్రహ్మాత్మై

క్ష్యజ్ఞాన మనునదియే నిజము, సత్యము, సాధ్యము, నగుటచే దానివంటిది పవిత్రమగు మరియొకవస్తువు జగత్తున లేదు. అను విషయము నిస్సంశయముగ నుండినను యింతవరకు చేసిన విచారణయు తద్వారా సామ్యబుద్ధియు దీనిని సంపాదించుకొనుటకు జెప్పబడిన మార్గమును బుద్ధిగమ్యములగుటచే వానిని పూర్ణముగా నావరించువట్టి తీవ్రబుద్ధిని ప్రతిమనుజుడు యెచ్చోటనుండి గైకొని రావలయును. మరియు బుద్ధితీవ్రతలేనివా డన్నివిధములచేతను మునిగిపోయెవని తాత్పర్యమా అనుశంక సామాన్యజనులకు గలుగుచున్నది. ఈశంకయు యుక్తముగనే యున్నది. గొప్పగొప్ప జ్ఞానులు సైతము వినాశియు నామరూపాత్మకమగు మాయచే నాచ్ఛాదింపబడిన యమృతస్వరూపమగు పరబ్రహ్మము తానే నేతి నేతి అని చెప్పి యూరకుండురేని పిదప మనవంటి సామాన్యుల కది యెట్లు తెలియును. కావున నీగహనమైన బ్రహ్మజ్ఞానము మాయొక్క అల్పగ్రాహకశక్తి కధీనమగుట కేమైన సులభమార్గము కలదా యని యెవ్వరైన నడిగినను దోషమేమి. ఆత్మ యనగా బ్రహ్మమును యాశ్చర్యచకితులై వర్ణించువారు వినువారు ననేకు లుండినను అది యేరికిని దెలియదని గీతలయందును కఠోపనిషత్తుయందును జెప్పబడినది. ఈవిషయమై శృతియందు యొకకథ కలదు. అదెట్లనిన మహానుభావా బ్రహ్మజ్ఞానము నాకు నుపదేశింపుమని భాష్కలుడు బాహ్వ్యుడను వాని నడుగ నత డేమియుం జెప్పక యూరకుండెను. భాష్కలుడు మరల నట్లే యడిగెను. కాని యెప్పటికిని బాహ్వ్యుడు పూరకయుండెను. ఇటుల నాలుగైదుసూరులు అడిగినను నేమియు జెప్పక తుదకు ఓరీ నీప్రశ్నకు సమాధానము నేనింతవరకు నొక విధముగనే చెప్పుచున్నాను. నీకది తెలియలేదు. నేనేమి చేయగలవాడను బ్రహ్మస్వరూప మేవిధమునను సాధ్యముగా నేరదు. మాటలాడక కూర్చుండుట యనునదియే బ్రహ్మవేత్తలకులక్షణమని యెరింగితివా యని బాస్కలుడు బాహుల్క్యు నడిగెను. కావున నోరుమూసుకొని చెప్పుటకు సాధ్యమగు నదియు కనుదోయి మూసికొనినపిదప దెలియునదియు నని యిందలి సారాంశము దృశ్యసృష్టి విలక్షణ మనిర్వాచ్యము అచింత్యము నగు నీపరబ్రహ్మమును సామాన్యబుద్ధిగల మనుష్యులు యెట్లు తెలిసికొందురు. తద్వారాసమాన్యవస్థయు సద్గతియు నెట్లు కలుగును. సర్వభూతములయందును నొకయాత్మయే యను పరమేశ్వరస్వరూపముయొక్క యనుభవాత్మకమగు యదార్థము

నగు జ్ఞానము కలిగి మనుజు లెల్లవారికిని పూర్ణమగు యున్నతస్థితి సంభవించుటకు తీవ్రమగు బుద్ధిదక్క మరియొకమార్గ మేమియు లేనియెడల జగత్తునందున్న లక్షలకొలది మనుజులు బ్రహ్మప్రాప్తిని గురించి యాశనైన జెందక స్వస్థముగ కూర్చుండవలసివచ్చును. కారణ మేమియనగ బుద్ధిమంతులగువారు మనుజులు కొద్దిమందిగనే యుందురు. బుద్ధిమంతులు చెప్పినదానిపై విశ్వాసముంచిన కార్యము నిర్వహించుచనుకొన్నను బుద్ధిమంతులలోను మతభేదములు స్పష్టముగ గాన్పించుచున్నవి. ఇంతియేకాక విశ్వాసముంచినయెడల కార్యము నెరవేరునని చెప్పెను. కాన జ్ఞానమంతయు బుద్ధిచేతనె ప్రాప్తమగును. దానికి మరొక ఇతిహాస మక్కరలేదు. శ్వేతకేతువునకు తండ్రి మర్రికాయను దెచ్చి దానిలో నేమియున్నదో చూడుమని చెప్పెను. శ్వేతకేతువు అపుడును పగలగొట్టి చూచి లోపల చిన్నచిన్న పెక్కు బీజములున్నవని చెప్పెను. వానియందలి ఒక బీజమును గైకొని దానిని పగలగొట్టి చూచి లోపల నేమియున్నదో చెప్పుమని తండ్రి చెప్పగా శ్వేతకేతువు వానిలో నొకబీజమును పగిల్చి చూచి లోపల నేమియు కాన్పింపలేదనెను. పిదప తండ్రి ఓరీ లోపల నీకు కాన్పింపనిదాని నుండియే యీవటమను గొప్పవృక్షము పుట్టియున్నదని చెప్పి తుదకు శ్రద్ధత్స్వ—దీనిమీద విశ్వాస ముంచుము. అనగ విషయమును విన్న మాత్రమున నోటితో మాత్ర మగునని చెప్పక యీతత్వమును హృదయములో నుంచుకొని నీయొక్క యాచరణమునందు ప్రవేశపెట్టుమని తండ్రి యతని కుపదేశించినట్లు చాందగోపనిషత్తునందు జెప్పబడెను. సూర్యుడు రేపుప్రాతఃకాలమునందు వుదయించునని నిశ్చయాత్మకములగు జ్ఞానము గలుగుటకు సైతము నమ్మక మావశ్యకమైనదో సర్వసృష్టికిని మొట్టమొదట నుండునట్టి మూలతత్వము అనాదిగ అనంతముగ నున్నదని పూర్ణముగ నెరుగుటకు సర్వకర్తత్వముగను సర్వజ్ఞత్వముగను స్వతంత్రముగను చైతన్యరూపన్యముగ నున్నదని పూర్ణముగ నెరుగుటకు బుద్ధియను యినుకుదాగిగుండ శక్యమైనంతదూరము పోయినపిదప నాదారి ననుసరించియైనను దానికంటె పరమందైనను కొంత నమ్మకమును ప్రేమయు ప్రేమయనెడు కాల్త్రోవనె వెళ్ళవలయుననునది నిర్వివాదమై యున్నది. మరియు॥ గీత॥ అచింత్యాఃఖలుయే భావాః నతాంస్తర్కేణ చింతయేత్॥ అని యింద్రియాతీతములగుటచే నేపదార్థముల చింతించుట సాధ్యము గానేరదో వానియొక్క స్వరూపనిర్ణయము కేవల తర్కమూల

మునిసే చేయగూడదని పూర్వమునందు చెప్పినరీతిన నధ్యాత్మశాస్త్రమునందును సిద్ధాంతము చేయబడినది. నిర్గుణపరబ్రహ్మమును సామాన్యమనుజులు తెలిసికొనుట కష్టమనునది మాత్రమే యాటంకమైనయెడల విశ్వాసముచే తొలగొట్టవచ్చును. ఎట్లనిన యీప్రకారముగ బ్రహ్మ మెట్లున్నదనిన యెవరైన యడిగినయెడల నిర్గుణముగ నున్నాడనియు నుత్తరమిచ్చుట కభ్యంతరమేమి. అది నిర్గుణముగ నున్నదా లేదా యని పూర్తిగా బరిశీలించి దానియొక్క సాధక, బాధక, ప్రమాణములను విచారించునంత బుద్ధి సామాన్యజనులకు లేకపోయినను నమ్మకమను మనోధర్మము కేవల మహాబుద్ధిమంతులగు పురుషులకే లభ్యమగును. నమ్మకము మనోధర్మము; నియమము లేదు. కేవల అజ్ఞానులకు సైతము నమ్మకముండకపోదు. మరియు నమ్మకముచే నజ్ఞానికి తన వ్యవహారములగుటకు నేమియు నభ్యంతరము లేదు. మోక్షధర్మముయొక్క యితిహాసములు బాగుగ విచారించినయెడల జ్ఞానబ్రహ్మస్వరూప విషయమై చర్చజేసి యది నిర్గుణమని నిశ్చయింపకమునుపే సృష్టికి మూలకారణమనియు సృష్టియందున్న నశ్వరములున్ను అనిత్యములయిన పదార్థములకంటె విలక్షణమైనదియు నొకానొక పదార్థము అనాద్యంతము అమృతము స్వతంత్రము సర్వశక్తియుతము సర్వజ్ఞము సర్వవ్యాపియు నయిన తత్వమని తన నమ్మకముచేతనే తెలిసికొని యాబ్రహ్మమేదో యొకరూపముచే యుపాసనచేయుచున్నయెడల గన్పట్టుచున్నది. ఈజ్ఞానమునకు నుపపత్తియాసమయమునం దతనికి సాధ్యముకానిమాట సత్యమే. కాని యాధిభౌతశాస్త్రమునందు సైతము మొదట ననుభవము ననంతరము దానికి నుపపత్తియు ననియే క్రమము. ఉదాహరణము భాస్కరాచార్యులవారు కీ పృధివియొక్కయు తుదకు న్యూటనునువానికి సమస్తము నగుప్రపంచము నందలి వస్తువులగురుత్వాకర్షణముయొక్కయు కల్పనతోచుటకు మున్నె వృక్షముననుండిఫలండు క్రిందికి జారిపడునను విషయము యెల్లవారికి తెలిసినదియే అధ్యాత్మశాస్త్రమునకును యీన్యాయమే వర్తించును. నమ్మకము ప్రాప్తమైన జ్ఞానమును పరిశీలించి దానికి నుపపత్తిని జేర్చుకొనుట బుద్ధియొక్క కార్యమే కాని సర్వదా యోగ్యమయిన యుపపత్తి చెప్పలేకపోయినంతమాత్రముచేతనే నమ్మకముచే ప్రాప్తమైన జ్ఞానము భ్రమయే యనుటకు సాధ్యము కాదు. భక్తియనగ ॥ సా భక్తి ర క్తి రీశ్వరే ॥ అని యీశ్వరుని యందలి నిరతిశయమగు ప్రేమనే భక్తియని చెప్పుచున్నారని భక్తిలక్షణము శాండిల్య

సూత్రములయందు వ్రాయబడినది. పరమనగ, కేవలము నిరతిశయము నను నదియే కాక నిర్హేతుకమనియు నర్థమే కాన, ఆయను రక్తి నిష్కామముగను నిరంతరముగ నుండవలయును. శ్రుతి॥ అహైతుక్య వ్యవహితాయాభక్తిః॥ పురుషోత్తమే అని భాగవత పురాణమునందు చెప్పబడినది. కారణమేమి యనగ, ఓపరమేశ్వరా నాకదికావలయు నీకు కావలయునని ప్రార్థింపుచుండు భక్తి సహేతుకమగును. కావున, కామ్యములగు యజ్ఞయాగాదికర్మలవలె దీనికి కొన్ని హంశముల నెంధైనను క్రియాస్వరూపము సంభవించును.

మహాఋషులు యెట్లుచెప్పిరి. అనగ, ఆత్మస్వరూపమును దెలియజెప్పిరి. పంచకోశములలో అన్నమయకోశమునకు వ్యతిరిక్తమగు, ప్రాణాదికోశములును, సూక్ష్మేంద్రియములును, పంచతన్మాత్రలును, ననువానిని వేదాంతులు లింగశరీరమనియును సూక్ష్మశరీరమనియును చెప్పుచున్నారు. కాని, యొక యాత్మకు వేర్వేరు యోనులయందు జన్మ మెటులగలిగెనను ప్రశ్నకు బుద్ధికి ననేకభాగములు గలుగుటవలన నెట్లుగలిగెనని, సాంఖ్యులు చెప్పిన సమాధానమునకు మారుగ, ఇదంతయు కర్మవిపాకము, కర్మఫలము యొక్క ఫలమని వేదాంతులు చెప్పుచున్నారు. ఈకర్మ లింగశరీరముయొక్క ఆశ్రయముచేత ఆధారముచేత నిలుచున్నది. మరియు నాత్మ స్థూలదేహమును విసర్జించి యేగుచుండెనేని యీకర్మయును లింగశరీరముద్వారా దానితోనే పోవును. ఈఆత్మను మరల, వేర్వేరు జన్మముల నెత్తునటుల చేయునని గీతలయందు వేదాంత శాస్త్రములయందు, యుపనిషత్తులయందును, స్పష్టముగ జెప్పబడినది. కావున నామరూపాత్మకములగు జనన మరణములను బొందుతూ మెత్తుచు నిత్యమైన పరమాత్మ స్వరూపము నొందుటకు బంధరహితమైన మోక్షమును సంపాదించుకొనుటకు పిండమందుండు 'నాత్మ ఆటంకమేమనిన యోచించునప్పుడు లింగశరీరమును లింగశరీరమనే కర్తను విచారింపవలసి వచ్చును. ఈరెంటిలోను అధ్యాత్మ విచారణయందు సాంఖ్యదృష్టిచేతను యోగదృష్టిచేతను, ఆత్మానాత్మ వివేకజ్ఞానదృష్టిచేతను, లింగశరీరమును బూర్వమువలెనే విచారించుటచే దానిని మరల విచారించుట ననవసరము. ఏకర్మమునందుండి బ్రహ్మజ్ఞానము లేకపోవుటయేగాక అనేకజన్మములనెడి సుడిలో నాత్మబడవలసివచ్చునో యాకర్మయొక్క స్వరూపమెట్టిదియైనను, అందుండి తప్పించుకొని, యాత్మయమృతత్వము నొందుటకు మనుజుడీజగంబున

నెటుల పరివర్తింపవలసినదియు తన్నుతా దెలియునదియు ఈఘట్టముల యందు వివరింపబడియున్నది.

మానవుడు సంసారదుఃఖమునుండి, విడువబడిన వాడగువరకును నెప్పుడైనను తా నొనరించు పుణ్యము తనఫలము అన తనకోరిక పరిహారము ఫలము నిచ్చునట్లుగ మార్గము నాలోచించుచుండును. కాన, తన పుణ్యఫలము ఏఫలము నిమిత్తమై స్థిరపడియుండునో—ఆఫలమునే ప్రాప్తమగును. అంతేమతిస్సాగతిః॥ యనునట్లు దేహాంతమున నేకోరికగలదో ఆకోరిక పరిహారమే- ప్రాప్తమగునని భారతమునందు పరాశరగీతలలో చెప్పబడియున్నది. అట్లనే సంచిత పాపకర్మ సహితము తనబలము నిచ్చువరకు- మనస్సు నిలచియేయుండును. సంచిత కర్మభోగము ఒక్క-జన్మమునందే సరికాక పోవుటచేత నీసంచితకర్మలలో ప్రారబ్ధకార్యములని కొన్ని తప్పక మిగిలేయుండును. మరియు యీజన్మమందు జేయబడు కర్మలన్నియు పూర్వోక్తమగు యుక్తిచే జేయబడినను మిగిలిన యప్రారబ్ధకార్యము లన్నియు కొన్ని తప్పక మిగిలియేయుండును. యీకార్యములను భోగించుటకు మరల జన్మమెత్తక తప్పదు. కావున, పూర్వోక్త మీమాంసకులయొక్క- సులభముగాయుండు మోక్షయుక్తి యసత్యమనియు, భ్రాంతిమూలకములని, వేదాంతుల సిద్ధాంతమే యుపనిషత్తునందును కర్మబంధమునుండి వదలించుకొనుటకు ఈమార్గము చెప్పబడలేదు. కేవలము తర్క-ములమీదనే చెప్పబడియున్నది. ఆతర్క-మైనను దుదవరకు స్థిరముగా నుండలేదు-కర్మచేత, కర్మనుండి విముక్తుడగుట- సిద్ధాంతము. ఎట్లనగ గ్రుడ్డివానికి గుడ్డివాడు దారిజూపి తరింపుజేయు ఆశవలె వ్యర్థమని- సారాంశము. అటులేయగునుగాక. కారణమేమనగ, ప్రారబ్ధములగు కర్మఫలమును అనుభవింపదగిన యిప్పటికిన్ని కొన్ని మిగిలేయుండుటయేగాక కర్మను వదలివేయుట యనే ద్దేశ్యము- బ్రహ్మజ్ఞానులు యీయుక్తిని విశ్వసింపక విరాగముచే నిఖిలకర్మలను త్యజించి నిరుద్యోగిగ కూర్చుండుటచే గర్మబాధములు వదలిపోవునని వచించితిమేని, యీరీతిగ గానేరదనే యనుమానము. కారణమేమనగ, ప్రారబ్ధములగు కర్మఫలము లనుభవింపదగిన విప్పటికిని కొన్ని మిగిలేయుండుటయేకాక కర్మను వదలివేయుట- అనామకము- యేలనగ- నిష్కామకర్మ చేయుట యుచితము. అందువలన మోక్షప్రాప్తి కారణమగును. మోక్షప్రాప్తియుకూడా- భ్రాంతికారణము కొందరు వేదాంతుల

యొక్క సిద్ధాంతము. ఏయుపనిషత్తులయందును కర్మ-నిష్కామయా చేయు నెడల మోక్షప్రాప్తికి కారణమని చెప్పుచున్నవి గావున, కర్మబాధకములు జన్మకారణములు గాన జన్మమెత్తక తీరదని, శాస్త్రములు-యుపనిషత్తులు-మహాఋషులు చెప్పుచున్నారు గనుక, తప్పదు. ఇంతియేకాక దేహమున్నంతవరకును శ్వాసనిశ్వాసములుగాని లేక శయనించి నిద్రించునప్పుడుగాని, కూర్చుండునప్పుడుగాని మొదలగు కర్మలు జరుగుతునేయున్నవి. అందుచేత సర్వకర్మలను వదలవలయు ననేవృత్తికూడా వదలవలయును. ఏమనగ యీ జగత్తునందు యెవరైనను ఒకక్షణమైనను కర్మ వదలలేదనియు గీతాశాస్త్రములలో చెప్పియున్నది. కర్మ మంచిదియైనను చెడ్డదియైనను దానిఫలమును ననుభవించు భోగించుటకు మనుష్యుడే జన్మమునైనను యెత్తుటకు సిద్ధముగ నుండవలయును. కర్మజన్మములు అనాదియగుటచేత, అజస్ర కర్మలయొక్క అఖండవ్యాపారికము నందు ఆపరమేశ్వరుడైనను స్వతంత్రించి చెప్పలేడు. కావున, సర్వకర్మలను త్యజించుట శక్యముగాదు. ఎందుచేతననగ, ప్రారబ్ధకర్మము యనుభయము తప్పదు. ప్రారబ్ధక్షయాంతమువరకున్ను- గాన జ్ఞాని-నిష్కామకర్మ చేయుచునే యుండవలయును. ఉన్నంతలో- క్రమక్రమముగ-కర్మవిముక్తి క్రమముగా కర్మలను త్యజించుట శక్యముగాదు. మరియు, కొందరు వేదాంతశాస్త్ర మీమాంసకులు- కొన్నికర్మలను త్యజించి, కొన్నికర్మలు చేయుటచే కర్మబంధమునుండి విమోచనము కానేరదని సిద్ధించినపిదప కర్మాత్మకమగు నామరూపములను విశ్వమనే చక్రమునుండి విముక్తుడై యీసంసారచక్రమునకు ఆధారభూతమును నగు అమృతమును నాశనము లేనిదియు నగుతత్వములలో గలసిపోవలయునను మనుష్యునికి స్వాభావికము నెరవేరుటకు మార్గము ఏదియనగ, ప్రశ్నకు చోటుయున్నది. ఇందునుగురించి వేదములలోను స్మృతులలోను గీతలలోను లౌకికములగు యజ్ఞయాగాదులను చేయుటకును మొదలైన సాధనములు చెప్పబడినవి. మోక్షసాధనదృష్టిచేత నవన్నియు క్రిందిమెట్టునన్న యేయగును. కారణమేమియనగ, యజ్ఞయాగాది పుణ్యకర్మలచే స్వర్గప్రాప్తియైనను పుణ్యకర్మఫలము సమాప్తమైనపిదప చిరకాలమునకైనను యెప్పుడో యొకప్పుడైనను క్రిందనున్న కర్మభూమియందు పడితీరవలయును. అనగ, మాతృగర్భమందు బిందురూపంబున అవ్యక్తనామరూపాత్మకమైన మర్త్యలోకంబునకు వచ్చును. అనగ, జన్మకువచ్చును- తప్ప

దుగాను- ఋ. ౨ - శ్రముగ భారతమునందు గీతలయందు స్మృతులయందును చెప్పబడును. ఇందువలన-కర్మయను పట్టకారునుండి పూర్తిగవిముక్తుడై అమృతతత్వమునందు గలసిపోవుటకును అనృతజడదుఃఖాత్మకములైన జననమరణ రూపకమగు స్థిరమైన కల్లోలమును- శాంతిజేయుటకును కామ్యకర్మమార్గము తగుమైన మార్గము కానేరదని స్పష్టముగా గన్పట్టుచున్నది. ఈజననమరణ ప్రవాహకల్లోలమును శాంతిజేయుటకు మోక్షమును జెందుటకు నధ్యాత్మ శాస్త్రానుసారముగా బ్రహ్మజ్ఞానమనునది యొక్కటియేమార్గము. జ్ఞానమన గా వ్యావహారికజ్ఞానము లేక నామరూపాత్మకమగు సృష్టిశాస్త్రముయొక్క-జ్ఞానము సర్వేంద్రియ సమన్వితమైన వ్యవహారికంబైన జ్ఞాతయైన జీవాత్మ-సర్వవేదశాస్త్రవ్యవహార జ్ఞానము గావున ఈజ్ఞానమే బ్రహ్మాత్మైక్యజ్ఞానమె యని యర్థము. దీనినే జ్ఞానము యెరుక విద్య బ్రహ్మవిద్య బ్రహ్మజ్ఞానమని యెదరు. మరియు శృతి॥ కర్మణాబద్యతేజంతుః విద్యయాచప్రముచ్యతే॥ అను వల్లు మానవుడు కర్మచే బద్ధుడగుచున్నాడు. అనగ బ్రహ్మవిద్యచే విముక్తు డగుచున్నాడని గీతాశ్లోకమునందు చెప్పబడినది కావున, విద్యాశబ్దమునకు-బ్రహ్మవిద్యాయను జ్ఞానమను నామధేయం గావున విద్యశబ్దమునకీబ్రహ్మైక్య జ్ఞానమైన నర్థమే నిశ్చయమైయున్నది- కాబట్టి గీతజ్ఞానాగ్ని సర్వకర్మాణి భస్మసాత్కురుతేర్జున జ్ఞానారూపమగు నగ్నిచే నిఖిలకర్మలు భస్మములగు చున్నవి. అని భగవంతునిచే నర్జునునకు జెప్పబడినది. గీత॥ బీజాన్యగ్న్యుపద గ్ధానినరోహంతియథాపునః జ్ఞానదగ్ధైస్తథాక్లేశైర్నాత్మాసంపద్యతేపునః॥ యను న్యాయమున వేచబడిన గింజలేతీరున మొలకలెత్తవో ఆతీరుననే జ్ఞానముచే కర్మలయొక్క- దుఃఖములును దగ్ధములగునే, ఆత్మను జెందవు. ఆత్మసర్వసాక్షి గమక అంట జేరవు. అని రెండు శ్లోకములయందు జెప్పబడినది. ఉపనిష త్తులయందుల నియిలనే॥ శృతి॥ యఏవం వేదాహం బ్రహ్మాస్మీతిస ఇదంసర్వం భవతి॥ నేనే బ్రహ్మనని యెడు తెలివి తెలిపినో నెవడు తెలిసికొనుచున్నాడో వాడె అమృతస్వరూపమగు బ్రహ్మమగుచున్నాడు. బృహదారణ్యోపనిషత్తు నందు చెప్పియున్నది. తామరాకునకుదకమంటనటు లెవరికిః బ్రహ్మజ్ఞాన ముగల్గినదో వారిని కర్మదోషము లంటజేరవు. అని ఛాందగోపనిషత్తు లో చెప్పియున్నది. ౪-౧౪-3౭ బ్రహ్మమును దెలిసికొననివారికి మోక్షు ప్రాప్తియగును. తెరీయతిమందు ౨-౧-౨ సర్వము నాత్మమయముగ నున్న

దని యెవడు తెలిసికొనునో వానికి పాపబాధ లేదు. బృ-ఉ-ఉ-౨౩౭ జ్ఞాత్వా దేతం ముచ్యతె సర్వపాశై॥ పరబ్రహ్మజ్ఞానము గలిగినపిదప సర్వకర్మ పాశములయందుండియు, విముక్తుడగును. శ్లో॥ గీ-౧౩-౬ ౧౩ "క్షీయంతె యాస్యకర్మాణితస్మిన్ దృష్టే పరావరె" పరబ్రహ్మజ్ఞానోత్పత్తైనపిదప వాని యొక్క సర్వకర్మములు నశించును. ముండకోపనిషత్ ౨ ౨-౮ "విద్యయా మృతమశ్నుతె" విద్యచే నమృతతత్వము సిద్ధించును. ఈశత్వాశోపనిషత్ ౨౧ మైత్రేయోపనిషత్తు ౭-౯ "తమేవవిదిత్వాతి మృత్యుమేతినాన్యః పంథావిద్యతేయనాయ" పరమాత్మను దెలసుకొనినయెడల తానే పరమాత్మయగును. దీనికంటె మోక్షప్రాప్తికి వేరుమార్గము లేదు. శ్లో॥ ౩-౮; ఈ తీరున బ్రహ్మజ్ఞాన మహాత్వమును బ్రతిపాదించు వాక్యము లనేకములున్నవి. మరియు, "శాస్త్రదృష్టం గురోర్ వాక్యం తృతీయం ఆత్మనిశ్చయం" యనునది యే దృఢసిద్ధాంతము. కారణమేమనగ నామరూపాత్మకమగు దృశ్యప్రపంచంబునందున్న పదార్థములన్నియు గర్మమయము లైనను నీసృష్టికి ఆధారభూతమగును. పరబ్రహ్మముయొక్క లీలావినోదము లేమైనను ఏకర్మయు పరబ్రహ్మమును బాధింపనేరదు. అన్నివిషయము లొనర్చినను బరబ్రహ్మము నిర్వికారుడై నిర్లిప్తుడై నిర్విశేషుడై నిష్కళంకుడై యున్నాడని స్పష్టముగ గాన్పించుచున్నది. అధ్యాత్మతత్వ శాస్త్రానుసారముగయీజగమునందుండు పదార్థములన్నియు కర్మ, మాయ, పరబ్రహ్మము నను నీరెండుభాగములుగనే యున్నవని, యీఘట ప్రారంభమునందే చెప్పబడియున్నది. కావున, నెవరికైనను మొదటి భాగమునుండి యనగ, కర్మయందుండి విముక్తికాలమని, కోరిక యుండినయెడల వారు రెండవభాగమునందు ననగ, బ్రహ్మస్వరూపమునందు ప్రవేశింపవలయును. ఇందుకు మరియొక మార్గము లేదు. కారణమేమియనగ, మూలకారణమునందు రెండుభాగములుగా నుండుటచే గర్మమునందుండి విముక్తి మైనచో బ్రహ్మస్వరూపముదప్ప, యేదియు నుండనేరదు. బ్రహ్మస్వరూపము యొక్క యీయవస్థ ప్రాప్తమగుటకు బ్రహ్మస్వరూప మేదియో మొదట నిశ్చయముగా దెలియవలయును.

అది తెలియనియెడల శృతి "వినాయకం ప్రకర్వాణోరచయా మాసవానదమ్"- అనునట్లు, ముక్తుడగుటకుమారుగ, వేత్తయగును. కావున, పరబ్రహ్మస్వరూపము యొక్కయు, బ్రహ్మాత్మైక్యముయొక్కయు, బ్రహ్మము

యొక్క. అవ్యక్తముయొక్కయు, జ్ఞాన ముత్పన్నమగునేని దానినే మరణ కాలమువరకు "అంతేమతిస్సాగతిః" స్థిరముగ నిలుపవలయును. ఇదియే కర్మ పరిపాకమునుండి విముక్తిపొందుటకు సత్యముగ ముఖ్యసాధనమై యున్నదని అధ్యాత్మతత్వశాస్త్రమునందు చెప్పుచున్నది. ఎవరు నిష్కామకర్మచేయు చు కర్మలోపము లేదని గర్వము నెవరుంగలదో వారు కర్మపాశమునందుండి విముక్తులగుదురు. గీతాశాస్త్రము చెప్పుచున్నది. కర్మబంధమునుండి విముక్తు డగుటకు, కర్మనువదలుట మార్గముగాదు. బ్రహ్మాత్మైక్యజ్ఞానముచే బుద్ధిని నిశ్చయమ్ముపరచుకొని, కోరికలను విడచి- నిష్కాముడై పరమేశ్వరునివలె, బ్రహ్మకర్మ నాచరించుటచే, మోక్షము సులభముగా లభించును. కర్మ పరి త్యాగము కేవలము భ్రమ మూలము. (అనగ) బాహ్యసన్యాసము భ్రమ కారణము. అంతర సన్యాసము నిష్కామకర్మ గావున, ప్రారబ్ధకర్మ వారికి యనుభవించకతీరదు. ఈప్రకారముగ, కామ్యకర్మ నిష్కామ్యకర్మ యీ రెండువిధమ్ములు నామరూపాత్మక ప్రకృతి యధీనమైయున్నది. కామ్యకర్మ మోక్షప్రాప్తికి కారణమైనదిన్ని-కర్మవిముక్తి యైనదిన్ని- గావున, యీ రెండు మార్గములు ప్రవృత్తి మార్గము. కామ్యకర్మ, నివృత్తిమార్గము. నిష్కామ కర్మ యీ రెండున్ను ప్రారబ్ధావసాన పర్యంతె మనస్సేము తప్పదుగాని, యీ రెంటికి భేదమేమనగ, బ్రహ్మప్రాప్తికి కారణము నిష్కామనివృత్తి కర్మ విముక్తియున్ను జననమరణ ప్రవాహరూపకమైనప్రవృత్తి కామ్య కర్మమార్గమున్ను నైయున్నది. కాబట్టి, శృతి॥ ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కింకరిష్యతి॥ నిగ్రహము ఏమిచేయును; ప్రాణులను స్వప్రకృత్యమునె జేయుచనుండును. గీత 3-33 మిధ్యైషవ్యవసాయస్తె ప్రకృతిస్త్వాం నియో క్ష్యతి॥ తనయొక్క ప్రయత్నము వ్యర్థము. ఏమనగ, తనకు అక్కరలేని పను లలోనికే ప్రయత్నమంతయు ప్రకృతిలోనికే లాగుచున్నది. గీ- ౧౮ ౫౯- మరియు ౨-౬౦ చూడవలెను. అని భగవానులుచేతను, "బలవానింద్రియ గ్రామో విద్వాంసమపికర్షతిః"- మహాబ్రహ్మజ్ఞానినైనను యింద్రియములు యీడ్చుకొని పోవును. మనుశ్రృతి॥ ౨-౨౧౫ యనిమనుశ్రృతి మనువుచేతను జెప్పబడినది. మరియు కర్మవిముక్తియొక్క నిష్కామ్మనివృత్తియు నటులనే యున్నది.

కారణమేమియనగ, మనుజునిమనస్సునందున్న సర్వకోరికలును, పూర్వ

జన్మ కర్మమూలముగనే గలుగుచున్నవి. ఆకర్మల నవలంబించిన కారణమున మరియొకకర్మ దానినుండి మరియొక్క కర్మానికి యంత్రిపుసూత్రము వలెను లాగుకొని పోవుచున్నది. కావున, ఈవిధముననే మనుజుడు జనన మరణమనే భవచక్రమనే శింసుమారచక్రమునందు ఉండవలసివచ్చును. కావున వేయేల కర్మయందుండి యావలికి దాటి పోవుటకునై జననమరణ మనే భవసాగరము దాటిపోవుటకునై విముక్తిగలుగుటకునై తాను జేయు నట్టి ప్రయత్నము కర్మయు ననుసవికూడ విరుద్ధముగా యుండునని చెప్పినను యుక్తముగాయుండును. ఇది సత్యమైన యెడల జ్ఞానము సంపాదించుకొనుటకు నెవ్వరైనను, బాధవిముక్తి గలుగుటకు సద్గురుసాంగత్యము శాస్త్రచింతన స్వానుభవముచేతను సాధించవచ్చును.

నామరూపాత్మకమగు సర్వదృశ్యసృష్టికి నేతత్వము ఆధారభూతమైన దో అదియే మానవదేహమైన జడదేహమునందు నాత్మరూపముగ, నివసించి యున్నది. కావున, మనుజుని సంబాధమగు ప్రకృతి వ్యవహారములు దేహ మె ఆత్మయనను నీరెంటి దృష్టిలో యొనరింపవలయునని, అనగ, దేహాత్మలు రెండింటిలో సర్వ కర్మకార్యములు యొనరింపవలయును గావున, యీశంక అధ్యాత్మ తత్వశాస్త్రమునందు యున్నది. నాత్మస్వరూపమె బ్రహ్మము. ఏక విధముగానున్నది ఏకమగుటచే ఆపరబ్రహ్మ మెప్పుడును, పరమగుటకు, అనగ, వేరగుటకు రెండవది యగుటకు వీలులేదు. ఎందుచేతననగ, యొక పదార్థము మరియొకపదార్థములో యగుటకది యొకటియు నిదియొకటియు యనుభేదములు స్థిరముగ నుండవలయును. ప్రకృతినందు నామరూపాత్మక మగు ప్రకృతి కర్మ యనునది మె రె ండవ పదార్థముగ నున్నది.

మరియు నీకర్మ నిత్యమును ఆదిమూలము దన్న పరబ్రహ్మము యొక్క లీలయె ప్రకృతి కిర్మయగుటచేతను పరబ్రహ్మముయొక్క యొక భాగ మనగ, పరబ్రహ్మముగాను గావున దాని యావరణమును పరబ్రహ్మమనునది యొక్కరుడు దాసత్వము చేసుకొనవలెను. అనగ, రెండవ దానితో సహవాసము చేసుకొనవలదనే సిద్ధాంతమునకు వివాదముగానే యున్నది. ఇంతియేకాక ఏయాత్మ కర్మసృష్టియందలి వ్యావహారముల యొక్క టిగ నొనర్చి సృష్టిజ్ఞానమును బుట్టించుచున్నదో అది కర్మసృష్టికంటె భిన్న ముగ నుండవలయును. అనగా, బ్రహ్మసృష్టియందున్నదే పరబ్రహ్మము. దాని

విచారణ కావలయునని విచారించిన సృష్టికి పూర్వంబు సృష్టికిపరమందు సృష్టి యున్నప్పుడు సృజనలేకయున్న, ప్రాగ్దక్షిణంబుల పశ్చిమోత్తరముల, నాల్గుమూలలమీద నడుమక్రిందను యున్నదిగాబట్టి, పరబ్రహ్మము ఆనిమూలము. ఆపరబ్రహ్మాంశమగునట్టియు, దేహమైనట్టియు, నాత్మయు యీదేహాత్మలు రెండును మొదటినుండియు అనాదులై స్వతంత్రులై కర్మాత్మకమగు ప్రకృత్తికి అధీనములుగావు. అవి నిష్ఫలమగుచున్నవి. వీంగో పరమాత్మయనంతమునై యున్నది.

ఇంతకంటె మనుష్యునకు నధికముగ పరమాత్మజ్ఞానము గోచరముగానేరదు. కాని యీపరమాత్మ హాంశమగు జీవాత్మ అనాదియుండు సస్వరూపుండగుటచేత ఆదికాలము మొదలు ఆదిగ అంత దేహవర్ణగోత్రినామరూపసాఖ్యసుఖదుఃఖధర్మపాపకోటులన్నియు వినాశ మొందుచుండుటచేత వీనిని జూచుచుండు అనాదిసస్వరూపుండైన పరమాత్మ ఈప్రకారముగా మహాఋషులు చెప్పుచున్నారు. అట్టి పరమాత్మ హాంశమగు జీవాత్మ అనాదియు అవినాసియు, నిర్గుణము, అకర్తయునైనను దేహము బుద్ధీంద్రియములనే బంధనములో బడియుండుటచేత అది మనుజునియొక్క మనస్సు యొప్పుడు-స్ఫురణమనే సంకల్పమును బుట్టించుచున్నదో అప్పుడు దాని ప్రత్యక్షానురూపముగు జ్ఞానమునకు గలుగును. బట్టబైలునందుండు యీవిరియొక్క వేగమేమియు గనబడకున్నను దాని నొక్కకుండయుండున దానిపైని గాన్పించుచుండును. ఆప్రకారముగనే అనాది పూర్వజన్మకర్మార్జిత జడదేహముచేతను నింద్రియములచేతను పరమాత్మయొక్క హాంశభూతుండగు జీవుడు గీతలయందు ౧౫-౭- బాధింపబడినప్పుడు యీ బద్ధావస్థయందుండిన జీవుని విముక్తునిగ జేయుటకై మోక్షార్థమగు కర్మను జేయుటకు దేహేంద్రియాదులు ప్రవర్తింపుచున్నవి. మరియు దీనినే యీయింద్రియములు చేయు పుణ్యకర్మయె బ్రహ్మకర్మ. బ్రహ్మార్పణముగా జేయునది యీ ఇంద్రియముల ప్రకృత్తియే. వ్యావహారికదృష్టిచేత ఆత్మయొక్క స్వతంత్రప్రకృత్తియని చెప్పుచున్నారు. వ్యావహారికదృష్టిచే యని చెప్పినందుకు హేతువేమనగ అజ్ఞానావస్థయందు లేక సాత్వికదృష్టిచే నాత్మసంకల్పశూన్యమును యిచ్ఛాశూన్యమును అకర్తయు నగుటచే సర్వకర్తుత్వములు ప్రకృత్తివి గనుకనే యున్నవి. గీతలయందు ౧౩-౨౯ సూత్రభాష్యమందు శాంతిభారతమునందు ౨-౩-౪౦. కాని యీ

మూలప్రకృత్తి స్వయముగనే మోక్షానుకూలమగు కర్మ యొనర్చునని సాం ఖ్యులు వేదాంతులు చెప్పుదురు. కారణ మేమియనగ పరిశుద్ధాత్మ స్వతంత్రి ప్రకాశముపలన చేయునది మనుష్యుడు ప్రవర్తింపుచున్నాడు. దీనినే నిజ మైన యాత్మజ్ఞానమని బ్రహ్మనిష్ఠ యని చెప్పెదరు. ఈప్రకారముగ ఆత్మ ప్రేరేపణమువలన మనుష్యుడు సంచరించెనేని నతడు తాను జేయు వ్యవహార మంతయు మోక్షానుకూలముగానే యున్నది.

భారతం శాంతి ౩౦౮-౨౩-౩౦ యీసంఖ్యయందు సూత్రము.

శ్లో॥ విశుద్ధధర్మా, శుద్ధేన, బుద్ధేనచ, సబుద్ధిమాన్ విమలాత్మాచభ వతి॥ సమేత్యవిమలాత్మనా స్వతంత్రశ్చ స్వతంత్రేణ స్వతంత్రత్వమవాప్ను తే॥ యిత్యాది ప్రమాణములు చెప్పుచున్నవి. స్వతంత్రుడగు నాత్మ మొదటి నుండియు నిత్యుడును, శుద్ధుడును, బుద్ధుడును, నిర్మలుండును, స్వతంత్రుడునగు పరమాత్మయం దేకీభవించుచుండును. జ్ఞానముచే మోక్షము సిద్ధించుచున్న దని వెనుక చెప్పబడినదానికి విరుద్ధముగనే జడమగు దేహేంద్రియములయొక్క ప్రాకృతధర్మము లనగ కర్మ సృష్టియందుండు ప్రేరణలు ప్రబలమగునేని మనుష్యునకు అధోగతిప్రాప్తి గలుగును. పునర్జన్మస్థితి గలుగును. దేహేంద్రి యములను మోక్షానుకూలములగు కర్మలలో బ్రవేశపెట్టి బ్రహ్మాత్మైక్యజ్ఞాన ముచే మోక్షమును సంపాదించవలెనని యిచ్ఛగలిగిన శరీరాత్మయొక్క స్వతం త్రశక్తిని మనస్సునందు నిడికొని గీత. ౬-౫ ఉద్ధరేదాత్మనాత్మానం నాత్మా నవసాదయేత్ ఆత్మైవహ్యాత్మనోబంధురాత్మైవరిపురాత్మనః॥ యనునట్లు మను ష్యుడు స్వయముగనే తన్ను తా వెలియవలయును. తనకుతానే అజ్ఞానమున నశిం చిపోరాదు. కారణ మేమియనగ ప్రతిమనుష్యుడును తానే తనకు బంధువు డును తనకు హితమైనకర్మ తనకుతానే శత్రువై నాశనకర్మ చేయువాడున్నాడు యని ఆత్మ తనయొక్క స్వతంత్రముయొక్క స్వానుభవముచేత తత్వము అర్జును నకు యుపదేశించెను. మరియు నీకారణముచేతనే యోగవాసిష్ఠమందు బ్రహ్మ పదమును నిరాకరించి ప్రకృతముయొక్క పౌరుషహంకారమును చెప్పు [redacted] యు న్నది. యోగవాసిష్ఠమందు ౨-సర్గ-౮-౮. సర్వభూతములయం [redacted] ర మాత్మయే యున్నదనేతత్వమును తా దెలసికొని యిట్లు ప్ర [redacted] టయే యె ల్లప్పుడు ఆచరణమనియు మోక్షాచరణమని చెప్పుదురు. ఈవిధముగ ఆచరిం చుటచే దేహేంద్రియాదులు వ్యవహరింపబడుచున్నవి. కావున బద్ధుడగు జీవా

త్మకు స్వతంత్రిప్రవృత్తిన దురాచారుడగు మనుష్యునియొక్క అంతఃకరణము యెల్లప్పుడు ఆచరణ చేయుటకు అనుకూలముగా నున్నది. ఆ కారణముననే దురాచారుడు దా జేసినదానినిగురించి పశ్చాత్తాపము పొందుచున్నాడు. కాబట్టి సాత్త్వికదృష్టిచే విచారించితిమేని బుద్ధీంద్రియములు జడప్రకృతియొక్క వికారములే యగుటచే అవి కర్మలయొక్క నియమములోనుండి స్వయముగ విముక్తులగుటకు వీలు లేదు. కావున బుద్ధియును మనస్సును కర్మానుగతమగు జడప్రకృతియొక్క అవ్యక్తము అసంవేద్యము. తను దానెరుగనిది వికారమేయగును. కావున నది స్వయముగ కర్మయనెడి పట్టుకారునుండి విముక్తము కానేరదు. కావుననే సత్యమగు స్వతంత్రము ఆత్మకు నెవ్వరు నియ్యనక్కరలేదు. ఎవరును బోగొట్టలేరు. స్వతంత్రమగు స్వయంప్రకాశమగు పరమాత్మయొక్క హంశమగు జీవాత్మబాధమగు దేహములో బడియుండి స్వతంత్రరీతిని ప్రవర్తించును. ఆత్మయొక్క హంశముచేత దేహేంద్రియములకు స్వతంత్రము గలిగినది.

శృతి॥ ఆత్మనా ఆత్మనా చోద యాత్మానం॥ తాను తన్ను స్వప్రయత్నముచే మంచిమార్గమున బ్రవేశపెట్టుకొనవలయును. అనగ తన్ను దా దెలియవలయును. శృతి॥ ఆత్మా ఆత్మ హి ఆత్మనోగతి తస్మాత్ సంజ్ఞమయత్తిణం అస్వం అశ్వం బద్ధం వహాణిజో॥ యని యున్నది. తానే తనకు రాజు అగుటచే తన యాత్మతప్ప తన్ను మరియొక ఏదియును తరింపుచేయునది లేదు. ఎట్లనగ ॥వజ్రం వజ్రేన భిద్యతె॥ అనగ వజ్రంచేత వజ్రమునే కోయబడును. కావున నొకరొతు తన మంచిగుర్రమును తానే స్వాధీనపరచుకొనవలయును. ఆగుర్రమును రౌతు గాలాను స్వాధీనపరుచుకొనునట్లు మనల మనమే బాగుగ మనస్సును స్వాధీనపరుచకొనవలయును. కర్మపాశమునుండి విముక్తుడై సర్వభూతములయం దన నొకయాత్మయే కలదని యెరుంగుట అధ్యాత్మతత్వశాస్త్రమునందు పూర్ణముగా చెప్పబడియున్నది. కావున మోక్షప్రాప్తికి బ్రహ్మైక్యజ్ఞాన మనునదియే యొక ప్రబలవాక్యము. గీత ౫-౭ సర్వకర్మఫలత్యాగంకురు॥ సర్వకర్మఫలములను వదలుము. అని గీతలు చెప్పుచున్నవి. సంసారచక్రమునం దుండినవాడు ముక్తుడౌనని చెప్పవచ్చును. ఈ సిద్ధాంతమే శృతి॥ అపిచేత్ సుదురాచారో భజతే మామనన్యభాక్॥ మిక్కిలి దురాచారుడైనను మనుష్యుడు అనన్యభావముచేత పరమాత్మను లేక పరమే

శ్వరుని సేవించెనేని మోక్షమును బొందును. కావున సగుణోపాసనచే గాని లేక యితరకారణములచే గాని బ్రహ్మము జీవాత్మయు ద్వైత రూపమగు యీరెండు వేరనుసదియే అన్యతర మనస్సునం దేమాత్రమును లేనివారు నిశ్చయముగ బ్రహ్మరూపులే యగుటచే యిట్టి మనుష్యులు బ్రహ్మప్రాప్తిని నిత్యమై మరియొక ప్రదేశమునకు కేగవలసిన యవసరములేదని స్పష్టముగనే కన్పట్టుచున్నది. కావున పరిశుద్ధమగు బ్రహ్మజ్ఞానము పూర్ణము నిష్కామము డైనవాడు శృతి॥ తస్యప్రాణాఉత్క్రామంతి బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి॥ బ్రహ్మమయునియొక్క ప్రాణము లెక్కడికిపోవు. నతడు నిత్యమైనవాడు బ్రహ్మస్వరూపుడు నట్టి బ్రహ్మమునందే లయమగును. అని బృహదారణ్యోపనిషత్తునందు చెప్పుచున్నది. శృతి॥ అత్ర బ్రహ్మసమశ్నుతే. ఎచ్చోట నున్నవా డచ్చోటనే యుండి బ్రహ్మైక్యము ననుభవించుచున్నాడు. ॥కఠోపనిషత్తు॥ ౬-౧౪. యని బృహదారణ్యము. ఈ రెండు యుపనిషత్తులయందును జెప్పబడినది. ఈశృతి ఆధారముచేతనే మోక్షముకొరకు గ్రామాంతరమున కేగవలసిన యవసరములేదని శివగీతలలో చెప్పియున్నది పరమాత్మ ఒకచో నుండునదియు వేరొకచో నుండనిదియు నని చెప్పుటకు సాధ్యముకాదు. చాందనోపనిషత్తునందు ౭-౨౫ ముండకోపనిషత్తు ౨-౨-౧౧. కాని యెప్పుడైనను సంపూర్ణముగ బ్రహ్మైక్యప్రాప్తి కలుగుటకు పరిపూర్ణజ్ఞాని యగువాడనగ ఉత్తమపురుషుడని యున్నది.

ఉత్తరాయణము సూర్యలోకము స్వర్గలోకము మొదలగు మార్గములయందు వెళ్ళవలయును. "బ్రహ్మవేద బ్రహ్మైవభవతి" బ్రహ్మము నెరింగినవారు ఇహలోకమునందే బ్రహ్మమగుదురు. ముండకోపనిషత్॥ భూతపృథగ్భావమేకస్థమనుపశ్యతి॥ సర్వభూతములయందున్న నానాతత్వరూపమునశించి అవి అంతయు నెవనికి నేకస్థముగ పరమేశ్వరరూపముగ గాన్పింపనారంభమాయెనో గీత ౧౩-౩౦ నతడు బ్రహ్మసంపద్యతే॥ బ్రహ్మమె యగుచున్నాడు. అని పరమజ్ఞానియగు బ్రహ్మవేత్త చెప్పబడుచున్నాడు.

గద్య. ఇతి శ్రీ................కాట్రావులపల్లి సూర్యనారాయణయోగినీ ప్రణీతంబగు శ్రీమహాఋషినిఘంటితయోగశాస్త్రి బ్రహ్మవిద్యాయాం జన్మసూత్రముకర్మసూత్రము చతుర్థప్రకరణము సమాప్తము.

# శ్రీ మహాఋషి నిఘంటిత యోగశాస్త్రము.

## ఆత్మయోగము

—: శ్రీశుకమహాఋషి దేవకన్యకలకు ఆత్మయోగము బోధించుట :—

ఆత్మయోగమును దెలియుటకొరకు తపోయోగ మంత్రయోగము మొదలైన యోగములు యెవ్వియనగ హఠయోగప్రదీపిక "భక్తియోగక్రియా యోగ కర్మయోగశ్చ వాయుభిః। లయయోగో మంత్రయోగో హటయోగో లంబికఏవచ జ్ఞాన విజ్ఞాన యోగశ్చ రాజయోగశ్చకీర్తితః॥ తుర్యయోగః పూర్ణ బోధో దశమః పరికీర్తితః" ఈదశవిధ యోగములలోను రాజయోగము తుర్య యోగము. ఇదే అమనస్క రాజయోగము. భక్తియోగము క్రియాయోగము కర్మయోగము వాయువయోగము లయయోగము మంత్రయోగము హఠ యోగము లంబికయోగము జ్ఞానయోగము విజ్ఞానయోగము రాజయోగశ్చ కీర్తితః యనియున్నవి. కావున, తపోమంత్రయోగాదులచేత జ్ఞానమును కలుగ జేసి ఈజ్ఞానముద్వారా మోక్షమును సంపాదించవచ్చునుగాని, జ్ఞానసాధనము వంటివిగావు. రాజయోగమునందుయుండి జ్ఞానయోగము సాధించవచ్చును. కావున, పైదశవిధయోగములును, జ్ఞానమును నిచ్చునవిగావు. కాబట్టి పరిత్య తా పరోక్షమోక్షైకసాధనం మోక్షమనగ, సంసారబంధ విమోచనమునకు ముఖ్యమైన సాధనం పనిముట్టు యిందుకు దృష్టాంతం తపోమంత్రయోగా దుల వైనయితరసాధనములకంటె సాక్షాత్ మిక్కిలి సమీపమైనది. ఎట్లనిన ఏకారణమువలన అత్రిశ్మృతి॥ పాకస్య వహివద్జ్ఞానం వినామోక్షనశిధ్యతి॥ కావున, పాకముచేయుటకు వంటచేయుటకు అగ్నిహోత్రమువలె ఆత్మ స్వ రూపయోగజ్ఞానము లేక మోక్షము బంధవిముక్తి గలుగనేరదు. అనగ తన్ను దా దెలియనేరదు. దుఃఖనివృత్తి కలుగనేరదు. ఆయా వేదవిదితములైన కర్మ లకు స్వర్గాదిఫలదాతృత్వాది ధర్మగుణము లనేకములుగా యుండుటవలన ఆకర్మములే జన్మకారణమైన కర్మలు లేక, అజ్ఞానమును నశింపజేయజాలనివి.

గావున, ఆత్మజ్ఞానయోగమువలన ప్రయోజనం బేమనిన, కర్మయోగమునకు ఆత్మజ్ఞానయోగమునకు, విరోధము లేకపోవుటంజేసి, కర్మజ్ఞానమును నివర్తింపజాలదని శృతిస్మృతులు చెప్పుచున్నవి. కాబట్టి, కర్మయోగము యాగాది రూపమైన క్రియయనగ, యనేక జన్మసంప్రాప్తమైన కర్మ జన్మకారణమైన కర్మయోగాదిరూపమైన క్రియ అవిరోధితయా అవిద్యాతో దనకు ననగ, ప్రకృతికర్మతో కూడుకొని యుండుటచేత అవిద్యా అజ్ఞానమనెడి చీకటిని మళ్ళింపజేయజాలదనగ, పోగొట్టనేరదు. ఆత్మజ్ఞానమన్ననో ఉశనశ్స్మృతి॥ తేజః- వెలుగు, తిమిరసంఘవత్ తిమిర- అంధకారముయొక్క, సంఘవత్ - రాశివలెనే, అనగ గుంపువలెనే, అవిద్యాం- అజ్ఞానముచేత, నిహంత్యేన- కొట్టివేయును. ఆత్మయోగజ్ఞానము ప్రకృతిజన్యముగాదు. స్వయంప్రకాశరూపముగావున, తేజఃపుంజము తిమిరపుంజములను హరింపుజేయును. అట్లు అవిద్యను హరింపుజేయును. అనగ, సంవర్తస్మృతి॥ అనేకజన్మ సంప్రాప్తి కర్మజన్మ విదాహినే జ్ఞానానల ప్రభావేన। తస్మై (శ్రీ)గురువేనమః॥ కావున, గురుముఖ వివేకజ్ఞానమనే ప్రకాశముచేత కర్మజన్మ కారణమైన అవిద్యయనే అజ్ఞానము హరించిపోవును. జ్ఞానోదయము కాగానే చీకటి నశించును.

ఆత్మజ్ఞానముయొక్క తేజంబు ప్రకాశించినతోడనే తనయొక్క మానసేంద్రియంబుల చేష్టలన్నిడ విడచియుండును. ఎట్లనగ, యేనుగు సింహము స్వప్నమందు గనబడిన భయమునవే నశించును. కావున, సింహము తన స్వప్నమునందు వచ్చునేమోయని వకకంటినిమూచి కొంచెము తెలివితో నిద్రించునుగాని, కేవలము గాఢమైన నిద్రను జెందనేరదు. కాబట్టి, సింహము స్వప్నమునందు వచ్చునని, బహుజాగ్రత్తతో తనయింద్రియములు చెలించకుండగనే యొదిగి, చెదరక యూరకుండును. కావున, సింహమును గన్న గజముభంగి అవిద్యతోకూడిన దేహేంద్రియములు ఆత్మజ్ఞానోదయము కాగానే యింద్రియములయొక్క విషయములయందు బోనీయక షడ్వర్గములను జయించి, గుర్రముయొక్క కళ్ళెమును బట్టినట్లుగా మనస్సు చెదరనీయక వదిలపరచవలయును. కాబట్టి, ఆత్మ ప్రతిదేహమునందు యుండి, చిన్మాత్రుడై భిన్నుడుగానే యట్లు కనబడుచుండగ, ఆత్మకు ఏకత్వము యెట్లు సంభవించు ననగ శృతి॥ అజ్ఞానాత్ అవివేకమువల ఆత్మా పరమాత్మ అపరిచ్ఛిన్నఇవ కప్పబడినవాడువలెనే దృశ్యతే తోచబడుచున్నాడు. ఆయవివేకమువలన అవి

ద్వయనే అజ్ఞానమువలన వినాశము గలుగుచుండును. శ్రుతి॥ ఏకమేవా ద్వితీయంబ్రహ్మ॥ మనునట్లు తాను ఏకముగా తానొక్కడై ప్రకాశించునప్పుడు అంగీరసస్మృతి॥ మేఘాపాయే- మేఘము వదలిపోయినప్పుడు, అంశుమానివ- సూర్యునివలెనే, స్వయం- తానుగానే ప్రకాశించుచున్నాడు. కావున, అఖండ తేజోమయంబై ప్రకాశించే పరమాత్మ తానొక్కడై వెలుగుచుండగ అవిద్యాజ్ఞానమనే మేఘావరణమనే ప్రకృతి ఆరోపించినది. కావున, యట్లనే అవిద్యాజ్ఞాన ప్రకృతి అధ్యారోపవాదముగ శ్రుతి॥ అధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచతే॥ యనునట్లుగ, లేనిది యున్నట్టుగా తోచబడినది. ఆరోపితమైనది గావున, ఈఅనాది అవిద్యాజ్ఞానమూల ప్రకృత్తి ఆదిమధ్యాంతశూన్యమైనట్టి ప్రకృతి ఆదిమధ్యాంత శూన్యరహితమైన అద్వైతాత్మునకు ఆదిమధ్యాంతములు గల్గినావరించెను గాన, వున్నది లేదనియు లేనిదివున్నదని యూహింపవచ్చును. శ్రుతి॥ మూలాభావ ఇదంజ్ఞాతునశరీరం నకిమస్థి॥ శ్రుతి॥ అణినమూలజ్ఞప్తి కళామాత్రశరీరం నాస్థికేవలమ్॥ అణిశూన్యాంబరశూన్యం సర్వనాస్థికేవలమ్॥ లేక భాస్థికేవలం॥ శ్రుతి॥ నిర్మూలమె తథాజ్ఞానశ్చరీరం నాస్థికేవలమ్॥ లేక భాస్థికేవలమ్॥ ఇత్యాదిశ్రుతిప్రమాణంబులు జెప్పుచున్నవి. పరమాత్మయందు వేరుగానుండు అవిద్యాకల్పితములైన యనేకవిధములగు దేహములయొక్క ఆభాసచేత నారోపణచేత కలిగినదేగాని, ఆత్మయోగజ్ఞానాంతరదృష్టిచేత లేదు గాని, వివేకజ్ఞానముచేత నవివేకజ్ఞానము తొలగియబడిన పక్షమందు పరమాత్మ యొక్కడుగానే యుండును. అవిద్యాజ్ఞానమనే మేఘావరణము వదలిపోగానే సూర్యుడు యెట్లు ప్రకాశించునో అలాగె పరమాత్మ స్వయంప్రకాశంబై తానంతటతానై ప్రకాశించును. కాబట్టి యిప్పుడు ఆత్మ యొక్కడేయని తెలియజెప్పితిరిగదా. పరమాత్మను తెలియుజ్ఞానమను మరి యొక్క వస్తువయుండగ పరమాత్మ అద్వితీయ పరబ్రహ్మ మెట్లగుననగ శ్రుతి॥ జ్ఞానం, పరమాత్మ స్వరూపమిట్టిదని తెలిసికొను తెలివి.

శ్రుతి॥ సత్యం, జ్ఞానమనంతంబ్రహ్మ.॥

అజ్ఞానకలుషం॥ కర్తృత్వాద్యహంకారాభిమానములచేత కార్యోపాధియై కించజ్ఞుడైన వ్యవహారికుడు పంచవింశతితత్వాత్మకుడు.

కలుషం॥ మలిన, సంసారకారణాజ్ఞానాంధకారం, అవిద్యాజ్ఞానజడమైన జఠరకోశమందు జన్మించుటచేతి జీవాత్మను, జ్ఞానాభ్యాసాత్॥ జ్ఞాన- పరమాత్మ

స్వరూపముయొక్క, అభ్యాసాత్ - నిరంతరము చింతచేయుటచేత యెల్లప్పుడు ఆత్మానాత్మ వివేకముచేత మనోమాయాకృత దృశ్యములు ఏకముజేసి పరమాత్మ యందు లయముచేయుట నిర్మలం కర్తుత్వాద్యహంభావముచేత నేను నీవు భేదభావ ముచేత దోషరహితమై, కృత్వా- చేసి యనగ, జీవాత్మను పరమాత్మగా తన్ను తానుగా తాదెలసుకొనితానుతానై శృతి॥ జలంకతకరేణువత్॥ జలం-బురదతో కలసిననీరు మలిన సత్వప్రధానమైన అవిద్యతో గూడిన పంచవింశతి తత్వాత్మ కమైన కార్యకారణాత్మకమైన క్షేత్రక్షేత్రి ద్వయదోషముతోకూడి జననమర ణప్రవాహరూపకమైన అవస్థాత్రయములో జిక్కియున్న అనగ, తన్నుతా మరచియున్న తాను దాదెలియక దేహేంద్రియములే తాననుకొనియున్న బుర దనీటిని శృతి॥ కతకరేణువత్॥ కతక-చిల్లగింజయొక్క, యిందుపగింజయొక్క- రేణువత్ -గంధమువలెనే, జ్ఞానం- జ్ఞానము అనగ తెలివి, స్వయమపి-తాను ను, నసేత్ -నశించును, ఆత్మయందు లీనమగును. అనగ, యిందుపగింజయొక్క- గంధమువలన నీటియందున్న బురద నశించును తాను దేహేంద్రియములకు వ్యతిరిక్తుడనని, సర్వము నేతీతిమహావాక్యములచేత శృతి॥ నేతి నేతీతి నేతీతి సే షితం పూర్ణముచ్యతె॥ పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదీరితం పూర్ణ శ్యపూర్ణమాదాయపూర్ణమే వావశిష్యతె॥ అని ఇత్యాదిశృతిప్రమాణముల చేత తాను దేహేంద్రియ సమన్వితమైన వ్యవహారికజీవుడనే అవిద్యాజ్ఞాన మనే చీకటిని నశింపుచేయునది నేతీతి మహావాక్యమునె యిందుపగింజయొక్క- గంధం అనే గురువాక్యం॥ యథాతథా॥

ఈప్రకారముగానే గురువాక్యమనే యిందుప గంధముచేత యనేక జన్మసంప్రాప్తమైన కర్మజన్మనివాహినీ॥ అజ్ఞానమూలహరణంజన్మ కర్మనివార ణంనానా కర్మవాసనామయంబైనమన్నుయొక్క మలినము హరించి, పర మాత్మయందు లీనమగు ననగ, బ్రహ్మైక్యభావము పొందును. తన నిజరూప మును తన్ను తా దెలియును. తాను తానైనదేవ పరమాత్మ. అట్టి పరమాత్మ యిపుడు స్పష్టముగా గనపడుచున్న నానారూపప్రపంచమంతయు నెల్లవారిచే త వ్యవహరింపబడుచున్న యీమూలంలేని గుర్తెరిగే శరీరమనే సంసారము మిక్కిలి అసత్తని అనగ సత్తుగాదని చెప్పుటకెట్లు నాలోచించవచ్చును. స్వప్నదృష్టాంతరముచేత దీని నసత్యము దెలియజేయుచున్నారు. యెట్లనిన శృతి॥ అనాత్మదృష్టె అవివేకనిద్రా అహంమమస్వప్నగతిం గతోహం॥

శృతి॥ సంసారస్వప్నతుల్యోహి, రాగద్వేషాదిసంకులః సర్వకాలే సత్యవ ద్భాతి ప్రబోధే సత్యవద్భవేత్ ॥ యని ఇత్యాదిశృతిప్రమాణములు చెప్పు చున్నవి. అనగ కలలో దోచిన శరీర మేలాగో ఆలాగేమూలంలేని యీ గు ఱ్ఱెరిగి శరీరం ఏమీలేదని గురువాక్యంచేత నసత్తైన నజ్ఞానము నసించును, కా బట్టి ఎట్లనగ,

రాగద్వేషాదిసంకులః॥ రాగద్వేషాదు లెవ్వియనిన కామ, క్రోధ లోభ, మోహ, మదమాత్సర్యములలో జేరిన దారేషణ, ధనేషణపుత్రేషణముల చేత చిక్కుబడి యెట్టులనిన యేచుగ, యంపలకంపలలో జిక్కునట్లుగ జీవా త్మ తన్ను తామరచి రాగద్వేషాదులలో జిక్కి సంకులః- మిక్కిలి కలతజెం ది అనగ సుఖదుఃఖముల ననుభవించుచు అహంకర్తుత్వాదులతో గూడి యీ షణత్రయములనే బంధకమనే లతలచే చిక్కుబడి ॥సంసారః- జననమరణప్ర వాహరూపకమైన సంసారమును ॥స్వకాలే- తన అజ్ఞానకాలమందు అజ్ఞానా వస్థయందు బాల్యావస్థయం దనగ, తన్ను దాదెలియకపూర్వమునం దనగ తనకు కారణభూతమైన యవిద్యాజ్ఞానము బలిష్ఠమై యున్నకాలమందు ॥సత్య వత్- శాశ్వతమైనదిగానే తోచుచున్నది. లేనిదే యున్నట్టుగ తోచుచున్నది. ॥ప్రబోధేసతి॥ శృతి॥ ఉపసమీపే జీవాత్మపరమాత్మనోః॥ సమీపముగా నుండు జీవాత్మ పరమాత్మ తాదాత్మ్యజ్ఞానము గలిగినపుడు ॥అసత్యవత్॥ లే నిదిగానే ॥భవతి॥ యగుచున్నది. యిందుకు దృష్టాంతము ఎద్దియనిన ॥స్వప్న తుల్యోహి॥ అనగ, సంసారము స్వప్నతుల్యమైనది. శృతి॥ అనాత్మదృష్టే రవి వేక నిద్రా అహంమను స్వప్నగతిం గతోహం॥ అనగ కలలో దోచిన శరీర మే లాగో ఆలాగె మూలంలేని యీగుఱ్ఱెరిగి శరీరం ఏమీ లేదని శృతులు చెప్పు చున్నవి. గావున స్వప్నావస్థ యెంతకాలమువరకు నిద్రావస్థను నిత్యమని యనుభవించబడుచున్నదో అంతవరకు తాను యసత్యమైనను సత్యమువలె కన బడుచున్నదో నిద్రనుండి యరుకగలిగిన పిమ్మట యనగ జ్ఞానమనే తెలివిగలి గిన పిమ్మట మిక్కిలి నబద్ధమై యసత్యమై నసత్తై కనబడుచున్నదో ఆలాగె సంసారమును తనకు కారణమైన నజ్ఞానదశయందుండు నంతవరకు సత్యముగా నే తోచబడుచున్నది. ఆత్మజ్ఞానోదయము కాగానే తనకు తాదెలివి కలుగగానే తన్ను దాదెలియగానే శ్రీసద్గురువాక్యముచేత మేలుకొనగానే లేనిదిగానే తోచుచున్నది. శృతి॥ నిర్మూలమేతథా జ్ఞానశరీరం నాస్తికేవలమ్॥ ఏవర్ మి

ధ్యాసుద్ధవియత్ కించం నాస్తీతినిశ్చయః॥ అణిసూన్యాం బరసూన్యం సర్వం నాస్తి నిశ్చయం॥ ఇత్యాదిశృతి ప్రమాణంబులు చెప్పుచున్నవి. కాబట్టి జగ ద్భ్రాంతి యసత్యమని మరియొక దృష్టాంతముచేతను విచారింతము. ఎట్లు లనిన, శృతి॥ శుక్తికారజితం యథా, సుక్తిరజితవత్సర్వం జగత్। అనగ ముత్యపుచిప్పయందు వెండియను యదార్ధజ్ఞానమే గలుగుచున్నది. కాని తన్ను దావిచారించిచూడగ ముత్యపుచిప్పలే యగును. కాని వెండి గానేరదు. కావున లేనిది లేనట్లున్న వున్నది వున్నట్లున్న తన్ను దాదెలియు జ్ఞానము గురు వాక్యముచేత మేలుకొనినవానికి నిజమైన వెండిగానే కనబడును. ॥తావత్ పర్యంతము॥ అంతవరకు ॥జగత్॥ అనగ ॥జ॥ పుట్టినదియు ॥గత్॥ అనగ నశించునదియు జగద్రూపకమైన సంసారము ముత్యపుచిప్పలు వెండివలె గన బడును. అట్లు గనబడినది. ॥ఏ॥ జగద్భ్రాంతి॥ వివేకజ్ఞానముచేత తన్ను దా దెలసిన సత్యయదార్ధమైనదిగానే ప్రకాసించుచుండును. ఆప్రకారముగానే సర్వప్రపంచకమునకు యాధారమైనదియు ఏకస్వరూపమైనదియు స్వయంప్రకాశమైనదియు పరమాత్మ ప్రత్యక్షాపరోక్షానుభవసిద్ధము కాలేదో అంత పర్యంతము తన్ను దాదెలియు పర్యంతము నామరూప ప్రపంచాకారముగ పరిణమించుచున్న ప్రకాసించుచున్న యీసంసారమనే జగద్భ్రాంతిచేత సత్యముగా కనబడుచున్నది. కాబట్టి యీకనబడుచున్న జగజ్జాలమంతయును పరమాత్మయందే నజ్ఞానముచేత కల్పింపబడియున్నదని మహాఋషులు చెప్పుచున్నారు. ఎట్లనగ, శృతి॥ భ్రమేణాహం భ్రమత్వం చ భ్రమేణోపాసకాజనాః భ్రమేణేశ్వరభావత్వం, భ్రమమూల మిదంజగత్॥

శృతి॥ ఇంద్రజాలవదం సర్వ యథా శుక్తిరజితవద్భ్రాంతికారణం॥ ఇత్యాదిశృతులు జెప్పుచున్నవి. అట్టి పరమాత్మయందు యెట్టిదనిన,

నిర్వచనస్మృతి॥ అధతం, నిరంజకనం, నిరామయం సర్వగత- మస్థూల- మనణ్వ- దీర్ఘమతీర్య- మగూర్ధ్వ- మతర్క్య- మనిర్వచనీయ పరమాకాశ- మలక్షణ- మభవం- శివపకోవశిష్యతే।

శృతి। అధఏవసనాతనం- బ్రహ్మ- భగవాన్- సచలయేవసత్యం- నిరంజనం- నిర్వికల్పం- నిరింద్రిం- పరాత్పరం- బాహ్యముపైతివిద్వాన్-౨-

శృతి। అస్యజ్ఞానంనాస్తి- జన్మప్రవృద్ధిర్నాస్తి, సర్వదా సత్యవాక్యం- భక్తిజ్ఞానేన- కర్మశక్తిచనాస్తి- సర్వవ్యాప్తం సచ్చిదానందహీనమ్- 3-

శ్రుతి॥ అవేద్యము, సంగ, మబాధ్య, మబోధ్య, మలక్ష్య, మకర్మ- మ ప్రమేయ- మద్వయ- మనిష్క్రియం- పరమాకాశమచలం- సర్వదాభాతి- పూర్ణం- ౪-

శ్రుతి॥ నిరాభాసేన, చిజ్జడాత్మకావరణంభిత్వా, నిరామయం- నిరంజనం- పరమశివమాలోక్య- నిరహంకారోభవ- అనావృతేన- జీవేశ్వరభావం విశృజ్య- సస్వరూపమాత్రనిర్వికారచేతన్య. చింతసంకుర్యాత్- ౫

శ్రుతి॥ నిర్వికారనిగ్రహ- బోధోవాచ్య- సర్వకాలసర్వావస్థాసుహంకారపదార్థ వ్యాపారరహితం- కుర్యాత్ - ౬

శ్రుతి॥ నప్రకృతి- నచపురుషో- నకూటస్థో- నచాత్మా ఇత్యాహుః- పూర్ణోనిరాఖ్యాః- ౭

శ్రుతి॥ అస్థూల- మనణ్వ- దీర్ఘ- మహ్రస్వ- మవర్ణమలక్ష్య- లక్ష్యలక్షణ- విలక్షణావాఙ్మానస- గోచరశ్శివఏకోవశిష్యతే- తంపూర్ణ- మచల- మఖండ- మద్వయమనంత- సర్వాతీతస్సవఏకశ్శివః- ౮

శ్రుతి॥ నిత్యనిరంతర- పరమాకాశ- సర్వానుభవవినిర్ముక్తః సవఏకశ్శివః- ౯

శ్రుతి॥ అణవ్వ- స్థూల- మహ్రస్వమదీర్ఘ- మజ- మవ్యయ- మరూప- గుణవర్ణాఖ్యాంతద్బ్రహ్మేత్యవధారయేత్ - ౧౦

శ్రుతి॥ రూపం- యత్ర- త్వాహురవ్యక్తమాద్యం- బ్రహ్మజ్యోతిర్నిర్గుణం- నిర్వికారం- సత్తామాత్రం నిర్విశేషం- నిరీహం- సత్వంసాక్షాత్ ద్విష్ణురధ్యాత్మదీపః॥ నష్టేలోకే, ద్విపరార్ధావసానే- మహాభూతేష్వాది భూతం గతేషు- వ్యక్తేవ్యక్తంకాలవేగేనయతే- భవానేకశ్శిష్యతే- శేషసంజ్ఞః- గురోర్ముఖేన జ్ఞాతవ్యం- అన్యథానోపలభ్యతే॥ యని జగద్గురువాక్యం పరబ్రహ్మనుగురించి సూచించుచున్నది. ॥గురువాక్యం యథాతథా గురువాక్యేన లభ్యతే నగురోరధికం- తత్వం- నగురోరధికం- తపః- తత్వజ్ఞానాత్ పరం నాస్తి- తస్మైశ్రీగురవేనమః॥ ఇత్యాదిశృత్యోపనిషద్ వాక్యములు బోధ చేయుచున్నవి. పరమాత్మనిరూపణము యిట్లు చెప్పుచున్నవి. కాబట్టి అట్టి పరబ్రహ్మమువందు నామరూపాత్మకమగు ప్రపంచమంతయు నజ్ఞానముచేత కల్పింపబడియున్నది. కావున యెట్లనగా బంగారమనేక భూషణములై కనబడుచున్న విధమున పరమాత్ముండు అఖిలప్రపంచమయుడై ప్రకాశించుచుండును.

శ్రుతి॥ నిత్యేవిష్ణౌపరికల్పితాః॥ వ్యక్తయోవివిధాస్సర్వాహాటకే కటకాదివత్ యిట్లు పరమాత్మ జగద్రూపుండై, విశ్వరూపుండై, విశ్వాకారుడై, జగదాకారుడై, బంగారంవక్కటై, శృంగారము లనేకరూపములైనట్టుగ పరమాత్మ తానొక్కడై ఖండములుగా గనుపించు నామరూపాత్మకమగు ప్రపంచమంతయు శృంగారములు వేరైనట్టుగనే తాను వేరు. ప్రపంచము వేరుగ నజ్ఞానకల్పితముచేత తోచబడునే గాని వేరు గాదు. యెట్లనగ, పంచమహాభూతములలో మహాభూతమైన సమిష్టిభూతమైన ఆకాశము తానొక్కటియై యుండి ఘట, మఠ, యుపాధులయొక్క భేదముచేత నానావిధములైనదిగ ఏప్రకారము గనబడుచున్నదో ఆఘటమఠాద్యుపాధులయొక్క లయము కలిగినప్పుడు యీఘటాకాశము మహాకాశమునందు లయమవును. ఆతీరుననే మనోసంబంధములైన సర్వేంద్రియములకు నియామకమైన జీవాత్మపరమేశ్వరుడు తన మాయాకల్పితములైన నానావిధశరీరముల యందు ననగ అంతఃకరణమందు ప్రతిఫలించినవాడగుచు యనేక జీవరూపములుగా గనబడుచున్నాడు. బ్రహ్మైక్యజ్ఞానముచేత ననగ తన్ను తాదెలియుటచేత మాయాకల్పితములైన శరీరముల నాశనము గలుగుచున్నది. కాబట్టి తానొక్కడె మిగిలియుండును. ఎట్లనగ ఘటాకాశమహాకాశములకు ఏకత్వంబు గలిగినటుల ఘటభిన్నంకాగానే జీవాత్మ మహాకాశమైన పరమాత్మయందు లయమవును.

దృశ్యప్రపంచమంతయు పరమాత్మయందె యుత్పత్తిస్థితిలయములు కలుగుచున్నవియని శృతులు చెప్పుచున్నవి. కాబట్టి, పరబ్రహ్మమునందు జగతి-బ్రహ్మాండములన్నియు, వారిణి-యుదకమునందు, బుద్బుదాఇవ-బుగ్గలువలె, సృష్టిస్థితిలయం- వుత్పత్తిస్థితిలయములు కలుగుచున్నవి. అచలసముద్రవత్-సముద్రమనే పరబ్రహ్మమునందు బుద్బుదములు కలిగినటుల సర్వబ్రహ్మాండములు పరమాత్మయైన తనయందు తోచబడుచున్నవి. వచ్చి, హెచ్చి, చచ్చుచున్నవి గాని, ఆయచలసముద్రమునకు ననగ ఆపరబ్రహ్మమునకు వేరుగానిపగిది యున్నవి. తన సంబంధమైన బుద్బుదములుతనయందున సృష్టి, స్థితిలయములగుచున్నవి. కావున, తనకన్నా నన్యము యించుకైనను లేదు. అనేకకోట్ల బ్రహ్మాండములు యుత్పత్తిస్థితి నాశనములు పొందుచున్నను వేరు పదార్థములుగా గనబడుచున్నప్పటికి పరమాత్మయైన తనకంటె వేరుగాదు. గాబట్టి అగ్నియందుండు యుష్ణశక్తియొక్క ప్రకాశమున్ను పుష్పాదులయందుండు

వాసన మొదలైనవిన్ని, తనకన్నా వేరుగానిదిన్ని, చెప్పగూడదన్నట్లు అనాదిగానుండె, మాయాస్వరూపమైన అవిద్యోపాధిన్ని చిన్మాత్రస్వరూపమైన ఆత్మకంటె వేరనిన్ని వేరుగాదనిన్ని చెప్పగూడనందున యనిర్వాచ్యమని చెప్పి తర్వాత మీంద చెప్పిన వుపాధిరూపమైన దేహత్రియమునకంటె వేరుగానున్న ఆ ప్రత్యగాత్మ స్వరూపమైన సర్వసాక్షిని తన్నుతా దెలియుట యట్లనగ, మోక్షముకావలెనని తన్నుతా విచారించువారికి ఒకదాని యందున్ను సంబంధము సర్వసాక్షియైన తనకు లేదనే వివేకజ్ఞానము దెలియుటకుగాను విశదముగా వ్రాయుచున్నది. యట్లనగ లోకములో మనుష్యులు ధాన్యము బియ్యమునకై దంచడముచేత పొట్టు తవుడు మొదలైనవాటిని వేరుపరచి బియ్యమును నగ్గుతీసి తాను నేతినేతీతి మహావాక్యములచేత నామరూపాత్మకముగు ప్రపంచమును గడద్రోచి శేషించిన పదార్థము బ్రహ్మాకదార్థముగావున ప్రత్యక్ బ్రహ్మశుద్ధచైతన్య స్వరూపముగనుక ఆ శేషించిన బియ్యమును వండి అన్నము పచనముచేసి అన్నం బ్రహ్మేతివ్యజనాత్ అన్నమే బ్రహ్మస్వరూపమై జీవులకాధారమైయుండును. కాబట్టి శుద్ధనిర్గుణ బ్రహ్మమె తానైయుండెను. ఇవుడు ఆత్మసర్వాంతర్యామియై నట్లాయెనా అనగ వ్యావహారికుడాయెనా యందుకు చేత సమస్తమైన వారికి నగపడదని శంకకలగవచ్చునుగదా ఆత్మ-పరమాత్మ సర్వద-యెల్లప్పుడు, సర్వగతోపి- సమస్తమందు వ్యాపించియుండిన్ని, సర్వత్ర-అంతటను, భావభాసతే- అంతటను ప్రకాసింపదు.

స్వచ్ఛేషు-నిర్మలమైన అందము మొదలైనవాటియందు ప్రతిబింబవత్-ఛాయవలెనే బుధ్యావేవ-రాగమోహాదులు రహితమై అవ- ఇవుడు భాసతే ప్రకాసించుచున్నాడు. కావున దేహమందుండె ఆత్మకు సాక్షిత్వము యెట్లు సంభవించు ననగ దృష్టాంతము యెట్లనగ శృతి॥ దశాకాశవిరాహిత్య దశేంద్రియ వివర్జితం దశప్రాణవినిర్ముక్తం దశయోగేన గశ్చతి పంచకోశవినిర్ముక్తం పంచదేహ వివర్జితం పంచకోశాది సంగత్వం స ఏవపరమశ్శివః॥ సర్వోపాసన రాహిత్యం సర్వబంధ వివర్జితం యత్రమోహాదికం నాస్తి యత్రినాస్తి తను త్రయం.

యత్రిజ్ఞానాదిరాహిత్యం స ఏవపరశ్శివః॥ అస్మిన్ నర్థేనసందేహం సత్య సత్యం పునః పునః ఇత్యాద్యుపనిషద్ ప్రమాణములు చెప్పుచున్నవి.

శృతి॥ యనగ ఒక దృష్టాంతం. ఒక పట్టణమందు రాజుగలడు. ఆరాజు నకు మంత్రులు మొదలైనవారు పనులు చేయుచున్నప్పు డారాజు వారివ్యవహారములకు సంబంధము లేకుండా యెట్లు చూచుచుండునో ఆప్రకారముగానే తాను సాక్షీభూతుడై దేహేంద్రియములు మొదలైనవి ఆయాత్మసన్నిధాన బలమువల్ల వ్యవహరించుచుండగా తాను వాటికి విలక్షణమై సర్వసాక్షిగా చూచుచుండును. అట్టి ఆత్మ సర్వసాక్షియై సర్వకాలములు యింద్రియవ్యాపారములు గలవానివలె తోచినను అట్టి ఆత్మనిర్వికారుడు నిర్గుణుడు యని నట్లు చెప్పవచ్చును. ఎట్లనగ ఆకాశమందు చంద్రునిపై చేరియుండే మబ్బుమేఘములు పారిపొయ్యే వేగము చంద్రునియందు తోచినట్లు గనబడును గాని నిజముగా చంద్రుడు నడుచుటచేదు. కావున శృతి స్మృతిరిక్తనుభవములు లేనివారికి జీవాత్మతో దేహేంద్రియాది రూపములగు నుపాధులు తమ వ్యాపారములను ఆత్మయందు తోపింపజేయుచున్నవి గాని యదార్థముగా నేతీతిమహావాక్యములచేత వేరువేరుగ విడదీసి మిగిలిన శేషసంజ్ఞయే ప్రత్యగాత్మమైన సర్వసాక్షియై యున్నది. చంద్రునియందు మేఘుసంబంధమైన సంచలము లేనట్టుల వాటివాటి వ్యాపారములు లేవని మోక్షాపేక్ష గలవాడు విచారించును. కాబట్టి యిందుకు ఒక దృష్టాంతరము కలదు. ఎట్లనగ దేహేంద్రియమనోబుద్ధులు ఆత్మవలెనే చేతనములుగా యెందువల్ల నగుపడుచున్నవో తెలియవలయును. శ్రీరామహృదయంబునందు శివగీతలయందు ఈశ్వరుడు, పార్వతికిన్ని నిట్లు బోధించెను. శృతి॥ ఆత్మచైతన్య మాశ్రిత్య దేహేంద్రియ మనోర్ధియః స్వకీయార్ధేషు వర్తంతే సూర్యాలోకం యధాజనాః॥

భానుతేజము నాశ్రియించు స్వభావకర్మములందు నీమానవులు విహరించు కైవడి మత్ప్రకాశము నంటి ధీమానసేంద్రియములు స్వకీయసమస్తకార్యములం దొ, న్ మానః ౯ జరియింపు నెం దభిమానపూర్వక వృత్తులన్॥ యనునట్లు మనుష్యులందరు సూర్యునియొక్క ప్రకాశమువలన ఏలాగున చైతన్యము గలవారలైరో అనగ యజ్ఞయాగక్రతువు-లు సర్వవ్యవహారికములు ఎట్లు గలుగుచున్నవో ఆప్రకారముగా ఆత్మయొక్క ప్రకాశమువలన సత్తామాత్రమువలన దేహేంద్రియములకు చైతన్యము కలిగియుండును. లేక విషయములు కలిగి వ్యవహరించుచుండును. కావున నాత్మయొక్క ప్రకాశమే లేనియెడల దీపములేని లాంతరువలె నుండును. కావున జడములైన దేహేం

ద్రియములకు స్వతస్సిద్ధమైన ప్రకాశమానము లేదు. అనగ కదలికయును వ్యవహారికజ్ఞానము లేదు.

శ్రుతి॥ అరూపగుణవర్ణాఖ్యత్ర(ద్బ)హ్మేత్యవధారయేత్॥ యని యున్నది. కావున అరూపమైన నిరవయవమై అవయవములు లేనిదైన ఆకాశమునందు పిల్లలు అజ్ఞానముచేత ఆరోపించి పేర్లు చెప్పెదరు. అట్లనె ప్రత్యగాత్మయందు సమస్త యుపాధులున్ను వాటివాటియొక్క వ్యవహారములున్ను శ్రుతియుక్త్యనుభవములు లేకపోవుటచేత తోచబడుచున్నవే గాని వాస్తవముగా విచారించినట్లయితే ఆకాశమందు రూపములు లేనట్లు ఆత్మయందును ఆవ్యాపారములు లేవని మోక్షాపేక్షగలవారు చెప్పెదరు. కావున పరమాత్మయందు విచారించి చూడగ తన్ను తావిచారించి చూడగ పరమాత్మకు కర్తృత్వభోక్తృత్వములనే యనుభవము తోచుచుండునే గాని యదార్థముగా పరమాత్మకు లేవని మహాఋషులు చెప్పుచున్నారు. కాబట్టి శ్రుతి॥ అంబుగతః- నీటియందు ప్రతిఫలించిన, చంద్రే- చంద్రునియందు, అంభసః- నీటియొక్క చలనాదికదలిక మొదలైనవి, యథా- యేతీరుననో, తథా- ఆప్రకారముగానే, అజ్ఞానాత్- అజ్ఞానస్వరూపకమైన, మానసోపాధేః- మనస్సనే యుపాధివలన, కర్తృత్వాదీః- కర్తృత్వభోక్తృత్వాదిధర్మములు, ఆత్మని- ఆత్మయందు, కల్పంతే- కల్పితములగుచున్నవి. కాబట్టి సర్వకల్పనానామరూపాత్మక ప్రపంచము సర్వకర్తృత్వాద్యహంకారానుభవములు తానైన పరమాత్మయందు కల్పితములైనవి. లేనివే యున్నట్లు యున్నవి. కనుక నసత్యమే సత్యముగా తోచబడును. కాబట్టి రాగద్వేషాదులు మొదలైన సుఖదుఃఖాదులు ఆత్మధర్మములని చెప్పుదురే గాని శ్రుతివాక్యానుభవములచేత యొప్పునవిగావు. ఆత్మ సర్వసాక్షిత్వముగుటచేత నవినంటవనుట శ్రుతి॥ జ్ఞానం వినాముక్తిపదం లభ్యతే గురుభక్తితః గురోః సామాన్యత్ సాధనం గురుమార్గిణాం॥ ఇత్యాదిశ్రుతులు చెప్పుచున్నవి. పరమాత్మ యహంకారాదులచేతను తన్ను దాదెలియకపోయినను బ్రహ్మజ్ఞానముచేత దెలియచేయబడుచున్నది. పరమాత్మ స్వరూపమునకంటె వేరె బ్రహ్మజ్ఞానము లేదు. శ్రుతి॥ అన్యథా జ్ఞానంనాస్తి॥ యని యున్నది గావున యన్యబోధేచ్ఛ మరియొక బోధజ్ఞానము కావలెననే కోరిక యక్కరలేదు. గాబట్టి సద్గురుముఖవివేకజ్ఞానముచేత తన్ను దాదెలియవలయును. ఇదియే ఆత్మయోగమని మహాఋషులు చెప్పియున్నారు.

సమాప్తము.



# శ్రీమహాఋషినిఘంటికత యోగశాస్త్రము.

## మనోయోగము.

—: వాల్మీకమహాఋషి భరద్వాజమహారాజునకు మనోయోగము బోధించుట. :—

మానవజన్మమెత్తినవాడు చేయవలసిన దేమనగ మనమందరము విచారించతగిన విషయమేను విచారించతగిన యేమనుష్యుడైన పుట్టినందుకు ముఖ్యప్రయోజనము మనుష్యునకు పశుపక్ష్యాదిక్షుద్రజంతువులకును గలభేద మే యిది. పూర్వోత్తరసందర్భములను విచారించి సరియని తోచునట్టి మార్గమునందు నడచుటకు శక్తి కలిగినవాడు ఉత్తమమైన మనుష్యుడు. పశుపక్ష్యాదుల కట్టి సమర్థత లేదు. అవి తాత్కాలికమున కేది యనుకూలమని తోచునో యాపనిని చేసి సుఖమునో దుఃఖమునో ననుభవించును. దీర్ఘాలోచన చేయు శక్తిగలవానికి లేదు. మనుష్యుడు ఈజన్మమునందలి సందర్భములను యోచించుటయే కాక మునుపటి జన్మముల సందర్భములను వెనుకటి జన్మముల సందర్భములను సహితము నాలోచనచేసిన వానికి తగినట్లుగ యిప్పటికి తన కర్తవ్యములను నిర్ణయించును. మానవుడుగా పుట్టినవాడు సాధించవలసినది పురుషార్థమని పరమపురుషార్థమని శిష్టాచార్యులు చెప్పియున్నారు. పురుషార్థమనగ పురుషు డపేక్షించదగినది. పురుషుడనగ దేహమందు నివసించును దేహముతో పనులుచేయుచు సుఖదుఃఖముల ననుభవించుచున్నవాడు. ఇందువలన పురుషుడన్న పేరుగలిగినది మనుష్యుడన్నపేరు యుత్తమప్రాణికోటికే చెల్లును. తాను దేహమాత్రుడనుగాను దేహమునిమిత్తకారణమైన దనగ ఉపకరణమాత్రమైనది. దేహియైన తాను తా నిచ్ఛానుసారముగ నడపు శక్తిగలవాడను నాకు కర్తవ్యం గోరునట్టి కార్యములను నేను చేయుట కుపయుక్తమైన సాధనము దేహము నని తన్ను దా దెలిసికొని పనిచేయువానిని ఆత్మపురుషుడని చెప్పుదురు. అనగ క్షేత్రజ్ఞుండు పురుషుడు మనుష్యులయందు అట్టి

జ్ఞానము ననేకముగా యుండుట లేదు యని యుపదేశించినను నాతత్వానుభవ మును దెలసికొనదగిన శక్తియు వారికుండుటలేదు. అట్టివారికి మనఃపరిపాక ము గలవారు కారనిన్ని ఉత్తమపురుషులని యెంచతగినది కాదు. అట్టివారు మానవులు కారని యెంచవచ్చును. ॥జ్ఞానేనహీనపశుభిః సమానః॥ అట్టివానికి నుపదేశించుటవలన ప్రకృతమున యోచనలేదు. కావున దేహవ్యతిరిక్తుడును తాను దేహమునకు ప్రభువును ఆత్మ పరమపురుషుడు తాను చెప్పినటుల వినదగినది దేహము యెవడు తన్ను దా దెలిసికొనుచున్నాడో యెవడు ఈ తత్వానుభవమును చెప్పినతోడనే తన్ను దా దెలియుటకు శక్తికలిగియున్నా డో నతడే పూర్వాసుడు నట్టివాడు నపేక్షింపతగినదియే పరమపురుషార్థము. పురుషార్థచతుష్టయమనగ ధర్మము అర్థము, కామము, మోక్షమని నాలుగు విధములు. పురుషార్థములను మనవారు విచారింపుచున్నారు. వీనిని రెండు భాగములుగా భావించియున్నారు. ధర్మార్థకామముల నొక్కటిగ చేర్చి దానికి చతుర్వర్గమని పేరు. త్రివర్గములను నపేక్షించువా రెవరు యను సంగతి విచారింతము.

ధర్మమనగ, యిహలోకమం దనుభవించతగిన సుఖాతిశయములకు సాధనమైన శాస్త్రములవలననే తెలియవలయును.

అర్థమనగ, సుఖదాయకమైన పశుపుత్ర కళత్ర హిరణ్యాది ద్రవ్య సంపత్తు.

కామమనగ, సుఖప్రదమైన మనోవృత్తి- మోక్షమనగ, బంధమునుం డి విడుదల అనగ, దేహసంబంధమువలన విడుదలను పొందుట మోక్షమని శాస్త్రమువలన దెలియుచున్నది. దేహబంధము తప్పించుకొని, తన నిజరూప మునందు స్థిరదృష్టి నిలిపి అనంతమైన బ్రహ్మానంద మనుభవింపగోరువాడు చతు ర్పదవుల నపేక్షించును. మోక్షమనుదానిని తెలియనివాడనగ, నజ్ఞానుడు. ఒకవేళ పూర్వజన్మ పుణ్యోదయమున తనుదా దెలసినను దేహేంద్రియముల ద్వారా రాదగిన సుఖదుఃఖముల నపేక్షించి, దానికి కావలసిన ధర్మార్థకామ ములను నపేక్షించును గాబట్టి యీ త్రివర్గములను సంపాదించుటకు వ్రతదాన పూజ ధర్మయజ్ఞయాగాది మొదలైన సాలోక్య సాయుజ్య సారూప్య సామీ ప్య స్వర్గాదిపదవులు గోరుటకు త్రివర్గములను నపేక్షించి యుండురు గాన, క్షేత్రజ్ఞుండైన వ్యవహారికజీవునకు పునర్జన్మ కారణమని శృతి స్మృతులు

వేదాంతశాస్త్రములు బోధించుచున్నవి. కాబట్టి, ముముక్షువుడైననో తనకు సహజముగానుండు సుఖము నపేక్షించి దేహసంబంధమువలన కలిగిన సుఖదుఃఖములను తప్పించుకొనుట యనగా, నిష్కామకర్ముడై కోర్కెలేనివాడై ఇహాముత్రార్థఫలభోగ విరాగుడై, దేహసంబంధములైన జన్మకర్మములను తప్పించుకొనుటకు ప్రయత్నించును. అతడు ఆముముక్షువు నిష్కామకర్మ చేయుచు బంధవిముక్తిమైనవాడు మోక్షసామ్రాజ్యసుఖము ననుభవించును. ఈరెండుతరగతులవారును బంధరహితమైన సుఖము నపేక్షించినవారైనను వారికి లభించు మోక్షసుఖమునందు తారతమ్యమున్నది. త్రివర్గముల వారికి ప్రకృతిపురుషునకు లభించు మోక్షసుఖము అనిత్యమనగ కొంతకాలమమాత్రమే యుండును. వానికి ఆ ప్రకృతి పురుషుడు నుపాసించు వర్గమును దానికి నాశనముకలదు. మోక్షమునుదానికి నాశనము లేదు. కావున మోక్షసుఖకాలమందు దుఃఖమను బీజముండును. ఈదుఃఖబీజమే జననమరణములకు కారణము. ఒకయింద్రియముద్వారా సుఖము ననుభవించునపుడు మరియొక యింద్రియముద్వారా దుఃఖము కలుగుటకు సిద్ధమైయుండును. కావున యీసుఖదుఃఖ సంబంధమైనదే జన్మగాన దేహేంద్రియములు పుణ్యపాపకర్మములు చేయుచుండును. ఈపుణ్యపాపములు ప్రకృతి పురుషుని నాశ్రయించి యున్నవి. ఇట్టి మోక్షసుఖము బాహ్యవిషయములచే కలుగుటవలన ఆయింద్రియములుండువరకు ఆసుఖముండును. విషయేంద్రియ సంపత్తి తక్కువైనప్పుడంతయు తక్కువౌను. విషయేంద్రియ ప్రకృతివ్యవహారికము మగుట చూచి మనస్సునందు దుఃఖము కలుగును. విషయేంద్రియ ప్రాకృతమున కనగ దేహము శుష్కించకమునుపే యింద్రియప్రీతిహాని లేకమునుపే ప్రాణవిరాగము కాకమునుపే పండితుండైన బ్రహ్మజ్ఞాని నాచరింపదగిన ప్రయత్నముముక్తికి యిల్లుకాలుచుండగ నుయ్యిత్రవ్వకుని యగ్నిచల్లారునన్నట్లు చల్లారదు. కాన నీరు నిలవయున్న నగ్నిచల్లారును కావున ప్రకృతి పురుషుడు త్రివర్గములను నాశ్రయించి యిహాఫల భోగముల నపేక్షించి విషయేంద్రియ సంయోగమువలన కలిగెడు భోగములు యవి అన్నియు దుఃఖమునకు కారణములే నవినశించునవి గాన మోక్షకాముడైనవాడు నిష్కామకర్మాచరణ చేయుచు కామరహితుడై బ్రహ్మసత్యం జగన్మిథ్యాయనే ఆత్మానాత్మ వివేకముగల పరమపురుషుడు కామ్యకర్మాచరణ విరక్తుడై మనోనిగ్రహు

విషయభోగ సుఖదుఃఖములవలన తృప్తుడు గాక శ్లో॥ అనిత్యాని శరీరాణి వైభ
వో నైవ శాశ్వతః। నిత్యం సన్నిహితో మృత్యుః కర్తవ్యో ధర్మసంగ్రహః॥ యను
నట్లును, ధర్మశృతి॥ అమేధ్యపూర్ణం క్రిమిజాల సంకులం స్వభావ దుర్గంధ
మశౌచమధ్రువం కళేబరం మూత్రపురీష భాజనం రమంతిమూఢా నరమంతి
పండితాః। యనునార్యోక్తినిబట్టి శృతి॥ మూఢాభావ మిదం జ్ఞాత్వానశరీరం
శాస్త్రిశేచలమ్। యనిత్రిప్రమాణములు చెప్పుచున్నవి. కాబట్టి దేహేంద్రియ
విషయములయందు కోరికలేనివాడై యిహాముత్రార్థఫలభోగ విరాగుడై మో
క్షార్థి అయినవాడు ధర్మార్థకామములను సాధించినను తన్నుతాదెలియు బ్రహ్మ
జ్ఞానికి మోక్షసుఖము నిత్యము నాశనము లేనిదియునై దననిజస్వరూపమనగ
స్వస్వరూపజ్ఞానానుభవము తాదెలసి బ్రహ్మైక్యభావము పొందియుండును. ఆత్మ
యింద్రియవిషయముల యందులో బడియున్నందున ఆత్మయందు సహజమైన
సుఖము లభించదు.

అపరమపురుషుడు బ్రహ్మమునందు స్థిరముగా మనస్సునిలిపి మనస్సు
మాయతను మాపు మూడు ఏకముచేసి బ్రహ్మైక్యసుఖమువం దవంతమైన
నిర్విషయానందసుఖమును పొందును. ఇట్టి బ్రహ్మానందమే పరమపురుషున
కు లాభము. (మనుష్యులలో) ప్రకృతిపురుషు లపేక్షించు ఐహికాముష్మిక
సుఖములకు తగిన సాధనములును శాస్త్రము విధించియున్నది. జ్ఞానవిహీనులై
నవారు తమ బుద్ధికి తోచినట్లుగ నడతురు. వారికి శాస్త్రాపేక్షలేదు. ధర్మా
ర్థకామములయం దపేక్షకలిగినవారు శాస్త్రము ననుసరించి నమష్ఠించతగిన
కర్మములకు కామ్యకర్మములనిపేరు. అట్టి కర్మమువలన నైహికఫలములైన
పసుపుత్ర హిరణ్యాదులను అముష్మికములైన సువర్ణాది సుఖములు లభించు
ను. శాంతా కనకాపేక్షగలవాడై యుండును. మోక్షకాములైనవారు సహి
తము నిష్కామకర్మ జేయవలసినవారని శాస్త్రములు విధించియున్నవి. ఐన
ను శాస్త్రవిహితకర్మలను ఐహికాముష్మికఫలములం దపేక్షయుంచి కర్మ
జేయువారుకారు. దేహబంధకములో చేరినవి. జననమరణ ప్రవాహరూపక
మైనవి. గమనాగమనములకు కారణమైనవి. కాబట్టి ముముక్షువులుచేయు
నిష్కామకర్మవలన దేహసంబంధమనే అభిమానము విడిచిపోగలందులకు
సాధనమైనవి. అందువలననే నిష్కాముడని యకర్తయని అభోక్తయని అసం
గుడని చెప్పుదురు. నిష్కామకర్మ చేయువారు కామ్యకర్మ చేయువారని

యెట్లు తెలియబడును. శారీరప్రరు వక టే విధముగా నుండురుగాన కొందరు నిష్కామకులు వారిమనస్సునందు భేదము గలిగేయుండును. ఫలాపేక్షయందు వారికి కర్మము కామ్యమౌను. అనగ, తనకోరిక చెల్లును. తానుచేయు కర్మ ఫలము తనకు చేరవలెననే అపేక్ష లేనివానికి కర్మము నిష్కామమగును. అట్టి వాడు చేయు కర్మఫలము లోకమునకు చేరు గాని తనకు చెందదు. వానికి దేహబంధకము చెందదు. కాన యీరీతిగా శాస్త్రవిధిప్రకారము తాను జేయ దగిన కర్మలన్నియు యీశ్వరునికి వినియోగపరచి లోకోపకారార్థమై బ్రహ్మ కర్మ సమారభేదుని బ్రహ్మార్పణంబు చేయుటవలన (నగగ) తన్ను దాదెలి యుటవలన తనకు గలదేహబంధకము క్రమక్రమముగా శిథిలమై నిజమైన బ్రహ్మైక్యజ్ఞానమనే సహజానందమును పొందును. శృతి: ఆనందో బ్రహ్మ తివ్యజానాత్॥ యనునట్లు బ్రహ్మానందమైయుండును.

శృతి॥ ఇహచ వేదీదథసత్యమస్తిన చేదిహావేదీన్మహతీవినష్టిః॥ ఇత్యాది శృతులు చెప్పుచున్నవి.

ఈవిధముగ మనుష్యులు మూడుతరగతులవారు గలరు. కేవలము నజ్ఞానులై దేహముమాత్రమే తానని భ్రమించి దేహముయొక్క యోగక్షేమ మునకే సర్వప్రయత్నములు జేసి సుఖదుఃఖముల ననుభవించువారు అధములు కొందరు దేహముమాత్రము తానుకాదని దేహమునకు జేరిన యొకయుపకర ణమని భావించి దేహేంద్రియములద్వారా తగిలి యింద్రియసుఖము నపేక్షిం చి యిహలోకమందు యనుభవించతగిన యింద్రియసుఖములు సాధనములైన కర్మలను శాస్త్రములద్వారా తెలిసికొని యా కర్మములనే జేయుదురు. అట్టి కర్మానుష్ఠానమువలన ననుకూలమైన అర్థకామములే నపేక్షించి సేవించెదరు. వీరు మధ్యమజాతివారు. ఉత్తమజాతివారు దేహేంద్రియములద్వారా లభించ తగిన ఐహికాముష్మిక సుఖముల నిత్యము దుఃఖమిశ్రమములని దెలసికొని దానినపేక్షించక నిత్యమైన బ్రహ్మైక్యాను సుఖమునందే మనోమారుత దృ ఢ్క్కలునిలిపి, దానిని పొందుటకు శాస్త్రోక్తమైన మార్గమునందే నడతురు. ఈమూడుజాతులవారును త్రివర్గములను నపేక్షించువారైనను వారి వారు ననుష్ఠించు మార్గములు వేరువేరుగానుండును. ఉత్తమజాతి మనుష్యుడు మోక్షము నపేక్షించి లోకహితముకొరకే త్రివర్గములను నపేక్షించు మధ్య ముడు తనయొక్క ఐహికాముష్మిక సుఖములకొరకే వానిని స్వీకరించుదురు.

ధర్మమునందు యుత్తమమధ్యమ జాతులవారికి మాత్రమే నివృత్తి గలుగును. మధ్యముడు కామ్యకర్మములజేసి వాని ఫలము యిహపరలోకములయందు కొంతకాల మనుభవించి తీర్చుకొనుచుండును. ఉత్తముడుచేయుకర్మలు లోకహితార్థముగా పరిణమించుచుండును. వానిబంధకమును విడిపించి నిత్యమైన బ్రహ్మైక్యానుభవమనేసుఖము వాని ననుభవమున నుండునట్లుచేయును. ఇట్టి యమనస్కరాజయోగ బ్రహ్మైక్యానుభవమే ముఖ్యధర్మము. అందువలననే మహాఋషులందరు యిట్లు చెప్పిరి.

అమనస్కరాజయోగ బ్రహ్మైక్యానుభవముచేత ఆత్మదర్శనము చేయుటయే యోగాదిధర్మములలో పరమధర్మము. పరమాత్మ దర్శన స్వరూపదర్శనమే ఆత్మలాభము. స్వలాభము దాని సారమను యోగము.

యోగమునకు అంగమైనది నిష్కామకర్మ. అట్టి కర్మానుష్ఠానమువలననే మోక్షమనెడు పరమపురుషార్థము సిద్ధించును. గీతలయందు॥ ఉత్తమపురుషస్త్వన్యపరమాత్మేత్యుదాహృతః క్షరాక్షరాభ్యాం విలక్షణః॥ యని శ్రీకృష్ణభగవానులు చెప్పియున్నారు. కావున యోగస్వరూపమనగ విచారింతము. సర్వాంతర్యామియై అన్నిపూసలయందుదారమట్లుగనే సర్వంబు నొక్కటియైనదని యెరుంగుట యోగము. వేదశృతి॥ శివాయవిష్ణురూపాయశివరూపాయవిష్ణవె సర్వం పరిపూర్ణమస్థి॥ అంతః పూర్ణబహిర్ పూర్ణం పూర్ణంకుంభ ఇవాంబరే॥ అంతర్ బహిశ్చ యోత్సర్వం నారాయణోహరిః॥ యని శృతిప్రమాణంబులు చెప్పుచున్నవి. ఇట్లు నిశ్చయజ్ఞానముగలవాడె యోగియగును. వాడు సర్వసమబుద్ధితో లోకమున వర్తించును. దేహేంద్రియ విషయంబులచే మనుష్యుని మనంబు సుఖదుఃఖంబున బొందుచుండుటచేత నిశ్చలముగానుండుట దుర్లభముగాదా దుర్లభమైనయెడల సర్వసమత్వభావము గాంచిన మనస్సు చెలింపకుండా యుండునేమో. ఇది యిట్టిదగుటచే మహాఋషులు యివ్విధమున మొదలిడిరి. ఏయోగంబున జంచలతలేని మనంబు సమముగా నిలిచియుండవలయునని ఋషిపుంగవులు చెప్పియుండిరో ఆయోగంబునకు మనంబు చంచలంబగుటజేసి దానిని స్థిరంబుగా నిలుపు టనగ మనస్సు హంస దృక్కు యీమూడున్ను ఏకముచేయుట సాధ్యముగాదని తోచుచున్నది. కావున మనస్సు చంచలంబును దేహేంద్రియక్షోభకరంబును బలవంతంబును దృఢంబును నైనది. కావున శృతి॥ మనమేవ మనుష్యాణాం కారణం బంధ

మోక్షయోః॥ ఇత్యాదిశృతిప్రమాణాబులు చెప్పుచున్నవి. అట్టి మనస్సుని గ్రహించుట మహాదుస్తరంబని చెప్పిరి. వాయువును బంధించుట యెంత దుస్తరమో అట్టిమనస్సు బంధించుట దుస్తరంబని తలంచెదను. మహాఋషులు ఇట్లు చెప్పుచున్నారు. మనంబు చంచలంబును నగుటచేత నిగ్రహించుటకు శక్యంబుగానిదియు ననుటకు సందియము లేదు. ఐనను నభ్యాసయోగము వలనను వైరాగ్యమువలనను నిగ్రహింపవచ్చును. నిశ్చలమైనచిత్తము నిలుపనివాడు యోగంబుజెందుటకు శక్తుండుగాడని నాయభిప్రాయము. నిశ్చల చిత్తముగలవానికో విమనక ప్రయత్నముచేయువానికి యోగంబు సూక్ష్మంబుగ బొందదగును.

శ్రీరామహృదయమందు శ్రీఆంజనేయులవారికి శ్రీసీతాదేవి తారక యోగము యుపదేశించినది. ఈశ్వరుడు పార్వతీదేవికి తారకయోగము బోధించెను. శ్రీరాములవారు సాంఖ్యయోగము అమనస్కయోగము సాధించుటకు కారణములు యుపదేశించెను. తారకయోగము చిత్తవిశ్రాంతియు చిత్తశుద్ధియు, మనస్స్థైర్యము, నగునని యోగమునందు చెప్పుచున్నారు. యోగంబు ముఖ్యసాధనంబు గావున బ్రహ్మజ్ఞా॥ నిష్కామకర్మయోగము ననాయాసంబున సాధించవచ్చును. శ్లోకం॥ నిష్కారణము నిరీహము నిష్కంపము నిష్క్రియంబు నిష్కల్మషము నిష్కళము నిష్కళంకము నైష్కర్మ్యప్రాప్య నిర్గుణబ్రహ్మముగును॥ శ్రీరాములవారు చెప్పిరి. కావున ఇట్లనే ఈశ్వరుడు కూడా చెప్పియున్నారు. కాన యనాయాసంబున గ్రహింపవచ్చును. పుష్పము గోయుట కెంతసులభమో కనురెప్ప మూయుటకు యెంత నతిసూక్ష్మంబుగ యీయోగము నైష్కర్మ్యనిర్గుణ బ్రహ్మ సాక్షాత్కారయోగము ఆత్మానాత్మవివేకము గలవాడు ననాయాసంబుగ సాధించవచ్చును. మహాత్మునకు గాఢదుర్లభముగా తోచబడును. ఆంజనేయులు సప్తవారిధుల దాటి లంకాపట్నం అనాయాసంబున దాటెను అతి సూక్ష్మబుద్ధిగలవాడికి యెంతకఠినమో అంత నతిసూక్ష్మముగ దెలియబడును. సప్తపర్వతములు యచ్చనగాయలవలె యెగరవేయుట వారధి గట్టుటకు యెంత కఠినమో అంత సులభముగాయుండ యచ్చనగాయలవలె యాడుట యెంత యనాయాసమో అట్లనే మహాకఠినముగాను వివేకజ్ఞానము గలవానికి అతిసులభముగా తెలియబడును. కాబట్టి యోగమనగ మనోనిగ్రహమనిన్ని చిత్తవిశ్రాంతియనిన్ని బంధవిముక్తిమైనదే

మోక్షమనిన్ని యోగాభిప్రాయము గావున యోగమనగ కర్మయోగము నిష్కామకర్మయోగము జ్ఞానయోగము తారకయోగము అనియోగములు చెప్పియున్నవి. నిష్కామకర్మయోగము ఆత్మవిచారణ ఇదే జ్ఞానయోగము ఆత్మానాత్మవివేకము తారకయోగము తన్ను తా దెలియుట తారకమనగ జీవుడా, పరమాత్మా యని తన్ను దా దెలియుట తారకయోగము. నిష్కామకర్మ యోగమే యిహాముష్మార్థ ఫలభోగవిరాగము, తారకము, గావున యింద్రియనిగ్రహమే గాక మనోనిగ్రహము విరాగమేగాక యనుభవము సంకల్పవికల్పనలతో యున్న మనస్సున్ను, హంసయున్ను సర్వప్రపంచస్వరూపంబైన దృక్కు-యున్ను యీమూడున్ను పరమాత్మయందు లీనముచేయుట యోగ మనబడును. దీనినే అంతర్ యోగమని నిష్కామయోగతారకయోగ జ్ఞానయోగమని మహాఋషులు చెప్పియున్నారు. కాబట్టి, మూఢాత్ములకు గ్రాహచారయోగము, ప్రారబ్ధయోగము, కర్మయోగము, సంకల్పయోగము యని యీనాలుగువిధముల యోగములకు పాటుపడుదురు. యీనాలుగు యోగములు మానవులకు ప్రధానమై యున్నవి. కావున నిత్యవిధిగా ననుభవించక తీరదని నాయభిప్రాయము భౌరకునుడు భీష్ములవారు భక్తియోగమని ఏకాంతయోగమని, అనన్యయోగమని మూడుభాగములుగా చెప్పియున్నారు. యీమూడుయోగములు చిత్తశుద్ధి, మనోనిగ్రహము, బ్రహ్మైక్యమని చెప్పిరి.

శృతి॥ ఏకద్వైతదక్షరంగార్గి బ్రాహ్మణాఽభివదని॥

శృతి॥ వాక్యం॥ అస్థూలమనణ్వహ్రస్వమ్॥

శృతి॥ యోహవైతద్భగవన్ మనుష్యేషు ప్రాయణా నమోంకారమభిధ్యాయీతకతమం వావస తేనలోకం జయతీతితస్మైస హోవాచైతద్వై సత్యకామ పరంచాపరంచా బ్రహ్మయదోంకారః॥

శృతి॥ అప్రాణాత్తత్తాపిహిద్రుష్టమ్॥

శృతి॥ యఃపునరేతంత్రిమాత్రేణామిత్యేతేనైవాక్షరేణపరం పురుషమభిధ్యాయీత॥

శృతి॥ అన్యత్రధర్మాదన్యత్రాధర్మాత్॥

శృతి॥సర్వవేదాయత్పదమామనన్తితపాంసిసర్వాణిచయద్వదన్తియదిచ్ఛన్తో బ్రహ్మచర్యంచరన్తి తత్తేపదగ్ంసంగ్రహేణ బ్రవమ్యోమిత్యేతత్॥

గీత॥ కవింపురాణ మనుశాశితారమ్॥ అ ౮ శ్లో—౯—

గీత॥ యదక్షరం వేదవిదావదంతి॥

శ్రుతివాక్యం॥ ఏతావాన్వైకామో నేత్సంశ్చి నాతోభూయో విందేతస్మా దప్యేతర్హ్యేకాకీకామయతే జాయామేస్యాదథ ప్రజాయేయాథ విత్తం మే స్యాదథ కర్మకుర్వీయేతి సయావదప్యేతే షామేకైకం నప్రాప్నోత్య కృత్స్న ఏవతావన్మన్యతే తస్యోకృత్స్నతః॥

శ్రుతివాక్యం॥ ఆత్మావైపుత్రనామాసి॥

ఉత్ఖాతం నిధిశంకయా క్షితితలం ధ్మాతాగిరేర్ధాతవో నిస్తీర్ణస్సరితాం పతిః క్షితి భుజోయత్నేన॥

శ్లోకం॥ మనోద్వివిధం ప్రోక్తంశుద్ధం చాశుద్ధమేవచ అశుద్ధం కామసంకల్పం శుద్ధం కామవివర్జితం మనఏవమనుష్యాణాం కారణం బంధమోక్షయోః॥ మనస్సుద్ధమనియును నపరిశుద్ధమనియును రెండువిధములు. కామసంబంధము నపరిశుద్ధమనియును కామవిహీనం శుద్ధమనియు చెప్పియున్నది. మనస్సేజీవునకు బంధమోక్షములకు కారణము. మనస్సువిషయములయందు నాసక్తిగలిగినప్పుడు బంధకారణమవును. నిర్విషయమైనచో అనగ విషయములయందు విరక్తిని బొంది విషవిముక్తుడైనపుడు పరమేశ్వరాయత్తమైనపుడు మోక్షకారణమనియును శ్రుతులుచెప్పుచున్నవి. ఇట్లు జీవునకు బంధమోక్షముల రెండింటికిని, కారణమైన మనస్సువిషయమై విచారింతము అనగ తన్నుతా విచారింతము. తాను యెవరోదెలిసికొనుట జీవన్ముక్తియని మహాఋషులు చెప్పుచున్నారు గావున ఈమనోయోగము నిత్యము నిర్మలమైనయోగముచేత ననుష్ఠించవలయును.

గద్య. ఇతి శ్రీభీమనిరంజన నిగమాగోచర గురువర కరుణాకటాక్ష వీక్షణాయత్త చిత్త చైతన్యజగజ్జేగీయమాన ప్రకర్షితాత్మితనై సచ్చిదానంద గుణగణాతీత వేదవేదాంగమంత్రమతార్థ శ్రీమద్గురు పాదుకాపూర్ణదీక్షాపక్ష దక్షత్వ శుద్ధనిర్గుణ నిజబోధపరాయణాపారీణ పారాయణధురీణ అజ్జరపుసూర్య నారాయణాఖ్య విరాజమానప్రభాసిత ప్రజ్ఞాప్రకర్షితప్రబోధితనై వేమూరివంశపయఃపారావారరాకా సుధాకరస్య కౌండిన్యసగోత్ర వీరయభాగమాంబా గర్భకనిష్ఠజనిత హారితసగోత్ర సౌభాగ్యవతి సామ్రాజ్యభోజవిద్యోపాసనా పరప్రసాదకవనాకవిత కాట్రపులపల్లి సూర్యనారాయణయోగినీ ప్రణీతంబగు శ్రీమహాఋషి నిఘంటితయోగశాస్త్రే బ్రహ్మవిద్యాయాం ఆత్మయోగము మనోయోగముపంచమ ప్రకరణంసమాప్తము.



# శ్రీ మహాఋషి నిఘంటీకృ ంహాగశాస్త్రము.

## షష్ఠప్రకరణము.

## ఆత్మజిజ్ఞాస.

—। దేవకన్యక నీలవర్ణమహారాజునకు ఆత్మజిజ్ఞాస బోధించుట ।—

ఈఆత్మజిజ్ఞాసయోగమునందు, జీవ, పరమాత్మతాదాత్మ్యంబును జగన్మిథ్యాత్వంబును ప్రతిపాదితంబు లగుటంజేసి ఈప్రకరణము అద్వైత పరముగా వ్రాయడమగును. శ్రీధరోపనిషత్ వ్యాఖ్యానమునందు॥ యదేతి యథా మనస ఉపరామః సమాదిః తథా నామరూపే రూప్యతే యేనతత్తథా తస్య ఉపరమే హేతుః దృష్టం దర్శనం, శ్మృతిశ్చ త్రియోసం ప్రిమోషాత్ నాశాత్ తదా యః కేనవేన స్వరూపజ్ఞానేన ప్రతీయతే తస్మైహంసాయ శుద్ధాయశుచిః, శుద్ధం, మనః, సద్మ, ప్రతిష్ఠానం యస్యతస్మై నమః॥ మరియు, ననేకవిధ నామనామరూప నిరూప్యంబగు మనంబునకు దృష్టస్మృతుల నాశనంబువలన గలిగెడు నుపరామంబగు సమాధియందు కేవల స్వరూపజ్ఞానంబు నదోచు నిర్మల ప్రతీతిస్థానంబైన పరమహంస స్వరూపమునకు నమస్కారము. ఈతత్వఘట్టమునందు అద్వైతపరముగ చెప్పబడును. వ్యాశోపనిషత్తు॥ భాష్యం॥ పురుషస్య-కుశలం- ధర్మమితర- మధర్మంవా- ఆతనోతి కైః- చేతోభిః జ్ఞానేంద్రియైః- ఆకూతిభిః- కర్మేంద్రియైశ్చ- తతధర్మాధర్మవాసనాయుక్తం- తదేవానేకదేహాదివైచిత్ర్యం కరోతీవ్యాహ- సఇతి తన్మన-ఇత్యర్థః వాసనాయుక్తం- ఆత్మోపాధిత్వాదాత్మా॥

పరమపురుని చిత్తంబు- త్రిగుణముల జెందెనేని యంతకాలము జరిగినధర్మంబు నిజమును అధర్మము, అనిత్యమనునట్లు ఆప్రకారము- విజ్ఞాన కర్మేంద్రియములచే జిక్కి- మరగి- తగిలి- పుట్టించుచుండు అత్యంతమహిమ గావున పంచతన్మాత్ర విజ్ఞానకర్మేంద్రియములలో జిక్కి- సృష్టించుచుండు అత్యంతమహిమలు చిత్రవిచిత్రములగు వుత్పత్తి స్థితిలయములు గావున

మనోవృత్తుల నతిక్రమించిన జీవుండు పరంజ్యోతి యైనపరబ్రహ్మ స్వరూపంగా నెరుంగవలయు. ఈశ్వరుండు సర్వభూతాంతర్యామి యగుచు జీవాత్మ స్వరూపంబుననుండు అనగ- ఆవరణ విక్షేపరూపంబులు యనేకంబులుదాల్చి వ్యవహారిక జీవాత్మస్వరూపంబున నుండు నంత ॥ బ్రహ్మసత్యం జగన్మిథ్యా॥ బ్రహ్మంబొక్కటియే సత్యంబు జగత్తసత్యం- యిట్లువ్యాసోపనిషత్తునందు చెప్పంబడియున్నది. సంస్కృతభాగవతంబున యిట్లు వర్ణించుచున్నది.

బుద్ధేర్జాగరణం స్వప్నం- సుషుప్తి రితిచోచ్యతే మాయామాత్రమిదం రాజన్నానాత్వం ప్రత్యగాత్మని యథా జలధరా వ్యోమ్ని భవంతి నభవంతిచ బ్రహ్మణీదంతథా విశ్వమవయ వ్యుదయాప్యయాత్॥ అన్యోన్యాపాశ్రయాత్సర్వమాద్యంతవ దవస్తుచ- నానాత్వం ఛిద్రయోర్యద్యజ్యోతిషోర్వాతయోరపి-యథా- హిరణ్యంబహుదా సమీయతే- నృభిః క్రియాభిర్వ్యవహారవర్త్మసు- ఏవంవచోభిర్భగవానదోక్ష జోవ్యాఖ్యాయతే- లవుకిక వైదికైర్జనైః॥ స్వప్నజాగరణ- సుషుప్త్యవస్థా భేదం॥ ఆత్మనుయాబై- బుద్ధియుక్తంబైన మాయయై- యోగమాయయై యోగంబనుబరిణమించు- ప్రాణిజాతంబున ఈశ్వరునందు లయోదయంబులగును. ఈజగం బన్యోన్యాపాశ్రయంబై- యాద్యంతవస్తువై వర్తించు ఒక్కతేజంబు బహురంధ్రంబుల గానంబడు తెరంగున నొక్కపరమాత్మను పెక్కువిధంబులుగా భావింతురు. హాటకంబు పెక్కురూపంబులయ్యు నేకంబైనతెరంగున పరమాత్మ నొక్కటిగా భావించి- అనగ- బంగరంవక్కటై శృంగారము లనేకములైనభంగి పరమాత్మండు అఖిల ప్రపంచమయుడై భాసిల్లునట్లవుటచే తానొక్కడై పరబ్రహ్మంబు నిత్యమని బ్రహ్మసత్యం జగన్మిథ్యాయనె వేదప్రమాణంబులు బల్కుచున్నవి.

కాబట్టి జాగ్రిత స్వప్నసుషుప్త్యవస్థలు బుద్ధిధర్మంబులగు ప్రత్యగాత్మయందు నానాప్రకారములన్ దోచు నీదృశ్యప్రపంచమంతయు మిథ్యయని తెలియుము. ఒక్క తేజంబు బహురంధ్రంబులం గానంబడు వడుపున నొక్కయాత్మయే పెక్కువిధంబుల దోచుచుండు. హాటకంబు పెక్కురూపంబులు గలదైనబంగారం వక్కటై శృంగారము లనేకములైనభంగి నేకంబైన తెరంగున పరమాత్మండఖిలప్రపంచమయుడై పరమాత్మ వివిధచేత నాచేతన శరీరములయం

దుపెక్కువిధంబులంగనంబడిన నేకంబుగ భావింపవలయును. ఈయభిప్రాయ ము సువ్యక్తముగ అద్వైతపరముగ చెప్పుచున్నది.

సూతసంహితయందు శ్లోకం॥ మనసావచసాదృష్ట్యా దృశ్యతేన్యైరపీంద్రియైః- అహమేవ-నమత్తొన్యదితి బుద్ధ్యధ్వమంజసా॥ అను యీశ్లోకమందు- పంచేంద్రియములకుదృష్టంబైన పదార్థం బనిత్యంబు గావున గీతాభాష్యం॥ సర్వధర్మాన్ పరిత్యజ్య॥ గీతావచనాత్॥ నేతి, నేతీతి, నేతీతి, శేషితంపూర్ణ ముచ్యతే॥ నేతీతి మహావాక్యానుసారము సర్వము తాను గానని మిగిలిన శేషము తానేయని తాను పరమాత్మయనిన్ని చెప్పుచున్నవి. ఎట్లనిన ప్రత్యగాత్మయందు నానాప్రకారములుగ దోచు నీదృశ్యప్రపంచ మంతయును మిథ్యయని తెలియుము. ఇట్లు ఆత్మస్వరూపునిగా సర్వము మిథ్యయని సర్వము తాగానని పంచవింశతితత్వములు నిషేధించి సర్వధర్మమర్మకర్మములు పరిత్యజించి తాను ఆత్మస్వరూపునిగా భావించట విశేషము బ్రహ్మైక్యాను సంధానము సూతసంహితయందు॥ ఏవమాత్మాన మాత్మస్థ మాత్మనైవామృశప్రభో॥ శ్రీమన్ నారాయణమూర్తియైనహరిని ఆత్మస్తుగాజేసి స్వఆత్మానం- భవతి-తానే ఆత్మస్తుగాదెలసి తన నిజాకారమును మనంబునతాదెలసి—

శ్రీధరవ్యాఖ్యానః తత్వఘట్టమందు శ్లోకం॥ ద్రవ్యంకర్మచ కాలశ్చ స్వభావోజీవఏచ॥ వాసుదేవాత్పరో బ్రహ్మసత్వనోర్థోసత్తత్వతః॥ వ్యాఖ్యానః॥ ద్రవ్యం-మహాభూతాని- వుపాదానరూపాణి- కర్మజన్మ నిమిత్తం-కాలః- తతః క్షోభకః స్వభావః॥ తత్పరిణామహేతుః॥ జీవోభోక్తా వాసుదేవాత్పర అన్యోర్థోనాస్తి॥

మరియు ద్రవ్యంబులైన మహాభూతంబులును దేహమునకు ప్రధానమై ఆధారమై హేతువై కారణమైన మహాభూతంబులు జన్మనిమిత్తంబులైనకర్మంబులును గర్మక్షోభకంబైన కాలంబును ఆపరిణామహేతువైన స్వభావంబును భోక్తయైన జీవుండును వాసుదేవుండుగా నెరుంగుము. వాసుదేవుండు నారాయణుండుగా నెరింగి॥ నారాయణాత్పరంవస్తు తస్మిన్ నాహం- కదాచ॥ అట్టి నారాయణస్వరూపుండైన ఆత్మవ్యతిరిక్తంబు లేదు. శ్రీధరవ్యాఖ్యానః॥ శ్లోకం॥ శశ్వరూపమహాసైవః షిద్ధభేదమోహాయ- బోధదిషణాయ- నమః- పరస్మై- విశ్వోద్భవస్థితిలయేషు-నిమిత్తలీలారసాయతేనమః॥ఇదం, చక్రమేశ్వరాయ- సవ్యాఖ్యానః॥ స్వరూపమహాసైవ- స్వరూపచైతన్యనైవ- బోధః- విజ్ఞానం ఏవదిషణం

ఆశ్రియం యస్య విశ్వస్య సృద్భవాదిషు నిమిత్తం మాయా తస్యాః లీలావిలాసః తయాసహాఇతిరాజక్రీడా భాగవతః సంస్కృతః తవిలిశశ్వత్స్వరూపచైతన్య భూరిమహిమచేత నపాస్తసమస్తభేదమోహుండవు నఖిలవిజ్ఞానమునకు నాశ్రియుండవగు నీకు మ్రొక్కెద నోపరేశా॥ జనన స్థితి లయములు అనయంబును హేతుభూతమగు మాయాలీలచు జెందినట్లన సలిపెడు పరమాత్మకు నీకు నభివాదనముల్॥ శ్రీధరవ్యాఖ్యానః- సంస్కృతభాగవతః॥

శ్లోకం॥ అద్ధేహ్యావిద్యమానేపి సంసృతి-ననివర్తతే-మనసాలింగరూపేణ స్వప్నే విచరతోయథా। సవ్యాఖ్యానః॥ ననుతహి। అజ్ఞానవిలశితత్వేన సంసృతిహేతోర్దేహ రస్యసత్యత్వా కింతన్నాశన్నివర్తన ప్రియానేననతత్రాహ అర్ధేహీతి లింగరూపేణ ప్రపాధిభూతేన॥

హేరాజా వినుము. స్వప్నంబుచందంబున నజ్ఞానజాతమై విసితంబగుటజేసి తివిరి- మిథ్యాభూతదేహాదికమునకు నరయ- నివర్తనాయా సమేటికని యంటివేని యు నస్థంబు లేకున్న నద్ధిసోపాధికంబైన మనము దేహాభవదీయసంకల్పాధీనంబైన శరీరంబులందు బ్రవేశించియున్న జీవసమూహంబు నీకు శేషభూతంబని తన్ను తా దెలసి కృతార్థులగుదురు. సచరాచరవస్తుజాతంబులకు నంతర్యామివై సర్వంబు నీవయై యుండుట దెలియలేక అనిత్యంబని విపరీతబుద్ధిని దెలియుదురుగాని, కొందరు జగద్భరితుండవనిన్ని జగద్రూపుండవనిన్ని నైకు తవాసుదనిన్ని గటకమకుటకర్ణికాదివివిధభూషణభేదంబులచే కనకంబు నిజస్వరూపంబు విడువక వర్తించు చందంబున జగద్వికారానుగతుండయ్యును. అనగసర్వేంద్రియసమన్వితుండును, నిఖిలహేయకళ్యాణగుణాత్మకుండవై యుందువని ఆత్మవిదులైనవారు తెలియుదురు కాని, ప్రాకృతులు తన్ను తా తెలియజాలరు. అట్టి జీవులు దేవతిర్యఙ్మనుష్యస్థావరాదిశరీరంబులలో జొచ్చి శ్రుతి। అణోరణీయాం మహతో మహీయాం॥ అనునట్లు, అణురూపులై యుందురు. అందును తాను యుండి తదంతరాత్మవై యుందువు. కావున సకలచేతనాచేతనాంతర్యామివైన సర్వేశ్వరుండు సర్వశబ్దవాచ్యుండు సకలబ్రహ్మాండనాయకుండైన తనయందు శ్రుతులు ముఖ్యవృత్తిగా ప్రవర్తింపుచున్నవి. కాబట్టి శ్రుతి। మాయాత్మవిశిష్టుండవై యున్న గార్యకారణాత్మకుండవై॥ శ్రుతి॥ కార్యోపాధిరయం జీవః కారణోపాధియీశ్వరః॥ కార్యకారణములకు విలక్షణుండవైయున్న నీవు—ఇట్లు జీవర్బహు

త్వానురూపత్వ శేషత్వములు॥ శృతి। కార్యకారణతాం హిత్వా పూర్ణబోధో వశిష్యతె గీతాభాష్యే॥ యీశ్వరుని జగదూప తత్వము చిద చిద్విసిష్ఠము శేషిత్వము విలక్షణత్వము సాక్షిత్వము శరీరభూత చిదచిదాత్మకత్వము సర్వ శబ్దవాచకత్వము ఈశ్వరతత్వమందు విశిష్ఠాద్వైత తత్వమందు శృతులు చెప్పు చున్నవి. కాబట్టి, సకలకర్మత్యాగ సరణినొప్పి ఆత్మతత్వజ్ఞానమునందు సాక్షి తత్వము శేషించియున్నది. కర్మబద్ధులైన జీవునకు జన్మకర్మకారణంబగును. కాబట్టి సర్వకారణంబగు పరబ్రహ్మము చతుర్వేదములయందును ననేక భంగుల నెన్నబడియున్నది. ఇందులకు ప్రమాణములు శృతులు ననేకంబులు జెప్పుచున్నవి. ఎట్లనిన యీమాడ్కి ననేక ప్రమాణంబు లనంతంబులు ఆమ్నాయంబులు పురాణేతిహాసస్మృతులందును గానంబడుచున్నవి. ఈ అభిప్రాయము ప్రాకృతజనులకు దురవగాహంబై యున్నది. కాబట్టి గొన్ని దృష్టాంతరంబులు శృతిస్మృత్యుపనిషద్ భాష్యసూత్రములు ఆత్మనిరూపణ జేయుచున్నవి.

శృతి॥ ఏకోవశీ సర్వభూతాంతరాత్మ ఏకం రూపం బహుధా యఃకరోతి తమాత్మస్థం యేనుపశ్యంతిధీరా స్తేషాం సుఖం శాశ్వతన్నేతరేషాం ఏకోదేవస్సర్వభూతేషు గూఢ సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా కర్మాధ్యక్ష సర్వభూతాధివాస సాక్షీచేత కేవలోనిర్గుణశ్చ ఏకోనారాయణో నద్వితీయోస్తి కశ్చిత్ ఏకవవశ్శివో నిత్య స్తతోన్యత్సకలం మృషా బహునాత్రి కిముక్తే న సర్వం బ్రహ్మమయం జగత్॥ ననేక భేదభినస్తు క్రీడతే పరమేశ్వరః॥ కావున ఆత్మజిజ్ఞాస కలిగి తన్ను తా దెలసిన జిజ్ఞాసాపరులకు తత్వోపదేశమును యొసర్చుచుంటిరి. యాజ్ఞవల్క్య జనకసంవాదమందు, బృహదారణ్యోపనిషత్ నందు చతుర్థాధ్యాయతృతీయబ్రాహ్మణమునందు ఆ ప్రపనిష వాక్యముల నుదహరించుచున్నవి. కాబట్టి ముందు వ్రాయబోవునవి ఏమనగ ఆత్మజిజ్ఞాసయు జీవజిజ్ఞాసయు బృహదారణ్యోపనిషత్॥ భావాభావద్వయంత్యక్త్వానిరాకాశస్థితిర్భవ॥ సర్వేంద్రియ వినిర్ముక్తం॥ జ్ఞానయత్రవిలీయతె॥ తత్రజ్ఞాన విశృజ్యే సమాధితస్యలక్షణం॥ నిత్యం నిరామయం పూర్ణం॥ నిరంజనమనామయం॥ నిర్ద్వంద నిర్భయం లింగం వస్తుమదహితంనమః॥ భేదాభేదవివర్జితం॥ నిజనాద మోదవినాశకం॥ అప్రమేయమనంత మప్రతర్క్య మకల్మషం॥ సాధ్యసాధకవర్జితం పరిపూర్ణమద్వయమవ్యయం॥ కార్యకారణహీనమచ్యుతమాది దైవమనా

మయం॥ పంచకోశవినిర్ముక్తం పంచదేహావివర్జితం॥ పంచభూతాది సంగత్వం సవ్వపరమశ్శివః॥ యత్రివ్యోమాదికం నాస్తిత్రియమాయాన విద్యతే తత్రిజ్ఞానాదికం నాస్తి తల్లింగమచలంభవేత్॥ ఇత్యాద్యుపనిషత్ ప్రమాణములు బల్కుచున్నవి. కాబట్టి యింకా కొన్ని శృతిప్రమాణములు వ్రాయనైయున్నవి. నిరాలంబోపనిషత్॥ ఆత్మానాత్మవినాశహేతుమనిశం సర్వాతిరిక్తం శుభం పూర్ణాత్పూర్ణ మనామయం సుఖతరం సర్వాపదద్వంకం సర్వజ్ఞాన జ్ఞాన వినాశకం గురుపదం గురుపదం సర్వాత్మకం నిర్మలం॥ సర్వసర్వభ్రాంతి వివర్జితం గుణహారం సంపూర్ణబోధం నమః।

ఈశ్లోకమునందు పరబ్రహ్మమును నిత్యునిగా విశేషించి చెప్పియున్నారు. నిత్యుడనగ కాలత్రయములందు యుండువాడని అర్థము. ప్రపంచము కాలత్రయములయందు యుండునదిగాదు. కావున యనిత్యమని యర్థము. ఇట్టి పరమాత్మను గూర్చి నిరంతరము విమర్శింపవలయునని చెప్పుటచేత ఆత్మజిజ్ఞాస నిరంతరము విమర్శింపవలయును. కావున పతంజలియోగశాస్త్ర సూత్రయోగములయందు చెప్పిన బ్రహ్మసూత్రమ్॥ సతుదీర్ఘకాలనైరంతర్య సత్కారాసేవితో దృఢభూమిః॥ యను సూత్రార్థము నిచట గ్రహించునది. కాలత్రయములయందుండునట్టియు ప్రపంచాతీతమైనట్టియు స్వప్రకాశమైనట్టియు ఆత్మజ్ఞానరూపమును సర్వకాలానంద స్వరూపమగు పరబ్రహ్మమె నేనను భావన సకలవిధకర్మలను విద్యుక్తముగ విడిచి చిరకాలము విడవక చేసిన జిజ్ఞాసచేత గాని కలుగదనియు మహాత్ములైన పెద్దలు సూచించియున్నారు. పరబ్రహ్మనుగూర్చి జిజ్ఞాస చేయవలసిన విధి యెట్లనిన, వాసనాక్షయాంతరము గాని బ్రహ్మనిష్ఠ గలుగదు. వాసనాక్షయమనగ- మరియుపాయాంతరములను వివరించుచున్నారు. ఎట్లనగ దంబము- దర్పము- కపటము మున్నగు నసురవాసనలు లేక నసించిన మనస్సు కలవాడై సుఖదుఃఖముల ననుభవించుచుండును. ముందువెనుకటి సందర్భముల జ్ఞాపకములేకనే త్వరగ కలిగినది. దంబము దర్పము మొదలైన చిత్తవృత్తులకు కారణమై మనస్సునందుండు సంస్కారవిశేషము వాసనయని యెరుంగవలయును గదా జన్మాంతర కర్మానుభవముచేత మనస్సునందు వసియించియున్నది. కావున, వాసన యను పేరుగలిగినది. ఇట్టి వాసనకు నాశన మనునది అమానిత్వము దంబత్వము మున్నగు దైవవాసనలు గలుగుటయే ఆత్మానాత్మ

జ్ఞానముచేత దైవవాసనలు జనించును. వానివలన బాహ్యనిమిత్తమువలన కలిగెడి దమమున్నగునవి కలుగజాలవు. ఇదియే వాసనాక్షయము. మనోనాశంబుగాకున్న బ్రహ్మానందానుభవంబు గలుగునే. అనాయాసంబుగ ఈ యానందాంబుధి నోలలాడకయె కలుగునా. కలదనుట. అద్వైతాత్మవిజ్ఞానము జ్వలసర్వేంద్రియమానసోపరతియును సంపూర్ణమైయున్న మనోనాశంబు గాకున్నె యితరవృత్తులు మనస్సునందు పుట్టకుండ మనస్సును వశపరచుకొనుటయే యంతఃకరణపరిణామము. మనస్సునందు నప్పుడప్పుడు కలిగెడి సంస్కారములు బ్రహ్మభావనచేత తిరస్కరింపబడును. విరోధలక్షణములగు వృత్తులు మనస్సుతో చేరుటయె మనోనాశన మనబడును. మనోనాశనము లేని సమయమందు చిత్తవృత్తులు కలుగుటయు బాహ్యనిమిత్తముచేత దంబాద్యసురవాసనలు కలుగుటయు కలదు. కావున వాసనాక్షయము లేదు. వాసనాక్షయము లేనప్పుడు మనోనాశనము లేదు. ఇవిషయమును గురించిన శ్లోకము నీక్రింద వ్రాయుచున్నారు. ఎట్లనిన, శ్రీరామహృదయ మందు శృతి॥ యావద్విలీనం నమనో నతావద్వాసనాక్షయః నక్షీణావాసనా, యావత్తావ చ్చిత్తం నశామ్యతి॥ మనోనాశన మగునంతవరకు వాసనాక్షయము కాజాలదు. వాసనాక్షయము మైనగాని మనోనాశము కాజాలదు. వాసనాక్షయ మన్నను మనోనాశన మన్నను ఒక్కటే యని తెలియవలయును.

ఈ వాసనాక్షయ మనోనాశనములు ఆత్మజ్ఞానమునకు కారణములని యుపనిషత్తులు మున్నగునవి స్పష్టముగ ప్రతిపాదించుచున్నవి. దైవవాసనలు గలుగుటయే వాసనాక్షయమని వెనుక చెప్పియున్నది. కావున ఇచ్చట దైవవాసనలు ఆత్మజిజ్ఞాససాధనములు నుదహరించుచున్నవి. స్మృతి॥ శాంతో దాంత ఉపరత స్తితిక్షు శ్రద్ధా సమాహితో భూత్వా ఆత్మన్యేవాత్మానంపశేత్॥ శాంతుడు దాంతుడు విషయములనుండి మరలినవాడు సుఖదుఃఖసహనములు గలవాడు శ్రద్ధాయుక్తుడై తనయందే ఆత్మను చూచుచున్నాడు. శృతి॥ అమానిత్వమదంభిత్వా మజ్ఞానం యదతో ౽న్యథా॥ యనునట్లు తనకంటె వేరైన దేహేంద్రియాదులందు నేననెడి తలంపు నభిమానము యితకంటె విలక్షణమైనది ప్రత్యగభిన్న పరమాత్మే. కావున అభిమానరాహిత్యమునకు ఆత్మజిజ్ఞాససాధనము గలిగియున్నది గావున, శృతి॥ తతస్తుతం పశ్యతి ధ్యాయమానః ఆధ్యాత్మయోగాధిగ మెనదేవం మత్వా॥ మనోనాశనమైనపిదప పరిశుద్ధుడగు

పరమాత్మను తెలిసికొనువాడు సుఖదుఃఖములను పొందజాలడు. శృతి॥ యం వినిద్రాజితశ్వాసాస్సం యత్తాసంయతేంద్రియాః జ్యోతిః పశ్యంతియుం జానాః తస్మైస్మయోగాత్మనేన్నమః॥ యనునట్లు నిద్రారహితులును ప్రాణజయము గలవారును నియమవంతులును జితేంద్రియులును నగు మహానుభావులు యోగసాధనముచేతను అఖండజ్యోతిస్వరూపమును తన్ను తా అంతర్ యోగదృష్టిచేత చూచుచున్నారో అట్టి పరమాత్మకు నమస్కారము. అట్లయిన ఇదివరకు వాసనాక్షయమువలన ఆత్మతత్వ జిజ్ఞాసము గలుగునని శృతులు నిరూపించుచున్నవి. యికను ఆత్మతత్వజ్ఞానమువలన గలిగెడి ననుభవమనే ఫలము యెట్లనిన సంచితప్రారబ్ధరూపములగు పుణ్యాపాపకర్మఫలమును శృతి॥ జ్ఞానాగ్నిదగ్ధదేహస్య॥ యనునట్లు జ్ఞానానలప్రభావేన బ్రహ్మజ్ఞానాగ్నియందు కాల్చివేయును. దగ్ధమౌను. కాలిపోవును.

శృతి॥ అగ్నిదగ్ధం యథాబీజం- శాఖాపల్లవవర్జితం. జ్ఞానదగ్ధం తథా యోగీ- పునర్ జన్మం నవిద్యతే॥

శ్మృతి॥ అభీజం వృక్షసంకీర్ణం శాఖాపల్లవవర్జితం- పుష్పం నాస్తి ఫలం నాస్తిసంపూర్ణం వృక్షవర్జితం॥

శ్మృతి॥ ప్రజ్వలత్పావకేకుండే- పద్మమూలం ప్రజాయతే నానాలత సమాకీర్ణం- పత్రపుష్పసమాకులం- తాసాంవృధియథాసత్యం జగసత్యం నసంశయః॥ యిత్యాది ప్రమాణంబులు చెప్పుచున్నవి.

శృతి॥ ప్రారబ్ధం భోగతోనసేత్॥ సంచితప్రారబ్ధ రూపములగు పుణ్యాపాపకర్మఫలములను- జ్ఞానాగ్నిచేత కాల్చివేయవలెను. అనగ కాల్చినబీజమువలన నంకురము యెట్లులపుట్టదో యట్లెజ్ఞానాగ్నియందు ఆగామిసంచిత కర్మములవలన రాబోనట్టిఫలములను- కాల్చివేయుటచేత ఆకర్మలవలన ననుభవించవలసిన సుఖదుఃఖములను జన్మమరణములు గలుగజాలవని భావము. ముల్లోకములయందు దుష్కృతయని వకపాపము నేచెప్పినను పుణ్యాపాపములు రెండును, అచట గ్రహింపవలయునని యె సద్గురువులైన మహా ఋషులయొక్క యభిప్రాయము. బ్రహ్మవేత్తలకు సంచిత కర్మవున్న వుండవచ్చును గాని- ఆగామి కర్మమాత్రం యెటులకలుగును అని యందు లేని బ్రహ్మసాక్షాత్కారము దేహేంద్రియా దివ్యాపారములవలన కలుగబోయెడు పుణ్య పాపకర్మములని గ్రహించవలెను. బ్రహ్మజ్ఞానికి పుణ్యపాపకర్మఫల

ములయందు నపేక్ష లేకయుండును- గాబట్టి దేహేంద్రియాది ప్రపంచము నకు విలక్షణమైన ఆత్మకుమాత్రము సచ్చిదానంద స్వరూపత్వము చెప్పినవి గాని నేను మనుష్యుడనని వ్యవహరించునపుడు మనుష్యుడైన నేననిగదా యని నర్థము. ఇచ్చట సచ్చిదానందత్వము మనుష్యునకున్ను నేనను ఆత్మకున్ను నుభయత్ర సాధారణముగా ప్రాప్తించుచున్నది నాశరీరము నా కన్న ఆత్మ యింద్రియభిన్నుడుగా దోచినను నేను మనుష్యుడను వాక్య ములోమాత్రము నేననునది దేహసంబంధముగుటచేత పూర్వాపర విరోధము లు సంభవించును. శరీరాదికములు బ్రహ్మచైతన్య సహాయమువలన ప్రకా శించునవిగాని స్వయంప్రకాశమానములుగావు. అనగ- దేహేంద్రియము లు ఆత్మయొక్క- ప్రకాశమానమువలన ప్రకాశించుచున్నవిగాని తనంతట తాము ప్రకాశింపనేరవుగావున భానుని యొక్క-తేజమును నాశ్రయించు స్వభావకర్మములందు ఈమానవులు వ్యవహరించుచుండిరి గావున మత్ ప్రకాశమునంటి ధీమానసేంద్రియములు స్వకీయములైన సమస్త కార్యముల యందు మనుష్యులు జరించునం దభిమానవృత్తులతో గూడియుందురు గావు న- శరీరమున్నగు హానియందు ఆత్మబుద్ధి కలుగుట జీవభ్రాంతిగాని యదా ర్థముగాదు. దీనినే అధ్యాసయని- ఆభాసయని- భాష్యమందు చెప్పియున్నా రు. ఐతే ఆత్మ నెరుంగుటకు ఆత్మస్వయంప్రకాసుడేగదా అట్టిఆత్మ నెరుంగు టకు అంతఃకరణ సహాయమేల. ఆత్మను- అజ్ఞానమను నావరణము నావరిం చియున్నది. తెరచాటున నుండు పదార్థములు సాక్షాత్క-రించదో అట్లు అజ్ఞానావరణముచేత బ్రహ్మచైతన్యము స్ఫురించుటలేదు. స్వప్రకాశమైన బ్రహ్మచైతన్యమే నేను యనుధృఢజ్ఞానము గలుగుటయే నజ్ఞానావరణము నకు విచ్ఛేదము కలుగుట యగుచున్నది. నజ్ఞానావరణము నాశనమునకు (నేను) యని చెప్పబడును. అంతఃకరణవృత్తి యావశ్యకము.

అట్టి అజ్ఞాననాశనమే బ్రహ్మచైతన్య స్వరూపమనియు చెప్పబడుచున్న ది. జీవభ్రాంతిరహితమే జన్మరహితం- జన్మరహితమె కర్మరహితంబైన తు ర్యాతీతంబైన పరబ్రహ్మస్వరూపమునందు నిర్వికల్పసమాధి జెందగోరి విక ల్పవృత్తి లేక సంకల్పములనుమరచి కర్మములను నిష్కా-మయాబ్రహ్మార్ప ణంబుగా జేయుచు బ్రహ్మకర్మసమారభేయను వేదశృతిప్రమాణములను బట్టి విచారించి సర్వకర్మ పరిత్యాగంబుజేయుచు యిహాముత్రార్థఫలభోగ

విరాగుడై ఫలకాంక్షగోరక తానుతానై బాహ్యసంకల్ప కర్మలనువిడచి
ప్రకృతి ధర్మములనంటక తానునై పరబ్రహ్మమైతానై అకర్త- అభోక్త-
అసంగుడై బ్రహ్మ నిష్ఠాగరిష్ఠుడై నివాతదీపచందమున నున్నదియే పరమ
రహస్యనిర్వికల్పము. అట్టి నిర్వికల్పం బెవ్విధంబున నెఱుంగబడును. గాలిలేని
దీపకళికచందంబున- అలలునిక్కలేని జలధిరీతి- నిశ్చలాత్మయున్న నిర్వికల్పం
బని యందురుబుధులు. మనోవృత్తి సర్వావస్థలనంటక శుద్ధస్ఫటిక సంకాశంబు
ననుండుట నది యెవ్విధంబన్న బ్రహ్మవేత్తయొక్క యోగాభ్యాసలక్షణ
నాహార నియమములు ఆహారంబులనువిడచి నవిద్యాకార్యవిరక్తుండై,
విద్యాయాత్రమున నిలచి- జలరేణుకాన్యాయంబున నవిద్యాభంగముజేసి
దానిందొలసి అనగ జలంకతకరేణువత్॥ అనగ, యిండువతీసిన నీటివలె అనగ
అవిద్యాజ్ఞానమను దేహాద్యభిమానమును జీవభ్రాంతినివిడచి అథర్వ
ణవేదోక్తోపనిషత్తుగో ఐ॰ త్మబ్రహ్మయని పల్కుచున్నదిగావున యీ
ఆత్మబ్రహ్మమే యనిన్ని- నేను బ్రహ్మనుయితిని యనగ తానుతానైతి
ననే ననుభవమున తాను కేవల శుద్ధాద్వైత పరమతత్వరహస్యార్థంబు
వినుమని ఇట్లనిన- బ్రహ్మనిష్ఠాగరిష్ఠుడు తాజేయు సర్వకర్మలున్ను నిష్కా
మయా ఆమ్నాయవిధిపూర్వకంబుక ఫలకాంక్ష వివర్జితులై- సంసార సంగ
మములు సర్వమునుగలిగి సంగిగాక తాను సర్వసాక్షియై మృత్కీటకచంబు
న మెలంగుచుండుకార్యములు సర్వమునుజేసి తానుకర్తగాక తామరాకు
యందు నీటిబిందువవలె నున్నవాడు- గావున, భోగములు సర్వమునుజెంది
భోక్తగాడు. అద్దమందు రూపమంటని యట్లు యున్నవాడున్ను విగత సంకల్పు
డై యుండు బ్రహ్మవేత్త కాబట్టి నట్టి బ్రహ్మ నిష్ఠాగరిష్ఠుండైనవాడు వనము
నున్ననేమి గృహవాసముజేసిననేమి ఆత్మభావనయునసంగవృత్తి యరిష
డ్వర్గంబును జయించినవాడు యెక్కడనున్ననేమి- అరిషడ్వర్గములు జయిం
చనివాడు వనముననున్నను గృహవాసముజేసిననేమి- నిర్మలజ్ఞాననిష్ఠగల
బ్రహ్మజ్ఞానియొక్క నడత యెట్టిదనిన- బాహ్యమునకు బైలసంరంభి లోపన
సంరంభియై కార్యతంత్రంబులు గడిపెనేని- చింతపండు గుల్లచింతపండు
నంటినట్లుగ గుల్లకున్ను పుట్టుకున్నులోను గింజకున్ను ఏమిసంబంధములేన
ట్టుయెట్లనిన సంబంధంగలిగియున్నది. పండినచింతకాయ ఆచింతకాయపం
డినవెనుక విచారించి విప్పి అనగ అధ్యాత్మతత్వవిచారణచేయగ తవకున్ను

ప్రకృతి సంబంధమైన ప్రపంచవ్యవహారమునకును పంచవింశతితత్వముల కున్ను అవస్థాత్రియములకున్ను సాక్షియై పంచకోశవ్యతిరక్తుడై॥ పంచ భూతాది సంగత్వం సపవమగమశ్శివః॥ ప్రస్థానత్రియమునకు విలక్షణమై వుత్పత్తి స్థితిలయమునకు విలక్షణమైన విరాట్టుస్వరూపమై సర్వసంగపరిత్యా గియైయున్న సఫల ప్రియత్నంబు విఫలప్రియత్నంబు తనకు తుల్యంబుగా దలచెనేని ఆగత అనాగతములనగ వచ్చినది రాబోవునది. సుఖదుఃఖములు సుఖము స్వాభావికము దుఃఖమాగంతుకము తనకు వేరుగాభావించి అనగ తాను బ్రహ్మమైయని తాదెలసిన అంటక తాగాక యున్నవాడు నని వార్యమై కర్మమునవచ్చు సుఖమువర్జించి యట్లుభోగించెనేని. నేతి నేతీతిమహా వాక్యములచేత- సర్వము తాగాదని గడదోృచి ఆద్యంబు జిహ్వాయందు నంటనట్లు నెయ్యి జిహ్వాకు జిడ్డునంటనియట్లుతాను జాగ్రస్వప్నసుషుప్తి అవస్తలకు విలక్షణమైన తుర్యావస్థయందు ప్రత్యగాత్మ తానని దెలసి తెలి యని చందమున తెలసియుండవలెను. సౌఖ్యంబు దుఃఖంబుసంప్రాప్తమైనచో నుబ్బుస్పృక్కు లేకనుండెనేని- సుఖదుఃఖములు సంప్రాప్తమైనయెడల ఒక ప్పుడు దుఃఖము- ఒకప్పుడుసుఖము- యీరెంటియందు యనురాగము లేని వాడై ఒకప్పుడు గొప్ప ఒకప్పుడు కొద్దియనె ఆశలేనివాడై- సుఖదుఃఖము లైనివాడై చిత్రభానుండును చీకటంటని యట్లు ఆకాశమున వాయువంటనట్ల నగ సూర్యుడు చీకటిని అంటనట్లుగను ఆకాశమున వాయువంటనట్లుగను- బ్రహ్మవేత్తలు యీ మాయాప్రపంచమునందు నఖల వ్యవహారములు జేసి యంటక॥ ప్రారబ్ధం భోగతోనశ్యేత్॥ ప్రారబ్ధం వున్నంతవరకు- తనంతటతాను వచ్చి తనంతటతాను మటుమాయముగా బోవును. జీవపరమేశ్వ రైక్యసత్చి త్సుఖానుభూతి నిస్సంశయాత్ముడై యుండెనేని బ్రహ్మజ్ఞాని ప్రారబ్ధవశము న వ్యవహారియైన ముక్తిసాంమ్రాజ్య పట్టాభిషిక్తుడగును. జీవబ్రహ్మైక్యజ్ఞానస మాధి నిష్ఠాగరిష్ఠుడై- అమనస్కారూఢ రాజయోగ మోక్షసామ్రాజ్యపదము జెందుగాక. సద్గురుముఖవివేకజ్ఞానమనే దర్పణంబున, తన్ను తా తెలియవలె ను. ముఖము మాలిన్యంబైన అద్దము మాలిన్యంబుగా గనబడును గాబట్టి బ్రహ్మవేత్త మాయాసంస్కృతియందు, చెప్పితె వినుట విని గ్రహించుట గ్రహిం చి ధారణజేయుట ధారణజేసి నమ్ముట, నమ్మి మననముజేయుట, అందు లీన మౌట, పిదప నిధ్యాసనుపొందుట, పిదప బాలోన్మత్త పిశాచవత్తుగా నుండు

ట, బ్రాహ్మణోగవిహస్తిని॥ సుచిచైవసుపాకేచ, పండితసమధర్శనాహ॥ యను నట్లు, బ్రహ్మవేత్త, తెలసి తెలియకయుండును. అట్టి నిర్వ్యాసనుని సాటియందైన గలరేయనిన, ఉప్పుయున్ను కప్పురమున్ను ఒక్కపోలికగానే యుండును గావున, చూడచూడగ, రుచులు జాడవేరుగ నుండును. కాబట్టి, పురుషులలో పుణ్యపురుషులు వేరుగానే గనబడుదురు. కావున చిత్తవిశ్రాంతి బొందుదురు.



# శ్రీ మహాఋషి నిఘంటిత యోగశాస్త్రము.



## చతుర్మహాయోగము.



—♦ భుఘుండనే కాకులరాజు వసిష్ఠునకు చతుర్మహాయోగము బోధించుట ♦—

మహావాక్యయోగము మహాఋషులచే విచారించబడినది ఎట్లనిన,

1 ప్రిజ్ఞానం బ్రహ్మేతి-వ్యజానాత్,
2 అహంబ్రహ్మాస్మి వ్యజానాత్-
3 ఐమాత్మాబ్రిహ్మేతి వ్యజానాత్-
4 తత్వమసీతి-
5 నేతినేతీతి-
6 సత్యజ్ఞాన మనంతం బ్రహ్మేతివ్యజానాత్-
7 సర్వఖల్విదం బ్రహ్మేతివ్యజానాత్-
8 ఆనందో బ్రిహ్మేతివ్యజానాత్-

ప్రజ్ఞానంబ్రహ్మేతి- వ్యజానాత్ ప్ర-జ్ఞానం- బ్రహ్మ ప్ర- ప్రకృత్తి- జ్ఞానం- అనగ- తెలివి- గ్రాహ్యశక్తి- మెరుక- యిరువైఅయిదోతత్వం- జ్ఞాత- ప్రజ్ఞానం- వ్యవహారిక రీజీవుడు- కార్యోపాధమైన కించజ్ఞుడు- ఆకాశహంశమైన సునీలమైన హంసయనే- మనస్సనేబిందువ- జీవకళ- ప్రిజ్ఞానం.

ఇరువదినాలుగు తత్వములచేతకూడినది- చతుర్వింశతితత్వములతోకూడినదే ప్రకృత్తి. యీచతుర్వింశతితత్వములను గ్రిహించినదే 25 దో తత్వంజ్ఞాత- ప్రజ్ఞానంబ్రహ్మ ॥శృతి॥ ఏనేతు తేశ్రణోతీదం- జిఘ్రితీవా-కరోతిచ- స్వాదస్వాదువిజానాతి- తత్ప్రజ్ఞానమితీర్యతే ॥ ఇత్యాదిఋగ్వేదవాక్యం॥ స్వాధిష్ఠానచిదాభాసుడైన జీవుడు కన్నులనుండివెడలిన అంతఃకరణవృత్తితోగూడుకొన్న యేజ్ఞానముచేత నేత్రమునకు విషయములగు- తెలుపు- నలుపు- పసుపు- ఆకుపచ్చ- మెరుపు- మిశ్రము లావు- సన్నము- పొట్టి- పొడుగు

లనెడు దశవిధరూపంబులును జూచుచున్నాడో శ్రోత్రిమునుండి వెడలిన విజ్ఞానముచేత శ్రోత్రమునకు విషయములగు అకారాది శోడశస్వరూపశబ్దంబులను వినుచున్నాడో నాసికాద్వారములనుండి వెడలిన విజ్ఞానముచేత నాసికకు విషయములగు సుగంధదుర్గంధములను గ్రహించునో జిహ్వనుండి వెడలిన విజ్ఞానముచేత నాలుకకు విషయములగు వగరు తీపు వుప్పు కారము చేదు పులుసు ననెడు షడ్రసములను గ్రహించునో త్వగింద్రియమునుండి వెడలిన విజ్ఞానముచేత త్వగింద్రియమునకు విషయములగు-శీతఉష్ణ- మృదుకఠిన స్పర్శంబులును గ్రహించునో వాక్కుగుండా బయలువెడలిన అంతఃకరణవృత్తితో గూడుకొన్న విజ్ఞానముచేత మాట్లాడుచున్నాడో విజ్ఞానముచేత చేతులతో యిచ్చి పుచ్చుకొనుట గ్రహించునో విజ్ఞానముచేత కాళ్లతో నడనడమును గ్రహించునో విజ్ఞానముచేత పాయువింద్రియముద్వార మలవిసర్జనను తెలసికొనునో విజ్ఞానముచేత వుపస్థేంద్రియమందలి విషయానందమును గ్రహించునో అదిప్రజ్ఞానము. అనగ సమస్తభూతములయందు అంతరాత్మగానుండు తెలివి అనగ ప్రజ్ఞానం బ్రహ్మయనగ సృష్టిబ్రహ్మ సగుణబ్రహ్మ పంచవింశతితత్వములతో కూడి వ్యవహరించుచున్నది. ప్రజ్ఞానం బ్రహ్మయనునది సమస్తభూతములయందును మనుష్యులయందు ఖండాఖండములుగా ప్రకాశించెడు ఆత్మస్వరూపమే బ్రహ్మస్వరూపము. చైతన్యమనినను ప్రజ్ఞానమనినను బ్రహ్మమనినను పరబ్రహ్మమనినను పేర్లుమాత్రమే వేరుగాని వస్తువయొక్కటియె యని తెలియునది. ఆప్రజ్ఞానము బ్రహ్మస్వరూపమేగానిపరబ్రహ్మమునకు అనన్యమైనదియని. యీ వాక్యమువల్ల తెలియగలదు. ఇది రుగ్వేదవాక్యము. జాగ్రదవస్థస్థూలశరీరము అన్నమయకోశము. పంచవింశతితత్వాత్మస్వరూపము. హృదయాకాశమందు త్రినేత్రిమధ్యమందు సునీలమైన హంసయనె మనస్సనే బిందువనే పావ ప్రజ్ఞానంబ్రహ్మమని వేదముపల్కుచున్నది. దీనినే మహాకాశబలితబ్రహ్మమని చెప్పుచున్నవి. గాబట్టి-

శృతి॥ చక్షోర్మధ్యేస్థితంగుహ్యం అంగుష్ఠంపరమాత్మకమ్ తస్మాగ్రే సూక్ష్మకంధృవం॥ ఈప్రజ్ఞానము నేత్రిమధ్యమున గోప్యముగ అంగుష్ఠమాత్రి పురుషుడగు పరమాత్మయున్నాడు—॥ తైత్తిరీయోపనిషత్తు॥

నీలతోయదమధ్యస్థ విద్యుల్లేఖవభాస్వరా నీవారశూకవత్తన్వి పీతాభాస్వత్తనూపమా తస్యాశిఖాయా మధ్యేపరమాత్మావ్యవస్థితః॥

భావార్థః॥ నేత్రస్థానమందుండెడు నల్లగుడ్డునకే నల్లకలువయని చెప్పుదరు. అందుమధ్యను నివ్వారిధాన్యపు ముల్లువలెనే నతిసూక్ష్మమగు రంధ్రమున్నది. అందు విద్యుల్లేఖయనెడు మెరుపుతీగె ప్రకాశించుచుండును. అదియే కళ, ఆకళే ప్రజ్ఞానం, ఆకళలో నిష్కళయే పరమాత్మస్వరూపం, యీ నేత్రస్థానమే పరమాత్మస్థానమని చెప్పుదురు. ఈకళయే ముక్తికాంతయనియు ఆపోజ్యోతియనియు ప్రజ్ఞానమనియు స్వప్రకాశమనియు చెప్పుదురు. ఈప్రకాశము వల్లనే సూర్యునికి ప్రకాశము గల్గినది. సూర్యుని వలన చంద్రునికి ప్రకాశముగలిగినది. ప్రకాశమునకు కారణము ప్రజ్ఞానస్వరూపమైన కళయేయని తెలియునది. ఇదియే హిరణ్మయకోశము. సూర్యునియొక్క కాంతి తెలుపు. సర్వత్ర తెలిసినవిషయము. అదిపి శుద్ధసత్వప్రధానము సూర్యునికాంతి ప్రత్యక్షముగ తెలుపురంగైనను నిజముగ విచారించి చూడగ వివిధరంగులయొక్క చేరికయని తెలియవలెను. సూర్యకాంతి ముక్కోణపద్దముచేత భాగించబడి వివిధరంగులయినట్లు నేత్రస్థానమందును 7 రంగులుగలవు. 1 మెరుపు నారింజపండువలె వర్ణము మెరుపు పసుపురంగుకలసిన వర్ణము పసుపుపచ్చవర్ణము ఆకుపచ్చవర్ణము నీలవర్ణము దీనికే నల్లగుడ్డుయని చెప్పుదురు. సునీలవర్ణము ఇదియే పాపయనె ఇంద్రనీలవర్ణం కళ ప్రజ్ఞానం బ్రహ్మ అద్దమునుదెచ్చి నందులో ప్రతిబింబమును చూచినచో అన్నిరంగులు తెలియగలవు. ఈ ఏడురంగులు సప్తచక్రంబులనియు అందలి కళయె సుషుమ్నయనియు ప్రజ్ఞానమనియు ఆకళలో నిష్కళయె పరబ్రహ్మమనియు శృతులు చెప్పుచున్నవి రేతోస్కలనాదులు ఆస్థానమునందె గలుగును. కావుననే రేతోస్కలనమప్పుడు నీరసమును నిస్త్రాణయును నిద్రామోహములు నేత్రములయందు బరువును గలుగును. ఇది స్వానుభవమువల్లనే కలుగును. తైత్తిరీయోపనిషత్తు॥ అణోరణీయాం మహతోమహీయాం॥ నాత్మాగుహాయాం నిహితోస్యజన్తోః। ఇత్యాద్యుపనిషత్ ప్రమాణంబులు చెప్పుచున్నవి. అతిసూక్ష్మములగు అణువుకంటె అణువును నతిసూక్ష్మమైన మహత్తుకంటె మహత్తును నగు పరమాత్మ జంతువులయొక్క బుద్ధి గుహాయందుండును. తైత్తిరోపనిషత్॥ జాలసూర్యమరీచస్థం యత్సూక్ష్మం తరంరజః॥ తస్యాష్టమోభాగః అణురిత్యభిధీయతే॥ భ్రూవోస్థానే అధఃపద్మంద్విదళంతత్ర శోభితం హంక్షాత్యక్షరసంయుక్తం వర్తతే వాయుమండలమ్॥ రెండు కనుబొ

షులమధ్యను సోహంయనే హంసస్వరూపము ఇంటికప్పులోని నందులగుండా తాలెను సూర్యకాంతిలోని నలుసులుయొక్క ఆరోభాగమునకు లేక ఎనిమిదో భాగమునకు అణువనిపేరు—నేత్రమందుయున్న పపయనే బిందువనె కళకు ప్రజ్ఞానమని పేరు—ఆమధ్యను నివ్వరిముల్లువంటి అతిసూక్ష్మనుగు రంధ్రమున్నది. ఇక్కడనుంచి యేనాడులు కపాలమునకు బోవును. ఆబ్రహ్మరంధ్రి మధ్యమందు ముక్తికాంతయున్నది. ఈనాళమే నడినాళమనియు బ్రహ్మరంధ్రమనియు మేరుశిఖరమనియు సుషుమ్నానాళమనియు చెప్పుదురు. అందుండెడు ముక్తికాంతయె కళ ప్రజ్ఞానం జీవతత్వం జ్ఞాత ఆపోజ్యోతియని చెప్పుదురు.

రక్తశ్వేతకృష్ణనీలవర్ణముల మధ్యను బ్రకాశించు ఆపోజ్యోతినే ప్రజ్ఞానబ్రహ్మ నీలతోయదమధ్యస్థమైన విద్యుల్లేఖయనియు అక్షరుండనియు చెప్పుదురు. క్షేత్రజ్ఞుండనియు దేహియనియు ఆత్మయనియు ఇదియే అంతర్లక్ష్యము. ఇదియే గగనము ద్రి. మేరుశిఖరస్థానం. ఇదియే మేరువగిరియనియును, ఆశిఖ చిన్మయనేత్రస్థానం కైలాసం సత్యలోకవైకుంఠములకు స్థానమైనదియు అధిప ఇది మర్మమంగధరాగ్రిమధ్య వార్ధినడుమను కృష్ణాశ్రియద్వారవతిని యాత్ముకున్నాడు. సూక్ష్మదృగ్వ్యాప్తిచేత జ్ఞాతగలవాడవై కనుసంజ్ఞచేత ఇంద్రియవిషయంబులందొక్కొక్కటి ప్రజ్ఞానమనె తెలివిచే గ్రహింపంబడియుండ నా తెలివి యావిషయంబు విడచి మరియొకవిషయమునకు పోవునప్పుడు పూర్వముపొందియున్న విషయములను వదలుటచేతను యితరవిషయంబులను గ్రహించకుండుటచేతను యీమధ్యకాలంబున విషయముల నంటకుండ ఆప్రజ్ఞానంబనే తెలివి తన్నుతా దెలసిన తెలివికి యేరూపంబో అదియె చిదాకాశంబు. స్థూలంబును చూచువాడురు గ్రహించువాడు ప్రజ్ఞానస్వరూపమైన జ్ఞాత. ఈజ్ఞాతే తన్నుతా దెలసి తాను సర్వసాక్షి ప్రత్యగాత్మ. ఇదే సాక్షి చైతన్యస్వరూపమైన సాక్షియనియు చూచువానికి మనస్సుసాక్షియనియు మనస్సున క్రమక్రమముగ బుద్ధియనియు బుద్ధిక్రమక్రమముగ ఆత్మయనియు ఆత్మ క్రమక్రమముగ పరమాత్మయనియు పరమాత్మ క్రమక్రమముగ పరబ్రహ్మమనియు మహాఋషిప్రోక్తములున్నవి.

జీవశ్రుతి॥ పంచీకృత మహాభూతసంభవం కర్మసంచితం॥ శరీరంసుఖదుఃఖానాం భోగాయతనముచ్యతే॥ పంచీకరణముచేయబడిన పంచమహాభూతములవల్ల నేరుపడిన ఆగామిసంచిత ప్రారబ్ధములు గలిగినట్టి స్థూలశరీరమే సు

ఖదుఃఖానుభవమున కునికిపట్టు. దీనినె ఓతయని జ్ఞాతయని చెప్పుదురు. ఇదియే ప్రబ్రజ్ఞానము. అత శ్రుతి॥ పంచప్రాణమనోబుద్ధి దశేంద్రియ సమన్వితం అపంచీకృత భూతాస్థం సూక్ష్మాంగం భోగసాధనం॥

సమానవ్యానోదాన ప్రాణాపానంబులనెడు పంచప్రాణంబులును మనోబుద్ధులును శ్రోత్రచక్షుర్జిహ్వాఘ్రాణంబులనెడు జ్ఞానేంద్రియంబులును వాక్పాణిపాదపాయుపస్థలనెడు కర్మేంద్రియంబులను యీపదునేడింటితోనుగూడినది లింగదేహం. ఈలింగదేహమె ప్రజ్ఞానఘనస్వరూపము. ఇదేచిద్ఘనానందస్వరూపం. ఇదేప్రజ్ఞానం. అపంచీకృత పంచమహాభూతములవల్ల నేర్పడినదియునగు యీసూక్ష్మశరీరమనేదే ప్రజ్ఞానము. సుఖదుఃఖములవల్ల ననుభవించునది సాధకము. ఈప్రజ్ఞానమును దెలసిన తెలివియే హిరణ్మయగర్భుడు ప్రజ్ఞానమే అనుజ్ఞాత యనియు అందురు. మలినసత్వ ప్రధానసత్వ రజస్తమోగుణాత్మకమైన అవిద్యయే మహదహంకారములతో కూడినదే ప్రజ్ఞానం.॥ విద్యాశ్రుతి॥ అనాద్యవిద్యానిర్వాచ్యా కారణోపాధిరుచ్యతె॥ ఉపాధిత్రితయాదన్యమాత్మానమవధారయేత్॥ వాక్కులచేత చెప్పనలవిగానిదియును ఆదిలేనిదియును నగు జ్ఞానమే ప్రజ్ఞానము. ఆత్మ ప్రజ్ఞానము — యీప్రజ్ఞానమునకు సాక్షి నిష్కళాస్వరూపమైన పరమాత్మ ఆదికల్పుడు శరీరత్రయవిలక్షణుడు అవస్థాత్రయసాక్షి హిరణ్మయకోశము. ఇదేప్రత్యగ్భిన్నపరమాత్మ తుర్యావస్థ. యీప్రత్యగ్పరమాత్మే నేను గావున, (2) అహంబ్రహ్మాస్మి—అహం- నేను, బ్రహ్మ- పరబ్రహ్మము, అస్మి- అయితిని, అనగ నేనయనెడి అహంభావం పోయి పరబ్రహ్మముదైక్యమగుచున్నాను. ఇచట జీవుడైన ప్రజ్ఞానంబనే అహంశబ్దముచేత చెప్పబడియున్నాడు. ఇదియజుర్వేదవాక్యం॥ స్వప్నావస్థ సూక్ష్మదేహం ప్రాణమాయకాశం॥ శ్రుతి॥ పరిపూర్ణపరాత్మేస్మి దేహే విద్యాధికారిణే బుద్ధిసాక్షితయాస్థిత్వా స్ఫురన్నహమితీర్యతే॥

(21600) యిరువదియొక్కవెయ్యి ఆరువందల హంసలు ప్రతిదినము సోహం హంసోహం అని యిడాపింగళనాడులయందు సంచరించుచున్నదే అహంయనే జీవజ్ఞప్తి. ఇదే జ్ఞానస్వరూపమైన తానే పరబ్రహ్మము గావున యిరవైయొక్కవెయ్యి ఆరువందల హంసలు లయమైన నిష్కళే తానైన పరమాత్మ అహంబ్రహ్మాస్మి॥ నేను పంచవింశతితత్వములుగాను నేను పరబ్రహ్మమునే గాని అహంసోహమనే జీవుడుగాను. నేనే బ్రహ్మమని తన నిజరూపమును తాను

దెలియుట తాను తా నౌటయే అహంబ్రహ్మాస్మి నేను పరబ్రహ్మానైతినని తన్ను తా దెలియుట కాబట్టి తత్వమసియనగ—తత్—త్వం అసి యనగ తత్—పదార్థమైన—పరబ్రహ్మము—త్వం—నీవు—అసి అయితివి. తత్పదార్థమై పరబ్రహ్మము నీవైతివి యనునట్లు తత్పదార్థము ఆపరబ్రహ్మ స్వరూపమే. త్వం—నీవు అనగ దేహేంద్రియాదులకు విలక్షణమై అతీతమై తాను తానై ఆపరబ్రహ్మమే నీవు యని శ్రుతి చెప్పుచున్నది.

సర్వసారోపనిషత్॥ ఏకమేవాద్వితీయం స్యాన్నామరూపవివర్జితమ్॥ సృష్టేఃపురాధునాప్యస్యతాదృక్త్వతదితీర్యతే॥ ఇత్యాదుపనిషత్॥ భావార్థః॥ సృష్టికి పూర్వంబు సృష్టికి పరమందు సృష్టియున్నప్పుడు సృజనలేక పార్శ్వదక్షిణంబుల పశ్చిమోత్తరముల నాల్గుమూలల మీద నడుమ క్రింద యచలమై సత్యమై యాద్యంతశూన్యమై పరిపూర్ణమై బట్టబయలుగాను యేకమైయుండు యేబాధలేకనుండునట్టి వస్తువు కేవలాత్మనగబడును అని ఆంధ్రవాక్యము లున్నవి.

సృష్టికాలంబునను అనగ ఆకాలంబునను వుపదేశకాలమందుగను తత్పదార్థమైన పరబ్రహ్మము అసి అయితిని. అసిపదం అనగ బ్రహ్మపదము పూర్ణపదము పరమపదం నేనైతిని. అనగ జీవబ్రహ్మైక్యమై తాను తానై తాను బ్రహ్మమై యున్నదే అసిపదము.

శ్లో॥ తేంద్రియాతీతంచిత్త్వతత్త్వంపదేరితామ్॥ ఏకతాగ్రాహ్యతే సీతిత ద్వైక్యమనుభూయతాం॥ అని మనుశ్రుతి.

వినునటువంటి శిష్యునియొక్క దేహేంద్రియాదులకు అతీతమైన చైతన్యబ్రహ్మము త్వంపదముచేత చెప్పబడును. ఇదే జీవబ్రహ్మైక్యము. గురుశిష్యైక్యము అశిపదము అని చెప్పుచున్నవి. మనస్సు-మారుతము-దృక్కు యీ మూడున్ను పరబ్రహ్మమందు లయము కావడమే అశిపదము. ఇదే యోగము. తాను తానైనదే అశిపదము.

తత్—ఈశ్వరస్వరూపము పరమాత్మస్వరూపము.

త్వం—జీవస్వరూపము ప్రత్యగాత్మస్వరూపము.

అసి—జీవేశ్వరైక్యము ప్రత్యగాత్మ పరమాత్మైక్యము.

ఇది సామవేదవాక్యం—సుషుప్త్యవస్థ మహాకారణము తుర్యము తుర్యాతీతమే అసిపదము.

సర్వసారోపనిషత్॥ భావాభావద్వయం త్యక్త్వనిరాకాశస్థితిర్భవ॥ ఆకాశస్యగుణశ్శబ్దోనిశ్శబ్దోబ్రహ్మముచ్యతే॥ భావర్థః॥ భావము అభావము గానిది నిరాకాశము-నిరామయము- గుణశబ్దాకాశముగానిది- జీవాత్మగానిది- నిశ్శబ్దము శబ్దము గుణములేని నిరామయము నిర్భయములు.

అయమాత్మాబ్రహ్మమనగ— అయం-స్వయంప్రకాశమైన నిత్యమై అపరోక్షమైయుండు యీయాత్మ బ్రహ్మస్వరూపమే.

బ్రహ్మము పరబ్రహ్మము యిది అధర్వణవేదవాక్యము తుర్యాతీతము తుర్యము ఆత్మస్మృతి.

స్వప్రకాశపరోక్షత్వాద్వయమిత్యుక్తితోమతః॥

అహంకారాదిదేహాంతా త్ప్రత్యగాత్మేతిగీయతే॥ దృశ్యమానస్యసర్వస్యజగతస్సత్వమీర్యతే॥ బ్రహ్మశబ్దేనతద్బ్రహ్మస్వప్రకాశాత్మరూపకమ్॥ అఖండతేజోమయాకార నిష్కళానంద ప్రత్యక్షసాక్షాత్కారమైనది నేననెడి అహంకారరహితమై జీవభ్రాంతిరహితమై ద్వైయదోషరహితమై యున్నది. తానైన పరమాత్మ అట్టి ఆత్మను దెలియుటకు—శృతి॥ వజ్రంవజ్రేణభిద్యతే॥ జ్ఞానేనజ్ఞేయమాలోక్యః॥

తన్ను తా దెలియుటయు ముంటిచేత ముల్లుతీయునట్లును ప్రుష్యరాగము మొదలగు రాళ్ళన్నియు రత్నముచేతనే కోయబడును గాని యితరరాళ్ళచేత కోయబడవు. రత్నము రత్నముచేతనే కోయబడును గాని వజ్రం వజ్రంచేతనే కోయబడును గాని యితరరాళ్ళచేత కోయబడవు గావున మనస్సుచేతనే బ్రహ్మమును దెలియవలెనే గాని యింద్రియములు పరమాత్మను దెలియజాలవు. జ్ఞానమనే తెలివిచేతనే జ్ఞేయమనే బ్రహ్మపదార్థమును దెలియవలెనే గాని తదితరమైన యింద్రియములవల్ల తెలియజాలవు. తన్ను తానే దెలియవలెను. తనకన్న నన్యమైన పదార్థములేమి గావున తన్ను తానే దెలసి తాను తానై యుండవలయు నని భాష్యకారులు చెప్పుచున్నారు.

సర్వంఖల్విదంబ్రహ్మ' సర్వము బ్రహ్మస్వరూపము. తుర్యాతీతము- శరీరరహితము-పంచకోశరహితము-దత్తాత్రేయోపనిషత్॥

జీవాత్మ పరమాత్మైక్యావస్థ త్రిపుటిరహితః॥

పరమానందస్వరూప— శుద్ధచైతన్యకాసనా మాధిః॥

మనోశృతి॥ జీవబ్రహ్మైక్యం- త్రిపుటిరహితం- ఆనందస్వరూపం- కేవ

ల శుద్ధచైతన్యస్వరూపంబైన పరబ్రహ్మము సుఖముగాదు దుఃఖముగాదు యీరెంటియొక్క సంతోషము వ్యసనము యీరెండూకానివాడు అంటనివాడు సృష్టిస్థితిలయములు శరీరధర్మంబులు గనుక వాటిని అంటనివాడు పొందనివాడు లేనివాడు ఆదిమధ్యాంతములు లేనివాడు అంతట పరిపూర్ణమై బ్రహ్మమైయున్న తానే గావున జీవాత్మ పరమాత్మలైక్యమును జేయవలయును. నేననెడి యేరుపగ అహంకారమే జీవాత్మ. తాను యనునదియే పరమాత్మ. ఈజీవాత్మ పరమాత్మల కైక్యమైనయెడల సాక్షిత్వంగూడ లేదు. తానే బ్రహ్మమైనప్పుడు సాక్షి యెవరికి గావున తాను తానైనప్పుడు సాక్షి గూడా లయమయినది. అనుభవజ్ఞానముచేత విచారించగ పరబ్రహ్మమందు నైక్యమగును.

గీత॥ ఆత్మవత్సర్వభూతాని యఃపశ్యతిసపస్యతి॥

సర్వాంతర్యామియై తానే నంతట నిండియున్న పరమాత్మను సద్గురుముఖవివేకజ్ఞానముచేత తన్ను దా దెలియవలెను.

సత్యజ్ఞానమనంతంబ్రహ్మ మనగ సత్తు-చిత్తు-ఆనందం యీమూడుగలసి సచ్చిదానందంబ్రహ్మమని యున్నది. సత్యం—యదార్థస్వరూపమైనది. జ్ఞానం బ్రహ్మజ్ఞానం పరబ్రహ్మమే తానని తెలుసుకొనునది. అనంతం సనాతనమైనదిన్ని ఆనందం రూపనామరహితమైనదిన్ని సచ్చిదానందం సత్యజ్ఞానమనంతంబ్రహ్మ. ఈసత్యమైన యనాదియైన జ్ఞానమనే జీవుడే పరబ్రహ్మము. అట్టిపరబ్రహ్మమే తాను తానె అనాదియై సనాతనంబై ఆదిమధ్యాంతములు లేక అంతటను నిండి తాను తానైయుండగ ఆదిమధ్యాంతములు గలిగి నావరించి మాయాశబళితబ్రహ్మ నావరణవిక్షేపశక్తి యనాదిమూలప్రకృతి విద్యచ్ఛక్తి నావరణవిక్షేపశక్తి త్రిగుణశక్తియనంబడును.

గురుణావర్ణత్యాగోనిరావరణవృత్తమః॥ పరిపూర్ణపూర్ణమేవపూర్ణబోధోవశిష్యతే॥ పూర్ణాచలసముద్రవత్॥ శృతిగీత॥ ఆవరణరహితమైనదిన్ని వుపాధిద్వయదోషరహితమైనదిన్ని నిరావరణం ఆవరణములేనిదిన్ని పరిపూర్ణం నిండియున్నదిన్ని యైయున్న పరబ్రహ్మం బొక్కటియే వెలుంగుచుండును. ఖండాఖండములుగానిది యింత యంతయను మితిలేనటువంటిది కొంచెము గొప్పకానటువంటిది సర్వత్రనిండి నిబిడీకృతమైనదియు పూర్ణమథఃపూర్ణమిదం పూర్ణాత్పూరమిదీరితం॥ పూర్ణశ్యపూర్ణమాదాయ పూర్ణబోధోవ

శిష్యతే॥ లోపలవెలుపలమధ్యను అంతట నిండి ఏకీకృతమైనదే పరిపూర్ణం బని చెప్పుచున్నారు.

ఆనందోబ్రహ్మ యనగ ఆనందం రూపము నామములేని కర్తకర్మక్రియలులేనిది నిర్మలమైనది.

శృతి॥ బ్రహ్మానందం పరమసుఖదం కేవలంజ్ఞానమూర్తిం॥ విశ్వాతీతం గగనసదృశం తత్వమశ్యాదిలక్ష్యం ఏకంనిత్యం విమలమచలం సర్వధీసాక్షిభూతం భావాతీతం త్రిగుణరహితం నిశ్చలం నిర్వికారం కార్యాకారణహీనం జ్ఞానమానందగం బ్రహ్మనందో బ్రహ్మయుచ్యతే॥ జ్ఞానమానందగంబ్రహ్మ ఇత్యుక్తంమూఢమానసైః॥ భ్రాంతిమూలమిదం జ్ఞానం జ్ఞానంభ్రాంతేతునిశ్చయం॥ సద్రూపంనాస్తిసర్వత్ర చిద్రూపంనాస్తిసర్వద ఆనందరూపకంనాస్తి అచలన్నాస్తిసర్వదా॥ పాదాభావాద్గతిర్నాస్తి హస్తాభావాత్ క్రియానహి॥ మృత్యుర్నాస్తె జన్మభావాత్ బుద్ధ్యాభావాత్సుఖాతికం॥ ఆత్మాభావాద్ జగంనాస్తి యిని వేదాంతడిండిమహ॥ సర్వసారపూర్ణోపనిషదితి గాబట్టి బ్రహ్మనందము యేమియులేని యేమియుగాని శృతి॥ అభ్యంతర్బాహ్యోపినభవతి॥ ఈయుక్తపరిపూర్ణం యేమీలేదు.

శృతి॥ మూలాభావమిదంజ్ఞాతుం నశరీరంనకిమస్తి॥ మూలములేని యీ గుర్తు యెరిగే శరీరం యేమిలేదు. సర్వంబ్రహ్మానందంభవతిః యిట్లు శృతిశ్మృతిద్యుపనిషత్తులు చెప్పుచున్నవి.

నేతినేతీతి- వైశృతిః॥ నేతినేతీతి నేతీతిశేషితం పూర్ణముచ్యతే॥ పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదీరితం. పూర్ణశ్య పూర్ణమాదాయా- పూర్ణమేవావశిష్యతే॥ భావార్థః॥ హేప్రభో బాహ్యాభ్యాంతరః యః సర్వత్ర సర్వదాభవతి సః త్వమేహం అస్మి సంయోగశ్చ తతస్తతః త్వం జగత్ న ఆత్మ జగత్ న సంయోగశ్చ వియోగశ్చ మే న తే న త్వా న అహం న త్వం న ఇదం జగిత్ న సర్వం కేవలం ఆత్మైవ భావార్థః॥ హే ప్రభో.ఓరాజా, బాహ్యాభ్యంతరః-లోపల వెలుపగలవాడు, న-కాదో, యః- ఎవ్వడు,సర్వత్ర-అంతటను అనగ ఆపరమపురుషుడు,సర్వదా,ఎల్లప్పుడు-భవతి-వున్నాడో,సః-పరమాత్మ, త్వం-నీ,అసి అగుచున్నావు తే-నీకు,సంయోగశ్చ-కూడికయును, వియోగశ్చ-ఎడబాయుటయును, నవర్తతే-కలుగదు,తతస్తతః-పలుమారును, సః-ఆపరమాత్మ, త్వం-నీ,జగత్-జగత్తును, న-కాదు, అహం-

నేను జగత్, న-కాదు, సర్వం- సమస్తమైనజీవకోటి కేవలము అద్వితీయుడగు పరబ్రహ్మము, సంయోగవియోగశ్చ-కూడికయు యెడబాటును మే-నాకును, న-లేదు తే నీకును, న-లేదు, త్వం-నీకును న లేదు సర్వం సమస్త ప్రపంచమును కేవలం అద్వితీయుడగు ఆత్మైవ పరమాత్మ పరబ్రహ్మమేను అస్య ఈ శబ్దాదిపంచకస్య శబ్దగుణకమాకాశమును వాక్యమునుబట్టి యాకాశాది పంచమహాభూతములయొక్కయు సముదాయః అధ్యావృతము సముదాయము త్వం నీవు నైవాశి కానెకావు పునః మరల తె నీకును న లేదు పరము ఉత్కృష్టమైన తత్వంజ్ఞానము త్వమేవ నీవె నైవాశి కానేకావు పునః మరల తే నీకును న లేదు. పరమః పరమోత్కృష్టమైన తత్వం పరతత్వము త్వమేవ నీవే అతః యిందువలన కిం యెందుకు ప్రత్యజేత్ విసర్జింతువు విడిచి పెట్టవలెను. ఓరాజా నీవెబాహ్యాభ్యంతరములులేనివాడు గానివాడవు సర్వత్ర సర్వకాలములయందు నుండువాడును నిత్యమంగళస్వరూపుడునైన పరమాత్మ వ్యాపకుడనియు అవ్యాపకుడనియు యిచ్చట సర్వత్ర యనుటచేత పరమాత్మ పారములేనివాడనియు సర్వదా ననుటయందు కాలమునతిక్రమించినవాడనియు స్నేహము విరోధములు రెండున్ను లేవనగ జీవాత్మకు పరమాత్మకు భేదములేదనియు చెప్పుచున్నది. జగత్తు మిథ్య నీవు నేను సమస్తమైన జీవకోటులు కేవలుండగు పరబ్రహ్మమగుచుండగ బలుమారును భ్రాంతినొందినవాడవై యట్లు పిశాచమువలె తిరుగుచున్నావు. బ్రహ్మమొక్కటె దక్కతక్కినవియెల్ల కల్ల. అట్టిపరబ్రహ్మమునకు జీవభ్రాంతిలేదని యభిప్రాయము. సంయోగవియోగములు నీకులేవు. నాకును లేవు. నీవును లేదు. నేనునులేదు యీజగత్తునులేదు. సమస్తము కేవలుండగు పరమాత్మయే—నీకు ఆకాశ మహాపంచభూతములుయొక్క సముదాయముకాదు. నీకు ఆకాశాది పంచ మహాభూతములయొక్క సంబంధము లేదు. నీవును వుత్కృష్టమైన పరమాత్మ స్వరూపుడవు—

గీత॥ వుత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః॥ ఆపరమాత్మ వుత్తమపురుషుడు గావున తన్నుతాదెలసిన తానుపరమాత్మేగాబట్టి తాను తానైనతత్వమును దెలియవలెను—

జ్ఞానవాశిష్ఠం॥ వదంతిమునయస్సర్వే నిర్గుణంశుద్ధమవ్యయం అశరీరం సమంతత్వం తస్మాంవిధినశోశయః॥

భావార్థః॥ నిర్గుణం సత్వరజస్తమోగుణములు లేనివాడును శుద్ధం పరిశుద్ధమైనవాడును అవ్యయం నాశనములేనివాడు అశరీరం దేహములేనిదిగాను సమం సమస్తజీవరాశియందు భేదములేక సమముగానుండునదిగాను యత్ ఏజ్యోతిస్స్వరూపము శ్రుతయః వేదములు సర్వే సమస్తములు వదంతి చెప్పుచున్నారో తత్ అజ్ఞానస్వరూపము మాం నన్నుగా విధియెరుగుము. సంశయః సంశయము న లేదు సమస్తవేదములే పరమాత్మను సత్వరజస్తమోగుణములుగలదిగాను మలినములేనిదిగాను నాశనములేనిదిగాను దేహములేనిదిగాను సమస్తజీవులయందు సమముగలదిగాను చెప్పుచున్నవో నట్టిజ్ఞానస్వరూపము నేనే యిందుకు సంశయములేదు. రూపముతోగూడిన పృధివ్యాధి సమస్తపదార్థములు నబద్ధములు. ఆకారములేనట్టి పరబ్రహ్మమొక్కటియే స్థిరమయినదనే జ్ఞానోపదేశంబున పునరావృత్తిరహితమగుచున్నది. అనగా జీవన్ముక్తి గలుగుచున్నది —

ఆత్మసమాధి అనాత్మసమాధి విశిష్ఠసమాధి యివి యెందుకు. సమస్తప్రపంచకోటియు నొక్కటియేయని నిశ్చయించినట్టులయిన ముక్తిస్వరూపము తానేయగును. శరీరములేనిదియు నుత్పత్తినాశనము లేనిదియు భేదములేనిదియు నగు పరిశుద్ధుండవు—తత్వమసియను మహావాక్యం దత్తాత్రేయోపనిషత్తు॥ తత్వమస్యాదిదివాక్యేన హ్యాత్మాహిప్రతిపాదితః॥ నేతినేతీతి శ్రుతిర్ భూయాదనృతం పాంచభౌతికం॥

భావార్థః॥ తత్వమస్యాదివాక్యేన తత్వమసియను మొదలగు మహావాక్యములచేత, ఆత్మాహి-జీవాత్మయే బ్రహ్మస్వరూపమని ప్రతిపాదితః- స్థాపింపంబడినది. తదాహి అదియుక్తమేను. శృతి- వేదము అనృతంః- అబద్ధమైన పాంచభౌతికంపంచభూతాత్మకంబునగు జగత్తు నేతినేతి- కాదు కాదు యని భూయాత్ పలుకును—తత్వమసి। అహంబ్రహ్మాస్మి సర్వఖల్విదంబ్రహ్మ ప్రజ్ఞానంబ్రహ్మమొదలగు మహావాక్యములచేత జీవాత్మయె పరమాత్మయని చెప్పబడినది. ఇదే అభేదజ్ఞానము యనిత్యంబయిన శరీరము నేనుకాదని వేదములు ఘోషించుచున్నవి—బృహదారణ్యోపనిషత్॥ విశుద్ధోశిసమంతత్వం విదేహమజమవ్యయం విభ్రమంకధమాత్మార్థే విభ్రాంతోహం కధంపునః—

(భావార్థః॥ త్వం నీవు విశుద్ధః పరిశుద్ధుడవు అశి అగుచున్నావు. త్వం నీవు సమం భేదములేని తత్వం జ్ఞానస్వరూపమును అశి అగుచున్నావు. త్వం

నీవు విదేహం శరీరము లేనివాడవు. త్వం నీవు అజం పుట్టుక లేనివాడవు. త్వం నీవు అవ్యయం నాశనము లేనివాడవు ఆత్మార్థె పరమార్థమునందు విభ్రమం భ్రాంతిపడినవాడవు. అసి అగుచున్నావు. భవతి కలుగుచున్నది. నీవు పరిశుద్ధుడవు. జీవబ్రహ్మ భేదము లేని తత్వస్వరూపుడవు. దేహము లేనివాడవు. పుట్టుక లేనివాడవు. నాశనము లేనివాడవు. అగుచుండగ నీవెట్లు భ్రాంతిపడుచున్నావు. పొందుచున్నావు. కాబట్టి జీవభ్రాంతి తనయందు ఆరోపింపబడినది గాని నిజముగా లేనే లేదు. ఘటేభిన్నం ఘటాకాశం స్వలీనం భేదవర్జితం శివేన మనసాసార్ధం నభేదః ప్రతిభాతిమే దత్తాత్రేయగోరక్షణ సంవాదమందు.

భావార్థః ఘటే ఘటమునందు భిన్నం బిన్నమయిన ఘటాకాశం ఘటాకాశము స్వలీనం తనయందులీనమునొందిన మహాకాశము కథం యెట్లు మనస్సు మనస్సుతో సార్ధం కూడుకొని యుండు జీవాత్మయు శివంచ మంగళస్వరూపుడైన పరమాత్మయును మె నాకు భేదం భేదము గలదిగా నతిప్రభాతి తోచలేదు.

కుండ నొక్కచోటనుంచిన యడల అందు ప్రతిఫలించి యుండు ఆకాశముగు ఘటాకాశమునకును మహాకాశమునకును యట్లు భేదములేదో నట్లు మనస్సుతో గూడి యుండు జీవాత్మకును పరమాత్మకును మే నాకు భేదం భేదము గలదిగా నప్రతిభాతి తోచలేదు. విచారించగ తోచలేదు. తన్నుతా దెలసిన తోచలేదు. దత్తాత్రేయోపనిషత్తు నఘటోన ఘటోకాశో నదేహే నచ జీవకః కేవలం బ్రహ్మసంవిద్ధి వేద్య వేదక వర్జితమ్ వ్యాఖ్యానః కథం ఎట్లు ఘటేన ఘటముచేత ఘటాకాశః ఘటాకాశము న లేదు. తథా అట్లు దేహే నచ దేహముచేతను జీవకః ఆజీవాత్మ న లేదు. వేద వేదకవర్జితం తెలియుదగినదియు తెలుపదగినదియు ననువానిచేత వదలబడిన విడువబడిన కేవలం అద్వితీయుడగు బ్రహ్మ బ్రహ్మము సంవిద్ధి చక్కగ నెరుగుము.

ఘటముతోటి సంబంధము గాని ఘటమువలన గలుగుట గాని యింకయు యేవిధమైన సంబంధము ఘటాకాశమునకు లేదో అదెట్లనగ నాకు సమస్త ప్రపంచకము నిండియున్నది. కాబట్టి మనము కుండ బెట్టినచో కుండయందు గాన్పడు నాకసము ఘటాకాశము ఘటముపగిలి నవెంబడినే ఘటాకాశము మహాకాశమగును. అలాగే వ్యాపకుడయిన పరమాత్మకు దేహముతోడి యేవిధమయిన సంబంధములేదు. దేహము నసించినను జీవాత్మకు నాశ

నము లేదు. కాబట్టి జ్ఞాతృజ్ఞేయములు లేని కేవలాత్మనగు పరబ్రహ్మమే యగును.

ప్రపంచ మబద్ధము జీవుడు సత్యము జీవుడు ప్రపంచ స్వరూపుడు నిత్యమైనవాడు చలనము లేనివాడు జీవుడే పరమాత్మ ప్రపంచ స్వరూపుడును భేదము లేనివాడును పరిపూర్ణపదం కొరతలేని పదం వెలితిలేనిపదం వేదైః వేదములచేత గదితం చెప్పబడుచున్నది. ఉల్లేఖమాత్రం కొంచమయినను న లేదు, పరమాత్మ కన్నానితరమైన పదార్థమంతయు తానే తనకన్నా ఇతరం యించుకైనను లేదు.

గద్య ఇతి శ్రీభీమనిరంజన నిగమాగోచర గురువర కరుణాకటాక్ష వీక్షణా
యత్తచిత్త చైతన్యజగజ్జేగీయమాన ప్రకర్షితాత్మీతనై సచ్చిదానంద గుణ
గణాతీత వేదవేదాంగమంత్రమంత్రార్థ శ్రీసద్గురు పాదుకాపూర్ణదీక్షాపక్ష
దక్షత్వ శుద్ధనిర్గుణ నిజబోధ పరాయణా పారణపారాయణాధురీణ అజ్జరపు
సూర్యనారాయణాఖ్యవిరాజమాన ప్రభాసి ప్రజ్ఞాప్రకర్షితప్రబోధితనై
వేమూరి వాశపయః పారావారరాకాసుధాకరస్య కౌండిన్యసగోత్ర వీర
యభాగమాంబాకుక్షిజనిత హరితసగోత్రి సౌభాగ్యవతి సామ్రా
జ్యభోజ్య విద్యోపాసనావీర ప్రసాదకవనాకవిత కాశీంవులపల్లి
సూర్యనారాయణ యోగిప్రణీతంబగు శ్రీమహాఋషి
నిఘంటిత యోగశాస్త్రే బ్రహ్మవిద్యాయాం ఆత్మ
జిజ్ఞాస చతుర్మహావాక్య యోగము
షష్ఠమప్రకరణం సమాప్తము,



# శ్రీ మహాఋషి నిఘంటిత యోగశాస్త్రము.

## సప్తమ ప్రకరణము.

## బ్రహ్మసూత్రము.

—॥ భృగుమహాఋషి భరద్వాజులవారికి బ్రహ్మసూత్రము బోధించుట. ॥—

అద్వితీయుండగు పరబ్రహ్మముయొక్క విచారణమునందలి తలంపు, సృష్టిస్థితిలయములు గలిగి యొప్పుచున్న మహాప్రపంచికభయమును దొలంగించి రక్షింపగల నిత్యానందుండగు పరమేశ్వరుండైన మహాదేవగురుడైన నారాయణమూర్తిని ధ్యానించువారలకు అజ్ఞానము తొలగిపోవును. కర్మవశంబునం గలిగిన ప్రపంచకంబునందు రక్షకమపేక్షించు పురుషులకు బ్రహ్మసత్యం జగన్మిథ్యా యనువాక్యము జెప్పిన ఆత్మజ్ఞానములేని అజ్ఞానులకు తపోభిః॥ తపఃపూజాధ్యానాదుల పాపచయంబు దొలంగించుకొని యోగపుకలికి ప్రపంచంబునం దాసక్తి వదలి మోక్షేచ్ఛగలవారలకీఆత్మబోధను చెప్పుచున్నారు. సగుణబ్రహ్మోపాసనజపపూజాధ్యానదానాదులగు సత్కర్మాచరణంబున సమస్తపాపంబుల దొలగి ప్రపంచసుఖంబులయందు కోరికలుడిగి పరమార్థము నెరుంగగోరు ముముక్షువులకే యద్వైతవిచారణమందలి తలంపు పొడముచున్నది గాని యితరులకు గలుగనేరదు.

ఆంగీరసస్మృతి॥ యేన-ఏ, ఆత్మన- పరమాత్మచేత, ఇదమ్- ఈ, సర్వం- సమస్తప్రపంచమును, పూరితమ్- నిండింపబడియున్నదో, అభిన్నం- భిన్నములేనిదియు, అవ్యయం- నాశనములేనిదియు, నిరాకారమ్- రూపములేనిదియు, తమ్- ఆపరమాత్మకు, కథం- యెట్లు, ఆత్మ మనః- మనస్సుచేత వందేహి, నమస్కరించెదను. యీచరాచరప్రపంచమంతయు నిండియున్నవాడును భిన్నముగానివాడును పరమాత్మనుగూర్చి చిత్తముచేత నమస్కరించెదను. కావున తనచిత్తమునందు పరమాత్మను మనస్సుచేత తెలియబడును.

సంవర్తస్మృతి। కస్య- యెవ్వనికి, పంచభూతాత్మకం-పృథివ్యాపస్తేజో వాయురాకాశములను, విశ్వం- ప్రపంచము, మరీచిజలసన్నిభం- యెండమావులయందు నీళ్ళవలెను, భవతి- అగుచున్నదో, తస్యాపి- వానికే, అహం నేను, ఏకం- ఒక్కడనై, నిరంజనః- నాశరహితుడనై, నమః- నమస్కరించుచున్నాను, పంచభూతములచేత గలిగిన ప్రపంచ మెవ్వనికి గిరణములయందలి జలముభంగి నగుచున్నదో అట్టి పరమాత్మను నేనొక్కడనై నమస్కరించెదను. శాతాపతస్మృతి॥ సర్వం- సమస్తప్రపంచమును, కేవలం- ఒక్కడనై, ఆత్మైవ- పరమాత్మయే, తస్మిన్- ఆబ్రహ్మమునందు, భేదా- భేదః- భేదాభేదములు, నవిద్యతే- లేదు, తత్- ఆపరబ్రహ్మము, అస్తి- కలదనిగాని, నాస్తి లేదనిగాని, కథం- యెట్లు, బ్రూయాం- చెప్పెదను. సమస్తచరాచర ప్రపంచమంతయు నద్వితీయుండగు పరమాత్మయె పరమాత్మకన్న భిన్నంబైన వేరుపదార్థ మొక్కటియులేదు. కావున అతనియందు భేదము అభేదము లేదు. కాబట్టి పరమాత్మయందు భేదాభేదములు గలదనిగాని లేదనిగాని యెట్లు నిర్దేశించి చెప్పెదను. ప్రచేతస్మృతి॥ హిరణ్యగర్భాదిస్థావరాంతేషు శరీరేషుచయద్వైకం చైతన్యం మస్తితదేవాహమస్మీతి దృఢజ్ఞానసిద్ధి భూయాత్॥ బ్రహ్మమొదలగు సమస్తస్థావరణములయందు గాని శరీరములయందు గాని యేచైతన్యముగలదో ఆచైతన్యంబే తానని దృఢజ్ఞానము గలుగుగాక యని యీస్మృతియందు పరమాత్మ యద్వితీయుండనియు వ్యాపకుండనియు చెప్పబడెను. బ్రహ్మైక్యపరిపూర్ణసమాధిః- యెట్టిదనిన, యిందుకు స్మృతియుపనిషత్॥ ప్రమాణంబులు చెప్పుచున్నవి.

శ్లోకం॥ చిత్తాకాశం, చిదాకాశం, మహాకాశం చ తృతీయకం ద్వాభ్యాం శూన్యతరంవిధి- చిదాకాశం మహామునే॥

శ్లోకం॥ చిదాకాశం, మహాకాశం ఆకాశంచ తృతీయకం సూన్యం కృత్వాచిదాకాశం మహాకాశం మవాప్నుయాత్॥

శ్లోకం॥ భావాభావద్వయంత్యక్త్వా, నిరాకాశస్థితర్భవ సర్వేంద్రియ వినిర్ముక్తం జ్ఞానం యత్రవిలీయతె తత్రిజ్ఞానవిశ్వైక్యసమాధితస్యలక్షణం॥

శ్లోకం॥ వ్యోమాతీతం తమాత్మానం ఆత్మమధ్యేని రామయం వ్యోమానమాత్మకురీత సమాధితస్యలక్షణం॥

శ్లో॥ ఆకాశం మానసంకృత్వా మనఃకృత్వానిరాస్పదం నిశ్చలంతం విజానీయాసమాధితస్యలక్షణం॥

శ్లో॥ పూర్ధ్వపూర్ణ, మధఃపూర్ణ మధ్యపూర్ణ యదాత్మకం- సర్వపూర్ణతదాత్మేతి సమాధితస్యలక్షణం॥

శ్లో॥ పూర్ధ్వసూన్యమధః సూన్యం మధ్యసూన్యం యదాత్మనః సర్వసూన్యంతదాత్మేతి సమాధితస్యలక్షణం॥

శ్లో॥ ప్రభాసూన్యం- మనసాసూన్యం- బుద్ధిసూన్యం, నిరామయం సర్వసూన్యనిరాభాసంసమాధితస్యలక్షణం॥

శ్లో॥ శూన్యభావితభావాత్మాపుణ్యపాపైః ప్రముచ్యతే యిత్యాది సమాధివాక్యము చెప్పుచున్నవి. యీఉపనిషత్ ప్రమాణములు నిర్గుణబ్రహ్మమునుగురించి చెప్పుచున్నవి.

సమాధిలక్షణములు యిదివరకు అనేకములు చెప్పియున్నవి గాని యీ యుపనిషత్తు వాక్యములనుబట్టి విచారణచేయగా కేవల నిర్గుణపరబ్రహ్మము ను గురించి చెప్పుచున్నవి. అట్టినిర్గుణపరబ్రహ్మమునుగురించి గోచరించినంత వరకు వ్రాయడమైనది.

బ్రహ్మంబన నెట్టిదనిన—

ప్రచేతస్మ్రుతి॥

సంయోగశ్చ-కూడికయును, వియోగశ్చ-యెడబాటును, మే-నాకును న-లేదు, తే-నీకు, న-లేదు, త్వం-నీవును, న-లేదు, అహం-నేను, న-లేదు, ఇదం-ఈజగత్తును, న-లేదు, సర్వం-సమస్తప్రపంచమును, కేవలం-అద్వితీయుండైన, ఆత్మైవ-ఆపరమాత్మే తాను, తానే పరమాత్మ. ఈపరమాత్మే ఆకశలోనిమ్కళ. ఈనిమ్కళే పరబ్రహ్మం. సంయోగవియోగములు నీకులేవు. నాకులేవు నీవునులేదు నేనునులేదు యీజగత్తునులేదు యీసమస్తము కేవలుండనైన పరమాత్మయే.

అస్య-ఈ-శబ్దాదిపంచకస్య- శబ్దగుణకమాకాశపంచకమను వాక్యము బట్టి ఆకాశాదిపంచమహాభూతములయొక్క సముదాయః-సముదాయమును, త్వం-నీవు, నైవాశి-కానేకావు, పునః-మరల, తే-నీకును, న-లేదు, పరమం-వుత్కృష్టమైన, జన్మ-పుట్టుకయు, మృత్యుః-చావును, తే-నీకు, న-లేదు, చిత్తం-బుద్ధియు, న-లేదు, బంధమోక్ష-కట్టువిడుపులును, న-లేదు, శుభాశు

భ్రా-మేలు కీడును, న-లేదు, తే-నీకును, నామ రూపం-పేరును, రూపమును, న-లేదు; అహోచిత్రం-ఆశ్చర్యము, కథం-యట్లు, భ్రాంతః-భ్రాంతినిపొందిన వాడవై యున్నావు,అభిన్నం భేదములేని, ఆత్మానం-పరమాత్మను, పశ్య-చూచి, రాగత్యాగాత్-ఆసక్తిని వదలుము. తాను ఆకాశాదిపంచమహాభూతములయొక్క సముదాయముకాదు. తనకు ఆకాశాదిపంచభూతములయొక్కయు సంబంధము లేదు. జననమరణములు బుద్ధి బంధమోక్షములు మంచి చెడుగులు శరీరమనే పేరు తనకు లేదు. తాను యేలభ్రాంతినొందినవాడవై పిశాచమువలె తిరుగుచున్నావు. అఖండస్వరూపుండైన పరమాత్మ తానై ఆసక్తి వదలుము.

హారీతస్మృతి॥

త్వమేవ-నీవే, తానే వికారవర్జితః-వికారమునుండి విడువబడినదియు, నిష్కంపం-వణుకులేనిదియు, అనగ చలనములేనిదియు, విమోక్ష-విగ్రహం-మోక్షస్వరూపమైన, ఏకం-ఒక్కటియగు, తత్వంహి-జ్ఞానస్వరూపమైన, తే-నీకు, రాగశ్చ-అనురక్తియు, న-లేదు, నిర్గుణం-సత్వరజస్తమోగుణములు లేనివాడు గాను, శుద్ధం-పరిశుద్ధమైనదిగాను, సమం సమస్త జీవరాశియందు భేదము లేక సమయముగా యత్-యేజ్యోతిస్వరూపమును, శ్రుతయః-వేదములు, సర్వే-సమస్తములు, వదంతి-చెప్పుచున్నవో, సంశయః-సంశయము లేదు, సాకారం-రూపములో నూనినది, అనగా కనుల కగుపడునవి, అనృతం-అబద్ధమని, విద్ధి-యరుగుము, నిరాకారంతు-రూపములేని నేత్రములకు గోచరముగాని. పరమాత్మయే, నిశ్చలం-చలనములేనిది, స్థిరః స్థిరమైనది, ఏతతత్వోపదేశేన- ఈజ్ఞానోపదేశముచేత, పునర్భవసంభవః మరలపుట్టుకయొక్క-కలుగుట, న-లేదు, సమం-భేదములేని, తత్వం-ఆజ్ఞానము, ఏకమేవ-ఒక్కటియేయని, విపశ్చితః-పండితులు, వదంతి- చెప్పుచున్నారు.

అనాత్మరూపస్య-అసద్రూపముయొక్క సమాధిః-బ్రహ్మనిష్టయొక్కయు కథ-యందుకు ఆత్మస్వరూపస్య-సస్వరూపముయొక్క-సమాధిః బ్రహ్మనిష్ట ఆస్తీతి-వున్నదిగాని నాస్తీతి-లేదనిగాని సమాధిః-బ్రహ్మనిష్ట సర్వం-సమస్తమును ఏకం-ఒక్కటియగు మోక్షస్వరూపం ఖలు-ముక్తిస్వరూపం గదా అటువంటిముక్తిస్వరూపంబనె బ్రహ్మస్వరూపం విదేహం-శరీరములేనిదియు అజం-పుట్టుకలేనిదియు అవ్యయం-నాశనములేనిదియు సమం-భేదములేనిదియు

విశుద్ధః-మిక్కిలి పరిశుద్ధుడైన ఆత్మానంపరమాత్మ. తత్వమశ్యాదివాక్యేన-తత్వమసిమొదలగు మహావాక్యములచేత ఆత్మాహి- జీవాత్మయే, బ్రహ్మ-బ్రహ్మస్వరూపమని, ప్రతిపాదితః- స్థాపింపబడినది, తదాహి- అదియుక్తమే ను, శ్రుతః- వేదము, అనృతం- అబద్ధముయిన, పాంచభౌతికం- పంచభూతాత్మకంబగు. జగత్తు- నేతినేతీతి- కాదుకాదు, అశి- బ్రూయాత్- పలుకును, తత్వమశి- అహంబ్రహ్మాస్మి సర్వంఖల్విదం బ్రహ్మ! ప్రజ్ఞానం బ్రహ్మమొదలగు మహావాక్యములచేత జీవాత్మయే పరమాత్మ యనిచెప్పబడినది. ఇదే అభేదజ్ఞానము, అనిత్యంబైన శరీరము నేనుకాదని వేదము ఘోషించుచున్నది. ఇట్లు నేతినేతీతి నేతీతి నేషితం పూర్ణముచ్యతె పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదీరితం పూర్ణస్యపూర్ణమాదాయ పూర్ణమేవశిష్యతె॥ అవశిష్టం-పుట్టుకలేనివాడును, అవ్యయః- నాశనములేనివాడును, త్వం-నీవు ఏకం- ఒక్కడవై, ఏవంహి- యిందువలన, సర్వేషు- సమస్తప్రాణులయందును, సమం- సమముగా, సదా- ఎల్లప్పుడు, స్థితః- ఉండువాడును, అశి- అగుచున్నావు, దివాచ- పగలును, నక్తంచ- రాత్రియును, న- లేదు, నిరంతరం-శాశ్వతుండు, సర్వం- సమస్త ప్రపంచస్వరూపమును, ఏకం- ఒక్కడను, అనగ అద్వితీయుండను అగు, ఆత్మానం- పరమాత్మను, సంతతం- యెల్లప్పుడును, అభిన్నం- భిన్నంగానివాడును, మృతః- చచ్చినవాడవు, నాస్తి- లేదు, కావు, జాతః- పుట్టినవాడవు- నాస్తి- లేదు కావు, సర్వం- సమస్తప్రపంచమును, బ్రహ్మ- బ్రహ్మస్వరూపమును, ఇతి అశి విఖ్యాతం- ప్రశిద్ధమైనదని, శృతిః- వేదము, బహుదా- పెక్కువిధములుగా, బ్రవీతి- బలుకుచున్నదిః.

ఆత్మ- పరమాత్మ, అవిభక్తం- భాగింపబడినదియును, న- కాదు, విభక్తం- భాగింపబడునదియుకాదు, ఆత్మ- పరమాత్మ, దుఃఖసుఖేనచ- సుఖదుఃఖములతో, సహితః- కూడినది, నహి- కాదు, త్వం-నీవు, ఆత్మానం- పరమాత్మవుగా, అవ్యయం- నాశరహితునిగా, విద్ధి- యెరుగుము. నాకన్నభిన్నంబైనకర్మయొక్కటియులేదు- నేనుచేయువాడనుగాను- నాకంటె భిన్నంబైనదెద్దియులేదు- కావున, శృతి॥ నాహంకర్మానభోక్తాచ నమెకర్మపురాతనం నమెదేహో విదేహోవ నిర్మమేతిమమేతికిమ్॥ నేను అనుభవించువాడనుగాను- నాకు గార్యములేదు గావున సంచితకర్మయులేదు. నేను నిత్యుండను. ఇట్లుండ-నాకనురాగవిరాగము లెక్కడివి గావున నాకుదేహములేదు. నేనువ్యాప

కుండ గావున దేహములేనివాడనుగాను. అనగ- నేను ఆపస్తంభస్మృతి॥ అవాఙ్మానసగోచరః- మనస్సునకు గోచరుడను అగోచరుడను గాబట్టి-

గౌతమస్మృతి॥ దుఃఖదేహాదికం- దుఃఖముతోగూడిన శరీరము మొదలుగాగలది; తం- నీవు, నహి- లేవు, ఆత్మానం- పరమాత్మగా, అహం- నన్ను, విద్ధి- యెరుగుము, శ్రుతి॥ ఇదం- ఈ, సర్వం- సమస్తమైన జగత్తున్ను, శ్రుతి॥ అనాత్మదృష్టై అవివేకనిద్రా అహంమను స్వప్నగంగతోహం॥ అనగ కలలోన నరుకులాడి కలవెగాయములు మేలుకాంచినవెనుకన్ దెలియకము నుపటుసంశ్రుతి కలకలువిజ్ఞాని కేలగలుగందోచున్॥ ఉశనస్మృతి॥ ఇదం- ఈ, సర్వం- సమస్తమైనజగత్తున్ను, స్వప్నభ్రాంతివత్- తత్సర్వంజగత్తు గావున సారభూతం. ముఖ్యాంశమైనదో, తత్- ఆ, త్వమేవ- నీవే, ఆత్మానం- పరమాత్మవు, అసి- అగుచున్నావు, అనిమయా- నాచేత, తే- నీకు, ధితం- చెప్పబడినది, ఆశ్లాయనస్మృతి॥ జ్ఞానం సంప్రాప్తసమయే విగతాశయః॥ తీర్థే వా అథవా గేహే నష్టస్మృతి పరిజేత్ అసౌ ముక్తం భవతి॥ ఇత్యాదిశ్రుత్యర్థః- జ్ఞానం సంప్రాప్తసమయె॥ శ్రుతి॥ గురోర్ముఖె నజ్ఞాతవ్యం-అన్యదానోఫలభ్యతె॥ అనునట్లు గురుముఖవివేక జ్ఞానోపదేశముచేత, తన్ను తాతెలిసిన- బ్రహ్మాత్మైక్యసమాధి నిష్ఠాగరిష్ఠులైన ఆసూచనకాలమందు- విగతాశయః- వదలినయభిప్రాయములు గలవారై, తీర్థేవా- పుణ్యతీర్థమునందుగాని, అథవా- లేక, గేహే- యింటియందుగాని, నష్టస్మృతి- పోయినస్మృతిగల శరీరమును, పరిత్యజేత్- వదలవలయును, అసౌ- యిట్లుచేసినవాడు, ముక్తః- విడువబడినవాడు, భవతి- అగుచున్నది. స్మృతి॥ ధర్మార్థకామమోక్షాశ్చ, వియదాదిసచరాచరం మన్యంతె యోగినస్సర్వం మరీచి జలసన్నిభమ్॥

అహం- నేను, మంత్రం- మంత్రమును, నహివిందతి- యెరుగలేను, ఛందోలక్షణతంత్రం- ఛందస్సుయొక్కయు లక్షణముయొక్కయు తంత్రమును, నైవవిదంతి. యెరుగనేయరుంగను, అహం- నేను, సమరసమగ్నః- కామాది శత్రువర్గములతోగూడి యుద్ధమునందు చక్కగ మునుంగనివాడయు, భావితపూతః- భావింపబడిన పరిశుద్ధుడైన, ఏతత్- ఈబ్రహ్మజిజ్ఞాస, మయా- నాచేత, ప్రలపితం- ప్రలాపింపంబడినది, అహం- నేను, కథం- యెట్లు, ఆత్మానం- పరమాత్మను, అస్మి- అగుచున్నాను, యః- ఎవ్వడు ప్రణవమంత్రమును, నహి విందతి- నహివిందతి- యెరుగనేయెరుగడో, సః- వాడు, ఛందోలక్షణతంత్రం-

వేదములయందు చెప్పబడినలక్షణములుగల బ్రహ్మముయొక్క రహస్యార్థమునునైన యెరుగనేయెరుగడు. సమరసమగ్నః- అభేదమైన బ్రహ్మముయొక్క పరమానందమున మునింగినవాఁడై, సర్వం- సమస్తము, శూన్యం- లేనిది,న-కాదు, అశూన్యంచ- వున్నది, న- కాదు, సత్యాసత్యం- నిజమును అబద్ధమును, నవిద్యతే- లేదు, స్వభావభావతః తనయభిప్రాయ ప్రకారంగాను, శాస్త్రసంపత్తిపూర్వకం- వేదాంతశాస్త్రముయొక్క సమృద్ధిపూర్వకముగా, మయా- నాచేతచెప్పబడినది గావున అట్టిబ్రహ్మంబైన సద్గురుండు యెట్టివాడనగ, ఆశ్లాయనస్మృతి॥ బాలస్యవానిఖిలభోగరతస్యవాపి మూర్ఖస్య సేవకజనస్యగృహస్థితస్య, యేతద్గురోః కిమపినైవవిచింతనీయం, రత్నం పరిత్యజతి కోప్యసుచౌ ప్రతిష్ఠం॥ ఇత్యాదిస్మృత్యోశ్య పనిషత్॥

బాలస్యవా- బాలునియొక్కయు, నిఖిలభోగరతస్యవాపి- సమస్తములైనభోగములయందు ఆసక్తుడయినవానియొక్కయు, మూర్ఖస్య- మూర్ఖునియొక్కయు, సేవకజనస్య- పరిచారకులయొక్కయు, గృహస్థితస్య- ఇంటనుండువాని యొక్కయు, యేతత్ గురోః- ఇట్టిగురువుయొక్క, ఉపదేశః- ఉపదేశము, కిమప్యేవ- యెంతమాత్రము, న- కూడదు, గురోః- గురువుయొక్క, గుణం- గుణమును, విచింతనీయం- మిక్కిలి ఆలోచింపదగినది, కోపి- యెవ్వడయ్యను అనగ ప్రతివాడును, అసుచౌ-అమేధ్యమునందు, ప్రతిష్ఠం- వుండునట్టి, రత్నం- రత్నమును, అనగ మేలైనపదార్థమును, పరిత్యజతి- దలచుచున్నాడు, కావున లోకంబున నెవ్వండును నేప్రకారము అమేధ్యంబుననుండునట్టి మేలయినపదార్థమును గ్రహింపక వదలుచున్నాడో అట్లే గురువు వేదాంతశాస్త్రసంపత్తి గలవాడయ్యను ఆతండు బాల్యము, సమస్తభోగాసక్తి, మూర్ఖత్వము, సేవకత్వము, గృహాసక్తి గలిగియుండెనేని అతనియొద్ద నుపదేశము జేసికొనరాదు. కావున, ఆచార్యునివిషయమైఅనగ వుపదేశించు గురువువిషయమై విచారింపదగినది అనగ, నిజగురువులను వెదకి విచారించవలెను.

మనుస్మృతి॥ అత్ర- ఇచ్చట, అనగ విషయములయందు, చిత్రకరణాది- చిత్రములైనకార్యములు మొదలైనవి. విచింతనీయం-ఆలోచింపదగినది, నైవ- కానేకాదు, పరం- ఉత్కృష్టమైన, 'గుణావత- గుణములుగలదాని చేత, సారమేవ- ముఖ్యాంశమునె, గ్రాహ్యంఖలు- గ్రహింపదగినదిగదా,

భువి- భూమియందు, సింధూరచిత్రరహితా- యెఱ్ఱనైనచిత్రము బలేనిదియు, రూపశూన్యా- రూపము లేనిదియునగు, చిత్రం-చిత్రమును, గంతు కామాః- పొందుటకుతగినకోరికలును, పారం- సముద్రపుగట్టును, నౌరివ- ఓడ వలె, పారం, సముద్రపుగట్టును, పారం- సంసారముయొక్కగట్టును, నయతి కిం న- పొందింపలేదాయేమి అనగ వేదాంతగ్రంధమునందలి చిత్రమైన యలంకారాతిశయములు చింతింపదగినదిగాదు. అందులోనుండు సారమునే గ్రహింపవలెను ఎట్లనగ, శృతి॥ అనంతశాస్త్రం బహువేదితవ్యం॥ అల్పశ్చ కాలో బహువశ్చవిఘ్నా యత్సారభూతం తదుపాశితవ్యం॥ హంసోయథాక్షీరమివాంబుమిశ్రం॥ పాలు నీళ్ళు కలియబోసిన వివకుత హంస కొంగ యీ రెంటిలోవిభాగించె నేర్పు హంసకుయున్నదిగాని కొంగకు లేనేలేదు కాబట్టి ఓడ యెట్లు సముద్రముగట్టును బొందుచున్నదో అట్లె సంసారమునే గట్టును ముక్తిని పొందుచున్నది. శాస్త్రసారమును గ్రహించవలెను. చరాచరప్రపంచ స్వరూపంబును, స్వభావముగ శాంతమైనదియు, నిరాకాశమైనదియు నగుపరమాత్మ నెవ్వడును తత్వవిచారంబున తెలుసుకొనుచున్నాడో ఇక నెట్లును దెలుసుకొనదరముగాదు. కాబట్టి, తనకన్న భిన్నంబైన వేరొక్క పదార్థము లేదనియు, జంగమస్థావరాంతకమైన ప్రపంచము తానే యనియు సర్వాత్మకంబైన ప్రపంచము ఒక్కటేయనియు ప్రయత్నముచేయుకనే యెఱుగుచున్నాడు.

అట్టి ప్రపంచరూపంబైన పరమాత్మ యెల్లప్పుడును-కాలత్రయములు లేనిదియునై సమస్తమును బొందినదియు నెప్పుడును భేదము లేనిదియు నద్వితీయంబునునై వర్తిల్లుచున్నది.

ఆనందస్మృతి॥ యస్మాత్-ఏకారణమువలన, సారాత్- సారమునకంటె అనగ ఆనందమునకంటె, సారితం- శ్రేష్ఠమును, సారమే- యుత్కృష్టమైన బ్రహ్మానందమై, తస్మాత్- ఆకారణమువలన, అహమేవ-నేనే, ఆత్మానం-పరమాత్మ, యత్- ఏది, సర్వావయవ నిష్క్రాంతం- సమస్తఅంగములచేతను, ఆక్రమింపబడినదియును, భవతి-అగుచున్నదో, తత్-ఆపరమాత్మను, అహం-నేను, భవతి- అగుచున్నాను. సంపూర్ణత్వాత్- నిండినదియగుటవలన, త్రిదశాదికం- స్వర్గలోకము మొదలగు సమస్త ప్రపంచస్వరూపంబైన, ఆత్మానం-పరమాత్మను, యథా- యట్లు, జలే- నీళ్లయందు, బుద్బుదాః- నీటిబుగ్గలు,

ఉత్పద్యంతే- పుట్టుచున్నవై, విలయంతేచ- కలసిపోవుచున్నవో, తథా- ఆ ప్రకారము, వృత్తిమాంశ్చ- సంసారవ్యాపారముగలవాడు, ప్రమాదేవ- మరుపుచేత, ఉత్పద్యంతే-పుట్టుచున్నాడు, విలీయంతే- చచ్చుచున్నాడు, సంశయః- సంశయము, న-లేదు, కావున అహం- నేను, మరుపుచేతపుట్టుచున్నాను ఇత్యాహమాత్రిప్రభుశ్రుషిః- సుషుప్తియందు మెళుకువ వచ్చినట్లుగనే నీటియందు బుద్బుదప్రాయంబుగ పుట్టుచున్నదిగావున- ఆకస్మికముగా పుట్టుచున్నది. అనగ, నీళ్లయందు నీటిబుగ్గలు పుట్టుచును కలసిపోవుచున్నవో ఆ ప్రకారము సంసారవ్యాపారముగలవాడు, ప్రమాదవశంబువం బుట్టుచును చచ్చుచున్నాడు. ఇందుకు సంశయములేదు. అనగ, వృత్తి యిచ్ఛ గలవానికే జననమరణములు గలవు. వృత్తి యిచ్ఛలేనివానికి వుత్పత్తినాశనములు లేవు- గావున యెట్లనగ—

మేధాస్మృతి॥ మహదాదీని- మహాతత్వము మొదలైన, భూతాని-భూతములను, సదా- యెల్లప్పుడును, మయి-నాయందు, స్థితాన్యపి- వున్నవిఅయినను, బహిః- వెలుపల, స్థితాని- ఉన్నవి, భవంతి- అగుచున్నవి, యథా- యే ప్రకారము, జలం- నీళ్ళు, మృదాదిషు- మొత్తని పదార్థములయందును, కటుకేషుచ కారమైన పదార్థములయందును, స్థితం- వున్నదో, ఏవం- యీ ప్రకారం, స్థితాని- వున్నది గావున కారముతోగూడినజలము, మెత్తనితనముతోగూడినజలము చల్లదనముతోగూడిన జలము యెట్లు శుద్ధజలముకన్న భిన్నము గలదో, అట్లు ప్రకృతికన్న అనగ పరమాత్మకన్న, పురుషుడు అనగ, జీవాత్మ భిన్నముగాదని నాకు తెలియవచ్చుచున్నది. నామరూపప్రపంచము లేనిదియు అనగ, శ్రుతి॥ మూలాభావఇదంజ్ఞాతుంనశకేరం నకిమస్తి॥ అని వుపనిషద్వాక్యము. సూక్ష్మముకన్నసూక్ష్మమైనదియు, శ్రుతి॥ అణోరణీయాన్ మహతోమహీయాన్॥ అనునట్లు, పరమాణువైనదియు పరమశ్రేష్ఠమైనదియు, మనస్సు, బుద్ధి, ఇంద్రియములు, వీనికన్న నధికరించినదియు, విలక్షణమైనదియు, కలకలులేనిదియు ప్రపంచమునకు ప్రభువును అనగ సర్వాధారంబైన పరమాత్మ—పంచేంద్రియ వినిర్ముక్తం, పంచకోశవిలక్షణం, పంచభూతాదిసంగత్వ- సఏవపరమశ్శివః॥ ఇత్యాద్యుపనిషత్ ప్రమాణాత్॥

అదృశ్యం సహజంయస్య తత్రచలనంతుకథంభవేత్ త్వమేవ హికథంతత్రిచరాచరం॥ యత్ర- యందు పరబ్రహ్మమునందు, అదృశ్యం-

శానశామి, సహజం- స్వభావమో, తత్రతు అపరబ్రహ్మమునందు, త్వమేవ- నీవే, కథం- యెట్లు, తత్- అపరబ్రహ్మమునందు, చరాచరం- స్థావరజంగ మాత్మకమైన ప్రపంచము, కథం- యెట్లు- అపరబ్రహ్మము నేత్రేంద్రియము లకు గోచరము గానిదియు, గావున దానికి చలన మెట్లు కలుగుచున్నది. నీవు ను, చరాచర ప్రపంచమెట్లు పరబ్రహ్మమగును. శ్రుతిస్మృతి॥ ఆకాశస్యగు ణశ్శబ్దోనిశ్శబ్దో బ్రహ్మముచ్యతే। ఇత్యాదిశ్రుతులు చెప్పుచున్నవి. నిశ్శబ్దా కాశముతో సమానమైనట్టి స్వయంప్రకాశము అయిన, శుద్ధచైతన్యమే నిశ్శ బ్దాకాశముతో సమానమైనది నిర్లిప్తమైనదియు సమస్తము నెరుంగునదియును నిండియుండునదియును ఘటమునందలి యాకసమునకు యెట్లు ఘటమునకు గలుగు వుపధులు అనిశ్శబ్దాకాశంబైన పరమాత్మకు లేవో అట్లె పరమాత్మ కు దేహాద్యుపాధులులేవు. కాబట్టి చరాచరప్రపంచము పరమాత్మ నీవు పర మాత్మ గాబట్టి- అపరమాత్మ భూమియందు గదలిక కలదియుగాదు. దాని గాలి తాకుడుతగలదు. నీళ్ళచేత తడియునదికాదు. తేజోమధ్యంబున జ్యోతి స్వరూపముగా వెలుగుచున్నది అనిఅగ్నివలన దహించునదిగాదు. గీత॥నయనం ఛిదంతిశస్త్రాణినయనందహతిపావకః నచైనంక్లేదయంత్యాపోన శోషయతిమారు తః॥ పృథివ్యాంచలనంనైవ మారుతేనచవాహితం వారిణాహితంనైవ తేజో మధ్యేవ్యవస్థితం। వసుధలోనణగదు- వార్ధిలో మునుగదు- గాఢాగ్నిచేత దగ్ధం బుగాదు- గాలికికూలదు. కలుముఁజిక్కదు- పాషాణములనైన పగిలిపోదు- యెండకుయుండదు- యెండనీడకురాదు- ఘనపాశములనైన గట్టుపడదు. చలికి వణకదు, భయములకులికిపడదు. బ్రహ్మమైయుండు-పరిపూర్ణ మమలచరిత॥ ఇట్లు చెప్పుచున్నవి. కావున, తత్- అపరబ్రహ్మము, కేనచిత్- ఒక్కనిచేత నున్ను,అవ్యాప్తం- వ్యాపించ డలేదు, సః- అపరబ్రహ్మము, బాహ్యాభ్యంత రం- లోపలను, వెలుపలను, తిష్ఠతి- వున్నది. అవిచ్ఛిన్నం- భేదింపరానిది నిరంతరం- శాశ్వతమైనది. శ్రుతి॥ అనిదమూల జ్ఞప్తికళామాత్రి శరీరం నా స్తికేవలం। ఇత్యాది అపరబ్రహ్మము సూక్ష్మమగుటవలనను గానరానిదియగు టవలనను, గుణత్రయములు లేనిదియగుటవలనను మాయాస్వాధీనము కాద ని యెంచి మాయను వదలవలయును.

కృతయుగస్మృతి॥ మనస్మృతి॥ యదా- ఎప్పుడు, సతతాభ్యాసయు క్తః- సంతతము అభ్యాసముచేయువాడు, నిరాలంబస్తు- అధీనముగానివాడును,

భవేత్- అగునో, తథా- అప్పుడు. అంతర్గుణదోషవివర్జితః- అంతస్సునం దు గుణదోషములచేత విడువబడినవాడై, తర్లలయాత్- బ్రహ్మమునందు లీనమగుటవలన- లీయతేన, కలిసిపోవును.

ఎప్పుడు ఆత్మవిచారము సార్వకాలము చేయువాడు మాయకు లోబడనివాడు నగునో అప్పుడు అంతస్సునందు గుణదోషములు విడిచినవాడై అ బ్రహ్మమునందు లీనముచేత కలసిపోవుచున్నాడు- గావున త్రేతాయుగ స్మృతి॥ గౌతమస్మృతి। రాద్రిస్య-తామసనసంబంధమైన, మోహమూర్ఛాప్రదస్య- వలపుమూర్ఛలచేత నిండినదగు, విషవిశ్వస్య- విషస్వరూపమైన ప్రపంచముయొక్క, వినాశాయ- నసించుటకొరకు, అమోఘం- దోషరహితమైన, సహజామృతం- స్వభావమైనదియు నాశములేనిదియు నగు బ్రహ్మజ్ఞానమనెడు అమృతమొక్కటె ప్రసిద్ధముగా నొక్కటె యున్నది-

ఆత్మోపనిషత్॥ సాకారం- స్వరూపముతో గూడుకున్నది, అనగా- (సాలభంజిక,) దృష్టిగోచరం- చూపునకు దెలియునది అనగ కండ్లకుకనబడునది, నిరాకారం- స్వరూపములేనిది, అనగ- పరమాత్మ, భావగమ్యం- మనస్సుచేత బొందదగినది అనగ మనస్సుచేత నెరుంగదగినది, భావాభావవినిర్ముక్తం- కలిమిలేములచేత విడువబడినదై, అంతరాళం- మాయకుస్వాధీనముగాక యంతరాళముగా నుండునదని, తత్- అపరమాత్మ, ఉచ్యతే- చెప్పబడును.

ఆకారముగల పదార్థములన్నియు కండ్లకుగనబడుచున్నవి. స్వరూపము లేని యాపరమాత్మ మనస్సుచేతనే యెరుగదగినది. స్థూలసూక్ష్మకారణ శరీరములను శరీరత్రయములకు విలక్షణుడు పరమాత్మకాబట్టి- అట్టిపరమాత్మ కండ్లకు గానబడదు. మనస్సుచేతనే యెరుగదగినవాడు అపరమాత్మ భావాభావములను విడిచినవాడు అపరమాత్మమాయకు స్వాధీనముగాక అనగ మాయాసంబంధములేక అంతరాళముగా నుండువాడు గావున- బాహ్యాభిప్రాయము భార్యాపుత్రులు మొదలగునవి ప్రపంచమగుచున్నది. అభార్యాపుత్రులు మొదలగువానిని మనస్సునదలచుటయె సంసారమని చెప్పబడుచున్నది. ఈసంసారముయొక్క వాసన టెంకాయలోని నీళ్ళతెరంగున దెలియనగులేక ప్రపంచమునందలి పరమాత్మ టెంకాయలోని నీళ్ళతెరంగున దెలియనగును. ఇందుకు ద్వాపారస్మృతి॥ శంకవిహితస్మృతి॥ బాహ్యాం- భావం- విశ్వం- భవేత్- అంతః- ప్రకృతిఉచ్యతే- అంతరాత్- అంతరం- నారికేళఫ

లాంబువత్ - ఉచ్యతే॥ ఇత్యాదిశ్రుతులు పైవ్రాసినయర్థంబునకు అన్వయము-

బాహ్యే- ప్రపంచమునందు, భ్రాంతిజ్ఞానం- భ్రమరూపమైన వివేక ము, స్థితం- ఉన్నది, సమ్యక్- రూఢిగా, మధ్యగం- మనస్సును బొందునట్టి, జ్ఞానంచ- జ్ఞానమును, స్థితం- ఉన్నది, మధ్యాత్- నడిమికంటె మనస్సుకంటె, మధ్యతరం- నడితరము, శ్రేష్ఠమైన హృదయకమలమునందు పరమాత్మ, నారికేళఫలాంబువత్- టెంకాయలోని నీళ్ళతెరంగున, జ్ఞేయం- తెలియదగి నది — ఎట్లనగ, ప్రపంచమునందు భ్రాంతిరూపమైన వివేకమువున్నది. మన స్సును బొందునట్టి రూఢజ్ఞానమున్నది. మనస్సుకన్న నగోచరమైనజ్ఞానము అనగ ప్రపంచజ్ఞానము భ్రాంతిరూపకమైనది. ఈశ్వరు డున్నాడని నిశ్చయిం చుజ్ఞానము మనస్సును బొందినది. మనోగామికన్న అధికమైన తత్వస్వరూప ము టెంకాయలోని నీళ్ళతెరంగున దెలియదగినది. కావున, కలియుగపార శరస్మృతి॥ ఏవంజ్ఞాత్వాత్వము మార్గంయోగినాం నైవకల్పితం వికల్ప వర్జితం తేషాం స్వయంసిద్ధం ప్రవర్తతే॥ అముం- యిట్టిమార్గము, మార్గం- మోక్షమార్గమును, ఏవం- యీప్రకారము, జ్ఞాత్వా- తెలసికొని, యోగీ నాం- నమచుజ్ఞానులకు, నైవకల్పితం- ప్రపంచము కల్పింపబడనె లేదు, విక ల్పవర్జితాం, సంకల్పములనుండి విడువబడిన, తేషాం- వారలకు, సిద్ధికి- ముక్తి స్వాయం- తానే, ప్రవర్తతే- ఉన్నది. మోక్షమార్గ మిట్టిదని యెరింగిన జ్ఞాను లకు ప్రపంచము కల్పింపంబడలేదు. కోరికలులేనివారికి స్వయముగానే ముక్తి గలుగుచున్నది గావున కర్మకులకు ముక్తిమార్గము గలదని చెప్పుమాట మా త్రిమేగాని, ఇది తథ్యముకాదు. చిత్తవృత్తులు వదలిన యోగులకు చెప్పబడి నమార్గము సంసారమును వదలుటె మోక్షమని- ముక్తియని చెప్పబడును. కావున కర్మజన్మ రహితమే మోక్షం బంధరహితమేమోక్షం గావున తన్ను తాదెలియుటె ముక్తి. చిత్తవృత్తులను వదలిన యోపుణ్యతీర్థములయం దు మృతిబొందినప్పటికిన్ని- లేక మరెక్కడ మృతిజెందినప్పటికిని- పరమో త్కృష్టమైన బ్రహ్మమునందు లీనమవుచున్నాడు. ఆయోగి మరల జన్మించడు గావున ఎవ్వడైతే పుట్టుకలేనిదియు, తలంపనశక్యమైనదియు నగు పరబ్రహ్మ మును ఏకాలమందు సహజముగా జూచునో అప్పుడు ఆపరమపురుషునకు మనస్సు నిశ్చయముజేసికొని యీ అహంకారమును విడుచుటవలన, కొంచెమైన నను కార్యము చేయడు. ఆపరమపురుషుడు సంసారముయొక్క నిర్బంధముల

గట్టబడినవాడుగాడు కాబట్టి ఆపరమపురుషుడు తపస్వియని చెప్పబడును. అట్లియుండును. సమస్తకర్మంబులు విడచిన విరాగియు బ్రహ్మనిష్ఠయందు యుండు పరమశ్రేష్ఠుండు పుత్రాదిరహితుండు. ఈడు లేనివాడు స్వరూపము లేనివాడు నివాసములేనివాడు శరీరములేనివాడు అధిపుడుగానివాడు ప్రజ్ఞలేనివాడు సుఖదుఃఖములు లేనివాడు కోరికలు లేనివాడు సంపూర్ణసామర్థ్యముగలవాడు సమస్తప్రపంచము నిండినవాడు నైన పరబ్రహ్మమును పొందుచున్నాను. కావున జీవబ్రహ్మములకు భేదము లేదనే ఆరూఢఅపరోక్షబ్రహ్మైక్యజ్ఞానమును పొందియున్నవాడు యోగి—

వేదము పరబ్రహ్మముగాదు. దీక్షయును పరబ్రహ్మముగాదు. సన్న్యాసము పరబ్రహ్మముగాదు. కర్మయు పరబ్రహ్మముగాదు. గురువును పరమాత్మకాదు. శిష్యుడును పరమాత్మకాదు. మంత్రసిద్ధియు పరమాత్మకాదు. షణ్ముఖ మొదలగు పంచముద్రలు పరమాత్మకావు. కాబట్టి ఏపరమపురుషునియందు అభేదజ్ఞానం గలుగుచున్నదో జీవాత్మపరమాత్మలకు అభేదజ్ఞాను కలుగుచున్నదో ఆపరమయోగి జననమరణభ్రాంతిరహితమైనవాడు అట్టిపరమాత్మయందు లీనమగుచున్నాడు. ఆపరమాత్మ శివసంబంధమయినది కాదు. శక్తిసంబాధమైనదికాదు. మనుష్యసంబంధమైనదికాదు. శరీరము కాదు. కాళ్ళుచేతులు మొదలైన అవయవములు లేనిది. ప్రయత్నముగాదు. అప్రయత్నముగాదు కాబట్టి ఆపరమాత్మ యది పరమజ్యోతిస్వరూపంబైన నిష్కళాస్వరూపం అదిస్థిరమైనది. నిరాలంబోపనిషత్। అచలమచలవర్ణం వర్ణహీనం విహీనం నిఖిలనిగమ గుహ్యా గుహ్యమేకం సుసూక్ష్మం అమలవిమలతత్వం దేవపస్యంతి ఏమాం హృదయకమలమధ్యే జీవముక్తోభవంతి॥ సర్వసారోపనిషత్॥ చైతన్యంపరిపూర్ణమేకమచలంజ్యోతిర్మయం వ్యాపకం నాదుబిందుకళాతీతం బ్రహ్మరూపం నమామ్యహం॥

సర్వసారపూర్ణోపనిషత్। అపరిభిన్నరూపాత్మ అణుస్థూలాది వర్జితం॥ నామరూపరూపవిహీనాత్మ ద్వైతాద్వైతవివర్జితః॥ నిష్కళాత్మా నిర్మలాత్మ శుద్ధాత్మబిందువర్జితః॥ సచ్చిదానందహీనోయో ఏషైవాత్మా సనాతనః॥ పాదాభావాద్గతర్నాస్తి॥ హస్తాభావాత్క్రియానహామృత్యుర్నాస్తి జన్మభావాత్ బుధ్యాభావాత్సుఖాదికం ఆత్మాభావాజగన్నాస్తి యితివేదాంతడిండిమః॥ యితాంద్యుపనిషత్ ప్రమాణములు చెప్పుచున్నవి.

నిరాలంబోపనిషత్తు॥ సర్వద్వంద్వవినిర్ముక్తం సర్వానందమయఃపరః॥ సర్వానుభవవినిర్ముక్తం సర్వాభావవివర్జితః॥ ఆత్మానాత్మవివేకాది భేదాభేదవివర్జితః॥ మహావాక్యార్థతోమారః॥ అహమస్మీతివర్జితః॥ గురోర్ముఖేరజ్ఞాతిత్వం॥ అన్యదానోపలభ్యతే॥ అనియు నిరంజనోపనిషతి॥ సర్వనిగమగుహ్యం శాశ్వతం సర్వకాలం॥ సకలదివిజవంద్యం సర్వదిక్పూర్ణమచలం నిఖిలనిగమసారం, నిర్మలాకాశరూపం సకలలోకపూర్ణం సచ్చిదానందరహితం॥

బ్రహ్మోపనిషత్ - పయోవికారాత్॥ నీళ్ళయొక్క - చంచలమువలన, ఫేనబుద్బుదాయివ - నురుగుబుగ్గలవలె, యస్య॥ ఏమహాపురుషునియొక్క. స్వరూపాత్ - ఆకారమువలన, చరాచరం - స్థావరజంగమాత్మకమైన, జగత్ - ప్రపంచము, ఉత్పద్యతే - పుట్టుచున్నదో, స్థిత్యపి॥ వర్తిల్లుచుండినను, లీయతే - కలసిపోవుచున్నదో, తం - అట్టి, ఈశం - సమస్తప్రపంచమును శిక్షించునదియు, శాశ్వతం - నాశనములేనిదియు, ఆత్మానం - పరమాత్మను, యోగీ - బ్రహ్మజ్ఞాని, ఉపైతి - పొందుచున్నాడు—

జలాశయములోని నీళ్ళయొక్క చలనమువలన ఫేనములయొక్క బుద్బుదముల సృష్టిస్థితిలయముల చొప్పున స్థావరజంగమాత్మకమయిన ప్రపంచము పుట్టుచు వర్తిల్లుచు కలసిపోవుచున్నదో అట్టిశాశ్వతంబైనదియు జగన్నియామకంబైనదియు బ్రహ్మమును జ్ఞానిపొందుచున్నాడు గావున అట్టిజ్ఞానికి జీవన్ముక్తోభవేభవ॥ గాబట్టి గురుముఖమున తన్నుదాదెలియవలెను. తన్నుతా దెలిసినవాడే ఆరూఢయనుభవజ్ఞాని—

ఎవ్వనికి దేహాద్యుపాధులు ఆఘ్రాణము దృష్టి ఆసనము జ్ఞానాజ్ఞానాజ్ఞానములు నాడీప్రచారములులేవో అట్టిశాశ్వతంబైన జగన్నియామకంబగు పరమాత్మను పొందునుగావున ఏది ఒక్కటియును రెండును అనేకమును యితరమనియును వివక్షితలేక కేవలముగానున్నదో అశుద్ధచైతన్యమే జగన్నియామకమైనదియు శాశ్వతంబును నగునదే పరమాత్మ. కాబట్టి మనుస్మృతి॥ సః॥- ఆపరబ్రహ్మము, మనః-మనస్సు, న-కాదు, బుద్ధి న-కాదు, శరీరం-దేహము, న-కాదు, యింద్రియం-యింద్రియము, న-కాదు, తన్మాత్రభూతాని-తన్మాత్రప్రాణులును, న-కాదు, భూతపంచకం న-కాదు, పంచమహాభూతములు న-కాదు, అహంకృతిశ్చ-అహంకారమును, న-కాదు, వియత్స్వరూపకం-భేదస్వరూపకమును, న-కాదు, ఈశం-జగన్నియామకంబును, శాశ్వతం-స్థిరమైనది

యునగు, తం-అప్రసిద్ధమైన, ఆత్మానం-పరమాత్మ, విధా-రీతియైనదియు, నిరోధేన-వశముగాజేయుటదియు, భేదవర్జితే-ద్వేషముచుండివదలబడినదియునగు, చేతసి-చిత్తము, పరమాత్మాత్మాంగతే-పరబ్రహ్మమగుటను, బొంకుచుండగ యోగినః-చిత్తవిశ్రాంతిగల జ్ఞానికి, శౌచంవా-పరిశుద్ధియైనను, న-లేదు, అశౌచం-యనిపరిశుద్ధత లేకుండుట యును, న-లేదు, ఆలింగభావన గురుతులేని స్వభావమైనను లేదు. సర్వం-అంతయు, నిషిధ్యతే విడువబడియున్న, ఇత్థం-ఈవిధము, విధేయం-తెలియదగినది గావున,

యత్ర-ఏపురుషునియందు, మనః-మనస్సును, వచః-మాటయును, మీారితుం-దాటుటకొరకు, నశక్తః సామర్థ్యములేదో, తత్ర-ఆపురుషునికి, గురూపదేశతా-దేశికులయొక్క యుపదేశము, కథం-యట్లు, ఇమాం-ఈ, కథాం-ప్రసిద్ధమైనబ్రహ్మమును, ఆత్త్యక్తస్య- మిక్కిలిపొందియున్నదో, గురోః-అజ్ఞానము, లేనివానికి, తత్వాంహి-పరబ్రహ్మమె, సమం-భేదములేక, ప్రకాశతే-వెలుగుచున్నది, సుగుణనిర్గుణములు భేదాభేదములు లేకయుండగ అనగ జీవాత్మపరమాత్మలకు భేదములేకయుండగ, ఏవం-ఈప్రకారము, అహంచ-నేనును వికల్పరహితః- మాయావిహీనుండను, అలం-ప్రసిద్ధుడనై, స్వాత్మానం- పరమాత్మ, అస్మి-అగుచున్నాను, సదా-యెల్లప్పుడును, ఉదితః ప్రకాశించుచున్న మే-నాకు, నిశ్శోకశోకపదవీ-దుఃఖములేమియొక్కయు దుఃఖముయొక్కయు స్థితి, మే-నాకు, న-లేదు. వికల్పం-చంచలము, మే నాకు, న- లేదు, కదాచిత్-ఒకప్పుడును, సంతోషసంతతి సుఖం-సంతోషసమూహముయొక్కయు సుఖమును, మే-నాకు, న-లేదు, స్వధర్మజనకం-తనయొక్క స్వభావమువలన గలిగిన, సత్వం-సత్వగుణవికారః-వికారము, మే-నాకు, న-లేదు, సంతతాపదుఃఖజనకం- సంతాపమనెడు దుఃఖమువలన గలిగిన, విధిః- చేయ వలసిన ప్రకారము, మే- నాకు, కదాచిత్- ఒకప్పుడును, న- లేదు. సంతతాపయోగ జనితం- సంతాపము వలన గలిగిన మనస్సు, మే- నాకు, న- లేదు. తస్మాత్- ఆకారణము వలన నిష్కంపక నిధనం- అవ మానముల యొక్క చావు లేక ఉనికి, మే- నాకు, న- లేదు, వికల్ప కల్పం- సంకల్ప వికల్పములు అనగ మనస్సుయొక్క కార్యము సంకల్పము మనస్సు యొక్క కార్యముకానిది. వికల్పము స్వప్రబోధనిధనం నిద్రాజాగ్రత్తల యొక్క చావు లేక యునికి, మే- నాకు, న- లేదు. హితా హితంచ- మిత్రత్వ

శత్రుత్వములు, మే- నాకు, న- లేదు, ఇదం- యీబ్రహ్మస్వరూపము, అవేద వేదకం- వేదము సంబంధించినది కానిదియు వేదము సంబంధించినదియు, హేతుతర్క్యంచ- కారణమైన వాదసంబంధమైనదియు, ఇదం- యీబ్రహ్మ స్వరూపం, వాచాం- వాక్కులకు, అగోచరం- గోచరముగానిదియు, భవతి- అగుచున్నది. ఇదం- యీబ్రహ్మస్వరూపం, ఏవంహి- యీప్రకారముగా, పరమార్థతత్వం- వుత్కృష్టమైన మోక్షమునకు ప్రయోజనమైనదియు పర మార్థతత్వం వుత్కృష్టమైన మోక్షమునకు ప్రయోజనమైనది.

కించత్- కొంచమైనను, వస్తు- వస్తుపదార్థం, మే- నాకు, న- లేదు, ప్రస్థానత్రయములనెడి నేతియది- లేదనినట్లయితె, తురీయుంచ- తురీయాశ్రి మము, క్థం- యట్లు, భవేత్- అగును. అనగా తురీయాశ్రిమము లేదనుట. కాలత్రయ్యం- భూతభవిష్యద్వర్తమానకాలములు, నేతియది- లేదనినట్లయితే, దిశశ్చ- దిక్కులు, కథం- యట్లు, భవేత్- అగును. హి- ఏకారణమువలన, నిర్గుణంభవేత్- నిర్గుణంత్రిగుణరహితమగుటవలన, భవేత్- అగుచున్నది.

దత్తాత్రియోపనిషత్తు॥ పౌర్ణమాశ్యాంయథాచంద్రఏకఏవాతినిర్మలం తేనతత్సదృశ్యాపశ్యేద్విదాదృష్టి విపర్యయః॥

పౌర్ణమాశ్యా-పౌర్ణమియందు, చంద్రః- చంద్రుడు, యథా-ఎట్లు, భాసతి- ప్రకాశించుచున్నాడో, తేన-ఆచంద్రునితో, సదృశం-సమానమైన, తత్- ఆబ్రహ్మస్వరూపము, యేకయేవ-ఒక్కడై, అతనిర్మలః మిక్కిలిమలిన ములేనివాడై, భాసతి- ప్రకాశించుచున్నాడు. యః-యెవ్వడు ద్విదాదృష్టి- విపర్యయః ఐహికాముష్మికము లనురెండువిధములుగా జూచుటచేత విడువ బడినవాడై, సః-అతడు తత్-బ్రహ్మస్వరూపమును, పశ్యేత్- చూచును.

పౌర్ణమాస్యలయందు చంద్రుడు ప్రకాశించునట్లు ప్రపంచమునకు సాక్షిగాను ప్రపంచమంతయునిండి ప్రకాశించుతెరంగున నాచంద్రునితో సమానముగా పరమాత్మ కేవలుండై మిగుల పరిశుద్ధుడై ప్రకాశించుచు న్నాడు గావున యెవ్వడు ఇహపరములయందు ఆశవదలి వైరాగ్యము గలిగి యున్నాడో అట్టివాడే కేవలాత్ముడు పరిశుద్ధుడును నగు బ్రహ్మస్వరూపం గాబట్టి పైశ్లోకమునందు చెప్పిన ప్రకారమే చంచలబుద్ధిగలవాడు భేదబుద్ధి గలవాడు సమస్తస్వరూపుడైన పరమాత్మను బొందజాలడు. ధీరతగలవార లో లదాత అనగ ప్రపంచమునందలి యాశను వదలుటయందు స్థిరబుద్ధిగల

వారలలో భేదబుద్ధిలేక సర్వసమత్వబుద్ధి గలిగి యతరులకు ప్రాపంచిక సుఖమునొసంగువాడు సర్వస్వరూపుడగు బ్రహ్మమును బొందగలడని ప్రసిద్ధులైన మహాత్ములచేత చెప్పబడుచున్నది.

కాబట్టి దేవ్యోపనిషత్॥
మనోవచోయత్రనశక్తి మీరితుం
నూనంకథం తత్రగురూప దేశతా
ఇమాంకథాముక్తవతోగురోస్త
దత్యుక్తస్యతత్వంహిసమంప్రకాశతే।

యత్ర-యేపరమపురుషునియందు, మనః-మనస్సును, వచః-మాటయును, మీరితుం-దాటుటకొరకు, నశక్తః- సామర్థ్యములేదో, తత్ర- ఆపరమపురుషునికి, గురూపదేశాత్ దేశకులయొక్క యుపదేశము, కథం-ఎట్లు, ఇమాంకథాం- ప్రసిద్ధమైన బ్రహ్మమును, అత్యుక్తస్య-మిక్కిలి పొందియున్న, గురోః- అజ్ఞానములేనివానికి, తత్వంహి- పరబ్రహ్మమే, సమం- భేదములేక, ప్రకాశతే- వెలుగుచున్నది.

ఏపరమపురుషునకు మనస్సును మాటను వదలుటకు శక్తిలేదో వానికి గురూపదేశము పనికిరాదు. అట్టివాడు మరివకనికి యుపదేశించుటకు బనికిరాడు. ఇట్టిమాటలు చెప్పినట్టి ప్రసిద్ధమైన బ్రహ్మమును బొందియుండు నజ్ఞానము వదలిన సుజ్ఞాని. అనగా ఓంకారమనే బ్రహ్మప్రణవమును ధ్యానించుటకు నామమటకు సర్వకాలము పరమాత్మయందు మనస్సును స్థిరముగా నిలిపినవాడై యజ్ఞానకార్యముల వదలిన సత్పురుషులకు పరబ్రహ్మమునకు భేదములేక కేవలంబై ప్రకాశించుచుండును. అనగ తానే పరబ్రహ్మమై పరబ్రహ్మమే తానై యుండును. ఎల్లప్పుడు ప్రకాశించుచున్న తానే ఆద్యంతములు లేనివాడును గనుక ఘూమాధూమంబులు లేనివాడు జంగమస్థావిర్యస్థావరమ యంబగు ప్రపంచభేదములేనివాడు యెల్లప్పుడు ప్రకాశించువాడు చీకటి వెలుతురు లేనివాడైన తనకే మోహవిమోహములు తనకు గలుగనేరవు. నాశనములేనివాడు గావున నాకు దేహాదిసంబంధములైన సుఖదుఃఖములు గలుగనేరవు. తాను అద్వితీయుండును గావున పైనజెప్పిన ప్రాపంచికసంబంధము తనకులేదు. తనకు శరీరసంబంధించిన సుఖదుఃఖములు లేవు. తనకు సుఖదుఃఖములతోగూడిన సమూహములతోగూడిన మాయలేదు. తాను అమృతస్వ

రూపుడగుటచేత పొడుగు కురుచ బరువు చులకతనములేదు గావున విస్తారము కఠినము మొదలైన భేదములు లేవు గనుక తనకు మరణములేదు. తనకు తల్లితండ్రియు కుమారులును లేరు. తనకు చావుపుట్టుకలు లేవు. మనస్సులేదు. ఈవుత్కృష్టమైన మోక్షోర్ధమగు వ్యాకులములేనిదియు స్థిరమైనదియు నైన పరమాత్మ తానే ఆపరమాత్మకన్న తదితరం కించిత్-కొంచమైనను లేదు గావున రాకపోకలు లేవు. గమనాగమనములతోగూడిన ఉచ్ఛ్వాసనిశ్వాసములు గాని లేవు.

శ్రుతి॥ యత్-యేది, శుద్ధం-పవిత్రమైనదో, విశుద్ధం-పవిత్రములేనిదియో లేక మిక్కిలి పవిత్రమైనదియు, అవిచారం-విచారములేనిదియు, తత్-అది, అనంతరూపం-తుదలేని స్వరూపముగలది, యత్-యేది, నిష్కండఖండం- భేదింపనిదియు భేదించునదియు, తత్-అది, అవిచారం విచారములేనిదియునైన పరమాత్మయైన తనకంటె నీలోకంబునందు తనకన్న భిన్నులగు బ్రహ్మాదిదేవతలు స్వర్గాదిస్థానములు లేవనిపుపనిషద్వాక్యములు గావున—

తనకు సంసారముగాని ప్రపంచముగాని కార్యముగాని కారణముగాని పరిపూర్ణుడననిగాని పుంల్లింగ స్త్రీలింగ నపుంసకలింగములు తనకు లేనివాడు తాను గానివాడు గావున మాయాసంబంధమైన కార్యములు లేనివాడను గాబట్టి తాను ఏకమేవాద్వితీయంబ్రహ్మ యను వేదప్రమాణములు చెప్పుచున్నవి. కావున నిత్యమైనదియు శ్రుతి॥ అయంవ్యర్థబాహ్యాభ్యాస్థికేవలం॥ అత్యద్భుతమైనదిన్ని నగుబ్రహ్మస్వరూపము కార్యముగాదు కారణము గాదు.

గీతాభాష్యే॥ కార్యకారణతాంహిత్వాపూర్ణబోధోవశిష్యతే॥ కావున క్షరముగాదు అక్షరముగాదు. గీతాభాష్యే॥ క్షరాక్షరాభ్యాంవిలక్షణః॥ అక్షరమునకు క్షరమునకు విలక్షణమైన పరమాత్మే తానైన పరబ్రహ్మ దేహము లేనిదియుగాదు దేహముకలదియుగాదు. వికారః-వికారము, న- లేనిది.

మాయాప్రపంచరచనాచమేవికారః॥ మాయాప్రాపంచికసంబంధమునగు యేర్పాటునను వికారః-వికారము, న-లేదు, సత్యానృతేతిరచన-నిజము అబద్ధములను ప్రాశస్త్యమను వికారము లేదు. నిరాకులం-వ్యాకులములేని పరమాత్మ, నిశ్చిత్తచిత్తరహితం-చిత్తములేనిది చిత్తముచేత వదలబడినదియు నైన తాను చిత్తశుద్ధిగలపరమాత్మ, సర్వావిగతం-సమస్తమునుంచి విడువబడినవాడు, అఖిలం-సమస్తము, అద్వైతరూపం ఒక్కటే ఆకారముగలదని,

హి-ప్రసిద్ధముగా, కథం-యిట్లఅవదామి..చెప్పెదను. అఖిలం-సకలముసమస్తము, అద్వైతస్వరూపం అఖిలం-అంతయు నిత్యం-శాశ్వతమైనదిన్ని, తు-తిరుగా, వుపమం-అపరబ్రహ్మముతో సాటియైనది, న-లేదు, హి-ఏకారణమువలన, స్థూలం-పరబ్రహ్మము లావు అని అర్థం. నో-కాదు, కృశం-జీర్ణమైనది కాదు, గతాగతంనహి-చావుపుట్టుకలుకాదు, అపరంపరం- హెచ్చుతక్కువలు, నహి-కాదు, ఆది అంత్య మధ్యరహితం-మొదలు నడుమ కొనమొదలైనవిలేని దనగ పరిపూర్ణమైనది, సత్యం-శాశ్వతమైనది, ఖలు-నిశ్చయమైనదియునైన తానే పరమాత్మ సర్వకరణాది మనస్సు బుద్ధి, చిత్తము- అహంకారము ఈఅంతఃకరణము లన్నింటిని, సంవిద్ధి-తెలిసికొనుము, చ తిరుగ, సర్వవియాః-సమస్తవిషయములను, చ- సంవిద్ధి-చక్కగతెలిసికొనుము. ఏకం-వక్కటై, అమలం-నిర్మలమైన, బంధముక్తం-బంధములనుండి విడువబడినదైన, పరమాత్మ హి-ఏకారణమువలన, నిర్బంధబంధదహనః-విడుపుకట్టులను దహించుచున్న, హుతాశనః-అగ్నిహోత్రుడనగ జ్ఞానాగ్నియనే హుతాశనుడు, చే-దహించును.

కావున తాను భావాభావరహితః- భావాభావములచేత విడువబడినవాడు, ఆత్మా-పరమాత్మ నాశనములేనివాడును అభేదస్వరూపుడును కాబట్టి నాకిది కోర్కెలేనిస్థానమనియు కోర్కెగలస్థానమనియు సందేహములేదు. తనకిది దుఃఖస్థానమనియు దుఃఖములేనిస్థానమనియు తనను ఆశగల స్థానమనియు ఆశలేనిస్థానమనియు తనకు వికల్పములేదు. తనకుభేదములేదు. వికల్పకల్పం-సంశయనిశ్చయములు, మే-తనకు, న-లేదు, తనకు నిద్రయులేదు. జాగ్రత్తయును లేదు. తనకు హితములేదు. అహితములేదు. రుచి అరుచి లేదు. తనకు జంగమస్థావరాంతకమైన భేదము లేదు. ఇదం- ఇది, నోవేద వేదకం-వేదసంబంధముగానిది వేదసంబంధమైనది, మే-తనకు, న-లేదు, హేతుతర్క్యం-వాదమునకు గారణమైనది, ఇయం-ఇది, మే-తనకు, న-లేదు, ఇదం-ఇది, వాచాం-వాక్కులకు, అగోచరం-గోచరముగానిది, ఇయం-ఇది మనస్సు, న-లేదు,ఇయం, ఇదిబుద్ధికాదు, ఏవం, ఈప్రకారము-స్థితౌసతి, ఉండగ, భవతః-తనకు కాబట్టి, పరమార్థతత్వం-ముక్తికిప్రయోజనమయిన పరమాత్మ, అంతర్బహిః-లోపల వెలుపల గలది, కథం-యెట్లు, నహి- కాదు

ప్రాక్సంభవం-పూర్వముగలిగిన, రతంచ-ఆసక్తియు, న-లేదు-కాబట్టి వస్తుప దార్థము కించిత్-కొంచెమైనను, నహి-లేదు.

తాను తాపాదిదోషరహితం- తాపత్రియములను దోషములనుండి విడువబడినది. అనగ విలక్షణమయినది. తత్వంతు బ్రహ్మస్వరూపముగదా సంసారశోకరహితం సంసారదుఃఖముచేత వదలబడిన, అహమేవ-నేనే; తత్వం తు- బ్రహ్మస్వరూపము, సమరసం-అభేదస్వరూపుడను, సంసారదుఃఖమునుండి వదలిన పరమాత్మ, భవతిచ- ఉన్నదనియు, స్థానత్రియం- మూడవస్థలు, నభవతిచ-లేవనియు, తురీయం- నాల్గవయవస్థ, భవతి- వున్నదనియు, కథం- యెట్లు, యదియెప్పుడైతే కాలత్రియం- మూడుకాలములయందు, నభవతి- లేవనియు, దిశశ్చ-దిక్కులు, భవతిచ-వున్నదనియు, కథం- యెట్లు, వదామి- చెప్పుచున్నారు, హి- ఏకాకారణమువలన, శాంతం- శాంతమయినట్టియు, పరమార్థతత్వం- మోక్షజ్ఞానమైన, పదం- ముక్తియగును గాబట్టి, ఇహ- యీలోకమందు, దీర్ఘః- పొడుగైనదియు, పునః- మరల, లఘుః-పొట్టిది, ఇతి- అని తనకు, విభాగః- భేదము, న-లేదు. యిహ- యీలోకమందు, విస్తారసంకటం- అధికం కొంచెము, ఇతి- అని తనకు, విభాగః- భేదము, న- లేదు, కోణం- వంకరైనది, వర్తులం- గుండ్రమైనది, మే-తనకు, న-లేదు. హి- ఏకారణమువలన, దుఃఖములేనికారణమువలన, అనగ సంసారమనే దుఃఖములేనికారణమువలన, స్థిరతం- శాశ్వతమైనదై పరమార్థతత్వం మోక్ష మునకు బ్రయోజనమగు తత్వస్వరూపం తానైనపరమాత్మ. ఆపరమాత్మే తాను తానే చింతితులేనివాడు శాశ్వతమైనవాడు. శృతి॥ అణీనజ్ఞప్తి కళామా త్రిశరీరం నాస్తి కేవలం॥ అనునట్లు యీమూలంలేని గుర్తెరిగెశరీరం చేమీలేదని గురువాక్యం యథాతథా మాతాపితాచ తనయాచకదాచిత్ తల్లిదండ్రికొ మాళ్లు ఒకప్పుడును, మే- నాకు, న- లేదు, జాతం- పుట్టుకను, మృతంచ- చావును, మే- తనకు, న- లేదు. శృతి॥ గీత॥ నజాయతేమ్రియ్యతే వాక దాచిన్నాయంభూత్వాభవిత వానభూయః అజోనిత్యంశాశ్వతోయంపురాణో నహన్యతేహన్యమానే శరీరె యస్మాక్షరమతీతోహమక్షరదపిచోత్తమః ఉత్కా్రం త్తమః అక్షరాదపిచ అమోఘోత్తమః క్షరాక్షరాభ్యాంవిలక్షణః ఉత్తమపురు షస్త్వన్య పరమాత్మేత్యుదాహృతః ఇత్యాది ప్రస్థానత్రియ యుపనిషత్ భాష్యములు చెప్పుచున్నవి.

శుద్ధం- పవిత్రమైన, అసుద్ధం- పవిత్రములేనిదియునైన పరమాత్మ తానే, ఇతి- అని, విచారం- విచారములేనిది, అనంతరూపం- తుదలేని బ్రహ్మస్వరూపం, నిర్లేపలేపం- పూతలేనిది, పూతగలదియు, న- లేదు, నిష్ఖండఖండం- తునకలుగానిదిలేనిది, అనంతరూపం- తుదలేని బ్రహ్మస్వరూపం, ఏకరూపం- కేవలుండైన పరమాత్మ, అహం- యది, నేనైతినేని బ్రహ్మాదయః-పరమేష్ఠి మొదలుగాగల, సురగణాః- దేవసమూహములు, అత్ర- ఈ ప్రపంచమునందు, కథం- యెట్లు, సంతి- ఉన్నారు. స్వర్గాదయః- స్వర్గము మొదలైన, వసతయః- ఉన్నతస్థానములు, కథం- యెట్లు, సంతి-వున్నవి. హి- ఏకారణమువలన, విమలః- మలినములేనిది, నిర్నేతి- అవును, నేతి-కాదు, వదామి- చెప్పుచున్నవి. నిర్లింగలింగః-లింగములేనిది, లింగమనియు, న-లేదు. లింగభంగః- లింగభంగమే, జన్మరహితః. పునర్జన్మలేదని, వదామి- చెప్పుచున్నవి. తత్-ఆకారణమువలన, భవామి- అగుచున్నది. సంతతం- యెల్లప్పుడు, కరోమి- చెప్పుచున్నారు. నిస్సంగసంగరహితం- సంగతిలేమిసంగతినుండి వదలబడినవాడై, సాంగత్యః- సాంగత్యమును, సంతతం. యెల్లప్పుడు, విషయ- విషయములను, మే-నా, న-లేవు. తనకు మాయారూపమైన ప్రపంచ సంసారములేదు. శృతి॥ నిర్మలమె తథాజ్ఞానశ్చరీరం నాస్తికేవలం॥ అని గురువాక్యాం. తనకుకుటిలత్వము, డాంబికములేదు. తనకు సత్యాసత్యములులేవు ఇదం- ఇది, కాంతారమందిరం- అడవియనియు, దేవాలయమనియు, హి- ప్రసిద్ధముగా, కథం- ఎట్లు, వదామి- చెప్పుచున్నారు. శృతి॥ దేహోదేవాలయ ప్రోక్తాజీవో దేవస్సనాతనః॥ ఇదం- ఇది, సంసిద్ధసంశయం- నిశ్చయమనియు, సందేహమనియు, హి- ప్రసిద్ధముగా, కథం- ఎట్లు, వదామి- చెప్పుచున్నారు. హి- ఏకారణమువలన, నిర్జీవజీవరహితం- ప్రాణమునుండియు, ప్రాణములేమినుండియు, విడుబడిన ప్రత్యక్షభిన్నపరమాత్మ, విభాతి- ప్రకాసించుచున్నది. నిర్బీజబీజరహితం- విత్తనము లేమినుండియు, విత్తనమునందియు విడువబడినది. గీతాభాష్యే॥ అభీజంవృక్షసంకీర్ణం। శాఖాపల్లవవర్జితం। పుష్పం నాస్తిఫలం నాస్తిసంపూర్ణం వృక్షవర్జితం- యథానాహతథాసుధంతస్మాచ్ఛుద్ధే నిర్ణయః। ఆత్మాతీతం కేవలాత్మ దేహోనాస్తికదాచన సర్వశూన్యమయం రూపం జన్మశూన్యం స్వభావతః। జన్మాభావేనమృత్యుశ్చ పరిపూర్ణం స్వభావతః। ప్రజ్వలత్ పావకేకుండే పద్మమూలం ప్రజాయతె నానానలతసమాకీర్ణం।

పత్రిపుష్పసమాకులం తాసాంవృధియథాసత్యం జగసత్యం నసంశయః। అగ్నిదగ్ధం యథాబీజం శాఖాపల్లవవర్జితం। జ్ఞానదగ్ధం తథాయోగీపునర్జన్మ నవిద్యతే। అశరీరం సర్వదాస్థిశరీరరహితం సదా। యియమేవసదాముక్తిఅన్యథాభ్రమకారణం॥ లక్ష్యాలక్ష్యములు వదలినదియు, లేనిదియు సమర్థాసమర్థము లేనిదియు, గానిదియు, కర్మాకర్మములు లేనిదియు గానిదియు కార్యాకార్యములుగానిదియు, లేనిదియు, కారణకార్యములు లేనిది గానిది—కాబట్టి నిరంజనస్వరూపుడును తర్కాతర్కములు లేనివాడు గానివాడున్ను గావున, ఆశాపాశవినిర్ముక్తః- ఆశాపాశములు విడువబడిన ముక్తస్వరూపుడును, శౌచాశౌచవివర్జితముక్తః- ఆచారానాచారములు విడువబడినవాడు, ముక్తస్వరూపుడగును. సర్వవివర్జితః- సమస్తమునుండి విడువబడినదియునైన పరమాత్మ, ఏవం- ఈప్రకారం, సంతః- ఉండువాడును, శుద్ధనిరంజనవంతః- పరిశుద్ధమయినదియు, నిరంజనము- పరమాత్మ, భవతి- అగుచున్నది. నిర్మల నిశ్చలో నిత్యో నిర్వికల్పో నిరంజనః। నిష్కళంకం నిరామయం నిర్వికల్పసమాధిః॥ స్వయం- తానుగా అనగా నితరసహాయములేకయె ప్రకాశించుచుండగ, ఇహ- ఈ లోకమందు, దేహావిదేహావిచారః- శరీరాశరీరములయొక్క విచారము, కథం- యెక్కడిది, ఇదం- ఈలోకమందు, రాగవిరాగవిచారః- అనురాగ విరాగములుయొక్క విచారము, కథం- యెక్కడివి, న- లేదు. పరమోత్కృష్టమైన పరమాత్మ, విందతి- పొందుచున్నదో, అక్కడ విషయ సబంధమైనకర్మ యెట్లు కలుగుచున్నది. ఎక్కడ పరమాత్మయున్నదో అచ్చట రూపము అరూపము ఎట్లు కలుగుచున్నదనగ, పరమార్థ విచారమునందు కర్మ కర్మవలనగలుగు శరీరములేదు. కావున, సః- ఆపరమాత్మ, ఏవం- ఈప్రకారం, ఇతి- అని తెలిసికొనినట్లయితే. ఇహ- యీలోకమందు, భిన్నాం విభిన్నం- భేదాభేదములు, కథం- యెట్లు, భవతి- కలుగుచున్నవి.

సమస్తస్వరూపుడును, అద్వితీయుండును నిత్యుండును నిర్మలుండును-నిరాకారుండును, ఏవం- ఈప్రకారము, సర్వం- సమస్తమయిన, సః- తాను, కేవలతత్వనిరంతర సర్వం, ఇహ- యీలోకమందు, యోగాయోగాచ- సుయోగదుర్యోగములు, కథం- యెట్లు- కలుగుచున్నవి. ఏవం- ఈప్రకారం, సః- తాను, ఉత్కృష్టమైనదియు, నిత్యమైనదియు ప్రపంచస్వరూపమైనదియు నగు పరమాత్మయనియు, తెలుసుకొనునట్లయితె, ఇహ-యీలోకమందు, సారాసారం-

రసవిరసములు, కథం-ఎట్లు, భవతి-కలుగుచున్నవి, ఏవం- ఈప్రకారం, సః-అపరమాత్మ, యిహం- యిచ్చట, సంగవిసంగం-సాంగత్యాసాంగత్యములు, కథం- యెట్లు, సత్యం- నిజము, భవతి- కలుగుచున్నవి, రహితః- విడువబడినవాడుతానే, భోగీ- సుఖానుభవుడు, సః- తానే, ఏవంచ- ఈప్రకారముగా, యః- యెవ్వడు, జ్ఞాత్వా- తెలిసికొని, మందంమందం- తిన్నతిన్నగా, చరతి-సంచరించుచున్నాడో, సః-అతడు అనగ తాను, మనసా- మనస్సుచేత, కల్పిత సహజానందం- కల్పితమయిన స్వాభావికమగు ఆనందమును, విందతి- పొందుచున్నాడు, సహజః- స్వాభావికముగలవాడు, సంతతం-యెల్లప్పుడు, యుక్తః-కూడినవాడు, ద్వైతాద్వైతైః- భేదాభేదములచేత, ముక్తః- విడువబడిన, సః- తాను పరమాత్మ, కథం-ఎట్లు, భవతి- అగును, సహజః- సహజముగా శుద్ధనిరంజనం- పరిశుద్ధమైనది, భవతి- అగుచున్నది. సర్వం-సమస్తప్రపంచము, శ్రుతి॥ నాస్తినాస్తిజగత్సర్వం సర్వనాస్తీతినిశ్చయః॥ శ్రుతి॥ అణిశూన్యాం బరశూన్యసర్వం నాస్తినిశ్చయం॥ పరమాత్మ-పరబ్రహ్మము, అఖండితం- భిన్నముగానిదియు, ఖండముగానిదియు, అనాకారః- ఆకారములేనిదియు, కేవలః-అద్వితీయంబును నైన, సః- తానె, ధర్మప్రభృతిమోక్షపర్యంతము యెల్లప్పుడును తానుకోరికలేనివాడై అనగ తనకంటె అన్యమైన అనగ భిన్నమైనదియు నొక్కటియులేను, కాబట్టి సంకల్పములేదు. ఇట్లుండ పండితులెట్లు తాను అనురాగవిరాగములతోగూడినవారిని చెప్పుచున్నారనగ సంకల్పము లేనప్పుడు, అనురాగవిరాగములుగలవని యెట్లుచెప్పుదురు. వేదైః - వేదముల చేత, గలితం- చెప్పుచున్నది. సః- తాను, జ్ఞానారూఢుడై బాహ్యచేష్టలు, మనస్సంకల్పముచేత చేయడు. ఆత్మానం సః తాను, పరమాత్మవృటచేతనైనను, ప్రాకృతమట్లు వానిగని, సః- తాను నాచేష్టలేచేయును. అజ్ఞుడు సర్వమును మరచి, చిత్సుకసుధారాపానము చేయుచు, శుద్ధబ్రహ్మమేనంచు శంకరహితమై, సః- తాను, మోక్షప్రాప్తిపొందును గాబట్టి ఇహ- ఈసంసారమునందు, తత్వనిరంతరతత్వం-పరమార్థమునందు నిత్యుడై, సర్వవివర్జితసర్వసమం-యదిసమస్తమునుండి విడువబడినవాడునగుదువేని, అకర్తవై, స్థాననిర్ణయములేనివాడవై సంగములు సర్వమునుగలి సంగిగాడు కార్యములు సర్వమునుచేసి కర్తగాడు, భోగములు సర్వమునుజేసిభోక్తగాడు విహతసంకల్పుడగు బ్రహ్మవేత్తయని ప్రస్థానత్రయభాష్యసూత్రకారులు చెప్పియున్నారు; అసత్యమితి, శ్రుతి॥

అనాత్మదృష్టై అవివేకనిద్రాలహంమనుస్వప్నగతింగతోహం॥ అర్థద్దమనియు, వైదే- వేదములుచెప్పుచున్నవి.

శృతి॥ గురుప్రజ్ఞాప్రసాదేన, మూర్ఖోవాయదిపండితః యస్తుసంబుద్ధ్యతే తత్వం విరక్తోభవసాగరాత్॥

శృతి॥ గురుప్రజ్ఞాప్రసాదేన- శ్రీదేశికులవారియొక్క- యుపదేశము చేతనైనను, అనుగ్రహముచేతనైనను, మూర్ఖోవాయది- తెలివిలేనివాడైనప్పటికిన్ని, పండితః- జ్ఞానపురుషుడు, భవతి- అగుచున్నాడు, యస్తు- ఎవ్వడైతె తత్వం- ప్రసిద్ధమైన బ్రహ్మస్వరూపమును, సంబుధ్యతె- యెరుగుచున్నాడో సః-వాడు, భవసాగరాత్- సంసారసాగరము సముద్రమునుండి, విరక్తః- విడువబడినవాడు, భవతి- అగుచున్నాడు. శ్రీదేశికులవారి యనుగ్రహము చేత మూర్ఖుడైనను పండితుడగుచున్నాడు. ఎవ్వడీ ప్రసిద్ధమైన పరమాత్మను చక్కగదెలుసుకొన్నాడో నట్టివాడు సంసారసముద్రమునుండి విముక్తుడై మోక్షమును దరిగానగలడు.

సమాప్తము.



# శ్రీ మహాఋషి నిఘంటిత యోగశాస్త్రము.

## జీవసూత్రము.

—॥ అంబికాదేవి ధర్మగుప్తమహారాజునకు జీవసూత్రము భోధించుట ॥—

జీవసూత్రమనగ తన్నుతా దెలియుటకు ఆర్యులవారి శంకరాభాష్య మందు ఆత్మపంచకం॥ నాహందేహో నేంద్రియాణ్యంతరంగం నాహంకారః ప్రాణవర్గోనబుద్ధిః ధారాపత్యక్షేత్రవిత్తాదిదూరః సాక్షీనిత్యః ప్రత్యగాత్మాశివోహమ్॥ వ్యాఖ్యానః॥ నేను దేహముగాను ఇంద్రియములుగాను మనస్సునే గాను అహంకారమునేగాను ప్రాణసమూహమునేకాను బుద్ధినేకాను భార్యలు పుత్రులుక్షేత్రమునేకాను, ధనముమున్నగువానితో సంబంధించిన ప్రపంచము నకు దూరమునుండి సర్వసాక్షియై కాలత్రయాభాద్యుడైన పరమాత్మరూపు డనగుశివుడనగు నేనేను. నిరావరణోపనిషత్తు॥ భేదపాదవివర్జితం గుణహారం నిర్ద్వంద్వంనిర్వాయం రహితం భేదవాదవివర్జితం సాధ్యసాధకవర్జితం - కార్య కారణహీనం పంచకోశవినిర్ముక్తం పంచదేహావివర్జితం పంచభూతాదిసంగ త్వం॥ యత్రవ్యోమాదికంనాస్తి యత్రనాస్తితనుత్రయః॥ యత్రమాయాన విద్యతే తత్రజ్ఞానాదికంనాస్తి స ఏవపరమశ్శివః॥

భేదాభేదవివర్జితం - తాను, సమం - భేదము, న - లేదు, అభేదం - లేదు, త్వం - నీవు, అహం - నేను, నీవనేభేదము నేననేభేదము, న - లేదు, గుణ హారం - త్రిగుణరహితమైన, నాది నీది అది యిది అనగ, వేద్య - వేదక వర్జితం - తెలియునది తెలుపునది, వర్జితం - వదలబడిన, అన్నమయ ప్రాణ మయ మనోమయ విజ్ఞానమయ ఆనందమయముల విడువబడినది. స్థూలసూక్ష్మ కారణమహాకారణ హిరణ్మయములనే పంచదేహములు విడిచిపెట్టినటువం టిన్ని పంచభూతములచే కూడినది, నాస్తి - లేనిదే, తస్మాత్ - ఆకారణము వలన, యత్ర - యెక్కడ, వ్యోమం - ఆకాశం, ఆకాశస్యగుణశబ్దోగుణశబ్దా కాశములేని గాని, గగనోపమః - ఆకాశముతో సమానమయిన, అనగ, నిశ

ద్బ్రహ్మముచ్యతే- ఆకారముగలవాడు, అనగ, నిశ్శబ్దాకాశము మహాకాశం పరమాత్మనే- పరమాత్మ అనగ, పరబ్రహ్మస్వరూపము యత్రినాస్థి తనుత్రియం- యేస్థూలసూక్ష్మకారణత్రియతనువులు, నాస్థి-లేని, యత్రిమాయానవిద్యతే- ఏమాయాస్వరూపమైన అవిద్యలు, న- లేనివే, తత్రి- జ్ఞానాదికం నాస్థి సవివపరమశ్శివః- నిత్యమంగళస్వరూపమైన, సమరసం- అభేదస్వరూపముగల పరమాత్మమంగళ స్వరూపమైన బ్రహ్మము. కృష్ణాష్టకం॥ పూషరెంబువత్సభూతరజుసర్పవత్తథా ముహ్యమానదుర్మదె భవారణం ప్రతారణం। వాసవానిరాసకం సుఖాసన ప్రిభాసకం గోపరూపకం స్వరూపపాప్రికం గురుంభజే॥——శంరాష్టకంలోని శ్లోకం॥ ఆత్మపంచకమందు శంకరవిరచితం॥ రజ్జ్వజ్ఞానాద్భాతిరజ్జ్వర్యదాహిః స్వాత్మజ్ఞానాదాత్మనోజీవభావం ఆప్తోక్త్యాహిర్ భ్రాంతినాశేశరజ్జ్వోనాహం దేశికాక్తోశివోహమ్॥

ఆత్మయే తానని యెరుంగకపోయినప్పుడు ఆత్మనే జీవునిగా భావించును. పిదప వస్తుతత్వము నెరింగిన జీవుడుగాడు ఆత్మస్వరూపుడే నేనని తెలుసుకొనుచున్నాడు. అది యెట్లనిన ఒక చిన్న దృష్టాంతము చెప్పెద వినుము. శృతి॥ అధ్యారోపాపవాదాభ్యాం అపమృత్యాక్ భవిష్యతి అధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచతే॥ లేనిది వున్నదని వున్నది లేదని లేనిదానిని గలుగజేసి చెప్పడము యెట్లులనిన, తొల్లి వకరహదారీవీధిలో యొకత్రాడు లావుగాను నిడివిగాను. పడియుండెను. దానింజూచి పెక్కండ్రు మనుష్యులు సర్పమని భయపడి కొందరు ప్రాణవియోగముపొందిరి. కొందరు మూర్ఛిల్లిరి. కొందరు భయముచేతం బడి గాయములు గొట్టుకొని కొందరు ప్రాణభీతిని పరగుబారిపోయి పట్టణమున చెప్పుకొనిరి. ఆపట్టణమునకుండు జనులందరు కలవరపడి గుంపుగుంపులుగా గూడి పెక్కువిధముల యోచించుచుండిరి. ఇట్లుండగ నొకబాటసారి యామార్గమున వచ్చుచు నారజ్జువునుం జూచి సర్పమని భ్రాంతినొంది కొంతదూరము వెనుకకుంబోయి నిదానించి యీరహదారీబాటలో నీసర్పము గదలక మెదలక యుండుటకు కారణమేమని చేతులు దట్టి సందడిచేసెను. రాళ్ళు రువ్వి కొట్టెను. అందువల్ల అది చలించనందువలన మెల్లమెల్లగా బోయి కర్రతో కదలించి చూచి త్రాడని తెలుసుకొని సర్పభ్రాంతిని విడచి యాత్రాడు హస్తమునందు బట్టుకొని వోహోత్రాడా నాకెంత భయోత్పాదము బుట్టించితివి. ఆహా శరీరాత్మలు లేనిదానవు ఏకాల

మందును నీవు కోరికైయుండవు ఏమీ లేని నీయందు సర్పభ్రాంతి పుట్టుచున్నది. ఛీఛీ నీయందు ఏదోషమున్ను లేదు. నిన్ను నీవు యెరుంగవు యితరులును యెరుంగరు. ఏజోలి నీకు పుట్టను. ఆహా యెంతమంది భ్రమజెందిపడిరి. యిందుకు నీవె కారణము కార్యము నీవె కార్యకారణములు యెరుంగవు యీరెండున్ను భ్రమ నీకుం దెలియకనే నీయందు మాయ కల్పితమైనది పండితపామరులు యిది తెలియనేరక యీజీవభ్రాంతిని నీవు కల్పించినటుల చెప్పుదురు. ఏకాలమందును భ్రమను నీవు పుట్టించలేవు. మూలాభావంగ వచ్చినది మేఘమందు మెరుపుతీగవలె వచ్చినది. నీవు యెమీ లేని త్రాడువని యచట దూరముగ బడవైచి భ్రాంతి యెంతమాత్రము లేక పట్టణములోనికి వచ్చి అచట గుంపుగుంపులుగా గూడియున్న సమాచారమును జూచి గాబారేలపడెదరు యేమీ లేని యుత్తరాడు సర్పభ్రాంతినిబొంది బహుమంది జనులు పడిపోయిరి. అది సర్పముగాదు నిజముగా త్రాడు. నేను చక్కగ పరిశీలించిచూచి యే భ్రాంతిని బొందించని ఆయుత్తరాడుచుం బట్టి దూరముగ బడవైచి వచ్చితినని యదార్థమును చెప్పిన యీభ్రాంతికులు యతని నిజవర్తమానము దబ్బర యని తలచి చాలుచాలు నిలుపు నీమాటలు నూర్గురుమంది మరణించిరి. మున్నూర్గురు మూర్ఛిల్లిరి. బహుమంది గాయములు గొట్టుకొనిరి. పట్టణపు జనులు బహుమంది భయముచేత పరగుబారివచ్చిరి. ఇంతమంది సర్పమని చెప్పుచుండగ నీవు వక్కడవు త్రాడని చెప్పుటెట్లు పోపొమ్మని పరిహాసించిరి. జీవభ్రాంతిగలవారికి యెన్నిజెప్పినను యెన్ని దృష్టాంతములు జూపినప్పటికిన్ని వారు నమ్మరు. వారికి సర్పభ్రాంతియే పట్టియున్నది నిజమెరింగి వచ్చి త్రాడని చెప్పిన యాపుణ్యపురుషుడు సర్పమని కోట్లకొలది జనులు చెప్పి పెక్కు దృష్టాంతరములు చెప్పినను అతడు త్రాడని యెంచునే గాని సర్పమని భ్రాంతిబొందడు. కాబట్టి నిజముగా నీనిజస్వరూపమైన కేవలాత్మస్వరూపమును దర్శించినవారికి దప్ప యితరులకు నీజీవభ్రాంతి విడువదు. భ్రాంతిచేతనే పండితపామరులు వేదశాస్త్రములను గల్పించిరి. నీనిజస్వరూప కేవలాత్మయందు జీవభ్రాంతివలన ప్రపంచము కల్పింపబడును. నిజగురు కటాక్షముచేత గాని తన్ను తా దెలియదు. చీకటి వెలుతురుగానికాలమందు మార్గమధ్యమున త్రాడుపడియున్నది. అది త్రాడని ఎరుంగక దానినే పామని భ్రాంతిజెంది కళవళబడినటుల ఆత్మయే తానని యెరుంగకపోయినప్పుడు

ఆత్మనె జీవుడుగా భావించును. పిదప వస్తుతత్వము నెరింగిన తను తానెరింగిన అప్తుడగు జనుడు వచ్చి అనగ సద్గురుడు హరుడు గురుడైవచ్చి ధరణిలోపల నారారుతత్వములకు నవ్వలైయున్న తత్వంబు నెవ్వడెరుగు శివుడు గురురూపమున వచ్చి చెప్పకున్నె యనునట్లు, ఆసద్గురుడు వచ్చి భయపడకుమని ఇది త్రాడుకాదు పాము సుమీ యని చెప్పినప్పుడు వెనుక పాము సుమీ యని చెప్పినప్పుడు వెనుక పాముని చెందిన భ్రాంతి ఎట్లు నాశనమగుచున్నదో యట్లె ఆప్తశ్రేష్టుడగు ఆచార్యుని అనగ గురువుయొక్క సదుపదేశమువలన నేను జీవుడనుగాను ఆత్మస్వరూడపునే యని శృతి॥ నేతినేతీతి వైశృతిః॥ అను న్యాయంబున నేను అని తెలసుకొనుచున్న తాను తానైన పరమాత్మయై యుండును. శ్లోకం॥ ఆత్మపంచకం ఆభాతితం విశ్వమాత్మస్యసత్యం సత్యజ్ఞానానందమోహవిమోహాత్ నిద్రామోహాత్స్వప్నవత్తన్యసత్యం శుద్ధపూర్ణోనిత్య ఏకశివోహం॥ వ్యాఖ్యానం॥ కలలోన నరుకులాడిన గలవే గాయములు మేలుగాంచినవెనుకం దెలియక మునుపటిసంసృతి కలకలువిజ్ఞానికేల గలుగం దోచుఁ; తలపన్ గాఢవిరక్తియుఁ స్పుటరాద్వైతవిజ్ఞానము జ్వలనర్వేంద్రియమానసోపరతియుఁ సంపూర్ణమై నిత్యముఁ వెలయంగదనుగాంచు కేవలునకుఁ విశ్వంబు చూపట్టునే కలలో గన్న గజంబు మేలుకొనినన్ గఁపట్టునె మారుతి శ్రీరామహృదయమందు చెప్పియున్నది. కావున మహావాక్యరత్నావళియందు శృతి॥ అనాత్మదృష్టె అవివేకనిద్రా అహమనుస్వప్నగతిం గతోహం॥ సచ్చిదానంద స్వరూపుడగు పరమాత్మయందు యీప్రపంచమంతయు అజ్ఞానవశమున అన్నాత్మదృష్టివలన వున్నదానివలె గనంబడుచున్నది. గాఢనిద్రయందు స్వప్నమునందు దోచిన ప్రపంచమువలె పైని గనబడిన ప్రపంచము సహితము వాస్తవముగాదు. నిర్మలుడును అట నిండియుండువాడును కాలత్రయములయందు ప్రకాశించువాడు అద్వితీయుడు శివస్వరూపుడనైన మంగళస్వరూపుడనైన నేనే పరబ్రహ్మమును నామరూపజడదుఃఖాత్మకమైన ప్రపంచము స్వప్నమువంటిది. అనగ లేనిదే వున్నట్టుగ తోచబడినది. ఆరోపింపబడిన అధ్యారోపాపవాదము కృష్టాష్టకం॥ ఇంద్రజాలవజ్జగత్సతోతిరిక్తమావహాత్ శబ్దదర్శనం యథావిమూఢముగ్ధదర్శనం భ్రాంతిమాత్రకారణం విత్వకృద్వినాశనం॥ అని యిత్యాదిదృష్టాంతములు. తత్రాత్రేయోపనిషత్॥ ఇంద్రజాలమిదం సర్వం యథామరుమరీచరికః అఖండితమనాకారం

వర్తతే కేవలం శివం॥

వ్యాఖ్యానః॥ మరుమరీచికా- దూరములోని యెండమావులు, యథా- ఎట్లో, తథా- ఆప్రకారముగా, ఇదం- ఈ, సర్వా- సమస్తప్రపంచమును, ఇంద్రజాలం- జాలమువంటిది, పరమాత్మా- పరమాత్మను, అఖండితం- భిన్నముగానిదియు, అనాకారః- ఆకారములేనియు, కేవలః- అద్వితీయంబును, శివః- మంగళస్వరూపుఁడును, భవతి- అగుచున్నది. దూరములోని యెండమావులు దగ్గరకుబోయినయెడల నెట్లు నబద్ధమగుచున్నవో యట్లె ఈప్రపంచమంతయు తత్వవిచారంబున నింద్రజాలమువలె మిథ్యయగుచున్నది. అఖండస్వరూపుఁడగు పరమాత్మ ఆకారములేనివాఁడున్ను అద్వితీయుఁడును నిత్యమంగళస్వరూపుఁడును నగు పరమాత్మ యెప్పుడు యున్నవాఁడు. అవధూతోపనిషత్తు॥ సతతం సర్వవివర్జితయుక్తః సతతం సర్వవివర్జితముక్తః ఏవంతథమిహ జీవితమరణం॥ భావార్థః॥ అహం- నేను, సతతం- ఎల్లప్పుడును, సర్వవివర్జితయుక్తః- సమస్తమునుండి విడువబడినదానితో గూడినదియు, సర్వా- సమస్తస్వరూపుఁడును, తత్వవివర్జితముక్తః- జ్ఞానమునుండి విడువబడిన యజ్ఞానప్రపంచసంసారమునుండి విడువబడినదియు, పరమాత్మ- ఇతి- అని, ఏవం- ఈప్రకారము, జ్ఞాతః- తెలిసినవాఁడు అగుచుండగ, ఇహ- ఇచ్చట, మమ నాకు, జీవితమరణం- పుట్టుచావులు, నాస్తి- లేవు, కథం- యెట్లు, భవతి- కలుగుచున్నవి, మమ- నాకు, ఇచ్చట ధ్యానాధ్యానైః ధ్యానముచేతను, ధ్యానము లేక పోవుటచేతను, కరణం- కలుగునట్టి కార్యములు, యెట్లుకలుగును గావున తన కంటె అన్యమైనది యొక్కటియు లేదు — శ్లోకం॥ ఆత్మపంచకం మత్తో నాన్యత్కించిదత్రాస్తి విశ్వం- సత్యం బాహ్యంవస్తుమాయోపక్లుప్తమ్॥ ఆదర్శాంతర్భాసమానస్యతుల్యం మయ్యద్వైతేభాతి- తస్మాచ్ఛివోహం.

త్వంమేవ- కదాచిదపి- హంతః నహి- నీవు ఒకప్పుడును చంపబడువాడవు కావు, కులజాతివిచారః- కులముయొక్కయు జాతియొక్కయు, అసత్యమిది- యబద్ధమనియు, అహమేవ- నేనే, పరమాత్మా- పరబ్రహ్మమును, ఇతి- అనియు, వదంతి- చెప్పుచున్నారు. శ్రుతి- యీప్రపంచము, శ్రుతి॥ వంధ్యాకుమారవత్- గొడ్డుదానికుమారునివలెనే అనగ గొడ్డుదానికి సంతతి యెన్నడూలేదు యికముందు కాదుగావున లేనిది లేనేలేదు, అనగ నీకునునాకును భేదములేదని యభిప్రాయము అనగ. నాకంటెభిన్న

ముగ సత్యముయినట్టి ప్రపంచమను వస్తువేలేదు. బాహ్యమునకు గోచరించునట్టి ఈవస్తుసమూహము మాయాకల్పితముగాని యదార్థముమాత్రము గాదు. నిర్మలమును ఛిద్రహితమును నగునద్దమునందు గనంబడు ప్రతిబింబము సత్యముకాక యధిష్ఠానమాత్రమె ఎట్లుసత్యమగుచున్నదో అట్లే స్వజాతి విజాతి స్వగతభేదశూన్యుడైనట్టి నాయందు ఈప్రపంచము ప్రకాశించుచున్నటుల తోచునుగాని వాస్తవముమాత్రముగాదు. కనుక ఆత్మస్వరూపుడనె నేను. అనగ పరబ్రహ్మమేను. బృహదారణ్యోపనిషత్॥ త్వం ఏకనిరంతరసర్వసమం విజ్ఞాశిచ ఇదం వియదాదిః మృగతోయసమం యతః భవతి సర్వసమం॥ శృతి॥ మృగతృష్ణజలంపీత్వా తృప్తిశ్చేదస్త్విదం జగత్॥ మృగతృష్ణికలయందు సిగగలుగ దోచుచున్న జగదాభాసమును భావార్థః॥ త్వం- నీవు, ఏకనిరంతరసర్వసమం- కేవలుండును నిత్యుండును భేదములేనిదియు నగుపరమాత్మయని విజ్ఞాశిచ- తెలుసుకొనునట్లయితె, ఇదం- ఈ, వియదాదిః- ఆకాశము మొదలైన పంచమహాభూతములయొక్క సమిష్ఠియగు ప్రపంచము, మృగతోయసమం- యెండమావులయందలి నీళ్ళవలె, యతః- అంతవలెననే, భవతి- అగుచున్నది. సర్వసమం- ప్రపంచస్వరూపుడను భేదములేనివాడునగుదువు గావున శృతి॥ యత్ర- పరబ్రహ్మమునందు, యః- ఏమనస్సైతే, నహివిందతి- నహివిందతి పొందదో పొందదో- తత్ర- ఆ మనస్సుగలవానికి, చందోలక్షణం- వేదచోదితములైన లక్షణములుగల పరమాత్మ, నహివిందతి- నహివిందతి పరమాత్మపొందదు- పొందదు సమరసమగ్నః- అభేదస్వరూపమైన బ్రహ్మానందమునందు మునిగినవాడై, భావితపూతః- తలంపుచేత పరిశుద్ధుడై అనగా సంకల్పములేనివాడై ఆహార మాత్మ తానై తానుతానై, ఆత్మపంచకం॥ నాహంజాతో నప్రబుద్ధోననష్టః దేహస్యోక్తాః ప్రాకృతా సర్వధర్మాః కర్తృత్వాదిశ్చిన్మయస్యాస్తినాహం కారస్యైవహ్యాత్మనో మె శివోహమ్॥ నేనునొకప్పుడును పుట్టలేదు, ఒకప్పుడు మేల్కొని లోకవ్యవహారములతో ప్రవేశించలేదు. ఒకప్పుడు నశించలేదు. ప్రకృతిసంబంధములగు యీధర్మములన్నియు దేహమునకుచేరినవి గాని నాకుసంబంధించినవిగావు. చిత్స్వరూపుడనగు నాకు కర్తృత్వభోక్తృత్వములులేవు. అహంకారరహితుడగు జీవాత్మకే నేను శివస్వరూపుడనైన మంగళస్వరూపుడను. శృతి॥ తత్వమస్యాదివిద్యాచ పరోక్షజ్ఞానమెవహి

అహంబ్రహ్మాస్మీతి అపరోక్షమితీర్యతే॥—మేధోయుపనిషత్॥ దశాకాశవిరాహిత్యం దశేంద్రియవివర్జితం- దశప్రాణవినిర్ముక్తం దశయోగేనగశ్చతి సర్వోపాసనరాహిత్యం సర్వబంధవివర్జితం యత్రవ్యోమాదికంనాస్తి యత్రనాస్తి తనుత్రయం॥ శృతి॥ అకుక్షౌజగంనాస్తి హ్యాతకుక్షౌజగన్నహి- సదాజ్ఞానాదికంసర్వం జ్ఞానంనాస్తీతి నిశ్చయః॥

శృతి॥ మందాధికారిణామనాత్మూసేన నిష్ప్రపంచబ్రహ్మాత్మప్రతిపత్తా సిద్ధయే అధ్యారోపపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచతే॥ మూఢబుద్ధి చేత అనగ అజ్ఞానవశమున యీనామరూపాత్మప్రపంచము పరమాత్మ యందు ఆరోపింపబడినది గాని స్వాభావికముగాదు కావున తనకన్నా అన్యమైన దొక్కటియునులేదు గావున తన్నుదా దెలియవలెను. తెలిసినవాడు అంతా తానె. తానె అంతాయని శాస్త్రదృష్టంచేతను గురువాక్యంచేతను ఆత్మనిశ్చయంచేతను తన్నుతాదెలియవలెను. తెలిసినవానికే జీవభ్రాంతి రహితంబై పరమాత్మే తానై పరిపూర్ణుడై అంతాతానే మైయుండెను.

ఆత్మపంచకం॥ శంకరవిరచితం॥ నాహంజాతో నప్రవృద్ధోనష్టః దేహస్యోక్తా ప్రాకృతాసర్వధర్మాః కర్తుత్వాదిశ్చిన్మయస్యాస్తినాహంకారస్యైవహ్యత్మనోరమేశశ్శివోహం॥ కాబట్టి ఇత్యాదిప్రమాణంబులు జీవాత్మ పరమాత్మనుగురించి చెప్పుచున్నవి. భావార్థం॥ నేను ఒకానొకప్పుడు పుట్టలేదు. ఒకప్పుడు మేల్కొని లోకవ్యవహారములులో ప్రవేశించలేదు. నశించలేదు. ప్రకృతిసంబంధములగు యీధర్మములన్నియు దేహమునకు చేరినవిగాని నాకనే తనకు ఆపరమాత్మకు సంబంధించినవికావు. సన్స్వరూపుడనగు తనకు కర్తుత్వభోక్తృత్వములులేవు. అహంకారహితుడగు జీవాత్మమె తానైన కేవలాత్మమె మంగళస్వరూపమైన శివస్వరూపుడు.

మనీషాపంచకం॥ నాహంజాతో జన్మమృత్యుః కుతోమే నాహంప్రాణః క్షుత్పిపాసా కుతోమే నాహంచిత్తం శోకమోహౌ కుతోమే నాహం కర్తాబంధమోక్షౌకుతోమే॥ భావార్థం॥ నేను పుట్టలేదు. ఇకనాకు జననమరణము లెక్కడనుండిరాగలవు. నేను ప్రాణస్వరూపుడనుగాను. ఇక నాకు ఆకలిదప్పియెక్కడిది. నేనుచిత్తముకాను నాకు శోకమోహములు యెక్కడనుండివచ్చును. నేనుకర్తనుగాను గనుక బంధమోక్షములు యెక్కడనుండిరాగలవు. కాబట్టి శంకరభాష్యం॥ అవస్థాపంచకం శృతి॥ యతోవాయి

మానిభూతాని జాయంతే॥ అనిప్రశ్న మెట్లనిన—పరబ్రహ్మమునుండి ఈ భూతములుపుట్టుచున్నవో అను మొదలుగాగల వేదవాక్యములు బ్రహ్మమె ఆజగత్తునకు కారణమని చెప్పుటచేతను జీవాత్మకు అట్టిశక్తిలేకపోవుటచేత యిద్దరకు అనగ జీవాత్మ పరమాత్మలకు ఐక్యమెట్లుకలుగును. కావున—సమాధానమెట్లనిన, శృతి॥ బ్రహ్మణోఽవ్యక్తః అవ్యక్తాత్ మహతః మహతో అహంకారః అహంకారాత్ పంచతన్మాత్రాణి పంచతన్మాత్రేభ్యః పంచభూతాని పంచభూతేభ్యోనిఖిలంజగత్॥ ఇందుకుసమాధానమెట్లనిన- త్రిగుణాత్మికమై అనిశము జగములబుట్టింప నేర్పసమయింపంగాదగు మూలప్రకృతి నేనగుదుజుమీ సత్యముగ మహాగుణశాలీ అన్నట్లు త్రిగుణాత్మిక అవిద్యాప్రతిబింబరూపుడగు ఘటముపొలిసినతద్ఘటాకాశమున జెందుకరణి విజ్ఞానప్రవృత్తిపురము నెడబాసి నిర్మలపురుడు నన్నుబొందికరిమ్మరబారయును. పూర్వసంజ్ఞాఅన్నట్లు జీవునిచేత సృజింపంబడిన స్వప్నచైతన్యకోటుల నశ్వరమో అబద్ధమో నిజముగాదో అట్లె యీశ్వరకల్పితప్రపంచము స్వప్నమువలె నెట్లునబద్ధమో కాదో గావున జీవబ్రహ్మలకు ఏకత్వము చెప్పుటచేత దోషమేమియులేదు. ఈవిషయమునుగురించి శృతి॥ అనాత్మదృష్టే అవివేకనిద్రా అహంమమస్వప్నగతింగతోహం॥ శృతి॥ యథాస్వప్నప్రపంచోఽయం మయిమాయావిజృంభితః। ఏవంజాగ్రత్ప్రపంచోఽపి మయిమాయావిజృంభితః। కలలోదోచిన శరమేలాగో ఆలాగె అని- శృతి॥ సృష్ట్వాందేవానుప్రావిశత్॥ అను శృతివాక్యమునకు ప్రపంచమును సృజించి ఆప్రపంచమునే ప్రవేశించి యని యర్థము. కావున ప్రత్యగాత్మయు సాక్షాత్తుగ పరబ్రహ్మస్వరూపుడు గాని వేరుగాడు. తనకన్నా వేరుగాదు. జీవాత్మకు పరమాత్మకు భేదముకావుననే తత్వమసి మున్నగు వేదవాక్యములు జీవభావముజెందినవారికేగాని స్వభాసిద్ధమైన బ్రహ్మభావమును చెప్పుచున్నది. అనువిషయము యీశ్లోకమందు చెప్పబడియున్నది. చైతన్యముతోనిండియున్నట్టియు జీవేశ్వరాదిభేదములు గల యీప్రపంచమంతయు క్షేత్రక్షేత్రజ్ఞస్వరూపమైన యీప్రపంచము- గీత॥ క్షేత్రక్షేత్రజ్ఞయోరన్యః నామరూపవివర్జితః॥ సదా త్రిపుటిరహితః సర్వద్వంద్వవివర్జితః॥ అనుగీతాశాస్త్రప్రమాణతః పరమాత్మ- గీత॥ ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః నామరూపవివర్జిత॥ యను ప్రమాణముచొప్పున పరబ్రహ్మము, గీతావచనాత్॥ క్షేత్రక్షేత్రజ్ఞులుగానిదియు లేనిదియు నామ

రూపములు లేనిదియు గానిదియు నెల్లప్పుడుండునదియు త్రిపుటి త్రిగుణరహితమైనదిన్ని శబ్దగుణాతీతమైనదిన్ని ద్వంద్వములు కార్యకారణము క్షేత్రక్షేత్రజ్ఞులు దేహిదేహములు క్షరాక్షరములు మొదలగునవి లేనిదియు గానిదియు సర్వోత్కృష్టమైన ఉత్తమ పురుషుడు పరబ్రహ్మస్వరూపుడు జడదుఃఖాత్మకమైన నామరూపప్రపంచకము లేనిది గానిదిన్ని జీవేశ్వరాది భేదములుగల యీప్రపంచమంతయు సత్వరజస్తమోగుణాత్మకమగు అవిద్యచేత నావలన కల్పింపంబడిన కేవలనిర్మలమయిన పరబ్రహ్మమును యీవిధముగా సుఖరూపకమైనట్టియు నాశనములేనట్టియు స్వచ్ఛమైనట్టియు పరబ్రహ్మమునందు — యెవనికి బుద్ధిస్థిరమైయున్నదో అట్టివాడు చండాలుడైనను బ్రాహ్మణుడైనను గురువుగాని శిష్యుడుగాని బుద్ధిచే దెలసి తన్ను తాదెలసినవాడు యేజాతివాడైనను బ్రహ్మైక్యమును పొందవచ్చును.

నామరూపాది బహువిధభేదములుగల ప్రపంచమంతయు పరమాత్మయైన తనయందు ఆరోపింపబడినది. కాని వాస్తవముగా యీప్రపంచమనునది లేదు. శ్రుతి॥ నాస్తినాస్తిజగత్సర్వం నాస్తీశ్చయః॥ అని యంతను అధిష్ఠానభూతమగు పరబ్రహ్మము మాత్రమే సత్యముగాని మరియొకవస్తువుగాదు. సత్వరజస్తమోగుణాత్మకమగు అవిద్యను సాధనముగా గ్రహించి నిమిత్తకారణముగా భావించి నేనే యీప్రపంచమును కల్పించినాడను. ఈజగత్తున కధిష్ఠానభూతమగు పరమాత్మయే నేననునట్టిబుద్ధి నిరతిశయానందరూపుడగు పరమాత్మయందు మోక్షేచ్ఛగలవానికి నిరతిశయానంద నిత్యశుద్ధస్వప్రకాశ బ్రహ్మనిష్ఠైక్యానుసంధానముచేత దృఢమగుచున్నదో అట్టివాడు నిత్యశుద్ధస్వరూపముగల పరబ్రహ్మమే యగుచున్నాడు గావున జీవబ్రహ్మంబులకు భేదము సిద్ధించుచున్నది. కాని తన్ను తా విచారించిగా భేదములేదు.

శ్రుతి॥ శుక్తిరజితవత్సర్వజగత్॥

కొందరు ముత్యపుచిప్పయందు భ్రమచేత ఆరోపింపబడిన వెండివలె జగత్తుకూడ భ్రమచేత, స్మృతి॥ భ్రమేణాహంభ్రమత్వంచ భ్రమేణోపాసకాజనాః॥ బ్రహ్మణేశ్వరభావత్వం భ్రమమూలమిదంజగత్॥ భ్రమచేత ఆరోపింపబడినది గాని వాస్తవముగాదు. కాని ఆవిషయము ప్రమాణము చెప్పరాదు. ఏలననగ లోకమందు సార్థకమయిన వ్యవహారాదికము క్రమక్రమముగ జరుగుచున్నది గావున ముత్తెపుచిప్ప వెండియని శుక్తిరజితదృష్టాంతముగా యీ

ప్రపంచము దృష్టయగు పరబ్రహ్మమందే ఆరోపింపంబడినది. అద్వైతపరబ్రహ్మమునందు ద్వైతప్రపంచము ఆరోపింపబడినది గావున దృశ్యత్వముగలది మిథ్యయగుటచేతను ప్రపంచమునకు మిథ్యాత్వము సిద్ధించుచున్నది. కావున సత్యజ్ఞానానందస్వరూపమగు పరబ్రహ్మమే మిగులుచున్నది. దృగ్గోచరమగు అఖిలప్రపంచము అనిత్యమైనదను విషయము బాగుగా నెరిగి నిత్యుడగు పరమాత్మ తానని దెలసి తెలియనిచందమున దెలసియుండవలెను.

గద్య.

ఇతి శ్రీభీమనిరంజన నిగమాగోచర గురువరకరుణాకటాక్షవీక్షణాయత్తచిత్త చైతన్యజగజ్జేగీయమాన ప్రకర్షితాత్మికనై సచ్చిదానంద గుణగణాతీత వేద వేదాంగమంత్రమంత్రార్థ శ్రీమద్గురుపాదుకాపూర్ణదీక్షా పక్షదక్షత్వశుద్ధ నిర్గుణనిజబోధ పరాయణా పారీణపారాయణాధురీణ అజ్జరపుసూర్యనారాయణాఖ్య విరాజమానప్రభాసిత ప్రజ్ఞాప్రకర్షితప్రబోధితనై వేమూరివంశపయః పారావార రాకాసుధాకరస్య కౌండిన్యసగోత్ర వీరయభాగమాంబాగర్భకనిష్ఠజనిత హరితసగోత్ర సౌభాగ్యవతీ సామ్రాజ్య భోజ్య విద్యోపాసనావరప్రసాదకవనాకవిత కాట్రావులపల్లి సూర్యనారాయణ యోగినీ ప్రణీతంబగు మహాఋషినిఘంటితయోగశాస్త్రే బ్రహ్మవిద్యాయాం బ్రహ్మసూత్రము జీవసూత్రము సప్తమప్రకరణం

సమాప్తము.



# శ్రీ మహాఋషి నిఘంటిత్ర యోగశాస్త్రము.



## అష్టమ ప్రకరణము.



## విద్యాయోగము.



—♦ వసుదేవుడు, అర్జునునకు విద్యాయోగము బోధించుట ♦—

విద్యయనగ బ్రహ్మవిద్యయనియు, కామ్యవిద్యయనియు రెండువిధములు. బ్రహ్మవిద్య, నిష్కామవిద్య, అనగ బంధవిముక్తియైన మోక్షవిద్య. దీనినేననేక నామములుగా వాడేరు. పరమవిద్యయనియు, జ్ఞానవిద్యయని, గురువిద్యయని మోక్షవిద్యయనియు, ఆత్మవిద్యయనియు, పరమరహస్యమైనదియనియు యని శృతులు చెప్పుచున్నవి. విద్యయనగ జ్ఞానం, తెలివి, యెరుకగలిగియుండుట జ్ఞాపకశక్తి గలిగియుండుట, గ్రాహ్యకశక్తి, గ్రహణశక్తియని. శృతి॥ సత్యం జ్ఞానమనంతం బ్రహ్మబ్రహ్మవిద్యాసాంప్రదాయః॥ సత్యం-శాశ్వతమైనదియు, జ్ఞానం-గ్రహించునదియు, అనంతం-అత్యంతశూన్యమయినదియు, బ్రహ్మ-పరబ్రహ్మస్వరూపమైన విద్యయే మోక్షవిద్యయనబడును. బ్రహ్మ, విద్య, బ్రహ్మయనునది అవాఙ్మానసగోచరమైనది. అనగ వాక్కుచేతను మనస్సుచేతను గ్రహించుటకు గోచరముగానిదియు పలుకుల కందనిదియు భావమున కందరానిదియునైన బ్రహ్మము స్వయంప్రకాశముగాయున్న పరిపూర్ణము తానే యగుచున్నది. పిలిచిన పలుకనిదియు పలుకుయున్నదనే జ్ఞాపకమున్ను యేతలపులున్ను లేకయున్నదియు నిరంతరము నిర్మలమైనదియు, మౌనంనిర్వాసనంచతత్॥ మౌనస్వరూపమయినదియునైనది రేబ్రహ్మ యిట్టిబ్రహ్మను తెలియునది విద్య అనగ పంచవింశతితత్వాత్మకుడు, వ్యవహారికుడు, జ్ఞాత, విద్య, జ్ఞానం, తెలివి యెరుక యనునది విద్య. ప్రజ్ఞానం, బ్రహ్మప్రకృతి, జ్ఞానం, బ్రహ్మ అనగ చతుర్వింశ

తిచేకూడినదియే స్థూలదేహము. జ్ఞానం దేహేంద్రియములను గుర్తెరుగునది ప్రజ్ఞానం. ప్రకృతిని గ్రహించునది ప్రజ్ఞానం. ఈజ్ఞానమే బ్రహ్మమనగ యిరనై అయిదో వాడు జ్ఞాత యనేజీవాత్మ. ఈజీవాత్మే పరబ్రహ్మ. బ్రహ్మ, విద్య, అనగ జీవాత్మయని పరమాత్మయని. ఉపసపేయోవాసోజీవాత్మ పరమాత్మ వో॥ ఈరెండు సమీపముగా నేయున్నవి.

యజ్ఞవరాహభగవద్గీతయందు చెప్పియున్నది. విద్యకన్న ధనమువెుం దైనగలదా. జననమరణప్రవాహరూపకమయిన సంసారవారధిదాటించునది నానాకర్మజవాసనామయంబైన నజ్ఞానము నశింపుజేయునదియు యిదియే మూలవిద్యయనియు, ఆదివిద్యయనియు యీవిద్య మహఋషులు యుపనిష ద్వాక్యంబులచే బోధించునదియునైయున్నది. కాబట్టి విద్యయనగ వేదమని యు యీవేదమును విచారించిన బ్రహ్మమేయగును. ఈవేదస్వరూపమే బ్రహ్మ మని చెప్పియున్నది. కామ్యవిద్య దేహేంద్రియసమన్వితమయి యీమణత్రి యములకుబాల్పడి వాసనాత్రయములకులోనగుచు అష్టమదములకు చిక్కు పడి యరిషడ్వర్గములకు దగులుపడి, యుదరనిమిత్తంబహుకృతవేషః॥ యను నార్యోక్తిస్వప్పున మెలంగుచ,

ఫస్టు, సెకెండు. థర్డు, ఫోర్తు, ఫిఫ్తు, స్కూలుఫైనల్, మెట్రిక్యులేషన్, యింటర్మిడియేట్, బియె బియల్, ఎమ్యే, ఎల్టి మొదలయిన క్లాసుపరీక్ష లు చదువుకొని యేవిధంబునానైన ధనమార్జింపంగవలయు. ధనమూలమిదం జగత్॥ అనెడి నార్యోక్తివలన విద్యను సంపాదించి ఫైవ్ హండ్రెండు, త్రి హండ్రెడ్, తవ్జండ్స్ అని జీతములు. గవర్నమెంటువారికి కావలసిన వుపకృ తులను చేయుచు నెలాఖరు ఒకటవతేదీనాట్కి జీతములు తెచ్చి పుత్రమిత్రి కళత్రిబాంధవుల యుదరపోషణార్థమయి బహుశ్రమదమాకల పొంది సంపా దించి తనదేహసంరక్షణార్థమయి సంపాదించు విద్యాధనము కామ్యవిద్యయని చెప్పబడును. కామ్యమనగ కోరికగడ. విద్యయనగ ధర్మము, అర్థము, కాము లు, మూడుకోరికలను యిచ్చునది. కామ్యవిద్య యిహపరసాధనంబైనది. బ్రహ్మవిద్యయే మోక్షసాధనంబైనవి. అకారాది క్షకారాంతపర్యంతము యాబైయారక్షరములుతోగూడినదే కామ్యవిద్య. అకారం క్షకారం యీరెం డుబీజములు గలసి అక్షరతత్వమయినది. ఈఅక్షరతత్వమే బ్రహ్మతత్వము. ఇదే బ్రహ్మవిద్య. కామ్యవిద్యయందు భక్తిరసమున్నది. బ్రహ్మవిద్యయందు

మోక్షసామ్రాజ్యము ప్రాప్తమగును. కావున కామ్యవిద్య యనగ కోరికల నిచ్చునది. ధర్మము, అర్థము, కామము, మోక్షముసు నిచ్చునది. కామము, రోషము, దుష్టశత్రువర్గపరితాపసాధనమయినదియు జన్మపరంపరాసంపాదితానేకమయినదియు ఘనమయిన కర్మజాలమయినదియు కైవల్యసంప్రాప్తమయినదియు కారణవైరాగ్యమైనదియు ధర్మమార్గమైనదియు సకలమైనగుణపుంజములచేత కూడినదియు సంశయరూపకమైనదియు దాగుణమైనబంధకమైనదియు గలిగి గర్వంబు దుఃఖంబు మదికిదోచుచుండి యజ్ఞానాంధకారమైన ధనము ధనము గావున బ్రహ్మవిద్యకు తల్లి తండ్రి భార్య సుతులు వశమునయ్యును సంసారంబువదలకుండు వశముగాకున్న వారల వదల మేలని చెప్పియున్నది. కావున సంసారకూపమునందు గూల్చునదియు సంసారకూపమునందు గూలనదియు నైన బ్రహ్మవిద్య జీవబ్రహ్మైక్యజ్ఞానము నిచ్చునదియు నైనదియే విద్యాయోగము రెండుభాగములుగా వ్రాసెదరు.

బ్రహ్మవిద్యాయోగము, పుట్టుట, గిట్టుట, లనెడి అలలుగల సంసారమను సముద్రమును దాటించునదియును సనకసనందనసనత్కుమారాదులచేతను బ్రహ్మవిష్ణురుద్రాదులనుచేతను వసిష్ఠాది మొదలైన మహాఋషులచేతను పొగడదగినదియును పొందదగినదియు సేవించదగినదియు విచారించతగినదియు నై యున్నది. బ్రహ్మహత్యాదిమహాపాపకర్మలనే నానాకర్మజవాసనామయంబైన కామక్రోధలోభమోహమదమాత్సర్య డంబాదిదుర్గుణములను సంహారముచేయునదియు నేను జీవుడ ననెడి అజ్ఞానమును తొలంగించునదియు నైనది బ్రహ్మవిద్య. పరబ్రహ్మజ్ఞానమనెడి దివ్యజ్ఞానము నిచ్చునదియు నిరతిశయానందము నిచ్చునదియు వేదమనెడి వృక్షమునకు ఆదియైనదియు నైనది బ్రహ్మవిద్యాయోగము.

కాబట్టి కామ్యవిద్యాయోగము వేదాంతవాక్యార్థములను ప్రతిపాదించుచు స్వేచ్ఛగా వాదించి ప్రవర్తించుచు సంసారదుఃఖకూపమునందపేక్ష గలుగజేయుచు, శ్రవణమనననిదిధ్యాసములుచేత వాదుకచేయుటకు బద్ధకించి, వేదాంతశాస్త్రములయందలి కొన్నియుక్తులను నేర్చుకొని, సభలయందు ప్రసంగించుచున్నను, బ్రహ్మవిద్యాయోగము అనగ, దుఃఖరహితమైన బ్రహ్మైక్యయోగము సంప్రాప్తముకానేరదు. అనంతరము కామ్యవిద్య, కామక్రోధాదులనెడు వర్గములయొక్క కలకలధ్వనులను ప్రచురముచేయుచు, స్త్రా

లశరీరత్రియాభిమానియగు, జీవుడు అజ్ఞానమనే, ప్రాపంచక శాంత, ఘోర, మూఢ వృత్తిత్రియముతో గూడుకొనియుండుట అంతఃకరణ చతుష్టయము నందు జేరి బ్రహ్మవిద్యయనే, సస్వరూపావలోకనమందు నిలవక అనగ తన్ను దా దెలియనేరక తననిజస్వరూపమును తాదెలియక, జననమరణప్రవాహ రూపకమైన ప్రాపంచకవ్యవహారములయందు మోహముంచి శబ్దాదితన్మాత్రిరూపముగ ఆవరణవిక్షేపములతోకూడిన కర్మేంద్రియ జ్ఞానేంద్రియముల నెడు పద్మములన్నియు ముకుళించియుండగా బ్రహ్మజ్ఞానాఖండాత్మాకారము న విజ్ఞానమైనట్టి బ్రహ్మమేతానై ప్రకాశించియుండగ కామ్యవిద్య కాయిక, వాచిక, మానశిక వ్యాపారరహితమై పరిపూర్ణమైన బ్రహ్మవిద్యానందమనెడు అమృతమును పానముజేసిన చిత్తము బ్రహ్మవిద్యాకారముగ పరిణమించి అధిక సంతోషమునుపొంది ఈబ్రహ్మవిద్యకు సమానములేనటువంటి యాకారమై యఖండస్వరూపుడై బ్రహ్మవిద్యాధురంధరుడై కామిగాకమోక్షకామిగాడు యను నార్యోక్తినిబట్టి ముక్తికామినితో క్రీడించుచుండు గావున బ్రహ్మవిద్యాదురంధరుడు మహాభోగియై, విరాగియై నిత్య నిర్గుణపరిపూర్ణసచ్చిదానందస్వరూపమైన బ్రహ్మవిద్యయందు ఆపరబ్రహ్మయందు సంప్రీతితో విద్యాభ్యాసముచేపొంది అనగ పర, బ్రహ్మ, విద్యయందు తనకు అనగ కామ్యవిద్యతో కూడిన ప్రపంచవ్యవహారికజీవునకున్ను అభేదైక్యానుసంధానముచే జనించిన, బ్రహ్మవిద్యయనే సుఖమునమభవించును. క్రమక్రమముగ కామకుడైన జీవుడవైనసీవు నిష్కాముడైన పరబ్రహ్మమైన ఆత్మవిద్యయందు అభేదముగ గూడియున్నదను పూర్ణబోధవలన గలిగిన బ్రహ్మవిద్యయనే యానందముచేత ప్రకాశించు బ్రహ్మజ్ఞానమునే పరమాత్మకును, కామ్యవిద్యయనె జీవాత్మకును భేదములేదను బ్రహ్మజ్ఞానము ఆనందోబ్రహ్మమనుటచే, నిరతిశయానందమును పొందియుండును. ఎట్లనగ గాలిలేని దీపకళికచందంబునను, అలలు నీళ్ళు లేని జలధిరీతిగాయున్ను, శాఖలు కొమ్మలు ఆకులుమొదలైనవిలేని స్థాణువ వలెనున్న యున్నది. బ్రహ్మవిద్య ఇహపరలోకఫలానుభోగములయందు అభిలాష లేకున్నదియు, బ్రహ్మ విద్యయనెడు పరమాత్మకున్ను, కామ్యవిద్యయనెడు జీవాత్మకున్ను, ఐక్యానుసంధానము గలుగజేసెడు విద్యయనే జ్ఞానస్వరూపియై తన్నాశ్రయించి తనకంటె యితరములేనట్టి ప్రత్యక్బ్రహ్మవిద్యాస్వరూపమైన, ఈపరమాత్మయందు శుద్ధజీవుడవైన తాను తీక్ష్ణమైనయొండయం

దుంచబడిన దీపమువలె, విద్య కర్మేంద్రియములకును, పంచవాయువులకు అంతఃకరణవృత్తులనెడు విద్యకులయముగలుగునటుల బహిరింద్రియదృశ్యములగు తనకంటె యితరములగు వస్తువులయొక్క రూపనామాదికములున్ను, అంతరింద్రియములకు గోచరములగు కామక్రోధాదిరూపములను మరచి, అసమానమైన రాజయోగమనే బ్రహ్మవిద్యయనే సమాధిని పొందవలయును. ఏలాటివిద్యాయోగము, బ్రహ్మవిద్యాయోగము, కామ్యవిద్యాయోగముచేతనయినను, తన్నుదా దెలియవచ్చును. అనగ బ్రహ్మ, విద్యా యోగమువిడదీయుటకు ఆత్మానాత్మవివేకజ్ఞానసంపన్నునకేగాని యెట్లని క్షీరనీరవిభాగేన హంసోహంసబకోబకః॥ హంసోయథాక్షీరఇవాంబుమిశ్రిమం॥ బ్రహ్మమనెడు పాలను అనగ నైష్కర్మ్యప్రాప్య నిర్గుణబ్రహ్మమనే పాలతోకలసిన నీళ్ళను పాలనుండి విభజింపనేర్చిన హంసవలె ప్రపంచముయొక్క, విద్యయొక్క చావుపుట్టుకలు మొదలైనవాటికి కారణభూతుడైన, పరబ్రహ్మస్వరూపముగల విద్య నిస్సారమైన ప్రపంచమును ప్రపంచవిలక్షణమైన బ్రహ్మమునందు నివసించినదై దానితో ఐక్యమైయున్నది. ఏవిద్యాయోగము బ్రహ్మ విద్యయనెడు వాస్తవమైన శబ్దార్థమును యెవడుతెలుసుకొనుచున్నాడో నట్టివాడు సంసారదుఃఖమునుండి తొలగింపబడుచున్నాడు. గనుక అట్టిదుఃఖములను బోగొట్టినదియె బ్రహ్మవిద్యాయోగము. గాబట్టి—

శ్లోకం॥ పంచభూతాదిసంయోగ జ్ఞాయతే నాదసంజ్ఞకం హృచ్చిత్త బుద్ధిసంయోగ జ్ఞాయతేబిందుసంజ్ఞకం॥ క్షేత్రజ్ఞజీవచైతన్యం కళానామ్నేతి విశ్రుతః॥ బిదునాదకళాతీతం ప్రణవంమోక్షదాయకం॥ ఇట్లని రాజయోగ సిద్ధాంతమందు చెప్పియున్నది. విద్యయనగ బిందువ. బిందువనగ స్థూలశరీరమందుయుండెడు ఉచ్ఛ్వాస నిశ్వాసరూపమైన ప్రాణవాయువ్రయనే మనస్సు వీటియొక్క అగ్రభాగమునందుయున్న అనగ శృతి॥ తస్యాశ్శిఖాయామధ్యే పరమాత్మేవ్యవస్థితః- శ్లోకం॥ చక్షుర్మధ్యేస్థితంగుహ్యం, అంగుష్ఠపరమాత్మకం తదర్థంచాపిసర్వార్థం, తస్మాగ్రిసూక్ష్మకంధృవం॥ ఇత్యాదిశృతి ప్రమాణములు చెప్పుచున్నవి.

విద్యాజ్ఞానమె నిశ్చయాత్మకమగుబిందువ. ఆబిందుస్వరూపమైన విద్యాజ్ఞానమె విజ్ఞానమయకోశమునందు ప్రకాశించుచున్నది. విద్యాయోగమనే బ్రహ్మవిద్య పరమాత్మయొక్క ప్రతిబింబమె కళయనబడును. దీనినే

విద్యాకళయని, బ్రహ్మకళయని, జీవకళయని, ఆత్మకళయని, ప్రకృతికళయని మహాఋషులుచెప్పుదురు. ఈపంచకళాతీతమె పరబ్రహ్మము. పూర్వము చెప్పబడిన బ్రహ్మవిద్యాధికారైన పరమాత్మయొక్క ప్రతిబింబమై జీవకళతోడ కలసిన మాయంతఃకరణముయెల్లప్పుడును కదలకుండునటుల జేయుటయే బ్రహ్మవిద్యాయోగము. బ్రహ్మజ్ఞానస్వరూపమైన బ్రహ్మవిద్యారూపమైనదియు పరబ్రహ్మమనే జ్ఞానబిందురూపమైనదియునైన జ్ఞానకళయును మఱియు దీనిచేతనే జగత్ ప్రారంభముచేయబడుచున్నది — శ్రుతి॥ ప్రకరోతిపురుషోపభోగార్థం, శబ్దాదిభోగ్యానితి వా ప్రకృతిః॥ పురుషభోగముకొరకు శబ్దస్పర్శాది భోగ్యవస్తువులజేయునదిగాన ప్రకృతియనబడును. విచారింపగా ప్రకృతిలేనిది (దీనికే అవిద్యయని పేరు) తానైన పరబ్రహ్మమే యునికిపట్టైయునదిగాని వేరైనయునికి లేనిదిగనుక తనకన్నా భిన్నమైనదిగాదు. సనాతనమైన యీ మాయ ప్రకృతియనియు, అజ్ఞానమనియు చెప్పబడుటవలన తనకంటె వేరు కాదనియున్నది. శ్రుతి॥ రజ్జువునం సర్పారోపితంబైన చ ద బన అవగ తాటియందు సర్పభ్రాంతితోచినట్లుగనే బ్రహ్మమందు జగద్భ్రాంతితోచబడినది.

ఈప్రకారముగాచెప్పిన ఆప్రకృతిమొదటను, నడుమను, అంత్యమందును లేనిదయ్యును, మొదటను, నడుమను, కడపటను యున్నదానివలె కనబడి జన్మస్థితిలయములులేని బ్రహ్మకు జన్మస్థితిలయములు గలుగునటుల ఆక్రమించునది విద్యయనే ప్రకృతి ఈప్రకారముగ క్రమ్మగాని మూలవిద్యయనే ప్రకృతి మాయయనియు, యవిద్యయనియు రెండువిధములయినది. అందులో మొదటిదియగు మాయసత్వగుణమైన నిర్మలమైనదియునై యున్నది. అవిద్య మాలిన్యమైనదియునై యున్నది. ఆలోచించిచూడగ సత్వగుణస్వరూపిణియైనదే విద్య యనియు ఈరీతిని నిర్మలమైన సత్వగుణము ముఖ్యముగాగల మాయయనెడు కారణోపాధిగలది సమస్తప్రాణికోట్లకు ఆధారమైయున్నది లోకములను సృజించుశక్తిగలదియైయున్నది. జీవోపాధియైన అవిద్యరాజసగుణస్వభావముగాగలదియైనట్టి త్రిగుణసహితమైనట్టి మూలవిద్యయనే ప్రకృతికి ఆధారంబైన బ్రహ్మంబొక్కటియే యున్నది. ఈప్రకారముగా మలినసత్వప్రధానమైన అవిద్యయు ఆ అవిద్యయందు ప్రతిఫలించిన బ్రహ్మచ్ఛాయయును జేరి జీవుడని చెప్పబడును. కావున సర్వప్రాణులకు స్థానమైనట్టి విద్యయతిశయమైన ప్రపంచస్వరూపమైనట్టిదియునై యున్నది. ప్రపంచమే స్వ

రూపముగాగలవిద్య అఖండసచ్చిదానందపరబ్రహ్మమై యున్నదిగాబట్టి సమస్తలోకములకు ఆధారమైనట్టి అంతట వ్యాపించునదియు సర్వాంతర్యామియు స్వజాతి విజాతి స్వగతభేదములు లేనిదై పరిపూర్ణాద్వితీయ బ్రహ్మవిద్యాచైతన్యమాత్రంబునై యున్నది. కావున వేదములచేతనున్ను తెలియబడని దాటచేత ఋగ్వేదము యజుర్వేదము, సామవేదము, అధర్వణవేదము అని వేదములు నాలుగు. ఈనాలుగువేదములచేతను బ్రహ్మవిద్య శ్లాఘింపదగినదియున్ను వేదస్వరూపమైనదియున్ను, ఋషిప్రోక్తమైనదియున్ను, వేదాంతశాస్త్రములచేత వాస్పినమైనదియున్ను యుపనిషత్తులయందలి యదార్థమును తన్ను దాదెలిసికొనినవారివలన దెలిసికొనదగినదియునై యున్నది. ఇదియునుంగాక ఆరుశాస్త్రములున్ను అరువదినాలుగు విద్యలలో ఆదివిద్యయైనదియు వేదాంతశాస్త్రజ్ఞానము గల దేశికులయొక్క బోధవలన గలిగిన సారమైన బ్రహ్మవిద్యను దెలసినదియునై ప్రకాశించుచున్నది. విద్యాజ్ఞానస్వరూపమైనదియు జ్ఞానము చేత యెరుగదగినదియు బ్రహ్మైక్యజ్ఞానము నిచ్చువట్టిదియునైన తానె- అహం బ్రహ్మాస్మియను వేదప్రమాణము చెప్పుచున్నది. కావున తానె బ్రహ్మము అహం- నేనే బ్రహ్మను, అస్మి- అయితిని అనునట్లు అనంగచంద్రఇంద్రలోపాముద్రిసౌభాగ్యషోడశమహావిద్య శ్రీవిద్య, బ్రహ్మవిద్యా, అవిద్యా, అగస్త్య, మహావిద్య, ఆదివిద్య, సాదివిద్య లనెడు చతుర్దశమాత్రవిద్యలచేతను నెరుగదగినది. అరువదినాలుగు విద్యలకు ప్రభునైన బ్రహ్మవిద్య సర్వవిద్యాస్వరూపమైనదియు అపరోక్షసాక్షాత్కారమైన బ్రహ్మవిద్యాస్వరూపమైనది గాయత్ర్యాది సప్తకోటిమహామంత్రములకు మహాతత్వమైనదియునై మహామంత్రవిద్యలకు ఆధారభూతమైన బ్రహ్మవిద్యాస్వరూపమైనదియు గురుస్వరూపమైన సర్వపరిపూర్ణ పరబ్రహ్మతత్వ మాత్రుండగు—

గీత॥ క్షరాక్షరాభ్యాం విలక్షణః ఉత్తమపురుషస్య పరమాత్మేత్యుదాహృతః క్షరాక్షరాభ్యాం విలక్షణః। గీతావచనములు చెప్పుచున్నవి కావున ఇరువదిఅయిదవవాడైన జ్ఞాత, విద్య, జీవుడు ఈజీవప్రకృతికి పరమైనవాడు ఇరువదిఆరవవాడు పరమాత్మయు తన సాన్నిధ్యంబువలన తన దివ్యతేజస్సును పొందియు బ్రహ్మమును పొందియు పరబ్రహ్మమైన, తన్ను తాదెలియలేక తానగు జీవుని నామరూపములు గలవానినిగ తలంచుచు, సంసారచక్రమందు తిరుగుచుండును. ఈలాగు బహుకాలము సంచరించి కొంతకాలము

నానాకర్మజవాసనామయంబై యనేకజన్మములయందు ఆర్జింపబడిన సుకృత పుణ్యఫలముచేతను పరిపక్వమైన తన యనుగ్రహము శ్రీమహాదేవగురుడైన పరమాత్మయొక్క యనుగ్రహమువలనను స్వచ్ఛమైన మనస్సుగలవాడనై, సాధనచతుష్టయసంపత్తిగలవాడు సాధనచతుష్టయ మనే నుపకరణముయొక్క సంపత్తితో గూడి, శృతి॥ గురోర్ ముఖేనజ్ఞాతవ్యం అన్యథా నోపలభ్యతే సర్వధర్మాన్ పరిత్యజ్యమామేకం శరణం వ్రజ॥ సద్గురుపాదముల నాశ్రయించి ఆజగద్గురువులవలన ఇది పరబ్రహ్మము, ఇది ప్రకృతియని నిత్యానిత్యవస్తు వివేకము నెరుగనగి బ్రహ్మ సాక్షాత్కారము నెరుగదగినవాడును నైన జీవుడు, స్థూలముమొదలు అహంకారమువరకు గల అనగ యిరువదిఅయిదు తత్వములు లేక, ముప్పదియూరుతత్వములు లేక, తొంబదియారుతత్వములును, ఆత్మకానిది యంతయు తాను గానని నిరాకరించి నాహం దేహోనేంద్రియా ణ్యాంతరంగం నాహంకారః ప్రాణవర్గోనబుద్ధిః దారాపుత్రక్షేత్ర విత్తాది దూరః సాక్షీనిత్యప్రత్యగాత్మాశివోహం॥ సర్వవస్తుదృశ్యజాల మంతయు తా పని తన్ను దాదెలసి తాను గాదని నిరాకరించి, శృతి॥ యదృశ్యభావనానాస్తి దృశ్యమేవతద్వినస్యతి॥ యని యదృశ్యం తద్వస్తు యదృశ్యం తన్నస్యం బని ఇత్యాదిశృతి ప్రమాణములు చెప్పుచున్నవి. కావున నేతి నేతీతి మహావాక్యములచేత వక్కపెట్టున నిరాకరించి సర్వము తానై విశ్వాకారమై, విశ్వరూపమై, జగదాకారమై జగద్రూపమై, సర్వాంతర్యామియై సర్వపరిపూర్ణమై, పరబ్రహ్మమై, సర్వసాక్షియై, దేహమును ప్రాణములను జ్ఞానేంద్రియ కర్మేంద్రియములును తనను తాను తెలుసుకొన నేరవు. తనను తాను దెలసికొనజాలనివి యితరము యెట్లు దెలుసుకొనును. ఆయింద్రియములు యితరమును దెలసికొనవు గావున పైచెప్పిన సర్వసాక్షియైన తానే దేహేంద్రియములయొక్క వ్యాపారములనున్ను అసత్యముగాను పరమాత్మయైన తాను సత్యమనియు తను తా తెలసి జూచును. కాబట్టి యెట్లనగ యనేకరంధ్రములుగల భాండములో నున్న దీపము వెలుపలి లోపలివస్తువులను తెలియజేయునట్లు మనస్సుచేతను బుద్ధిచేతను దశవిధప్రాణములచేతను జ్ఞానేంద్రియ కర్మేంద్రియములచేతను కూడిన శరీరమునందు తాను యెల్లప్పుడు, నిష్కారణమైన యవివేకముచేత ఆరోపింపంబడిన వెలుపలలోపలను నుండెడు నామరూపములయొక్క సమూహములను లోకోక్తి విలాసముగా చూచుచు

ప్రకాశింపజేయుచుండును. ఋగ్యజుస్సామాథర్వణము లనెడు నాల్గువేదములచేతను వ్యాకరణము మొదలగు ఆరుశాస్త్రములుచేతను కామికము మొదలుకొని వాతూలాదివరకు నుండెడు యిరువదియెనిమిద మహాదాగమములచేతను తన్నుదా దెలియదగిన పరమాత్మగాను సమస్తము దెలసినమహాత్ములు గాయత్ర్యాదిజపములయొక్కయు కృచ్ఛ్రచాంద్రాయణాది నిత్యనైమిత్తిక శమదమాది మొదలగు అష్టాంగయోగములచేతను గోదానము మొదలుగాగల సోడశమహాదానములు యజ్ఞములయొక్కయు సమూహములచేతచక్కగ తన్నుదా దెలసి పూజింపదగిన పరమాత్మ గాపున సమస్తమునకు సాక్షినై స్థూలసూక్ష్మశరీరములయందు ప్రవేశింపక కారణశరీరము నే ననెడు భ్రమ లేనందున నిష్కారణమైన నైష్కర్మ్య కర్మజ్ఞానముగలదినై యున్నది. కాబట్టి సాక్షాత్కారమైన బ్రహ్మజ్ఞానులందరును అట్టి పరబ్రహ్మస్వరూపమైన జగద్గురునకు అప్రాకృతమైన పాదారవిందములకు ఉరసా, శిరసా, దృష్ట్యా వచసా, మనసాతథా, కరాభ్యాం, కర్ణాభ్యాం, ప్రణమోష్టాంగముచ్యతే॥ యని సాష్టాంగదండప్రమాణంబు లాచరించి వినయము, భక్తి, దృఢము, వివేకముగలిగి జగద్గురువర్యా, నిజస్వరూపము బాహ్యభక్తి, ఏకాంతభక్తి, అనన్యభక్తిచేత తెలియదగినదియో లేక త్రిగుణములతో గూడినదియో లేక త్రిగుణాతీతమో తన్నుదా నెట్లు దెలుసుకోబడునో అనగ ఏకాలమందు యెట్టియాచారములను గలిగియో వాక్యమౌన, అక్షరమౌన, కాష్ఠమౌనము లనెడు మౌనమాత్రము గలిగియో యెట్లు తన్నుదా దెలిసుకొనునో శృతి॥ మౌనం నిర్వాసనం చతత్॥ యని యున్నది. కావున ఇది విదితంబుగ దెలియ చెప్పవలయునని యడిగిన గురువిధేయుంబు నడిగిన మాయయొక్క వికారములగు పుత్రమిత్రకళత్రాదులు శరీరేంద్రియములు మనోబుద్ధిచిత్తఅహంకారములు మొదలగువాటిని విడుచుటకు తగిన యనుభవజ్ఞానయుక్తిచేత లౌకికమయయుక్తిచేత శాస్త్రయుక్తిచేతను తన్నుదా దెలసుకొని తాను గాదని సర్వము తానయై ఏస్థలమందైనను ఏకాలమందైనను ఏపనులు చేయుచున్నైనను మరి యేవిధముచేతనైనను, సమస్తవికారములు అవిద్యాకల్పితములనియు తాను వికారరహితమైనదియు ప్రపంచశూన్యమై కల్పనారహితమైనట్టి సంపూర్ణమైనట్టి కదలనట్టి పరిశుద్ధమైనట్టి నాశనము లేనట్టి నిత్యస్వరూపమైనట్టి బ్రహ్మవిద్యాస్వరూపమై సంసారదుఃఖము పోగొట్టునదియు నిత్యసుఖ

స్వరూపమై ఆకారహితమైనదియు అంతట నిండియున్నది త్రిగుణాతీతమైనది కూటస్థునికంటె వేరు గానిదియు నగు బ్రహ్మము తానని యెల్లప్పుడు ఆత్మావలోకనము జేయుచు సమయమందు సత్పురుషునకు సప్తకోటిమహామంత్రములన్నియు నిరర్థకములు అవియన్నియు కామ్యకర్మము ౧ త్రివర్గముల నిచ్చునవి అనగ స్వర్గాదిభోగముల ననుభవించునవి. కావున నిష్కామకర్మచేయు బ్రహ్మ విద్యాధికారికి కామ్యకర్మము లన్నియు నిరర్థకములు. కావున లింగదేహము అనగ సూక్ష్మదేహము సమస్తకోరికలకు ఆధారమైనది అజ్ఞానమైనది యునై యున్నది. పరబ్రహ్మము, అజ్ఞానరూపమైన లింగదేహము నంటక ప్రకాశించుచుండును. అట్టి పరబ్రహ్మమే తానైన వానిని ప్రకృతి వికారములు అంటనేరవు. కావున కేవలాత్మయగు తానే బ్రహ్మవిద్యానిష్ఠునకు అన్యుడను గాను ఆబ్రహ్మవిదుడు బ్రహ్మమైన నాకంటె నన్యుడుగాడు బ్రహ్మ విద్యాజ్ఞానమనునది అజ్ఞానమైన నన్ను విజ్ఞానుడనైన తన్ను తాదెలిసికొననేరదు. కాబట్టి త్రిగుణాత్మకమైన ప్రకృతిని తగిలియుండిన అనగా ప్రకృతితో గూడియున్న తన్ను సగుణస్వరూపునిగా జూతురు. ఆప్రకృతిని విడిచినప్పుడు నిర్గుణుడని యందురు. కావున శ్రీజగద్గురు కటాక్షమున తన్ను దా దెలియవలయును.

సమాప్తము.



# శ్రీ మహాఋషి నిఘంటిత యోగశాస్త్రము.

## జీవుని స్థూలసూక్ష్మకారణయోగము.

భీష్ముల వారు ధర్మరాజునకు జీవుని స్థూలసూక్ష్మకారణయోగము బోధించుట.

ఆ- స్వయంప్రకాశంలో బ్రహ్మంలో అహం స్ఫురణఆయినది. ఆ- స్ఫురణపేరు మాయ. శృతి॥ యంమాసామాయ యని శృతి. అంతఃకరణ- దీనిపేరే- అవిద్యాజ్ఞానం ఆబ్రహ్మ- బాధమోహాలులేనిది- ఆమాయపేరు జ్ఞానం- ఇదే ప్రజ్ఞానం- యెరుక- చిచ్ఛక్తి చిత్కళ- బ్రహ్మకళ పూర్ధ్వరేతస్సు త్రిగుణాత్మికమూలప్రకృతి॥

శృతి॥ అణిమమూలజ్ఞప్తి కళామాత్రశరీరం- అనాదిమూలప్రకృతి- త్రిగుణగాయత్రి- సర్వార్ధధాత్రి- సావిత్రిమావాహయామి- సరస్వతిమావా హాయయామి- ఛందసుషిమావాహయామి శ్రియమావాహయామి- బలమావాహ యామి- శృతి॥ ఓమిత్యేకాక్షరం బ్రహ్మ- అగ్నిర్దేవత- బ్రహ్మయిత్యా ఋషిః॥ గాయత్రింఛందం పరమాత్మ స్వరూపం శృతి॥ నశృతిః శశ్మృతిః నప్రకృతి నపురుషః నభవతి॥ శృతి॥ సత్యజ్ఞానానంద మనంతం బ్రహ్మ ఇది మాయాశబలితబ్రహ్మ అనాదిమూలమాయ యిదివిద్యగనుక॥ శృతి॥ అణిమ మూలజ్ఞప్తికళామాత్రశరీరనాస్థవిశ్వయః॥ ఆదిమధ్యాంతశూన్యమైనది. నమా తనపితూర్ - ఈయిదంజ్ఞాతుంశరీరం వేరేగాబ్రహ్మశక్తి యనేయెరుక స్మరణ దీపం అనగ జ్యోతిసీస - యీనీడపేరు అజ్ఞానం- అవిద్య జడం అనేదే స్ఫురణపుట్టినది. ఇదే అర్థమాత్ర పంచవింశతి అధ్యాత్మ 25 దో తత్వ జ్ఞాతశుద్ధసత్వ అహంకారం సగ్వసాక్షిణ్యావస్థ, ప్రాజ్ఞడభిమాని, విశిష్టం, సుషు ప్త్యవస్థ, అక్షరతత్వం॥ శృతి॥ హృదయకమలధ్యేజ్యోతిరానందరూపం హృదయ కమలమధ్యే సూర్యబింబానరూపం, భృగియవిదళమధ్యే హంసమార్గానరూ పం, సకలవిధమయం బ్రహ్మమార్గానరూపం బని ఇత్యాదిశృతిప్రమాణంబులు చెప్పుచున్నవి. మాయాయుక్తచైతన్యం పేరు, ప్రాజ్ఞుడు యీప్రాజ్ఞునకు సర్వ

జ్ఞత్వ అవస్థాత్రియ సాక్షీ స్వప్రకాశత్వం సర్వవ్యాపకత్వం సర్వనియంతృత్వమైయున్నది. ఈమాయాత్యాగంత్యాగంచేస్తే ఆచైతన్యానకు యీశ్వరత్వం నాస్తినిశ్చయం.

ఆఅవిద్యాయుక్తచైతన్యం పేరు జీవుడు. ఈజీవచైతన్యానకు కించజ్ఞుడు అవస్థాత్రియసాక్షిత్వం అవస్థాత్రియవ్యాపకత్రియం అవస్థాత్రియానకు ప్రకాశత్వం యున్నది. ఇతనికి దేహత్రయతాదాప్యం అయినది. ఈతాదాప్యం పేరు బంధనం. ఈబంధనం విచారణచేత పోతుంది. బంధనం విడుచుటే మోక్షం. దేహత్రియతాదాప్యంచేత బద్ధత అనిపిస్తుంది గాని జీవునిశరీరం చిన్మాత్రం చిదాకాశం అక్కడ దేవతతాదాప్యమున్నది. దేహంయొక్క తాదాప్యంనాస్తినిశ్చయం. తనస్వరూపవిచారణచేత దానిపేరు మోక్షం. బంధరహితంమోక్షం ఆచైతన్యానకు బంధత్వంలేదు. ముక్తత్వంలేదు. బంధమోక్షములు కల్పనామాత్రములు. శ్రుతి॥ మనఏవమనుష్యాణాం కారణంబంధమోక్షయోః॥ జీవస్వరూపములో యేమిలేదు. జీవస్వరూపం స్వప్రకాశం చిద్రూపం కేవలచైతన్యం. శ్రుతి॥ ఆకిశూన్యం బరశూన్యం సర్వంనాస్తికేవలం॥ కల్పనారహితంమోక్షం. ఈజీవుడు అవిద్యాత్యాగంచేస్తే ఆచైతన్యకు జీవత్వంనాస్తి. స్థూలసూక్ష్మకారణదేహత్రియమూలం అంతఃకరణ దానిపేరు హృదయకమలం శ్రీశంకరుడు రాజరాజేశ్వరియోగంబున చక్షోర్మధ్యేస్థితం గుహ్యం అంగుష్టంపరమాత్మకం తదర్థంచాపిసర్వార్థం తస్మాగ్రేసూక్ష్మకం ధ్రువమ్. ఆహృదయాకాశమందు తనస్వరూపం స్వప్రకాశం చిద్రూపం ఆనందరూపం. శ్రుతి॥ సత్యజ్ఞానానందోబ్రహ్మ॥ ఇత్యాది శ్రుతులు చెప్పుచున్నవి. పరిపూర్ణచైతన్యఘనం చిదాకాశం చిన్మాత్రం అవినాశనం నిర్వికారం అసంగం తన నయేకరూపం అస్తి. శ్రుతి॥ గీతావచనాత్॥ నయనంఛిదంతిశస్త్రాణి నయనందహతిపావకః॥ సీ. వసుధలో నణగదు వార్ధిలోమునగదు- గాధాగ్నిచేత దగ్ధంబుగాదు, గాలికిగూలదు కలుములజిక్కదు పాషాణములనైన పగిలిపోదు, యెండకుయెండదు యెండనీడకురాదు ఘనపాశములనైన గట్టుపడదు, గీ. చలికివణకదు భయమున కులికిపడదు, బ్రహ్మమైయుండు పరిపూర్ణమమల చరిత॥

శ్రుతి॥ స్వఆత్మపై స్వప్రకాశంభవతి॥ ఈజీవబ్రహ్మైక్యవిచారణచేయవలెను. ఈపైప్రకారం తన్ను తా తెలియవలెను. పంచవింశతితత్వములు

చేకూడిన జీవునకు జాగ్రత్స్వప్నసుషుప్తి తురీయాతీతం యీఅయిదున్ను జీవు నిగుణాలు స్థూలసూక్ష్మకారణమహాకారణదేహములు నాలుగున్ను వాటివివ రం వ్రాయనైయున్నది.

—♦ జీవునిత్రిగుణముల వివరం వాక్యార్థలక్ష్యార్థములు ♦—

1. సత్వగుణం బుద్ధినుంచి యుద్భవించినది. దీనిపేరే బాహ్యజ్ఞానం. దీని నుంచి దేవలోకప్రాప్తిభవతి అదే అన్యథాజ్ఞానబుద్ధి. దీనినే దేవయోనిప్రాప్తి దీనిధర్మం స్వప్నావస్థ, నిత్యనైమిత్తికకర్మం, వైరాగ్యశాంతి, ఔదార్యంకలది, సౌమ్యంజ్ఞానం, మౌనం, హర్షం, క్షమం, సత్సహవాసం, నిశ్చయం, శ్రద్ధ, ధైర్యం, వివేకం. ఈదశగుణములు దీనివే. దయ, ధర్మం, కృప, భక్తి ఇవి దీనిగుణములే. ఎరుక, యివిజీవుని సత్వగుణం.

—♦ రజోగుణ వివరము ♦—

2. రజోగుణం. మనస్సునుంచి రజోగుణము పుట్టినది. దీనిపేరే విష యాశక్తి. దీనినే మనుష్యలోకప్రాప్తి. దీనిధర్మం జాగ్రదవస్థ. కామ్యకర్మ కామక్రోధలోభాదులుగలది. దర్పం, మదం, అహంకారం, విషమవాదం, అప్రియవాక్యం, వుద్యోగం, మత్సరం, కోపం యీమొనిమిదిన్ని రాజసగుణ ములు. దానం, భోగం, శృంగారం, వస్తుగ్రహణం, స్వార్థం యివియన్నియు కలది ఎరుకమరుపులు కలది రజోగుణం.

—♦ తమోగుణవివరం ♦—

3. తమోగుణం అహంకారమునుంచి పుట్టినది. తమోగుణం, ఆలశ్య ము, మోహం, నిద్ర, చాపల్యం, హీనవృత్తి, పరనింద, హింస, సాంప్రిష్టం, వాదం, శోకం, కలహం, వధ, వంచన యివి తమోగుణములు. ఈతమోగు ణము పేరే మోహభ్రాంతి. దీనినే అధోలోకప్రాప్తివని ధర్మసుషుప్తి తామస కర్మ, ఆలస్యం, భ్రాంతి, తొందర, మొదలయిన వికారములు కలది తామస గుణం మరుపు.

—♦ ఈశ్వరదేహచతుష్టయం ♦—

1. మహాకారణం, ఈశ్వరుని మహాకారణదేహం, మాయ, మూల ప్రకృతి, స్వరాట్టు, అనాహతం, పంచబ్రహ్మమయం, పంచభూతములకు హేతుర్భూతం, దీనికి సర్వసాక్షిణ్యావస్థ, ఈశ్వరుడభిమాని, శుద్ధసాక్ కారం, జ్ఞానశక్తి, బ్రహ్మాండస్థానం, సర్వకర్తృత్వసర్వపాలకత్వ సర్వ

కత్వ, సర్వనియామకత్వ, సర్వభోక్తృత్వ, సర్వేశ్వరత్వాది షడ్గుణైశ్వర్యభోగం ఓంకారంమాతృక, మహాత్మనిరంజనస్థానం, అష్టమాతృక యిదే అంతటికిమూలం. ఇదే మూలజ్ఞప్తికళామాత్రశరీరం, అనాదిమూలప్రకృతి, సునీలగత, స్ఫటికవర్ణం విద్యావిద్యాచస్వయమేవభవతి.

—। ఈశ్వరునికారణశరీర వివరం లక్ష్యార్థం ।—

2. ఈశ్వరునికారణశరీరం, అవ్యాకృతమాయ, ఇదేజ్ఞానం. మహాతత్వం మకారంమాత్ర, విస్మరణ, ప్రళయావస్థ, రుద్రుడభిమాని, తామస అహంకారం. ఈఅహంకారమువలన తాపత్రయాదులు పుట్టినవి. దీనికి ద్రవ్యశక్తి అగ్నిస్థానం, సర్వసంహారభోగం, శుద్ధాత్మ దీనియందు మహదహంకారాదులు పుట్టినవి. త్రిగుణగర్భం, బిందోర్యపది, పంచభూతాలకుకారణం. దీనిక పార్వతిశక్తి, కైలాసస్థానం, కృష్ణవర్ణం, గత శ్యామలవర్ణం, యిదిప్రణవతృతీయపాదం, అజ్ఞానం కేనభవతీతిచేత్, న కేనాపిభవతి.

—। ఈశ్వరుని సూక్ష్మశరీరం వివరం ।—

3. ఈశ్వరుని సూక్ష్మశరీరం హిరణ్యగర్భం, ఉకారమాత్ర, స్థిత్యవస్థ విష్ణుఅభిమాని, సాత్వికాఅహంకారం, యీఅహంకారము వలన సూర్యాదిదేవతలు పుట్టిరి. దీనికి దిక్కులు శ్రోత్రంబులు, వాయువు త్వగింద్రియం, సూర్యుడు నేత్రం, వరుణుండు జిహ్వేంద్రియం, అశ్వనీదేవతలు ఘ్రాణేంద్రియం, వహ్ని త్వగింద్రియం, ఇంద్రుడు కరంబులు, ఉపేంద్రుడు పాదంబులు, బ్రహ్మ గుహ్యంబు, మృత్యువు గుదం, జ్ఞాతృ అంతఃకరణంబు, మనంబు చంద్రుడు, బుద్ధి బ్రహ్మస్వగ్రం క్షేత్రజ్ఞుడు, చిత్తం అహంకారం, రుద్రుడు దీనికి చంద్రస్థానం, సర్వపాలనభోగం, లక్ష్మీశక్తి, వైకుంఠస్థానం, శ్వేతవర్ణం, గతకర్బురవర్ణం, నీలమేఘమందు యుద్వేస్థానం, మెరుపువన్నె ఇదిమూలజ్ఞప్తి, విద్యుల్లేఖ, ఇతనికి సప్తధాతువులు ప్రాణాలు ఇది ప్రణవద్వితీయపాదం, ఈశ్వరుని సూక్ష్మదేహం.

—। ఈశ్వరుని స్థూలదేహవివరం ।—

4. ఈశ్వరుని స్థూలశరీరం విరాట్టు యిందుకు అకారం మాతృక సృష్టి అవస్థ బ్రహ్మ అభిమాని రాజసఅహంకారం పృథివ్యాపస్తేజో వాయురాకాశములు సూర్యచంద్ర ఆత్మలనె అష్టమూర్తుంబు ఈశ్వరునియొక్క విరాడ్రూపం బగు స్థూలదేహం దీనికి క్రియాశక్తి సూర్యస్థానం సర్వకర్తృత్వభోగం యందు

లకు ఆత్మ భూతాత్మ యితనికి ధరణి పాదములు వితలం మస్తకం అంతరిక్షం నాభి యిట్టి విశ్వశరీరునకు అతలంబు పాదంబులు వితలంబు గుల్ఫంబులు సుతలంబు జంఘంబులు, రసాతలంబు జానువులు, మహాతలం బూరువులు, తలాతలంబు కటిప్రదేశంబు, నాగలోకం, నాభ్యధోభాగం, భూలోకం నాభి, భువర్లోకం జఠరం, మహర్లోకం, కంఠం జనర్లోకం, ముఖం తపోలోకం, భ్రూమధ్యం సత్యలోకం, సహస్రారం దీనికి సావిత్రి శక్తి సత్యలోకస్థానం, రక్తవర్ణం గత పీతవర్ణం జీవుని నాలుగో శరీరం యితనికి స్థూలశరీరం. ఇది ప్రథమప్రణవపాదం సముద్రములు కుక్షి నదీనదములు, నాడులు పర్వతంబులు శల్యంబులు వృక్షలతలు రోమంబులు.

## —। జీవదేహచతష్టయవివరం ।—

1 జీవుని కారణశరీరం- ఇదె మూలమాయ- మూలజ్ఞప్తి ఇది- అంతఃకరణ- అర్ధమాత్రం- స్ఫురణరూపం- ధ్వనిరూపం- జ్ఞానం- స్ఫురణ- 25 దో తత్వంతుర్యావస్థ- ప్రత్యగాత్మాభిమాని- శుద్ధసాత్వికగుణం అక్షరస్వరూపం- కూటస్థం- పంచభూతోత్పత్తికి హేతువైన- సద్యోజాత వామదేవ అఘోర- తత్పురుష యీశాన పంచబ్రహ్మలుగలది ఆదిశక్తి- పరాశక్తి- జ్ఞానశక్తి- యిచ్ఛాశక్తి- క్రియాశక్తులుగలది. ప్రేరేపకంబులైన- పంచప్రాణంబులు- పంచాక్షరములు- పంచేంద్రియములుగలది. బ్రహ్మవిష్ణురుద్రయీశ్వర- సదాశివులును- పంచకర్తలంతఃకరణంబులుగలది- దీనికి మూర్ధస్థానం- ఆనందం- ఆభాసభోగం హ్రీంకారం- మాతృక- నిర్మలాత్మ- ఇది బ్రహ్మను సంధానంచేసేది- అణుమాత్రప్రమాణం- మేఘకాంతి- అతిశీత పుష్పసంకాశం- సునీలవర్ణం- ధూమ్రవర్ణం- ఇది ప్రణవచతుర్థపాదం- అంతఃకరణ- ప్రతిబింబచైతన్యంఅధిష్ఠానచైతన్యంబు జీవుడైనది-బ్రహ్మానుసంధానమునగ-వీమంటె-పరమ జడమైనస్థూలదేహంనేగాను- గమనాగమనములుగల ప్రాణములు నేనుగాను- జ్ఞానకర్మలక్షణంబులుగల యింద్రియంబులు నేనుగాను- వాగింద్రియము నేనుగాను-స్ఫురణగల అంతఃకరణ నేనుగాను- సంకల్పవికల్పాత్మకమైన- మనస్సు నేనుగాను నిశ్చయగుణంబుగల బుద్ధినే గాను-చింతచేసెచిత్తంబు నేగాను- దేహాన్ని నెత్తె అహంకారము నేగాను- గుణత్రయం నేనుగాను- నేనభోక్తను- అర్ధమాత్రకు ఆవలివాడను. శక్తిత్రయాతీతుడనని ఘొరుగునది.

శృతి। నాహందేహోనేంద్రియాణ్యాంతరంగం నాహంకారః ప్రాణవర్గోనబుద్ధిః- ధారాపత్యక్షేత్రవిత్తాదిదూరః సాక్షీనిత్యఃప్రత్యగాత్మాశివోహం॥

—♦ జీవుని కారణశరీరం వివరం ♦—

2. జీవుని కారణశరీరం- అజ్ఞానం- గుణసామ్యమాయ. దీనిపేరే మహత్వం మకారంమాత్రి విస్ఫురణ-. సుషుప్త్యవస్థ- ప్రాజ్ఞుడభిమానితమోగుణం దీనందువాయువరూపమైన వుశ్వాసనిశ్వాసం వున్నది. గనుక ఇది తిరిగేటందుకు ఆకాశం వున్నదనవలెను. యివి అన్ని యుండెటందుకు భూమిగావలెను. అది కూడా వున్నదని అనుకోవలసినదె. యీబీజరూపమైన పంచభూతాదులు కలసినదానిపేరె కారణశరీరం దీనికి స్థానం హృదయం చిత్తాహంకార జీవాత్మ సంగమమె కారణతనువు. ఆకాశాఅహంకారములు- కారణతనువు దీని హృదయస్థానమె ద్రివ్యశక్తి ఆనందభోగం- పరమాత్మ పారమార్థకుడు, ఇది ఆభాస అవ్యాకృతం- దీనికి అంగుష్ఠపరిమాణం కృష్ణవర్ణం- పస్యంతివాక్కు, ఆనందభోగం- మకారమాతృక. ఇది ప్రిణవతృతీయపాదం. ఇది సత్తుకాదు అసత్తుగాదు ఆత్మకు భిన్నంకాదు అభిన్నంకాదు సావయముకాదు నిరవయవముగాదు వుభయంకాదు ఇది ఆనందమయకోశం.

—♦ జీవుని సూక్ష్మశరీరం వివరం ♦—

3. జీవుని స్థూలశరీరం- ఉకారంమాతృక- స్వప్నావస్థ- తైజసుడభిమాని- సత్వగుణం- ప్రాణపంచక- జ్ఞానేంద్రియపంచక- కర్మేంద్రియపంచక- మనస్సుగలసి షోడశవిరాత్మకమైన సూక్ష్మశరీరం బని కొందరన్నారు. బుద్ధిని గలిపి 17 పదిహేడవది యని కొందరన్నారు. ఇందులోనె అంతఃకరణను విషయపంచ కొన్నికలిపి యిరువదిఅయిదవది యని కొందరన్నారు. కొందరు విషయపంచకాని తీసివేసి భూతపంచకాన్ని తీసివేసి కర్మపంచకాన్నికలుపుకొన్నారు. దీనికి కంఠస్థానం అగ్నివాయువులు కలసి సూక్ష్మశరీర మనబడును.

జ్ఞానేంద్రియపంచకం కర్మేంద్రియపంచకం మానసాద్యంతఃకరణ చతుష్టయపంచకం తత్కర్మకాలం భూతపంచకం దశప్రాణములు గలది. దీనికి యిచ్ఛాశక్తిస్వేచ్ఛాభోగం అంతరాత్మ ప్రాతిభాతికుడు యీదేహవాసనకు బిడారమైనది. దీనికి వివిక్తభోగం ప్రాణధర్మాలు మనోధర్మాలై క్షుత్పిపాస- శోకమోహాములు- వూర్మిచతుష్టంగలదు- అంధ, బధిర- మూక, ఖంజ-

పంగు, క్షీబహ్వాది- ధర్మాధర్మ స్వర్గనరకబంధమోక్షాలు గలది. పాృణమనో విజ్ఞానకోశతృయాత్మకమైనదిఅంగుష్ఠపృమాణంగలది శ్వేతవర్ణంఇదివిశేషశక్తి.

—♦ జీవుని స్థూలశరీరం వివరం ♦—

4. జీవుని- స్థూలశరీరం, యీదేహాత్మస్వరూపంకాదు. ఆత్మ సాక్షిగ యున్నది. జీవాస్వరూపం వేరే దేహం- పంచభూతాకారం- అది యెట్లాగంటె పంచభూతాలనుంచి ధ్యాన్నం నిర్మాణమైనది యీదేహంపేరు అదిస్థానం దీనికి అకారం మాతృక జాగృదవస్థ విశ్వడభిమాని రజోగుణం ఆకాశాంశమైన రాగద్వేషభయలజ్జ మోహాదులున్న వాయువహాంశమైన చలన-వళన- ధావన- అకుంచన- పృసరణాలు- అగ్నిహాంశమైన క్షుత్తు- పిపాస- నిదాృ- ఆలస్య- సంగమాదులు- వుదకాంశమైన- లాలమూతృ- శ్వేద- రక్త- శుక్ల- శుక్లమనగ బీజము కర్దము. పృథివిహాంశమైన అస్థిమాంస- తన్నాడి- రోమాదులున్న కలసి యీపంచవింశతి తత్వములచేత కూడినదే స్థూలదేహం- తొంభైఆరు అంగులాలు పొడవు నాలుగుజానలు వెడలపు దీనిలో డెబ్బది పెద్దయెముకలు యెనిమిదిఫలాలు గుండెలు నూటతొమ్మిది మర్మస్థానాలు డెబ్బదిరెండు సంధులు మూదిఅరుపిడికెళ్ళ మాంసము ముప్పదిమూరుకోట్ల రోమంబులు డెబ్బదిరెండువేల నాళ్లు ముప్పదిమూడుమూళ్ళ పెద్దపేగు అర్థ శేరు రుధిరం- సోలడు పైత్యం- అరసోలడు శ్లేష్మం వుండును. దీనికి యుక్త భోగం కృియాశక్తి వ్యవహారికజీవాత్మ యీదేహం లింగశరీరానకుబిడారమైనది. దీనిపేరు భూతకర్దమం దీనికి స్థూలభోగం- పృణవపృథమపాదం- అన్నమయకోశం- ఆపరణశక్తి- స్థూలకృశ- హృస్వ- దీర్ఘ- పుక- దేవదత్త- యజ్ఞదత్త- ధనంజయులు నామారూప వర్ణాశృమ కులగోతాృదులు గలది పితృసంబంధమైన మజ్జనాడ్య అస్థులనె కోశతృయమున్న కలసిన షట్కోశాలది. అస్తితే- జాయతే- వర్ధతే- పరిణమతే- అపక్షీయతే- వినశ్యతేఅనెడు షడ్భావవికారములు గలది. అంగుష్ఠం- నరపృమాణం- రక్తవర్ణం- దీనికి జననమరణాదులనేడూర్మిద్వయం గలది. శ్లోకం॥ అస్థిరం జీవనంలోకే అస్థిరం యవ్వనం ధనం అస్థిరం దారపుతాృది ధర్మకీర్తిద్వయం స్థిరం॥ శృతి॥ నాస్తినాస్తి జగత్ సర్వం యథా మరుమరీచికః యదృశ్యం భావనానాస్తి దృశ్యమేవతద్వినశ్యతి। యిత్యాది శృతిపృమాణంబులు చెప్పుచున్నవి. కాన దీపం వుండగానె వస్తువును తెలుసుకోవలెను.

ఏకమేవ- అద్వితీయం, బ్రహ్మ- వేదప్రమాణంబులు చెప్పుచున్నవి. ౧౧= స్వయంప్రకాశమానంబైన- నిర్గుణసాక్షాత్కారకేవల పరబ్రహ్మ. ౧౨= స్వజాతి- విజాతి- స్వగభేద- శూన్యంబై- అద్వితీయం- రెండవది కానిది- ఏకమేవ- తానొక్కటైనదియు- నైన-ం- బ్రహ్మంబునందు నధ్యస్థమై మిథ్యాభూతమై. త్రిగుణాత్మికమై గలుగదోచు- అణిమమూలజ్ఞప్తి కళామాత్రశరంబని మూలప్రకృతియనె- మాయాశబళిత బ్రహ్మంబనె- అనాదిమూలప్రకృతి- ఆ- బ్రహ్మంబునందు- శృతి- బ్రహ్మణోరవ్యక్తః- అనశృతి ప్రమాణంబున- యిట్టి అనాది అత్యక్త నామరూపాత్మియై- మూలజ్ఞప్తి కళామాత్ర శరీరంబై- అనిర్వచనీయమై- ఆవరణవిక్షేపరూపంబైన మూలప్రకృత్తి- అవ్యక్యజీవభ్రాంతి- శృతి. అబ్రహ్మనుంకు- అధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపంచా ప్రపంచతె- బ్రహ్మమందు ఆరోపింపంబడిన- మూలప్రకృతి- చంద్రచంద్రికా న్యాయంబున- ఆబ్రహ్మసన్నిధానబలమున-

బీజమందు వృక్షశక్తియున్ను- అగ్నియందు- వుష్ణశక్తియున్ను జలమునందు- చమ్మగించు శక్తియును- వాయువునందు. చలించుశక్తియును- శుక్లశోణితములయందు- తనువయ్యే శక్తియును. శరీరమందు- చైతన్యశక్తియును- మృత్తికయందు భాండమయ్యే శక్తియును- పృథివియందు కంపశక్తియును- బంగారమందు అనేకరూపములైన భూషణములయ్యేశక్తియు- పరమాత్మునందు అఖిలప్రపంచమయుడై- ప్రకాశించుచందంబున- బ్రహ్మాండంబు సృజింపబెంపలయు- పంగల్గుచందంబునన- త్రిగుణాత్మికంబైన మూలప్రకృతి- యనె జీవభ్రాంతి- ఆరోపితంబైనది. అదియెట్లనిన- మృగతృష్ణికలయందు.నిగనిగతోచునీరు- జగదాభాసము- దగులరజ్జువందు- ఉరగముతోచిన- నత్తెరగున- మాయాభాసము- దారువందు దోచిన మనుష్యరూపమాభాసమున్ను శుక్తియందుదోచిన-రజితాభాసమున్ను యిందుకు-శృతి॥ మృగతృష్ణజల పీత్వాతృప్తిశ్చేదం స్త్వందంజగతే- మరుమరీచికరజిత భ్రాంతివత్సర్వంనాస్తి- దారువపురుషవత్సర్వం భ్రాతి- నాస్తి రజ్జుసర్పవత్సర్వం జగత్తు- నాస్తి। పరమాత్మయందు- తన్నిధానబలమున- శృతి॥ గీతాశాస్త్రం॥ అస్తినాస్తితిశోవెద, నిర్నయూనాస్తి సర్వదా॥ అనిగీతావచనాత్॥ రజ్జువందు సర్పభ్రాంత్యారోపణం భవతి. ఆది మధ్యాంతశూన్యంబునై- మూలజ్ఞప్తి కళామాత్ర శరీరంబని మూలప్రకృతి యనె జీవభ్రాంతి- ఆరోపితంబైనది- తన్నుతా విచారించగ బరబ్రహ్మసత్యౌ

మని- తానె బ్రహ్మమని- అయమాత్మ బ్రహ్మంబని- తానె బ్రహ్మయని- తనయందు- తోచబడిన- జీవచైతన్యభ్రాంతి- ఆరోపణ- అసత్యమని శృతి॥ బ్రహ్మసత్యం జగన్మిథ్యా॥ అనిశృతిచెప్పుచున్నది. శ్లో॥ మమశేంబువత్స భూతరజ్జుసర్పవత్తథ- మహ్యామానమర్మదే భవారణు ప్రతారణు- వాసవా నిరాసకం సుఖాసన ప్రభాసకం బ్రహ్మరూపకం స్వరూపప్రాపకం గురుంభజే॥

శృతి॥ రజ్జజ్ఞానాత్ ద్భాతిరజ్జుంయదాహి స్వాత్మజ్ఞానాదాత్మనో జీవభావః ఆప్తోక్త్యాహిభ్రాంతినాశే శరజ్జున్ జీవోనాహం దేశాకాక్తా శివోహమ్॥

జగద్రూపకంబైన భ్రాంతి- నాస్తినిశ్చయము॥ జగద్రూపంబైన తానె బ్రహ్మము సర్వం బ్రహ్మమయం జగత్- సర్వం విష్ణుమయంజగత్॥ శృతిః శివాయవిష్ణురూపాయశివరూపాయవిష్ణవె- శృతి॥ అసావాదిత్యో బ్రహ్మ- సర్వాబ్రిహ్మేతివ్యజానాత్॥ బ్రిహ్మఇత్యాఋషిః గాయత్రీంఛందసాపరమాత్మాస్వరూపంఅస్థితి॥ తాను తానైనతత్వంబు తెలియదరమె అనునటుల మోక్షసామ్రాజ్యము.

గద్య.

ఇతి శ్రీభూమసిరంజన నిగమాగోచర గురువరకరుణాకటాక్షవీక్షణాయత్తచిత్త
చైతన్యజగజ్జాగ్రదయమాన ప్రకాశితాత్మతత్వనైన సచ్చిదానందగుణగణాతీత వేద
వేదాంగమంత్రిమంత్రార్థ శ్రీమద్గురుపాదు కాపూర్ణదీక్షాపక్షదక్షత్వ శు
ద్ధనిర్గుణనిజబోధపారాయణాపాకీణపారాయణాఘుశ్రీ అజరపు సూర్య
నారాయణాఖ్య విరాజమాన ప్రభాసిత ప్రజ్ఞాప్రకాశితప్రబోధితనై
వేమూరివంశ పయఃపారావార రాకాసుధాకరస్య కౌండిన్యసగోత్ర
వీరయభాగమాంబాగర్భశుక్తజనిత హారితసగోత్రి సౌభాగ్య
వతీ సామ్రాజ్యభోద్యవిద్యోపాసనా వరప్రసాదకవనాక
లిత కాట్రపులపల్లి సూర్యనారాయణయోగినీ ప్రణీ
తంబగు శ్రీమహాఋషినిఘంటితయోగశాస్త్రి బ్రహ్మ
విద్యామయాం విద్యాయోగ జీవుని
స్థూలసూక్ష్మకారణయోగము
అష్టమ ప్రకరణము
స మా ప్త ము.



# శ్రీ మహాఋషి నిఘంటికిత్ర యోగశాస్త్రము.



## నవమ ప్రకరణము.



## తత్వోపదేశము.



—: శ్రీ పతంజలిమహాఋషి సుధర్మమహారాజునకు తత్వోపదేశంబునకు ముఖ్యకారణములు బోధించుట :—

తత్వోపదేశంబుజేయుటకు ముఖ్యమైన కాలనిర్ణయములు గురుశిష్యులయొక్క యదార్థస్థితుల వివరము.

1. బ్రహ్మవిదునకు నిత్యానిత్యవివేకముగలవానికి వుత్తమునకు ప్రథమకాలంబున ఆత్మజిజ్ఞాసతత్వచింతన ఆరుమాసములకు కారణగురుప్రలసన్నిధిజేరిన ఆరుమాసములకు అహంబ్రహ్మాస్మి యను మొదలుగాగల వాక్యములను బోధించి జీవేశ్వరైక్యమును తేటతెల్లముగ దెలిపి జీవన్ముక్తియనుభవమును గలుగజేయును. ఎట్లనిన, సూక్ష్మబుద్ధిగలవానికి ప్రస్తుతక్షణముందు తక్షణమే జీవన్ముక్తిగలుగును.

2. బ్రహ్మవిద్వరునకు ఇహాముత్రార్థఫలభోగ విరాగముగలవానికి మధ్యమునకు ద్వితీయకాలంబున బ్రహ్మజిజ్ఞాసతత్వచింతన చిత్తచలనముగల మూఢాత్మునకు ఒక్కసంవత్సరమునకు రాజయోగసిద్ధిగలుగును. సద్గురుప్రల సాన్నిధ్యమును జేరిన ప్రజ్ఞానంబ్రహ్మంబను మొదలగు శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణంబులనెడి జ్ఞానేంద్రియంబులయొక్కయు వాక్పాణిపాదపాయుపస్థలనెడి కర్మేంద్రియంబులయొక్కయు మనోబుద్ధిచిత్తాహంకారంబులనెడి అంతరింద్రియములయొక్కయు విషయములగు శబ్దస్పర్శరూపరసగంధములయొక్కయు వచనదానగమన విసర్జన ఆనందములు సంకల్పవికల్ప నిశ్చయ చంచల కర్తృత్వములు వీటియందు వైరాగ్యమును గలిగించి శిష్యుని అంతఃకరణ నిర్విషయ

మగునటుల చేయుచు మహాత్ముడైన వాచకగురువు అట్టిబోధయందే మనస్సు పూర్వముఖవ్యాప్తిమై నిర్విషమై యుండును. ఇట్టివానికి ఒక్కసంవత్సరమున కు మనస్సు బ్రహ్మజిజ్ఞాసయందు స్థిరచిత్తముగలుగును.

3. బ్రహ్మవిద్వరీయునకు శమాదిషట్కసంపత్తిగలవానికి తృతీయకాలంబున అధమునకు జీవజిజ్ఞాసతత్వచింతనగల కేవలమూఢాత్మునకు మందప్రజ్ఞునకు ఆరుసంవత్సరములకు చిత్తవిశ్రాంతి గలుగును. యీలోకమందుండు స్త్రీలు వస్త్రములు నగలు పుష్పములు చందనము అత్తరువు పన్నీరు మొదలుగాగల గంధద్రవ్యములు మేడలు మిద్దెలు యిల్లు వాకిళ్లు తోటలు ధనము ధాన్యము ఆలుబిడ్డలు మొదలగువాని భోగములయందును పరలోకమందు యింద్రపదవి మొదలుగాగల పదవుల భోగములయందును రంభాసంభోగాదులయందును స్వర్గవైకుంఠకైలాసాదులయందును కోరిక లేకయుండుట మనస్సు బుద్ధిచిత్తము అహంకారము అంతరింద్రియములును వానివృత్తులకు పోనీయక పరబ్రహ్మయందు ఐక్యముచేసియుంచుట మనస్సు వేదాంతశ్రవణమునకంటె వ్యతిరిక్తమైన విషయాదులకు పోవుచుండెనేని దానిని మరలించి వేదాంతశ్రవణాదులయందు నిలుపుట మనస్సు తొందరబెట్టి చెదరగొట్టక నెమ్మదిగా స్వాధీనముచేసుకొనవలెను. దీనినే అంతరింద్రియనిగ్రహమని చెప్పిన శ్రుతి॥ యతో యతో నిశ్చరతిమనశ్చంచలమస్థిరం॥ తతస్తోనియమ్యైతదాత్మన్యేవ వశంనయేత్॥ అనగ చంచలమైన మనస్సు యేయేవిషయములయందు సంచరించుచున్నదో ఆయావిషయములనుండి దానిని మరలించి ఆత్మయందు వశపరచుకొనవలయును గావున యీమూఢాత్మునకు ఆరుసంవత్సరములకుగాని మనోచాంచలమడగదని పెద్దలు చెప్పనురేగాని పిపీలికాన్యాయంబున ఆరుసంవత్సరములకు ప్రయత్నపూర్వకముగా శిక్షించును. కావున యీమందప్రజ్ఞుడు సద్గురుసహవాసము విడువక చేయుచు నిత్యము ఆత్మవిచారణచేయుచుండెనేని ఆరు సంవత్సరములకు చిత్తవిశ్రాంతి సిద్ధించును.

4 బ్రహ్మవిద్వరిష్టునకు ముముక్షువునకు అధమాధమునకు 12 సంవత్సరములకుగాని జీవబ్రహ్మైక్యయోగశిద్ధి గలుగనేరదు.

5. మేధావియైన బ్రహ్మజ్ఞానికి వుత్తరక్షణములోని ఘట్యాంగునివలె రెండుఘడియలకు మోక్షమిచ్చినట్లునుదక్షప్రజాపతికి ఏడుఘడియలకు మోక్షమిచ్చినట్టుపురాణంబులుచెప్పుచున్నవి. కావునసద్గురుసన్నిధానమునుండి

శ్రుతి॥ శాస్త్రదృష్ట్వం గురోర్వాక్యం తృతీయం ఆత్మనిశ్చయం॥ యనునట్లు యీయాఘంటిచేత బ్రహ్మజిజ్ఞాసన జేసి మోక్షేచ్ఛగలవారై సూక్ష్మబుద్ధిచేత భక్తిజ్ఞానవైరాగ్యతత్వ విచారణచేత సద్గురుసన్నిధాన ముందుండి చతుర్విధ శుశ్రూషలజేయుచుసాధనచతుష్టయ సంపత్తిగలిగి తారకసాంఖ్యఅమనస్క రాజయోగమును నిత్యము సాధించుచు యింద్రియ నిగ్రహులై యింద్రియ ములను తాబేలువలె తన స్వాధీనములో వుంచుకొని—ఎట్లనిన శబ్దములను గ్రహించునట్టి శ్రోత్రేంద్రియము చెవుల స్పర్శను గ్రహించునట్టి త్వగింద్రియ ము చర్మము రూపమును గ్రహించునట్టి చక్షురింద్రియము కన్నులు రుచుల ను గ్రహించెడి జింహేంద్రియము నాలుక సుగంధదుర్గంధములను గ్రహించెడి ఘ్రాణేంద్రియము ముక్కు అనెడి జ్ఞానేంద్రియములైదింటిని. వచనములు గల వాగింద్రియములు నోరు దానప్రతిగ్రహములు గల పాణీంద్రియములు చేతు లు గమనాగమనములు గల పాదేంద్రియములు కాళ్ళు విసర్జనముచేయు పాయురింద్రియములు మలద్వారము ఆత్మానందముగల వుపస్థేంద్రియము మూత్రద్వారము ననెడు కర్మేంద్రియము లైదింటికిని వానివాని వ్యాపారము లకు బోనియ్యక పరబ్రహ్మమూ ఐక్యము జేసియుంచుట ఇంద్రియములు వేదాంతశ్రవణమున కంటె భిన్నమైన విషయములకు పోవ యత్నించుచుండ వానిని మరలించి వేదాంతశ్రవణాదులయందు మనస్సు నిలబెట్టవలెను. దీనినే బాహ్యేంద్రియనిగ్రహమని చెప్పుదురు.

ఏవంక మనస్సు నిలచిన ఆవంకనె యింద్రియము లన్నియు నిలచును. శ్రోత్రత్వక్చక్షుర్జింహ్వాఘ్రాణంబు లనెడు జ్ఞానేంద్రియములచేత ఉజ్ఞల కంద రకు మనస్సు సంచరించును. జ్ఞానులకు ఆజ్ఞానేంద్రియముల సహాయము లేక మనస్సు విహరించుచున్నది. యోగాభ్యాసము గలవారలు జ్ఞానేంద్రియముల సహాయము లేకనే జ్ఞానమనో నేత్రమువల్లనే సమస్తమును లోపల వెలుపల తనయొక్క సస్వరూపమును యోగజ్ఞానదృష్టిచే లోచూపు వెలిచూపును కూడా చూచెదరు. కనగలరు వినగలరు గ్రహించగలరు. కావున,

గీతాభాష్య॥ 2 అధ్యాయం 58 శ్లోకముందు—యదాసంహరతే చా యం కూర్మోఙ్గానీవ సర్వశః ఇంద్రియాణీంద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ తాబేలు తన కరచరణాద్యవయవములను వెలుపలనుండి తనలో కిముడ్చు కొన్నునట్లు యోగివరు విషయములను మరలించి మనస్సును ఆత్మయందే యిను

ద్భుకొని యున్నవాడో అతనియొక్క బుద్ధియే మిక్కిలి స్థిరమైనది. కావున సకల పాపకర్మంబులను విడచి సకలపుణ్యకర్మంబులు శ్రీమన్నారాయణ మూర్తియైన బ్రహ్మార్పణంబుగా జేయుచున్నవాడే ముముక్షువు. అట్టి మోక్షేచ్ఛగలవానికి అతిసూక్ష్మముగా గురురహస్యము గ్రహించి బ్రహ్మపదార్థమునందు లీనమై పరబ్రహ్మమే తానై తాను తానై అతిసూక్ష్మముగ అతిసులభముగ సూచనను గ్రహించును. అట్టివానికి ఘట్వాంగునివలె వృత్తరక్షణములోనే జీవన్ముక్తి నొందును. కాబట్టి, శ్రుతి॥ మనఏవ మనుష్యాణాం కారణంబంధమోక్షయోః॥ యనునట్లు సమస్తప్రాణులకు మనస్సు శ్రీగా నెంచబడియున్నది. అట్టి మనస్సు ఊర్ధ్వముఖవ్యాప్తి యగునేని విషయములను విడచి నిర్గుణసాక్షాత్కార పరబ్రహ్మమునందే నిలచియుండును. కావున సర్వకాలసర్వావస్థయందు మనస్సునకు నూర్ధ్వముఖ వాక్యమునకు నభ్యాసము చేయవలెను. అట్టియెడ నది క్రమక్రమముగ పరమేశ్వరునియందే నిలచి విషయలోలత్వము మానును. ఇదియే జీవేశ్వరైక్యము గాబట్టి అట్టి అభ్యాసము నొందిన మనస్సునకే జీవుడని పేరు. సజ్జనమనస్సును క్రమక్రమంబుగ వృత్తులకు పోకుండ నిలుపుట అభ్యాసము చేయగ మనస్సు నిలుచును. మనస్సు నిలచినప్పుడనే స్వప్రకాశమనెడి శుద్ధతెలివి జ్ఞాననేత్రమునకు కనబడును ఆ తెలివికే ఆత్మజ్యోతియనియు చిత్ప్రకాశమనియు పెద్దలు చెప్పుదురు. అదియే మూలప్రకృతి సర్వసాక్షి. ఇట్లు మూర్ఖమున్నగు మనస్సును స్వాధీనము చేసుకొనవలెను. పరమార్థమందు మనస్సు శ్రీగాను ఆత్మ పురుషుడుగాను. తన్ను తానెఱిగి అభ్యాసమందు మనస్సును అనాహతచక్రమందు నిలిపి పిమ్మట ఆజ్ఞాచక్రమున జేర్పవలయును. దాని కిటుకుతెలుసుకున తెలిసిన వెనుక సుషుమ్నానాడిక్రముగ సహస్రారమునకు జొప్పించి నిరంతరంబు సౌఖ్యమును ననుభవింపవచ్చును. అంగడిలో చక్కెర యున్నదని చెప్పినమాత్రమున విని భోగము గల్గునా? చక్కెర కొనితెచ్చితి ననినచో గదా దాని మధురము తెలియగలదు. అట్టిదే యిదియు ననుభవవేద్యమై యుండును. కాబట్టి కామక్రోధలోభమోహమదమాత్సర్యంబు లనెడు అరిషడ్వర్గమును దగ్గరకు జేరనీయక యేపాపకృత్యములకును బోక ప్రతిఫలము నపేక్షింపక భగవదర్పితంబుగ పుణ్యకర్మంబులు మాత్రమే చేయుచు నుండుటయే శివజీవైక్యా దీనినే సామాన్యముగ అరిషడ్వర్గములను జయించవలెను. శ్లోకం॥ కామః

క్రోధశ్చ- లోభశ్చ- దేహేతిష్ఠంతితస్కరః జ్ఞానరత్నాపహారేణ తస్మాత్ జాగ్రత జాగ్రత॥ కామము- కోరిక, క్రోధము- కోపము, లోభము- పిసిని గొట్టుతనము, మోహము- స్త్రీమీదనైనను ధనముమీదనైనను గలిగెడి కోరిక. మదము ధనమువలననైనను విద్యవలననైనను గలిగెడి అహంకారము, మాత్సర్యము- ఓర్వలేనితనము, ఇవి శరీరమునందలి అంతఃశత్రువులు. అనగ లోపలిదొంగలు. ఇవి జ్ఞానమనెడి రత్నమును హరించును. గనుక జాగ్రత్తగ యుండవలెను. అరిషడ్వర్గములను జయించవలెను.

గీతాభాష్యః॥ శ్లోకం॥ యస్సర్వత్రానభిస్నేహ స్తత్తత్ప్రాప్యశుభాశుభం నాభినందతి- నద్వేష్టి- తస్యప్రజ్ఞాప్రతిష్ఠితా॥ యెవడు దేహప్రాణాదులగు సర్వవిషయములలో దేనియందు నభిమానముంచక తనకు గలిగిన శుభమును గూర్చి సంతోషముగాని యశుభమును గూర్చి గాని విచారమును గాని యెవడు పొందకుండునో వానియొక్క మనస్సు బుద్ధియే మిక్కిలి స్థిరమైనది. వేదాంతశాస్త్రములయందు గురువునందు పరమేశ్వరునియందు బ్రహ్మవేత్తలగు పెద్దలయందు నుండు అచంచలములగు భక్తిశ్రద్ధలే ముఖ్య సాధనములు. అట్టివాని సద్యోముక్తిఫలము సంప్రాప్తమగును. పెద్దలవలన రహస్యములను దెలసికొనునప్పుడు మనస్సును యింద్రియములును విషయములకు లోబడనీయక నిలకడగ నిశ్చలసమాధినిష్ఠయందు నిలుపవలయును. అనగ మనస్సును చెదరనీయక మహాత్ములు చెప్పెడి రహస్యములను దెలిసికొనుటయం దాసక్తితో నుండునట్లు నిలుపుటయని యర్థము. పెద్దలవలన దెలసికొనిన సంగతులన్నియు ఒక్కటే యని శృతియుక్తి యనుభవములచేత మనస్సునందు సమాధానపరచుకొనుటయే నిశ్చలయోగ మనబడును. కాబట్టి అగ్నిలో బడినవాడు జలమును జూచుటకు తొందరపాటుచెందమున యీసంసారారణ్యమునందలి తాపత్రయంబులను దవానలకీలలకు కమలినవానికి మోక్షసామ్రాజ్యసుఖము యెచ్చట- నెచ్చట యని అతి ఆసక్తిచేత గలిగిన తీవ్రము యిల్లు గాలుచునుండు యింట్లోనివాడు తల్లడింపుచునుండి తాబైలువెళ్ళిననున్నట్లుగనే తీవ్రము సంసారతాపంబులను దొలంగించు సద్గురువు లెవరని సాధనము లెవ్వియని చింతించుచుండును. యీనాలుగు సాధములు గలవారే మోక్షాధికారులు. యీనాలుగుసాధములే మనస్సు అనెడి పెద్దపులిని ఆశయను కృష్ణసర్పముగ గరచి అనగ కామక్రోధలోభమోహమద

మాత్సర్యంబు లనెడి దొంగలను బారదోలును. ఈసాధన సంపత్తి లేనివానికి శ్రవణాదులచేత విజ్ఞానము అనగ బ్రహ్మజ్ఞానసిద్ధి యెన్నటికిని గలుగనేరదు. కావున యీసంసారతాపత్రయములను సద్గురుముఖవివేకజ్ఞానమున తన్ను దాదెలసుకొని యిది శరీరేంద్రియములకు గాని దీనికి సాక్షియైన తనకుగాని లేదని తన్ను తాదెలసుకొనినవాడే జీవన్ముక్తుడు గావున దీనిని దెలసుకొని ప్రారబ్ధవశమున గలిగెడు సుఖదుఃఖములకు వ్యసనబడక సంతోషింపక సర్వకాలసర్వావస్థలయందు నిర్గుణసాక్షాత్కార పరబ్రహ్మస్వరూపమునందే మనస్సు లగ్నముచేయుచుండవలయును. మరియు నీషణత్రయములు తాపత్రయములకు లోబడక తన్ను తాదెలసి తెలిసితెలియని చందమున దెలిసియుండవలెను.

బృహదారణ్యకోపనిషత్. తయోరేషసగ్ స్త్రావోయ ఏషోన్తర్హృదయ ఆకాశః॥ 6-అ-2- బ్రాహ్మణమునందు 3 అన్తరహృదయమందలి చిదాకాశము జీవేశ్వరులనెడు స్త్రీపురుషులకు సంభోగస్థానము. అట్టి స్థానమందే రమించిసుఖము ననుభవించవలయును గాని అన్యస్త్రీ అనగ ప్రకృత్తియందు భ్రాంతి విడువవలయును గాబట్టి అట్టి పరబ్రహ్మానందసంధానము చేయుటవలననే ఎడతెగని సుఖముకలుగును. కట్టెయందు నిప్పువలెనే పుష్పములయందు వాసనవలెనే పాలయందు నేతివలెనె సమస్తభూతములయందు ఆత్మసప్రకాశముగా నున్నది. అట్టి ఆత్మావలోకన లేకనే జీవన్ముక్తి గలుగదు. యీకలియుగమునందు పాపకూపారమున బడియుండుటవలన ననేకులు దుర్మార్గములు చేయుదురు. దొంగిలింతురు. హింసచేయుదురు శూద్రులకు సేవచేయుదురు ధనాపేక్షచేత నీచులకు భోదజేయుదురు. సత్యముగుదానిని అసత్యమని నసత్యమగుదానిని సత్యమనియు వాదించెదరు. విద్యావిహీనులైయున్నను సమస్తవిద్యలు దెలసినట్లుగ నటించెదరు. శూద్రులు వండిన అన్నమైనను తిందురు. ద్రవ్యముకొరకు కన్యకను విక్రయించెదరు బ్రాహ్మణశబ్దమునకు యర్థముదెలియక జంధ్యము వేసుకొనినమాత్రముననే బ్రాహ్మణులమని చెప్పుదురు. సన్మార్గులను నిందింతురు నీచజాతితో సంభోగముకోరుదురు రోగపీడితులైయుండెదరు మదగర్వముచేతను అమితకోపముచేతను దుఃఖముచేతను నిండియుండెదరు మోసముచేయుటయే ప్రజ్ఞావిశేషమని తలంచెదరు.

ఇది యేమికాలమహిమ- పూర్వము దుర్మార్గములేకపోవుటవలన సద్గు

ణసంపత్తిగలవారలై యనేకసంవత్సరములు జీవించెదరు. ఇప్పు డట్లుగాక నల్పాయుష్యముగలవారలై కొద్దివయస్సులోనే యమితమగు పాపమునుచేసినవారలై చచ్చుచు బుట్టుచుండెదరు. కాబట్టి బుద్ధిమంతులు యీదుర్మార్గములు మొదలగు దుర్గుణముల కిరవివ్వక సద్గురువును వెతుకవలెను. గురువులేనివిద్య కూడదు. ఎందులకైనను తల్లిదండ్రులులేని బిడ్డలవలెను, భర్తలేని పడుచువలెను, కళాహీనమైయుండును. నొసటవ్రాత తుడిచి భస్మముతో రేఖలుగీసి హస్తమస్తకసంయోగము చేయగ తెలివి శిరస్సునందు నిలచును. ఆతెలివియే నీవని గురువు చెప్పును. సూర్యుడు కిరణములతో యెట్లు హస్తమించునో అట్లే మనస్సున్ను వృత్తులతో నణగి తనయందే నిలచును. పక్షులు రాత్రులయందు చెట్లయందు నిద్రించురీతిని జీవుడు పరమాత్మయందు నిద్రించును. గోవులు వేరువేరుగాని అనగ నల్లగోవు తెల్లగోవు కర్రిగోవు పచ్చగోవు యనిభేదమే గాని పాలంతయు తెల్లగానుండి మధురముగలవియగును. అట్లే భూతములు వేరువేరైనను పరమాత్మ యొక్కటియే యని తెలియవలయును.

కౌశికుడను బ్రాహ్మణుడు ఒకయొరుకవానివద్ద సమస్తధర్మములను తెలుసుకొనెనని భారతమందు చెప్పియున్నది వినలేదా. బుద్ధిమంతులగు ఆత్మానాత్మవిచారణచేయు మేధానిధులు యేజాతివారైనను బ్రహ్మజిజ్ఞాసచేయుట సందేహమేల.

శ్లోకం॥ మనఏవజగత్సర్వం మనఏవమహారిపుః మనఏవహిసంసారో మనఏవజగత్రియమ్॥ ఋభుగీత॥ 2 అధ్యాయం 34 శ్లోకం॥

భావార్థమేమనగ, మనంబే సర్వప్రపంచము మహాశత్రువు మహాసంసారము లోకత్రియము నగును. మనస్సే సర్వము కల్పింపబడును. మనంబుచేతనే సర్వము పరిపాలింపబడును. మనంబుచేతనే సర్వము స్మరింపంబడును. కనుక మనంబే సంసారకారణమైనది. మనస్సువలననే దుఃఖమును పాపములును సంకల్పములును జీవుని చిత్తము, అహంకారము, మహాబంధము, అంతఃకరణపంచభూతములు, పంచతన్మాత్రలు, పంచవిషయములు, పంచకోశములు అవస్థాత్రియములు కలిగెను. కావున ప్రపంచమంతయు మనోవికారమేగాని యన్యముగాదు. కావున శృతి॥ నకర్మణా నప్రజయాధనేన త్యాగేనైకే అమృతత్వమానశుః పరేణనాకాం నిహితం గుహాయాం విభ్రాజతే యద్యతయో విశంతి॥ అనగ భావార్థః॥

స్వర్గమునకు మీదుగా పరమాకాశమందుండెడు మోక్షపదము కర్మ చేతను, సంతానముచేతను, ధనముచేతను పొందదగినదికాదు. మనస్సన్న్యాసముచేతను పొందదగినది. అదియేముక్తి. మరియు సత్యవాక్యపరిపాలనమువలననే ముక్తియని కొందరును తపస్సుచేతనే ముక్తియని కొందరును అంతరింద్రియనిగ్రహమువలననే ముక్తియని కొందరును దానకర్ణునివలె దానముచేయుటవలననే ముక్తియని కొందరును ధర్మమువలననే ముక్తియని కొందరును బ్రహ్మచర్యనియమమే ముక్తిమార్గమని కొందరును వైశ్వదేవము మొదలుగాగల కర్మలచేతనే ముక్తియని కొందరును యజ్ఞములచేత ముక్తియని కొందరును ఆధానములచేత ముక్తియని కొందరును పలువిధములుగ చెప్పుదురు. దేనివలనను ముక్తిగానము. బ్రహ్మక్షత్రైక్య అమనస్క-రాజతారకయోగమునగాని జీవనముగలుగనేరదు. అన్నమయమువలన ప్రాణమునకు బలముగలుగును. అన్నం బ్రహ్మేతివ్యజానాత్॥ అని-ప్రాణం బ్రహ్మేతివ్యజానాత్॥ బలముచేత తపస్సును తపస్సువలన ఆస్తిక్యబుద్ధియును అందువలన వేదాంతశ్రవణమును తద్వారా మననమును పిమ్మట నిదిధ్యాసయును నిదిధ్యాసవలన పరబ్రహ్మమందు జ్ఞప్తియును గాక భగవంతునియందు జ్ఞప్తియున్ను అందువలన ఆత్మజ్ఞానమును కలుగుచున్నది. పిమ్మట అపరోక్షజ్ఞానమును ముక్తియును కలుగును. మనోవాక్కాయములచేత త్రికరణశుద్ధిగ సద్గురువుల సేవజేసి గురుమంత్రమంత్రార్థమంత్రానుభవములను తెలసి అనగ తన్ను తా దెలసిన ముక్తిగలుగును.

శ్రుతి॥ ద్రష్టదర్శనదృశ్యానాం విరామోయత్రభావవేత్ దృష్టిస్తత్రైవ కర్తవ్యా నాసాగ్రావలోకనం॥ ఇత్యాది శ్రుతులు ఇట్లు ద్రష్ట దర్శ దృశ్యములు అనగ చూచువాడు చూపు చూడబడునది యను మూడును విశ్రాంతిని పొందు స్థలము అనగ లయమగు తావుననే మనస్సు నిల్పవలెను. కాని భ్రూమధ్యమందు నిలుపకూడదు. అభ్యాసులకు భ్రూమధ్యమందే నిలుపునది గ్రమక్రమముగ నిలకడ చిక్కినతరువాత నియమస్థలము వదలి బ్రహ్మమందైక్యమగును. లీనమగును. కాబట్టి మనోలయం ఏక్షణమందు ఏకాలమందు లయమగునో ఆకాలమందే జీవన్ముక్తి కలుగును. చిత్తవిశ్రాంతి గలవాడు వృత్తరక్షణములోనే గురూచనను గ్రహించును. గురుదీక్షాత్రియ కాలంబుననే సద్యోముక్తి నొందును. అట్టివానికి చిత్తవిశ్రాంతి గలవాడు అతిసూక్ష్మముగా గ్రహించి విదేహముక్తి నొందును. శ్లోకం॥ గురుగీతలు॥ గురుసన్నిధిసాలోక్యం

సామీప్యం హస్తమస్తకం దీక్షామాత్రేణ సారూప్యం సాయుజ్యం సమరసైక్య తాం॥ యెట్లన గురువుచెంతకు బోవుటనె సాలోక్య మనియు హస్తమస్తక సం యోగమె సామీప్యమనియు త్రివిధదీక్షలు తెలిపినంతనే సారూప్యమనియు సమరసైక్యము గలిగియుండుటె సాయుజ్యమనియు నది ఐక్యమనియు పెద్ద ల చెప్పుదురు.

శ్లోకం॥ నీతిశాస్త్రం॥ జన్మదుఃఖం, జరాదుఃఖం, జాయాదుఃఖం, పునః పునః సంసారసాగరందుఃఖం, తస్మాత్ జాగ్రత జాగ్రతః॥ పుట్టుకయును ముది మియును భార్యయును దుఃఖములకు కారణములని గుర్తెరిగి నిత్యానిత్యవస్తు వివేకముకలిగి సంసారసాగరమును దాటుటకు మార్గమును పెద్దలవలన దెలిసి కొనజాలక కపటసన్యాసులు తనభార్యలను వదలి పరదారపరధనములను గ్రహింపగోరి తనలోని కపటమును దెలియనీయక తిరుగుచుండగ వారిని జూచి నిరాశకులుగదా యని పూజించుచుదురు. గురివిందగింజ దానిముక్కు నందు నలుపుగలిగి యుండురీతిని కపటసన్యాసులు వెలుపలికి యోగ్యులవలె నే కనబడుదురు. సహజామనస్క రాజయోగులును బ్రహ్మనిష్ఠాగరిష్ఠులును నగు పెద్దలు దొరకుటకు దుర్లభము. అట్టిపెద్దలు లభించినను శిష్యునియొక్క యనేక జన్మములయందు చేసిన పాపమువలన కపటసన్యాసులుగానే గనబడు దురు. అనేక జన్మార్జితపుణ్యమువలననే నిజమైన పెద్దలని తెలియగలరు. కోతి కి కొబ్బరికాయదొరికినను మధురమును గ్రహించలేదు. షండుండు రంభ సరస నుండినను రతిక్రీడసుఖమును దెలసికొనజాలడు. ఆవు చంటికి పిఱుగులు కప్పి యుండి రక్తమును పీల్చును గాని క్షీరమునుత్రాగి మధురమును గ్రహించ లేవు. అట్లె పెద్దలసాన్నిధ్యము దుండినను శిష్యుడు పాపకూపారమున బడి యుండుటవలన వ్యక్తి గలుగదు. కావున కపటసన్యాసులు గురువులు సంసా రమునందుయుండు యుపద్రములకు నోర్వలేకుండుటచేత సన్యసించును గావు న యిట్టి కపటసన్యాసివేషములు వేసి—భజగోవిందశ్లోకం॥ జటులోముండి లుం చితకేశః కాషాయాంబర బహుకృతవేషః వుదరనిమిత్తోబహుకృతవేషః భజ గోవిందం మూఢమతే॥ యనునట్లు వుదరనిమిత్తమై కన్యబహులక యనేక వేషము లువేసి తలలు బోడులైతే తలపులు బోడులా యన గావున ముక్తిని బొంద నేరరు. క్షీణె పుణ్యే మర్త్యలోకే విశంతి॥ యను న్యాయముచొప్పున భూలోక మునకు వచ్చి స్వప్రయత్నమువలన మోక్షాపేక్షగలవాడు ఆజన్మమందు

గాని మరియొక్క జన్మమందుగాని మోక్షము జేగువ జేరునంతకు నట్లు గావున ఈనరజన్మమునందు ధీనిధియైన మేధావి బ్రహ్మవేత్త యీజన్మమునందే విదేహకైవల్యమోక్షసామ్రాజ్యము నొందగలడు. కావున అట్టివారు మనోలయము, స్వరూపలయము, అరూపలయము, మూడువిధములు అనగ మనస్సు మారుతము దృక్కులు మూడున్ను లయమునొందినవారే జీవన్ముక్తులు. వీరు దగ్ధపటలన్యాయముగ స్వరూపలయము నొంది అరూపలయము నొంది మనోలయమునొంది వారు యెవరనగ స్వరూపలయము మనోలయము నొందినవారు జీవన్ముక్తులు అరూపలయము నొందినవారు విదేహముక్తులు మనోలయము నొందినవారు చిత్తవిశ్రాంతిగలవారు. కావున వీరలే ఆగామి సంచిత ప్రారబ్ధనాశనములు గలవారు వీరలే శ్రుతి॥ అగ్నిదగ్ధం యథాబీజం దగ్ధస్యదహనంనాస్తి పక్వస్యపచనంయథా జ్ఞానాగ్ని దగ్ధదేహస్యనచ శ్రాద్ధం నచక్రియః' అగ్నిచేత తగలబడిన బీజమెన్నటికి మొక్కమొలవదు. తగలబడినవస్తువ తిరిగి తగలబడునా, వుడికిఅన్నము తిరిగి పచనమగునా? ఆలాగుననే జ్ఞానాగ్నిచేత తగలబడిన దగ్ధశరీరం లింగదేహం తిరిగి జన్మమునకు రాదు. కాబట్టి నిర్గుణోపాసనచేయు మహాత్ములు వీరాసనమునందుండి చేతులు తొడల మీద నుంచుకొని నేత్రంబులు మూసుకొని అహం. బ్రహ్మాస్మి॥ యను న్యాయముచొప్పున పరబ్రహ్మస్వరూపమే తానని నిర్వికల్పనిష్ఠగలిగియుండి స్థూల సూక్ష్మకారణశరీరములు తాను గాననియు పంచప్రాణములు వుపవాయువులు తాను గాననియు పదునాలు గింద్రియములు తానుగానని నేతి నేతీతి నేతీతి శేషితం పూర్ణముచ్యతే॥ యని యిత్యాదిశ్రుతులు చెప్పుచున్నవి. కావున సర్వేంద్రియములు తానుగానని సర్వేంద్రియములకు తాను సాక్షియై తాను సాక్షిత్వమును వృత్తియె గనుక పరబ్రహ్మరూపమే తాననియు సర్వదా బ్రహ్మనిష్ఠయందే యుండుట యిట్లు నిర్గుణోపాసనజేయుచున్న ఆత్మజ్యోతి దర్శన మిచ్చును. సత్యజ్ఞానానంద నిత్యనిర్మలాఖండ స్వరూపమగు పరబ్రహ్మమే తా ననెడి నిశ్చయము స్వానుభవేద్యమగుదాక సర్వకాల సర్వావస్థలయందు ప్రారబ్ధనాశనపర్యంతము దేహావ్యవసాన పర్యంతము నిర్వికల్ప బ్రహ్మనిష్ఠగలిగియుండుటె నిర్గుణోపాసన గావున తాను విలక్షణుడ ననెడు వృత్తియున్న లేక తానే పరబ్రహ్మస్వరూపమై తాను తానై యుండుట ననుభవమువలననే తెలసికొనవలెను. కావున శ్రుతి॥ యతోవాచో నివర్తంతె అప్రా

ష్యమనసాసహ॥ మనస్సుతోగూడ పరబ్రహ్మముసందే మనస్సును మగ్నము చేసియుంచుట మనస్సు పరబ్రహ్మమును జూడనేరదుగాని పరబ్రహ్మముం దైక్యమగును అనగ పరబ్రహ్మమే తానగును. సర్వకాలసర్వావస్థలయందును సత్యమై నిర్మలమై శ్రేష్ఠమై సచ్చిదానందస్వరూపమగునదియును పెద్దలచేత తెలియదగినదియు అవాఙ్మనసగోచరంబునగు పరబ్రహ్మము తెలియునో నట్టి ప్రదేశమే పుపదేశము ఏకాంతస్థలము నని చెప్పుదు గావున ప్రపంచవ్యవహారమందువలె గాలనియమములు లేక యఖండముగా బ్రకాశించు పరబ్రహ్మమే కాలమందు లేకపోలేదు. కావున పరబ్రహ్మస్వరూపము తానై యుండుట పస్వీకారములులేని పరబ్రహ్మమును అపరోక్షజ్ఞానదృష్టిచేత జూచి దానియం దైక్యమైనతోడనే తాను తానై యుండును. సముద్రమునందు సమస్తనదులు మురుగుకాల్వలు మొదలుగున వన్నియు గలసి యభేదముగ నున్నట్లు బ్రహ్మానందమనే సముద్రమునందు నింద్రియములు వాని విషయములు షడ్వర్గములు మొదలుగాగలవన్నియు జేరి వానిరూపములం బాసి పరబ్రహ్మముం దైక్యమగుచున్నవి. అప్పుడు స్థూలసూక్ష్మకారణ మహాకారణములనెడి శరీరభేదములు లేక రూపనామక్రియారహితమైన పరబ్రహ్మము అంతట నిండియుండును. కావున నాకు గోచరించినంతవరకు వ్రాసితిని. బుద్ధిమంతులగువారు మీదుమిక్కిలిగా నూహింపవచ్చును.

యజ్ఞవరాహగీత॥ ఇదం సర్వందేహాదియథా అనృతం జాయతే తథాహి॥ శుద్ధాద్వైతం పరాత్పరం బ్రహ్మ సంవేత్తి భాష్య॥ చెప్పుచున్నది. భావార్థః॥ ఇదం- ఈ, సర్వం- సమస్తమైన, దేహాది- దేహము మొదలైన, సమస్తపదార్థసముదాయమును, యథా- యెప్పుడు, అనృతం- అబద్ధమని, జాయతే- తెలుసుకొనుచున్నారో, తథా- అప్పుడు, హి-అందువలనను, శుద్ధాద్వైతం-పరిశుద్ధమైనదియు, అద్వితీయుంబును పరాత్పరం మిక్కిలి పుత్కృష్టమైన, బ్రహ్మ- బ్రహ్మస్వరూపమును, సంవేత్తి- చక్కగ నెరుగబడును, నెరుగతగినదియు, ఈదేహము మొదలగు సమస్తములైనపదార్థములంతయు నబద్ధమని యెవ్వడెరుగుచున్నాడో అతడు పరిశుద్ధుండును, పరాత్పరుండైన బ్రహ్మస్వరూపమును- జక్కగ నెరుంగుచున్నాడు- ఈసమస్తమైన ప్రపంచాకారము ఆకారములేని పరబ్రహ్మముగా నెరుగుము. ఈప్రపంచమంతయు నాకృతిగలిగియుండక ఆకారములేని పరమాత్మయనుటచే జగము మాయాకల్పితము. శృతి॥

అనాత్మదృష్టే రవివేకనిద్రా అహంమమ స్వప్నగతింగతోహం। అనునట్లు అనాత్మదృష్టిచేత జూడబడిన తోచబడిన స్వప్నముతోచినట్లుగ యీ స్వప్న ప్రపంచము కానంబడు. ఆకారముతోడం గూడిన పదార్థములు యెల్లయు యనిత్యము. నిరాకారుడైన ఆత్మారామపరబ్రహ్మము ఒక్కటియే యనిత్యము. సమస్తప్రపంచము వికారములేని పరమాత్మగా తెలిసికొనుము అనగా ప్రపంచమునందలి వికారములన్నియు పరిశుభ్రమైన దేహము గల పరమాత్మగా ఆత్మారామపరబ్రహ్మముగ అంతరాత్మగ నెరుగుము. అనగ, చరాచరప్రపంచము యీవస్తు మలినరూపములుగానున్నవి. కాని మలినము లేక శరీరముకలుగదు గావున, యిచ్ఛామాత్రప్రభుసృష్టిః అవ్యక్తః బ్రహ్మణోరవ్యక్తః॥ గావున శరీరములు అనిత్యము అశరీరం. శరీరము లేనిపరమాత్మ నిత్యము సమస్తప్రపంచము పరమాత్మస్వరూపమైయున్నది. కేవలము ఆత్మారామబ్రహ్మము నిత్యముగళ ప్రజ్ఞస్వరూపంబైన పరమాత్మ యని యెరుగవలయునని అష్టదశపురాణములు శ్రుతి స్మృత్యుపనిషత్సారములు ఘోషించుచున్నవని బల్కెను.

సమాప్తము.



# శ్రీ మహాఋషి నిఘంటివిత్ర యోగశాస్త్రము.



## పంచముఖయోగము.



భృంగిమహాఋషి వీరసేనమహారాజునకు పంచముఖయోగము బోధించుట
సద్యోజాతమనగ :—

| | | |
|---|---|---|
| 1. సద్యోజాతముఖం | — | రక్తవర్ణమైన పృథివిహంశ జ్ఞానశక్తి |
| 2. వామదేవముఖం | — | శ్వేతవర్ణమైన అపహంశ ఇచ్ఛాశక్తి |
| 3. అఘోరముఖం | — | కృష్ణవర్ణమైన తేజోహంశ క్రియాశక్తి |
| 4. తత్పురుషముఖం | — | నీలవర్ణమైన వాయువహంశ ఆదిశక్తి |
| 5. ఈశాన్యముఖం | — | సునీలవర్ణమైన ఆకాశహంశ పరాశక్తి |

ఈపంచముఖములున్ను మహాశక్తియొక్క - హంశములు. ఈపంచముఖములు పంచశక్తులకు ముఖములు జ్ఞానశక్తి ఇచ్ఛాశక్తి. ఆదిశక్తి పరాశక్తి అపరాశక్తి పంచశక్తి పతేనిత్యం మహాపాతక నాశనం యీపంచశక్తులు పరబ్రహ్మ స్వరూపమైన విరాట్టుస్వరూపమునందు రక్త శ్వేత కృష్ణ నీలసునీలములతో గూడిన పంచభూతములతో గూడి ఆవరణవిక్షేప శక్తియైన- జ్యోతిర్మయాకారంబైన- మహాశక్తి త్రిగుణాత్మికమైన మూల ప్రకృతి- యీమూలజ్ఞప్తి కళామాత్రశరీరంబనే అనాదిమూలప్రకృతి- మూలాభావం ఇదంజ్ఞాతుంనశరీరం॥ బనె. మాయాశబలితబ్రహ్మం- ఆవరణ విక్షేపశక్తియై-యనేకరూపనామాదికప్రపంచంబైన పరమాత్మయందు శృతి॥ రజ్జుర్ సర్పభ్రాంతివత్ తత్సర్వంజగత్॥ త్రాటియందు-సర్పము ఆరోపణవలె- పరబ్రహ్మమైన తనయందు ఆరోపింపబడినది- అట్టిమూలజ్ఞప్తి కళామాత్ర శరీరమనే ప్రజ్ఞానం సనాతనమై అనాదియై ఆదిమధ్యాంతములులేనిదై ఆది మధ్యాంతములుగలదై మూలాభావమై పరబ్రహ్మ సన్నిధాన బలమున అధో రేతోస్కలుడైన పంచవింశతి 25 దోవాడైన సునీలమైన హంసయనే మన స్సనేబిందువనేక కళ-జీవకళాస్వరూపమై శృతి॥ ఇచ్ఛామాత్ర ప్రభుస్సృష్టిః॥

అనునార్యోక్తివలన- గుణసామ్యావస్థతోఁగూడి- అవరణవిక్షేపశక్తి యనే
వృక్షముసర్వేంద్రియసమన్వితమైన దేహమనే- వేదవృక్షం- వటావృక్షం-
అనగ, అశ్వత్థమనేవృక్షం- నారాయణవృక్షం- అనగ, శ్రీమన్నారాయణు
డైన పరమాత్మయొక్క- హంశమైన తదాకారమైన వృక్షం- వేదః- అనగ
తెలివి ప్రజ్ఞానస్వరూపం- బ్రహ్మకళ జీవజ్యోతి- కళామాత్రం-శరీరంబైన
అశ్వద్ధనారాయణవృక్షం- శృతి॥ బిందుబీజం తథావృక్షం శాఖాపల్లవ వ్య
వస్థితం పుష్పంఅస్థి ఫలం అస్థి-సంపూర్ణం వృక్ష రుచ్యతే॥ అని జీవబిం
దుకళాస్వరూపం- తథా ఆప్రకారమె ఆబిజమందు యున్నశక్తి- వృక్షమయ్యె
శక్తి అనగా- శరీరమైయ్యెశక్తియే ఆదిశక్తి- ఆవరణవిక్షేపశక్తిమై- కొమ్మలు
ఆకులు పుష్పములు ఫలములు మొదలైనవన్నింటితో- సంపూర్ణముగా
యీశరీరమనే వేదవృక్షం- సర్వేంద్రియ సమన్వితమై- సంపూర్ణముగా ఈ
అశ్వద్ధము- ఆవరణవిక్షేపరూపమై పరిశుద్ధమైన- ఆత్మస్వరూపమై- జీవాత్మ
స్వరూపమై- యెరుకయనే జ్ఞానస్వరూపమై- స్థూల సూక్ష్మ కారణదేహ
ములు అవస్థాత్రయమునందు కాలచక్రం శృష్టిస్థితిలయకారణంబై- ఆహార
నిద్రభయమైథునములకులోనై-దారేషణ ధనేషణ పుత్రేషణములయందు కామ
క్రోధలోభ మోహమదమాత్సర్యములతోఁగూడి- వ్యవహారికకించిజ్ఞుండైన కా
ర్యోపాధిమైన వ్యవహారకజీవుడైయున్న యీవృక్ష మునకుమూలం- అభావం
తనకుతానెమూలం తనకుమూలం పరబ్రహ్మమె గావున, యీవృక్షం భగ
వద్గీత ఊర్ధ్వమూల మధఃశాఖః మశ్వర్థం ప్రాహురవ్యయం- ఛందాంసియ
శ్యపర్ణాని- యస్థంవేద, సవేదవిత్॥ ఇత్యాదిగీతాశాస్త్రము చెప్పుచున్నవి-
భావార్థంమొదలు మీదుగను- కొనలుక్రిందుగను- మొలచియున్నది- అశ్వ
ర్థమనే, నారాయణవృక్షః చతుర్వేదములు శాఖలుగాను- ఆచతుర్వేద
ములయందు పుష్పములు- ఆకులు- పిందెలు- కాయలు- మొదలైనవియు
విగములు- యీవేదవృక్షం- 25 దుతత్వములు పంచభూతములు 5 జ్ఞానేం
ద్రియములు 5 పంచప్రాణములు 5 పంచకోశములు 5 అంతఃకరచతుష్టయం
4 యియిరవైనాలుగు తత్వములచేతను- శాఖయనె పుని కూడాకలుసుకొని
వేదవృక్షమైనది. ఇదే- క్షేత్రక్షేత్రజ్ఞద్వయం అధశ్చమూలం- అధోముఖమే
మూలం- శృతి॥ పద్మకోశః ప్రతీకాశం- హృదయం చాప్యధోముఖం- గీతా
భాష్యః నాభికమల మధ్యేజ్యోతిరానందరూపః॥ అధశ్చ- అధోముఖముగ-

మూలం వృక్షమూలం పద్మకోశం- నాభికమల మధ్యమందు తామర మొగ్గ వలె నాభికమలం అధోముఖమంగనున్నది. ఆనాభికమలం చివళ్లు దిగువు గాను- మొదలు పైగానున్నది. వూర్ధ్వమూల అధఃశ్శాః- అశ్వర్థం- ప్రాహు అవ్యయం- ఛందాంశి యస్య- పర్నాని యస్తాం వేదసవేదవిత్- మొదలు మీదుగ- తలలుక్రిందుగ మొలచియున్నది. వృక్షముమోదయులో- హృద యాకాశమధ్యమందు- మింటిమీదను ఆకాశం అనగ- శిరస్సుయందున అనగ- హృదయాకాశమధ్యమందు- శ్రుతి॥ హృదయకమల మధ్యే సూర్యా బింబాసరూపం భృగియవిదళమధ్యే హంసమార్గానరూపం సకలమిదమ యం స్థూలసూక్ష్మాదిరూపం సహతరపరం బ్రహ్మ మార్గాన రూపం భా వార్థం॥ హృదయకమధ్యమందు వూర్ధకుండలీమార్గం అనగ - వూర్ధ్వభాగ మందు యీవృక్షమునందు - తన్మధ్యేజ్యోతిరానందరూపం- భ్రూమధ్యస్తా నమందు జ్యోతిర్మయాకారంగా - స్వయంప్రకాశమానంబై- తానుతానై నవేదపరమపురుషుడు అనగ - పరమాత్మ ప్రకాశించుచున్నాడు. ఆహృద యాకాశమధ్యమందు కోటిసూర్యప్రకాశమానంబై - కోటిచంద్రతేజోతు యాకారమై- తనమనస్సు ఏకముఖముజేసి త్రికూటమందు అంతరదృష్టి నిలచి- అక్కడ ఆత్మ స్వప్రకాశుడై యున్నాడు. ఆపరబ్రహ్మ కళాస్వరూపు డైన పరమాత్మ అధోముఖవ్యాప్తియై జఠరగర్భమందు జీవబిందుకళాస్వ రూపుడై- యీ అశ్వర్థమనె ఆవరణ విక్షేపరూపమనే నారాయవృక్షం బనే యీశరీరమందు భృగియ విదళమధ్యే హంసమార్గానరూపం యిడ పింగళానాడులయందు- హంస- సోహం- హంసోహంబని వుచ్ఛ్వాసనిశ్వాస రూపమై- భ్రూమధ్యస్థానమునందు మొదలై మూలాధారంవరకు అధోముఖ మై- మూలాధారం మొదలు- భ్రూమధ్యస్థానంవరకు వూర్ధ్వభాగమై- మొద లై ఉన్నది. యీవేదవృక్షం- గుణసామ్యావస్థచేతనున్ను అంతఃకరణవృత్తు లచేతనున్ను- యీగుణత్రయములచేతను- అరిషడ్వర్గములచేతనున్ను - సర్వ విషయములయందు- సర్వకార్యకారణములయందు- కర్మజన్మముకు కారణ మై- మానుష్యజన్మమనే శరీరమనే వేదవృక్షమె విశ్వరూపమైనది. పిండో త్పత్తికి కారణంబైనది- మొదలు మీదుగను పురుషునియొక్క- వూర్ధ్వరేత స్సు రేతోస్ఖలనాదులచేతను జఠరగర్భమందు అధోముఖమై స్త్రీలజఠ మందు బిందురూపముగ ప్రవేశించి వేదవృక్షమనే శరీరమైనది. ఇది యో

నికూటముద్వారా మొదలుమీదుగ తలముందు కాళ్లు వెనుకకు నాభ్రికార ముగ సృష్టియయ్యెను. ఆత్మనివాసస్థానం శృతి॥ సర్వేంద్రియాణాం నైనం ప్రధానం సర్వస్యగాత్రస్య శిరః ప్రధానం॥ అని యిత్యాదిశృత్యర్థతః॥ శిరస్సు సహస్రారం ఆమధ్య త్రినేత్రం ఆమధ్య పరమాత్మప్రకాశించుచున్నాడు గావున- శృతి॥ తస్యాశిఖాయామధ్యే- పరమాత్మావ్యవస్థితం॥ ఇత్యాది శృత్యర్థతః॥ ఆమేరుశిఖరాగ్రమందు పరమాత్మ నివాసంగాయున్నాడు గావున- వూర్ధ్వమూలం అధఃశాఖః॥ అశ్వత్థం ప్రాహురవ్యయం॥ పరమాత్మ- మేరు శిఖరాగ్రమధ్యహృదయాకాశమందు వుండునని వేద వేదాంత సూత్రభాష్య ములు చెప్పుచున్నవి. కావున యీవృక్షం తలక్రిందుగను కాళ్ళు పైకిన్ని మొలచియున్నది. ఈ వేదవృక్షము విశ్వరూపమైన జీవస్వరూపము జగద్రూపం తత్సోద్వయం బైన జీవాత్మ సూత్రభాష్యః॥ త్వం ఏకః సకలః భవతి ప్రత్యక్షంవా పరోక్షంవా ఆత్మానం వ్యాప్యవ్యాపకవినిర్ముక్తః కథం భవతి॥ ఇతి సూత్రభాష్యః॥ భావార్థః॥ వ్యాప్యవ్యాపకవినిర్ముక్తం- వ్యాపించెడుదిన్ని వ్యాపింపదగినదిన్ని వ్యాపించునదియైనది, త్వం- నీవు, ఏకః- ఒక్కడవును, సకలః- సమస్తస్వరూపుడును, భవతి- అది అగుదువేని, ప్రత్యక్షంవా- నాప్రాతిబాధ ప్రత్యక్షమైన, పరోక్షంవా- పరోక్షుడనిగాని, ఆత్మానం- పరమాత్మను, కథం- యెట్లు, గీతాభాష్యః॥ అద్వైతం కేచదిచ్ఛంతి ద్వైతమిచ్ఛంతిచాపరే సమతత్వం నవిందంతి ద్వైతాద్వైతవివర్జితః ఇత్యాది సూత్రభాష్యః॥ ఉచ్యతే- చెప్పబడుచున్నది.

భావార్థః॥ కేచిత్-కొందరు, అద్వైతం-అద్వైతమతమును, ఇచ్ఛంతి కోరుచున్నారు, అపరే-ఇతరులు అనగ మరికొందరు, ద్వైతం-ద్వైతమతమును, ఇచ్ఛతిచ-కోరుచున్నారు, ద్వైతాద్వైతవివర్జితః-ద్వైతాద్వైతములచేత విడువ బడిన, సమం-భేదములేనిదై, తత్వం-పరమాత్మను, వదంతి-యెరుంగుము అనగ నిచ్చట రామానుజాచార్యాది- ప్రభువులచేత నేర్పరుపబడిన విశిష్టాద్వైతమ తము- అనగ జీవాత్మకును పరమాత్మకును భేదముగలదనియు జీవాత్మ జప పూజాధ్యాన కీర్తనాదులచేత భక్తిమార్గము నవలంబించి పరమాత్మను సాక్షిగావించిన- ఆపరమాత్మ కరుణాసముద్రుడుగావున జీవాత్మను తనయందే లీనం బుజేసికొనును. ఇది విశిష్టాద్వైతమతాభిప్రాయము. అప్పుడు జీవాత్మ పరమాత్మ యందే కలిసిపోవును. ఇందునుబట్టి ప్రపంచముగూడ- సత్యముగానే గనబ

దును. ఇంకయు ననేకములైన భేదములు యీమతమునందుండును నవియెల్లను యిచ్చట నావశ్యకముగాదు గావున నవియెల్ల వ్రాయుటకు గ్రంథబాహుళ్యమునకు క్లుప్తపరచనైనది.

గద్య.

ఇది శ్రీభీమసరంజన నిగమాగోచర గురువర కరుణాకటాక్ష వీక్షణాయత్త
చిత్త చైతన్య జగజ్జేగీయమానప్రకర్షితాత్మీతనై సచ్చిదానంద గుణ
గణాతీత వేదవేదాంగ మంత్రతంత్రార్థ శ్రీసద్గురు పాదుకా పూ
ర్ణదీక్ష పక్షదక్షత్వ శుద్ధనిర్గుణ నిజబోధపరాయణా పారీణ పా
రాయణాధురీణ అజ్జరపు సూర్యనారాయణాఖ్య విరాజ
మానప్రభాసిత ప్రజ్ఞాప్రకర్షిత ప్రబోధితనై వేమూరి
వంశపయః పారావార సుధాకరస్య కౌండిన్యస
గోత్ర వీరయ భాగమాంబా గర్భశుక్తి జనిత
హరితసగోత్ర సౌభాగ్యవతీ సామ్రాజ్య
భోజ్యవిద్యాపాసనావరప్రసాదకవనా
కవిత కాట్రావులపల్లి సూర్యనారా
యణ యోగినీప్రణీతంబగు శ్రీ
మహాఋషినిఘంటితయో
గశాస్త్ర బ్రహ్మవిద్యా
యాం తత్త్వోపదేశం
బునకు ముఖ్యకా
రణం పంచముఖ
యోగము
నవమప్రకరణము
సమాప్తము.



# శ్రీ మహా ఋషి నిఘంటి తె
# రొహాగ శాస్త్రము.

## దశమప్రకరణము.

## లక్షణత్రియయోగము.

— ౹ దూర్వాసమహాఋషి కళావతికి లక్షణత్రయయోగము బోధించుట. ౹ —

లక్షణత్రియమనగా జహార్లక్షణ అజహార్లక్షణ జహాదహార్లక్షణ మని మూడువిధములు. జహార్లక్షణమనగ పుట్టినలక్షణము జీవునిలక్షణము అవిద్య లక్షణం యిందుకు దృష్టాంతః—గంగాయారుమః ప్రతివసతి॥ అనగా గంగయందు గ్రామంలోవున్న ధ్వని యక్కడనుంచి యిందున దోచుచున్నది. ఈగంగకు వద్దున నొకగ్రామముగలదు. దానిధ్వని యిందున గలిగియున్నట్టువలె ఆ విమర్శబుద్ధి కలవడములో కూర్చున్నవానికి తోచుచున్నది. ఇది దృష్టాంతంవాచ్యార్థం. ఇక ననుభవార్థం గంగయనగా సాక్షిస్వరూపమై సచ్చిదానందరూపమై అతీతమై ప్రత్యగాత్మనే చైతన్యమనుట, గ్రామమనగా, ఉపాధిత్రియమనగా చతుర్ వింశతికమైన పంచకోశమై అనృతజడదుఃఖాత్మకమైనది. పడవ అనగా లింగదేహమై అవిద్యమైన అజ్ఞానమిది. పడవలోవాడు ప్రతిబింబచైతన్యరూపులైన గుణత్రియ అహంకారరూపుడై కించజ్ఞత్వ గుణవిశిష్ఠుడైనవాడు యీనాలుగింటిని గురుమూలముగాదెలిసి యిదులో అహంకారుడు పడవను పోగొట్టుకొని గ్రామమునువిడిచి జ్ఞానమనే నేత్రముగలిగిన నేను అనేదాన్ని శూన్యముచేసుకొని మనోబ్రహ్మేతి అని గంగయనేసాక్షియైన ప్రత్యగాత్మగా వుండుటః జహార్లక్షణ మనుభావార్థం ఆజహార్లక్షణమనగా పుట్టనిలక్షణం। ఈశ్వరలక్షణం మాయాలక్షణం యిందుకు దృష్టాంత శోశాంధువతి అనగ నడవనిది. మహాత్వరగానడుస్తూవున్నదనే ప్రతీతికలదు అసివారించితె వాయు వేగమున, నిమ్నోన్నతభావమున వుదకమే నడచెను గాని ఎడిచిననడవ లేదు. నడవనిదినడిచెనని యెట్లాతోచెనంటె తోవతప్పి చిక్కుపడియున్న ఆవిమర్శ తెలివిగలవానికి తోచుచున్నది. ఇది దృష్టాంతవాచ్యార్థం॥

ఇకననుభవార్థం అనగా పూర్ణమై సచ్చిదానందమై వేదాతీతమై భూతలక్షణమై పరమాత్మయైన తానే చైతన్యమనుట వుదకమనగా సమిష్టి శరీరత్రియమైన చతుర్వింశత్యధిదేవతాత్మకమై జ్ఞానశక్తి నడిచెతోవలోవారు అనగా, ప్రతిబింబచైతన్య స్వరూపుడైన గుణత్రియ మహదహంకారుడై సర్వజ్ఞతగుణవిశిష్టుడైనవాడు యీనలుగురిమూలముగ దెలిశి యిందు వ్యష్టియందు ప్రత్యగాత్మయైన యిందులో వ్యష్టియైన ప్రత్యగాత్మయై వున్న సాక్షిచైతన్యానకు ఆధారమైన బింబచైతన్య మనతగిన మహదహంకారుడు తోవను తెలసి తొలగించుకొని వుదకగమనమును లేకచేసుకొని విజ్ఞానమనే అతీతదృక్కు గలిగి నేను నేననే మహామాయను సర్వసూన్యము చేసుకుని సత్యజ్ఞానమనంతర బ్రహ్మేతి అనిపూర్ణమైన పరమాత్మగావుంటుట అజహార్లక్షణం అనుభవార్థం జహదహార్లక్షణమనగ పుట్టిపుట్టని లక్షణం గురులక్షణం పరమాత్మలక్షణం అనగ యిందుకు దృష్టాంతం తేజోబిందూపనిషత్॥ ఛత్రిసంయుక్తజనసమచూస్మృతి॥ అనగ జనముగొడుగు లేక నడుస్తూవున్నప్పటికిన్ని ఒకడు ధరించినందున సర్వము ధరించినది అనివిచారించితే గొడుగధరించినవానియందె గొడుగున్నదనె దానివల్ల రాబడె ఆనందముఉన్నది. తద్యరిక్తజనమందు ఆరెండున్ను లేనట్టు తోచుచున్నది. ఈరీతివుండగా జనము ఛత్రము జనసంయుక్తమని యెట్లుతోచెనంటె దూరదేశమందు వెనుకబడినట్టి యిప్పుడు ఛత్రిధారణచాయనట్టి అవిమర్శాబుద్ధి కలిగినవాడికి తోచుచున్నది. ఇదిదృష్టాంతవాచ్యార్థం యిక అనుభవార్థం ఛత్రిమనగ పూర్ణ రహితమైన సర్వసూన్యమై లక్షణలక్ష్యరహితమై అద్వైతమైన కేవలాత్మ ధరించినవాడు అనగా ప్రకృతిద్వయదోషరహితుడై అహంకారరహితుడై భ్రాంతిరహితుడైన గురువుఅనుట దూరదేశమనగా మూలమాయయైన సర్వకార్యకారణరూపియైన ముక్తరూపిణియైన జీవేశ్వరాది చైతన్యులకు ఆధారరూపిణి అను వెనుకబడియున్నవాడు అనగ సప్తావరణబద్ధుడై అజ్ఞానమాత్రుండై అహంకారకుడై మోక్షశ్చగలశిష్యుడు యీనలుగురుని గురుమూలముగా తెలిసి ఇందులో పూర్ణమైన బింబమైన చైతన్యమునే నిరహంకారుడు దూరదేశమునువిడచి మహదహంకారమును పోగొట్టుకొని గొడుగువేసుకొనిన దానిని గలుసుకొని శిష్యులనే వాదులమై దృక్కులకు దృక్కుయైన దృక్కుకాని దృక్కుకలిగిన యేవైమానసభూతె అనుశ్రుతి॥ అనిగొడుగు ధరించితే ధరించని జనమున్ను వ్యతిరిక్తముగాలేదు. అప్పు

డంతా తనవలెనే ఏకవిధమున శాంతమైన నిర్వాసనమానమై తానుపోయిన తానే మహాశ్చర్యముచున్నది. ఈలక్షణం గురుస్వానుభవంబునదెలిసి నిశ్చయారూఢుడై తన్ను తానుండ చూచుకునేది ఇదిలక్షణత్రియవిమర్శ॥ మాయఅనగా అవిద్యామాయ. ఇవి ఏకవిధమూ రెండువిధములా రెండు విధములు. అనగా అవిద్యలో అవిద్య. అవిద్యలో విద్య ఇతను యీపురుషుడు రెండుమాయలకు ఏమి అయివున్నాడు. ఆధారుడైయున్నాడు. యీరెంటికిఅలను ఏమి అయివున్నాడు సాక్షి అయివున్నాడు. ఈరెంటిచేతను అతనికి ఏమివచ్చినది. జీవుడనే నామము ఒకటినుంచి మూడునామములు. ఏరీతున వచ్చినవి. సూక్ష్మకారణ మహాకారణములు ఒకటిలో నొకటి అంతర్భూతమై యున్నందున యీప్రత్యగాత్మ యెక్కడయున్నది. ఇతనికి మూలమేమి సమిష్టిలో ప్రతిబింబము ఆబింబము ఏమియైయున్నది. వ్యష్టిమహాకారణదేహమున ప్రతిఫలించిన ప్రతిబింబచైతన్యములున్నవి. వ్యష్టిమహాకారణదేహ మహాజ్యోతిర్మయాకారమైన ఆకాశమందు ప్రణవస్వరూపముగ నున్నది. ఇది జడమూ అజడమూ జడము. ఇది స్వజాతా విజాతియూ విజాతియందు సవిజాతి సమిష్టియైన ఈశ్వరదేహమందున వ్యష్టిమహాకారణదేహమందున ప్రతిఫలించిన ప్రతిబింబచైతన్యమునుంచి కలిగిన సత్తాయైన శుద్ధసత్వగుణమైన పరిశుద్ధాత్మ చైతన్యమును కప్పుకొనియుండడము ఆతదాత్మయనుట కార్యకారణములనే ద్వయముగలదు. కారణమనగ వ్యష్టిమహాకారణదేహమందు ప్రతిబింబించిన ప్రత్యగాత్మనే చైతన్యమనుట కార్యమనగా హిరణ్మయకోశస్వరూపమైన వ్యష్టిమహాకారణమనుట క్రియఅనగా వ్యష్టిమహాకారణదేహమందు ప్రతిఫలించినప్రతిబింబచైతన్యమునుంచికలిగినసత్తాయైన తెలివియనుటఆప్రత్యగాత్మయనేచైతన్యముఏమిఅయివున్నది. వ్యష్టికారణదేహమందుప్రతిబింబించినప్రతిబింబచైతన్యమైయున్నది. వ్యష్టికారణదేహమనగా అవిద్యతోగూడిన ఆకాశస్వరూపమైయున్నది. ఇది జడమూ అజడమూ జడము. ఇది స్వజాతా విజాతవిజాతియైనందున విజాతివ్యష్టి మహాకారణదేహమందు ప్రతిఫలించిన ప్రతిబింబచైతన్యము ఆదేహమునకు ఏమివచ్చినది సత్తావచ్చినది. ఈదేహమునుంచి ఆచైతన్యమునకు యేమివచ్చినది. కర్మజన్మతాదాత్మయమున్ను ప్రాజ్ఞుడనేనామమున్ను తదాత్మయమనగా, వ్యష్టికారణదేహమందున ప్రతిఫలించిన ప్రతిబింబచైతన్యానుంచి కలిగిన సత్తాఅయిన తమోగుణమైన తెలివి ఆచైత

న్యమును కప్పుకొనియుండుట అనుట కార్యకారణములనే ద్వయంకలదు. కారణమనగా వ్యష్టికారణదేహమందు ప్రతిబింబించిన ప్రాజ్ఞడనెచైతన్యమనుట, కార్యమనగా అవిద్యాతో గూడిన ఆనందస్వరూపమైన వ్యష్టికారణదేహమనుట కర్తకర్మక్రియలనే త్రిపుటికలదు. కర్తఅనగ వ్యష్టికారణదేహమందు ప్రతిబింబించిన ప్రతిబింబచైతన్యమను! కర్మఅనగా, అవిద్యగూడిన అజ్ఞానస్వరూపమైన వ్యష్టికారణదేహమనుట క్రియఅనగా వ్యష్టికారణదేహమందు ప్రతిబింబించిన ప్రతిబింబచైతన్యమునుంచి కలిగినసత్తాఅయిన తెలివిఅనుట ప్రాజ్ఞడనే చైతన్యం యేమి అయివున్నదివ్యష్టిసూక్ష్మదేహమందు ప్రతిబింబించినచైతన్యమైయున్నది. వ్యష్టిసూక్ష్మదేహమనగా అవిద్యతో గూడిన వాయువాగ్ని జలస్వరూపమైయున్నది ఇదిజడమూఅజడమూజడము ఇదిస్వజాతవిజాతవిజాతీయంను సవిజాతివ్యష్టికారణదేహమందును వ్యష్టిసూక్ష్మదేహమందును ప్రతిబింబించిన ప్రతిబింబచైతన్యమునుంచి ఆదేహమునకు ఏమివచ్చినది. సత్తా యీదేహమునుంచి ఆచైతన్యానకు యేమివచ్చినది. కర్మజన్మతాదాత్మ్యయమువచ్చినది. తైజసుడనె నామమున్ను తదాత్మ్యయనగా సూక్ష్మదేహమందు ప్రతిబింబించిన చైతన్యానకు కప్పుకొనివుండుట అనుట, కార్యకారణమనే ద్వయంగలదు. కారణమనగ వ్యష్టిసూక్ష్మదేహమందు ప్రతిఫలించిన తైజసుడనే చైతన్యము అనుట కార్యం అనగ అవిద్యతో గూడి ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ కోశస్వరూపనవ్యష్టిసూక్ష్మదేహమందు ప్రతిబింబించిన విశ్వుడనే చైతన్యమనుట కర్మఅనగ అవిద్యతో గూడిన అహంకారస్వరూపమైన వ్యష్టిస్థూలదేహమనుటక్రియఅనగా వ్యష్టిస్థూలదేహమందు ప్రతిఫలించిన ప్రతిబింబచైతన్యమునుంచి కలిగినసత్తాఅయిన తెలివిఅనుట అప్రత్యగాత్మమైన చైతన్యముయొక్క మాయలో ప్రతిబింబించిన స్వరూపమైయున్నది. అట్లావున్నది అంటిఅంటనట్టున్నది. యీచేసెవ్యాపారములు మాయవా చైతన్యానివామాయవిరెండూకూడినప్పుడు అచైతన్యవమైయున్నది. కూడీకూడనప్పుడు శబలబ్రహ్మము, శుద్ధము, అంటె యిందుకు నిజమేమిచైతన్యము చైతన్యమునే ప్రత్యగాత్మ, వాక్యార్థలక్ష్యార్థమైన్న స్వరూపవిధంయేరీతు వాక్యార్థమనగా జీవుడుఅనగా అంతఃకరణ అంతఃకరణప్రతిబింబచైతన్యము తధాధిష్ఠానచైతన్యము అంతఃకరణమనగా అవిద్యతో గూడిన ఆకాశమందు ప్రతిఫలించిన విశ్వతైజసప్రాజ్ఞులనే చైతన్యం తదధిష్ఠానచైతన్యంఅనగా జోతిర్మ

యాకాశమైన ప్రణవమందలివున్న చైతన్యా, యీమూడు కూడితె జీవుడు. ఇది త్వంపదవాచ్యార్థస్వరూపము ప్రత్యగాత్మ అనుట ప్రత్యగాత్మ చిదానందస్వరూపమునకు చెప్పుట ఏరీతి సత్తుచిత్తు ఆనందము, సత్తుఅనగా కాలత్రయాబాధ్యమై తనలో తానిండియుండుట. చిత్తుఅనగా కాలత్రయాబాధ్యమై సర్వప్రకాశమైయుండుట తనలోతానే ప్రకాశిస్తూ స్వయంప్రకాశమానమై వున్నది. ఆనందమనగా కాలత్రయాబాధ్యమై సర్వానందకరమై తనలోతానే ఆనందమై నిరతిశయానందమున్నది అనుట ఆప్రత్యగాత్మ పంచకోశవిలక్షణమునిన్ని చతుర్వింశతితత్వాతీతమునిన్ని, అవస్థాత్రయసాక్షియునిన్ని చెప్పడమేవిధంఅనగా, పంచకోశవిలక్షణమనగా అన్నమయ, ప్రాణమయ, మనోమయవిజ్ఞానమయఆనందమయ కోశములకు విలక్షణమైయుండి తనకు ఆలక్షణముతో పనిలేక తనకు తానే లక్షణమైయున్నందున విలక్షణమను చతుర్వింశతితత్వాతీతమనగా, కర్మేంద్రియ విషజ్ఞానేంద్రిప్రాణాంతఃకరణచతుష్టయముతో సరియైన యిరువదినాలుగు తత్వములకు తాను తత్వమైయుండి తనకు ఆతత్వముతో పనిలేక అభేదతత్వమైయున్నందున తనకు తానేయనుట అవస్థాత్రయసాక్షియనగా జాగ్రతస్వప్నసుషుప్తులనే తనకుతానే సాక్షియైయుండి తనకు ఆసాక్షిత్వము లేక తాను ఆసాక్షియై సాక్షిగావున్నందున సాక్షిఅనుట యీవిధము ననిలిచిన చైతన్యంయవరు నేను అనగా జ్ఞానమాత్రుణ్ణిఅనగా ఇదివరకు అజ్ఞానమాత్రుణ్ణిఅయివున్నప్పుడు గురుకటాక్షమువల్లను జ్ఞానమాత్రుణ్ణిఅయివున్నాను. యీవిమర్శచేసినది యవరు జ్ఞానమాత్రుడనైన నేను యట్లాయీమాయ తెలివిలురెండూ మాయగాదెలసి చైతన్యమును నిశ్చయించి జ్ఞానమాత్రుణ్ణిఅయిన నేను కేవలంగా చైతన్యమాత్రుణ్ణిఅయి యున్నాను. ఇక్కడ ఐక్యంయవరికి చైతన్యముతోటి జ్ఞానమాత్రుణ్ణిఅయిన నేను పోయిన తనకు అనుట ఇది సంపూర్ణ. సమిష్టిమహాకారణదేహమనగా జ్యోతిర్మయాకారమందు మహదాకాశమందు ప్రణవస్వరూపమైవున్నది ఇది జడమూఅజడమూ అజడము. ఇదిస్వజాతవిజాత విజాతి యందునమూలమాయలో నున్నది. సమిష్టిమూలకారణదేహమునకు సహజన్యవదాత్మయమున్న సూత్రాత్మయనే నామము వచ్చినది. తాదాత్మ్యయమనగా సమిష్టిమహాకారణ దేహమందున ప్రతిఫలించిన ప్రతిబింబచైతన్యమునుంచి కలిగిన సత్తాఅయిన మహాశుద్ధసత్వగుణమైన ఈశ్వరరూపమైన పరిజ్ఞానం చైతన్యమును కప్పుకొనియుండుట కార్యకార

ణము ద్వయంగలదు. కారణమనగా సమహిమష్టిమహా కారణ దేహమందుప్రతి ఫలించిన సూత్రాత్మచైతన్యమనుట కార్యమనగా విద్యతోగూడిన పరాపర శక్తిస్వరూపమైన సమిష్టిమహా కారణదేహమనుట కర్తకర్మక్రియలనే త్రిపుటి గలది. కర్తఅనగా సమిష్టిమహా కారణదేహమనుట క్రియఅనగా సమిష్టి కారణ దేహమందున ప్రతిఫలించిన ప్రతిబింబచైతన్యమునుంచి కల్గినసత్తాఅయిన పూర్ణ తెలివిఅనుట సూత్రాత్మయే మైయున్నది సమిష్టి కారణదేహమందు ప్రతిఫలించిన ప్రతిబింబచైతన్యమై యున్నది. సమిష్టిసూక్ష్మదేహమనగా విద్యతోగూడిన అఖండవాయువాగ్ని జలస్వరూపమైవున్న, ఇదిజడమూ, అజడమూ, జడము, ఇదిస్వజాత విజాత, విజాతి అయినందున సమిష్టి కారణదేహమందున సమిష్టి సూక్ష్మదేహమందున ప్రతిఫలించిన ప్రతిబింబచైతన్యమునుంచి సమిష్టిసూక్ష్మ దేహమునకు ఏమివచ్చింది సత్తా యీదేహమునుంచి ఆచైతన్యమునుంచి సమి ష్టిసూక్ష్మదేహమునకు ఏమివచ్చింది సత్తా యీదేహమునుంచి ఆచైతన్యమున కు ఏమివచ్చింది కర్మజన్మదా దాత్మ్యయమున్ను, హిరణ్యగర్భుడనే నామమున్ను వచ్చినది తదాత్మ్యయమనగా సమిష్టిసూక్ష్మదేహమందున ప్రతిఫలించిన ప్రతిబిం బచైతన్యమునుంచి కలిగిన సత్తాఅయిన మహతత్వగుణమైన విశ్వరూపమైన తె లివిఆచైతన్యమును కప్పుకోయుండుట కార్య కార్య కారణములనే ద్వయంగలదు. కారణమేమనగా సమిష్టిసూక్ష్మదేహమందున ప్రతిఫలించిన హిరణ్యగర్భుడనే చైతన్యమనుట కార్యమనగా విద్యగూడినయిచ్ఛాశక్తి స్వరూపమైన సమిష్టిసూ క్ష్మదేహమనుట, కర్మక్రియ నేత్రిపుటిగలదు. కర్తఅనగ సమిష్టిసూక్ష్మశరీరమం దు ఫలించిన హిరణ్యగర్భుడనే చైతన్యము. కర్మఅనగా విద్యతో గూడిన స్థితి శక్తిస్వరూపమైన సమిష్టిసూక్ష్మశరీరమందు ప్రతిఫలించిన హిరణ్యగర్భుడనే చైతన్యమునుంచి కల్గిన సత్తాఅయిన పూర్ణ తెలివి అనుట హిరణ్యగర్భుడనే చై తన్యమైయున్నది. సమిష్టి స్థూలదేహప్రపంచము ప్రతిఫలించిన ప్రతిబింబ చైతన్యమైయున్నది. సమిష్టిస్థూలదేహమనగ విద్యతో గూడి అఖండస్వరూపమై యున్నది ఇదిజడమూఅజడమూజడము. ఇదిస్వజాతాదిజాతాదిజాతిఅయినందున సమిష్టిస్థూలదేహమందునప్రతిఫలించిన ప్రతిబింబచైతన్యమునుంచి సమిష్టిస్థూ లదేహమునకు ఏమివచ్చినది సత్తా యీదేహమునుంచి ఆదేహమునకు యేమి వచ్చినది భ్రాంతి జన్యతాదాత్మ్యయమున్ను విరాట్టు అనేనామమున్నువచ్చినది. తదాత్మ్యఅనగా సమిష్టిస్థూలదేహమందున ప్రతిఫలించిన ప్రతిబింబచైతన్యమ

నుంచి కల్గినసత్తా మహారజోగుణమైన బ్రహ్మస్వరూపమైన ప్రజ్ఞానం ఆచైతన్యము కప్పుకొనియున్నది. కార్యకారణద్వయం కారణమనగా సమిష్టిస్థూలదేహమందున విరాట్టనే చైతన్యము కార్యమనగా విద్యతోగూడిన క్రియాశక్తిస్వరూపమైన సమిష్టిస్థూలదేహమనుట కర్తకర్మక్రియలనే త్రిపుటిగలదు. కర్తఅనగా సమిష్టిస్థూలదేహమందు ప్రతిఫలించి ప్రతిబింబచైతన్యం. కర్మ అనగా విద్యతోగూడిన ఉత్పత్తిశక్తిస్వరూపమైన సమిష్టిస్థూలదేహమనుట. క్రియ అనగా సమిష్టిస్థూలశరీరమందు ప్రతిఫలించిన ప్రతిబింబచైనమునుంచి కల్గిన సత్తా అయిన పూర్ణతెలివిఅనుట! పరమాత్మనే పరమాత్మనే చైతన్యం యెక్కడయున్నది. మూలమాయ అనగా మూలజ్ఞప్తికళామాత్రి శరీరంలో ప్రతిబింబమైయున్నది. ఎట్లాయున్నది అంటెఅంటనట్లున్నది. ఈచేసేజవ్యాపారములుమాయవా చైతన్యానివా యవిచైతన్య! యరుగునాయరుగదు. మాయకుస్వతంత్రిమూ లేదు. రెంటికి రెండూలేకుంటే వ్యాపారములు యట్లా అవుతూయున్నవి. చైతన్యంయొక్క సత్తావల్లను అనుట అయితె రూపనామక్రియలు మాయవా చైతన్యానివా మాయవి యీరెండూకూడినప్పుడువమైయున్నది శబలయీశ్వరుడై వున్నది. కూడనప్పుడు యేమయివున్నది. శుద్ధయీశ్వరుడైయున్నది. కూడినప్పుడు శబలము శుద్ధము. అంటే నిజమేమి? చైతన్యమనే పరమాత్మ వాచ్యార్థలక్ష్యార్థమై యున్నవిధం యేరీతున వాచ్యార్థమనగా ఈశ్వరుడు ఆయీశ్వరుడనగా మాయ. మాయాప్రతిబింబచైతన్యం మాయయనగా విద్యతోగూడిన అఖండాకాశస్వరూపమైయున్నది. మాయాప్రతిబింబచైతన్యం అనగా విద్యగూడిన ఆకాశమందు ప్రతిఫలించిన హిరణ్యగర్భవిరాట్టు అవ్యాకృతులనే చైతన్యమనుట తదధిష్ఠానచైతన్యమనగా జ్యోతిర్మయాకారమైన మహదాకాశప్రణవస్వరూపమందు నివశించిన చైతన్యమనుట యీమూడూకూడి ఈశ్వరుడు. ఇది తత్పదవాచ్యార్థం లక్ష్యార్థం. విరాట్టు హిరణ్యగర్భఅవ్యాకృత సూత్రాత్మలనే చైతన్యమునుంచి దేహములయందు కల్గిన బ్రహ్మ విష్ణు చంద్రి ఈశ్వరుడు అనే నాలుగు తెలివిలు ఆచైతన్యమును విడిచి యీదేహములయందు లయమైనప్పుడు ఒక్కచైతన్యం వున్నది. గనుక ఆచైతన్యం తత్పదలక్ష్యార్థం ఇదే పరమాత్మ. సచ్చిదానందస్వరూపమై యున్నదిట్లు. తత్వమసి అనగా త్వంపదం తత్పదం అశిపదం వ్యష్టిసమిష్టికానిది. యీరెండూగాని అపరోక్షం పరోక్షం రెండూకానిది వాచ్యార్థలక్ష్యార్థ భావా

ర్థ జహదహ అజహల్ల జహదహల్లక్షణ మొదట మూడూ విడిచి అనగా తత్వ మశి అనుట నాలుగుమూళ్ళు పన్నెండున్ను మొదటి ఆమూడుక్రింద వుండ చూచుకునేది. త్వంపదమనగా వ్యష్టిదేహేంద్రియ విషయబుద్ధి అంతఃకరణవృత్తి సాక్షితోకూడి త్వంపదమనుట త్వంపదం మూడువిధములు. అనగా త్వంపదంలో త్వంపదం త్వంపదంలో తత్పదం త్వపదంలో అసిపదం యీ రీతిని అర్థత్రియ లక్షణత్రియాలను చెప్పుకునే తతుమాయాఅవ్యక్త చైతన్యమున్ను త్వం అంతఃకరణవృత్తిచైతన్యమున్ను దానియందుండె తత్పదార్థమందుండి సర్వజ్ఞత్వాదులున్ను త్వం పదార్థలయందుండెడి కించజ్ఞత్వాది ధర్మములున్ను విడనాడి చూచిన రెండూ వకటె అగును.

త్వంపదంలో తత్పదమనగా వ్యష్టిసప్తధాతులైన దేహమనుట త్వంపదములో తత్పదమనగా యింద్రియఅంతఃకరణ బుద్ధివృత్తియై కార్యకారణములను యెరుగుతూ యెరిగింపజేస్తూవున్న ప్రజ్ఞానంఅనుట త్వంపదములో అశిపదం అనగా వ్యష్టిదేహమందు జాగ్రిత, సుషుప్తులను యెరుగుతూ యెరిగింపజేస్తూవున్న ప్రజ్ఞానమను యెరిగే తెలివి అనుట ఆదేసాక్షి. అదే నేను. అదే జీవుడు. అదే కూటస్తుడు. యీత్రియము యెక్కడవున్నది. వ్యష్టి జీవుని యందు. ఈవ్యష్టి జీవుడు యెక్కడ వున్నది. వ్యష్టి దేహమందు యీమూడు కూడి యేమైనది. విడినామములు కల్గి యేడు అర్థములతో కూడు త్వంపదమన బడినది. యీత్వంపదం తిరిగి యేమయినది. వ్యష్టి దేహం తెలివి సాక్షిలు అని త్రివిధములైనవి. యీత్వంపదమునకు పూర్వపీఠిక యీత్రివిధములో ఒకటిసాక్షినివుంచి యిందుకు వేరు అయిన యీరెండు మిడిమాయ తత్పదమనగా సమిష్టిపిపీలికాది బ్రహ్మాండపర్యంతంబైన దేహేంద్రియ అంతఃకరణబుద్ధివృద్ధిపూర్ణముతోకూడుకున్నది అనుట.

ఇది మూడువిధములు. తత్పదంలో త్వంపదం త్వంపదంలోతత్పదం తత్పదంలో అసిపదం యీరీతిని అర్థత్రియలక్షణత్రియాలను చెప్పుకునేది. తత్పదంలో తత్పదం అనగా సమిష్టి పిపీలికాది బ్రహ్మపర్యంతమైన ఇంద్రియవిషయ అంతఃకరణబుద్ధి వృత్తికార్య కారణములను యెరుగుతూ యెరిగింప చేస్తూయున్న ప్రజ్ఞాన స్వరూపంబైనది అనుట. తత్పదంలో అసిపదమనగా సమిష్టి పిపీలికాది బ్రహ్మపర్యంతం దేహిమైనదేహమందుజాగ్రితసుషుప్తులందాయెర్. జాగ్రిత సుషుప్తులను యెరుగుతూయున్న ప్రజ్ఞానము యెరిగేలో యెరుకమైన

తాను అనుట. ఇదేపూర్ణం ఈశ్వరుడు ఇదే తాను యీత్రయం యెక్కడ వున్నది. సమిష్టి దేహమందునకూడి యేమిఅయివున్నది. అందునామములు కూడి ఏమిఅర్ధములై తత్పదమై యున్నది. ఈ తత్పదం తిరిగి ఏమయివున్నది. సమిష్టి దేహిదేహీపూర్ణములనే మూడువిధములైయున్నది తత్పదమునకు పూర్వపీఠిక యీమూడువిధములలోను ఒకటిపూర్ణమును వుంచి యిందుకు వేరైన రెండూ యేమిటి మాయఅనగా విద్యామాయ ఇది వకవిధమా. రెండువిధములా. రెండు విధములు. అనగా విద్యలో అవిద్య విద్యలోవిద్య. ఇతడె పరమపురుషుడు రెండుమాయలకు ఏకమైయున్నాడు ఆధారుడైయున్నాడు. పూర్ణమైయున్నాడు. యీరెంటిచేతను యితనికి ఏమివచ్చినది ఈశ్వరుడనే నామము సమిష్టిస్థూల దేహమునుంచి ఏమివచ్చినది విరాట్టనే నామమువచ్చినది సమిష్టి యెందుకు వచ్చినది. ఏమివచ్చినది హిరణ్యగర్భసూత్రాత్మ అవ్యాకృతులనే నామములు ఒకటినుంచి మూడు యేరీతునవచ్చినవి. సూక్ష్మకారణమహాకారణములు ఒకటిలోవకటి అంతర్భూతమై వున్నదనుట సూత్రాత్మ యెక్కడవున్నది. మాయలో ప్రతిబింబమైయున్నది. ఆబింబము ఏమైయున్నది. సమిష్టిమహాకారణ దేహమందు ప్రతిఫలించిన ప్రతిబింబ చైతన్యమైయున్నది.

దేహ॥ యెరుకచైతన్యములను మూటిని అనుభవమార్గమున విచారించితె ఒకటిలో నొకటి సంబంధమున్ను స్థాయిన్ని ప్రేరేపకర్తృత్వమున్ను అనుకూలమున్ను ఉత్పత్తిస్థితిలయములున్ను పృథివిన్ని అభిమానమున్ను లేనట్టి నిశ్చయముగనుక అమూటికి యీ ఎనిమిది ఆరోహణభావన చెప్పేది దేహం యెరుకచైతన్యములైన మూటిలో దేహమునకు దేహితోటి దేహికి దేహముతోటి ఏమి నిమిత్తములేదు. కాన దేహము లేనెలేదు. తెలివికి చైతన్యముతోటి ఏమీ నిమిత్తములేనందున తెలివి లేనేలేదు. ఈరీతిని యీరెండూలయమైనప్పుడు ఏమియులేక ఒక్కచైతన్యము మాత్రం తనకుతానే స్వతసిద్ధమైయున్నది. అనుట గురుపుత్రుడైనవాడు యీమహదనుభవమును ఎరిగి పరమగురు కటాక్షమును ఎరిగి పరమగురు కటాక్షమునుంచి శివపదస్వానుభవమునుపొంది నిర్వాసనమానమైయుండుట రాజయోగి అఖండభావమై యుండుట ఈవిమర్శాసూత్రమనే గ్రంథమందు కలసంబంధత్రయ లక్షణత్రయ పాదత్రయములకు ప్రశ్నవిధాయకముగా స్వానుభవక్రమానపండిత పామరులకు అనుకూలమానట్టుగా వాక్యవృత్తిచేత శృతి॥ ద్రష్టదర్శదృశ్యానాంవిరామో

యత్రిభావయేత్॥ దృష్టి పవన మనస్సు లయము హృదయాకాశమందు జీవ బ్రహ్మైక్యమగును. మృదుభాషగలదిగాన సర్వానుభవములకు సంపుటమన దగిన శ్రీగురుచరణారవిందాధ్యాన్న అనుభవముచే సిద్ధిపొందిన శ్రీభీమాజ్జరపు సూర్యనారాయణ రాజయోగీంద్ర విరచితంబైన విమర్శాసూత్రం.

॥శృతి॥ శరీరంవావసంతం, నప్రియాప్రియస్పృశతఇతిసహ్వై శరీరస్య సతఃప్రియప్రియోరపహితిరస్థియన్మరుసానుమరుతే యేనార్మశోన్మతం తదేవ బ్రహ్మత్వంవిధినేదం యదిద ముపాసతే॥ ॥శృతి॥ నతత్రసూర్యోభాతిన చంద్ర తారకం నేమావిద్యుతో భాంతికుతోయమగ్నిః। తమేవభాంతమనుభాతి సర్వం తస్యభాసాసర్వమిదం విభాతి॥ యత్రయత్రకుతో జీవో తత్రతత్రసదాశివః అని యున్నది. త్వంపదతత్పదావైన రెంటియొక్క రెండుముళ్ళు ఆరెంటికి వ్యష్టిస మిష్టిసంబంధములనిన్ని ఈశ్వరసంబంధములనిన్ని చెప్పేది. వ్యష్టిదేహంసమిష్టి దేహమందు అంతర్భూతమైయున్నది గనుక లేనేలేదు. లేకపోతే సమిష్టి ఒక టి లేక దేహంమాత్రం వున్నది. వ్యష్టిసమిష్టియందు కలను విచారించి చూడగ వ్యష్టితెలివి సమిష్టి తెలివియందు అంతర్భూతమైయున్నది గనుక వ్యష్టి లేనే లేదు. లేకపోతె సమిష్టియనేది ఒకటి లేక యేమాత్రంవున్నది. వ్యష్టి సమిష్టి యందు జీవఈశ్వరులనే సాక్షిపూర్ణములను విచారించితే పూర్ణమందు చైత న్యములో సాక్షిచైతన్యం అంతర్ భూతమైయున్నది గాన వ్యష్టియనే చైతన్య మనేది లేనేలేదు. లేకపోతే సమిష్టియనేపూర్ణచైతన్యం అనేది ఒకటి లేకచై తన్యంమాత్రంవున్నది. అనగ, జీవేశ్వరదేహులు అయిక్యమైన దేహం జీవే శ్వర తెలివి అయిక్యమైన తెలివి జీవేశ్వరులు అయిక్యమైన విరాట్టు అనగా, బ్రహ్మాండదేహం, బ్రహ్మాండతెలివి, శబలబ్రహ్మం, అనగా విరాట్ద్దేహం విరాట్టుమక విరాట్టు ఈరీతిని వ్యష్టిసమిష్టులు అయిక్యమైనవని చెప్పేది విరాట్టనే శబలచైనములు ఈసంబాధమైన దేహి దేహములను ఈరెండు ను మాయ అనగ మూలమాయ మూలజ్ఞప్తి కళామాత్ర శరీరం ఇది వకవిధమా రెండువిధములా, రెండువిధములు. మూలమాయలో అవిద్య మూల మాయలోవిద్య. ఇతను యవరు పురుషుడు యీరెండు మాయలకు ఏమిఅయివున్నాడు ఆధారుడైయున్నాడు. ఈరెంటికి యితను ఏమిమైయు న్నాడు పూర్ణమైయున్నాడు. ఈరెంటిచేత ఇతనికి ఏమివచ్చినది. విరాట్టనే నా మమువచ్చింది స్థూలదేహమునుంచి ఏమివచ్చినది హిరణ్యగర్భఅవ్యాకృత సూ

త్రాత్మలకే నామములు ఒకటినుంచి మూడు ఏవిధమున వచ్చింది సూక్ష్మకా రణములు ఒకటిలోవొకటి అంతర్భూతమైనందున అనుట యీవిరాట్టుచైతన్యం యక్కడనున్నది. మూలమాయలో బింబమైయున్నది యట్లావున్నని అంటి అంటనట్లున్నది బ్రహ్మాండవ్యాపారములుచేసెడి యవరుమాయ అనేచైతన్యము యరుగునా యరుగను అయితే మాయకు స్వతంత్రమూ లేదు. రెంటికీరెండూ లేకుంటె వ్యాపారములు ఏరీతున అవుతూయున్నది. చైతనముయొక్క సత్తు వల్లఅనుట ఈరూపనామక్రియలు మాయాచైతన్యానివాయ వేయీదేహా తెలివి రెండుకూడినప్పుడు ఏమిఅయివున్నది, బ్రహ్మచైత్వమైయున్నది. కూడీ కూడనప్పుడు శబలము శుద్ధము. అంటె యిందుకు నిజమేమిచైతన్యము యీచై తన్యము యసరు, నేను అనగనిరుపాధిక జ్ఞాన మాత్రుని ఈవిమర్శచేసిదియవరు అనెను యట్లా, యీదేహిదేహములు రెండు మాయగాదెలసి చైతన్యమును నిశ్చయించి నిరుపాధిక నిరుపాధిక జ్ఞా. మాతృన్ని అయితే చైతన్యమాతృణ్ణి అయివున్నాను. యట్లు చైతన్యమునుచూచితె నావలెనే నిరుపాధికమైనట్టివలె నున్నది. నున్ననేను చూచితె నిరాకారిమైన చైతన్యమువలెనున్నాను. యీ స్థలమందు అయిక్యం యవరికి చైతన్యములోటి నిరుపాధికమైన తానుఅయిన నాకు అనుట.

సమాప్తము.



# శ్రీ మహాఋషి నిఘంటిత యోగశాస్త్రము.

## జాతిత్రియయోగము.

వశిష్ఠమహాఋషి శ్రీరాములవారికి జాతిత్రియయోగము బోధించుట.

1. స్వజాతీయ మనగ- మఱ్ఱివృక్షమునకు- రావివృక్షము స్వజాతీయ భేదము.

2. విజాతీయభేదమనగ- మఱ్ఱిచెట్టునకు- శిల- విజాతీయభేదము.

3. స్వగతభేద మనగ- ఆవృక్షమునందుగలభేదములు-పూవులు, పిందెలు, కాయలు, పండ్లు మున్నగునవి. ఈమూడుభేదములు- పరమాత్మకు లేవని పెక్కుశృతులు బల్కుచున్నవి. పరమాత్మయందు కించిత్ భేదమైనను గనబరచువాడికి అనగ- జీవునకు మృత్యురూపమైన సంసారమునుండి మరల జననమరణ రూపకమగు సంసారమునె పొందును అనగ (స్వజాతీయభేదము మఱ్ఱివృక్షమునకు రావివృక్షము స్వజాతి భేదము- అనగ మఱ్ఱివృక్షమునకు మఱ్ఱివృక్షమె స్వజాతిగా- మరివకజాతివృక్షమునకు స్వజాతియని చెప్పుటకు వీలుకాదుగదా యట్లనిన యేవిత్తనమునకు ఆవిత్తనమె స్వజాతి. ఇతరజాతి విత్తనములు వృక్షములు విజాతీయము. కావున యేవిత్తనము యేజన్మమునకు ఆజన్మమె స్వజాతి. అనగ మనుష్యజన్మమునకు మనుష్యుడె పుట్టును. చతుష్పాదజన్మమునకు చతుష్పాదజంతువులె పుట్టును. మృగములకు మృగములె బుట్టును. పక్షులకు పక్షులేబుట్టును పిపీలకమునకు పిపీలకములె పుట్టును. వృక్షమునకు వృక్షమె మొలచును. గావున ఏజాతికి ఆ జాతికి స్వజాతి. యీస్వజాతి అనగ (అంతరార్థం) స్వజాతి అనగ ఆత్మ. స్వజాతి ఆత్మకు పరమాత్మె. స్వజాతి తనకు తానె స్వజాతి శృతి॥ దీపందీపాంతరంవ్రజేత్॥ ఒకదీపముచేత ననేకదీపములు ప్రకాశించునటుల తనకు తానె స్వజాతియని చెప్పుచున్నవి.

2. విజాతీయభేదమనగ మఱ్ఱిచెట్టునకు శిల విజాతీయము. అనగ వృక్షమునకు శిలపర్వతములు విజాతీయములు. వృక్షములకు పుష్పములు, పిందెలు, కాయలు, కొమ్మలు మొదలైనవి గలవుగావున పర్వతములకు అట్టి శాఖలు మొదలయినవి లేవుగాన వృక్షముకు పర్వతములు విజాతీయములు-

3. స్వగతభేదము అనగ వృక్షమునందుగల పుష్పములు, శాఖలు, కాయలు, పిందెలు మొదలైనవి. స్వగతభేదము అనగ- ముందు యింకా కొన్ని హంశములు వ్రాయనైయున్నవి—

స్వజాతీయ మనగ పరమాత్మ స్వజాతీయము. ఈపరమాత్మకు యింద్రియములు విజాతీయములు. ఈ ఇంద్రియములయొక్క విజాతీయములు స్వగతభేదములు. స్వసాక్షిస్వరూపమైన ప్రత్యగాత్మ స్వజాతీయము. యీఆత్మచేత ప్రకాశింపబడిన యింద్రియములు విజాతీయములు. యింద్రియములయొక్క విషయములు స్వగతభేదములు గావున

స్వజాతి విజాతి స్వగతభేదములు మూడు భేదములు పరబ్రహ్మమునకు లేవు. యీమూడు భేదములకు విలక్షణమైన పరబ్రహ్మము అనగ జాగ్రత్త- స్వప్నసుషుప్తి అవస్థలకు విలక్షణమై ద్రష్ట స్వజాతీయము. ఈద్రష్టకు దృశ్యము విజాతీయము. దృశ్యమును గ్రహించేది స్వగతము. అనగ చూచేవాడు స్వగతము- చూపు- విజాతి- చూడబడేవి చూడబడేదే- దృశ్యప్రపంచకము. సర్వచరాచరప్రపంచమంతయు స్వగతము. గావున 25 దు యింద్రియములు వ్యవహారికం స్వగతము. యీపంచవింశతితత్వములకు విలక్షణమైన ఆత్మ స్వజాతీయము. పంచవింశతితత్వములయొక్క విషయములు స్వగతము గావున-

శంకరభాష్యం॥ ప్రత్యగ్వస్తుని నిస్తరంగసహజానందావబోధాంబుధౌ॥ విప్రోయం శ్వపచో యమిత్యపి మహాన్ కోయం విభేదః భ్రమం కింగంగాంబుని బింబితెం బరీమణౌ। ఛండాలవీథీపయః- పూర్వేవాంతర మస్తి కాంచనఘటీ- మత్కుంభయోర్వాంబరే. ఇట్లు శ్రీశంకరులవారు చెప్పియున్నారు. ఇందుకు భావార్థం- అనృత, జడదుఃఖ రూపములగు అహంకారాదికముకంటె భిన్నమై విలక్షణముగా ప్రకాశించునట్టియు సంకల్పవికల్పాత్మకములగు అలలు లేకపోవుటచేత నిశ్చలమయిన పరిపూర్ణమైన జ్ఞానానందనిధియగు పరబ్రహ్మయందు నీవుబ్రాహ్మణుడు. శృతి॥ బ్రహ్మజ్ఞానానంతు

బ్రాహ్మణః- వీడు శ్వపచుడు అనుభేదబుద్ధిలేనివాడు. కుక్కలను వండుకు తినువాడు సంకల్పరహితమైనవాడు సంశయరహితమైనవాడు. యిందుకు దృష్టాంతము.

గంగోదకములందును చండాలజాతులుండు వీధులలోనుండు జలములయందును బ్రతిబింబించిన సూర్యునకు బంగారుకుండయందున్న ఆకాశమునకును మట్టికుండయందున్న ఆకాశమునకున్ను భేదము యెట్లులేదో అట్లే ఆత్మకు గుణదోషములు లేవు. ఆత్మప్రత్యక్ పరమాత్మ సర్వసాక్షి అభేదరి భేదములేనివాడు గావున వివరముగా విచారించెదము. పరమాత్మను సచ్చిదానంద స్వరూపునిగ వేదమువర్ణించుచున్నవి. ఈశ్లోకం అనగ అనృతజడదుఃఖాహంకారాదికముకంటె విలక్షణముగా ప్రకాశించెడి ప్రత్యగాత్మయని చెప్పుటచేత పరమాత్మయొక్క సద్రూపము పేర్కొన బడినది. సంకల్ప వికల్పాదికములు లేక శాశ్వతానందరూపమను బ్రహ్మజ్ఞాన సముద్రమనుటచేత పరమాత్మయొక్క బ్రహ్మానందమనె చిదానందరూపము గ్రహించుటచేత పరమాత్మను సత్యజ్ఞానానందరూపునిగ చెప్పుటయు వుపాధినిమిత్తముచేత గాని వాస్తవముగాదు గావున పరమాత్మజ్ఞానానంద స్వరూపుడని శ్రుతి సత్యజ్ఞాన మనంతం బ్రహ్మం ఆనందో బ్రహ్మేతివ్యజానాత్ మున్నగు శ్రుతులు ప్రతిపాదించి చెప్పుచున్నవి. అట్టి ప్రత్యగాత్మయందు బ్రాహ్మణ చండాలాదిభేదములు లేవు. మరియు పరమాత్మ ఏకమేవాద్వితీయం బ్రహ్మ అను శ్రుతిచేత స్వజాతీయ విజాతీయ స్వగతభేదశూన్యుడై యుండునని శ్రుతులుబలుకుచున్నవి ఈమూడుభేదములు పరమాత్మకు లేవు. పరమాత్మయందు ఈషద్ భేదము యించుకైనను లేదు. స్వజాతివిజాతి స్వగతభేదములకు అతీతము=జాగ్రత స్వప్నసుషుప్తవస్తలకు అతీతుడు. మృత్యురూపమైన అనిత్యమైన సంసారమునుండి మరల జన్మమరణములకు రూపమైన సంసారమునే గోరుచున్నాడు పొందుతున్నాడు. పునర్జన్మమునకు కారణమౌను. శ్రుతి॥ మృత్యోస్స- మృత్యు మాప్నోతి॥ యాదాహ్యేవైష ఏతస్మిన్నుదరమంతరంకురుతె- అధరతస్యభయంభవతి- శ్రుతి॥ ప్రమాణములు నిందించి చెప్పుచున్నవి. కావున పరమాత్మయందు భేదబుద్ధిని గనంబరచవలదని చెప్పుచున్నవి. ఉచ్ఛనీచస్థితులుగల శరీరోపాధులయందు గలచైతన్యము ఆయావుపాధులననుసరించి శ్రేష్ఠమనియు నింద్యమనియు కల్పించుట తగదనుటకుగాను దృష్టాంతముగా పరిశుద్ధమైన జలములోను అవి

త్రమైన గంగోదకములయందు అనగ అపవిత్రమైన మనుష్యులయందు అతినీచమైన ఛండాలునియందు వశించు వీధియందు అపవిత్రవస్తువులతో- మిళితమైయుండు జలముల జలములయందు ప్రతిబింబించిన సూర్యునిదృష్టాంతము గాగనంబరచుచున్నవి- మంచిచెడ్డలు భేదాభేదములు- సూర్యునిప్రకాశమునకు నెట్లు అంటవో నట్లె- పరమాత్మ తానులక్షణుడై సర్వసాక్షియైయున్నది. జ్ఞానిహృదయమునందు- అజ్ఞానిహృదయమునందు సమానముగానే తానువిలక్షణుడైయుండె. మలినమైన గ్లాసుయందు నిర్మలమైన గ్లాసుయందు జ్యోతిర్మయాకారమైన ఆత్మతేజస్సు వక్కటైయున్నట్లుగ ఆయుపాధి ననుసరించి- ప్రతియుపాధి ననుసరించి ప్రతియుపాధియందును భిన్నాభిన్నముగా పరమేశ్వరుండైన ఆత్మ గనంబడునుగాని అతడొక్కడె యనియు ఆయా యుపాధుల యందు ననుసరించి భేదమున్నట్టుల తోచుచున్నవని ముందుశ్శ్రుతులు బోధించుచున్నవి గావున శ్రు॥ ఏక ఏవహి భూతాత్మా భూతే భూతేవ్యవస్థితః ఏకధా బహుధాచైవ దృశ్యతే జలచంద్రవత్ భావార్థం. సర్వభూతములకు ఆత్మయగుపరమాత్మతానొక్కడైనను- ప్రతీభూతమునందు వ్యాపించియున్నవాడై తానొక్కడైనను ఆనీళ్ళయందు ప్రతిఫలించుచంద్రునివలె అనేకవిధములై గనబడుచున్నాడు. మరియొక్కదృష్టాంతము చెప్పెదవినుము. అంతటవ్యాపించియున్న ఆకాశము సర్వత్ర ఒకేవిధముగ వ్యాపించి యుండును. ఒకచోటగలదు. ఒకచోట లేదని లేదుగదా అయినను సువర్ణకలశము మృత్తికలశము దేనియొక్కసంబంధముచేత వానియందు వేర్వేరుగా ఉన్నదానివలె చూడబడినను వాస్తవమునకు మాత్రము దేశకాలాద్యుపాధులందున్న ఆకాశమునకు భేదముమాత్రము లేదని తెలియవలెను- శ్రీరామహృదయమందు ఘటముపోలిశిన ఘటాకాశమునజెందు కరణి విజ్ఞానదృష్టి ఘురము నెడబాసి నిర్మలకుడు నన్నుబొంది క్రమ్మరబొరయడు పూర్వసంజ్ఞ. ఘటాకాశమనగ జీవునకున్ను మహాకాశం పరమాత్మకున్ను అభేదజ్ఞానమును బోధించుచున్నవి. ఘటమూ నశించునుగాని ఆకాశము మహాకాశమందు లీనమయ్యేనేగాని- ఆత్మయన్నదూనశించదు. తన్ను తాదెలిసినతర్వాత జీవాత్మ పరమాత్మయగును. తానుతానాను- జీవబ్రహ్మైక్యజ్ఞానమును బోధించుచున్నవి- కొన్నిశ్రుతిస్మృతులు బోధించుచున్నవి.

శ్రుతి స్మృతులను వుదాహరణములు బోధించుచున్నవి.

1 శ్లో॥ శాంతోద్దీపిత సగుణనిర్గుణాతీత శుద్ధనిర్గుణతత్వం త్వమేవాహం త్వమేవాహం నసంశయః.

2 శ్లో॥ శాంతో- దాంత- ఉపరత- స్థితిక్షు- శ్రద్ధాసమాహితో- భూత్వా ఆత్మ- న్యేవాత్మానం- పశ్యేత్.

శాంతుడు, దాంతుడు- విషయములను మరలినవాడును- సుఖదుఃఖములను- సమానముగ జూచువాడును- శ్రద్ధాయుతుడునై తనయందె ఆత్మను జూచుచున్నాడు గావున-

3 శ్లో॥ అమానిత్వ- మదంభిత్వ- మజ్ఞానం- యదతో న్యథా- తనకంటె వేరైన- దేహేంద్రియాదులందు నేననెడి- తలంపు అభిమానము ఇంతకంటె విలక్షణమైనది. ప్రజ్ఞానమేగనుక అభిమానరాహిత్యమునకు జ్ఞానసాధనమగుచున్నది. గావున-

4 తతస్తు- తంపశ్యతి- ధ్యాయమానః అధ్యాత్మయోగాధిగమేనదేవం మత్వా- మనోనాశనమైన పిదప పరిశుద్ధుడగు పరమాత్మను ధ్యానించుచు జ్ఞానయోగముచేతను ప్రకాశించువాడగు పరమాత్మను తెలుసుకొనువాడు సుఖదుఃఖములను పొందజాలడు. జీవబ్రహ్మైక్యయోగానుభవము గలవానికి- దుఃఖమాగంతుకము- సుఖము స్వాభావికము అయియుండును-

5 యంవినిద్రా- జితశ్వాసా- స్సంయత్తాస్సంయతేంద్రియాః జ్యోతిః- పశ్యంతి యుంజానాః తస్మై యోగాత్మనేనమః॥ నిద్రారహితులును ప్రాణజయముగల వారలును నియమవంతులును- జితేంద్రియులును అగుమహానుభావులును యోగసాధనముచేత యేజ్యోతిస్స్వరూపమును చూచుచున్నారో అట్టిఆత్మకొరకు నమస్కారము. జ్ఞాని అనగ ఆత్మానాత్మవివేక జ్ఞానంగలవాడు. సంచితప్రారబ్ధరూపములగు పుణ్యపాపకర్మలఫలమును బడబానలమైన బ్రహ్మజ్ఞానమనే అగ్నియందు కాల్చివేయును. శృతి॥ అగ్నిదగ్ధం యథాబీజం శాఖాపల్లవవర్జితం జ్ఞానదగ్ధం తథాయోగీ- పునర్జన్మం నవిద్యతే. ఇత్యాది అనగ కాల్చినబీజమువలన- అంకురము యెటులపుట్టదో అట్లే బ్రహ్మజ్ఞానమనే బడబానలమనే అగ్నియందు ఆగామి సంచితకర్మములవలన రాబోవునట్టిఫలమును కాల్చివేయుటచేత ఆకర్మవలన అనుభవించవలసిన సుఖదుఃఖములు- జనన మరణములు- కలుగజాలవని భావము. ఈశ్లోకమునందు దుష్కృతం అని ఒకపాపమునుమాత్రమె చెప్పినను పుణ్యపాపములురెండును అచ్చట గ్రి

హింపవలయును. పాపం అనుశబ్దము దగ్గరనె పుణ్యంవున్నది. ఇవిరెండు సుఖ
దుఃఖములవంటివే గావున ఆర్యులు అనగ పెద్దలయొక్క అభిప్రాయము
లైయున్నవి- బ్రహ్మవేత్తకు సంచితకర్మ వున్నా వుండవచ్చునుగాని ఆగామి
కర్మయెటుల గలుగును అని అందురేని బ్రహ్మసాక్షాత్కారము దేహేంద్రి
యాది వ్యాపారములవల్ల కలుగబోయెడి పుణ్యపాపకర్మ లని గ్రహింపవల
యును, ఒకవిధమైన పూర్వపక్షము చేయనగుచున్నది. యెట్లనగ శృతి॥ నా
భుక్తం క్షీయతే కర్మ. చేశినట్టి పుణ్యపాపరూపమైన కర్మ అనుభవించిన
గాని నశింపదు అని ప్రమాణమున్నది. గావున- బ్రహ్మజ్ఞానికికూడ పుణ్య
పాపరూపమగు కర్మఫలానురూపము తప్పదు గావున ప్రారబ్ధంభోగతోనశ్యే
త్ అనునట్లు బ్రహ్మవేత్తకు ప్రారబ్ధ అనుభవించకతీరదు కాబట్టి శృతి॥ నాభు
క్తం క్షీయతెకర్మ అనిచెప్పిన ప్రమాణవచనము బ్రహ్మజ్ఞానము లేనివానిని
గూర్చి చెప్పబడినది గాని బ్రహ్మజ్ఞానము గలవానివిషయమై చెప్పబడినది
గాదు. బ్రహ్మజ్ఞాని భూతభవిష్యత్ వర్తమానకాలములయందు నాకు కర్తృత్వ
కర్మత్వము లేదనియు నేను బ్రహ్మస్వరూపుడనని తలంచువాడికి పుణ్యపాప
కర్మఫల మంటనేరదు. ఈవిషయమును అందరెరుంగుదురు శృతి॥ ఏవం విది-
పాపం- కర్మ- నశ్లిష్యతే. ఇత్యాది శృతిప్రమాణములు ఈప్రకారం బ్రి
హ్మజ్ఞాన మెరుంగువానికి- పుణ్యపాపరూపమైన కర్మఫలము అంటదు అని బ్రి
హ్మజ్ఞానానాంతరము సంభవించెడి కర్మఫలమంటదు అని శృతి॥ తద్యథే
షీకా ఏవంహాస్య సర్వేపాప్మానః ప్రదూయంతే ఆశృతి వలన సంచితమగు
పుణ్యపాపరూపమగు కర్మఫలము నశించుననియు తెలియవలయును- కావున
సంచితకర్మ అనేకజన్మములనుండి పుణ్యపాపకర్మలయొక్క రాసులు ఇదియే.
ఇదిబీజవతుగ జన్మమునకు కారణము. ఈసంచితకర్మయే యీమానుషజన్మ
యే ప్రారబ్ధజన్మకర్మ అనుభవము. ఈప్రారబ్ధకర్మము ముందురాబోవు అగా
మికర్మ యీమూడున్ను మొదటికర్మసంచితం ప్రారబ్ధం కర్మసంచితం ఆగామి
యీలాగుననె అనేకజన్మములు యెత్తుచుండును. ఆగామి ఈజన్మయందు బు
ద్ధితెలిసినపిమ్మట చేశినపుణ్యపాపకర్మ ఇదియె ముందుజన్మకు కారణము ప్రా
రబ్ధమును అగును.

పారబ్ధముయొక్క కర్మ యీజన్మయందు అనుభవించుట కేర్పడిన
కర్మఫలము. ఏవారికిని ప్రారబ్ధము ననుభవించక తీరదనియెడు లోకోక్తిని చెప్ప

లారవినుచున్నాము. ప్రారబ్ధము స్వేచ్ఛాప్రారబ్ధము పరేచ్ఛాప్రారబ్ధము అని యిచ్ఛాప్రారబ్ధమని మూడువిధములు (శ్లోకం ప్రారబ్ధా భోగతో నశ్యేత్ తత్వజ్ఞానేనసంచితం ఆగామి ద్వివిధం కర్మతద్వేషీ ప్రియవాదినోః శ్లోకం (హరిణాపిహరేణాపి బ్రహ్మణాపి సురైరపి లలాటలిఖితేరేఖే పరమేష్ఠి నశక్యతే

చేసికొనిన వారికి చేసినంత అనుభవించక తీరదు. యెట్లులనిన ఘట్వాంగునియొక్క అనుభము పురాణములయందు వినుచుంటిమి గదా యెట్లులనిన బట్టతలవాడు ఒకడు యండదెబ్బవలన పరుగెత్తిపోయి యొకతాటిచెట్టుక్రింద నిలువగ నాతాటిపండొకటి తటాలున తలపైనపడి తలబ్రద్దలయ్యెను. కనుక విధినిదాట నెవరితరము గాబట్టి ప్రారబ్ధము అనుభవించక తీరదు.

బ్రహ్మజ్ఞానికి పుణ్యపాపకర్మ ఫలలేశము లేదు. జ్ఞానియగు వానికి బ్రహ్మప్రాప్తికాలమందు జ్ఞానోదయకాలమందు అజ్ఞానము నశించిన వెంటనే సంచితాగామికర్మలు నశించిన విధముగ ప్రారబ్ధకర్మఫలము కూడా జ్ఞానోదయకాలమందు ప్రారబ్ధము మాత్రముయేల నశింపదు. అని ఆశించుకొని ప్రారబ్ధముమాత్రము ఏల నశించదనియు అట్టిప్రారబ్ధము ననుభవించుటకొరకు తన దేహమును అర్పణజేసి తత్వవేత్తయగువాడు తత్ఫలానుభవ సమయమునందు సుఖదుఃఖముల నంటకయుండునని శృతి స్మృతులు చెప్పుచున్నవి.

ప్రారబ్ధఫలమగు కర్మము బ్రహ్మజ్ఞానముచేత నశింపదనియు అనుభవించుటచేతనే నశించు ననియు శృతియుక్తి అనుభవములు మూడును స్ఫుటముగా గానంబడుచున్నవి. శృతి॥ తస్య తావ దేవ చిరం యావన్నవిమ్యే యుక్తిః యట్లనిన ధనస్సువల్లనుంచి విడువబడిన బాణము తనవేగము క్షీణించిన పిదప తనంతటి తాను యెట్లు క్రిందపడిపోవునో ఆక్రిందపడుటకు పూర్వబాణము ప్రయోగించిన వాడు ఆబాణము పోగూడదు. దాని వేగము నిలిచిపోవలయు నని ప్రయత్నించినను సాధ్యమెట్లు గాదో ఆప్రకారముగా బ్రహ్మజ్ఞానము సహితము (ప్రారబ్ధకర్మఫలమును పోగొట్టజాలదు.) అనుభవించి తీరవలయును. అనుభవము యెట్లులనిన బ్రహ్మవేత్తలయొక్క అనుభవము గూడ యిట్లే గనబడుచున్నది. ఇట్లు ప్రారబ్ధకర్మము ఆఫలము అనుభవించు బ్రహ్మవేత్తయగు ఆమహా అనుభవము గలవాడు గురుస్వరూపుడు అని వుపనిషత్తులు శృతిస్మృతులు చెప్పుచున్నవి. కాబట్టి జీవబ్రహ్మలకు యేకత్వము చెప్పిన యడల అహంభావము గావబడుచున్నది. నేను కుంటివాడను గ్రుడ్డివాడను

సుందరుడను ఉదారుడను (వ్యవహారములందు అహం అనగ నేను అని వ్యావహారిక నామము ప్రయోగింపబడును. నేను అని నామవాచకము ఆత్మవాచకముగా యుపయోగింపడుచున్నది గదా నేను అని నామవాచకము (దేహేంద్రియాది ప్రపంచరూపముగు అనుభవము నందున్న) ఆత్మకు బ్రహ్మభావము చెప్పి పొందబడి యున్నది గదా అహంభావము దేహేంద్రియాది రూపముగు ప్రపంచము అహంకారముతో కూడి వ్యవహరించుచున్నది గావున యిట్లు అనగూడదు. ఇది నాశరీరము యిది నాకన్ను ఇది నాముక్కు ఇది నాప్రాణము ఇది నాబుద్ధి ఇది నామనస్సు అని చెప్పునపుడు దేహేంద్రియాదులను ఇది ఇది యని చెప్పునపుడు అనుభవములో అందఱకు ఆదేహేంద్రియాదులను ఇది ఇదియని వేరుగ చెప్పుటచేత అనుభవములో అందఱకు ఆదేహేంద్రియాదులు ఆత్మకంటె వేరైన పదార్థములని స్పష్టపడుచున్నది. ఆత్మమాత్రము నేను అని చెప్పుకొనునపుడు దేహేంద్రియ మనోబుద్ధులకంటె వేరైన వకవస్తువని దేహమనుష్యాది సకలవిధ జంతువులను ప్రత్యక్షానుభవ శిద్ధమైయున్నది. ఘటము మొదలగు బౌతికపదార్థములును ఇది అది అని మనము వాడుట చేత అవి ఆత్మకంటె భిన్నములగుట యెట్లు యెట్లు శిధించుచున్నదో అట్లాగే దేహేంద్రియాదికము సైతము ఆత్మకాదు. కావున నేను అని వ్యవహరింపబడు ఆత్మ సచ్చిదానంద రూపముగు పరబ్రహ్మము అనియు నేను కానని అనాత్మలనియు నిశ్చితములైనవి.

కాబట్టి దేహేంద్రియాదివిలక్షణమైన ప్రత్యగాత్మకు మాత్రము సచ్చిదానంద స్వరూపత్వము నని జెప్పితిరి గాని అహం నేను మనుష్యుడను అని వ్యవహరించు నపుడు మనుష్యుడైన నేనని గదా యని యర్థము యిక్కడ సచ్చిదానందత్వము మనుష్యుడనున్ను నేను అను ఆత్మకున్ను వుభయత్రి సాధారణముగా ప్రాప్తించుచున్నది. నాశరీరము నాకన్ను అనువాక్యములో ఆత్మ యింద్రియభిన్నుడుగ దోచినను నేను మనుష్యుడను అనువాక్యములో మాత్రము నేను అనునది దేహసంబంధ మగుటచేత పూర్వాపరవిరోధము సంబంధము సంభవించుచున్నది. కావున శరీరాభిమానములు బ్రహ్మచైతన్య సహాయము వలన ప్రబలమానే గాని వ్యవహరించునే గాని స్వయం ప్రకాశములు గావు శరీరము మున్నగు వానియందు ఆత్మబుద్ధిగలుట భ్రాంతిగాని వాస్తవముగాదు. దీనిని శృతి అధ్యారోపమును శంకరభాష్యములయందు చెప్పియున్నారు. ఊయి

తె యిందుకు ఒకవిషయము విచారించెదము. ఎట్లనిన నేను అనునపుడున్నూ నాకన్ను అనునప్పుడు నాశబ్దము అని ఆత్మనె చెప్పచున్నదని పలికి యున్నారు గద ఆత్మనె చెప్పుచున్నదని పలికి యున్నారు గదా ఆత్మయనునది నేను అనెడి జ్ఞానముచేత తెలియబడునని చెప్పుదురు గదా అప్పుడు ఆత్మకాత్మకు స్వపరి కాశత్వములేదనియు నేను అనెడి జ్ఞానముచేత తెలియబడునని చెప్పబడును. ఈఅహంకారమువలననే నేననేఆత్మకు స్వపరికాశత్వము లేదు నేను అనెడు ప్రజ్ఞానమువలన గోచరించుచున్నదని చెప్పబడును. ఇది సత్యమే అయినయడల ఆత్మప్రకాశుడని చెప్పునట్టి శృతులకు విరోధముగదా గాబట్టి అహం అనే ఆత్మ ప్రజ్ఞానం కార్యోపాధియైన కించజ్ఞుడు పంచవింశతిం తత్వాత్మకు డని యున్నది.

గద్య. ఇతిశ్రీభీమనిరంజన నిగమాగమగోచర గురువర కరుణాకటాక్షవీక్షణా యత్తచిత్తచైతన్య జగజ్జేగీయమానప్రకర్షితాత్మీశనై సచ్చిదానందగుణగణా తీత వేద వేదాంగమంత్ర మంత్రార్థ శ్రీసద్గురుపాదుకాపూర్ణదీక్షాపక్షదక్ష త్వశుద్ధ నిర్గుణ నిజబోధపరాయణాపారీణ పారాయణాధురీణ అజ్జరపు సూర్యనారాయణాఖ్య విరాజమాన ప్రభాశిత ప్రజ్ఞాప్రకర్షిత ప్రభో దితనై వేమూరివంశపయః పారావారరాకాసుధాకరస్య కౌండి న్యసగోత్రి వీరయభాగమాంబా గర్భకనిష్ఠజనిత హారిత సగోత్రసౌభాగ్యవతి సామ్రాజ్యభోజ్య విద్యోపాసనా వరప్రసాదకవనాకవిత కాత్రావులపల్లి సూర్యనారా యణయోగినీప్రణీతంబగు శ్రీమహాఋషినిఘం టితయోగశాస్త్రే బ్రహ్మవిద్యాయాం.

లక్షణత్రయము జాతిత్రయయోగము.

దశమప్రకరణం.

సంపూర్ణము.

# శ్రీ మహాఋషి నిఘంటిత యోగశాస్త్రము.

## ఏకాదశ ప్రకరణము.



## లింగదేహ వివరము.



—: సూర్యుడు వైవస్వతమనువునకు లింగదేహ యోగము బోధించుట :—

లింగదేహమనగ - సూక్ష్మదేహం స్వప్నావస్థ అభిమాని - తైజసుడు ఈతైజసుడనే జీవుడు 17 పదిహేడు తత్వములచే కూడినవాడు అంతరవ్యవహారముచేయుచున్నవాడు యీఅంతరేంద్రియవ్యవహారికుడైన జీవుడే జ్ఞాత సునీలమైన హంసయనే మనస్సనే బిందువనేపాప ఆమధ్య ప్రకాసించే కళే లింగదేహం. ఈలింగదేహమే జీవకళ. ఈజీవకళే సర్వచరాచర ప్రపంచమునకు బీజమైనది, యీబీజమే జన్మాంకురబీజం యీబీజం పూర్వజన్మమునకు యుత్తరజన్మమునకు యీమానుషజన్మమునకున్ను ననేకజన్మవాసనామయమైనదియు లింగదేహం పంచవింశతితత్వములచేతకూడిన జ్ఞాతయనే బిందువనేకళ, లింగకళ పూర్వరేతస్సు - బిందుకళారూపమై మాతృ జఠరగర్భమందు రేతోస్ఖలనాదులచేతను - నిద్రామోహాసంగమాదులచేతను కైవల్యోపనిషత్ ఆహారనిద్రాభైమైధునానిసమానమేతత్ పశుభిన్నరాణాం జ్ఞానంన్నరాణాం మధికో విశేషః। జ్ఞానె నహీనః పశుభిఃసమానః॥ ఆహారము నిద్రాభయము మైధునము ఈ నాలుగున్ను పన్నిజీవులకు సమానమేగాని, మానుషజన్మమునకు జ్ఞాన మధికమైయున్నది. అనంతకోటిజన్మములకు అధికమైనజన్మ మానుషజన్మము విశేషమైన జ్ఞానము ఇది కడసారజన్మము. గావున, యీమానుషజన్మమునకు జ్ఞాన మధికం యీజన్మములో ఆత్మానాత్మవివేకబ్రహ్మజ్ఞానముగల మనుష్మజన్మమే నధికమైన జన్మ. ఇదె ధర్మక్షేత్రమని, కురుక్షేత్రమనియు, మోక్షదాయకమైనదియుగా మనము నజ్ఞానాంధకారజడమైన మానుషజన్మ పసువులతో సమానమేకదా - అనాదిబీజమైన లింగదేహమె వ్యవహారికజీవుడై యింద్రియములచే తానని భ్రమించి నవస్థాత్రయమునందు సంచారముచే

యుచు సింశుమారచక్రంబువలె కులాలచక్రమనగ, కుమ్మరసానవలె ఆసు లోకండివలె జననమరణప్రవాహమునకు కారణమై - జన్మాంకురబీజమై - ఆవరణ విక్షేపనామరూపంబు లనేకంబులుదాల్చి చరాచరాత్మకమైన ప్రపంచమునందు యభిమానముంచి తానే కర్తయై - శయ్యనునుండియు పెక్కు దేశముల దిరుగఁ గల గాంచుచున్న నిద్రితుభంగి దానయ్యుసచ్చిదానందమయు దాజననమరణబాధలబొందినట్లుంట - భ్రాంతిగాదే యని నారదపురాణమందు చెప్పియున్నది.

వేదశృతి॥ మంత్రపుష్పం పద్మకోశప్రతీకాశం। హృదయంచాప్యధోముఖం అధోనిష్ట్యావితస్త్యాంతు నాభ్యాముపరితిష్ఠతి॥

కంఠమునకు అధోభాగమున నాభి కూర్ధ్వభాగమునకు మధ్యను ద్వాదశాంగుళపరిమాణభాగమందు అధోముఖమై ముకుళితమై తామర మొగ్గవలె హృదయకమలమున్నది. ఆహృదయకమలమందు జీవాత్మయున్నది. ॥రాజరాజేశ్వరియోగము॥ భృగోస్థానే. అధఃపద్మం - ద్విదళంతత్రశోభితం - హంతుంత్యక్షరసంయుక్తం॥ యనియు ॥రాజరాజేశ్వరీయోగం॥ చక్షోర్మధ్యేస్థితం గుహ్యం - అంగుష్ఠ పరమాత్మకం - తదర్ధం చాపి సర్వార్థం తస్మాగ్రేసూక్ష్మకం ధృవం॥ ఉచ్యతే చెప్పుచున్నవి. భూమధ్యస్థానమందు నధోముఖముగ హృదయకమలమున్నది. ఆకమలమధ్యమందు హంతుంబనే రెండు జీవాక్షరములున్నవి. త్రినేత్రమధ్యమందు రహస్యమైనది అంగుష్ఠపరిమాణమందు - పరమాత్మ నివసించియున్నది. తన్మధ్యను - సూక్ష్మమైన బ్రహ్మరంధ్రమున్నది ఆబ్రహ్మరంధ్రమధ్యను - బ్రహ్మకళాస్వరూపమైన ఆత్మయున్నది. అట్టిఆత్మ - జీవబిందుకళాస్వరూపమై లింగదేహియై వ్యవహారకుడై దేహేంద్రియాభిమానియై నుత్పత్తిస్థితిలయములకు కారణమై జననమరణప్రవాహమునకు హేతువై యున్నది. ॥వేదశృతి॥ మంత్రపుష్పం॥ జ్వాలమాలా కులంభాతి విశ్వస్యాయతనం మహత్ - సంతతగ్ంశిలాభిస్తు లంబిత్యాకోశసన్నిభం తస్యాతే సుషిగ్ంసూక్ష్మం తస్మిన్‌త్సర్వప్రతిష్ఠితం తస్యమధ్యేమహావహ్ని ర్విశ్వార్చిర్విశ్వతోముఖః ఇత్యాదివేదప్రమాణంబులు చెప్పుచున్నవి గావున ఆహృదయపుండరీకపురమధ్యస్థిరముగ నాశ్రయించి ననేకమైన చిత్కళాజాలావళులచే ప్రకాశించు- ననేకమైన నాడీసమూహములతో గూడుకొని లింగదేహియనేజీవునకు ముఖ్యస్థానమై ॥శంకరహృదయం॥ హృదయకమలమధ్యేజ్యోతిరానందరూపం భృగియ

విదళమధ్యే హంసమూర్గానరూపం॥ యనియున్నది. ఆహృదయకమలం వికశిత మైన-సూక్ష్మమైన-యొకకనులమున్నది. ఆహృదయపుండరీక కమలమధ్యమందు సర్వాంతర్యామియైన ఆత్మప్రతిష్ఠింపబడియున్నది. దానినడుమ ఆజీవాత్మ పైచెప్పిన ఆహార, నిద్రా, భయ, మైథున, మోహ- రేతోస్ఖలనాదులచేత అధోముఖమై శృతి॥ శంకరవిజయమందు, నాభికమలమధ్యేజ్యోతిరానందరూపం॥ యనియున్నది. నాభికమలమనే పద్మకోశమందు జఠరగర్భమందు సర్వత్ర ప్రజ్వలించే జఠరాగ్నియున్నది. యీజఠరాగ్ని వైశ్వానరుడుయనే యగ్నితత్వమున్నది. ఆజఠరగర్భమందు జీవాత్మయనేలింగదేహి బిందుబీజమై పూర్వరేతతస్కుడైన నాత్మఅధో రేతోబిందురూపుడై ఆజఠరాగ్నియందు తానుభుజించిన యన్నము నాయాభాగములలో విభజించుచు పూర్ధముగను నడ్డముగ క్రిందుగ నున్నది. అధోముఖముగ యీనాభికమలం తామరమొగ్గవలె నధోముఖముగ నున్నది. యీనాభికమలమధ్యనున్న వైశ్వానరుడనే అగ్నిహోత్రము యొక్క కిరణములు పాదాదిశిరఃపర్యంతం వ్యాపకన్యాసముచేత యోగాభ్యాసము చేయు మహాయోగులు యోగధ్యానాదిసత్కార్యములు జేయువారును యోగసిద్ధిగలిగి యీహఠరాజయోగమర్మధర్మములు దెలసి కొందరు స్వర్గాదిపదవులను గోరి వుత్తమజన్మము కోరుదురు. ఆజన్మములయందు భోగరాగాదులయందు ఆశచేత యీజీవాత్మయొక్క స్థానమర్మమునకే ఆశించి జననమరణ ప్రవాహములకు లోనగుచుందురు. రాజతారకహఠరాజయోగులు యీజీవాత్మనే పరమాత్మ-జీవాత్మయొక్క స్థానమర్మధర్మ నిజనివాస స్వరూపములను తన్నుతా దెలిసి జీవబ్రహ్మైక్యజ్ఞానమును దెలసి జరామరణవర్జితులై దేహకాంతిగలిగి కాయసిద్ధులై యోగశిద్ధులై స్వనాత్మానుభవమున సమాధిపరులై యుందురు. వేదశ్రుతి॥ తస్యమధ్యే-వహ్నిశిఖా అణీయోర్ధ్వావ్యవస్థితః॥ నీలతోయదమధ్యస్తా- విద్యులేఖేవభాస్వరా॥ కాబట్టి ఈజఠరాగ్నికి మధ్యను ఊర్ధ్వముఖముగా- నతిసూక్ష్మములైన నగ్నిజ్వాలలు అనగ యనేకములైన చిత్కళలు నూర్ధ్వముఖముగ ప్రజ్వలించుచున్నవి. అవినల్లని మేఘములోని మెరుపువలె ప్రకాశించుచున్నవి. అనగభ్రూమధ్యస్థానమందు యీకాశహంశమైన సునీలమైన హంసయె మనోబిందువమధ్య ప్రకాశించేదేమెరుపుతీగ. ఆమెరుపుతీగనే విద్యుత్తులేఖయనియు, విద్యుశ్శక్తియనియు వేదశ్రుతి॥ నీవారసూకవత్తన్వీ పీతాభాస్వత్యణూపమా తశ్యాశ్శిఖాయా మధ్యేపరమాత్మే వ్యవస్థితః

సబ్రహ్మ సశివస్సహరిస్సేంద్రి సోక్షరః పరమస్స్వరాట్. ఇత్యాది వేదప్రమాణంబులు చెప్పుచున్నవి. నీవారధాన్యములముల్లువంటి సూక్ష్మమైన నీలవర్ణమై అణువుతో సమానమైయున్నది. దాని శిఖామధ్యమందు పరమాత్మ డున్నాడు. ఆపరమాత్మయే బ్రహ్మయు రుద్రుడు విష్ణువు ఇంద్రుడును నాశరహితుడు కూటస్థుడు సర్వసాక్షి ప్రత్యగాత్మ ఆకళలోనిమ్క్లై పరమాత్మ. అన్నిటికిని కారణుడు స్వతంత్రప్రకాశుడు ఇద్యాది వేద వేదాంగములు ఘోషించుచున్నవి. వేదశృతి॥ జీంతద్బ్రహ్మ - వర్ణత్రియాత్మకమైన అకార ఉకార మకారములు మూడూ కలసి బ్రహ్మప్రణవమైనది. ఈహోంకారమే॥ శృతి॥ ఓంతద్వాయుః॥ యీబ్రహ్మప్రణవమే వాయుస్వరూపం శృతి॥ ఓంతదాత్మా॥ యీం బ్రహ్మప్రణవమే ఆత్మస్వరూపం॥ శృతి॥ ఓంత్రిసత్యం॥ ఈబ్రహ్మప్రణవమే సత్యస్వరూపం॥ శృతి॥ ఓం తత్సర్వం॥ సర్వకారణ స్వరూపమైన బ్రహ్మణవమే॥ శృతి॥ ఓంతత్పుర్ణోర్నమః॥ యాబ్రహ్మప్రివాత్మకమైన తచ్ఛబ్దవాచ్యుడైన ఆత్మస్వరూపుడైన భగవంతుడు సమస్తభూతములయొక్క హృదయగమలయందుండువాడున్ను॥ శృతి॥ అంతశ్చరతిభూతేషు॥ గుహాయాం విశ్వ మూర్తిషు॥ శ్రీశైల కుహరములయందుండు వాడున్ను అంతర్ బాహ్యహృదయములయందుండువాడును, సర్వమూర్తిత్రియాత్మకుండై॥ శృతి॥ త్వంయజ్ఞస్త్వం వషట్కారస్త్వమింద్రస్త్వం॥ రుద్రస్త్వం॥ విష్ణుస్త్వం॥ బ్రహ్మస్త్వం ప్రజాపతిః॥ యజ్ఞస్వరూపుడై వషట్కారస్వరూపుడైన యింద్రుడై రుద్రుడై విష్ణుడై బ్రహ్మస్వరూపుడై ప్రజలపాలించుచున్నాడని సర్వజగస్వరూపుడైయున్న పరమాత్మ సర్వాంతర్యామియైయుండెను॥. శృతి॥ త్వంతదాప॥ ఆపోజ్యోతీరసోమృతంబ్రహ్మ॥ భూర్భువస్సువరోం॥ ఇత్యాదిశృత్యర్థః॥ స్వయంప్రకాశమానంబైన పరమాత్మయైన నీవు॥ శృతి॥ వన్మధ్యే కురుచాత్మానం॥ ఉత్తరగీత॥ తనయందు హృదయాకాశమధ్యమందు ఆపోజ్యోతిస్వరూపంబై అమృతస్వరూపుడై మృతిలేనివాడై బ్రహ్మస్వరూపుడై భూలోక భువర్లోకరూపుడై - బ్రహ్మప్రణవమేకాక్షరస్వరూపుండై॥ వేదశృతి॥తద్విష్ణోః పరమంపదంసదాశ్యంతి సూరయఃదివీవచక్షురాతతమ్॥యని ఇత్యాదిశృత్యర్థ॥బ్రహ్మవిద్వరిష్టులైన విద్వాంసులకు జ్ఞానదృష్టిచేత అనగ అంతరదృష్టిచేత పరమపదమైన యామోక్షపదము విష్ణుపదము అంతరిక్షమందున్న నాటకదీపమువలెతానుసాక్షిగ నెల్లప్పుడు సర్వేశ్వరప్రపంచకము చూచుచున్న దృష్టమై సవస్త్రాత్రియసాక్షియై ప్రస్తానత్రి

యములకు విలక్షణమైన తాను-సృష్టిస్థితిలయములకు విలక్షణమై విరాట్టుస్వరూపుడైన పరమాత్మయొక్క యేమోక్షపదమై తెగలదో, అట్టిపరమపదమును బొందుదురు. యదార్థస్వరూపమైన సత్యస్వరూపుడు శ్రేష్ఠమైనవాడు విశ్వాకారుడు విశ్వమే నేత్రముగలవాడు ప్రపంచాకారముగలవాడు ఊర్ధ్వరేతస్తుడైన పరబ్రహ్మస్వరూపుడు నైనపరమాత్మ యీపరమాత్మే తాను- తానే-సర్వాంతర్యామైన పరిపూర్ణుడు లింగదేహరహితుడు. యీలింగదేహరహితమే హృదయగ్రంధిరహితము జీవన్ముక్తి. యీజంగమస్థావరాంతకమైన ప్రపంచమునువేకమేవ॥ తానొక్కడైయీప్రపంచస్వరూపమైనపరమాత్మ॥ శృతి॥ సర్వగం సమస్తయిదు అద్వైతం॥ అద్వితీయంబైనదియు సదా॥ యెల్లప్పుడుభిన్నం॥ భేదములేనిదై సదా యెల్లప్పుడు వర్తతే ఉన్నది. శృతి॥ యీసర్వచరాచరజంగమస్థావరాంతకమైన సర్వప్రపంచకము శృతి॥ ఈశావ్యాశోపనిషత్॥ యథాజలేబుద్బుదః ఉత్పద్యంతే విలయంతేచ తథా వృత్తివాంఛ ప్రమాదేన ఉత్పద్యంతే విలీయంతే సంశయః నాస్తి- కింకరిష్యామి॥ భావార్థః॥ కింకరిష్యామి ఏమిచేయగలను, యథా-ఎట్లు, జలే- నీళ్ళయందు, బుద్బుదః-నీటిబుగ్గలు, ఉత్పద్యంతే-పుట్టుచున్నవై, విలయంతేచ - కలసిపోవుచున్నవో, తథా- ఆప్రకారము, వృత్తివాంఛ- సంసారవ్యాపారముగలవారు, ప్రమాదేన- మరుపుచేత, ఉత్పద్యంతే-పుట్టుచున్నారు, విలీయంతే-చచ్చుచున్నారు సంశయః-సంశయము, నాస్తి-లేదు. బ్రహ్మోపనిషత్॥ సర్వారాఖ్యంమేత్ సూక్ష్మాత్ సూక్ష్మతరం ఏకపరం మనోబుద్ధీంద్రియాతీతం అకలంకః జగత్పతిః॥ భావార్థము॥ నామరూపాత్మకమైనది లేనిదియు. సూక్ష్మముకన్న సూక్ష్మమైనదియు నవగ పరమాణువుకన్నా నణువైనదియు పరమశ్రేష్ఠమైనదియు మనస్సు బుద్ధి ఇంద్రియములు దీనికన్న నధికరించినదియు కళంకము లేనిదియు నైన పరమాత్మ ప్రపంచమునకు ప్రభువు. ఆపరబ్రహ్మము నేత్రేంద్రియములకు గోచరముగావున దానికి చలనమెట్లుకలుగును. నీవును చరాచరాత్మకప్రపంచమెట్లు పరబ్రహ్మముగదువు. మనుశృతి॥ జలే కటుత్వంచ గాఢ్యంచ మృదుత్వంచ-యథా తద్వత్ ప్రకృతే పురుషః అభిన్నం మే ప్రతిభాతిభవతి॥

భావార్థము॥ ప్రతిభాతి తెలియవచ్చుచున్నది. మే-నాకు, భిన్నం-యభేదముగా, ప్రకృతే-ప్రకృతికంటె అనగ పరమాత్మకన్న, పురుషః-పురుషుడు

జలే-నీళ్ళయందు, కటుత్వంచ-కారమగుటయు, గౌళ్యంచ-గౌళ్యమును, మృదుత్వంచ- మెత్తనితనమును, యథా- ఏప్రకారమో, తద్వత్- ఆప్రకారమే యనగ కారముతోఁగూడిన జలము చల్లదనముతోఁగూడిన జలము మెత్తనితనముతోఁగూడిన జలము యెట్లుశుద్ధజలముకన్న భిన్నముగాదో యట్లే ప్రకృతికన్నా యనగ పరమాత్మకన్నా పురుషుడు జీవాత్మ భిన్నముగాదని వేదశృత్యోపనిషత్తులు ఘోషించుచున్నవి.

సమాప్తము.



# శ్రీ మహాఋషి నిఘంటికృత యోగశాస్త్రము.



## ఆత్మారామాయణము.



### సీతాదేవి ఆంజనేయులవారికి, శ్రీరామహృదయమనే, ఆత్మారామాయణమునకు అంతరార్థము బోధించుట.

అయోధ్యాపట్టణమనే భ్రూమధ్యస్థానమందు సచ్చిదానందాపరోక్షసాక్షాత్కారమనే పరబ్రహ్మమను దశరథుడుగలడు. అతనికి ముగ్గురుభార్యలుగలరు. అగ్నిహంశమైన కృష్ణవర్ణమైన తమోగుణమైన క్రియాశక్తియనే కైకయును పృథివిహంశమైన రక్తవర్ణమైన రజోగుణమైన యిచ్ఛాశక్తియనే సుమిత్రయును ఆకాశాంశమైన- సునీలమైన యనగ శ్వేతవర్ణమైన జ్ఞానశక్తియనే కౌసల్యాదేవియును యీమువ్వురుభార్యలుకలరు. ఈమువ్వురిలో నాకాశాంశంబైన సునీలవర్ణమైన జ్ఞానశక్తియనే కౌసల్యాదేవి పద్మకోశంబనే జఠరగర్భమందు బ్రహ్మస్వరూపుడైన నిష్కళాస్వరూపుడైన ఆత్మారాముండనే శ్వాసనిశ్వాసరూపంబైన 2,600 దళ హంసలచేతకూడిన మనస్సనే శ్రీరామమూర్తిన్ని శ్వేతవర్ణమైన జలతత్వమైన బుద్ధియనే శత్రుఘ్నుడున్ను కౌసల్యాదేవి హృదయగర్భమందు జన్మించిరి. అగ్నిహంశమైన కృష్ణవర్ణమైన తమోగుణమైన క్రియాశక్తియనే కైక జఠరగర్భమందు చిత్తమనే భరతుడు జన్మించెను. పృథివిహంశమైన రక్తవర్ణమైన రజోగుణమైన యిచ్ఛాశక్తియనే సుమిత్రి జఠరగర్భమందు అహంకారమనే లక్ష్మణుడు జన్మించెను. ఇది అంతఃకరణచతుష్టయము. అట్టి పరబ్రహ్మమనే దశరథుని కుమాళ్ళు శ్రీరామమూర్తి ఆబ్రహ్మముతానై ఆకళతానై శ్రీరామమూర్తియై యవతరించెను. ఆపరబ్రహ్మమైన శ్రీరామమూర్తి తన్నుతానురచి శృతి॥ బ్రహ్మణోరవ్యక్తః అవ్యక్తాన్మహతః మహతో అహంకారః అహంకారాత్ పంచతన్మాత్రాణి పంచతన్మాత్రేభ్యః పంచభూతాని- పంచభూతేభ్యో నిఖిలం జగత్ ॥ ఇత్యాది వేదశృతిప్రమాణంబులు చెప్పుచున్నవి. ఈయర్థమును అధ్యాత్మతత్వపరముగా దెలియవలెను.

అవ్యక్తః॥ తెలివి మరచినవాడైన తన్ను తా మరచినవాడై తాను పర బ్రహ్మమనే జ్ఞానం మరచినవాడై అనగ అవ్యక్తమనే ఆకాశాంశంబైన సునీలహంసయనే హంసయనే మనస్సనే బిందువనే జ్ఞాత 26 దో వాడై పంచవింశతితత్వాత్మకుడై సర్వేంద్రియసమన్వితమై గీతాభాష్యే॥ క్షేత్రజ్ఞంచాపి మాంవిద్ధి సర్వక్షేత్రేషుభారత॥ యని చెప్పియున్నది. వ్యావహారికజీవుడు జీవకళాస్వరూపుడైన క్షేత్రజ్ఞుడైన జ్ఞాతయనేజీవుడు వ్యావహారికజ్ఞానమనే భాల్యావస్థచేత సస్వరూపజ్ఞానమును మరచి తన్ను తా మరచి॥ శృతి॥ ఇచ్ఛామాత్రప్రభుస్సృష్టిః॥ కామిగాక మోక్షకామికాడు యనునట్లు దేహేంద్రియ ప్రపంచంబునందు యభిమానముంచి అధోముఖుడై, భజగోవిందశ్లోకం॥ పునరపిజననం పునరపిమరణం పునరపిజననీ జఠరేశయనం యిహసంసారే బహుదుస్తారే కృపయాపారే పాహిమురారే॥ యనునట్లు పంచవింశతితత్వాత్మకుండై దేహేంద్రియప్రపంచంబునందు నభిమానముంచి జీవజ్ఞప్తి తానని భ్రమించి యిరువదియొదవవాడైన॥ శృతి॥ ప్రజ్ఞానం బ్రహ్మమని ప్రజ్ఞానస్వస్వరూపమైన ఆకాశాంశంబైన శ్రవణమనే వశిష్టోపదేశంబుచేత॥ శృతి॥ గురోర్ముఖేన జ్ఞాతవ్యం అన్యథానోఫలభ్యతే॥ యనునట్లు మరల తెలివితెచ్చుకొని తన్ను తా దెలసి తాను జీవవ్యవహారికప్రపంచంబు తా గానని అంతర్బాహ్యేంద్రియములను నిగ్రహించి వైరాగ్యమనే ప్రత్యగాత్ముడైన లక్ష్మణమూర్తిని వెంటబెట్టుకొని హంసోహమనే విశ్వామిత్రునితో బయలుదేరి షడాధారములనే పర్వతములను గడచి రేచకమనే ధనుస్సు చేతబట్టి కుంభకమనే జ్ఞానాగ్నియనే తీక్షణబాణము నెక్కుబెట్టి దానిచేత యనాదియైన ఆవరణమనే విక్షేపశక్తియనే తాటకిని వధించి యింద్రియమిత్రుండైన మారీచును ఆనందమనే సముద్రములో ముంచివేసి అంతర్బాహ్యేంద్రియములనే బాహుప్రముఖులనే కరకు రక్కసుల ఖండించి దురభిమానమును విడచి అహల్యను గాలితో దన్ని మహా పవిత్రమైన తననిజరూపమును జేసి సహస్రారపురమనే ఏకాంతమనే మిధిలాపురము ప్రవేశించి శృతి॥ సర్వంఖల్విదంబ్రహ్మ సత్యజ్ఞానమనంతంబ్రహ్మ॥ మనే జనకుని దర్శించి యిహాముత్రార్థవిరాగమనే అనగ విరక్తియనే శివధనస్సు విరచివేసి త్రిగుణాత్మికమైన ముక్తికాంతయనే సీతాదేవిని వివాహము జేసుకొని ప్రతిబింబించిన మదమనే పరశురాముని భంగపరచి దహరాకాశమనే సాకేతపురమనే మోక్షము ప్రవేశించి తాను జీవుడుగాడని నిశ్చయించు

కొని జీవభ్రాంతిని విడచి కేవలపరబ్రహ్మానందమనే పట్టాభిషేకమును వహిం పంబూని యిచ్ఛాశక్తియైన చుప్పనాతివలన చపలత్వము సంభవింపగ పరబ్రహ్మమనే దశరథుని యెడబాసి దహరాకాశమనే మోక్షమనే అయోధ్యను వదలి ముక్తికాంతయనే సీతను వైరాగ్యమనే లక్ష్మణమూర్తితో నడువ బయలుదేరి చలచిత్తమనే గంగయమునలనే సరయూనది దాటి ధీనిధియైన గుహుని యాదరణపడసి విక్షేపమనే మహారణ్యమునుదాటి త్రికూటమనే చిత్రకూటమున నిల్చి అహంకారమనే విరాధుని బొలియించి యుచ్ఛ్వాసనిశ్వాసములనే కాకాసురుని కటాక్షించి మనోసంకల్పమనే కన్నుగ్రుచ్చి నిర్వికల్పమనే కన్ను యిచ్చి జీవకళయనే రేతస్సనే నగస్త్యుని నాశ్రయించి ధైర్యమనే అస్త్రమును పరిగ్రహించి కామమనే విరూపియనే జీవభ్రాంతిని నిర్మూలముజేసి అవస్థాత్రియములనే ఆగామిసంచితములనే ఖరదూషణులనుఖండించి యిచ్ఛామాత్రుండైన మారీచు వాదింపగ పృథివిహంసయైన రక్తవర్ణమైన రాజసమనే రావణుడు మాయయనే డంబమనే సన్యాసివేషముతో వచ్చి మాయాశబళితబ్రహ్మమై॥ శ్రుతి॥ యామాసామాయా అనుశ్రుత్యర్థతః॥ యః-యేదైతేగలదో, సః-అది, మా-లేనిది, రావణుడు మాయయనే డంబమనే సన్యాసివేషముతో వచ్చి త్రిగుణాత్మకయై ప్రకృతియనే ముక్తికాంతయనే సీతాదేవిని నపహరించుకొనిపోగా నిష్కళాస్వరూపుండైన బ్రహ్మతేజోమాయాకారంబైన పరబ్రహ్మమనే ఆత్మారాముడు మాయామానుష్యంబు ధరించి సుఖదుఃఖములకు హేతువై దుఃఖమాగంతుకము సుఖము స్వాభావికమని విజృంభించి ఇచ్ఛామాత్రుండైన మారీచు వాదింపగ నతనిని గీటడంచి త్రిగుణాత్మకమైన అనాదిమూలప్రకృతియనే ముక్తికాంతయనే సీతాదేవిని నపహరించుకొనిపోగా యమోఘమనే యావరణవిక్షేపమనే మహారణ్యములో విచ్చలవిడిగా దిరుగుచు ధీనిధియైన వివేకమనే జటాయువును విమలత్వమనే జీవన్ముక్తినొందించి చింతయనే కదంబుని వధియించి నమృతస్వరూపిణియైన జ్ఞానస్వరూపమైన శబరిని గాంచి చతుర్విధసుశ్రూషలు చేయుచు నంతఃకరణపూర్వకముగా పూజించి మనోలయము నొందించి బ్రహ్మైక్యానందమును పొంది వివేకజ్ఞానమనే సుగ్రీవాశ్రంబనే భ్రూమధ్యస్థానమనే ఋష్యమూకంబు ప్రవేశించి అజ్ఞానజడమైన వాలిని ద్రుంచి త్రిగుణాత్మకమైన ముక్తికాంతయనే సీతాదేవియొక్క నిజాంశమును తెలసి హంసస్వరూపుండైన హనుమంతుని బురికొల్పగ సంసా

రత్రియమనే మహాసముద్రమును లంఘించి సంకల్పములనే మనోయింద్రియ ములను లంకిణి ద్రుంచి అరిషడ్వర్గములనే రాక్షసులను మట్టుబెట్టి చతుర్వింశ తియైన ప్రారబ్ధమనే యశోకవనము పాడుచేసి ముక్తికాంతయనే సీతను గని పెట్టి యుచ్ఛ్వాసనిశ్వాసరూపుండైన హంసస్వరూపుండనే హనుమంతుడు త్రిగుణశక్తియైన సీతాదేవిని గ్రహించి ఆత్మారామునియొక్క నిజస్వరూపమై న ముద్రికనిచ్చి శ్రీయాత్మారామునియొక్క నిజవృత్తాంతము నిజరూపమును బోధించి త్రిగుణాత్మికయొక్క సీతాదేవియొక్క ఆజ్ఞ దెలుసుకొని యాగామి సంచితప్రారబ్ధములైన చతుర్వింశతితత్వములనే లంకాపట్టణమంతయు పాడుజేసి హంసస్వరూపుండైన అంజనీదేవికుమారుడు గమనాగమనములుగలవాడైన హనుమంతుడు వాయువేగ మనోవేగంబున ఆత్మారామపరబ్రహ్మముయొక్క సత్తామాత్రంబైన యావరణవిక్షేపరూపంబైన లంకాపట్టణమంతయు దగ్ధము జేసి సర్వేంద్రియసమన్వితమైన ప్రారబ్ధమనే యశోకవనమంతయు పాడుజేసి అలయక సప్తవార్ధులు నావలి కీవలి కొక్కరీతిగా గలయగదాటి ఆత్మారా మపరబ్రహ్మమైన శ్రీరామమూర్తి సన్నిధికిజేరి త్రిగుణాత్మికయైన ముక్తికాం తయనే సీతాదేవియొక్క నిజవృత్తాంతమంతయు వినిపించి ఆత్మారాముండు తా విజృంభించి మరల దెలివిదెచ్చుకొని యజ్ఞానజడమైన జంబుమాలిని నురు ముజేసి సంశయమనే నక్షుని శిక్షించి కూటస్థుండైన విపరీతమనే యింద్రజిత్తు ని దిరస్కరించి జీవభ్రాంతియనే పాశమును ద్రుంచి దశేంద్రియములనే తల లుగ రాజసమనే రావణుని నెదిరించి తిరస్కరించి ప్రకాశించే జ్ఞానాగ్నిని ప్రజ్వలింపంజేసి ప్రారబ్ధమనే లంకను దగ్ధముజేసి జననమరణప్రవాహరూపక మైన సంసారమనే మహాసముద్రమనే వారధిగట్టి నిశ్చలత్వమనే సేతువును గట్టి మనోమారుతములను యేకముజేసి సప్తవారధులు నొక్కపెట్టునదాటి సప్తపర్వతంబులను గచ్చనకాయలవలె నొక్కపెట్టున నెగరవేసితెచ్చి సేతు వును గట్టి సత్పదార్థమైన విభీషణునిచేబట్టి యవిద్యయనే యింద్రజిత్తుని నెది రించి తననిజస్వరూపమును దెలియక సందేహమనే నాగపాశములో జిక్కి సదూప్రపుండైన గరుత్మంతుచే విడుదలనొంది శ్రవణేంద్రియమనే తామసమనే కుంభకర్ణుని సంహరించి అంతర్లక్ష్యమైన వైరాగ్యమనే లక్ష్మణుకు జ్ఞానాస్త్ర మనే లక్ష్మణుడు మూర్ఛిల్లగ హంసస్వరూపమైన హనుమంతుని ప్రోత్సాహ పరచి పునరావృత్తియనే సంజీవిపర్వతమును దెప్పించి వైరాగ్యజ్ఞానమైన

మూర్ఛదేల్చి చిత్పదార్థమైన యింద్రజిత్తును ఘోంకమడచి యాగామిసంచిత ప్రారబ్ధమనే మూలబలమంతయు యోగజ్ఞాన బ్రహ్మాస్త్రముచే నిర్మూలముజేసి షడ్గుణములను నసురులను నాశనముజేసి సద్వాసనలచే అంతరారాముడైన శ్రీరామమూర్తియొక్క పరమభక్తులైన కపిసైన్యములను సంతరించి రేచకమనే బాణము నెక్కుబెట్టి దశేంద్రియములనే పదితలలుగల రావణుని నెదిరించి హృదయగ్రంథియనే లింగదేహమనే అమృతకళలను ఛేదించి దశేంద్రియములనె పదితలలుగల రావణుని సంహరించి ఆత్మారాముండు యింద్రియనిగ్రహుండై అఖండనిర్వికల్పసమాధిపరుండై పరిశుద్ధతత్వాత్మకుండై సహస్రారమందు బ్రహ్మానందమనే అయోధ్యాపురము ప్రవేశించి తాను జీవభ్రాంతిరహితుండై పరబ్రహ్మమనే దశరథుడే తానై స్వయంప్రకాశాత్ముడై ఆత్మారాముకు హృదయాకాశమందు కోటిసూర్యులు కోటిచంద్రులుకు మించి యఖండతేజోమయాకారమై ప్రకాశించుచున్న యంతరారాముడైన శ్రీరామమూర్తి వామభాగమందు జ్యోతిర్మయాకారమైన త్రిగుణాత్మికయైన సీతాదేవిన్ని ఆత్మారాముడైన శ్రీరామమూర్తివారి పాదకమలములయందు యిడాపింగళ నాడులయందు సంచరించే హంసస్వరూపుడైన వాయుపుత్రుండైన మనస్సనే హనుమంతుడున్ను యిరువైయొక్కవెయ్యి ఆరువందల హంసలను గమనాగమనములను బంధించి యెక్కుబెట్టి కుంభించినవాడు లక్ష్మణుడును మనోమారుతదృక్కుల నెక్కుబెట్టినవాడు లక్ష్మణుడు.

సూర్యచంద్రనాడులనే యుచ్ఛ్వాసనిశ్వాసములనే వింజామరలచేవిసరుచున్నవాడు భరతుడున్ను యనుపమోజ్వలమైన రత్నసింహాసనమున నమరగ చిత్కళాసమూహములచేత ప్రకాశించుచున్న సహస్రారమనే రత్నపీఠమధ్యమునందు ఆత్మారాముడు సర్వేంద్రియసమన్వితుడై మునిసమూహములచేత ఆత్మారాముడైన శ్రీరామమూర్తి పట్టాభిషిక్తుడైయుండె నంత—

1. ఆత్మారాముడు శ్రీరాముడు శృతి॥ నిరాకారనిరంజన నిష్కళంక ఏకోనారాయణాత్పరం॥ అఖండతేజోమయాకారంబైన నిర్గుణ సాక్షాత్కారంబైన శ్రీరామపరబ్రహ్మంబు సహస్రారమందు.

2. త్రిగుణాత్మికయగు యనిశము జగములబుట్టింప బెంప సమయింపంగ తగుమూలప్రకృతి జ్యోతిర్మయాకారంబైన కళాస్వరూపం అకారఉకారమకారాత్మకమైన ప్రణవస్వరూపం సీతాదేవియనియు భూమిమధ్యమందున చెప్పబడినది.

3. వాయువహాంశమైన హంసస్వరూపుండైన హనుమంతుడు వాయువేగ మనోవేగములచేకూడిన మనస్సనే అంజనీకుమారుడు ఆంజనేయులు సుషుమ్న నాళము.

4 విష్ణుహాంశమైన యనగ అపరబ్రహ్మాంబుయొక్క హాంశమైన సునీలమైన బిందుకళస్వరూపుడైన దృక్కుస్వరూపుడు లక్ష్మణుడు బ్రహ్మరంధ్రము. 5. అగ్నిహాంశమైన కృష్ణవర్ణమైన త్రినేత్రము భరతుడు. 6. వాయువహాంశమైన నీలవర్ణమైన శత్రుఘ్నుడు. 7. సుషుప్త్యవస్థయై యజ్ఞానజడమైన కుంభకర్ణుడు. 8. పృధివిహాంశమైన రక్తవర్ణమైన జాంబవంతుడు. 9. రావణుడు దశేంద్రియము లనే పదితలలుగలవాడు రావణుడు. 10. అశ్వహాంశమైన శ్వేతవర్ణమైనవాడే సుగ్రీవుడు. 11 విష్ణుహాంశమైన స్ఫటికవర్ణమయిన విభీషణుడు. 12. సూక్ష్మకళాస్వరూపుడైన సునీలహాంశ యింద్రజిత్తు. 13. వశిష్ఠమహాఋషి జగద్గురుస్వరూపంబైన శ్రీమన్నారాయణ మహాదేవగురుడు- పరబ్రహ్మము. తత్ పదార్థమైన అనగ ఆత్మారామపరబ్రహ్మమైన త్వం- నీవు, దత్తాత్రేయగోరక్షసంవాదమందు యీ అధ్యాత్మరామాయణముయొక్క యంతరాభిప్రాయము శ్రుతిప్రమాణములు చెప్పుచున్నవి. ఏకనిరంతరసర్వం శివం భవసి యదిచ తథాఇదం వియదాదిః మృగతోయసమం తవ భవతి- బహుధా శ్రుతయఃప్రవదంతి అంతఃహి తత్ ఉపమేయం ఉపమాచకథంవదామి త్వం ఏకనిరంతరసర్వసివం భవతి యదిచ త్వం నీవు అహం అవిభక్తః విభక్తః విహీనపదం భవతి త్వం- అహం కార్యఃకారణః విహీనపదః భవతి తన- యజనం కథం తపనంచ కథం యట్లు యిత్యాదిశ్రుతిప్రమాణములు చెప్పుచున్నవి.

భావార్థం యెట్లనిన, ఏకనిరంతరసర్వశివం- కేవలుండు నిత్యుండు ప్రపంచస్వరూపుండు నిత్యమంగళస్వరూపుండైన, ఆత్మాః- ఆత్మారామపరబ్రహ్మము, భవతి యదిచ- అగుదువైన, తథా- అప్పుడు, ఇదం- ఈ, వియదాదిః. ఆకాశము మొదలైన పంచమహాభూతాత్మకమైన ప్రపంచము, మృగతోయసమం- యెండమావులయందు నీళ్ళవలె, తవ- నీకు, భవతి-అగుచున్నది. అనగ సర్వచరాచరప్రపంచము ఆత్మారామపరబ్రహ్మమునందు యీ ప్రపంచము:—దత్తాత్రేయోపనిషత్తు॥ మృగతృష్ణజలంపీత్వాతృప్తిశ్చేదస్త్విదం జగత్॥ యెండమావులయందు జలములవలెను లేనిదే వున్నట్టుగ తోచినది.

యీ ప్రపంచము మిథ్యారూపకము. బృహదారణ్యోపనిషత్తు॥ యదృశ్యభావనానాస్తి దృశ్యమేవతద్వినశ్యతి॥ సర్వదృశ్యమాన నామరూప ప్రపంచము తయు లేనిదే యున్నట్లుగ పరమానందమయుఁడైన సర్వచరాచరపరిపూర్ణుఁడు అవ్యయుఁడగున శ్రీ ఆత్మారామపరబ్రహ్మమునందు యీత్రిగుణాత్మకమైన నామరూప సర్వచరాచర ప్రపంచమైన మూలప్రకృతి ఆత్మారామపరబ్రహ్మమందు ఆరోపింపఁబడినది — యెండమావులయందు జలముతోఁచినభంగి — బహుదా - పెక్కుతెరంగుల, శ్రుతయః - వేదములు, ప్రవదంతి - చెప్పుచున్నవి. అట్లుండగ, అతఃహి - అందువలననే, తత్ పదార్థం - ఆత్మారామపరబ్రహము, ఉపమేయం మరియొకవస్తువతో సరిపోల్చుటది గానివాఁడు, ఉపమేయం - ఉపమాన ఉపమేయములకుతగినవాఁడుగాఁడు. అతీతుఁడు విలక్షణుఁడయిన రెండవయర్థము. అనగ తనతో ఆత్మారామపరబ్రహ్మముతో సమానమైన వస్తువు మరియొకటిలేదని, వదామి శ్రుతయః వేదములుచెప్పుచున్నవి. కథం - యట్లు, త్వమేవ - నీవే, ఏకం నిరంతరసర్వశివం - తాను వక్కఁడయి ఏకమేవాద్వయంబ్రహ్మము కేవల ఆత్మారామపరమాత్మస్వరూపమై, నిత్యమంగళప్రదాయకుండు సుఖదుఃఖములు లేనివాఁడు అమృతుఁడు నశించనివాఁడు, అవ్యయః - వ్యయములేనివాఁడు, నజాయతే - పుట్టనివాఁడు, భవసియదిచ - అగుచువేని త్వమేవ - తాను, ఆపరమాత్మ, అవిభక్తః విభక్తః విహీనపదం - భాగము అభాగము అనగ భాగముగానిదియు అనగ జీవాత్మ పరమాత్మల అనుభేదము లేనిది, భవతి - అగుచున్నది. త్వమేవ - నీవు నిశ్చయముగ, కార్యః కారణ విహీనపదం - కార్యోపాధియైన జీవుఁడు కారణోపాధియైన యీశ్వరుఁడు యీరెంటికి విలక్షణుఁడై, భవతి - అగుచున్నావు. తవ - నీకు, హి - ఏకారణమువలన, అవిలః - విశాలమును విశాల అవిశాలమును, నాస్తి లేవు, సర్వనిరంతర సర్వగతం - ఎల్లప్పుడును సమస్తచరాచరంబుల బొందియుండియు. ననగ సర్వాంతర్యామియు శ్రుతి॥ అణోరణీయాం మహతోమహీయాం॥ సర్వభూతాంతర్యామియై, నిరంతరం సర్వ శివం - యెల్లప్పుడున్ను నిత్యస్వరూపమై సర్వమంగళకరమైన పరమాత్మ యనగ యఖండతేజోమయస్వప్రకాశంబైన సర్వమంగళకరమైన శ్రీశోభాయుక్తమైన స్వయంప్రకాశమానంబైన, సః - ఆత్మారామపరబ్రహ్మమునకు, దినరాత్రిభేదః నిరాకరణం - పగలురాత్రి భేదముగలదియు లేనిదియు వెలుగు చీఁకటి యీరెండునుగాని వాఁడైన. ఉదితానుదిత నిరాకరణం ఆత్మారా

మపరబ్రిహ్మము పుట్టుట పుట్టులేకపోవుట అనగ నజాయతె నమ్రియతె- పుట్టుకవృద్ధిలయములు రెండున్ను గలవాడున్ను, నిరాకరణం- పైరెండున్ను ని రాకరించినవాడున్ను గానివాడును లేనివాడున్ను, నిరాకరణం- నిరాకరించిన వాడయిన, జ్వలతియదిః- ప్రికాశించుచున్నట్టి అష్టెతె, రవిచంద్రిమసోః- సూ ర్యచంద్రులయొక్క, జ్వలనశ్చ-ప్రకాశము, కథం- ఎట్లు, భవతి- కలుగుచున్న ది. స్వయంప్రకాశః- స్వయంప్రకాశమానంబైన, అఖండః- అఖండంబైన, సః- పరమాత్మయయియుండగ సూర్యచంద్రులను యెట్లుప్రికాశింపచేసును. అనగ సూర్యనాడి చంద్రినాడి యనె రెండునాడులను తనయొక్క అనగ బలము చేత పరమాత్మయొక్క ఆత్మబలముచేత ప్రికాశింపబడుచున్నది—కావున తాను తనకుతానె ప్రికాశింపబడును. కేవలఆత్మారామ పరబ్రిహ్మము భవే ద్యది-అగుచువేని, గతకామ వికామవిభేదః- యిహాముత్రార్థఫలభోగవిరాగము గలవాడయి, భవతి- అగుచున్నాడు. బహిరంతర్భిదశ్చ- బయలు లోబైలు యీరెంటియొక్కభిన్నమును, భేదః- భేదముగలవాడై అనగ విభేదః- భేదము లేనివాడై, అస్తి-వుండెను. ఇతి-అనియు, యది- చెప్పబడినట్లయితే, ఏకం- తాన ద్వితీయుడై యున్న, తె- నీకు, జ్ఞానావాశిష్టం వెదక వేద్య నిరాకరణం తెలివి యు గ్రిహించేదియు అనగ యెరుకయు ఆత్మానాత్మవివేకజ్ఞానము అనగ ప్రి జ్ఞానము వేద్య గ్రిహణశక్తియు తన్నుతాదెలియతగిన దానిని త్వమేహం త్వం- నీవె, హం- నేనె, భేదాభేదనిరాకరణం- భేదాభేదములను నిరాకరించి అనగ శృతి॥ నేతి నేతీతి నేతీతి నైశృతిః శేషితంపూర్ణముచ్యతె॥ పంచభూత పం చేంద్రియ జ్ఞానేంద్రియా పంచకోశ పంచవాయువులున్ను॥ శంకరోవాచ॥ అవ స్థాపంచకం॥ నాహందేహోనేంద్రియాణ్యాంతరంగం నాహంకారః ప్రాణవర్గో నబుద్ధిః ధారాపత్యక్షేత్రవిత్తాదిదూరః సాక్షీ నిత్యఃప్రత్యగాత్మాశివోహం॥

ఈ పైచెప్పిన పంచవింశతితత్వములు తాగాక వేరైనవిధము ఇది గాదు అదికాదని సర్వముతాగాదని గడద్రోచి అనగ తన్నుతాదెలసి మిగిలిన శేషపదార్థం పరబ్రిహ్మపదార్థముగా తానుతానె ఆపరబ్రిహ్మమెతానై సర్వవిషయేంద్రియాతీతుడై సర్వముతానై సర్వముతాగాక సత్యం యదార్థ మయినది యని యోగినః- యోగులు, వదంతి- చెప్పుచున్నారు.

అట్టి ఆత్మారామపరబ్రిహ్మమును బ్రిహ్మణోరవ్యవః యనుశృతి॥ శ్రీ యుపనిషత్॥ మహాదాదిజగత్సర్వం నకించిత్ప్రితిభాతిమె బ్రిహ్మైవకేవలం

సర్వం కథం వర్ణాశ్రమస్థితిః॥ భావార్థః॥ మహదాదిజగత్సర్వం- అవ్యక్తమైన మూలజ్ఞప్తికళామాత్రశరీరం అనాది అవ్యక్త మహత్తత్వము మొదలు ప్రపంచమంతయు, మే-తనకు నాకు వేరుగ, కించిత్తు-కొంచెమైనను, నప్రతిభాతి-ప్రకాశింపదు. సర్వం- సమస్తమైన ప్రపంచము, కేవలం- కేవలుండగు, బ్రహ్మైవ- ఆత్మారామపరబ్రహ్మమె, వర్ణాశ్రమస్థితిః- జాతులయొక్కయు నాశ్రమములయొక్కయు, స్థితిః- ఉనికి, కథం- యెట్లు కలుగుచున్నది. మహదాదిసమస్తప్రపంచమంతయును కొంచెమైనను నాకు వేరుగా దోచలేదు. అంతయు కేవలుండయిన ఆత్మారామపరబ్రహ్మమె గావున వర్ణాశ్రమములయొక్క యునికి అనగ సంబంధం యెట్లుకలుగుచున్నది కలుగదనుట. అవ్యక్తనామరూపాత్మకమైన ప్రపంచమునకును ఆత్మారామ పరబ్రహ్మమునకును అభేదః- భేదములేదు, అని వేదవేదాంతోపనిషత్తులు ఘోషించుచున్నవి. ఋభుగీత॥ నిరాలంబం అశూన్యంచ వ్యోమాదిపంచకం శూన్యం సర్వదా సర్వం ఏకః నిరంతరం॥ భావార్థః —

నిరాలంబం- అధీనముకానిదియు లేనిదియు అనగ ఒకవస్తువుతోకూడుట ఒకవస్తువతానుకాకపోవుట, అశూన్యంచ- ఆత్మారామపరబ్రహ్మము శూన్యముగానిదియు నైన వ్యోమాదిపంచకం ఆకాశపంచకం అనగ ఆకాశాద్వాయుః వాయురోరగ్నిః॥

అపః అపఃపృథివ్యాదిజగత్-ఆకాశపంచకమహదాదిభూతములు, శూన్యం-అశరీరమైన పరబ్రహ్మము శరీరములేని పరబ్రహ్మము, సర్వదా-సమస్తవిధములచేత, సర్వం-యీ, విశ్వరూపం-జగద్రూపం-తతోద్వయం॥ అనిన్ని ఆలంబనములేనిదియు ఆవరణలేనిదియు అంతట నిండునదియు నగుపరమాత్మ పృథివ్యాపస్తేజోవాయురాకాశాత్ యీపంచమహాభూతములున్ను అశరీరం సర్వదాచ్ శరీరరహితంసదా॥ గీతావచనమ్॥ ఆత్మారామపరబ్రహ్మము అనే కప్పుకు తెరంగులనుండు విశ్వమంతయు సర్వాంతర్యామియై పరిపూర్ణుండై నిత్యమై కేవలుండైయున్నది. తానైన కేవలాత్మ రామపరబ్రహ్మము రామపదవాచ్యుడు ఆదినారాయణుండైన పరమాత్మ అతనికిన్ని తనకున్ను అనగ ఘటాకాశసమ్యగ్జ్ఞానమైన సర్వేంద్రియసమన్వితమైన విశ్వాకారుడు విశ్వమయుండైన ఘటాకాశమనే జీవాత్మకున్ను మహాకాశమైన ఆత్మారామపరబ్రహ్మమునకున్ను ఆత్మార్థే- ఆత్మార్థమునందు శ్రీశంకరభాష్యమునందు॥ దేహా

దేవాలయప్రోక్తో జీవో దేవసనాతనః॥ అనునట్లు జీవాత్మకు దేహమే ఆలయం ఆవరణ ఘటము. ఈజీవునకు దేహమేఘటము. ఈజీవాత్మే దేవుడు. ఆత్మానం పరమాత్మ అయితే ఘటాకాశంబైన జీవునకున్ను అనగ తనకున్ను ఆత్మానం- పరమాత్మస్వరూపమైన మహాకాశమునకున్ను తానైన ఆత్మారామపరబ్రహ్మమునకున్ను, అభేదం- భేదము లేదని త్రిభాష్యకారకుడైన శ్రీశంకరులవారు వుపనిషత్ భాష్యే॥ ఘటే భిన్నం ఘటాకాశం స్వలీనం కథం భేదవర్జితం భవతి మనసా సార్ధం శివంచత్వమేవ భేదం నప్రతిభాతి నఘటేనఘటాకాశోనదేహే నచ జీవకః కేవలం బ్రహ్మసంవిద్ధి వేద్య వేదకవర్జితం॥ ఘనఘటాకాశ మాకాశాంశమగు తానే జీవాత్మ యీజీవాత్మే పరమాత్మ యీపరమాత్మే తాను తాను తానైన తత్వం బ్రహ్మతత్వం విచారించగ తన్ను తా దెలియగ భావార్థః॥ ఘటె-ఘటమునందు, అనగ దేహం భిన్నం- భిన్నమైన,ఘటాకాశం-ఘటాకాశము, స్వలీనం-తనయందు అనగ ఆత్మారామపరబ్రహ్మమునందు లీనము నొందిన మహాకాశం, కథం-యెట్లు, భేదవర్జితం-భేదము లేనిదియు,భవతి-అగుచున్నదో,మనసా-మనస్సుతో,సార్ధం-కూడికొనియుండు జీవాత్మయు, శివంచ మంగళస్వరూపుండైన,ఆత్మానం-ఆత్మారామపరబ్రహ్మమునకును, మే-నాకున్ను, భేదం-భేదముగలదిగా,నప్రతిభాతి-తోచలేదు, కథం-యెట్లు, ఘటేన-ఘటముచేత,ఘటాకాశః-ఘటాకాశము న లేదో, తథా-అట్లు, దేహేంచ దేహముచేతను, జీవకః-జీవాత్మ, న లేదు, వేద వేదకవర్జితం- తెలియదగినదియు తెలుపువదియు ననువానిచేత యీరెంటిచేత దలపబడిన, కేవలం అద్వితీయుండగు-బ్రహ్మ బ్రహ్మము,స విద్ధి-చక్కగా నెరుగుము. తన్ను దా దెలియుము అనగ జీవబ్రహ్మ భేదము లేని పరతత్వస్వరూపుడవు దేహము లేనివాడు పుట్టుక లేనివాడు నశించనివాడు అయివుండగ భేదమెట్లుగలుగును.

కుండ నొక్కచోటనుంచిన మొడల అందు ప్రతిబింబించియుండు ఆకాశమగు ఘటాకాశమునకును మహాకాశమునకును నెట్లు భేదము లేదో యట్లే మనస్సుతోగూడిన అనగ ఆత్మారామపరబ్రహ్మమునందు అవ్యక్తంబనే అనాది మూలజ్ఞప్తిమైన జీవజ్ఞప్తిమైన సీతాదేవి మూలప్రకృతి మనస్సుతోగూడియుండు జీవాత్మకును పరమాత్మకును భేదము లేదు. ఎట్లనిన ఘటముతోడి సంబంధముగాని ఘటమువలన గలుగుటగాని యింకను నేవిధమైన సంబంధము ఘటాకాశమునకు లేదో అదెట్లనగా ఆకాశము సమస్తప్రపంచము నిండియున్నది.

కాబట్టి మనము కుండబెట్టినచో కుండయందుగాన్పు ఆకాశము ఘటాకాశము ఘటము పగిలినవెంబడినే ఘటాకాశము మహాకాశమగుచున్నది.

సర్వేంద్రియ అంతరేంద్రియ బాహ్యావ్యవహార వ్యాపకుండైన ఆత్మారామపరబ్రహ్మమునకు దేహములోటి యేవిధమైన సంబాధములేదు. దేహము నశించినను జీవాత్మకు నాశనములేదు. తనకు నాశనములేదు. కాబట్టి శృతి॥ జ్ఞానేనజ్ఞేయమాహోక్యపశ్చాజ్జ్ఞానం పరిత్యజేత్॥ అనునట్లు జ్ఞాతృజ్ఞేయములులేని కేవలుండగు పరమాత్మ అనగ ఆత్మారామపరబ్రహ్మము నెరుగును. కాబట్టి బృహదారణ్యోపనిషత్తు॥ వేదాః లోకాః న సురాః న యజ్ఞాః న వర్ణాశ్రమా బ్రహ్మచర్యగార్హస్త్య వానప్రస్థసన్యాసతురీయః॥ న జాతికులె న ధూమ్రమార్గః న దీప్తిమార్గః న పరమార్థ తత్వమేవ బ్రహ్మైక్యరూపం॥ ఇత్యాది భావార్థః॥ వేదాః-నాల్గువేదములు, న-కాదు, లోకాః- పదునాలుగు లోకములును,న కాదు,సురాః-ముప్పదియారుకోట్లదేవతలు, న-కాదు,యజ్ఞాః-దేవయజ్ఞము పితృయజ్ఞము మానుషయజ్ఞము, న-కాదు, వర్ణాశ్రమా-బ్రహ్మ క్షత్రియవిట్శూద్రులనే నాలుగువర్ణములును బ్రహ్మచర్యగార్హస్త్యవానప్రస్థసన్యాసతురీయములను అయిదాశ్రమములను,న-కాదు, జాతికులే- తెగవంశము,న-కాదు,ధూమ్రమార్గః-ప్రకాశమార్గము, న-కాదు, పరమార్థతత్వమేవ-మోక్షార్థమునకునైన జ్ఞానమే, బ్రహ్మైక్యరూపం- ఆత్మారామపరబ్రహ్మము యొక్క కేవలనిజస్వరూపము కాబట్టి నాలుగువేదములు ఆత్మారామపరబ్రహ్మరూపముకాదు. పదునాలుగుభువనములు బ్రహ్మముగాదు. ముప్పదిమూడుకోట్లదేవతలు బ్రహ్మముగాదు. దేవమానుష పితృయజ్ఞములు బ్రహ్మకాదు. బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులును బ్రహ్మకాదు. బ్రహ్మచర్యగార్హస్త్యవానప్రస్థసన్యాసతురీయాశ్రమములు బ్రహ్మగాదు. తెగలు బ్రహ్మకాదు. వంశము బ్రహ్మకాదు. చీకటిత్రోవ అనగ అజ్ఞానమార్గముగాదు. ప్రకాశమార్గము అనగ జ్ఞానమార్గముగాదు. మోక్షసామ్రాజ్యము.

గద్య.

ఇతి శ్రీభీమనిరంజన నిగమాగోచర గురువరకరుణాకటాక్షవీక్షణాయత్తచిత్తచైతన్యజగజ్జేగీయమానప్రకర్షితాత్మికనై సచ్చిదానందగుణగణాతీత వేదవేదాంగ మంత్రిమంత్రార్థ శ్రీమద్గురుపాదుకాపూర్ణదీక్షాపక్షదక్షత్వ శుద్ధనిర్గుణ నిజబోధపరాయణాపారీణ పారాయణధురీణ అజ్జరపు సూర్యనారా

యణాఖ్యవిరాజమాన ప్రభాశితప్రజ్ఞాప్రకర్షితప్రథితనై వేమూ
రివంశపయఃపారావార రాకాసుధాకరస్య కౌండిన్యసగో
త్రి వీరయభాగమాంబాగర్భ కనిష్ఠజనితహారితసగోత్రి
సౌభాగ్యవతీ సామ్రాజ్యభోజ్య విద్యోపాసనావర
ప్రసాదకవనాకవిత కాట్రావులపల్లి సూర్యనా
రాయణయోగినీ ప్రణీతంబగు శ్రీమహాఋ
షినిఘంటితయోగశాస్త్ర బ్రహ్మవిద్యా
యాం లింగదేహయోగము
ఆత్మారామాయణము
ఏకాదశప్రకరణము
సమాప్తము.



# శ్రీ మహాఋషి నిఘంటిత యోగశాస్త్రము.

## ద్వాదశప్రకరణము.



## మనోసూత్రము.



—॥ వైవస్వతమనువు ఇక్ష్వాకునకు మనోసూత్రము బోధించుట. ॥—

మంగళప్రదమగు పూర్వపండితులకును, పరమేశ్వరునిభక్తికిని, యోగసిద్ధికిని, కైలాసమునందుండు ప్రమదాదిగణములకును పరమాత్మైక్యానుసంధానోపదేశముచేసిన గురువర్యులకును నమస్కారములు —

మోక్షసంపదానంద నిశ్చయమెరింగి యనుష్ఠించునట్టి మహాయోగులకు భూలోకములోని జనులు ముక్తినొందుటకొరకై పునరావృత్తిరహితమైన మోక్షసామ్రాజ్యమార్గము నుద్ధరించిరి. సంసారబంధమును విడిచి అతిశీఘ్రమున ముక్తిపథమును కరతలామలకముగ నొందజేయును. శరీరమునందు ఆత్మయుండువరకును వాడు యెచ్చటనుండినను సుఖమైనను దుఃఖమైనను మోక్షమునైనను అనుభవించినను వీనికన్నిటికి మనస్సే కారణమైయున్నది. కావున శృతి॥ మనమేవమనుష్యాణాం కారణంబధమోక్షయోః॥ అనిచెప్పబడియున్నది. అనగ బాధమునకును బంధవిముక్తిమైన మోక్షమునకును మనస్సే కారణము. మనంబే స్థూలసూక్ష్మముల్ మాతృమానమేయముల్ మనంబే కామరాగరోషమత్సరాదివృత్తులున్ మనంబే సర్వధర్మముల్ మనంబే బంధమోక్షముల్ మనంబే దృశ్యమంతయున్ గ్రమంబుచే నెరింగినన్— యిట్టిసంకల్పవికల్పములచేత కూడినమనస్సునందుండు యిహపరకోరికలను మొదలైన సమస్తములైన కోరికలును వదలినవారికి తప్ప తదితరులకు మోక్షము గలుగదు. వైరాగ్యములేనివారు కొండగుహయందును సముద్రములయందునను పడినప్పటికిన్ని భూలోకమెల్ల తిరిగి అచ్చటచ్చటగల దివ్యక్షేత్రములలో స్నానము జేసినను పుణ్యక్షేత్రములలోని అర్చావతారవిగ్రహములను దర్శించినను ముక్తి లభించదు. కావుననే శృ॥ తీర్థానితోయరూపాణి దేవాఃపాషాణమృణ్మ

యాః॥ అనిచెప్పబడియున్నది. శృతి॥ సర్వం బ్రహ్మమయం॥ అనగ వైరాగ్యవరు మాత్రమె ముక్తిలభించును. నాలుగువేదములును ఆరువేదాంగములును అరువదిరువదినాలుగు కళలును చదివినప్పటికిన్ని బ్రహ్మపదమును బొందరు.

కావుననే ఇహలోకసంబంధమును వదలి పరమాత్మతత్వవిచారణ చేయుచు రాజయోగియై మౌనమునువహించినవారే పరబ్రహ్మైక్యమును బొందుదురు. శృతి॥ మౌనం నిర్వాసనంచతత్ మౌనాన్ముక్తిః॥ యని యున్నది. శృతి॥ విద్యాంతం బ్రహ్మవిద్యాంతం వా ర్తికాంతమగోచరం సాంప్రదాయరహస్యంచమౌనం నిర్వాశనంచతత్॥ మహాఋషులున్ను మహాయోగులున్ను లోకులందరున్ను మాయలోజిక్కియున్నారని దెలసి పరబ్రహ్మముయొక్క నిశ్చయమును తెలియుటకు ఆత్మ విచారణచేయవలయుననియును ఆత్మవిచారణచేతనే ముక్తిగలుగుననియును కాబట్టి ఆత్మనుయెరుగవలయుననియును ఇదితప్ప అనాదిగానుండు మూలకందమైన కర్మనుగూర్చి విచారించే ప్రయోజనములేదనియును మరియు దానిని దెలుసుకొనుటకును యెవ్వరికిని సాధ్యముకాదనియును బోధించెను. కావుననే శృతి॥ మాయాంవిద్యాచస్వయమేభవతి॥ అని చెప్పబడుచున్నది.

దేహమనే అశ్వర్ధవృక్షమనే ప్రకృతియనే చెట్టుశాఖయొక్క ఆదియును అంత్యమును తెలసికొనుటకు బ్రహ్మదేవునకునైనను శక్యముకాదు. ఆ వృక్షము కొమ్మలు గీ॥ ఊర్ధ్వమూలమదఃశాఖా అశ్వత్థం ప్రాహురవ్యయం చందాంశి యశ్యపర్నానియస్థం వేదసవేదదిత్॥ ప్రకృతియనే అశ్వత్థవృక్షముయొక్క కర్మవాసనయును ఆకుయొక్కచాటునందు ననగ ఇంద్రియములచాటున సకలమైనబ్రహ్మవిష్ణురుద్రాది లోకంబులన్నియు యున్నవి. కాబట్టి యే బ్రహ్మాదులందరును చచ్చిచచ్చి పుట్టుచున్నారు. అట్టిచావుపుట్టుకలకు హేతుర్భూతముగానుంకు ప్రకృతినిదెలసినయెడల పోగడవచ్చును గాబట్టి శృతి॥ మాయాదురత్యయా॥ గీత లు చెప్పుచున్నవి.

ధృతిస్మృతి॥ వ్యాసోనారాయణోహరిః॥ యున్నదిగాబట్టి వ్యాసులవారివంటి మహాయోగి అనగ తన్నుతాదెలసిన మహాయోగి తన్నెవరుపిలచినను బల్కకుండును. తిరుగపిలచినను వున్నాను లేననియైనను చెప్పకవూరకుండును. తెలిసితెలియకయుండును. ఇలనిర్వాసనుని సాటియెంచగలరే తన్నుయెవ్వరుతలచినప్పటికిన్ని తనుప్రదాగాదనియుండును; అట్టియోగి సదా బ్రహ్మై

క్యసంధానము చేయుచుండును. ఈరీతిగానుండు యోగి సాక్షాత్ పరమశి వుడుగా నెచ్చోట గనబడుచుండును. వేదశృతి॥ శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే శివశ్యహృదయంగుః విష్ణుః యిత్యాదిప్రమాణములు చెప్ప బడుచున్నవి.

శృతి॥ వుదాసీనవదాసీనో గుణైర్యోనవిచాల్యతే॥ అని యున్నది. బ్ర హ్మదేవుడు కడుపునకు బంగారముగలవాడగుటచే రోగియయ్యెను. పరమశివుడు బిక్షమెత్తుచు తిరుగుచున్నాడు. విష్ణువు సకలభోగములనను భవించుచున్నాడు. దక్షిణామూర్తి మహాయోగపురుషుండాయె. అర్ధనారీశ్వ రుండు కామాతురుండాయెను. మహాయోగులకు యిట్టిరూపములు గలవుగా బట్టి అట్టిమహాయోగీశ్వరులైనవారు లోకంబున నెవ్వరును లేరు. అట్టి మహా యోగులకు పైనజెప్పిన రూపములు గలిగినదెట్లనగ బంగారుపుచ్చకాయల ను పండించి దానితో కడుపునింపించికొన్నవాడును సన్యాసియై బిక్షమెత్తిన వాడును యువరాజుగా నుండి సకలభోగముల ననుభవించినవాడు మహాత్ము డై యోగసిద్ధిని బొందినవాడు గాబట్టి యింద్రియములకు వశుడై సర్వవిష యములలో దగిలినవాడైనను మనస్సునందు ఆవిషయములను గూర్చి సదా చింతింపక మహాత్ములవలె చింతింపక మహాత్ములుసంచరించుటకు విషయాభి లాషకు కారణములైన సంసారములను విషయములని దెలిసికొని దానిని జ యించుటకు సాదనమహాత్ములైన యోగపురుషులకే తెలుసు. సచ్చిదానంద స్వరూపుండైన పరమాత్మ సర్వదా బ్రహ్మతేజస్సుతోగూడి శాశ్వతుండై యుండును. ముప్పదిరెండు మహాదానంబులను జేసి పుణ్యమును సంపాదించి ఆపుణ్యబలముచేత మనస్సును దీర్ఘవిచారణచేసి మహాదానాదులన్నియు పర మపదప్రాప్తికి సాధనముగావనియు దానాదులన్నియు యిష్టప్రకారములయిన ఫలములన్నియు యిచ్చునవి యనియు దెలిసికొని ఆమీదజ్ఞానదీపమును నమ్మి పునర్జన్మాదులకు హేతువులైన కామాదివైరులను యణగద్రొక్కుచు॥ కా మక్రోధంచ లోభంచ దేహేతిష్ఠతి తస్కరః జ్ఞానరత్నాపహారేణతస్మాత్ జాగ్రతజాగ్రతః॥ కావున శృతి॥ జ్ఞానదేవతుకైవల్యం॥ యని చెప్పుచున్నవి. మా నవశరీరముతో గూడిన భూలోకమందున్నప్పుడే యిహలోకసౌఖ్యమునకు కా వలసిన ప్రయత్నమునకుగాని పరలోకసుఖములకు గావలసిన ప్రయత్నములు గాని చేసికొన్నయెడల జరామరణముగలిగినప్పుడు పుట్టిగిట్టుచుండును. మహా

ప్రళయకాలము వరకైనను ప్రయత్నముచేసి పరమాత్మైక్యముఁగోరుము. లే నియెడల ఈనరజన్మము వ్యర్థమగును గాబట్టి కొందరు తెలివిలేక దేవుడు ఎక్కడనో యున్నాడనియును కైలాసమున్నాడనియు జెప్పెదరు. దేవుడు హంసస్వరూపుడై సత్వగుణమనెడు తెలుపుగోడ వాహనమనెడు షట్చక్రములమీదుగ నెక్కి శరీరమందే సంచరించుచున్నాడు. కావున శ్రుతి। దేవీహంస్యాగణమయీ॥ యని యున్నది. కాబట్టి చీకటిలోఁగల వస్తువును దెలిసికొనువరకును దీపముకావలయునుగాని ఆవస్తువు దొరికినమీదట దీపమునెట్లక్కరలేదో ఆప్రకారమె పరమాత్మసమాగమనముగలిగిన మీదట దేహములతోఁపనిలేదు. పరమాత్మతత్వమును బోధించు గురువులయొక్క చరణములను బట్టి వానిని కోపాదులైన కుక్కలు గురువగుతనకు సద్గతినిజూపు గురువులయొక్క పాదమును విడచినవానిని కుక్కయనే కోపమునకు బాధగల్గి తన్నుతాను దూషించుకొనును. కావున కుక్కయైన కోపమును సంపూర్ణముగా గ్రింగినవాడు—మహాత్ముడు. అహంకారవిసర్జయేత్॥ అహంకారమును విడిచి వెయ్యవలెను. కాబట్టి ఆత్మవిచారణచేసి సర్వంఖల్విదంబ్రహ్మ యనుటను యెరిగినందుచేత సర్వముతానుతానైన వాడే. జీవాత్మయె పరమాత్మయని తెలసినందువలన అజ్ఞానముచేత దేహసూద్రుండాయెను. కాబట్టి జీవునికంటె ఆత్మయనునది వేరొక్కటి కలదని తెలసి మోహబుద్ధిని వదలును. మోహమును వదలినమీదట జీవాత్మపరమాత్మ భేదములు దెలియును. నశ్వరమైన యీనులినవశరీరము యెన్నెన్నివిధములు నుపచరించినను ఒకనాటికి క్రిందపడిపోవును. కాబట్టి శాశ్వతమైన సుఖమునొందుటకొరకు అణవ కార్మిక మాయిక మాయయేకతిరోధానములనెడు పంచములైన మురికిని బోవునట్లుగా చేసికొని భేదబుద్ధి బోగొట్టినయెడల మోక్షముగల్గును. పిల్లియైనది ఎలుకనుబట్టినట్లు అంతటితో తృప్తిపొందక కోడినిగూడా బట్టుటకు ప్రయత్నించును. ఈప్రయత్నమెల్లను నేననెడు మమత అహంకారముచేతనే గలుగుచున్నది. అనగా కొంచెము తెలుసుకొని యూరకుండక మరిమరిప్రయత్నముచేయవలెను. సర్వవిషయములను యెరుగవలయునని యర్థము. కాబట్టి యీలోకంబున గల మనుష్యులు పసువులు మొదలగునవన్నియును బ్రహ్మమని తెలిసినయెడల యెంతమాత్రమును దుఃఖములేక మోక్షమును జెందునుగావుననే సర్వంఖల్విదం బ్రహ్మం బని చెప్పబడినది.

గీతాభాష్యే॥ తేనుగుపద్యం॥ మరియుదధిఘృతము మాసులం దనలంబు కాయకుసుమములందు సౌరభంబు తిలలతైలమట్లు దేజరిల్లు జీవాత్మపార్థివేశ-- పెరుగునందు నేయియును, కట్టెయందు నిప్పును పుష్పములయందు వాసనయును, నువ్వులయందు నూనెయును ఏప్రకారము అడగియున్నదో ఆప్రకారమే మానవశరీరమునందు జీవాత్మ ప్రకాశించుచున్నాడు. ఎట్లనగ. కట్టెను కట్టెనుజేర్చి యజ్ఞమందు అగ్నిప్రజ్వరిల్లజేయుటకు అరణిని- తరుచున్నట్లు తరువగా తరువగా—అగ్నికల్గును కృష్ణశ్రుతి। దారుమధ్య స జ్ఞానోరురుజ్వలప్రిమోక్షసా చారుహృద్గతాక్షరం విరాజితేయథాతథా జ్ఞానమ-దవాస్వ మందభేదకో విధర్యశం గోపరూపకం స్వరూపప్రకాశకం గురుంభజే॥ యిట్లుచెప్పియుండగ తన్నుతాతర్కించుటకు కారణంబు యెట్లనిన, పెరుగునుతరువగ తరువగ నెయ్యిగలుగును. ఆప్రకారమె శరీరమునుగూర్చి విచారింపగ విచారింపగ నిశ్చలతత్వమె పరబ్రహ్మము తానని దెలియును—(శ్రీ)రామహృదయం॥ శివజీవైక్య సమాధియందు విలస్వచిన్మాత్రితత్వంబు దానవలీలంగని ప్రాణ్ణాక్షె పిదరు మాయాసంశ్రుతింజెందినకా దవ్వులకా నేర్చునె యోగి, పాలుపెరుగైదచ్చిగయానవనీతం బికచల్లలో గలయునే నానాప్రకారంబులకా॥ యనునట్లు తనయందు తానేతరచవలయును. శరీరమునందు ప్రకాశించుజీవాత్మ యెట్టివాడని తన్నుతాదెలియునందాక దేవుడు మరొకడున్నాడని భ్రమలుగలుగ చున్నవి. ఇట్లువిచారించి జీవాత్మ పరమాత్మస్థితి దెలిసికొన్నవాడు తా దేవుడని తన్నుతాదెలిసిన మహాయోగులైనట్టివారికి మోక్షము సులభముగా సిద్ధించును. భూమిలోపల చాలాకాలము బ్రతికియుండియు పరమాత్మయెట్టిదని తన్నుతా దెలిసికొనని మూఢుడు చచ్చుటకును పుట్టుటకును జన్మమెత్తినట్లు తలంచును. యెరుకయను పరమాత్మను మరచిపోవుటకు కారణమెయ్యదియో అది యేపరమాత్మలీనమగు స్థలమే పరబ్రహ్మస్థానము.

శ్రుతి॥ రాజరాజేశ్వరీయోగం చక్షోరోర్ధ్వ.ధ్యేస్థితం గుహ్యా అంగుష్ఠపరమాత్మకం తదర్ధంచాపిలసద్వార్ధం తస్మాగ్రేసూక్ష్మకం ధృవం- మంత్రిపుష్పం పద్మకోశప్రతీకాశం హృదయంచాప్యధోముఖం అధోనిష్ఠావితస్యాం తు నాభ్యాముపరితిష్ఠతి, హృదయంతద్విజానీయాద్విశ్వస్యాయతనం మహత్॥ నాభికమలమధ్యేజ్యోతిరానందరూపం, హృదయకమలమధ్యే, సూర్యబింబానరూపం, భృగియువిగళమధ్యే హంసమార్గానరూపం, సగళమిదమయం స్థూల

సాక్షాదిరూపం, సహితరపరం పాతుమాంబ్రహ్మరూపః॥

అని ఈప్రకారము తనయందు తాను, తనుదాదెలసి సమరజ్ఞానభావ ననంతతంబు గలుగ వరము ప్రసాదింపవలయుదేవా యనియు తనయందు నిఖిలభూతములందు నొకభంగి సమహితత్వంబుగా జరుపువాడు యనిభాగవత నార్యోక్తియున్నది. మానుయందు అగ్నిమరగియుండనగునుగాని, అగ్నియందు మ్రానుమణగియుండుటకు శక్యముగాదు. సంసారియైనవాడు (రాజయోగి) మ్రానియందు అగ్నియున్నయట్లు- లోకములనకును తానుండియు కనబడకుండును. మేఘము కప్పినయెడల, సూర్యుని కనుబడక జేయును, చిత్తము అడ్డమైనయెడల సమాధిని జేరుచును. గురువుచెప్పిన విషయములును "ధరణిలోపల నానారుతత్వములకు నవ్వలైయున్నతత్వంబు నెవ్వడెరుగు శిసివుడు గురురూపమున వచ్చిచెప్పకున్న" యిట్లు చెప్పుచున్నవిగాన జ్ఞప్తిదెచ్చుకొనుటకు ప్రతిబంధకములైన మెరుపులు నష్టమైనయెడల మోక్షము గలుగకుండును. సత్వగుణముతోగూడి వర్తించువానికి గురువుతనంతట వచ్చి బోధించును. శృతి॥ హరుడుగురుడై, వచ్చును (యెట్లనగ) నేను నీకొరకునై మేను దాల్చుకుని పూనివచ్చినవాడ పరముదెల్పుటకు మేనుతోనున్నట్లు మరితోచువాడ, యీమేను నాకెప్పుడూలేదన్న నీవుం దేవరకే మేనూనాకుండూనోయన్నాయని ద్విపదార్థములు అచల గ్రంథం చెప్పుచున్నది. కాబట్టి అట్లులేకసామాన్యులు యెన్నాళ్ళువెతకినను సద్గురువును తెలిసికొనజాలరు. లోకమున సర్వమును దెలసిన మహానుభావులు గలరు గాని అతడు అందరికిని కన్నులకు కనబడడు. అవాఙ్మానసగోచరుండైన వాడు బ్రహ్మజ్ఞాని అకర్తయై నిష్కామకర్మఫలమును బొందక నిష్కర్ముడై సంసారమందు దగిలినవాడైనను- ఆలుబిడ్డ లాదిగాగలవారియెడల, విశేషము, ప్రీతినుంచి సదా వారిక్షేమమునే గోరుచు తనగతిని తలంచకుండుట తగను. ఎప్పుడును సంసారములోనుండువాడు, అన్నివిషయములను విషయములనంటినట్లు చూచుచుండవలయును. సర్వమునెరింగిన వేదాంతవేత్తలు విషయసుఖములందు దగులకయుండుదురు. ఆ కర్తలక్షణం జ్ఞానారూఢుడు బాహ్యచేష్టల మనస్సంకల్పుడై చేయునేమైనం బ్రాకృతమట్లు వానిగని తానాచేష్టలే చేయగ బో నల్పజ్ఞుడు వంచనన్ నాదిదలంపుల్ మానకారూఢుడన్ నేనంచున్ ఫలమేమిజేయడు- నిశ్చితలేకుండిన్ అట్లుండును. ప్రతివచనమునందును, బోధించునట్టి విషయమునందును,

గుహా మొదలగు అంధకారములందును, సకలలోకములను, బోధాచార్యుండైన గురువేయాధారమై యుండునుగావున, మంత్రిమాత్రార్థమంత్రాభిధానదేవత స్వరూపంబులను నీకు దాపకేను మెరుగదగు గురి తనకంటె యెద్దిలేదు ఏమి చెప్పుదు శ్రీమహాగురునిమహిమ ఇట్లనే వచనములచేత గురుమహిమనుగూర్చి గొనియాడబడియున్నదిగాబట్టి- పుణ్యకార్యముగాని అకార్యము లోనగూర్చువారికి తెలియనేరదు. ధర్మమును దెలసిన సర్వజ్ఞమూర్తియైన యోగియగువాడు తెలుపవలయును.

భార్యయందును బిడ్డలయందును ధనమునందును విశేషముగా కోరిక గలిగి మోహసముద్రమున మునింగినవారికి పరమపదముగలుగనేరదు. లోకమునందలి సకలాభిలాషలును వదలి మహానుభావుని కృపచేత, శృతి॥ గురోః కృపాః ప్రసాదన మోక్షసంపదలభించును. సద్గురుకృపలేనివాడు యెన్నాళ్ళు యెన్నిగ్రంధములు చదివినను శృతి॥ అనంతశాస్త్రం- బహువేదితవ్యం అల్పశ్చకాలో బహవశ్చవిఘ్నాః యత్సారభూతంతదుపాశితవ్యం హంసోయథా క్షీరయివాంబు మిశ్రిమః॥ అనంతశాస్త్రసారాంశమును అనుభవమును, హంసవలె యనుభవము గ్రహించవలయును. వ్యర్థముగును. అదిసద్గతిగలుగజేయదు. సద్గురువును దైవమని భావించి ప్రకటించును. కావుననే, గురుగీత॥ గురురేకో జగత్సర్వం బ్రహ్మవిష్ణుశివాత్మకం గురుసాక్షాత్ పరబ్రహ్మ తస్మైశ్రీగురువేన్నమః గురోఃపరతరంనాస్తి నగురోరధికం॥ ఇత్యాది శృతులు చెప్పుచున్నవి.

యోగధ్యానాదులు జేయువాడు స్వస్థచిత్తుడై మానము నాశ్రయించియుండునప్పుడు పరులుచూచి తన్ను వెర్రివాడనియు పెండ్లాము బిడ్డలకు కూడుగుడ్డ యిచ్చుటకు చేతకానివాడనియు నిట్లు దూషింతురే యనే సిగ్గుతోగూడి సంసారబంధములో దగులుకొన్నవానికి ఆనందముకలుగదు. గురువుయొద్ద శుశ్రూషాదులు చేయకగాని సిగ్గుబోదు. పరులదూషణను లక్ష్యపెట్టక గురువుకడకు నేగి సద్విషయములను దెలుసుకొన్నవాడు శాశ్వతసుఖము యనుభవించుచుండును. కాబట్టి శృతి॥ పుత్రదారాదిసంసారో యోగాభ్యాసస్యవిఘ్నకృత్॥ అని యున్నది.

ఈలోకంబున తల్లియు, భార్యయు స్త్రీలే గనుక వీరిద్దరికిని భేదంబులేదు. తల్లిని తండ్రి వరించును. భార్యను తాను వరించును. తల్లి ఆలు వీరిద్దరును వొక్కొక్కరికి భార్యలేమొరి. తల్లివలన తానుగల్గి దుఃఖముగలుగు

చుండుటచేత తనభార్యవలన గలుగువారును దుఃఖమును పొందును కదాయని తెలసి సంగమములేకుండుటకు ప్రయత్నించువాడే తత్వజ్ఞానియనబడును. కావుననే శ్రుతి॥ జన్మదుఃఖం జరాదుఃఖం జాయాదుఃఖం పునఃపునః సంసారసాగరందుఃఖం తస్మాత్ జాగ్రితజాగ్రితః॥

దుఃఖం ఆగంతుకము సుఖము స్వాభావికము గావున ఆశయెందాక యున్నదో అంతదాక కర్మబంధమును యవలంబించినవాడే సర్వదుఃఖములను వదలి మోక్షమునొందును. కావుననే శ్రుతి॥ ఆశయాపరమందుఃఖం నిరాశాః పరమంసుఖః, ఆశాబద్ధతేలోకే కర్మణాబహుచింతయే॥ అనిచెప్పబడియున్నది.

పరమాత్మయందలి నాదమును విన్నట్టు యోగి కోరికలయందు దగులుకొనడు.

ఆత్మయందలి కళలే తత్వము బ్రహ్మము యనబడును. మహదహంకారబీజభూతముల ప్రకృతియను పరాశక్తిబిందువు యనంబడును. బిందువునందు బుట్టిన చతుర్విధవాక్కుల ధ్వనిసమూహము నాదమనబడును. క్షేత్రజ్ఞుడు చైతన్యుడు జీవుడు యను నామధేయంబులు కళలు యనంబడును. వీని కతీతమైనది బ్రహ్మమని చెప్పబడును. శ్రుతి॥ బిందునాదకళాతీతం యస్థంవేదసవేదవిత్॥ చెప్పబడియున్నది.

వస్తువుండేచోటు వెతకినయెడల కనబడునేగాని వస్తువులేనిచోటు వెదకినయెడల యేమియు కనబడదు. మరియు వెదకినను ప్రయోజనములేదు. ఇంతేగాక నిజముగా వస్తువుండేయెడల దానిని దెలిసికొనుటకు పాతాళాంజనము మొదలగునవి సాధనములు అవస్యములేదు. అప్రకారమే నిజముగా పరమాత్మను దెలియజేయు యోగికి శిష్యుడు శుశ్రూషచేయనక్కరలేదు. వస్తుతత్వమెరింగిన మహాత్ముడు తానే శిష్యునకు కనంబడి బొందును.

గురువుయొద్ద బ్రహ్మమును యెరిగినప్పటికిన్ని శాశ్వతమైన మోక్షము గలుగదు. ఎందుచేతననగా తనకు తెలియునని పరులు తన్ను బాగడుటదలచి నేను బ్రహ్మము నెరిగితినని చెప్పుకొనుటచేత గురుబోధము వ్యర్థమగును. కాబట్టి బ్రహ్మమును దెలిసినయోగి తనలోనె భావించుచు పరులకు దెల్పకుండును. శ్రుతి॥ మనసా మనఆలోక్యస్వయంవిద్యంతియోగినః॥ అని చెప్పబడియున్నది.

చెట్టునందు అగ్నియున్నను అది ఆచెట్టునకు తెలియదు. ఆప్రకార మే మనుష్యులలోను యోగియగువాడుండును. ఆయోగిని సామాన్యులగువా రు తెలిసికొనజాలరు.

శరీరమనే అండంబునందు మహాకాశమను అపరిభిన్నాకాశమున్నది. దానిని విభజనముజేసి ఆకాశమువలె తాను మిథ్యాభూతమని తెలిసికొన్న మీాదట అది మహదానందమును కలుగజేయును. ఆమార్గమున బోవునట్టి వానికి నిశ్శబ్దము నిష్ప్రపంచము సత్యము అక్షరము అను బ్రహ్మ మనబడు ను. శృతి॥ శరీరం వ్యాపకం వ్యోమం॥ యనియు, ఆకాశోహ్యవకాశశ్చ ఆ కాశవ్యాపితంచయత్॥ ఆకాశస్యగుణశ్శబ్దో నిశ్శబ్దో బ్రహ్మముచ్యతె॥ అని యున్నది.

కొందరుగురువులు శాస్త్రమునుచదివి, సామవేదమందు అహం బ్రహ్మా స్మి మొదలగు వాక్యములను నుచ్చరించినను ఆబ్రహ్మముయొక్క ఉనికి దెలి యకున్నయెడల ప్రయోజనము గలుగదు. అట్టివాచాబ్రహ్మమును బోధించు శాస్త్రగురువులు లక్షణములు సకలతత్వార్థములు నెరిగిన పరమాచార్యునకు దెలియునుగాని సామాన్యులకు దెలియక మోసపోవుదురు. గురువులుచెప్పిన పరమరహస్యవాక్యమును మనస్సుచే చింతించి, తెలిసికొనవలెను. అట్లు చింతించి తెలసినజ్యోతి మనంబునందు లీనమగును. ఇట్లు లీనమైన జ్యోతికి కారణభూతుండెవడో వానినిచక్కగ దెలసుకొనినవానిని, ఆపరమాత్మను భావించుచుండును. వాడు మహావేదాంత వేద్యుడగును. శృతి॥ అనాహతస్య శబ్దస్యయోధ్వనిః- నాదశ్యాంతర్గతంజ్యోతి జ్యోతిరంతర్గతంమనః- తన్మనో విలయంయాతి- తద్విష్ణోం పరమఃపదం॥-

తానేబ్రహ్మమని తెలియకయు, సర్వమును బ్రహ్మమయంబని తెలసి కొనకయు లోకంబులో గనంబడు రాళ్ళు- రప్పలు- మొదలగునవి మాత్రమే దైవమని తలంచుచు నుండువాడు గుళ్ళుకట్టించినను దేవతార్చనలు చేసినను మాత్రమే ఫలంబుగలుగునని, యెంచియుండును. ఇట్లు తలంచుట జ్ఞానంబు కరతలామలకంబగును. అంతవరకేయని తెలియవలయును. జ్ఞానియైనవాడు ధర్మకర్మములు తనకు ప్రయోజనము నొసంగునవి కావనియును అధర్మకర్మ ములు మరలమరల పునర్జన్మము కలుగజేయుననియును, దెలసి సదా అహం బ్రహ్మాస్మి భావన చేయుచుండును. కావుననే—అహం బ్రహ్మేతి మాంధ్యా

మె దేశాగ్రమనసాసకృత్॥ యని యున్నది.

కావున, సర్వకాలము సర్వత్ర వ్యాపించియుండు పరబ్రహ్మమును మనస్సున చింతించువాడు ముక్తిని పొందును. కాబట్టియే, సామవేదము॥ అహం బ్రహ్మాస్మి॥ యతంమోక్షధ్యేయం మహాత్మభిః॥ యని యున్నది.

ఆలుబిడ్డలనెడి సంసారమనెడు అంధకారములో బడియుండక జన్మము నెత్తినదానికి ప్రయోజనమేదో దానిని దెలుసుకొని మహదహంకారంబైన మాయాసంసారమునువీడి, యీమహానుభావులు కనబడుటయరుదుగానున్నది- కాబట్టి- యోగియనువాడు యితరులకు వెర్రివానివలెను పోమరివలెను గనబడు ను. అట్టియోగిని జ్ఞానముగలవారు యోగము దెలసినవారు- తమలోఁదాము తర్కించిచూచిరేని- యతడే ఆపరబ్రహ్మమె తానని ఆయోగియు తమవంటి యోగియనిగాని, లేక ఆతడును పరమాత్మయనిగానిదెలసి ఋగ్వేదము॥ అయ మాత్మాబ్రహ్మ॥ యని యెరుంగుదురు. హఠయోగమును సాధించువాడు వజ్రోలి మొదలగు కొన్నిటిని- యోగసాధనము నిమిత్తము చేయును. ఇట్టి వజ్రోలి సహస్రోలి అమరోలి మొదలగువానికి యువతి ఆవస్యకమై యున్నది- ఇవి అన్నియు యోగసమాధివిషయములను- చక్కగ నెరింగిన మహాత్మునకు అవస్యకములేదు. ఇట్టి మహాత్మునకు కుండలీయోగము చక్కగ దెలసియును కుండలిని నిద్రమేల్కొనజేయునట్లు చేయుశక్తిగలయో గీశ్వరుని శరీరమునందే వానియందె తనయందే ముక్తికాంత సంగమము గలు గును. కావున, వజ్రోలి మొదలగువానినిమిత్తము పరకాంతతోఁగూడి సాంగ త్యము చేయవలసినపని- లేదనియును కావుననే శృతి॥ సర్వేషాం యోగ తంత్రాణం తథాధారోహికుండలీ॥ యని చెప్పబడియున్నది.

మానవుడు యోగసిద్ధినొంది తన ఆగామిసంచితప్రారబ్ధములైన సకల దుష్కృతకర్మలనెల్ల జ్ఞానాగ్నిచే దహింపచేసి తనలో వెలుంగు పరమాత్మను దర్శించుటయె మోక్షమనబడును. కాబట్టియె, శృతి॥ బ్రహ్మహత్య సహస్రాణి వీరహత్య శతానిచ కశ్చిత్ ధ్యానయోగస్తు దహత్యగ్నిర్బి వేదనం॥ యని చెప్పబడియున్నది.

కాబట్టి అజ్ఞానమనే నరకము నీకు హేతువని తెలిపియు ఆ యజ్ఞానము నకు కారణమైన మాయను విడువరుందురు. ఇంద్రాదులుసహితము భోగ ములకు ఆసించి అప్పుడప్పుడు నిలుకడతప్పి తిరుగుచున్నారు. అందరును మా

యను దొలగజేసికొని ప్రవర్తించినయెడల మహాయోగీశ్వరుండైన పరమ శివునకే తావు లేకపోవును. పురుషులచే మోక్షలక్షణము వినుచుండు దేవత లు కూడా ఆశలో దగిలి దుఃఖించెదరనియును మృత్యుంజయుండైన పరమేశ్వ రుడే మహాయోగీశ్వరుండని తెలియవలయును. కావుననే శ్రుతి॥ మాయాంతు ప్రకృతి విద్యాన్మాయినస్తు మహేశ్వరం తస్యావయవభూతైస్తు వ్యాప్తం సర్వ మిదం జగత్॥ యని చెప్పబడియున్నది.

అజ్ఞానమువలన గల్గిన ప్రకృతిసంబంధము అనాదిమూల మాయకర్మ కు కారణము. అనాదికర్మ యిట్టిదని తెలిసినయెడల అజ్ఞానము నాశనమగును. అజ్ఞానము తొలగినమీదట పరమాత్మతత్వము బోధమగును. కావుననే శ్రుతి॥ యింద్రోమాయాభిః పురురూపయీయతే॥ యని చెప్పబడియున్నది. శ్రుతి॥ మూలాభావ ఇదం జ్ఞాతుం నశరీరం నకిమస్తి॥ పరమగురుకటాక్షము చేత నవద్వారములతో సంబంధించిన అసహ్యకరమైన శరీరము నసించి సర్వ జీవులయందు ప్రకాశించు పరమాత్మతో నైక్యమై యెచ్చోటను ప్రకాశిం చుచుండును. కావున, శ్రుతి॥ సర్వంఖల్విదం బ్రహ్మ॥ యనియున్నది. కోపము నివర్తియైనయెడల శత్రువులు కలుగరు. శత్రుత్వము నివర్తియైనయెడల ఆశ లన్నియు నివర్తియగును. ఆశలులేనియెడల పునర్జన్మములు గలుగవు. నీవు నేను యనుభేదము తీరినయెడల కర్మసంబంధములు వీడును. సత్వరజస్తమో గుణములయందు మగ్నుడుగాక యున్నయెడల మోక్షము సిద్ధించును. కావున శ్రుతి॥ సత్వం రజస్తమ ఇతిగుణాః ప్రకృతిసంభవాః॥ యని యున్నది. ప్రకృ తి మాయసంబంధమైన గుణములు నసించుటవలన ముక్తికలుగును. కర్మేంద్రి యములను జయించి జ్ఞానేంద్రియములను తనవశములో నుంచుకొని దృఢ నిశ్చయుండై పరమవస్తువును తెలిసికొన్నప్పటికిని తనశరీరమున వెలుంగు పర బ్రహ్మమును దెలసికొనినవాడు జ్ఞానియె కాడు. కావుననె, శ్రుతి॥ హృదయం నిర్మలం కృత్వాచిత్తశూన్యమనామయం అహమేకం సర్వమితినై తత్వశ్చే త్పరం సుఖి॥ యని యున్నది. కాబట్టి మౌనము వహింపకగాని ప్రణవమంత్ర సిద్ధిగలుగదు. ప్రణవమునందలి సకలనాదములు లయము కానియెడల మన స్సు స్థిరపడదు. మనస్సును అటుయిటు బోనీయనియెడల మోక్షము దొరకదు. కావున శ్రుతి॥ ఓంకారధ్వని నాదేన వాయుసంహారణాత్మకం నిరాలంబనము దిస్యతత్రినాదోలయం గతః॥ యున్నది. కాబట్టి భూచరీముద్రలచే పరమాత్మ

ను వీక్షించుచుండు యోగికి సర్వము సమత్వముగా నుండును. లోకమంతయు బ్రహ్మమయముగా నుండును. అట్టియోగి పరమాత్మను తెలియగలడు. యోగీశ్వరులైనవారు అంతర్లక్ష్య బహిర్లక్ష్యములను శాంభవి షణ్ముఖి ఖేచరీ ముద్రిల లక్షణములను జక్కగా నెఱింగి తనలో తేజరిల్లుచుండు పరబ్రహ్మమును దర్శనముచేతురు. కావున శ్రుతి॥ యత్రయత్రమనోయాతితత్రలయంగతః॥ యని చెప్పబడియున్నది. కామము, క్రోధము లోభము, మోహము, మదము, మాత్సర్యము యను యరిషడ్వర్గముల నంతయు మిగులక ఛేదించి కామాదులను మనస్సునకు దెచ్చుకొనక సకలప్రపంచమునం దెచ్చట నిండియుండు పరమాత్ముని సదా చింతించుచు ఒక్కడైన పరమాత్మను దెలియుటకొరకు ప్రయత్నించి పరమాత్మను దెలియువాడె సమాధిపరుడు యగును. శ్రుతి॥ శివఏధ్యేయః శివంకరః॥ యనియును, శ్రుతి॥ ఏకోహ హవైనారాయణ ఇదమగ్రమాశీత్॥ యని చెప్పబడియున్నది. కావున సుషుప్తిలో జాగ్రతగలిగి చూచినయెడల పరమాత్మయొక్క స్థితి తెలియును. సుషుప్తియందు జాగ్రతగ నుండువా రీ మహాత్ములు. మరియు మాయకు లోబడక ప్రవర్తించువారికి బ్రహ్మవిద్య బోధమగుననియును భావము గావున శ్రుతి॥ యోజాగ్రతిసుషుప్తస్థోయస్య జాగ్రన్నవిద్యతె యస్యనిర్వాసనాబోధః సజీవన్ముక్త ఉచ్యతె॥ యని చెప్పబడియున్నది. ప్రపంచమును గూర్చి చింతించినప్పటికిన్ని చింతింపభోయునప్పటికిన్ని మిధ్యగానే యుండును. శూన్యమైనది మిధ్యయైనది ప్రపంచమును గూర్చి విచారించినయెడల ప్రపంచస్థితి చక్కగా దెలియును. అట్లు దలంపక నిశ్చలచిత్తుడై యుండినను అనేక సంశయములు లేక సర్వము పరమాత్మమయమని తలంచినను తాను బ్రహ్మమై ప్రకాశించుచుండును. కావున శ్రుతి॥ ప్రభాశూన్యం మనశ్శూన్యం బుద్ధిశూన్యం నిరామయం సర్వశూన్యం నిరాభాసం సమాధితస్యలక్షణం త్రిశూన్యం యోవిజానీయాత్ సద్యోముచ్యేత బంధనాత్॥ అని చెప్పబడియున్నది. హృదయముయొక్క మధ్యమందు ప్రకాశించు శాశ్వతుడైన వానినిగూర్చి చిత్తైకాగ్రత్తతో వీక్షించినయెడల అందు గనబడువాడె పరమాత్మయగును. అట్లు చూడక పరమాత్మను ధ్యానించు స్థలము యిట్టిదని తెలిసికొనక పరమాత్మను గూర్చి చింతించువానికి పరబ్రహ్మము గనబడదు. కావున శ్రుతి॥ తథా సర్వగతోదేహీ, దేహ మధ్యేవ్యవస్థితః మనిస్థాదేహినాందేవో మనోమధ్యేవ్యవస్థితః॥ అని

చెప్పబడియున్నది. శరీరమును ధనమును, శాశ్వతము గాదని పరులకు బోధించి తాను వాచా చెప్పినట్లె నడుచుకొనుచుండు యోగి గుడ్డపేలికనైనను నెరుగకుండును. అనగ దేనిని గోరడు గావున శ్రుతి॥ అస్థిరం జీవనంలోకె అస్థిరం యవ్వనంధనం అస్థిరం దారపుత్రాది ధర్మకీర్తిద్వయం స్థిరమ్॥ భూలోకంబునం గల భార్యాభర్తలలో భార్య చేసిన పాపమంతయు భర్తకు చెందుననియు భర్తచేసినపుణ్యములో సగము భార్యకు చెందుననియు, శ్రుతికారులు చెప్పుచున్నారు. భర్త చేసినపాపముమాత్రము భార్యకు యెందుకై చెందదో తెలియకున్నది. అనగ యెప్పటికిని స్త్రీసహవాసము స్త్రీసంగమును చెందదని నిరూపణచేయబడెను. కావున శ్రుతి॥ రాజారాష్ట్రకృతం పాపం రాజాపాపం పురోహితః భర్తాచస్త్రీకృతం పాపం శిష్యపాపంగురోంపి॥ అని చెప్పబడియున్నది.

సాంఖ్యాదిదర్శనములయందును శైవవైష్ణవశాక్తేయగాణాపత్యసౌరకాపాలికము లనెడు ఆరుమతములయందును బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రు లనెడు భేదబుద్ధిగలిగి ఆ యావర్ణములవారు ఆ యా ధర్మములనే చేయవలయు ననుటయందును బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ సన్యాసములనెడు ఆశ్రమములు క్రమక్రమముగానె అభ్యసించి తరించవలయు ననుటయందును బుద్ధిని బ్రవేశింపజేయువాడు పరమాత్మను దెలియడు. అనగ పరమాత్మ విషయమునందు బుద్ధిని బ్రవేసింపజేయువాడు పైనచెప్పిన వృధాకాయకష్టములయందును సొచ్చి చెడిపోవడని భావము. కావున శ్రుతి॥ అనంతశాస్త్రం బహువేదితవ్యం అల్పశ్చకాలో బహవశ్చవిఘ్నః యాత్సారభూతం తదుపాసితవ్యం॥ హంసోయధాక్షీరమి వాంబు మిశ్రమః॥ యని చెప్పబడియున్నది. గంగాయమునాసరస్వతు లనెడు యిడాపింగళాసుషుమ్నానాడుల మార్గమునకు సమీపము నందలి భ్రూమధ్యస్థానమున వెలుంగుచుండు పరంజ్యోతిని సామాన్యులు తెలిసికొనలేరు. ఆజ్యోతిని సదా చూచుచుండినయెడల మోక్షము సిద్ధించును. కావున శ్రుతి॥ యిడాపింగళయోర్ మధ్యే సుషుమ్నా సూక్ష్మరూపిణీ సర్వప్రతిష్ఠితం తస్మిన్ సర్వగం సర్వతోముఖం॥ యని చెప్పబడియున్నది. కాబట్టి నాలుగువేదములును షట్శాస్త్రములును అరువదినాలుగు కళలును చదువుటయందు మనస్సును పోనీయక శాశ్వతమైన మహతత్వమును దెలిసికొని ప్రథమమున యెట్టి అక్షరమైన ఓంకారమును జపించు

వానికి నిరతిశయానందశాశ్వతపదవి సిద్ధించును. కావున శృతి॥ ఓమిత్యే కాక్షరం బ్రహ్మ ఓంకారప్రభవో వేదాః॥ అని ఇత్యాదిప్రమాణములు ప్రసిద్ధంబులై యున్నవి గాబట్టి బ్రహ్మానును పదార్థమును సర్వస్థలములయం దు నిండియుండుటచేత తనయందు యున్నాడని కూడా తన్నుదా దెలియ వలెను. ఆబ్రహ్మమునకు తానొకటి కలదని తలంచరాదు. అది బట్టబయలు గానే యున్నది. శృతి॥ అయం వ్యర్థబాహ్యాకోపినభవతి। తన్ను తామెఱిగిన యెడల తానె బ్రహ్మమని తోచును. కావున శృతి॥ అహం బ్రహ్మాస్మి మం త్రోయం సర్వపాప వినాశి ఏత్ అహం బ్రహ్మాస్మి మంత్రోయం సర్వకర్మ జన్మవినాశ ఏత్॥ వేదవాక్యము ప్రసిద్ధమైనది. ఇంతియెగాక బైలనగా శూన్య మని అర్థము గాబట్టి శృత్యోపనిషత్॥ ఊర్ధ్వశూన్యమధః శూన్యం మధ్యశూ న్యం యదాత్మనః సర్వశూన్య తదాత్మేతి సమాధితస్యలక్షణం॥ చెప్పబడి యున్నది కాబట్టి సర్వప్రపంచమును అణువుయందు నణగియుండును. అణువు తనలోనె యిమిడియుండును. ఈవిషయమును బాగుగా దెలసిచింతించువాడు ముక్తినొందును. శృతి। అణోరణీయాంమహతోమహీయాం॥ యని చెప్పబడి యున్నది. వెన్నను చేతపట్టకొని దానిని కరగించినయెడల నెయ్యి యగుననే జ్ఞానము లేనివారు సర్వత్రి వ్యాపించియుండు పరబ్రహ్మము తనయందున యున్నాడని మూఢులు తెలియకున్నారు. కావున శృతి॥ యథాజం జలేక్షి ప్తం క్షీరేక్షీరం ఘృతేఘృతం అవిశేషోభతత్సర్వ జీవాత్మ పరమాత్మనోః॥ అని చెప్పబడియున్నది. ఏది శూన్యమైనదో ఆశూన్యమునందె ఇమిడియుండు నో లేని సామాన్యజనులు బ్రహ్మము నెరుంగుటకొరకు శక్తి చాలక మరల మరల భూమిలో పుట్టి పరితపించుచున్నారు.

విచారించగ, శూన్యమందుండు శూన్యవస్తువే బ్రహ్మమని తెలియును. గావున, శృతి॥ ఆకాశోహ్యవకాశశ్చ॥ ఆకాశవ్యాపితంచయత్। ఆకాశశ్శ గుణశబ్దో నిశ్శబ్దో బ్రహ్మముచ్యతే॥ ఇత్యాదినిర్వచనశృతులు చెప్పబడి యున్నవి. కాబట్టి, ఈజన్మము ఏకారణముచే గలిగెనని విచారించినయెడల ప్రపంచసృష్టిమొదలు తాను వుండినట్లు తెలియును. ఈలాంటిది జన్మకార ణము. ఆత్మగానేయున్నది. అనగ, పరమాత్మతో నైక్యమగుటకును ఆత్మయె ఆధారమని భావము. మరియు జన్మకుకారణము కర్మయనియును అది అనాది యనియును చెప్పబడియుండుటచేత దానినెరుగుటకు శక్తిచాలదని తాత్పర్య

ము. కావున, శ్రుతి॥ కర్మబ్రహ్మోద్భవంవిధి॥ ఇత్యాదిప్రమాణములు చెప్పబడియున్నవి. కాబట్టి- శూన్యమైనచోటనే జన్మకు కారణమైయున్నది. ఆ శూన్యస్థితిని తెలిసికొన్నయెడల జన్మమునకు కారణబాధము నివర్తియగును. ఇట్టిలక్షణమును చక్కగా దెలసినవానికి- ఆశూన్యమునందే మోక్షము సిద్ధించును. కావున, శ్రుతి॥ శూన్యభావితభావాత్మాపుణ్యపాపైః ప్రముచ్యతె॥ అని చెప్పబడియున్నది. కాబట్టి- మానవుని శరీరమనే గృహమందునుగల దారేషణ ధనేషణ పుత్రేషణములయొక్క ఆశలను నిర్మూలముచేసి నిశ్చలచిత్తుడై యుండువాడె మహాత్ముండగును. కావున, శ్రుతి॥ యదావినియతం చిత్తం మాత్మన్యేవావతిష్ఠతే నిస్పృహస్సర్వకామేభ్యోయుక్త ఇత్యుచ్యతె తదా॥ అని చెప్పబడినది. గాబట్టి-ఏదిచూచుటకు తగియుండునో అనగ దేనివలన, ప్రకాశమానమైన ప్రపంచమును దెలసికొనుటకు మూలకారణమో- అట్టి పరమాత్మ ఆకాశమును తెలియును.

అనగ సహస్రారచక్రంబునందు, ప్రకాశించుచు పరమాత్ముడున్నాడని భావము ఇట్లు చూపుదు. సహస్రారచక్రమునందు ప్రకాశించువాడు మనస్సునందు వసియించియున్నాడు. ఈ అర్థము పురుషసూక్తమువలన, తేటపడగలదు. శ్రుతి॥ తస్యాశ్శిఖాయామధ్యే పరమాత్మావ్యవస్థితః॥ భ్రూవోస్థానే అధః పద్మం ద్విదళంతత్ప్రశోభితం॥ సహస్రదళమధ్యే బ్రహ్మాగ్రాన రూపం భవతి- నిశ్చయః॥ ఇత్యాది శ్రుతులు చెప్పుచున్నవి. కాబట్టి- శ్రుతి॥ మనస్థం॥ మనమధ్యస్థం॥ మనవర్జితం॥ మనసామన ఆలోక్యస్స్వయంవిధ్యం యోగినః॥ అని చెప్పబడియున్నది. కాబట్టి, అనేకవిధములుగా చింతించుటకు యేదికారణము గనుండునో దానిని విచారించి ముందుగ దెలిసికొనినపిమ్మట చంచలచిత్తముతో పలుచింతలను జేయక, నిశ్చలచిత్తుడైయుండి- ఏదితలంపునకు కారణమో ఆతలంపె పరమతత్వమైన పరమాత్మయని యెరుంగుము. కావున, శ్రుతి॥ సంకల్పప్రభవాన్॥ కామాన్త్యక్త్వా సర్వానశేషతః। మనసైవేంద్రియగ్రామం వినియమ్య॥ సమంతతః॥ ఇట్లు చెప్పబడినవి- కాబట్టి- బాహ్యప్రపంచమున తానుపుట్టినతర్వాత తనకు గల్గిన దారపుత్రాదులు మొదలగు సంసారపాశ బంధములను ఇచ్ఛోటనే దానిని నిజముగా నివర్తి చేయవలయును. ఇట్లు బాహ్యమందు- తనజీవదశలో నున్నప్పుడు తనతో సంబంధించిన దారాది సంబంధమును త్యజించినయెడల మోక్షము సిద్ధించును. కావున, శ్రుతి॥ సంసా

రమేవనిస్సారం॥ దృష్ట్వాసారదిదృక్షయా॥ ప్రవ్రిజంత్యకృతోద్వాహాం॥ పరం వైరాగ్యమాశ్రితాః॥ ఇట్లు చెప్పబడియున్నది. కాబట్టి- శింశుమారచక్రిము వలె- మనస్సు స్థిరముగానిల్వక తిరుగుచుండును. అట్లు తిరుగుచుండుటే మనస్సును స్థిరముగా నిల్పినయెడల నిశ్చయము తేటపడగలదు. కావున, శృతి॥ అహంబ్రహ్మేతి సూంద్యాయే దేశకాగ్రిమనసాసకృత్॥ ఇట్లు చెప్పబడినది- యోగియైనవాడు యెవరేమిచెప్పినను వినువానివలెనే తలయూచునుగాని వాడామాటలను చెవిలోనె వేసికొనడు. మరియు వాడు అన్నిటిని చూచినట్లు తోచునుగాని తనజ్ఞప్తియందుంచుకొనడు- ఇట్టిమహాత్ముడు మనుజశ్రేష్ఠుల చేత నుతింపబడుచుండును. పక్షులలోపల కాకి హీనజాతియని చెప్పబడును. కాకినాంపక్షి ఛండాలిః॥ యతీనాం కోపచండాలిః॥ యని చెప్పియున్నది. అట్టి కాకి సంభోగమును చూచినయెడల మృతిగలుగునని యెవరున్నుచూడరు. కావున- మనస్సు స్థిరపరుచుకొని చూచినయెడల జీవబ్రహ్మైక్యము గల్గును. పురుషుడు తన ధర్మపత్నిని బొందునప్పుడు తదేకతత్పరుడైయుండునో ఆలాగుననుండినయెడల తనలోనుండు పరమాత్మ గోచరమగును- శృతి॥ పద్మకోశః ప్రతీకాశం హృదయం చాప్యధోముఖం॥ అధోనిష్ట్యావితస్త్యాంతునాభ్యాముపరితిష్ఠతి॥ హృదయం తద్విజానీయాద్విశ్వశ్యాయతనం మహత్॥

కాబట్టి, అంధకారమైన జఠర కుహరమందుండిబుట్టి అజ్ఞానులచేత నావరింపబడిన అంధకార సంసారమునంబడి యెందుకై పరితపించవలయును- జన్మదుఃఖమును తెలసినయడల సకల ప్రపంచమును బోధమగును.

పరమలోభికి కంకణములును బొక్కినోటివానికి కర్రిచేతచేసిన కృత్రిమదంతములును గలిగియు నెట్లు ప్రకాశించుటలేదో యట్లు శూరులు కాని వారికి మీసములు గడ్డములు నుండియు ప్రయోజనము లేదు. ఇట్టివారిగడ్డము మేకపోతుగడ్డము తోడను యిట్టివారి మీసము రొయ్యయొక్క మీసము తోడను సమానముగా నుండును- తేనె చక్కెర మామిడిపండు యీ మొదలగువాని భక్షించకగాని దానిరుచి కనబడదు. స్త్రీనిమాత్రము చూచినప్పుడే- దానియందుగల మోహము తెలియదు. అనగ, స్త్రీనిచూచినప్పుడే మోహము గలుగునని భావము- ఆత్మయున్నదోలేదోయను విషయమును నిర్ధారణజెసి తెలుసుకొనుటకు శక్తిలేక, మంత్రములచేతను యంత్రముల చేతను, మోక్షము కలుగుననెడు తలంపుచేత మంత్ర యంత్రాదులయందు

మరలుకొని మోక్షమునొందక వృథాగాచచ్చిపోవుదురు. శృతి॥ పునరపిజన నం పునరపిమరణం। పునరపిజననీజఠరేశైనం। యిహసంసారె బహుదుస్తారె। కృపయాపారె పాహిమురారే॥ —భజగోవిందశ్లోకములయందు చెప్పబడియున్నది. కాబట్టి- జన్మమునకు కారణమవును గావున —

ఈతనేర్వనివార్లెల్లను మిక్కిలిలోతైన బావిలోబడి చచ్చిపోదురు. ఈతనేర్చినవారు బావిలోబడి సూర్నముగారు —దీనిరహస్యార్థమేమనగ సంసారకూపమునుండి తరించుటకు మార్గము నెరింగిన వారెప్పుడును సంసృతిలోబడి తగులుకొనరు —శృతి॥ కిమత్రిబహునోక్తేన శాస్త్రకోటిశతైర। పిదుర్లభ చిత్తవిశ్రాంతి। ర్వినాగురుపరాపరాత్॥ శృతి ప్రమాణము చెప్పుచున్నది. అనంతకోటిశాస్త్రములు చదివినను చిత్తవిశ్రాంతిగలుగుట దుర్లభంగావున, గీత। పరతస్మాత్తుభావోన్యోవ్యక్తో వ్యక్తాత్సనాతనః। యస్సర్వేషుభూతేషు నశ్యత్సునవినశ్యతి॥ అని గీతావచనం చెప్పుచున్నది. అని క్షేత్రజ్ఞవిచారములో క్షేత్రజ్ఞుడనెడువాడు జీవుడనిచెప్పబడును. సాంఖ్యశాస్త్రమున పురుషుడని చెప్పబడుచున్నది గావున సమస్తకురాకుర, చరాచర సృష్టియొక్కయుత్పత్తిస్థితి సంహారములయొక్కయు విచారించినచో సాంఖ్యమతానుసారముగ తుదకు ప్రకృతిపురుషులను నీరెండుతత్వములె స్వతంత్రములు. ఈరెండును అనాదులై మూలతత్వములుగ సిద్ధములైనవి. పురుషుడు అనగ క్షేత్రమును గుర్తెరిగే వ్యవహారికజీవజ్ఞప్తియనె పురుషుడు. తనదుఃఖములయన్నింటిని బోగొట్టుకొని మోక్షమునొందుటకు ప్రకృతికిన్ని తనకున్న భేదమును కైవల్యమును తెలిసికొని త్రిగుణాతీతుడుకావలయునను విషయములో పూర్వోక్తములగు రెండు ప్రకరణములకు అనగ ప్రకృతిపురుషులకు (ఫలితార్థము) ప్రకృతిపురుషులకు సంయోగమైనపిదప ప్రకృతి పురుషునియెదుట తననాట్యము నెటుల ప్రదర్శించుచున్నదను విషయములలో సాంఖ్యులపద్ధతికంటె నర్వాచీన (నవీన) సృష్టికర్తలు కొంచము వేరుగ చెప్పుచున్నారు. కావున,యైనను యీవిషయములో శాస్త్రాంతరమునకు సంబంధించినదిగాని వేదాంతశాస్త్రమునకు సంబంధించినదిగాదు యని యెరింగి మనము యీవిషయములో వాదముచేయుచు కాలమును గడపరాదు.ం కావున పిండబ్రహ్మాండములకు మూలమగు శ్రేష్ఠతత్వమెద్ది మనుష్యుడు తదూ్రపుడు యెట్లగును యని నిశ్చయించుటకది (ఆవేదాంతశాస్త్రము) వర్తిల్లెను. కాని తనయెదుట మరియొకశాస్త్రము ప్ర

వర్తింపనీయదు. సింహ మెదుట నక్కవలెను వేదాంతశాస్త్రము యెదుట యితరశాస్త్రములు మౌనమువహించును గావుననే,

శృతి॥ తావద్గర్జంతి శాస్త్రాణి జంబుకావిపినేయథా నగర్జతి మహాశక్తిః యావద్ వేదాంత కేసరీ॥ అనియున్నది.

ఒకవేదాంత భాష్యకారులచే వేదాంతయదార్థము యిటుల వర్ణింపబడినది. ప్రకృతిపురుషవిచారణచేసి పిదప సిద్ధుడగు ద్రష్ట పురుషుడు, ఆత్మయు క్షరాక్షరసృష్టియొక్క విచారణచేసెనపిదప సిద్ధించుసత్వరజస్తమోగుణాత్మకమగు నవ్యక్తప్రకృతియు నను నీరెండును స్వతంత్రములగుటచే జగత్తుయొక్క మూలము నీతీరున రెండువిధములుగ నంగీకరించుట న్యాయమని సాంఖ్యులు చెప్పియున్నారు గాని యింతకంటె దూరముగ విచారించి సాంఖ్యమతానుసారముగ అవిభక్తమును విభక్తపదార్థముల కన్నిటికి నవిభక్తమగు వ్యక్తమగు మూలతత్వమునగు నొకటి శృతి॥ అవిభక్తం విభక్తేషు। అనున్యాయముగనున్నదనియును అవిభక్తపదార్థముయొక్క స్వాభావికమగు జ్ఞానక్రియయే సృష్టికంతకును మూలమనియును అజ్ఞానముయొక్క సహాయ్యముచేతనే సృష్టియందున్న యనేకపదార్థములు నొకఅవ్యక్తప్రకృతియందు సమావేశము జేయవచ్చుననియు అజ్ఞానకియచేతనె ప్రకృతియనియును మొట్టమొదట మనుష్యులసంఖ్యలు కాకపోవుటచే ప్రకృతియందున్న యహంకారగుణమునెడు యుపాధిభేదముచే నీయసంఖ్యత్వము వారియందుత్పన్నమగునటుల గాన్పించుచున్నదని చెప్పవలసివచ్చును. ఇంతియేకాక స్వతంత్రుడగు క్షేత్రజ్ఞుండైన పురుషునకు స్వతంత్రమగు ప్రకృతితోగలిగిన సంయోగము, సత్యమా మిధ్యయా యను మరియొక ప్రశ్న వీలుపడును. సత్యమని యందుమేని యెప్పుడును వదలిపోవుటకు శక్యముగాకపోవును గాన సాంఖ్యమతానుసారముగ నాత్మకు ముక్తి యేనాడును లభింపదు. మరియు మిధ్యయని అందుమేని పురుషునిసంయోగకారణమున ప్రకృతితనవ్యాపారను తనయెదుట చేయుటకు నారంభించుననిచెప్పుట నిర్మూలమగును.

శృతి॥నిర్మూలమెతధ్యానశరీరంనాస్తి కేవలం॥అనిశృతి చెప్పుచున్నది.ఆవుదూడకొరకు పాలిచ్చునటుల ప్రకృతిపురుషునియందు లాభముకొరకు యెప్పుడును నాట్యముచేయుచున్నదను దృష్టాంతము సహితము యుక్తియుక్తముగ లేదు. కారణమేమియనగ గోగర్భమునందుండి దూడపుట్టుటచే దూడ

యందు గోవునకు బ్రీతియుంకునటుల ప్రకృతిపురుషునియందు ప్రేమయున్న దని చెప్పుట సాధ్యముకానేరదు. భారతశాంతిపర్వమునందు ప్రకృతిపురుషు లిరువురును సాంఖ్యశాస్త్రానుసారముగ మొదటినుండియు అత్యంతభిన్నులు మెటులననగా ప్రకృతిజడముగను పురుషుడు సచేతనుడుగను నున్నాడు. సృష్ట్యారంభమునందు యీరెండుపదార్థములు అత్యంతభిన్నములు, స్వతంత్రములు నగునేని వానిలోనొకదాని ప్రవృత్తి రెండవదాని లాభార్థమేలకావలయును ఇదిప్రకృతికి స్వభావమని యుపాదించుట సరియగు సమాధానముగానేరదు. స్వభావమని చెప్పితిమేని మహాపండితులయొక్క ద్వైతమేల తప్పగును గాన మూలప్రకృతియొక్క గుణములు వృద్ధిబొందుచు దానిలోనే స్వయముగ చూచునదియు స్వయముగను సైతము విచారించునదియు నగు చైతన్యశక్తి యుత్పన్నమగును. అనగ ఇదదాని స్వభావమైయున్నదని పండితులుచెప్పుచు న్నారు గదా. కాని యీమతము నంగీకరింపక సాంఖ్యశాస్త్రము ద్రష్ట చూచువాడు వేరనియు దృశ్యసృష్టి వేరనియు కొంతభేదముచెప్పినచో యేన్యాయముచేత యీభేదముత్పన్నమగునో ఆన్యాయముచే తరువాతసైతమింక కొంచె మేలయధికముగ నుపయోగింపకూడదు దృశ్యసృష్టి నెవరెంతపరీక్షించినను నేత్రముల మజ్ఞాతంతువులని దీధర్మములున్నవని నిశ్చయించినను నిశ్చయించువాడు మరలభిన్నుడైయే యున్నాడు. చూచెడుపురుషుడు దృశ్యసృష్టికంటె నీవిధముగ వేరైనపిదప నీచూచువాడెవడని మనముకొంతవిచారింపవలసి యున్నది.

దృశ్యసృష్టియొక్క సత్యస్వరూపము మనయింద్రియములకు గనబడు నట్లున్నదా లేక కనబడుదానికంటె భిన్నముగనున్నదా యనిమనము విచారింపవలసినయెడల దానికేమైనను మార్గముకలదా లేదా యను నీప్రశ్న కెప్పుడును సమాధానముచెప్పుట శక్యముకానేరదు. కావున ప్రకృతిపురుషులనను రెండుతత్వములు ఆదినుండిభిన్నములు స్వతంత్రములుగ నున్నవని యంగీకరించుట యుక్తముగ నున్నది. అనిసాంఖ్యులు చెప్పుచున్నారు గావున మరియు నొకఆదిభౌతికశాస్త్రపద్ధతిచేతనే విచారించితిమేని సాంఖ్యమతము యుక్తి విరుద్ధముగనున్నదనుటకు సాధ్యముకానేరదు. కారణమేమియనగ సృష్టిలోని యితరపదార్థములు మనయింద్రియములకు గానుపించునుగాన వానిగుణధర్మములనెట్లు పరీక్షించుచున్నాడో యటువలెనే చూచువాడు వేదాంతులకు ఆ

త్మయని చెప్పబడువాడు చూచువానియొక్క ఇంద్రియములకు తనయింద్రియములకు గోచరముకానేరదో యింద్రియాతీతమో దానిని మానసేంద్రియములతో నెట్లు తెలుసుకోగలము. ద్వితీయధ్యాయమునందు 23 వ శ్లోకమునందు

॥నైనం ఛిదంతి శస్త్రాణి నైనం దహతి పావకః నచైనం క్లేదయన్త్యాపో నశోషయతి మారుతః॥ యని చెప్పియున్నది. ఆత్మ సృష్టియందున్న యితర పదార్థములవలె తేజస్సు ఉదకము మొదలగు పల్చవిపదార్థముల సంయోగముచేత ద్రవత్వమును జెందదు. పదునైన కత్తులు దానిని నరకలేవు. నిప్పు దీనిని కాల్పలేవు. గాలి దీనిని శుష్కింపజేయలేదు. సృష్టియందున్న పదార్థములను బరీక్షించుటలో నాదిభౌతికశాస్త్ర వేత్తలకున్న యుక్తులన్నియు నీవిషయములో నుపయోగింపవని సారాంశము గాని ఆత్మని యెట్లు పరీక్షింపలయునను ప్రశ్నకఠినముగ దోచును కొంతవిచారించితిమేని దానియందేమీకాఠిన్యమున్నటుల గాన్పింపదు. సాంఖ్యశాస్త్రమునందు మాత్రము పురుషుడు నిర్గుణుడుగ స్వతంత్రుడుగ నున్నాడని యెట్లు నిశ్చయింపబడినది. తన యంతఃకరణమునందలి యనుభవముచేతను చేయబడినదా లేక మరియొక విధము అటులే ప్రకృతిపురుషుల సత్యరూపమును నిజరూపమును నిర్ణయించుట సైతమేల చేయగూడదు.

అధిభౌతిక శాస్త్రములకు అధ్యాత్మికశాస్త్రములకు యున్న ఘనమైన భేదమిదే. అధిభౌతిక శాస్త్రములయొక్క విషయమునింద్రియగోచరములగుచున్నది. అధ్యాత్మశాస్త్రవిషయ మింద్రియాతీతములు (అనగ) కేవల స్వసంవేద్యములు, తమయంతట తామె తెలసికొనదగినవి. శృతి॥ ఆత్మ స్వసంవేద్యః! మయినయెడల ప్రకృత్తి పురుషునకు దాని జ్ఞానమెట్లు కలుగునో అట్లె కానిమ్ము; అధ్యాత్మశాస్త్రము యొక్క యావశ్యకతయేమి యని యెవరైన నడుగుదురు. ప్రతి మనుజుని మనస్సు గాని యంతఃకరణము గాని ఏకరీతిగ శుద్ధముగ నుండనేని, యీప్రశ్న యోగ్యమైనది యగును. ప్రతిమనుజుని మనస్సుద్ధియైనను లేక శక్తియైనను నేహేతువుచే నొకవిధముగ నుండదని మనకు ననుభవ గోచరమగునో ఆహేతువచే నెవరి మనస్సత్యంతశుద్ధముగను పవిత్రముగను విశాలముగ నున్నదో వారి ప్రతీతినే యనుభవమునే యీవిషమును మనము ప్రమాణముగ నంగీకరింపవలయును. ఏమియుచు లేకయేనా కటులతోచుచున్నది. లేక నీకటులతోచును. వితండవాదము పెంచుటచే నేమియు

లాభములేదు. యుక్తివాదము బొత్తిగ వదలుమని వేదాంతము చెప్పదు. వేదాంతశాస్త్రము యుక్తికంటె స్వానుభవమునకు అనుకూలమగును. అతిప్రతీతియే మిక్కిలి గొప్పదని యంగీకరింతురు. ఈయనుభవము ననుకూలమగు యుక్తినే వేదాంతశాస్త్రము నొప్పుకొనును; శ్రీశంకరాచార్యులవారు వేదాంతసూత్రభాష్యములలో యీసిద్ధాంతము నుడివిరి; గాన నధ్యాత్మశాస్త్ర మునభ్యసించువారీ విషయమును దప్పక తెలుసుకొనవలయును. తన్నుతా దెలియుటకొరకు, సర్వవేదాంతశాస్త్రములు ఏర్పడినవి.

కాబట్టి భగవద్గీతయందు వ్యక్తావ్యక్తవిచారణయందు॥ ఉత్తమపురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః యోలోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః॥ యీరెంటికంటెను యీప్రకృతి పురుషులకంటెను భిన్నుడగు పురుషుడగు అత్యుత్తముడు పరమాత్మ యనుపేరు గలవాడు నవ్యయుడు సర్వశక్తి గలవాడు నగును మరియు నతడె మూడులోకములను వ్యాపించి అనస్త్రియమందు కూడా వ్యాపించి వానిని రక్షించుచున్నాడని చెప్పబడినది. ఈపురుషుడు క్షరాక్షరములను వ్యక్తావ్యక్తములగు రెంటికంటెను పరముగ నున్నవాడు యనుటవే అతనికి పురుషోత్తముడని పేరు సార్థకమైనది. ఇది గీతాభిప్రాయం చెప్పబడుచున్నది.

మహాభారత శాంతి పర్వమందు—

ఆత్మక్షేత్రజ్ఞ ఇత్యుక్తః సంయుక్తః ప్రాకృతైర్గుణైః తైరేవతుః వినిర్ముక్తః పరమాత్మేత్యుదాహృతః॥ ఆత్మదేహమందు బద్ధుడగునేని, యత్నని, క్షేత్రజ్ఞుడు జీవాత్మయని చెప్పబడును. ఆజీవాత్మయే ప్రాకృతములగు ప్రకృతి యొక్క లేక, దేహముయొక్క గుణములయందుండి ముక్తుడగునేని, పరమాత్మయనబడును. భృగువు భరద్వాజునకు చెప్పెను. క్షరాక్షరసృష్టిజీవుడు లేక సాంఖ్యశాస్త్రానుసారముగ నవ్యక్తమగు ప్రకృతియు, పురుషుడు నను నీరెంటికిని పరమునందు ఒకపరమాత్మయే యుండుటచే నొకప్పుడు క్షరాక్షరములకు పరముగనుండును. భగవద్గీత॥ క్షరాక్షరాభ్యాం విలక్షణః॥ నొకప్పుడు జీవుడగు, లేక జీవాత్మను, పురుషునకు, నీరెంటికి పరముగనున్నాడనియు యొక్క పరమాత్మకే ద్విధలక్షణము లేక వ్యాఖ్యానము చెప్పుచున్నది. ఈ యభిప్రాయమును, మనస్సునందుంచుకుని, కాళిదాసుసైతము, పురుషుని లాభముకొరకు ప్రవర్తించు ప్రకృతినినీవేయని సహజముగ నుదాసీనుడవగు

టచే, నాప్రకృత్తిని చూచుపురుషుడును నీవే॥ త్వమేవాహం త్వమేవాహం నసంశయః॥ అని పరమేశ్వరుని, కుమారసంభవములో వర్ణించినాడు ఇదియు నుంగాక అటువలెనే, భగవద్గీతలలో భగవంతుడును, గీత॥ మమయోనిర్మ హద్బ్రహ్మ॥ ప్రకృతి నాకుయోని లేక నాస్వరూపములలో నొకటి యనియు, జీవము లేక, యాత్మయనునది నాయంశముగనే యున్నదనియు జెప్పెను మరియు గీత॥ భూమిరాపో, నలో, వాయుః, ఖం మనోబుద్ధిరేవచ, అహంకార ఇతీయంతోభిన్నాప్రకృతిరష్టధా॥ గీతావచనము॥

పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము, అని ప్రకృతి యెనిమిదివిధములుగనున్నది యనియు, శ్లో॥ అపరేయమితస్త్వన్యాం॥ సర్వజగత్తు నెవరిచే ధరింపడెనో అట్టిజీవము నాయొక్క రెండవప్రకృత్తిగానున్నదని భగవంతుడు చెప్పియున్నాడు. కాని, సత్యముగు జ్ఞేయమేదికలదో అది, ప్రకృతియు, పురుషుడు, జ్ఞానము, జ్ఞాత యనునిరువురకంటెను బరమునసేయున్నది. అదియె పరమపురుషుడని, గీతలలో చెప్పుచున్నది కాని, వేదాంతదృష్టిచే పరబ్రహ్మమే యక్షరము ఎప్పుడు నాశనము నొందనిది అగుటచేత ప్రకృతి, పురుషు, పరమేశ్వరుడును యీముగ్గురినే అధ్యాత్మశాస్త్రమునందు జగత్తు జీవుడు పరమాత్మ డిటో పరబ్రహ్మమునిగ్రమముగ చెప్పుచున్నారు. కావున గీతలయొక్కయు, యుపనిషత్తులయొక్కయు అర్థం వొక్కటియే తాత్పర్యానుభవము యొక్కటియే యగుటచే గీతాభాష్యములయందున్న విచారమంతయు, పూర్వము యుపనిషత్తులలోనుండినదేయనియు తెలియబడుచున్నది.

ప్రకృతి పురుషు లిరువురకంటె, పరమందున్న పురుషోత్తముని పరమపురుషుని, పరమాత్మను, పరబ్రహ్మమును వర్ణించి భగవద్గీతలందు వ్యక్తము, అవ్యక్తము నేత్రముల, కానసించునని కాపించదని దానికి రెండుస్వరూపములుగా మొదలుచెప్పబడినవి. పూర్వమందు చెప్పబడిన దానివలెనే తనవ్యక్తరూపము, మాయికమగుటచే దానికి పరముదున్నఅవ్యక్తమే యింద్రియములకు గోచరముగాని స్వరూపమే ముఖ్యముగనున్నది. భగవంతుడు జెప్పియున్నాడు. గీతాభాష్యే॥ అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యంతే మామబుద్ధయః పరంభావమజానంతో మమావ్యయమనుత్తమం॥ నేను వ్యక్తుడను అనగ యింద్రియములకు గోచరుడను నైనను మూర్ఖులు నన్నువ్యక్తు

డని, యెన్నుచున్నారు. మరియు వ్యక్తమునకు పరముగనున్న శ్రేష్టమున వ్యయమునగు నాస్వరూపమని యెఱుంగలేరు. అనిచెప్పి తరువాత తరువాతశ్లోకములో నేను నాయొక్క యోగమాయచే ఆచ్ఛాదితుడవగుటచే మూర్ఖులు నన్నెరుంగలేరు, యని భగవంతుడు ఏడవఅధ్యాయములో చెప్పియున్నారు. శాంతి॥ భా॥ మాయాహ్యేషామయాసృష్టాయన్మాంపశ్యసినారద సర్వభూతగుణైర్యుక్తం, నైవం, త్వం, జ్ఞాతుమర్హసి॥ శాంతి॥ 33౯-౪౪. నీవు చూచుచున్న నా రూపమంతయు నాచే నిర్మితమైన మాయ. కావునను సర్వభూతగుణములతో నేను కూడినవాడనని యెఱుంగుమని యిట్లు భగవంతుడు చెప్పియున్నాడు. శ్వేతాశ్వతరోపనిషత్తునందు। మాయాంతు ప్రకృతిం విద్యాన్మాయినంతు మహేశ్వరమ్॥ అనగ మాయయన ప్రకృతి (సాంఖ్యులది) యగును. మరియు నామాయకు నధిపతి పరమేశ్వరుడు అగుటచే నతడే తన మాయయగుటచే ప్రపంచము నిర్మించుచున్నాడు గావున బ్రహ్మము సత్తునుగాదు అసత్తును గాదు. ఋగ్వేదమందు ॥అణోరణీయాం మహతోమహీయాన్॥ అణువుకంటె చిన్నది మహత్తుకంటె మహత్తు॥ కఠోపనిషత్తు॥ తదేజతి తన్నైజతి తద్దూరే తద్వంతికే॥ అది చలించనిది చలించునది. అది దూరమునందును సమీపమునందును నున్నది. సర్వేంద్రియ గుణాభాసుడైనను సర్వేంద్రియ వివర్జితుడనియును జెప్పియున్నది. మరియునితరములగు నుపనిషత్తులలోను ॥యతోవాచో నివర్తంతే॥ అప్రాప్యమనసాసహ॥ తైత్తిరీయమందు ॥అదేశ్యం॥ అదృశ్యం॥ అగ్రాహ్యం॥ ముండకోపనిషత్తునందు॥ నచక్షుషాగృహ్యతే॥ నాపివాచా॥ ముండకోపనిషత్తు॥ నేత్రములకు గోచరింపనిదియు వాక్కులతో చెప్పనలవి గానిదియు కఠోపనిషత్తునందు॥ అశబ్దమస్పర్శ మరూప మవ్యయం తథారసం నిత్యమగంధవచ్చయత్ అనాద్యనంతం మహతః పరంధ్రువం నిచాయ్యతన్మృత్యుముఖాత్ప్రముచ్యతే॥ యిట్లు చెప్పబడినది. పంచమహాభూతముల యే శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము, అను నైదుగుణములు లేనివాడును అనాదిభూతుడు, అనంతుడు, అవ్యయుడును పరబ్రహ్మముయొక్క నిర్గుణం అచింత్యము అగు స్వరూపము చెప్పబడినది. సూత్రభాష్యమందు గూడ చూడవలెను. మహాభారతమునందు శాంతియందు ఇట్లు మహానారాయణీయమందు గూడ చెప్పియున్నది. భగవంతుడు తన నిజస్వరూపము అదృశ్యము అఘ్రేయము, అస్పృశ్యము, నిర్గుణము, నిష్కళము. నిరవయము. అజము ని

త్యము శాశ్వతము నిష్క్రియముగ నున్నదని నారదునకు వాసుదేవపరమాత్మ చెప్పుచున్నారు. తానే సృష్టిస్థితిలయములను జేయు త్రిగుణాతీతుడగు పరమేశ్వరుడుగ నున్నాడనియు చెప్పియున్నాడు. మహాభారమునందు॥ సత్యం నామావ్యయం నిత్యం అవికాంతథైవచ॥ శాంతి చెప్పబడియున్నది. ఏది అవ్యయము (అనగ) ఎప్పుడును నాశనము నొందనిది మరియు నవికారియు నిత్యమును అనగ, యెప్పుడును స్థిరముగ నుండునదిగ నవికారియు దేనియొక్క స్వరూపము నెప్పుడును మారనిదినగునో అదియే సత్యము సత్వలక్షణము చెప్పబడియున్నది. శ్రు॥ యస్సర్వేషు భూతేషు నశ్యత్సునవినశ్యతి॥ అనగ సర్వపదార్థములును సర్వపదార్థములయొక్క నామరూపాత్మకమగు శరీరమును నాశనమునొందినను నేపదార్థము లేకపోవునది కాదో అదియే అక్షరమగు బ్రహ్మమగును. భారతము నారాయణీయమునందు గీ॥ భాగవతమునందు యుపనిషత్తులయందును కూడా యిట్లే చెప్పబడియున్నది. ఎట్లనిన భూతగ్రామశరీరేషు అను పాఠభేదముతో చెప్పబడినది. నామరూపాత్మకమగు జగత్తు మిథ్యయనియు బ్రహ్మ సత్యమనియు వేదాంతశాస్త్రములు చెప్పుటకు నర్థమిదియే. బృహదారణ్యోపనిషత్తు॥ తిదేవదమృతం సత్యేనశ్ఛన్నం అయమమృతం॥ సత్యము చెప్పబడినది యని చెప్పి యమృతతస్యశబ్దములకు వెంటనే బృహత్ప్రాణోవాఅమృతం నామరూపే సత్యం భ్యాసుయం ప్రాణచ్ఛన్నం॥ అనగ ప్రాణమనునది అమృతము నామరూపము లనునది సత్యము యీనామరూపములను సత్యముచే ప్రాణమాచ్ఛాదింపబడినదని వ్యాఖ్యానము చేయబడినది. ప్రాణమనగ ప్రాణరూపపరబ్రహ్మమని యిచ్చట నర్థము చెప్పబడును. మొదట నుపనిషత్తులలో దేనిని మిథ్య యనియు సత్యమనియు చెప్పుచున్నారో దానికే పూర్వానుండు ఆనుక్రమముగ సత్యము అమృతము యను పేరులుండును. దీనివలన గానుపించుచున్నది. మరియు ఋగ్వేదములో॥ ఏకం సద్విప్రాబహుదావదంతి॥ మొట్టమొదట నొకటియు నిత్యము సత్-అనుదానికే విప్రులు జ్ఞానులు పలుపేరులతో వాడెదరు పిలుతురు. మరియు బ్రహ్మాత్మకమగుటచే అది బాధకమగుటచే అకారణమగుటచే. శృతి॥ యత్రిహిద్వైతమివ భవతితదితరఇతరంపస్యతి జిఘ్రతి శృణోతి విజానాతి యత్రితస్యసర్వమాత్మైవాభూత్ తత్కేనకం పశ్యేత్ జిఘ్రేత్ శృణుయాత్ విజానీయాత్ విజ్ఞానాతారమరేకేనవిజానీయాత్ ఏతానదరేఖల్వమృతత్వమితి॥ అనగ

చూచువాడును చూడబడుపదార్థము అను ద్వైత మెంతవరకు నుండునో అంత వరకు నొకడు యితరులని చూచుచున్నాడు వాసన జూచుచున్నాడు వినుచున్నాడు తెలుసుకొనుచున్నాడు. కాని యివియన్నియు ఆత్మమయము లన్నప్పుడు స్వపరభేదములేనప్పుడు దానిని దెలుసుకొను మరియొకపదార్థము యెచ్చోట నుండి తీసుకొనిరాగలమని యాజ్ఞవల్క్యము బృహదారణ్యము పంచదసి యీపదార్థమును స్థిరపరచిరి. కావున మరణకాలమునందు బ్రహ్మైక్యానుభవంబు అవస్యమని సంభవింపవలయును. లేనిచో మోక్షము సంభవింపదని నిశ్చయించిరి. ఈయభిప్రాయము చేతనే అంతకాలమునందు అనన్యభావము చేత తన్ను తా దెలుసుకున్న మనుజులకు ముక్తి కరతలామలకమని చెప్పుదురని తరువాత గీతభాష్య సూత్రభాష్యము యందు చెప్పబడియున్నది. ఈ సిద్ధాంతమురీతిని జన్మమంతయు దురాచారమునందే గడపినవాడు సైతము మరణసమయమున పరమేశ్వరు నెరుగునేని ముక్తుడగునని వచింపవలసివచ్చును.

మరియు ననేకులు దీనిని యుక్తమనియు సమ్మతింపరు కాని కొంచెము ఆలోచించితిమేని దీనియందేమియు దప్పులేదని తోచుచున్నది. జన్మమంతయు దురాచారమందు గడపిన వానికి కేవలము మరణకాలమునందే సుబుద్ధియు బ్రహ్మజ్ఞానమును బుట్టుటకువీలులేదు. ఇతరవిషయములయందువలెనే బ్రహ్మనిష్ఠను సంపాదించుటయందును, మనస్సున కభ్యాసముండవలయును. మరియు, నీజన్మమునందొక పర్యాయమైనను బ్రహ్మైక్యానుభవము గలవానికి కేవలము మరణకాలమునందే అది యొక్కసారి ప్రాప్తమగుట మిక్కిలి దుర్ఘటము. వేయేల శక్యముగాదు. కావున, ప్రతిమనుజునిచేతను మనస్సు నిర్విషయముగ జేసుకొను నభ్యాసము నిత్యము ఆచరణలో నుంచబడెనేని యెంతకాలమునకు నాస్థితి స్థిరముగనుండుటకు నాటంకముండదు కాన, మనుజుడు తుదకు ముక్తుడగుననియు, త్రిభాష్యములు మరియొక్క గొప్పవిషయమును జెప్పుచున్నవి. ఎట్లనిన పూర్వసంస్కారములు మొదలగు కారణములవలన మూలమున నెవనికైనను కేవల మరణసమయమునందు హఠాత్తుగా జ్ఞానము సంప్రాప్తము కావచ్చునని శాస్త్రమునందలి సారాంశము. ఇట్టి యుదాహరణము లక్షకొకటిగానియుండవచ్చును కాని, అది యంతదుర్లభము. దుర్లభమను విచారము దూరముననుంచి యిట్టిస్థితి ప్రాప్తమగునేని పిదప నేమియగునని ప్రస్తుతము మనము విచారణచేయువలసియున్నది. మరణసమయమునందైన

యిట్టిజ్ఞాన ముత్పన్నమగుటచే పురుషుని యనారబ్ధకార్య సంచితమీ జన్మయం దలి భోగము మరణకాలమునందు సమాప్తమగును. కావున అతనికి యేకర్మ యును భోగింపవలసిన నవసరములేదు. సర్వకర్మలనుండి విముక్తుడైనవాడు (అనగ) సంసారచక్రమునందుండి ముక్తుడగునని చెప్పనక్కరలేదు.

ఈసిద్ధాంతమె శృతి॥ అపిచేత్ సుదురాచారోభజతేమామనన్యభాక్॥ మిక్కిలి దురాచారుడైనను మనుష్యుడు అనన్యభావముచేత పరమేశ్వరుని సేవించెనేని ముక్తుడగును. గీతలయందు చెప్పబడియున్నది. కావున, అనన్య భావము. అనగ, మరియు జగత్తునందున్న యితరధర్మములయందులో సైత ము ఆవిషయము అంగీకరింపబడినది అనన్యభావము పరమేశ్వరునియందు॥ చిత్తవృత్తి పూర్ణముగ లయముజేయుట బ్రహ్మైక్యానుభవంబు నొందుట మనోలయమౌట చిత్తవిశ్రాంతిగలుగుట యీనువదియే జీవపరమాత్మ అభేద మె యనన్యభావమని- అమనస్కరాజయోగమని బ్రహ్మాత్మైక్యమని- సాంఖ్యు లు అద్వైతులు అమనస్కులు, గీతాభాష్యములు యుపనిషద్భాష్యములు మొదలైన వేదాంతగ్రంధములు చెప్పుచున్నవి. కావున, చిత్తవృత్తిని మరి యొకచోటనుంచి నోటినుంచి రామరామయని పేలుట కాదనిమాత్రమె యిచ్చట బాగుగ గమనింపవలసినవిషయము. అనారబ్ధముల సంచితము లన్నిం టిని నొకపర్యాయమే క్షయింపజేయునట్టి మహాత్వముగలది. పరమేశ్వరజ్ఞాన మని సారాంశము. ఈయవస్థ యెప్పుడు ప్రాప్తమైనను యిష్టమేకాని యీ ప్రాప్తిలో సైతము పూర్వమునందు ప్రాప్తమైనది స్థిరముగ నుండుటగాని పూ ర్వమున ప్రాప్తముగాని కాకపోయినను తుద కంతకాలమువరకునైనను ప్రా ప్తమగుటగాని యత్యంతావశ్యకము. అట్లులేనియెడల మరణసమయమునందే వాసన మిగిలియుండినను దానివలన నేతిరిగి జన్మించుట తప్పదనియు పునర్జన్మ తప్పనియెడల మోక్ష మంతరించుననియు శాస్త్రకారులచే సిద్ధాంతం చేయ బడుచున్నది. కావున, కర్మబంధమననేమి కర్మక్షయమనిన దేనిని పేర్కొను చున్నారు. అది దేనిచే నెప్పుడగునను విషయములు చెప్పుచున్నవి. ఇప్పుడు కర్మక్షయమైనవారికిని కర్మబంధము వదలనివారికిని మరణానంతరమునందు ను వైదిక ధర్మానుసారముగ నెట్టిగతి ప్రాప్తమగునో ప్రసంగానుసారముగా నిచ్చో కొంతవిచారించి ప్రకరణమును సమాప్తిజేయుదము. ఈవిషయమున సైతము యుపనిషత్తులయందు బహుమారు చర్చలు చేయబడినవి. కావున,

యింద్రాదిదేవతలయొక్క స్తుతితో ఋగ్వేదసూత్రములన్నియు నిండి యున్న
వి. వానియం దొక్కకచోటను ఓదేవా నాకుసంతతిని సమృద్ధిజేయుము. మా
కును అయుర్దాయ మిమ్ము మమ్మును మాసంతతిని మాసూనులను మాపశువు
లను హింసజేయకుమని ప్రార్థింపబడినది. ఈయజ్ఞయాగాదులు వేదత్రయ
మునందును విహితములగుటచే నీమార్గమునకు త్రయీధర్మమని ప్రాచీననామ
ములు గావున కామ్యకర్మములుచేయుచు కామ్యధర్మములనుచేయుచు కామ్య
ఫలము ననుభవించుచు జననమరణ ప్రవాహముల నోలలాడుచూ యుందురు.
బృహదారణ్యే॥ నతస్య ప్రాణాఉత్క్రామంతి బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి॥ అతని
ప్రాణము లెక్కడకినేగవు. అతడు నిత్యబ్రహ్మభూతుడగుటచే బ్రహ్మమందే
లయమును బొందుచున్నాడని బృహదారణ్యమునందు యాజ్ఞవల్క్యుడు జనకు
నకు చెప్పిరి. ఇట్టిపురుషుడు అత్రబ్రహ్మస మశ్నుతే॥ యెచ్చోట నున్నవా
డచ్చోటనేయుండి బ్రహ్మానుభవము ననుభవించుచున్నాడు. బృహదారణ్యము
కఠోపనిషత్తునందు నీరీతియుంగ చెప్పబడినది. నీశృతి ఆధారముచేతనే మో
క్షముకొరకు గ్రామాంతరమున కేగవలసిన యవసరములేదని శివగీతలు
వక్కాణించుచున్నవి. బ్రహ్మయొక చోటయుండునదియు వేరొకచోట నుండ
నిదియు నని చెప్పుటకు సాధ్యముగాదు. ఛాందోగ్యోపనిషత్తునందు ముండకోప
నిషత్తునందు కాని యెప్పుడైనను సంపూర్ణముగ బ్రహ్మప్రాప్తి కలుగుటకు
కారణము పూర్ణజ్ఞానియగు యాపురుషుడు వుత్తరాయణము సూర్యలోకము
మొదలగు మార్గములచేత యేలయేగవలయును. బ్రహ్మవేద బ్రహ్మైవభవతి॥
బ్రహ్మము నెరింగినవారు యిహలోకమునందె బ్రహ్మమగును. భాష్యే॥ అభితో
బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనాం॥ ద్వైతభావమునువదలి యాత్మస్వరూ
పము తెలిసికొనినవారు ప్రారబ్ధక్షయార్థమై దేహపాతమును నిరీక్షించ
వలసివచ్చినను మోక్షప్రాప్తికి యెక్కడకు పోవలసిన నవసరము లేదు.
కావున బ్రహ్మ నిర్వాణ రూపమగు మోక్షమెప్పుడును వారియెదుట
సిద్ధముగనే యుండును. గీత భాష్యే॥ ఇహైవతైర్జితస్సర్గో యేషాంసామ్యేస్థితం
మనః॥ యని చెప్పుచున్నవి ఎవనిమనస్సునందు సర్వభూతాంతర్గతమగు బ్ర
హ్మైక్యరూపసామ్యము ప్రతిబింబితమైనదో దేవయానమార్గాపేక్షనుంచకొన
క యక్కడనుండిన నక్కడనేయుండి జననమరణాదికమును జయించుచున్నాడో
లేక శృతి॥ భూతపృథగ్భావమేకస్థమనుపశ్యతి॥ అనియు సర్వభూతములయం

ధున్న నానాత్వము నశించి యవిద్యాతీతయు నెవనికి నేకత్వముగ పరమేశ్వరరూపముగ, గాన్పింపనారంభమాయెనో యతడు శృతి॥ బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి। బ్రహ్మమేయగుచున్నాడని, పరమజ్ఞానియగు పురుషుడు వర్ణింపబడెను. భాష్య॥ ప్రాజ్ఞస్యమూఢస్యచ కార్యయోగే సమత్వమభ్యేతి నసర్వబుద్ధిః॥ యనునట్లు జ్ఞానికి, మూఢునకు కర్మలు, సంభవించునేని, దైవ మొక్కరీతిగ నేయుండును. బుద్ధిమాత్రము వేరుగనుండును. అనగ బ్రాహ్మణాదిసూత్రగ్రంధములయందు ప్రతి గృహస్థుడు, బ్రాహ్మణుడైనను, లేక క్షత్రియుడైనను, అగ్నిహోత్రముచేయుచు జ్యోతిష్టోమాదియజ్ఞయాగములను, తనతన యధికారానుసారముగ జేయవలయునని యాజ్ఞయాం చుకుటచేత వివాహమాడి, ప్రతిమనుజుడును వంశవృద్ధిజేయుటకునైత మతనికి కర్తవ్యమని స్పష్టముగ వచనములున్నవి. ఉదాహరణము శృతి॥ ఏతద్వైజరామర్యసత్రంయదగ్నిహోత్రం॥ అగ్నిహోత్రరూపమునగు నీసత్రము నడిపింపవలయును. శృతి॥ బ్రాహ్మణ యువంచు! ప్రజాతంతుంమావ్యవచ్ఛేత్సీః॥ వంశవిచ్ఛేదనమును జేయకుము, వంశమను సూత్రమును ద్రెంపకుము, అనియున్నది. తైత్తిరీయమందు లేక ఈశావాస్యమిదంసర్వం॥ జగత్తునందున్నదంతయు పరమేశ్వరునిచే నధిష్ఠింపబడినది. అనగ నాదిగాదు అతనిదియని తెలిసికొనవలయును. మరియు నీనిష్కామబుద్ధిచేయవలయును. దక్షస్మృతి॥ బ్రహ్మవిదాప్నోతిపరం. బ్రహ్మజ్ఞానముచే మోక్షము లభించును॥ యమస్మృతి॥ నాన్యఃపంధావిద్యతేఽయనాయ॥ జ్ఞానముతప్ప మోక్షప్రాప్తికి రెండవమార్గములేదు. శ్వేతాశ్వరోపనిషత్తు॥ పూర్వేవిద్వాంసః ప్రజాంనకామయంతే కిం ప్రజయాశ్చవిత్తైషణాయాశ్చలోకైషణాయాశ్చవ్యుత్థాయాథభిక్షాచర్యం చరంతి। ప్రాచీనులగు జ్ఞానులకు పుత్రాదులయొక్క యిచ్ఛలేమిచే, నేహేతువుచే సర్వలోకములును మాయాత్మయేయైనవో, యాహేతువుచేతనే మాకు, రెండవది వలకావలయును, గాబట్టి యీరీతిగనే విరక్తుడైన పురుషునికిమోక్షంలభించుచున్నది. బృహస్పతిస్మృతి॥ వివేకీసర్వదాముక్తఃకుర్వతోనాస్తికర్తృత్వాం॥ భాష్య॥ అలేపవాదా మాశ్రిత్య శ్రీకృష్ణజనకాయధా॥ ఇట్లుచెప్పుచున్నవి గావున పూర్ణముగ బ్రహ్మజ్ఞానియైనను, సర్వకర్మలను జేయుచు శ్రీకృష్ణజనక దశరధరామబ్రహ్మతులాధారధర్మవ్యాధుడు యీమొదలైనవారు రాజయోగానుసంధానులై నిష్కామకర్మాచరణచేయుచున కర్తయు నలిప్తులు సర్వదాముక్తులుగనే యున్నారు. శృతి॥ వచనమునందు చెప్ప

బడుచున్నది. మనువు యిక్ష్వాకులు మొదలగు కర్మయోగుల పరంపర జెప్పిన పిదప శంఖలిఖితస్మృతి॥ ఏవం జ్ఞాత్వాకృతం కర్మపూర్వైరపిముముక్షుభిః॥ దీని నెరింగి జనకాదిజ్ఞానులు కర్మనొనర్చిరి. పారాస్మృతి॥ పూర్వైరపిముముక్షుభిః॥ అని చెప్పియుండుటచేత జనకుడే కాక యీప్రకారముగ ననేకులు కర్మనొనర్చిరి గనుకను దాహరణములు, యోగవాసిష్ఠమునందును భాగవతమునందును, కూడా జెప్పబడినవి. జనకాదులకు పూర్ణబ్రహ్మజ్ఞానము లేదని యెవరైనను శంకింపవచ్చునా లేదా, అయినను వీరందరు జీవన్ముక్తులుగనే యున్నారని యోగవాశిష్ఠమునందును పైవ్రాసిన స్మృతులయందును జెప్పబడియున్నది. మరియు యోగవాశిష్ఠమునందే గాక మహాభారతమునందును వ్యాసులవారు తనపుత్రుడగు శుకునికి మోక్షధర్మములను బూర్ణముగ దెలిసికొనుటకై తుదకు బ్బుద్ధులతో జనకునియొద్ద కంపినట్లుయున్నది. మహాభారతమునందు శాంతియందు మరియు, యోగవాసిష్ఠమునందునుకూడ యీతీరుననే యుపనిషత్తులయందు స్మృతులయందు నశ్వపతియును కేకయరాజు యుద్దాలకఋషికిని ఛాందోగ్యోపనిషత్తునందు మరియు కాశీరాజగు నజాతశత్రువు గార్గ్యుడను బ్రాహ్మణునికిని బృహదారణ్యమందు బ్రహ్మజ్ఞానమును దెలిపినట్టుల కథలున్నవి. అట్టుల నశ్వపతి లేక జనకుడు రాజ్యారంభము మొదలుకొని కర్మత్యాగరూపసన్యాసమును గైకొనినట్టుల నెక్కడను వర్ణింపబడలేదు. దీనికి ప్రతికూలముగ జనకసులభాసంవాదమున జనకుడు నేను ముక్తసంగుడనై యాసక్తినుంచక రాజ్యమును చేయుచున్నాను. మరియు నాయొక్క హస్తము గంధముచే బూయబడినను రెండవహస్తము శస్త్రముచేఖండింపబడినను నాకు సుఖదుఃఖములు సమానములుగనే యున్నవని యీ మొదలగు తనస్థితిని మహాభారతము శాంతియందు పిదప సులభతో నిట్లనియె. మహాభారతే॥ శాంతిపర్వణి 320-36॥ మోక్షేహి త్రివిధానిష్ఠాదృష్టాన్యైర్మోక్షవిత్తమైః॥ జ్ఞానలోకోత్తరం యచ్చసర్వత్యాగశ్చకర్మణాత్॥ జ్ఞాననిష్ఠాం వదన్త్యేకే మోక్షశాస్త్రవిదోజనాః॥ కర్మనిష్ఠాంతథైవాన్యే యతయః సూక్ష్మదర్శినః॥ ప్రహాయోభయమప్యేనం జ్ఞానం కర్మచకేవలమ్॥ తృతీయేయం సమాఖ్యాతానిష్ఠాతేన మహాత్మన॥ మోక్షప్రాప్తికొరకు మూడువిధములగు నిష్ఠలను మోక్షశాస్త్రవేత్తలు నుడువుచున్నారు. జ్ఞానమును సంపాదించి సర్వకర్మలను వదలుట దీనినె కొందరు మోక్షశాస్త్రజ్ఞులు జ్ఞాననిష్ఠయని చెప్పుదురు. అటులే యితరమగు సూక్ష్మదర్శులగు జనులు కర్మనిష్ఠను జెప్పుదురు. కాని

జ్ఞానము కేవలకర్మయను రెండునిష్ఠలను వదలి యీమూడవదగు అనగ జ్ఞానముచే నాసక్తి బోగొట్టకొని కర్మనుజేయు నిష్ఠయె నాకు అనుమహాత్ములచే అనగ అస్మత్ గురు పంచశిఖ ఆచార్యునిచే వక్కాణింపబడినది. యాజ్ఞవల్క్యస్మృతి॥ యదిదం వేదవచనం కురుకర్మత్యజేతిచ॥ విష్ణుస్మృతి॥ కాందిశం విశయాంయాంతిగాంచగచ్ఛంతి కర్మణా॥ అనగ వేదము కర్మలను వదలుమనియు చెప్పుచున్నది మరియు కాని విద్యచే అనగ కర్మవిహీనమగు జ్ఞానమునేతను కేవల కర్మచేతను నేమిగతి లభించును. ఇది నాకు జెప్పుము. కావున అని వ్యాసులవారి నడిగినపిదప వతనికి నుత్తరమిచ్చుచు శ్రీవ్యాసులవారు భారతం శాంతి॥ కర్మణాబధ్యతె జంతుః విద్యయాచపరిముచ్యతే తస్మాత్కర్మన కుర్వంతి యతయః పారదర్శినః॥ అని యిట్లు భారతశాంతిపర్వమందు చెప్పుచున్నది- యెద్దియనిన కర్మచే ప్రాణము బంధింపబడును. మరియు విద్యచే ముక్తుండగును. కావున నెవరు పారదర్శులగుదురు. పారంగతులగు యతులు లేక సన్యాసులలో వారు కర్మలను జేయరు అని నుడివిరి. ఈశ్లోకముయొక్క ప్రథమచరణము వెనుకటిప్రకరణమున నాచే చర్చింపబడినది. శృతి॥ కర్మణా బధ్యతె జంతుః విద్యయాచపరిముచ్యతె॥ ఈసిద్ధాంతవిషయమై నేమియు వాదములేదు. కర్మణాబధ్యతె అనగ జడము లేక యచేతన మగుకర్మ మెవరిని బంధింపజేయదు. మరియు వదలివేయదు. మనుజుడు ఫలాశచే గాని తన యాశక్తిచేగాని కర్మయందు బద్ధుడైనవాడు యీయాసక్తి వదలిపోయిన యెడల నతడు బాహేంద్రియములచే గర్మచేసినను ముక్తుడే యగునని తెలునట్లు యచ్చోట చూపింపబడినది. ఈఅర్థమునే మనస్సున నుంచుకొని అధ్యాత్మరామాయణే॥ రామచంద్రుడు లక్ష్మణునకు శృతి॥ ప్రవాహపతితం కార్యకుర్వన్నపినలిప్యతే బాహ్యే సర్వత్రకర్తృత్వమావహన్నపిరాఘవ॥ అని యున్నది. కావున కర్మమయమగు సంసారముయొక్క ప్రవాహములో బడిన మనుజుడు బాహ్యములు సర్వప్రకారములు నగు కర్మలను చేసినను అలిప్తుడగనె సంబంధములేనివానివలె యుంటున్నాడని చెప్పెను. జ్ఞానమునకు కామ్యకర్మమునకు విరోధమున్నను నిష్కామకర్మమునకు జ్ఞానమునకు నేమియు విరోధముండనేరదని తాత్పర్యము. ఈహేతువుచేతనే ॥భాష్యే॥ తస్మాత్కర్మన కుర్వంతి॥ యని యున్నది. కావున కర్మలను జేయరు యనువాక్యమునకు మారుగ అశ్వమేధపర్వమందు॥ తస్మాత్కర్మసుని స్నేహాయేకేచిత్పారదర్శినః॥

అని యున్నది. పారదర్శియగు పురుషుడు కర్మలయందు ఆసక్తియుంచడు అని వాక్యములుండుటచే తత్పూర్వమున అశ్వమేధపర్వం॥ కుర్వతే హేతుకర్మాణి శ్రద్ధధానావిపశ్చితః అనాశీర్యోగసంయుక్తాస్తేధీరాః సాధుదర్శనః॥ అని చెప్పి యున్నది. విజ్ఞానులు శ్రద్ధతో ఫలాశనుంచక కర్మయోగమార్గము నవలంబించి కర్మలను జేయుచున్నారో వారే సాధుదర్శులై బాగుగ నెరింగిన వారుగ యున్నారు. కర్మయోగమార్గము బాగుగ ప్రతిపాదింపబడినది గావున భారత॥ శాంతి॥ ఏషాపూర్వతరావృత్తిః బ్రాహ్మణస్యవిధీయతే జ్ఞానవానేవకర్మాణి కుర్వన్సర్వత్రసిధ్యతి॥ జ్ఞానవంతుండై సర్వకర్మలను జేయుచునే సిద్ధిని సంపాదించుట బ్రాహ్మణునకు పూర్వముకంటె పూర్వమగును. పూర్వాతరవృత్తిగ నున్నది. అని వ్యాసులవారు శుకునకు, రెండుపర్యాయములు స్పష్టముగ జెప్పినారు. జ్ఞానవానేవ యనుపదముచే జ్ఞానప్రాప్తిమైనపిదప జ్ఞానయుక్తము లగు కర్మలె యిచ్చోట విపరీతముచే యని స్పష్టముగనే యున్నది. రెండు పక్షములందున్న యీవచనములను నిష్పక్షపాతబుద్ధితో శాంతముగ విచారించితిమేని కర్మణాబధ్యతేజంతు॥ యీవాదక్రమముచే తస్మాత్కర్మనకుర్వంతి॥ కావున గర్మలను జేయరు. ఈకర్మత్యాగపరమగు ననుమానమొక్కటియే యున్నది. అందుచేత తస్మాత్కర్మసునశ్శైహః। కావున కర్మలయందు ఆసక్తిని యుంచరు. ఈవత్తుకామబుద్ధిచే కర్మలనుజేయుట రెండవయనుమానము సైతము అంతయోగ్యతగలదియే యని సిద్ధమగుచున్నది. ఈరీతిగ యీరెండు అనుమానములును కల్పించుటలేదు. స్పష్టముగ వ్యాసులవారును యీ అర్థమునే వ్రాసిరి గావున—

కర్మపాశములో మనస్సు మగ్నమగుటచే బ్రహ్మానందము లభింపకపోవును గావున, కుమారసంభవము॥ వికారహేతౌసతివిక్రియంతే యేషాంనచేతాంసితఏవధీరాః॥ యనియున్నది. ఏకారణముచేత వికారముత్పన్నమగునో యీ కారణంలేక, యీవిషయము కన్నులయెదుటనుండినను యెవరియొక్క యంతఃకరణము మోహవికారము జెందదో యీపురుషులె ధైర్యశాలురని చెప్పవలయును. అని కాళిదాసు చెప్పినటులనను, కర్మలుశేయునప్పుడును మనోనిగ్రహము పూర్ణముగ గలిగినదా, లేదా, యితరులుకును స్వయముగ గర్తకును దెలియగలదు గావున నీపక్షమునందుసైతము శాస్త్రముచే ప్రాప్తమైన అనగ, ప్రవాహపతితమగు కర్మలను జేయవలయుననియే స్థిరమగుచున్నది. భాష్య

